## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 5010010006782

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు.

# చరకసంహిత

అగ్నివేశమహర్షికృతము

చరకప్రతిసంస్కృతము

దృఢబలసంపూరిత

## కల్ప - సిద్ధిస్థానములు

బ్రహ్మశ్రీ పణ్డిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రి

ప్రణీతాంధ్రవ్యాఖ్యాసమలంకృతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1941.

# ఉ పో ద్ఘా త ము

"చరకస్తు చికిత్సితే"

శ్రీపరాత్పరుండును చరాచర జగత్కారణుండును అనాదినిధనుండును త్రిమూర్త్యాత్మకుండును అగు పరమాత్మయందు లీనములై యున్న నాల్గువేదములును తొలుత నిశ్వాసరూపముగ బైలువెడలినవని ఆర్షసిద్ధాంతము. ఈవిషయమునే "అస్యమహతో భూతస్య నిశ్వసితమేవైతత్ యత్ ఋగ్వేదో యజుర్వేదస్సామవేదోఽథర్వణ ఇతి" (బృహదారణ్యకము); "యస్య నిశ్వసితం వేదాః", ఇవి మున్నగు శ్రుతిస్మృతివాక్యములు వేనోళ్ల చాటుచున్నవి. ఈప్రమాణములబట్టి నాల్గు వేదములును పరమాత్మనుంబోలె ఉత్పత్తినాశరహితములై పరమాత్మయందే లీనములై తాత్కాలికావిర్భావ తిరోభావములుగల్గి స్వతః ప్రమాణంబులును స్వయంప్రకాశంబులు నై వెలయుచుండునని స్ఫుటముగ దెలియదగియున్నది.

అట్టివేదముల నాల్గింటికిని ఆయుర్వేదము, గాంధర్వవేదము, ధనుర్వేదము, స్థాపత్యవేదము అనునవి నాల్గును ఉపవేదములని ఆర్షసమ్మతము. ఆనాల్గింటిలో ఆయుర్వేద మనునది ఋగ్వేదమున కుపవేదమని "ఋగ్వేదస్యాయుర్వేద ఉపవేదః" అనుచరణ వ్యూహవాక్యముచే దెలిసెడి. కొన్ని ప్రమాణవచనములచే అథర్వవేదాంగమనియు చెప్పదగియున్నది. ఏది యెట్టులున్నను వేదమున కంగభూతమైనది ఆయుర్వేదమనుట నిర్వివాదాంశము. ఈసిద్ధాంతమునుగురించి స్థలాంతరమున వివరింపబడినది.

అట్టి ఆయుర్వేదము కాయచికిత్స, కౌమారభృత్యము, భూతవిద్య, శాలాక్యము, శల్యతంత్రము, అగదతంత్రము, రసాయనతంత్రము, వాజీకరణతంత్రము అని యెనిమిదియంగములతో కూడియుండును. ఈయెనిమిది అంగములలో నొక్కొకఅంగమును ప్రధానముగ జేసికొని తక్కినయంగముల సూచనామాత్రముగ దెల్పుచు ప్రాచీనఋషిపుంగవులు వారివారియుద్దేశప్రకారము కొన్నితంత్రముల రచియించిరి. అందు కాయచికిత్సాగ్రంథములలో చరకసంహిత అగ్రపదవి నలంకరించి సర్వోత్కృష్టమై వెలయుచున్నది. ఈతంత్రప్రాశస్త్యము ఈతంత్రాంతమున నిట్లు చెప్పబడినది.—"చికిత్సా వహ్నివేశస్య

సుస్థాతురహితం ప్రతి, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్" (సి. అ. ౧౨. శ్లో. ౬౩). ఈవాక్యమునుబట్టి చరకతంత్రమునం స్వస్థపరిపాలనమునకును రోగనివృత్తికిని కావలసిన చికిత్సావిధానము లన్నియు పూర్తిగనుండుటచే ఇయ్యది మిగుల ప్రశస్తమనియు, తక్కిన చికిత్సాబోధకములగు భేడ-జతూకర్ణాదీతరతంత్రములయందు ఇంతటి విషయములే క్లుప్తముగ జెప్పబడినవనియు తెలిసెడి. ఈవిషయమునే వాగ్భటాచార్యులు ఇట్లు చెప్పెను:—"ఋషిప్రణీతే ప్రీతిశ్చేన్ ముక్త్వా చరకసుశ్రుతౌ, భేడాద్యాః కిం న పఠ్యన్తే తస్మాద్గ్రాహ్యం సుభాషితమ్."

చరకుడు ప్రతిసంస్కర్త:—ఆత్రేయమహర్షికి శిష్యుడైన అగ్ని వేశులు గురువువలన ఉపదేశమునొంది వారిచే నుపదేశింపబడినదాని కన్న న్యూనాతిరేకము గాకుండునట్లు కాయచికిత్సాప్రధానమగు ఆయుర్వేదతంత్రమును తొలుతరచించెను. అయ్యది మిక్కిలి విస్తృతమై యుండుటంజేసి పాఠప్రవచనాదులకు కష్టముగనుండుననిగ్రహించి వైకుంఠధామునకు పర్యంకభూతుడగు ఆదిశేషుని అవతారుండును, వ్యాకరణ మహాభాష్యప్రణేతయు నగు పతంజలిమహర్షి అగ్నివేశకృతతంత్రమును విపులముగ నున్నచోట సంగ్రహించియు, సంక్షిప్తముగనున్నచోట విస్తరించియు సంస్కరించి క్రమముగ తంత్రమును రచించెను. ఈపతంజలికే చరకుడను నామాంతరము వ్యావహారికముగ నున్నది. ఈసుప్రసిద్ధనామముచే నీతంత్రము చరకసంహిత యని ప్రశస్తిగాంచినది. ఈవిషయమంతయు చికిత్సాస్థానమునందలి ఉపోద్ఘాతమున సహేతుకముగవివరింపబడినది.

దృఢబలప్రతిసంస్కారము:—పై జెప్పనరీతిగ అగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబునునగు చరకసంహిత సూత్ర-నిదాన-విమాన-శారీర-ఇంద్రియ-చికిత్సా-కల్ప-సిద్ధిస్థానము లను ఎనిమిదిస్థాన(ప్రకరణ)ములచే విభక్తమైనది. వానిలో చికిత్సాస్థానమున పదునేడధ్యాయములును కల్ప-సిద్ధిస్థానములు పూర్తిగను కొన్ని కారణంబులచేతను కానరాకుండెను. అట్టియెడ పంచనదపుర వాస్తవ్యుండును, కపిలబలపుత్రుండును అగు దృఢబలుడను ఆయుర్వేదపండితుడు చరకమున లుప్తములగు ఈభాగముల పూర్తిగావించి కృతకృత్యుడయ్యెను. ఈవిషయమును చికిత్సాస్థానాంతమునను, సిద్ధిస్థానాంతమునను "అస్మిన్ సప్తదశాధ్యా

యాః......పూరణాయ యథాతథమ్" (చ. చి. అ. ౩౦. శ్లో. ౧౨౯). "తచ్ఛఙ్కరం భూతపతిం ప్రసాద్య సమపూరయత్, అఖణ్డార్థం దృఢబలో జాతః పఞ్చనదే పురే,......సప్తదశౌషధాధ్యాయ సిద్ధికల్పైరపూరయత్" (సి. అ. ౧౨.) అనువాక్యములచే దృఢబలుడు తాను సంస్కరించి పూర్తిగావించినభాగమును పరిగణనముచేసి కంఠోక్తిగ నిర్దేశించెను. ఈవివరణమంతయును చికిత్సాస్థానమున దృఢబలునిచే పూర్తిగావింపబడిన పదునేడధ్యాయముల వివరణంబును చికిత్సాస్థానమునందలి ఉపోద్ఘాతమున విస్తరింపబడెను.

చికిత్సాద్వైవిధ్యము:—చరకము కాయచికిత్సాబోధకములగు భేదజతూకర్ణాది తంత్రములకన్న అగ్రగణ్యమైనదని పైని నిరూపింపబడినది. అట్టి చికిత్స శోధనమనియు శమనమనియు రెండుతెరంగులు. అందు మిథ్యాహారవిహారాదులచే ప్రకుపితములైన దోషములను ఆయాదోషములకు సమీపమునంగల మార్గములనుండియు బైటవెడలించునది శోధనమనంబరగు ప్రకుపితములైనదోషముల బైటవెడలింపకయే సమస్థితికి దెచ్చి సమస్థితినుండుదోషముల ప్రకోపింపజేయక ధాతుసామ్యరూపమైన ఆరోగ్యమును గల్గించునది శమనచికిత్స అనబడును. ఈశమనచికిత్స చికిత్సాస్థానమున విపులముగ నీతంత్రకారులచే నుపదేశింపబడెను.

శోధనము:—వమన-విరేచన-ఆస్థాపన - అనువాసన-నస్యకర్మ భేదములచే నైదువిధములు. ఇవి పంచకర్మములని తంత్రకారులచే వ్యవహరింపబడును. అందు కఫప్రధానమైన వ్యాధులయందు వమనరూపమైన శోధనంబును, పిత్తప్రధానములగు రోగములయందు విరేచనంబును, వాతప్రధానములగు వ్యాధులకు ఆస్థాపన-అనువాసనవస్తి కర్మంబులును, కంఠమునకు పైభాగమున (శిరస్సున) జనించినవ్యాధులకు నస్యవిధియు నుపయోగింప దగియుండును. ఈసంశోధనములు ఆయాస్థానముల నుండుదోషముల నిశ్శేషముగ వెడలించుటచే అట్టిరోగములు మరల బొడసూపక రూపుమాయునని శమనచికిత్సకన్న శోధన ముత్కృష్టమని "యే తు సంశోధనైశ్శుద్ధాః న తేషాం పునరుద్భవః" అను వాక్యముచే తంత్రకారులుపదేశించిరి.

వస్తికర్మము:—నిరూహ - అనువాసన - ఉత్తరవస్తిభేదములచే మూడుతెరంగులు. ఇయ్యది వాతహరచికిత్సలలో మిక్కిలి యుత్తమ

మైనది. ఈవిషయమునే వాగ్భటాచార్యులు—"వాతోల్బణేషు దోషేషు వాతే వా వస్తిరిష్యతే, ఉపక్రమాణాం సర్వేషాం సోఽగ్రణీ స్త్రివిధశ్చ సః, నిరూహోఽన్వాసనోవస్తి రుత్తరః" (అ. హృ. సూ. అ. ౧౯.) అని చెప్పిరి. ఈతంత్రకారులును సూత్రస్థానమునందలి అగ్ర్యాధికారమున—"వమనం శ్లేష్మహరాణాం, విరేచనం పిత్తహరాణాం, వస్తిర్వాతహరాణాం" (చ. సూ. అ. ౨౫. సూ. ౪౧.) అనువాక్యముచేత వమన-విరేచన-వస్తికర్మములయొక్క అగ్రగణ్యత నుపదేశించిరి.

కల్పస్థానమున—అట్టిపంచకర్మములలో వమనవిరేచనముల కుపయోగింపదగు నౌషధములను వేరువేరుగ విభజించి, అందు మ్రంగకాయ, దేవదాళి (డావరడంగి), చేదుసొర, చేదుబీర, కొడిసెపాల, చిన్న చేదుబీర అను ఈయారిటిని వమనమునకు ప్రధానముగను; నల్ల తెగడ, తెల్లతెగడ, రేల, లొద్దుగు, బొంతజెముడు, సంబరేణు, దింతెన, దంతి, ద్రవంతి అను నీతొమ్మిదిటిని విరేచనమునకు ప్రధానముగను పరిగణనముచేసి, వానిఫలమూలాదులను సంస్కారాదివిశేషములంజేసి కల్పనాభేదములచే మూడువందల నేబదియైదు, (355) వమనౌషధయోగములను, రెండువందల నలుబదియైదు (245) విరేచనౌషధయోగముల గల్పించువిధానమును నిపుణముగ నిరూపించిరి. పిదప వానిని ఆయావ్యాధులయందుపయోగించు విధానంబును, వాని అయోగ-అతియోగ-మిథ్యాయోగములచే గల్గువ్యాపత్తులును, వాని చికిత్సితములును నిర్దేశింపబడినవి.

సిద్ధిస్థానము:—వస్తికర్మమన—ఔషధరూపములైన క్వాథ-కల్క-తైలాదిద్రవములను వస్తి (మూత్రపుతిత్తి మున్నగు) యంత్రముచే శరీరమునందధోమార్గమునుండి లోనికి ప్రయోగించువిధానము. దీనినే 'ఎనీమా' అని పాశ్చాత్యవైద్యవిధానజ్ఞులు చెప్పెదరు. ఇయ్యది నిరూహము. (ఆస్థాపనము), అనువాసనము ఉత్తరవస్తియని మూడు విధములుగ పైని నిర్దేశింపబడినవి. అట్టి త్రివిధవస్తికర్మములకు కావలసిన క్వాథ-కల్క-తైలాదుల గల్పించువిధానంబును, వాని ఆయా వ్యాధులయందుపయోగించు పద్ధతులును, పంచకర్మముల అయోగ-అతియోగాదులచే గల్గువ్యాపత్తులును, వానిచికిత్సితములును, నస్యకర్మవిధానంబును మున్నగు విషయములు ఈసిద్ధిస్థానమున సమర్మకముగ

విస్తరించి చెప్పబడినవి. శల్యతంత్రమున (సర్జరి) రక్తమోక్షణంబును, కాయచికిత్సలలో వస్తికర్మయు ప్రాణులకు మిక్కిలి హితకరమని సుశ్రుతాచార్యు లిట్లు చెప్పిరి—"సిరావ్యధశ్చికిత్సార్ధం శల్యతన్త్రే ప్రకీర్తితం, యథా ప్రాణి హితస్సమ్యక్ వస్తిః కాయచికిత్సితే" (సుశ్రుతము). ఈతంత్రకారులును—"సత్యపి దోషహరత్వే కటు......నృణాం దదాత్యాశు" (సి అ. ౧౦ శ్లో. ౬-౭) అనువాక్యముచే తక్కిన సంశోధనములకన్న వస్తికర్మ నిరపాయంబును ప్రశస్తంబును నగునని కంఠోక్తిగ జెప్పిరి.

జ్వరాదిరోగముల చికిత్సావిధానంబులును అగ్రగణ్యమైన వస్తికర్మమును ప్రధానముగగల పంచకర్మముల వివరణంబును ఈతంత్రమున విస్తరించి చెప్పినవిధముగ నితరతంత్రములయందు గానరావు. కావుననే "నిదానే మాధవశ్శ్రేష్ఠః......చరకస్తు చికిత్సితే" అని ప్రాచీనాచార్యులచే ఈతంత్రము ప్రశంసింపబడినది.

అట్టి ఈతంత్రము మహాభాష్యప్రణేతయగు పతంజలివిరచితమగుటంజేసి గంభీరార్థ విశిష్ట ప్రౌఢవాక్యభూయిష్ఠంబై సామాన్యులకు గోచరింపకుండెను. అట్టిలోపమును నివర్తింప నుద్దేశముతోనందును ఆంధ్రజనోపయోగ్యమగునట్లు ఆంధ్రవ్యాఖ్యానమును సులభశైలితో రచియించినాడ. ఈవ్యాఖ్యారచనమునకు చక్రపాణిదత్త విరచితమగు ఆయుర్వేదదీపిక యనువ్యాఖ్యానమును, సుశ్రుతవాగ్భటాదితంత్రములను సాహాయ్యకములుగ నిడికొని, అచ్చటచ్చట పరిభాషాదివిషయముల నిరూపించుచు వివరించి రచియించినాడ. ఇందు అచ్చటచ్చట దొరికినపాఠాంతరములను కుండలీకరణ చిహ్నితములుగ పొందుపరచినాడ.

మరియు ఈవ్యాఖ్య రచించునపుడు లేఖనపరిశోధనాది కృత్యములచే నాకు దోడ్పడిన నాకుమారుడు చిరంజీవి శ్రీసుబ్బుసుందరేశునకు ఆయురారోగ్యవిజ్ఞానముల నొసంగి పురోభివృద్ధిని గల్పించి సంరక్షించుటకై పరమకారుణికుండగు జగదీశ్వరుని కేలుమొగిడ్చి వేడికొనియెద.

భాషోద్ధారకాది బిరుదాంకితులును అముద్రిత ప్రాచీనగ్రంథముల ముద్రించి వెల్లడింప బద్ధాదరులును అగు బ్రహ్మశ్రీ శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నన్నీ వ్యాఖ్యానరచనమునకు ప్రోత్సహించి తగుపారితోషికమునొసంగి ముద్రణాదుల కావశ్యకములగు వ్యయప్రయాసములనైన సరకుసేయక ఈగ్రంథమును

# వి ష య సూ చి క.

---

## క ల్ప స్థా న ము

### ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము.



## తృతీయాధ్యాయము.



## చతుర్థాధ్యాయము.

## అష్టమాధ్యాయము.

## ద్వాదశాధ్యాయము.

## సిద్ధిస్థానము.

## ప్రథమాధ్యాయము.

## సప్తమాధ్యాయము.

విషయము. పుటసంఖ్య.

## దశమాధ్యాయము.



## ఏకాదశాధ్యాయము.

విషయము. పుటసంఖ్య.



## ద్వాదశాధ్యాయము.

విషయము. పుటసంఖ్య.



విషయము. పుటసంఖ్య.

# సంస్కృత గ్రంథములు.

## వైద్యగ్రంథములు.

| | | ప్రతి 1-కి రుప్ప | అ. |
|---|---|---|---|
| అజీర్ణమంజరి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| అనుపానమంజరి ,, | ... | 0 | 4 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 6 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 5 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 3 | 8 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 0 |
| ఇలాజుల్ గుర్బా, యూనానివైద్యము | ... | 3 | 0 |
| కాలజ్ఞానము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| రావణకుమారతంత్రము ,, | ... | 0 | 6 |
| గదనిగ్రహము ,, | ... | 2 | 8 |
| ఘృతతరంగము ,, | ... | 1 | 0 |
| చక్రదత్త ,, | ... | 3 | 12 |
| చరకసంహిత, సూత్రస్థానము, ప్రథమ సంపుటము | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు, ద్వితీయ సంపుటము | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము, తృతీయ సంపుటము | ... | 8 | 0 |
| చికిత్సాసారము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 8 |
| దేహతత్త్వనిర్ణయము ,, | ... | 0 | 4 |
| నాడీజ్ఞానము ,, | ... | 0 | 4 |
| బసవరాజీయము ,, | ... | 7 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 6 |
| మశూచికము (Small-pox) | ... | 0 | 4 |
| రసప్రదీపిక, పద్యకావ్యము, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| రాజమార్తాండము ,, | ... | 0 | 10 |
| లోలంబరాజీయము ,, | ... | 0 | 8 |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | ... | 5 | 0 |
| వంధ్యాతంత్రము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| విషవైద్యచింతామణి ,, | ... | 2 | 0 |
| వృక్షాయుర్వేదము ,, | ... | 0 | 4 |
| వైద్యశతశ్లోకి ,, | ... | 0 | 6 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, | ... | 3 | 0 |

శ్రీరస్తు.

# చరకసంహిత

## ఆంధ్రవ్యాఖ్యానసహితము



# కల్పస్థానము

## ప్రథమాధ్యాయము.

మూ. అథాతో మదనకల్పం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

### వ్యాఖ్యానప్రారంభము.

సన్మాత్రమద్వయమనాదిమనన్తమీశం యోగీద్యమేకమగుణం గుణనిర్వికల్పం,
ఆనన్దరూపమమరైరపి చిన్త్యమానం దేవం పురాణమనిశం కలయే హృదాహమ్.
యోగేన మానసభవం మలినం తథైవ వాచోఽపి శబ్దవితతేరనుశాసనేన,
శారీరకం త్వమలవైద్యకబోధనేన యోఽపాకరోద్భువి పతఞ్జలిమానతస్తమ్.
బ్రహ్మాణం దక్షమహం బలసూదనమశ్వినా భరద్వాజమ్,
నత్వా చరకవ్యాఖ్యాం కుర్వే స్థానస్య కల్పానామ్.
స ఏవ పూర్ణాం చరకస్య కౌముదీం వ్యాఖ్యాం తనోత్యార్యజనోపయోగ్యాం,
న విశ్వనాథో లఘుధీరయం స్వయం విమోహమాయాన్తి చ యత్ర యోగినః.

అవతరణిక:—చికిత్సాస్థానమున నాయావ్యాధుల చికిత్సితముల జెప్పునపుడు అచ్చటచ్చట వమన-విరేచనరూపచికిత్సలును విధింపబడినవి; కావున అట్టి వమనవిరేచనముల కల్పముల వివరముగ జెప్పుటకై యీకల్పస్థానము చెప్పబడును. వస్తిప్రయోగంబును చికిత్స కంగముగనే యున్నను, వమనవిరేచనపూర్వకముగనే సామాన్యముగ వస్తివిధిప్రయోగ ముండును. కావున వస్తివిధానము దెల్పు సిద్ధిస్థానమునకు ముందు కల్ప

స్థానమును జెప్పుట సమంజసము. (వమనవిరేచనముల కల్పములుగల భాగము కల్పస్థానము. ఈయర్థము "వమనవిరేచనానాం కల్పాః తిష్ఠన్త్యస్మిన్ ఇతి కల్పస్థానం" అను విగ్రహముచే నేర్పడును.)

వమనవిరేచనములతో కూడ విరేచనము వమనపూర్వకముగ విధింపబడును. కావున వమనకల్పములే తొలుదొలుత చెప్పబడును. అందును "వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠతమాన్యాచక్షతేఽనపాయిత్వాత్" అను వాక్యముచే వమనద్రవ్యములతో మదనఫలములు (మ్రంగకాయలు) మిగుల శ్రేష్ఠములని క్రింద జెప్పబడును. కావున తొలుత మదనకల్పమే చెప్పబడును.

వ్యా. చికిత్సాస్థానమును జెప్పినపిదప చికిత్సాంగభూతమైన వమనౌషధకల్పములలో మదనకల్పమును దెల్పునట్టి యధ్యాయమును ఆత్రేయు లుపదేశించినదానికి న్యూనాఽతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

కల్పస్థానమునందలి విషయనిర్దేశము.

మూ. అథ ఖలు వమనవిరేచనార్థం వమన విరేచనద్రవ్యాణాం సుఖోపభోగ(గ్య)తమైః సహాఽన్యైర్ద్రవ్యైః వివిధైః కల్పనార్థం, (భేదార్థం విభాగార్థం చేత్యర్థః.) తద్యోగానాం చ క్రియావిధేః సుఖోపాయస్య, సమ్యగుపకల్పనార్థం, కల్పస్థానముపదేక్ష్యామోఽగ్నివేశ ! 3

వ్యా. వమనములను విరేచనములను జేయించుటకై మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యములను, తెగడ మున్నగు విరేచనద్రవ్యములను సుఖముగ నుపయోగింపదగిన సురసౌవీరకము మున్నగు పలుదెరంగులైన యితర ద్రవ్యములతో గూర్చి ప్రయోగభేదములను భాగభేదములను కల్పించుటకును, అట్టి వమనవిరేచన ద్రవ్యములకు సంబంధించిన స్వరసాదిరూపముల జక్కగ గల్పించుటకును కల్పస్థాన ముపదేశింపబడునని యగ్నివేశునకు ఆత్రేయులు చెప్పెను.

(మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యములను తెగడ మున్నగు విరేచనద్రవ్యములను తత్కాలసుఖమునేగాక యారోగ్యరూపసుఖమును గల్గింపదగిన సురాసౌవీరకాదీతరద్రవ్యములతో గూర్చి వానివాని భేదములను భాగభేదములను గల్పించి, అట్టి యౌషధయోగములను స్వరసాదిభేదముల గల్పింపతగు నుపాయముల జూపి యౌషధముల గల్పించి యుపయోగించి వమనవిరేచనముల జేయించుటకై యీకల్పస్థానము చెప్పబడునని యీకల్పస్థానమునందలి విషయము లీవాక్యముచే నిర్దేశింపబడినవి.)

## వమన-విరేచనపదముల నిర్వచనము.

మూ. తత్ర దోషహరణమూర్ధ్వభాగం వమనసంజ్ఞకం, అధోభాగం విరేచనసంజ్ఞకం; ఉభయం వా శరీరమలవిరేచనాత్ విరేచన సంజ్ఞం లభతే. ౪

వ్యా. శరీరమునందలి దోషమును ఊర్ధ్వభాగముగ (నోటినుండి) వెడలించుట వమనము. అధోభాగమునందలి దోషమును గుదమార్గమునుండి వెడలించుట విరేచనము. శరీరమునందలి యూర్ధ్వాధోభాగముల నుండుమలములను నోటినుండియు గుదము నుండియు వెడలించుటంజేసి వమనవిరేచనములు రెండును సామాన్యముగ విరేచనశబ్ద ముచే వ్యవహరింపదగియు నుండును.

ఇచ్చట "రిచ్‌ర్ క్షరణే" అను ధాతువుచే నిష్పన్నమైన విరేచనశబ్దమునకు 'స్రవింపజేయునది' యని యర్థము. అయ్యది శరీరమునందలి యూర్ధ్వాధోభాగముల మలమును నోటినుండియైనను గుదమునుండియైనను వెడలించుటంజేసి వమనవిరేచనములకు రెంటికిని సామాన్యముగ సంజ్ఞావాచకమై యీతంత్రమున వ్యవహరింపబడునని తంత్ర కారుల యాశయము. కావుననే తంత్రకారులు షడ్విరేచనశతాశ్రితీయమునందును "ఇహ ఖలు షడ్విరేచనశతాని భవన్తి" అను వాక్యమున వమనవిరేచనసామాన్యవాచక ముగ విరేచనశబ్దము నుపయోగించెను. మరియు నీపదము వమనవిరేచనములకు మాత్రము పంకజాదిపదములవలె యోగరూఢముగ జెప్పబడినది. కావున వస్తి-శిరోవిరేచనములకు వాచకముగ నుపయోగింపంజనదు.

## వమన-విరేచనౌషధములు వమనవిరేచనముల గల్గించువిధము.

మూ. తత్ర ఉష్ణ-తీక్ష్ణ-సూక్ష్మ-వ్యవాయి-వికాసీని ఔషధాని స్వవీర్యేణ హృదయముపేత్య, ధమనీరనుసృత్య, స్థూలాణుస్రోతోభ్యః కేవలం శరీరగతం దోషసఙ్ఘాతం ఆగ్నేయత్వాత్ విష్యన్ద యన్తి; తైక్ష్ణ్యాత్ విచ్ఛిన్దన్తి; స విచ్ఛిన్నః పరిప్లవన్ (పరిప్లవః) స్నేహభావితే కాయే, స్నేహాక్తభాజనస్థమివ క్షౌద్రం అసజ్జన్, అణుప్రవణభావాదామాశయమాగమ్య, ఉదానప్రణున్నః, అగ్నివాయ్వాత్మకత్వాత్, ఊర్ధ్వభాగప్రభావాత్, ఔషధస్య ఊర్ధ్వముత్క్షిప్యతే; సలిలపృథివ్యాత్మకత్వాత్ అధోభాగప్రభావా

చ్ఛౌషధస్య అధః ప్రవర్తతే; ఉభయతశ్చోభయగుణప్రభావాత్, ఇతి లక్షణోద్దేశః. ౫

వ్యా. ఉష్ణము, తీక్ష్ణము, వ్యవాయి (తొలుత శరీరమునందెల్ల వ్యాపించి పిమ్మట జీర్ణమగుస్వభావము), వికాసి (శరీరమునందలి రోమకూపాదిసూక్ష్మరంధ్రముల వ్యాపించు స్వభావము), అను నీగుణములు కలయౌషధములు తనయందలి ప్రభావముచే హృదయస్థానమునజేరి, ధమనుల ననుసరించి, తనయందలి యాగ్నేయ (అగ్నిసంబంధమైన యుష్ణ) గుణము కల్గియుండుటచేత శరీరమునందెల్ల సంచితమైన దోషసంచయమును ద్రవింపజేసి, శరీరమునందలి స్థూలంబులును సూక్ష్మంబులు నగు స్రోతస్సులనుండి విడదీసి వేరుపరచును. అట్టి విడదీయబడిన దోషసంచయము శరీరమునం దొకచోట నిల్కడలేక నలుప్రక్కల సంచరించుచు, సూక్ష్మమార్గముల సంచరించు స్వభావంబును, కోష్ఠమున కున్ముఖమగు స్వభావంబును కల్గియుండుటంజేసి, తొలుతనే స్నేహవిధానప్రయోగముచే భావితమై స్నిగ్ధముగనుండు శరీరాంతర్భాగమునం దెచ్చటను (నూనె మున్నగు స్నేహద్రవ్యముల సంబంధముచే జిడ్డుకల్గినపాత్రయందు తేనె యంటకుండుభంగి) అంటికొనక ఆమాశయమున జేరిన దోషసంచయము (ఉరఃస్థానముననుండు) ఉదానవాతముచే ప్రేరేపింపబడి, ఔషధమునందు అగ్నివాయుగుణంబు లధికముగ నుండుటవలనను ఊర్ధ్వమార్గమునుండి దోషముల వెడలించుస్వభావము కల్గియుండుటవలనను అట్టి యౌషధముచే నోటినుండి వెడలింపబడును.

పైజెప్పినరీతిగనే తీక్ష్ణోష్ణాదిగుణములుగల యౌషధములును పైజెప్పినరీతిగనే స్వకృత్యముల జేసి, తనయందు సలిలపృథివీగుణములు అధికముగ నుండుటంజేసి అథోభాగమున దోషముల వెడలింపజేయు ప్రభావవిశేషముచే నథోమార్గమున వెడలింపజేయును.

మరియు నౌషధములు అగ్నివాయుగుణంబులును జలపృథివిగుణంబులును సమానములుగ నుత్కటములై యుండుటంజేసి తనయందలి దోషముల నుభయమార్గముల వెడలింపజేయు ప్రభావవిశేషముచే నూర్ధ్వమార్గమునను, అథోమార్గమునను దోషమును వెడలింపజేయును.

ఇచ్చట "ఆగ్నేయత్వాత్ విష్యన్దయతి" అనుటచేతనే వమనద్రవ్యములు ఆగ్నేయములని తెలియుచున్నను మరల "అగ్నివాయ్వాత్మకత్వాత్" అని చెప్పుటవలన వమనద్రవ్యములు సామాన్య-విశేషగుణములచే నగ్నివాయుగుణముల కల్గియే యుండవలెననియు అందును అగ్నిగుణము ప్రబలముగ నుండవలెననియు నర్థము. వమనవిరేచనసామాన్యముగ "ఆగ్నేయత్వాత్" అనుపదముచే విరేచనద్రవ్యములును ఆగ్నేయములని

తెలియుచున్నను విశేషగుణముల జెప్పుతరి "సలిలపృథివ్యాత్మకత్వాత్" అని నిర్దేశించుటవలన విరేచనద్రవ్యములయందు సామాన్యముగ నాగ్నేయగుణము కల్గియున్నను, విశేషముగ జల-పృథివిగుణము లధికముగనుండునని తెలిసెడి. (వమనద్రవ్యములయందు ఆగ్నేయగుణభాగ మధికముగ నుండవలెననియు, విరేచనద్రవ్యములయందు సలిలపృథివి గుణములు బహుళముగ నుండవలెననియు ఫలితార్థము.)

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—అగ్నివాయ్వాత్మకద్రవ్యములు వమనకరములనియు, ఆగ్నేయములై పృథివీజలగుణభూయిష్ఠద్రవ్యములు శరీరమునం దధోభాగదోషహరవిరేచనకరంబులనియు పైవివరణముచే సిద్ధాంతమైనది. అట్టియెడ అగ్నివాయుగుణములు ఊర్ధ్వముగ వ్యాపించుట స్వతస్సిద్ధము. పృథివిజలగుణము లధోగమనశీలంబులు. కావున అట్టి గుణవిశేషములబట్టియే వమనద్రవ్యములు ఊర్ధ్వభాగమున దోషహరములనియు, విరేచనద్రవ్యములు అధోభాగవ్యాపకస్వభావముచే నధోభాగదోషముల నధోమార్గమునుండి వెడలించుననియు నేర్పడును; అటులుండ "ఊర్ధ్వభాగప్రభావాత్, అధోభాగప్రభావాత్" అనుపదములు వమనవిరేచనముల కేల విశేషవిధిగ జెప్పవలెనన్న:—అగ్నివాయుగుణములు కలద్రవ్యములు ఊర్ధ్వముగనే దోషముల హరించుననియు, పృథివిజలగుణములు కలద్రవ్యము లధోభాగదోషములనే వెడలించుననియు నియతముగ జెప్ప వలనుపడదు. అట్లు చెప్పునపుడు కటుకరసద్రవ్యములు ఆగ్నేయములగుటవలన అన్నియు నూర్ధ్వభాగదోషహరములుగనే యుండవలసివచ్చును. అట్లు అనుభవమున కానరాదు. కావున పైజెప్పిన గుణములు కల్గి ఊర్ధ్వభాగదోషహరప్రభావముకల వమనాదిద్రవ్యములు వమనకరంబులనియు, అధోభాగదోషహరప్రభావము కల తెగడ మున్నగు ద్రవ్యములు విరేచనకరంబులనియు చెప్పబడినది. (పైజెప్పినరీతిగ గుణవిశేషములు కల్గియున్నను ప్రభావవిశేషముచే వమనవిరేచనముల జేయునని భావము.) అట్టి రెండుప్రభావముల గల్గినద్రవ్యములు వమనవిరేచనముల రెంటిని ఏకకాలమున గల్గించునని యెరుంగునది. ఇదియును ద్రవ్యనిష్ఠప్రభావవిశేషము.

### వమనవిరేచనయోగముల సంగ్రహము.

మూ. తత్ర ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకుటజకృతవేధనానాం, శ్యామాత్రివృచ్ఛ్యతు రఙ్గుళతిల్వకమహావృక్షసప్తలాశఙ్ఖినీదన్తీద్రవన్తీనాం చ, నానావిధదేశకాలసమ్భవాస్వాదరసవీర్యప్రభావగ్రహణాత్, దేహదోషప్రకృతివయోబలాగ్నిభక్తిసాత్మ్య

రోగావస్థాదీనాం నానాప్రభావత్వాచ్చ (నానాత్మకత్వాచ్చ),
విచిత్రగంధరసస్పర్శానాముపయోగసుఖార్థం (ఉపభోగసుఖార్థం) అసఙ్ఖ్యేయసంయోగానామపి చ సతాం ద్రవ్యాణాం వికల్ప
మార్గోపదర్శనార్థం షడ్విరేచనయోగశతాని వ్యాఖ్యాస్యామః.

వ్యా. మ్రంగకాయ, దేవదాళి (డావరడంగి), చేదుసోర, ఆవడ, (చేదుబీర, పెద్దవి) కొడిసెపాల, (చేదుబీర చిన్నది), అను నీవమనౌషధులును, నల్లతెగడ, తెల్ల తెగడ, రేల, లొద్దుగు, బొంతజెముడు, సంబరేణి, దింటెన (శంఖిని), దంతి, (నేపాళము), ద్రవంతి (పెద్ద నేపాళము), అను నీవిరేచనద్రవ్యమును ఇవి పలుదెరంగులైన దేశములయందును కాలములయందును పుట్టునవియునై యుండును. మరియు వాని రుచియు, రసంబులును, వీర్యంబును, ప్రభావంబును పలుదెరంగుల కానవచ్చుచున్నయవి. మనుజులకు సంబంధించిన శరీరములు, వాతాదిదోషములు, ప్రకృతి, వయస్సు, బలము, జాఠరాగ్ని, మనుజులకు బోడము ఇచ్ఛ, సాత్మ్యము, రోగములయొక్క అవస్థావిశేషము, సత్త్వము, ఆహారము అనునవి యన్నియును పలుదెరంగులైన ప్రభావవిశేషముల గల్గియుండును. కావున (వమనౌషధవిరేచనౌషధంబులును, దేహదోషాదిపరిస్థితియు పైజెప్పినరీతిగ నానావిధములై యుండుటవలన) అట్టి యౌషధములను ఉపయోగించునపుడును ఉపయోగానంతరంబును సుఖముగనుండుటకై విచిత్రములైన గంధ-రస-స్పర్శములు కల్గియుండుటకై యౌషధసంయోగంబులును సంఖ్యాతీతములై యుండవలసి వచ్చును. అట్టి గణనాతీతములైన యౌషధసంయోగవికల్పమార్గములను అతివిస్తరంబును అతిసంక్షిప్తంబునుగాక యుండునట్లు చూపుటకై ఆరువందలవిరేచనయోగముల నీక్రింద వివరించెదము.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—వమన-విరేచనౌషధముల గల్పించునెడ అట్టి యౌషధముల యుత్పత్తిదేశమును, కాలమును, వాని రస-వీర్య-ప్రభావములను చక్కగ గమనించి, మనుజుని శరీరము, దోషములు, ప్రకృతి, వయస్సు, శరీరబలము, జాఠరాగ్ని పరిస్థితి, రోగికింగల యభిలాష, సాత్మ్యము, ఆయారోగములయవస్థాభేదములు, వీని నన్నిటింగూడ గమనించి తత్తదనుగుణముగను, ఔషధమును సేవించునపుడును, ఉత్తర కాలమునను సుఖోపభోగముగనుండుటకై చిత్రములైన గంధ-రస-స్పర్శములు గల్గి యుండునట్లును ఔషధముల గల్పింపవలెను. అట్లు కల్పింపబడిన యౌషధమే సమ్యగ్యుక్తంబును స్వకార్యసమర్థంబును నగును. ఈవిషయమునే తంత్రకారులు సూత్రస్థానమున నిట్లుపదేశించిరి.—''అథైనం పునరే... పాయయేత్; ప్రసమీక్ష్య దోషభేషజకాల

బలశరీరాహారసాత్మ్యసత్వప్రకృతివయసాం అవస్థాన్తరాణి వికారాంశ్చ" (సూ. అ. ౧౫. సూ. ౨౫) అట్టి సమ్యగ్యోగమునే చికిత్సితాంతమునను:—"దేశకాలప్రమాణానాం సాత్మ్యాఽసాత్మ్యస్య చైవహి, సమ్యగ్యోగః, అన్యథా హ్యేషాం పథ్యమప్యన్యథా భవేత్" (చి-అ. ౩౦) అని యుపక్రమించి దేశకాలాది సమ్యగ్యోగమును వివరించి చెప్పి యున్నది.

అట్టియెడ మ్రంగకాయ మున్నగు వమనౌషధంబులకును తెగడ మున్నగువిరేచనౌషధంబులకును ఉత్పత్తిదేశకాలంబులును, రసవీర్యవిపాకప్రభావంబులును పలుదెరంగుల నుండును. అందు కొన్నియౌషధములు కొన్నిదేశములయందును కొన్నికాలములయందును మాత్రము దొరకును. మరియు మనుజులదేహంబును, దోష-ప్రకృతి-వయో-బలాఽగ్ని-భక్తి-సాత్మ్య-రోగావస్థ-సత్వంబులును నానావిధభేదములు కల్గియుండును. అట్టిమనుజుల దేహాదిభేదముల కనుగుణముగ, దేశకాలాదులచే పలుదెరంగులైన వమనాద్యౌషధములను, రోగీచ్ఛానుసారముగ విచిత్రగంధరసస్పర్శాదులు కల్గియుండునట్లు కల్పింపవలెనన్న అట్టి కల్పనావికల్పములు అసంఖ్యాకములుగను కల్పించుటయు దుస్సాధముగ నుండును. కావున అట్టి యౌషధకల్పనావికల్పములను పైజెప్పిన వమనవిరేచనద్రవ్యముల నుద్దేశించి మిక్కిలి సంఖ్యాతీతము గాకుండునట్లు మందప్రజ్ఞులకు సుబోధముగ నారువందల ప్రయోగమార్గము లీక్రింద వివరింపబడునని సముదితార్థము. మిక్కిలి విశాలబుద్ధులగు వారికి సంగ్రహము నపేక్షింపకయే యిచ్చట జెప్పబడని యోగములయందును కల్పనా సామర్థ్య ముండునుకావున వారు అనుక్తయోగముల గూడ కల్పించుకొనవచ్చునని తంత్రకారులయాశయము. ఈవిషయము సూత్రస్థానమునను షడ్విరేచనశతాశ్రితీయ మున నిట్లుపదేశింపబడినది.—'నహి విస్తరస్య ప్రమాణమస్తి...బుద్ధిమతాం చ స్వాలక్షణ్యాత్ అనుమానయుక్తికుశలానాం అనుక్తార్థజ్ఞానాయ" (సూ. అ. ౪. సూ. ౭౫)

### వమనవిరేచనౌషధములకు దేశకాలాదిసంపద్విశేషముచే వీర్యాధిక్యము.

మూ. తాని తు ద్రవ్యాణి దేశ-కాల-గుణ-భాజన, సమ్ప-ద్వీర్య-బలాధానాత్, క్రియాసమర్థతమాని భవన్తి. ౭

వ్యా. పైజెప్పబడిన వమన-విరేచనద్రవ్యములు దేశముయొక్కయు, కాలముయొక్కయు, గుణములయొక్కయు, ఔషధము నుండుస్థానముయొక్కయు సంపద్విశేషమునుబట్టి వాని వీర్యము మిక్కిలి యధికముగ నుండును. దానంజేసి యవి మిక్కిలి వానికృత్యములజేయు సామర్థ్యము కల్గియుండును.

## దేశత్రైవిధ్యము.

**మూ.** త్రివిధః ఖలు దేశః జాఙ్గలోఽనూపః సాధారణశ్చేతి. ౮

వ్యా. దేశము జాంగలము, అనూపము, సాధారణము నని మూడువిధములుగ నుండును.

## జాంగలదేశలక్షణము.

**మూ.** తత్ర జాఙ్గలః.—పర్యాకాశభూయిష్ఠః, తరుభిరపి చ కదరఖదిరాఽసనాఽశ్వకర్ణధవతినిశసల్లకీసాలసోమవల్క బదరీతిన్దుకాఽశ్వత్థవటామలకీవనగహనః, అనేకశమీకకుభశింశపాప్రాయః, స్థిరశుష్కపవనబలవిధూయమానప్రనృత్యత్తరుణవిటపః, ప్రతతమృగతృష్ణికోపగూఢతనుఖరపరుషసికతాశర్కరాబహుళః, లావతిత్తిరిచకోరాఽనుచరితభూమిభాగః, వాతపిత్తబహుళః, స్థిరకఠినమనుష్యప్రాయః జ్ఞేయః. ౯

వ్యా. అందు జాంగలదేశము విశాలముగనుండు బయలుప్రదేశముకల్గి యీక్రింద చెప్పబడు చెట్లతో గూడి యుండును.—వెలిచంద్ర, నల్లనిచంద్ర, వేగిస, అశ్వకర్ణ చంద్రలోభేదము, ధవ (చంద్రభేదము), నెమ్మిచెట్టు, అందుకుచెట్టు, మద్దిచెట్టు, సోమవల్క (చంద్రభేదము), రేగు, తుమికిచెట్టు, రావిచెట్టు, మఱ్ఱి, ఉసిరికచెట్టు, ఈచెట్లుతో కూడి యరణ్యభూయిష్ఠముగ నుండును. అందును జమ్మిచెట్లును, ఏరుమద్దిచెట్లును, విరిగిచెట్లును విశేషముగ నుండును. స్థిరంబులై యెండి గాలిచే కదలింపబడి నటనముచేయునటు కదలుచున్నవిటపములు (చిన్నచెట్లు) కల్గియుండును. నిడుదలైన యెండమావులగల్గి మిగుల సూక్ష్మంబులును కఠినంబులు నైనయిసుకయు సున్నపురాళ్లును విశేషముగ వ్యాపించి యుండును. లావుకపిట్ట, తీతువుపిట్ట, చకోరములు అను నీపక్షిజాతులచే వ్యాపించిన భూప్రదేశము కల్గియుండును. దృఢముగను కఠినముగ నుండుశరీరము కలమనుష్యులు విశేషముగ వాతపిత్తప్రాయులై యుందురు. (ఈలక్షణములు కల్గినది జాంగలదేశమని యెరుంగునది.)

ఇచ్చట కదర-ఖదిర-ధవ-సోమవల్కశబ్దము చంద్రచెట్టుభేదముల బోధించు పర్యాయనామములు. ఈజాంగలాదిదేశలక్షణముల బోధించుగ్రంథము అనార్షమని కొందరియభిప్రాయము.

## అనూపదేశలక్షణము.

మూ. అథాఽనూపః—హిన్తాలతమాలనారికేళకదలీవనగహనః, సరిత్సముద్రపర్యన్తప్రాయః, శిశిరపవనబహుళః, వఞ్జుళవానీరోపశోభితతీరాభిః సరిద్భిరుపగతభూమిభాగః, క్షితిధరనికుంజోపశోభితః, మన్దపవనాఽనువీజిత క్షితిరుహగహనః, అనేకవనరాజీపుష్పితవనగహనభూమిభాగః, స్నిగ్ధతరుప్రతానోపగూఢః, హంసచక్రవాకబలాకానన్దీముఖపుణ్డరీకకాదమ్బ మద్గుభృఙ్గరాజశతపత్రమత్తకోకిలానునాదితతరువిటపః, సుకుమారపురుషః, పవనకఫప్రాయో జ్ఞేయః. ౧౦

వ్యా. అనూపభూమి—హింతాలములు, కానుక, కొబ్బరిచెట్లు, అరటిచెట్లు అను నీవృక్షములు గల్గియుండును. నదులకును సముద్రమునకు సమీపించియుండును. చల్లని గాలి విశేషముగ వీచుచుండును. పొగడచెట్లచేతను నీరుప్రబ్బలిచెట్లచేతను ప్రకాశింపబడిన గట్టుకల ప్రవాహములచే నాక్రమింపబడిన భూమిభాగములు కల్గినదియు, పర్వతములచేతను పొదరిండ్లచేతను ప్రకాశించునదియు, మందమారుతముచే కదలింపబడిన చెట్లు కల్గినదియు, అనేకములగు వనసమూహముచేతను పుష్పించినవనముచేతను వ్యాపింపబడిన భూభాగముతో కూడినదియు, స్నిగ్ధంబులైన వృక్షములచేతను తీవెలగుంపుచేతను నిగూఢమగు ప్రదేశము కల్గినదియు, హంసములు, చక్రవాకములు, బెగ్గురుపక్షులు, నందముఖములు, పుండరీకములు, కలహంసములు, నీరుకోళ్లు, శతపత్రములు, మదించిన కోయిలలు అను నీపక్షులకలకలముతో గూడిన చెట్లకొమ్మలు కల్గినదియు, సుకుమారపురుషులుండునదియు, వాతకఫబహుళంబును నగుభూమి అనూపమని చెప్పబడును.

## సాధారణదేశలక్షణము.

మూ. అనయోరేవ ద్వయోః దేశయోః వీరుద్వనస్పతివానస్పత్యశకునిమృగగణయుతః, స్థిరసుకుమారబలవర్ణసంహననోపపన్నసాధారణగుణయుక్తపురుషః, సాధారణో జ్ఞేయః. ౧౧

వ్యా. పైని జాంగలానూపదేశముల రెంటికిని చెప్పబడిన వీరుత్ (పొదరిండ్లు), వనస్పతి, వానస్పత్యములను చెట్లతోడను, హంసచక్రవాకాదిపక్షులతోడను మృగముల

తోడను కూడి స్థైర్యంబును సుకుమారత్వంబును శరీరకాంతియు కల్గి సామాన్యగుణములు కల్గినపురుషులు కల్గినదియు నగుభూమి సాధారణదేశమని యెరుంగనగును.

(ఇచ్చట దట్టముగ నల్లిన లతాసమూహము వీరుత్తనియు, పుష్పించకయే ఫలించు అత్తి పనస మున్నగునవి వనస్పతులనియు, పుష్పించి ఫలించు మామిడి మున్నగునవి వానస్పత్యములనియు నెరుంగునది.)

ఔషధమునకుండవలసిన దేశాదిసమ్పద్వివరణము.

మూ. తత్ర దేశే సాధారణే జాఙ్గలే వా యథాకాలం శిశిరాఽఽతపపవనసలిలసేవితే, సమే, శుచౌ, ప్రదక్షిణోదకే, శ్మశానచైత్యదేవయజనాగారసభాశ్వభ్రారామవల్మీకోషరవిరహితే, కుశరోహిషాస్తీర్ణే, స్నిగ్ధ-కృష్ణ-మధురమృత్తికే, సువర్ణవర్ణమధురమృత్తికే వా, మృదౌ, అఫాలకృష్టే,అనుపహతేఽన్యైర్బలవత్తరైర్ద్రుమైః, ఔషధాని జాతాని ప్రశస్యన్తే. ౧౨

వ్యా. పై జెప్పబడిన దేశములలో సాధారణదేశమునందైనను జాంగలదేశమునందైన ఆయాఋతువులకు నైజమైన శీతోష్ణములచేతను గాలిచేతను జలముచేతను వ్యాపింపబడినదియు, నిమ్నోన్నతముగాక సమంబును, పరిశుద్ధంబును, ప్రదక్షిణముగ వెడలుజలము కల్గినదియు, శ్మశానము రచ్చతిన్నె యజ్ఞములజేయు గృహము సభాస్థలము బొరియలు ఉద్యానవనము పుట్టలు చౌటిమన్ను అనునవి లేకున్నదియు, దర్భలచేతను పచ్చికచేతను వ్యాపింపబడినదియు, స్నిగ్ధంబును కృష్ణవర్ణంబు మధురంబునైనమట్టి కల్గినదియు, లేక బంగరురంగును మధురరసంబును కలమట్టితో కూడినదియు, నాగలిచే దున్నకుండునదియు, మిక్కిలి బలవత్తరములగు నితరవృక్షములచే నభిఘాతములేనిదియు నగుప్రదేశమున పుట్టినయౌషధములు మిగుల ప్రశస్తములు.

ఆయాయౌషధమును గ్రహింపదగినకాలము.

మూ. తత్ర యాని కాలజాతాని, ఆగత (ఉపగత) సమ్పూర్ణప్రమాణరసవీర్యగన్ధాని, కాలాతపాగ్నిసలిలపవనజన్తుభిరనుపహతగన్ధవర్ణరసస్పర్శప్రభావాణి, ప్రత్యగ్రాణ్యుదీచ్యాం దిశి స్థితాని; తేషాం శాఖాపలాశమచిరప్రరూఢం వర్షావసన్తయోర్గ్రాహ్యం, గ్రీష్మే మూలాని శిశిరే వా శీర్ణప్రరూఢపర్ణానాం, శరది త్వక్కన్దక్షీరాణి, హేమన్తే సారాణి, యథర్తు పుష్పఫలమితి. ౧౩

వ్యా. పై జెప్పబడిన లక్షణములతో గూడిన దేశమున పుట్టిన యౌషధములు ఆయాయౌషధములకు నియతమైనకాలమున పుట్టియుండవలెను. (ఇది కాలమునకు జేరిన సంపత్తు) మరియు నవి సంపూర్ణములైనరసంబును పరిమాణంబును మధురాదిరసంబులును వీర్యంబును గంధంబును కల్గియుండవలెను. వాని గంధవర్ణరసస్పర్శంబులును ప్రభావంబులును కాలముచేతను ఎండచేతను నిప్పుచేతను జలముచేతను గాలిచేతను కీటాదిజంతువులచేతను చెడక మంచిగుణములు కల్గియుండవలెను. (ఇది గుణములకు సంబంధించిన సంపత్తు) ఇట్టి దేశాదిసంపత్తు గల్గి తానుండుప్రదేశమున ఉత్తరదిశయందుండు ఔషధముల గ్రహింపనగును.

అందు శాఖలను ఆకులను క్రొత్తగనుండువానిని వర్షర్తువునందును, వసంతఋతువునందును గ్రహింపనగును. గ్రీష్మఋతువునందైనను శిశిరఋతువునందైనను చెట్లకు ఆకులు రాలి క్రొత్తగ చిగిరించి యున్నపుడు వానిమూలములను (వేళ్లను) గ్రహింపనగును. త్వక్కులను (పట్టను) గెడ్డలను క్షీరములను శరత్కాలమున గ్రహింపనగును. సారములను (చంద్ర మున్నగువానిచేవను) హేమంతఋతువున గ్రహింపవలెను. పుష్పములను ఫలములను అవి యేయేఋతువున సంభవించునో ఆఋతువున గ్రహింపనగును.

ఇచ్చట "గ్రీష్మే మూలాని,శిశిరే వా" అనుచోట ఆగ్నేయములగు నౌషధమూలములను గ్రీష్మమునందును, సౌమ్యములగు నౌషధమూలములను శిశిరఋతువునను గ్రహింపవలెనని కాలవిభాగము నెరుంగునది. ఈవిషయమును సుశ్రుతు లిట్లుపదేశించెను:—'సౌమ్యాన్యౌషధాని సౌమ్యేష్వృతుష్వాదదీత, ఆగ్నేయాన్యాగ్నేయేషు" (సు. సూ ౫. ౩౬)

## ఔషధగ్రహణనియమము.

సూ. మఙ్గళాచారః, కల్యాణవృత్తః, శుచిః, శుక్లవాసాః, సమ్పూజ్య దేవతాః అశ్వినౌ గోబ్రాహ్మణాంశ్చ, కృతోపవాసః ప్రాఙ్ముఖః ఉదఙ్ముఖో వా గృహ్ణీయాత్.　　　౧౪

వ్యా. ఔషధముల గ్రహించు మనుజుడు శుభకరమైన యాచారంబును చేష్టలను కల్గి పరిశుద్ధుడై తెల్లనివలువలందాల్చి, ఇష్టదేవతలను అశ్వినీదేవతలను గోబ్రాహ్మణులను పూజించి, నా డుపవాసముచేసి తూర్పుముఖముగనైనను ఉత్తరముఖముగనైనను తానుండి పై జెప్పిన దేశకాలాదిసంపద్యుక్తమైన యౌషధమును, శాఖాపత్రాదులకు పైన వర్ణయింపబడిన ఆయాకాలమున గ్రహింపవలెనని భావము.

## ఔషధముల భద్రపరచువిధము.

మూ. గృహీత్వా చాఽనురూపగుణవద్భాజనస్థాన్యగారేషు ప్రాగుదగ్ద్వారేషు నివాతప్రవాతైకదేశేషు నిత్యపుష్పోపహారబలికర్మవత్సు, అగ్నిసలిలోపస్వేదధూమ రజోమూషకచతుష్పదాం అనభిగమనీయాని స్వవచ్ఛన్నాని శిక్యేష్వాసజ్య స్థాపయేత్. ౧౫

వ్యా. పైజెప్పినరీతిగ గ్రహింపబడిన యౌషధములను, ఆయౌషధములకు అనురూపములైన గుణసంపత్తుకల పాత్రలోనునిచి తూర్పువాకిలియైనను ఉత్తరపువాకిలియైనను కల్గి గాలిలేని యొకప్రదేశంబును, గాలివీచుచుండు వేరొకప్రదేశంబును కల్గి, పుష్పములు ఉపహారములును బలికర్మవిధానంబునుంగల యిండ్లయందు పదిలముగ బెట్టి, అట్టి యౌషధపాత్రములయందు నిప్పు జలము ఆవిరి పొగ ధూళి ఎలుకలు ఇతరములగు పశ్వాదిజంతువులును చొరకుండునట్లు వానిపై మూతలుపెట్టి యుట్లపై నుంచవలెను. (ఇది భాజనసంపత్తు).

## వమనవిరేచనద్రవ్యములను భావన-ఆలోడనములజేయదగిన ద్రవ్యములసంగ్రహము.

మూ. తాని చ యథాదోషం ప్రయుఞ్జీత:—సురా-సౌవీరక-తుషోదక - మైరేయ - మేదక-ధాన్యామ్ల-ఫలామ్ల-దధ్యమ్లాదిభిః వాతే; మృద్వీకామలక-మధు-మధుక-పరూషక-ఫాణిత-క్షీరాదిభిః పిత్తే; శ్లేష్మణి తు మధుమూత్రకషాయాదిభిః, భావితాన్యాలోడితాని చేత్యుద్దేశః, తం విస్తరేణ ద్రవ్య-దేహ-దోష-సాత్మ్యాదీని ప్రవిభజ్య వ్యాఖ్యాస్యామః. ౧౬

వ్యా. పైజెప్పినరీతిగ భద్రపరచబడిన యౌషధములను ఆయాదోషములకుదగునట్లీక్రింద జెప్పబడువిధముగ నుపయోగించవలెను.—అందు సురామద్యము, సౌవీరకము, తుషోదకము, మైరేయమనుమద్యము, మేదకము, ధాన్యామ్లము (పుల్లనిగంజి), ఫలామ్లము (దానిమ్మ మున్నగుఫలముల పుల్లనిరసము), పులిసినపెరుగు, ఇవి మున్నగువానిలో జేనియందైనను ఔషధమును భావనచేసి వానియందే కలిపి వాతమునం దుపయోగింపవగును.

పిత్తమునందు—ద్రాక్షపండ్లరసము, ఉసిరికకాయలరసము, తేనె, అతిమధురస్వరసము, ఈతపండ్లరసము, చక్కెరపాకము, ఆవుపాలు మున్నగువానిలో నౌషధమును భావనచేసి వానియందే కలిపి యుపయోగింపందగును.

కఫమున—తేనే, మూత్రములు, కఫహరద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడిన క్వాథము మున్నగువానితో నౌషధముల భావనజేసి వానిలో కలిపి యుపయోగింపవలెను. ఇత్తెరంగున వాతపిత్తకఫముల ననుసరించి సంక్షిప్తముగ నౌషధప్రయోగవిధి చెప్పబడినది. మరియు ద్రవ్యము, దేహము, దోషములు, సాత్మ్యము, (సత్వము, ప్రకృతి, బలము) మున్నగువానిని వేరువేరుగ విభజించి యౌషధప్రయోగవిధి యీక్రింద వివరింపబడును.

### వమనార్థము మదనఫలముల (మ్రంగకాయల) గ్రహించువిధము.

మూ. వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠతమాన్యాచక్షతే, అనపాయిత్వాత్. తాని వసన్తగ్రీష్మయోరన్తరే పుష్యాశ్వయుజాభ్యాం మృగశిరసా వా (అన్తరా పుష్యేఽశ్వయుజ మృగశిరసి వా) గృహ్ణీయాత్, మైత్రే ముహూర్తే. ౧౭

వ్యా. వమనద్రవ్యములలో మదనఫలములు (మ్రంగకాయలు) అపాయమును (వమనవ్యాపత్తును) కల్గింపదు; కావున నిది మిగుల శ్రేష్ఠమనుగ జెప్పబడును. అట్టి మ్రంగకాయలను వసంత గ్రీష్మఋతువులమధ్యకాలమున పుష్యము, అశ్విని, మృగశీర్షములలో నొకనక్షత్రము నాడు మిత్రదేవతాకమైన శుభముహూర్తమున సదాచారాదినియమయుక్తుడై గ్రహించవలెను.

### వమనములకు మ్రంగకాయల సిద్ధముచేయురీతి.

మూ. యాని పక్వాని అకాణ్డాని, అహరితాని, పాణ్డూన్యకృమీణి, అపూతీని, అజన్తుజగ్ధాని, అహ్రస్వాని; తాని ప్రమృజ్య కుశపుటే బద్ధ్వా గోమయేనాఽఽలిప్య యవతుష (బుష) శాలికులుత్థముద్గ పలానాం (పర్ణానాం) అన్యతమే నిదధ్యాదష్టరాత్రమ్. ౧౮

అత ఊర్ధ్వం మృదూభూతాని మధ్విష్టగన్ధాన్యుద్ధృత్య శోషయేత్, సుశుష్కాణాం ఫలపిప్పలీః(ఫలానాం పిప్పలీః) ఉద్ధరేత్.

తాసాం ఘృతదధిమధుపలలవిమృదితానాం పునశ్శుష్కాణాం నవం కలశం సుప్రమృష్టవాలుకం అరజస్కం ఆకంఠం పూరయిత్వా, స్వవచ్ఛన్నం స్వనుగుప్తం శిక్యేష్వాసజ్య (ష్వవసృజ్య) సమ్యక్ స్థాపయేత్. ౨౦

వ్యా. గ్రహింపబడిన మ్రంగకాయలలో చక్కగ పండినవియు, కాడలు లేనివియు, పచ్చనిరంగులేనివియు, పాండువర్ణంబులును, పురుగులులేనివియు, దుర్గంధము లేనివియు, కీటములు మున్నగుజంతువులచే నమలబడకుండునవియు, మిక్కిలి హ్రస్వములు గాక యుక్తపరిమాణము కల్గినవియు నగువాని సేర్పరచి గ్రహించి శుభ్రముగ కడిగి, దర్భలను సంపుటముగజేసి యందు నడుమ కాయల నునిచి బిగియ గట్టి యాపొట్లముపై పేడ బూసి, యవలు, పొట్టు, వరిధాన్యము, ఉలవలు, పెసలు, వీనిరాసులలో నొకదాని యందు నడుమ (పైజెప్పబడినయౌషధమును) ఎనిమిదిదినములకాల ముంచవలెను.

ఎనిమిదిరాత్రులు కడచినపిదప ధాన్యాదిరాశిలో నుంచబడిన మ్రంగకాయలు మెత్తవడి తేనెవలె నింపైనగంధము కల్గియుండును; అత్తరి వాని వెలికిందీసి చక్కగ నెండించి యాకాయలలోనుండు విత్తనముల నూడదీసి యుంచుకొనునది. పిదప వానిని (మ్రంగకాయగింజలను) నెయ్యి పెరుగు తేనె మాంసము అనువానిలో నొకదానియందు కలిపి మర్దనముచేసి చక్కగ మరలనెండించి, ఇసుక మున్నగుధూళి లేక శుభ్రముగనుండు నొకక్రొత్తమట్టిపిడతలో నిండుకు పైజెప్పిన మ్రంగకాయల గింజలచే నిండించి, దానిపై భద్రముగ మూతమూసి, ఉట్టిపై పదిలముగ నుంచవలెను.

{ మదనఫలముతో వమనౌషధయోగములు నూటముప్పదిమూడు.
వమనౌషధప్రయోగవిధిః మదనఫలకషాయయోగములు తొమ్మిది. }

మూ. అథ చ్ఛర్దనీయమాతురం ద్వ్యహం త్ర్యహం వా స్నేహస్వేదోప పన్నం, శ్వశ్ఛర్దయితవ్యమితి గ్రామ్యానూపౌదక మాంసరస - క్షీర-దధి-మాష-తిలశాకాదిభిః సముత్క్లేశిత శ్లేష్మాణం వ్యుషితం జీర్ణాహారం, పూర్వాహ్ణే కృతబలిహోమమఙ్గళప్రాయశ్చిత్తం, నిరన్నమనతిస్నిగ్ధం,యవాగ్వా ఘృతమాత్రాం పీతవన్తం,తాసాం ఫలపిప్పలీనాం అన్తర్నఖముష్టిం యావద్వా సాధు మన్యేత, జర్జరీకృత్య యష్టిమధుకషాయేణ, కోవిదార-కర్బుదార-నీపవిదుల బిమ్బీ-శణపుష్పీ-సదాపుష్పీ-ప్రత్యక్పుష్పీకషాయాణాం అన్యత మేన వా రాత్రిముషితం, విమృజ్య పూతం మధుసైన్ధవయుక్తం సుఖోష్ణం కృత్వా పూర్ణం శరావం మన్త్రేణానేనాభిమన్త్రయేత్.
"బ్రహ్మదక్షాశ్విరుద్రేన్ద్రభూచన్ద్రార్కానిలానలాః,
ఋషయస్సౌషధిగ్రామాః భూతసఙ్ఘాశ్చ పాన్తు తే.

రసాయనమివర్షీణాం దేవానామమృతం యథా,
సుధేవోత్తమనాగానాం భైషజ్యమిదమస్తు తే." ౨౨
ఇత్యేవమభిమన్త్ర్య ఉదఙ్ముఖం ప్రాఙ్ముఖం వా ఆతురం పాయయేత్; శ్లేష్మజ్వరగుల్మప్రతిశ్యాయార్తం విశేషేణ పునః పునరాపిత్తాగమనాత్. తేన సాధు వమతి. ౨౩

వ్యా. పిమ్మట వాంతి చేయింపవలసినరోగికి రెండుదినములైనను మూడుదినములైనను విధ్యుక్తప్రకారము స్నేహస్వేదవిధులచే స్నిగ్ధస్విన్నశరీరునిగ జేసి, వమనముచేయించుదినమునకు ముందుదినమున గ్రామమునందలి జంతువులయొక్క మాంసరసము, అనూపజంతువులమాంసరసము, ఉదకముననుండు మత్స్యాదులమాంసరసము, పాలు, పెరుగు, ఉద్దిపప్పు, నువ్వులు, శాకములు మున్నగువానిచే నాహారమిడి, రోగికి శ్లేష్మము స్వస్థానమునుండి వెలిపడునట్లుచేసి, నాడురాత్రి నిశ్శంకముగ నిదురించి ముందు భుజింపబడినయాహారము జీర్ణమైయుండునపుడు ప్రాతఃకాలమున పూజావిధానమును హోమమును మంగళాశాసనములను ప్రాయశ్చిత్తమును చేసికొన నిరాహారుడై యున్నరోగికి క్రిందచెప్పబడురీతిగ వమనౌషధమును త్రాగించవలెను. మరియు రోగి మిక్కిలి స్నిగ్ధకోష్ఠుడు కాకుండునెడ యవాగువుతో ఘృతమును మితముగ జేర్చి త్రాగించి పిమ్మట వమనౌషధమును త్రాగించవలెను—పైజెప్పినరీతిగ సిద్ధముచేసి యుంచబడిన మ్రంగకాయవిత్తనములను ఒకపిడికిలి మాత్ర పరిమాణమునైనను, లేక దోషాదిబలానుగుణమైన పరిమితముగనైనను గ్రహించి నలియకొట్టి అతిమధురకషాయమునందైనను, ఎఱ్ఱనిదేవకాంచనము తెల్లనిదేవకాంచనము, కడిమి, ప్రబ్బలి, దొండ, గిలకచెట్టు, (జనుపచెట్టు) సదాపుష్పి, ఉత్తరేణి, అనువానితో దేనినైన నొకదాని చేర్చి సిద్ధముచేయబడిన కషాయమునందైన నొకరాత్రియంతయు నూరబెట్టి, చక్కగపిసికి వడగట్టి, యాకషాయమున తేనెను సైంధవలవణమును కొంచెముగ జేర్చి, సుఖోష్ణముగ జేసి యాయౌషధమును పూర్ణశరావమున బెట్టి, "బ్రహ్మదక్షాశ్వి...మిదమస్తు తే" అనుమంత్రముచే (మంగళార్థము) అభిమంత్రించి వమనమునకు సిద్ధముగనున్న రోగిని తూర్పుముఖముగనైనను ఉత్తరముఖముగనైనను నిలిచి వానికి త్రాగించవలెను.

శ్లేష్మము, జ్వరము, గుల్మము, పీనసము అనుసీరోగములచే పీడింపబడినవానికి విశేషముగ వమనౌషధము నుపయోగింపవలెను. ఇత్తెరంగున రోగికి పిత్తపసరు బైటవెడలకుండునందాక వమనౌషధమును మాటిమాటికిని త్రాగించుచుండవలెను. దీనిచేత చక్కగ

వమనమగును. (ఈతొమ్మిదియోగములును "నవయోగాః కషాయేషు" అని సంగ్రహముగ నిర్దేశింపబడును.)

(ఇచ్చట నీసంగ్రహము నెరుంగునది:—వమనము చేయించవలసినరోగికి తొలుత స్నేహస్వేదవిధులను విధ్యుక్తప్రకారము రెండుమూడు దినములు చేసి స్నిగ్ధుడైనపిదప వమనముచేయదలచినదినమునకు ముందుటిదినమున కఫము స్వస్థానమునువదలి వమనోన్ముఖముగనగుటకై గ్రామ్యానూపాదిజంతువుల మాంసరసము మున్నగువానితో నాహారమిడి రాత్రి సుఖముగ నిదురించినవానికి మరునాడు బలిహోమాదుల నిర్వర్తించి ముందు భుజించినయాహారము జీర్ణమై పరగడుపుతోనున్నపు డుదయకాలమున వమనౌషధమును వానికి త్రాగింపవలెను. ఒకవేళ ముందుజేసిన స్నేహవిధిచే పూర్తిగస్నిగ్ధుడుకానియెడ వానికి యవాగువున నేతిని మితముగ గలిపి త్రాగించి పిదప వమనౌషధమును త్రాగింపవలెను— పైజెప్పినరీతిగ సంస్కరించి పదిలముగ నుంచబడియుండు మ్రంగకాయవిత్తనములను వ్యాధ్యాదిబలానుగుణమునకు తగిన పరిమాణముతో గ్రహించి నలియగొట్టి అతిమధుర కషాయము మున్నగు ద్రవములలో నొకదానియందు ముందుటిరాత్రియంతయు నూరబెట్టి చక్కగ విత్తనములసారము కషాయమునజేరునట్లు పిసికి వడగట్టి యాకషాయము సుఖోష్ణముగనున్నపుడు పైజెప్పినమంత్రముతో నభిమంత్రించి రోగిని తూర్పుముఖముగనైనను ఉత్తరముఖముగనైనను కూర్చుండబెట్టి త్రాగింపవలెను. పిత్తపసరు మాత్రము బైటరాక కఫము పూర్తిగవెడలునందాక పలుమారు త్రాగించవలెనని సముదితార్థము.)

ఈవమనౌషధమును సేవించురోగికి ముందుగనే స్నేహస్వేదవిధులచేసి స్నిగ్ధస్విన్నునిగ జేయుట ముఖ్యము. ఈవిషయమునే సుశ్రుతు లిట్లుపదేశించెను:—'పేశలైర్వివిధై రన్నైః దోషానుత్క్లేశ్య దేహినః, స్నిగ్ధస్విన్నాయ వమనం దత్తం సమ్యక్ ప్రవర్తతే" (సు. చి. అ. 33) "ఆపిత్తగమనాత్" అనుచోట ఆఙుమర్యాదార్థకము కావున పిత్తము బైటవెడలకుండునందాక వమనౌషధమును మాటిమాటికి నుపయోగింపవలెనని యర్థము. కావుననే సిద్ధిస్థానమున "పిత్తాన్తమిష్టం వమనం" (సి. అ. ౧) అని చెప్పబడును.

మంత్రార్థము:—బ్రహ్మ, దక్షప్రజాపతి, అశ్వినీదేవతలు, రుద్రుడు, ఇంద్రుడు, భూదేవత, చంద్రుడు, సూర్యుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు, దేవర్షి బ్రహ్మర్షులు, ఓషధిసమూహములు, పంచభూతసముదాయము, వీరందరును నిన్ను కాపాడెదరుగాక! నేనొసంగు నీయౌషధము ఋషులకు రసాయనమును బోలియు, దేవతల కమృతమునుం బోలియు, ఉత్తములగునాగులకు సుధనుబోలియు నీకారోగ్యమును గల్గించి యాయువును వృద్ధినొందించుగాక.

—॥ వమనము చక్కగ కానియెడ చేయదగిన యుపాయము. ॥—

మూ. హీనవేగంతు పిప్పల్యామలకసర్షపవచాకల్కకషాయేణ, లవణోష్ణోదకైః పునః పునః ప్రవర్తయేదాపిత్తదర్శనాత్, ఇత్యేషః సర్వచ్ఛర్దనీయోగవిధిః. ౨౮

వ్యా. పైని చెప్పిన యౌషధప్రయోగముచే వమనములు చక్కగ గాకుండునెడ పిప్పళ్లు, ఉసిరికకాయలు, ఆవాలు, వస, వీనికల్కకషాయమును ఉప్పుకలిపిన వేడినీళ్లను మాటిమాటికిత్రాగించి పిత్తముకనుబడునందాక వమనముల వెడలింపవలెను. వమనయోగములన్నిటియందును ఈవిధానమునే యెరుంగునది.

—॥ వమనౌషధమున సైంధవలవణమును తేనెను జేర్చువిధి. ॥—

మూ. సర్వేషు తు మధుసైన్ధవం కఫవిలయనచ్ఛేదార్థం వమనేషు విదధ్యాత్. న చోష్ణవిరోధో మధునః ఛర్దనయోగయుక్తస్య, అవిపక్వప్రత్యాగమనాత్ దోషనిర్హరణాచ్చ. ౨౯

వ్యా. వమనౌషధయోగము లన్నిటియందును కఫము పలుచవడి పట్టువదలి వెడలుటకై సైంధవలవణమును తేనెను కూడ చేర్చవలెను. తేనె యుష్ణద్రవ్యములతో జేర్చిన విషతుల్యమగునని సామాన్యముగ జెప్పియున్నను వమనప్రయోగమున నయ్యది పక్వము గాకయే (వమనరూపముగ) బైటవెడలుటంజేసియు, దోషముల వెడలించునది యగుటంజేసియు, వమనౌషధమున జేర్చినను విరుద్ధము కానోపదు.(ఇచ్చట "అవిపక్వప్రత్యాగమనాత్" అని చెప్పబడిన హేతువువలన తేనె యుష్ణపదార్థములతో కలిసి జాఠరాగ్నిసంబంధముచే పక్వమైనపుడు మాత్రము విషతుల్యమగునుకాని, పక్వముగాక బైటవెడలునెడ విరుద్ధముకానేరదని తంత్రకారులభావము.)

ఇచ్చట నీవివరణము నెరుంగునది:— తేనె నానావిధములగు పుష్పములయందలి మకరందమును తేనెటీగలు ఒకచోట చేర్చినపదార్థము. కావున దానికి విషసంబంధము కల్గియేయుండును. అట్టితేనెను ఉష్ణపదార్థములతో జేర్చి యుపయోగించినను, ఉష్ణపీడితులకుపయోగించినను విషతుల్యమై ప్రాణముల హింసించును. ఈవిషయము నీతంత్రకారులు సూత్రస్థానమున "హన్యాన్మధూష్ణం, ఉష్ణార్తం అథవా సవిషాన్వయాత్"(సూ.అ.౨౭. శ్లో. ౨౮) అనువాక్యముచే నుపదేశించిరి. వాగ్భటాచార్యులును—"ఉష్ణముష్ణార్తముష్ణేచ యుక్తం చోష్ణైః నిహన్త్యసూన్" అనువాక్యముచే స్ఫుటముగ జెప్పిరి. ప్రాకృతమున

ఉష్ణవీర్యమగు వమనార్థకషాయమున తేనెనుచేర్చుట యె ట్లుచితమగునన్నచో వమనౌషధ మున మాత్రము తేనెను జేర్చుట విరుద్ధము కానేరదని "న చోష్ణవిరోధో......నిర్హ రణాత్" అనుపైవాక్యముచే సహేతుకముగ విధింపబడినది. ఈవిషయమునే వాగ్భటా చార్యులును ఇట్లుచెప్పిరి:—"ప్రచ్ఛర్దనే నిరూహేచ మధూష్ణం న నివార్యతే,అలబ్ధపాక మాశ్వేవ తయోర్యస్మాన్నివర్తతే" ఈయపవాదశాస్త్రమునుబట్టి నిరూహవస్తియందును మధూపయోగము విరుద్ధము కానేరదని యెరుంగునది. ఈవివరణమంతయు సూత్రస్థాన వ్యాఖ్యయందును మాచే జూపబడినది.

ఇచ్చట "సర్వేషు" అని చెప్పినది ప్రాయికముకావున శ్లేష్మాదివమనౌషధముల కొన్నిటియందు తేనెను జేర్చుటలేదు. మరియు—"అథచ్ఛర్దనీయం" అనియుపక్రమించి చెప్పబడినప్రయోగమున అతిమధురము మున్నగుతొమ్మిదిద్రవ్యములను వేరువేరుగ క్వాథ ముల తొమ్మిదిటినిచేసి వానితో నుపయోగింపబడిన వమనయోగములు తొమ్మిదియగునని యెరుంగునది.

(౮) మదనఫలమాత్రాయోగము లెనిమిది.

మూ. ఫలపిప్పలీనాం ద్వౌ ద్వౌ భాగౌ కోవిదారాదికషాయేణ త్రిస్సప్తకృత్వః స్రావయేత్; తేన రసేన తృతీయం భాగం పిష్ట్వా మాత్రాం హరీతకీభిః విభీతకైరామలకైర్వా తుల్యాం వర్త యేత్;తాసామేకాం ద్వే వా పూర్వోక్తానాం కషాయాణామన్య తమస్య అఞ్జలిమాత్రేణ విమృద్య బలవచ్ఛ్లేష్మప్రసేకగ్రన్థిజ్వరో దరారుచిషు పాయయేదితి సమానం పూర్వేణ. ౨౬

వ్యా. పైనిర్దేశింపబడిన మ్రంగవిత్తనముల గ్రహించి మూడుభాగములుగ జేసి యందు రెండుభాగములను మాత్రము గ్రహించి, పైయోగమున జెప్పబడిన దేవకాంచ నము మున్నగుద్రవ్యములలో నొకద్రవ్యమును క్వాథముచేసి యాకషాయమున పైయోగ మున జెప్పినప్రకారము ఒకరాత్రి భావనచేసి మరునాడుదయమున పిసికి కషాయమును మాత్రము వంచుకొనవలెను. ఇత్తెరంగు నాకషాయముననే మరల రెండుభాగముల మ్రంగకాయగింజలను భావనచేసి మరుసటిదినము కషాయమునుమాత్రము గ్రహించునది. ఇత్తెరంగున నొకేకషాయమున మ్రంగకాయవిత్తనముల మాటిమాటికి జేర్చుచు నిరువది యొకసారి భావనచేసి కషాయమును మాత్రము గ్రహించునది. ఇత్తెరంగున నిరువదియొక సార్లుభావనచేసి గ్రహించబడినకషాయమును మూడవవంతుగ నుంచబడినమ్రంగవిత్తనముల కల్కముతో కలుపుకొని మెత్తగ నూరి కరకకాయ, తానికాయ, ఉసిరికకాయ, అను

వానితో నొకదానిపరిమితి కల్గియుండునట్లు ఉండలుగజేసి, వానిలో నొకటినైనను రెంటినైనను, నాల్గుపలముల పరిమితమైన దేవకాంచనాదికషాయములలో నొకదాని యందు నూరి కలిపి వమనముచేయించవలసినరోగికి త్రాగింపవలెను. ఈయౌషధమును మిక్కిలి ప్రబలముగ కఫము కారునప్పుడును, గ్రంధిరోగమునందును, జ్వరమునందును, ఉదరమునందును అరోచకమునందును ప్రయోగింపందగును. స్నేహస్వేదవిధుల జేయుట, ఔషధాభిమంత్రణము మున్నగునవియన్నియు పైయోగమున జెప్పబడిన క్రమమునను సరించియే చేయనగును. (ఈక్రింద జెప్పబడు యోగములన్నిటియందును 'సమం పూర్వేణ' అనుదాని కిదియే యర్థము) ఈయోగములు "మాత్రాస్వష్టౌ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—మొదటియోగమున తొమ్మిది కషాయద్రవ్యములలో నతిమధురమును మాత్రము వదలి తక్కినదేవకాంచనము మున్నగు నెనిమిదిద్రవ్యములలో నొకదానిని క్వాథముచేసి యాక్వాథముననే రెండుభాగముల మ్రంగకాయగింజలకల్కమును జేర్చి యిరువదియొకసారి భావనచేసి కషాయమును గ్రహింపనగును. ఏద్రవ్యముయొక్క కషాయమున భావనలజేసెదరో ఆకషాయమునందే మ్రంగగింజలనూరి కరక-తాని-ఉసిరికకాయలలో నొకదానిపరిమితముగ నుండలజేయవలెను. సేవించునపుడును తొలుత భావనచేసినదినుసు కషాయముననే కలిపి త్రాగవలెను. ఇదియొకయోగము. ఇత్తెరంగుననే దేవకాంచనము మున్నగునెనిమిదికషాయములయందును వేరువేరుగ నౌషధమును కల్పింపనగును. ఈకషాయభేదములబట్టి ఫలపిప్పలి (మ్రంగకాయగింజల) మాత్రాయోగము లెనిమిదివిధములగునని యెరుంగునది. ఈమాత్రాయోగములే "మాత్రాస్వష్టౌ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

## (౪) ఫలపిప్పలీక్షీరాది వమనయోగములు నాల్గు.

మూ. ఫలపిప్పలీక్షీరం, తేన వా క్షీరయవాగూం అధోభాగే రక్తపిత్తే హృద్దాహే చ, తజ్జస్య వా దధ్నః ఉత్తరకం కఫచ్ఛర్ది తమకప్రసేకేషు; తస్య వా పయసః శీతస్య సన్తానికాంజలిం పిత్తే ప్రకుపితే, ఉరఃకణ్ఠహృదయే చ తనుకఫోపదిగ్ధే; ఇతి సమానం పూర్వేణ. ౨౭

వ్యా. మ్రంగకాయగింజలను ఆవుపాలలోజేర్చి క్షీరపాకవిధి ప్రకారము పక్వము చేసిన నయ్యది ఫలపిప్పలీక్షీర మనబడును. ఈక్షీరమును; దీనినిచేర్చి విధ్యుక్తప్రకారము

సిద్ధముచేయబడిన యవాగువును, అధోగతరక్తపిత్తమున వమనమునకై త్రాగించవలెను. మరియు అట్టిక్షీరమున తోడుబెట్టి (చేమిరిబెట్టి) సిద్ధముచేయబడిన పెరుగుపైనుండుమీగడను కఫము వాంతియగునపుడును, తమకశ్వాసమునందును, నోట నీరుకారునప్పుడును వమనముచేయించుట కుపయోగింపనగును. పైజెప్పిన ఫలపిప్పలీక్షీరము చల్లారినపిదప దాని పైనుండు మీగడను నాల్గుపలములను పిత్తము ప్రకోపించినపుడును, ఉరస్సునందును కంఠమునందును హృదయమునందును స్వల్పముగ కఫముచే నావరింపబడినప్పుడును వమనమున కుపయోగింపనగును. (స్నేహస్వేదాదివిధుల మునుపటియోగమునందువలెనే యెరుంగునది.)

## (౧) ఫలపిప్పలీఘృతయోగము.

మూ. ఫలపిప్పలీశృతక్షీరాత్ నవనీతముత్పన్నం ఫలాదికల్కకషాయ సిద్ధం, కఫాభిభూతాగ్నిం విశుష్యద్దేహం (విశుష్కదేహం విశుష్యమాణం) చ మాత్రయా పాయయేత్, ఇతి సమానం పూర్వేణ. ౨౮

వ్యా. మ్రంగకాయగింజలనుచేర్చి కాచబడిన క్షీరమునుండి తీయబడిన వెన్నలో ఫలజీమూతాది వమనద్రవ్యములకల్కమును, వానిచే సిద్ధముచేయబడిన కషాయమునుజేర్చి ఘృతపాకవిధిననుసరించి పక్వముజేసి, యాఘృతమును కఫముచే జాఠరాగ్ని మందగించినపుడును, శరీరము శుష్కించునపుడును, తగుపరిమాణముతో త్రాగించవలెను. స్నేహాదుల మునుపటివలె నెరుంగునది.

ఇచ్చట పైజెప్పిన క్షీరయోగములును, ఈఘృతయోగంబును జేరి ఫలపిప్పలీక్షీరయోగములు ఐదని యెరుంగునది. విషయసంగ్రహమునందును "పయో ఘృతే పంచ" అని పరిగణింపబడినది. ఈయోగమున 'ఫలాదికల్క' అనుచోట,—"తత్ర ఫలజీమూత... వేధనానామ్" (సూ. ౬) అని నిర్దేశింపబడిన మ్రంగకాయ మున్నగుద్రవ్యముల గ్రహించునది.

ఇచ్చట పైజెప్పిన క్షీరమును సిద్ధముచేయునపుడు మ్రంగకాయవిత్తనములకు ఎనిమిదింతలు పాలను, పాలకునాల్గింతలు నీళ్లనుకలిపి, నీరంతయు చుండి పాలుమాత్రము మిగులునట్లు కాచవలెను. ఈక్షీరపాకతంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"క్షీరమష్టగుణం ద్రవ్యాత్ క్షీరాన్నీరం చతుర్గుణమ్, క్షీరావశేషమ్" క్షీరపాకస్థలములయందెల్ల విశేషవిధి లేనపుడీసామాన్యపరిభాషానుసారముగ కల్పించునది.

(౧) వమనమునకు ఫలపిప్పల్యాఘ్రాణయోగము.

మూ. ఫలపిప్పలీనాం ఫలాదికషాయేణ త్రిస్సప్తకృత్వః సుపరిభావితేన పుష్పరజః ప్రకాశేన చూర్ణేన సరసి సఞ్జాతం, బృహత్సరోరుహం సాయాహ్నే అవచూర్ణయేత్, తద్రాత్రిపర్యుషితం ప్రభాతే పునరవచూర్ణితం ఉద్ధృత్య, హరిద్రాకృసర-క్షీర-యవాగూనామన్యతమం సైన్ధవగుడఫాణితయుక్తం ఆకణ్ఠం పీతవన్తం ఆఘ్రాపయేత్. సుకుమారముత్క్లిష్టపిత్తకఫం ఔషధద్వేషిణం, ఇతి సమానం పూర్వేణ. ౨౯

వ్యా. మ్రంగకాయగింజలను పుష్పొడివలె శ్లక్ష్ణముగ నుండునట్లు పొడిచేసి యాచూర్ణమును వమనద్రవ్యములైన ఫలజీమూతాదిద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడిన కషాయమున నిరువదియొకమారులు భావనజేసి యాచూర్ణమును సరస్సునందు గొప్ప తామరపువ్వుపై చల్లి రాత్రియంతయు నుండనిచ్చి, మరుసటిదినమున నాకమలమును గ్రహించి మరల ఫలచూర్ణమును చల్లి యుంచుకొనునది. పిదప వమనము చేయించవలసిన వానికి, పసుపునుచేర్చి పక్వముచేయబడిన కృసరము (పులగము) నైనను, పాలనైనను, యవాగువు నైనను, అందు కొంచెము సైంధవలవణమును బెల్లమును చక్కెరపాకమును కలిపి, (రోగికి) కుత్తుకవరకును నిండునట్లు త్రాగించి, పిమ్మట పైజెప్పబడిన తామరపువ్వును ఆఘ్రాణింపజేయవలెను. ఈయౌషధమును సుకుమారులకు పిత్తకఫములు వమనోన్ముఖములైయున్నతరి నుపయోగింపందగును. తక్కినస్నేహస్వేదాదివిధుల నన్నిటిని వమనాంగముగ పైజెప్పబడినవిధముగనే యాచరింపనగును.

(౨) ఫలపిప్పలీలేహము, చూర్ణంబును చేరి రెండు.

మూ. ఫలపిప్పలీనాం భల్లాతకవిధిపరిస్రుతం స్వరసం పక్త్వా ఫాణితీభూతమాతన్తులీభావాల్లేహయేత్; ఆతపశుష్కం వా చూర్ణీకృతం జీమూతకాదికషాయేణ పిత్తే కఫస్థానగతే పాయయేత్; ఇతి సమానం పూర్వేణ. ౩౦

వ్యా. మ్రంగకాయవిత్తులను, రసాయనప్రకరణమున చెప్పబడిన భల్లాతవిధిప్రకారము పక్వముచేసి యందుండి స్వరసమును గ్రహించి తన్నాస్వరసమును చక్కెరపాకమువలె తీగెలుసాగునంతవరకు పక్వముచేసి యాలేహమును పిత్తము ప్రకుపితమై కఫస్థానమున చేరియున్నపుడు రోగికి నాకించినయెడ చక్కగ వమనములగును. లేక మ్రంగ



కాయవిత్తులను యెండనెండించి మెత్తగచూర్ణముచేసి దేవదాళిమున్నగు వమనద్రవ్యముల కషాయమునకల్పి త్రాగించినను చక్కగ వమనములగును. తక్కిన విధానమునంతను మును పటివలె నెరుంగునది. ఇది ఫలపిప్పలిచూర్ణరూపమైన వమనయోగము. (ఇచ్చట లేహ చూర్ణరూపములైన యోగములు రెండు చెప్పబడినది.) ఇచ్చట "భల్లాతకవిధిపరిస్రుతమ్" అనుచోట రసాయనప్రకరణమున "భల్లాతకాన్యాపోథ్య అష్టగుణే గుణేనాంభసా సాధు సాధయేత్ తేషాం రసమష్టభాగావశేషం పూతం" (చ. చి. అ. ౧ పాదం ౨. శ్లో. ౧౩) అనిచెప్పఁబడిన భల్లాతకరసవిధానమననుసరించి మ్రంగకాయగింజలను నలియ కొట్టి దాని కెనిమిదింతలు జలమును చేర్చి యెనిమిదవవంతు మిగులునట్లు కాచి యాస్వరస మును వడగట్టి గ్రహించునది. ఈరసమును పైజెప్పినప్రకారము లేహపాకముగ పక్వము చేయవలెనని యెరుంగునది. (పైమూడుయోగములును "ఏకః ఫాణితే చూర్ణే త్రీయే" అని సంగ్రహముగ నిర్దేశింపబడును).

—(౯) ఫలపిప్పలీవర్తియోగము లారు.—

**మూ.** ఫలపిప్పలీచూర్ణాని పూర్వవత్ ఫలాదీనాం షణ్ణామన్యతమ కషాయస్రుతాని వర్తిక్రియాః ఫలాదికషాయోపసర్జనాః (కోవిదారాదికషాయోపసర్జనాః) పేయా ఇతి సమానం పూర్వేణ. ౩౧

వ్యా. మ్రంగకాయగింజలనెండించి మెత్తగచూర్ణముచేసి యాచూర్ణమును వమన ద్రవ్యములుగ చెప్పబడిన మ్రంగకాయ, దేవదాళి, చేదుసొర, ఆవడ, పెద్దచేదుబీర, కొడిసెపాల, చిన్నచేదుబీర అనునారిటిలో నేదైననొకద్రవ్యముచే సిద్ధమయినకషాయమున కలిపి పైజెప్పబడిన భల్లాతకవిధిప్రకారము, అష్టగుణకషాయమునచేర్చి కాచి అష్టమాంశ మునుగ్రహించి యారసమును మరల చక్కెరపాకమువలెకాచి వానిచే వర్తులను (గుటిక లను) చేయునది. ఆవర్తులను మ్రంగకాయ మున్నగువానికషాయమున కలిపి త్రాగించు నది. తక్కిన వమనాంగవిధులను పూర్వమువలె చేయునది. (ఇత్తెరంగున మ్రంగకాయ గింజలపొడిని మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యములలో నొక్కొకకషాయమున వేరు వేరుగ జేయబడిన వర్తియోగములు ఆరువిధములగునని యెఱుంగునది.) ఈయోగము లారును "వర్తిక్రియాసు షట్" అని నిర్దేశింపబడును.

—(౨౦) ఫలపిప్పలీలేహయోగము లిరువది.—

**మూ.** ఫలపిప్పలీనామారగ్వధ-వృక్షక-స్వాదుకణ్టక-పాఠా-పాటలా-శార్ఙ్గేష్టా-మూర్వా-సప్తపర్ణ-నక్తమాల- పిచుమర్ద - పటోల - సుషవీ -

గుడూచీ - సోమవల్కద్వీపికానాం, పిప్పలీ - పిప్పలీమూల - హస్తి
పిప్పలీ-చిత్రక-శృఙ్గబేరాణాం చాన్యతమకషాయేణ, సిద్ధో లేహాః,
ఇతి సమానం పూర్వేణ. ३२

వ్యా. రేల, కొండిసెపాల, పుల్లవెలగ, చిరుబొద్ది, కలిగొట్టు, కురువింద, చాగ, ఏడాకులపొన్న, కానుక, వేము, చేదుపొట్ల, కాకర, తిప్పతీగె, వెలిచంద్ర, వస, (వాకుడు) పిప్పళ్లు, మోడి, గజపిప్పలి, చిత్రమూలము, శుంఠి, అను నీయిరువది ద్రవ్యములలో నొక్కొకదానికషాయమునందు మ్రంగకాయవిత్తనముల చూర్ణమును కలిపి లేహపాకవిధిప్రకారము వేరువేరుగ చేయనగును. (పైజెప్పిన యిరువదికషాయములలో వేరువేరుగచేర్చి చేయబడిన ఫలపిప్పలీలేహయోగము లిరువదియగునని యెరుంగునది.)

(४०) మ్రంగవిత్తులచే నుత్కారికా-మోదకయోగములుచేరి నలువది.

మూ. ఫలపిప్పలీష్వేలాహరేణుకా శతపుష్పా కుస్తుమ్బురు తగరకుష్ఠ
త్వక్ చోరకమరువకాగురుగుగ్గుల్వేలవాలుక శ్రీవేష్టకపరిపేలవ
మాంసీ శైలేయక స్థౌణేయక సరలపారావత పద్యశోకరోహి
ణీనాం వింశతే రన్యతమస్య కషాయేణ సాధితోత్కారికా,
ఉత్కారికా కల్పేన, మోదకా వా మోదకకల్పేన, యథా
రోగదోషభక్తి ప్రయోజ్యా ఇతి సమానం పూర్వేణ ३३

వ్యా. ఏలకులు, రేణుకలు, సదాప,కొతిమిరి(దనియాలు), గ్రంథితగరము,చెంగల్వ కోష్టు, లవంగపుపట్ట, కచోరములు, మరువము, అగరు, గుగ్గిలము, నూగుదోస (కూతురు బుడమ), దేవదారుబంక, కైవర్తముస్తలు, జటామాంసి, శైలేయకమను గంధద్రవ్యము, స్థౌణేయక మనుగంధద్రవ్యములు (లేక పచ్చాకు), దేవదారు, ఎక్కుడుతీగె, అశోక, రోహిణి (కటుకరోహిణి), అను నీయిరువది ద్రవ్యములలో నేదైననొక ద్రవ్యమునుచేర్చి కషాయము కాచి, మ్రంగవిత్తుల చూర్ణమును పిష్టముగనుంచుకొని దానిచే నపూపముగజేసి పైజెప్పిన కషాయముయొక్క యావిరియం దుడికించునది.(ఉదయేయుత్కారిక) మరియు మ్రంగకాయవిత్తులచూర్ణమును కుడుములుగజేసి పైజెప్పిన కషాయమునం దావిరిచే నుడికించునది. (ఇది మోదకము). వీనిని రోగమును దోషమును రోగియొక్కయిష్టమును అనుసరించి యుపయోగించిన వమనములు చక్కగనగును. (ఈలేహ-ఉత్కారికా-మోదకయోగములు "వింశతిర్వింశతిర్లేహమోదకోత్కారికాసుచ" అని సంగ్రహముగ నిర్దేశింపబడును).

ఇచ్చట ఉత్కారికా-మోదకకల్పనావిధానము పాకశాస్త్రముచే నెరుంగునది. పైజెప్పినరీతిగ మ్రంగవిత్తులను ఏలకులు మున్నగునిరువదిద్రవ్యములలో నొక్కొకదాని కషాయమునం దుత్కారికలజేసిన యిరువదియుత్కారికాయోగము లగును. అట్లేరండవ నసే మోదకములును ఇరువదియగును. ఈయోగములన్నియు కలిసి నలువది ఫలపిప్పలీ వమనయోగను లగును.

(మరియు కషాయము నొకపాత్రలోబోసి వాసెనగట్టి యావాసెనలో పిష్టమునునిచి మూతమూసి యుడికించిన కషాయముయొక్క యావిరిచే పక్వమగును.)

(౩౨) ఫలపిప్పలీశష్కులీఅపూపయోగములు చేరి ముప్పదిరెండు.

మూ. ఫలపిప్పలీ స్వరసకషాయ భావితాని తిలశాలితణ్డుల పిష్టాని తత్కషాయోపసర్జనాని శష్కులీకల్పేన వా శష్కుల్యః, పూప కల్పేన వా పూపాః ఇతి సమానం పూర్వేణ. ౩౮

వ్యా. మ్రంగకాయగింజల స్వరసమునందైనను కషాయమునందైనను నువ్వులను వరిబియ్యమును భావనావిధిప్రకారము భావనచేసి పిండిచేసి యాపిండిని ఆకషాయమును కలిపి పక్వముజేసి శష్కులీ (చక్కిలముల) కల్పప్రకారము చక్కిలములనైనను, అపూప విధిననుసరించి యపూపములనైనను చేయునది. వీనిని వమనమునకై పైజెప్పిన విధి ప్రకారము సేవించునది. (ఇచ్చట శష్కులీకల్పన మొకటియు, అపూపకల్పన మొకటియు కలిసి ఫలపిప్పలీయోగములు రెండు చెప్పబడినవి).

శష్కులీ-అపూపయోగములు.

మూ. ఏతేనైవ చ కల్పేన సుముఖ-సురస-కుఠేరక-కాణ్డీర-కాకమూలక-పర్ణాసక-క్షవక-ఫణిజ్జక-గృఞ్జన-కాసమర్ద-భృఙ్గరాజానాం, పోటగల-ఇక్షు-ఇక్షువాలికా కాలఙ్కతక-దణ్డైరకాణాం చ అన్యతమస్య కషా యేణ కారయేత్. ౩౯

వ్యా. పైజెప్పబడిన కల్పముననుసరించి మ్రంగకాయగింజల కషాయకల్పములలో భావనజేయబడిన నువ్వులను బియ్యమును పిండిచేసి యాపిండిని—ఎట్టావాలు, తులసి, తెల్లగగ్గెర, కాకర, నల్లగగ్గెర, గగ్గెర, క్షవకము (తుమ్ములగల్గించుచెట్లు), మరువము, వెల్లుల్లి, కసివెంద, గుంటకలగర, కాకివెదురు, తెల్లచెరుకు, నల్లచెరుకు, సాధారణమైన చెరుకు, అను నీపదునైదింటిని వేరువేరుగ కషాయముల సిద్ధముచేసికొని వానిలో

న్నొక్కొకదానియందు (పైజెప్పిన పిండిని) కలిపి పైజెప్పినరీతిగ పదునైనశష్కులీయోగములనైనను, అపూపయోగములుగనైనను కల్పించి వమనమునకై పైజెప్పినరీతి నుపయోగింపదగును. (ఇచ్చట మ్రంగగింజల కషాయమున భావనచేయబడిన నువ్వులు బియ్యము ఈరెంటిపిండిని చేర్చి పైజెప్పబడినరీతిగ పదునైదుశష్కులీయోగంబులును, పదునైదు అపూపయోగంబులును ఏర్పడును. ఈముప్పదియోగములును పైజెప్పబడిన శష్కులీఅపూపయోగములు రెండును కలిసి ముప్పదిరెండు వమనౌషధయోగము లగును.) ఈయోగములు "శష్కులీపూపయోశ్చోక్తాః యోగాష్షోడశ షోడశ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

## (౧౦) కొన్ని వమనయోగములు.

మూ. తథా బదరషాడబ-రాగ-లేహ-మోదకోత్కారికా-తర్పణ-పానక-మాంసరస-యూష-మద్యానాం మదనఫలాన్యన్యతమేన ఉపసృజ్య, యథారోగదోషభక్తి దద్యాత్, తైస్సాధు వమతీతి. ౩౬

వ్యా. రేగుపండ్లు చేర్చి సిద్ధముచేయబడిన షాడబము, రాగము (పానకవిశేషము), లేహము, మోదకము, ఉత్కారిక, తర్పణము (సత్తుపిండిలో పెరుగును కలిపి చేయబడిన ద్రవపదార్థము), పానకము, మాంసరసము, యూషము, మద్యము, అను నీపదివిధములైన ద్రవములలో దేనియందైనను మ్రంగగింజలచూర్ణమును కలిపి, వమనమునకై యుపయోగింపందగును. వానిలో రోగియొక్క దోషమును రోగమును ఇష్టమును గమనించి తత్తదనుకూలమైనదానియందు చేర్చి యుపయోగింపం దగును. అటు చేసినచో చక్కగ వమనము లగును. (ఇచ్చట షాడబ-రాగాదిలక్షణములు స్థలాంతరమున వివరింపబడినవి. మరియు పైజెప్పబడిన పదిద్రవ్యములతో మ్రంగకాయవిత్తుల జేర్చి వేరువేరుగ కల్పింపబడుయోగములు పదియగునని యెఱుంగునది) ఈపదియోగములును "దశాన్యే షాడబాద్యేషు" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

## మదనపర్యాయనామములు.

మూ. మదనః కరహాటశ్చ రాఠః పిణ్డీతకః ఫలం,
శ్వసనశ్చేతి పర్యాయైః ఉచ్యతే తస్య కల్పనా. ౩౭

వ్యా. మదనము, కరహాటము, రాఠము, పిండీతకము, ఫలము, శ్వసనము, అను నీపర్యాయపదములచే మ్రంగకాయ చెప్పబడును. కావున వానికల్పనాస్థలములయందు ఈపర్యాయపదములు చెప్పబడినయెడ మ్రంగకాయయని యెరుంగునది.

(ఈపర్యాయనామములు తంత్రమునందు విశేషముగ ప్రయోగింపబడునుకావున సుబోధమునకై యిచ్చట పర్యాయనామములు చెప్పబడినవి. ఇక్ష్వాకు మున్నగువాని పర్యాయనామకథనము నిత్తెరంగుననే యెరుంగునది).

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః.—

మూ. నవ యోగాః కషాయేషు, మాత్రాస్వష్టౌ, పయోఘృతే,
పఞ్చ, ఏకః ఫాణితే, చూర్ణే, ఘ్రేయే; వర్తిక్రియాసు షట్.
వింశతి ర్వింశతిర్లేహ-మోదకో-త్కారికాసు చ,
శష్కులీపూపయోశ్చోక్తా యోగాష్షోడశ షోడశ. ౩౯
దశాన్యే షాడబాద్యేషు, త్రయస్త్రింశదిదం శతమ్,
యోగానాం విధివద్దృష్టం ఫలకల్పే మహర్షిణా. ౪౦

వ్యా. మ్రంగకాయవిత్తుతో కషాయరూపమైన యోగములు తొమ్మిది. మాత్రా యోగములెనిమిది, క్షీరయోగములునాల్గును, ఘృతయోగమొకటియుచేరి యైదు. ఫాణిత మొకటి, చూర్ణమొకటి, ఘ్రేయము (మూర్కొనదగినది) ఒకటి, వర్తిక్రియలు ఆరు, లేహములు ఇరువది, మోదకము లిరువది, ఉత్కారిక లిరువది; శష్కులీయోగములు పదునారు, అపూపయోగములు పదునారు, షాడబాలులయోగములు పది. ఇత్తెరంగున నివి యన్నియుచేరి మదనఫలకల్పముచే నైన వమనౌషధయోగములు నూటముప్పదిమూడు (133) ను ఈయధ్యాయమున మహర్షియగు నాత్రేయులచే నుపదేశింపబడినరీతి అగ్నివేశులచే విధ్యుక్తప్రకారము వివరింపబడినది. (ఇచ్చట చెప్పబడినయోగముల సంఖ్యావిభాగము అచ్చటచ్చట వ్యాఖ్యానముననే జూపబడినది.)

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే దృఢబలసమ్పూరితే
కల్పస్థానే మదనకల్పో నామ ప్రథమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగుచరకసంహితయను నాయుర్వేదతంత్రమున దృఢబలునిచే పూర్తిగావింపబడిన కల్పస్థానమున మదనకల్పమనునది ప్రథమాధ్యాయము సంపూర్ణము.

# ద్వితీయాధ్యాయము.

## (౧) జీమూతకకల్పము.

అవతరణిక:—మ్రంగకాయనుబోలె జీమూతంబును (దేవతాడియు) వమన యోగములలో నిరపాయమైనది యగుటంజేసి ఫలకల్పానంతరము జీమూతకల్పము చెప్పబడును.—

మూ. అథాతో జీమూతకకల్పం వ్యాఖ్యాస్యామః.　　౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః.　　౨

వ్యా. ఫలకల్పమును జెప్పినపిదప జీమూతకల్పమును త్రికాలజ్ఞానసంపన్నుడగు నాత్రేయు డుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెద నని యర్థము.

జీమూతమును వమనయోగ్యౌషధముగ కల్పించువిధానము జీమూతకల్పము. దాని నధికరించి చెప్పనట్టి యధ్యాయము జీమూతకల్పమగును. అట్టి యధ్యాయమును చెప్పెదనని యర్థము. తక్కినస్థలములయందును (ఇక్ష్వాకుకల్పము మున్నగుచోటను) ఇదేయర్థమని యెరుంగునది. మరియు వమనౌషధములలో నిచ్చట వరుసగ జెప్పబడు మదన-జీమూతక-ఇక్ష్వాకు-ధామార్గవ - వత్సక - కృతవేధనము లనునారిటిలో పూర్వ పూర్వము ఒకదానికన్న నొకటి నిరపాయమగుటంజేసి శ్రేష్ఠముగ నుండును. అట్టి శ్రేష్ఠత్వమున తారతమ్యమునుబట్టియే మదన-జీమూతాదిక్రమముగ వరుసగ జెప్పబడినవి యని యెరుంగునది.

## జీమూతకల్పమునందాశ్రయము పర్యాయనామములు.

మూ. కల్పం జీమూత కస్యేమం ఫలపుష్పాశ్రయం శృణు,
గరాగరీ చ వేణీ చ తథా స్యాద్దేవతాడకః.　　3

వ్యా. వమనములకై దేవతాళియొక్క ఫలములను పుష్పములను ఆశ్రయించిన యౌషధకల్పమును జెప్పెద వినుమని యర్థము. గరాగరి, వేణి, దేవతాడి, యనుపర్యాయ ములచే జీమూతము ఇచ్చట వ్యవహరింపబడును.

ఇచ్చట "ఫలపుష్పాశ్రయం" అని చెప్పుటచేత ఈకల్పమున వమనమునకై దేవతాడియొక్క ఫలములను పుష్పములను మాత్రము గ్రహింపనగుగాని ఆకులు కాడలు మున్నగువాని గ్రహింపదగదని తెలియదగును.

జీమూతమన డావరడంగి—ఇయ్యది చేదుగల్గియుండును. దీని
భావప్రకాశమున నిట్లు చెప్పబడినవి:—"దేవదాళీరసే తిక్తా కఫార్శశ్శోఫ
నాశయేత్ వామనీతిక్తా క్షయహిక్కాకృమిజ్వరాన్......వాతనుత్పరమ్"
నిది లతజాతిలో చేరినదనియు, దీనిపువ్వులు తెల్లగను పసుపురంగుగను ఎఱ్ఱ
మూడురకములుగ నుండుననియు చిన్నపుచ్చకాయలంత కాయలు కల్గియుండ
తెలుగువ్యాఖ్యలో వివరించియున్నది. అందు ఈకల్పమున పచ్చపువ్వులు కలది
దగును. చక్రపాణివ్యాఖ్యయందును "జీమూతకః పీతఘోషకః" అని చెప్పియు

దేవదాళిగుణము.

మూ. జీమూతకం త్రిదోషఘ్నం యథాస్వౌషధకల్పితం,
ప్రయోక్తవ్యం జ్వరశ్వాసహిక్కాద్యేష్వామయేషు చ.

వ్యా. జీమూతకము (డావరడంగి) త్రిదోషహరము. వాతాదిదోషహం
నౌషధములతో జేర్చియు, కల్పించియు నుపయోగించినచో నాయా
హరించును. మరియు శ్వాసము, జ్వరము, ఎక్కిళ్లు మున్నగురోగములయందును
రోగముల హరించునౌషధముల జేర్చి కల్పించి యుపయోగింపందగును.
ఆదిశబ్దముచేత నురస్సు నాశ్రయించి జనించు కాసము మున్నగురోగములును
బడును.)

(౬) దేవదాళీయోగములు ముప్పదితొమ్మిది, అందు క్షీరయోగము లారు.

మూ. యథోక్తగుణయుక్తానాం దేశజానాం యథావిధి,
పయః పుష్పేఽస్య, నిర్వృత్తే (పయః పుష్పేషు నిర్వృత్తే
పేయా పయస్కృతా.
లోమశే క్షీరసన్తానం, దధ్యుత్తరమలోమశే,
శృతే పయసి దధ్యమ్లం జాతం హరితపాణ్డుకే.
జీర్ణానాం చ సుశుష్కాణాం న్యస్తానాం భాజనే శుచౌ,
చూర్ణస్య పయసా శుక్తిం వాతపిత్తార్దితః పిబేత్.

వ్యా. మదనకల్పమున సామాన్యముగ జెప్పబడిన గుణవీర్యదేశకాలాది సం
విధ్యుక్తప్రకారము గ్రహింపబడి యథావిధిగ గ్రహించియుంచబడిన దేవదాళి
పుష్పముల చేర్చికాచబడినపాలను; లేతపిందెలుగనుండు దేవదాళిఫలముల జేర్చి కా

పాలచే సిద్ధముచేయబడిన యవాగువును; రోమములబోలిన నూగుతో కూడియుండు కాయలజేర్చి కాచబడినపాలపై మీగడను; నూగులేకయుండుకాయలజేర్చి పాలనుకాచి యాపాలతో సిద్ధముచేయబడిన పెరుగుపైనుండు మీగడను, పచ్చనిరంగును పొందు వర్ణంబునుకల్గి చక్కగ ముదిరిన దేవదాళికాయలజేర్చి కాచబడినపాలతో సిద్ధమై పులిసిన పెరుగును; వమనమునకై త్రాగవలెను. మరియు చక్కగపండిన దేవదాళికాయలను చక్కగ నీడనెండించి యుక్తమైన పాత్రయందుంచి, మెత్తగ చూర్ణముచేసి అందు శుక్తిప్రమాణను (అర్ధపలము) ఆవుపాలతో కలిపి వమనమునకై త్రాగవలెను. (ఇత్తెరంగున దేవదాళికి పాలతో కల్పనావిశేషరూపముగను, ఆలోడనరూపముగను, ఆరుక్షీరయోగములు చెప్పబడినవి. ఈభేదములనే "షట్ క్షీరే" అని సంగ్రహమున చెప్పియున్నది.)

ఇచ్చట మదనకల్పమున "తత్ర దేశే సాధారణే జాంగలే వా......స్థాపయేత్" (౧౨-౧౫-సూ.) అనుగ్రంథముచే జెప్పబడిన ఔషధగ్రహణకాలాదుల నెరుంగునది. కాలజత్వాదిసంపత్తనుదానినే యెరుంగునది. మరియు "ఛ్ఛర్దనీయమాతురం ద్వ్యహం త్ర్యహం వా...దోషనిర్హరణాచ్చ" (సూ.౨౧.౨౫) అనుగ్రంథముచే వమనసాధారణ ముగ జెప్పబడిన స్నేహస్వేదాదినియమముల నెరుంగునది.

### (౧) సురామండముతో జీమూతకయోగమొకటి.

మూ. ఆసుత్య చ సురామణ్డే మృదిత్వా ప్రస్రుతం పిబేత్,
కఫజేఽరోచకే కాసే పాణ్డురోగే సయక్ష్మణి. ౧

వ్యా. చక్కగ పండిన దేవదాళిఫలములను విధిప్రకారము గ్రహించి చక్కగ నలియకొట్టి సుర యనుమద్యమున నునిచి పిసికి రాత్రియంతయు నునిచి మరుసటిదినమున చక్కగ తేరినయామద్యమును మాత్రము తేటగ గ్రహించి కఫముచే గల్గినయరోచకము నందును, కాసమునందును, పాండురోగమునందును, రాజయక్ష్మమునందును రోగికి విధ్యుక్త ప్రకారము త్రాగింపనగును. (ఇది యొకయోగము. "మదిరామణ్డే ఏకః" అని సంగ్రహమున నిర్దేశింపబడినది.)

ఇచ్చట విశేషనిర్దేశము లేదు కావున "ఫలం పర్యాగతం గ్రాహ్యం" అను సామాన్యవచనముచేత చక్కగ పండినదేవదాళీఫలమును గ్రహింపనగును. క్రిందజెప్పబడు యోగములందును ఫలమునే గ్రహింపవలెను.

### (౧౨) దేవదాళికి కషాయముతోచేరిన కల్పనాయోగములు పండ్రెండు.

మూ. ద్వే చాపోథ్యాఽథవా త్రీణి గుడూచ్యా మధుకస్య వా,
(గుడూచ్యామలకస్య వా)

కోవిదారాదికానాం వా నిమ్బస్య కుటజస్య చ. ౯
కషాయేష్వాసుతం పూత్వా తేనైవ విధినా పిబేత్,

వ్యా. విధ్యుక్తముగ గ్రహింపబడిన దేవదాళిఫలములలో రెంటినైనను మూటినైనను నలుగగొట్టి, తిప్పతీగె కషాయమునందైనను, అతిమధురకషాయమునందైనను, లేక మదనకల్పమున "కోవిదార" అని యుపక్రమించి చెప్పబడిన ఎఱ్ఱని దేవకాంచనము, తెల్లని దేవకాంచనము,కడిమి, ప్రబ్బలి, దొండ, జనుము, సదాపుష్పి (సదాప), ఉత్తరేణి, అను నీయెనిమిదిటిలో నొకదానికషాయమునందైనను, వేపచెక్కకషాయమునందైనను, కొడిసెపాలపట్ట కషాయమునందైనను చేర్చి రాత్రియంతయు నానబెట్టి మరుసటిదినమున నాశీతకషాయమును వడగట్టి మదనకల్పమున జెప్పబడిన విధిప్రకారము వమనమునకై త్రాగవలెను.

ఇచ్చట తిప్పతీగె, అతిమధురము, దేవకాంచన మున్నగునవి యెనిమిది, వేము, కొడిసెపాల, అను నీపండ్రెండుద్రవ్యములచే వేరువేరుగ సిద్ధమైన కషాయములతో దేవదాళీఫలములకు వేరువేరుగ గల్పింపబడిన యోగములును పండ్రెండగును. ఈకషాయ యోగములే "ద్వాదశ చాపరే" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

మరియు మదనకల్పమున "కోవిదార-కర్బుదార - నీప-బిదుల-బిమ్బా-శణపుష్పీ-సదాపుష్పీ-ప్రత్యక్పుష్పీ" అని నిర్దేశింపబడిన యెనిమిదికషాయద్రవ్యములును "కోవిదారాదికానాం వా" అనుపదముచే గ్రహింపబడును. "తేనైవ విధినా పిబేత్" అను చోట కషాయాణామన్యతమేన వా...పాయయేత్" (అ. ౧. సూ. ౨౨) అని చెప్పబడిన పానవిధి నెరుంగునది.

(౭) దేవదాళికి రేల మున్నగుకషాయముల నేడిటితో యోగములు.

మూ. అథ వాఽఽరగ్వధాదీనాం సప్తానాం పూర్వవత్పిబేత్. ౧౦
ఏకైకస్య కషాయేణ పిత్తశ్లేష్మజ్వరార్దితః,

వ్యా. మదనకల్పమున నిర్దేశింపబడిన రేల, కొడిసెపాల, పుల్లవెలగ, చిరుబొద్ది, కలిగొట్టు, కురువింద, చాగ అను నీయేడుద్రవ్యములలో నొక్కొకదానిని చేర్చి వేరువేరుగ కాచబడిన కషాయములలో నొక్కొకదానియందు దేవదాళిఫలకల్కమును చేర్చి వమనమునకై త్రాగవలెను. (ఏడువిధములైన కషాయములలో దేవదాళికి నేడుయోగములగును. దీనినే సంగ్రహమున "సప్త చారగ్వధాదీనాం కషాయేణ" అని నిర్దేశించి యున్నది). ఈయోగమును పిత్తకఫజ్వరపీడితుడు త్రాగవలెను.

ఇచ్చట "ఆరగ్వధాదీనాం" అన్నచోట మదనకల్పమున "ఫలపిప్పలీనామార గ్వధ-వృక్షక - స్వాదుకణ్టక-పాఠా-పాటలా-శార్ఙ్గేష్టా-మూర్వా" (అ. ౧. సూ. 3౨) అని నిర్దేశింపబడిన రేల మున్నగు కషాయద్రవ్యములేడును గ్రహింపనగును.

(౮) దేవదాళీఫలమాత్రాయోగము లెనిమిది.

మూ. మాత్రాస్స్యుః ఫలవచ్చాష్టౌ, కోలమాత్రాస్తు తాః మతాః ౧౧

వ్యా. మదనకల్పమున మ్రంగవిత్తుల నుద్దేశించి మాత్రాయోగము లెనిమిది చెప్పబడినవి; ఆవిధముగనే దేవదాళిఫలములకును ఎనిమిదివిధములుగ గల్పింపనగును. అట్టి మాత్రలను రేగుకాయపరిమాణముగ నిర్మించవలెను. (ఫలమాత్రాయోగమున కరకకాయ-తానికాయ ఉసిరికకాయలంతేసి మాత్రల గల్పింపవలెనని చెప్పబడినది. ఇచ్చట అటుగాక రేగుపండంతేసి మాత్రల కల్పింపవలెనని విశేషవిధి.)

ఈమాత్రాకల్పము మదనకల్పమున—"ఫలపిప్పలీనాం ద్వౌద్వౌ భాగౌ కోవిదారాదికషాయేణ......తుల్యాం వర్తయేత్" (అ-౧-సూ. ౨౬) అని చెప్పబడినది. ఆకల్పము ననుసరించి యిచ్చట కల్పనము నిట్లెరుంగునది:—దేవదాళీఫలములను గ్రహించి మూడుభాగములుగ విభజించి, అందు రెండుభాగములను ఎఱ్ఱదేవకాంచనము మున్నగు నెనిమిదిద్రవ్యములలో నొకదానికషాయమున చేర్చి యిరువదియొకమార్లు భావన చేయుచు నాకషాయమును వంచుకొని యందు దేవదాళిఫలముల మూడవభాగమును చేర్చి మెత్తగ నూరి రేగుపండంతేసి మాత్రలచేసి, పైజెప్పిన కషాయములలో నాల్గుపలముల పరిమితమున కలిపి త్రాగునది. ఈమాత్రాయోగములును కషాయసంఖ్యనుబట్టి యెనిమిదియగును. ఇయ్యది సంగ్రహమున "అష్టౌ చ వర్తిషు" అని నిర్దేశింపబడును.

(౯) దేవదాళికి పానసాధనస్వరసయోగములు నాల్గు.

మూ. జీవకర్షభకేక్షూణాం శతావర్యా రసేన వా,
పిత్తశ్లేష్మజ్వరే దద్యాత్ వాతపిత్తజ్వరేఽథ వా. ౧౨

వ్యా. దేవదాళీఫలములను జీవకముయొక్కయు, ఋషభకముయొక్కయు, చెరకుయొక్కయు, పిల్లిపీచరగడ్డలయొక్కయు రసములలో నెద్దానియందైన కలిపి పిత్తశ్లేష్మజ్వరమునందును, వాతపిత్తజ్వరమునందును వమనమునకై త్రాగింపవలెను. (త్రాగుటకు సౌకర్యముగ నుండుటకై పైజెప్పిన నాల్గు రసములలో నెద్దానినైన ననుపానముగ గల్పించవలెనని భావము. ఇవియును నాల్గుయోగములు. ఇది "జీవకాదిషు చత్వారః" అని సంగ్రహమున నిర్దేశింపబడినది.)

(౧) దేవదాళీ-ఘృతయోగ మొకటి.

మూ. తథా జీమూతకక్షీరాత్ సముత్పన్నం పచేత్ ఘృతం,
ఫలాదీనాం కషాయేణ శ్రేష్ఠం తద్వమనం తు తమ్. ౧౩

వ్యా. మఱియు దేవదాళీఫలములను చేర్చి కాచబడిన పాలనుండి తీయబడిన వెన్నను మ్రంగకాయవిత్తులు మున్నగువానికషాయమును చేర్చి ఘృతపాకవిధి ప్రకారము పక్వము చేయబడిన ఘృతమును పానముచేసినచో నియ్యది యుత్తమమైన వమనౌషధమగును. (ఈఘృతయోగ మొక్కటి. ఇయ్యది "ఘృతం చైకం ప్రకీర్తితమ్" అని సంగ్రహమున నిర్దేశింపబడును).

అధ్యాయవిషయసంగ్రహము.

మూ. షట్ క్షీరే, మదిరామణ్డే ఏకో, ద్వాదశ చాపరే,
సప్తచారగ్వధాదీనాం కషాయే, ఉష్టౌ చ వర్తిషు. ౧౪
జీవకాదిషు చత్వారః, ఘృతం చైకం ప్రకీర్తితం,
కల్పే జీమూతకానాం చ యోగాస్త్రింశన్నవాధికాః. ౧౫

వ్యా. ఈజీమూతకకల్పమునందు దేవదాళికి సంబంధించి క్షీరయోగములారును, మద్యయోగం బొకటియు, కషాయకల్పయోగములు పండ్రెండును, ఆరగ్వధాదికషాయ యోగము లేడును, వర్తి (మాత్రా) యోగము లెనిమిదియు, జీవకాదిస్వరసయోగములు నాల్గును, ఘృతయోగం బొకటియు చేరి దేవదాళివమనయోగము ముప్పదితొమ్మిది యీయధ్యాయమున చెప్పబడినవి. (వీనివివరమంతయు నాయాస్థలములయందే పైనిచెప్ప బడినది.)

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే,
కల్పస్థానే, జీమూతకకల్పో నామ ద్వితీయోఽధ్యాయః.

వ్యా. ఇత్తెఱంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు చరక సంహితయను నాయుర్వేదతంత్రమున దృఢబలసంపూరితకల్పస్థానమునందు జీమూతక కల్పమనునది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

# తృతీయాధ్యాయము.

## (3) ఇక్ష్వాకుకల్పము.

అవతరణిక:—పైయధ్యాయప్రారంభమునసే యీకల్పములకుంగల పౌర్వాపర్య సంబంధము చెప్పబడినది. అట్టి సంబంధమునంజేసి క్రమప్రాప్తమైన యిక్ష్వాకుకల్పము చెప్పబడును:—

మూ. అథాత ఇక్ష్వాకుకల్పం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః ౨

వ్యా. జీమూతకకల్పమును చెప్పినపిదప ఇక్ష్వాకు(చేదుసొర)ను వమనౌషధముగ గల్పించువిధానమును దెల్పునధ్యాయమును ఆత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతి రేకము కాకుండునట్లు వివరించెదనని యర్థము.

మూ. సిద్ధం వక్ష్యామ్యథేక్ష్వాకుకల్పం యేషాం ప్రశస్యతే,

వ్యా. ఇక్ష్వాకుకల్పము వేని కుపయోగింపదగునో వానినెల్ల నీక్రింద వివరింపుచు సిద్ధకల్పమును చెప్పెదను.

## చేదుసొర పర్యాయనామములు.

మూ. లమ్బాఽథ కటుకాలాబూస్తుమ్బీ పిణ్డాఫలా(లం) తథా. 3

ఇక్ష్వాకుః ఫలినీ చైవ ప్రోచ్యతే తస్య కల్పనా,

వ్యా. లంబ, కటుకాలాబు, తుంబీ, పిండాఫల, ఇక్ష్వాకు, ఫలినీ, అనుపర్యాయ నామములచే చేదుసొర దానికి సంబంధించిన కల్పనావసరమున పర్యాయపదములుగ వ్యవహరింపబడును.

## చేదుసొరను వమనమునకై యుపయోగింపదగినవిషయములు.

మూ. కాసశ్వాసవిషచ్ఛర్ది జ్వరార్తే కఫకర్శితే. ౪

ప్రతామ్యతి నరే చైవ వమనార్థం తదిష్యతే,

వ్యా. కాసము, శ్వాసము, విషము, వాంతి, జ్వరము, కఫముచే శరీరము కృశించుట, తమకశ్వాసము, అను నీవ్యాధులచే బాధితుడగువానికి వమనముచేయించుటకై చేదుసొరకాయ మిగుల శ్రేష్ఠముగనుండును.

(౧) ఇక్ష్వాకు(చేదుసొర)కు సంబంధించిన
వమనయోగములు నలువదియైదు.
అందు క్షీరయోగము లెనిమిది-అందు మొదటియోగము.

మూ. అపుష్పస్య ప్రవాళానాం ముష్టిం ప్రాదేశసమ్మితాం
క్షీరప్రస్థే శృతం దద్యాత్ పిత్తోద్రిక్తే కఫజ్వరే,

వ్యా. పుష్పించక (లేతదిగ) యుండు చేదుసొరచెట్టుయొక్క ఫిడికిలి నిండునంత గ్రహించి ప్రస్థపరిమితమైన ఆవుపాలలో నునిచి గింతల జలమును చేర్చి) పాలుమాత్రము మిగులునట్లు చుండకాచి యూమైన కఫజ్వరమున వమనమునకై త్రాగింపవలెను (ఈవమనయోగము స్నేహస్వేదాదివిధులు మదనకల్పమున సామాన్యముగ జెప్పబడినవి గ్రహిం నిచ్చట "ముష్టిం ప్రాదేశసమ్మితం" అని చెప్పియుండుటవలన తంత్రములయమైన పలప్రమాణమగుముష్టిని గ్రహింపకయ చేతికిసంబంధించిన పిడికి గ్రహింపవలెను.)

(౪) ఇక్ష్వాకుక్షీరయోగములు నాల్గు.

మూ. పుష్పాదిషు చ చత్వారః క్షీరే జీమూతకే యథా-
యోగాః

వ్యా. పైని జీమూతకకల్పమున "పయః పుష్పే...మలోమశే" చెప్పబడినప్రకారము చేదుసొరకాయయొక్క పుష్పఫలముల జేర్చి క్షీర సంస్కృత యవాగు-దధిమండములను నాల్గుక్షీరయోగముల గల్పించునది.

(చేదుసొరపువ్వును చేర్చి కాచబడినక్షీర మొకటి, అట్టి పాలజేర్చి బడిన యవాగువు రెండవది, నూగుతోకూడి లేతగనుండు చేదుసొరపించెల జే పాల పైమీగడ మూడవది, నూగు లేకయుండు కాయల జేర్చి కాచబడినమైన పెరుగు పైమీగడ నాల్గవది. ఇత్తెరంగున పుష్ప-ఫలములచే సిద్ధము యోగముల నాల్గిటిని చేదుసొరకల్పమున నెరుంగునది).

(౧) చేదుసొరకు సురాయోగ మొకటి.

మూ. హరితపాణ్డూనాం సురామణ్డేన పఞ్చాః

వ్యా. హరితవర్ణంబులును పాండువర్ణంబులునైన చేదుసొర కాయల కల్పమున చెప్పబడిన సురాయోగప్రకారము (కాయలను నలుగగొట్టి స

రాత్రియంతయు నూరబెట్టి మరునాడుదయమున నాసురామద్యము పైతేటను మాత్రము గ్రహించి) ఇక్ష్వాకుపుతోను సురాయోగమును కల్పింపనగును. ఇది యైదవయోగము.

ఇచ్చట "ఆసుత్య చ సురామండే మృదిత్వా ప్రస్రుతం పిబేత్" (౨-౮) అని జీమూతకకల్పమున జెప్పబడిన సురాయోగము నెరుంగునది. పైజెప్పిన పుష్ప-ఫలసిద్ధక్షీర యోగములు నాల్గును సురాయోగ మొకటియు చేరి యైదుయోగములును జీమూతకకల్ప విధిననుసరించిన యోగములని దెలుపుటకై యిచ్చట "పఞ్చమః" అని నిర్దేశింపబడినది.

**(౬) ఆరవక్షీరయోగములు.**

మూ. ఫలస్వరసభాగం చ త్రిగుణక్షీరసాధితం. ౭
ఉరఃస్థితే కఫే దద్యాత్ స్వరభేదే చ పీనసే,

వ్యా. చక్కగ పండిన చేదుసొరకాయలస్వరస మొకభాగమును, మూడుభాగములు ఆవుపాలను, (ఆవుపాలకు నాలుగింతలజలమును) చేర్చి (క్షీరావశిష్టముగ) పక్వము చేయబడిన క్షీరమును కఫము ఉరస్థ్సానమున చేరినప్పుడును, స్వరభేదమునందును, పీనసమునందును త్రాగవలెను (ఇచ్చట "క్షీరాత్తోయం చతుర్గుణం, క్షీరావశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః" అనుపరిభాష ననుసరించి చతుర్గుణజలమును జేర్పనగును. క్షీరపాక స్థలములయందెల్ల నీపరిభాష నెరుంగునది).

**(౭) క్షీరయోగము ఏడవది.**

మూ. జీర్ణే మధ్యే వృద్ధతే క్షీరం ప్రక్షిపేత్తద్యదా దధి. ౮
జాతం స్యాత్ స కఫే కాసే శ్వాసే వమ్యాం చ తత్పిబేత్,

వ్యా. చక్కగ పండిన చేదుసొరకాయలో మధ్యముననుండు గుంజును తీసి ఆవుపాలను ఆబుఱ్ఱలో పోసి (తోడుపెట్టి) అయ్యది చక్కగ గడ్డగట్టి పేరినపిదప దానిని కఫముతో కూడిన శ్వాసకాసములయందును వాంతియందును త్రాగనగును.

ఇచ్చట "హృతమధ్యే ఫలే జీర్ణే స్థితం క్షీరం యదా దధి" అనుపాఠాంతరము ప్రాచీనముద్రితప్రతియందున్నది. ఈపాఠమే సుబోధము.

**(౮) క్షీరయోగము ఎనిమిదవది.**

మూ. అజాక్షీరేణ బీజాని భావయేత్ పాయయేత చ
(భావితాని ప్రయోజయేత్). ౯
విషగుల్మోదరగ్రన్థిగణ్డేషు శ్లీపదేషు చ,

వ్యా. చేదుబీరవిత్తనములను మేకపాలతో భావనచేసి చూర్ణముచేసి (కల్కముచేసి) మేకపాలలో కలిపి విషములయందును గుల్మములయందును గ్రంథియందును, గండమాలయందును, శ్లీపదముల (బోదకాలు) యందును త్రాగింపవలెను.

ఇత్తెరంగున చేదుసొరకు సంబంధించినక్షీరయోగములు ఎనిమిదియు చెప్పబడిన దీనిని సంగ్రహమున "పయస్యష్టౌ" అని నిర్దేశించియున్నది.

(౨) చేదుసొరకు మస్తు-తక్రయోగములు రెండు.

మూ. మస్తునా వా ఫలాన్నమధ్యం పాణ్డుకుష్ఠవిషార్దితః. ౧
తేన తక్రం విపక్వం వా సక్షౌద్రలవణం పిబేత్,

వ్యా. చేదుసొరపండునందలి గుంజును మీగడతో కలిపియైనను, ఆగుంజును కలిపి పక్వముచేయబడిన మజ్జిగనైనను తేనెను లవణమును కలిపి త్రాగవలెను. ఈయోగము రెండిటిని పాండువులయందును కుష్ఠములయందును విషమునందును ఉపయోగింపందగును (ఈరెండుయోగములను, పైజెప్పబడిన సురామండయోగమునుచేర్చి మూడుయోగములుగ సంగ్రహమునందు "సురా-మణ్డ-మస్తు-తక్రేషు చ త్రయః" అని నిర్దేశింపబడును.)

(౧) చేదుసొరకుచేరిన ఘ్రేయయోగ మొకటి.

మూ. తుంబ్యాః ఫలరసైః శుష్కైః సపుష్పైరవచూర్ణితం. ౧౧
ఛర్దయేన్మాల్యమాఘ్రాయ గన్ధసమ్పత్సుఖోచితః,

వ్యా. చేదుసొరకాయలరసముచే దానియెండినపువ్వులచేతను భావనచేయబడిన పుష్పమాలికను సుగంధము నాఘ్రాణించెడియలవాటుగల సుకుమారుడు మూర్కొనినచో వమనములగును. (సుగంధము నాఘ్రాణించు వాడుకగలవారు పైజెప్పినరీతిగ భావన చేయబడిన పువ్వుల మూర్కొనినంతమాత్రమున నాదుర్గంధమును సహింపలేక వారికి వాంతియగునని భావము.)

(3) చేదుసొరకాయ మాంస-తైల-ఘృతయోగములు.

మూ. భక్షయేత్ఫలమధ్యం వా గుడేన పలలేన చ. ౧౨
ఇక్ష్వాకుఫలతైలం వా, సిద్ధం వా పూర్వవత్ ఘృతమ్,

వ్యా. చేదుసొరకాయ లోపలనుండుగుంజును బెల్లముతోనైనను మాంసముతోనైనను కలిపి యుపయోగించునది. లేక చేదుబీరకాయల కల్కమునుచేర్చి కాచబడిన

తైలమునైనను; జీమూతకకల్పమున జెప్పబడిన ఘృతయోగవిధిప్రకారము (దేవదాళికి బదులు చేదుసొరకాయను చేర్చి కాచబడిన క్షీరమునుండి తీయబడినఘృతమును మ్రంగ కాయ మున్నగు వమనద్రవ్యములకషాయమును చేర్చి ఘృతపాకవిధిప్రకారము) పక్వముచేయబడిన ఘృతమునైనను వమనమునకై గుపయోగింపదగును. (ఇచ్చట ఇక్ష్వాకువునకు మాంసముతో యోగ మొకటియు, ఇక్ష్వాకుతైలయోగ మొకటియు, ఘృత యోగ మొకటియు, చేరి మూడు యోగములు చెప్పబడినవి.)

(౬) వర్ధమానఫలయోగము కషాయములతో నారు.

మూ. పఞ్చాశద్దశవృద్ధాని ఫలాదీనాం యథోత్తరమ్. ౧౩
పిబేద్విమృద్య బీజాని కషాయేష్వాశతం పృథక్,

తా. చేదుసొరవిత్తనములను ఏబది మొదలు పదేసివంతున హెచ్చించుచు మదన కల్పమున జెప్పబడిన మ్రంగకాయ మున్నగుద్రవ్యములలో నొక్కొకదానికషాయము నందు కలిపి మర్దించి త్రాగునది. ఏబదిగింజలను మ్రంగకాయలకషాయమున కలిపి సేవించు నది. ఇది యొకయోగము. ఇత్తెరంగున నేబదికి పైపైన పదేసి ఒక్కొకయోగమునకు హెచ్చించుచు, వేరువేరుగ యోగములవరుసగ నొక్కొక కషాయమున జేర్చుచున్నయెడ ఆరుయోగములగును. (మొదటియోగమున ఏబదిగింజలు అది మొదలు పదేసి హెచ్చించిన యెడ (౨) అరువది (౩) డెబ్బది, (౪) ఎనుబది, (౫) తొంబది, ౬ నూరువంతున ఆరు యోగములగునని భావము).

లేక మొదటియోగమున పదిగింజల జేర్చునది. తక్కినయోగములయందును పదేసి హెచ్చించుచు నేబదియగునందాక యోగముల గల్పించునది. ఈపక్షమున మ్రంగ కాయ మున్నగువానికషాయము లారు అగును, కావున అట్టికషాయసంఖ్యనుబట్టి ఆరు యోగములగును. ఈరెండుమార్గములును చక్రపాణివ్యాఖ్యానమున జూపబడినవి. ఏపక్ష మునందైనను కషాయయోగము లారే యగును.

(పైని చెప్పబడిన ఘ్రేయ-పలల - తైల-ఘృత-ఫల-వర్ధమానకషాయయోగములు "ఘ్రేయం, సపలలం, తైలం, వర్ధమానాః, ఫలేషు షట్" అని సంగ్రహమున నిర్దేశింప బడును).

(౭) చేదుసొరకు అతిమధురాదికషాయములతో యోగములు తొమ్మిది.

మూ. యష్ట్యాహ్వకోవిదారాద్యైః ముష్టిమన్తర్నఖం పిబేత్. ౧౪

వ్యా. అతిమధురమును ఎట్టిని దేవకాంచనము మున్నగు నెనిమిది ద్రవ్యములను వేరువేరుగ కషాయముల జేసి, అందు పిడికెడు చేదుసొరకాయగింజలచూర్ణమును కలిపి త్రాగనగును. (ఇచ్చట అతిమధురము దేవకాంచనము మున్నగు తొమ్మిది ద్రవ్యములచే వేరువేరుగ సిద్ధములైన కషాయముల తొమ్మిదితోను చేదుసొరవిత్తులచూర్ణమును కలిపి కల్పింపబడిన యోగములును తొమ్మిది యగునని యెరుంగునది.)

ఇచ్చట మదనకల్పమున తొలుత "యష్టిమధుకకషాయేణ, కోవిదార-కర్బుదార-నీప-బిదుల-బిమ్బీ-శణపుష్పీ - సదాపుష్పీ - ప్రత్యక్పుష్పీకషాయాణామన్యతమేన వా... పాయయేత్" (క. అ. ౧) అని నిర్దేశింపబడిన కషాయములు తొమ్మిదియు "యష్ట్యాహ్వకోవిదారాద్యైః" అనుపదముచే గ్రహించునది. (ఈయోగనులు తొమ్మిదియు "కషాయేషు నవాన్యే మధుకాదిషు" అని సంగ్రహమున నిర్దేశింపబడును).

(౮) చేదుసొరవర్తియోగము లెనిమిది.

మూ. కషాయైః కోవిదారాద్యైః మాత్రాశ్చ (వర్తయః) ఫలవత్ స్మృతాః,

వ్యా. మదనకల్పమున "ఫలపిప్పలీనాం ద్వౌద్వౌ భాగౌ కోవిదారాద్యైః త్రిస్సప్తకృత్వః......పాయయేత్" (క. అ. ౧). అని మాత్రాయోగములు ఎనిమిది చెప్పబడినవి. ఆకల్పనమునే అనుసరించి చేదుసొరవిత్తనములకును దేవకాంచనము మున్నగు నెనిమిదికషాయములతో మాత్రాయోగముల చేయునది. (ఈమాత్రాకల్పనము జీమూతకకల్పమునందును వివరింపబడినదికావున నచ్చట జూచునది. ఈయోగములు "అష్టౌ వర్తిక్రియాః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౯) చేదుసొరలేహయోగములైదు.

మూ. బిల్వమూలకషాయేణ తుమ్బీబీజాఞ్జలిం పచేత్. ౧౫
పూతస్యాఽస్య త్రయో భాగాః చతుర్థః ఫాణితస్య తు,
(పూతస్యాస్య త్రయో భాగాః త్రయస్త్రికటుకస్య చ.)
సఘృతో బీజభాగశ్చ పిష్టానర్ధాంశకాంస్తథా. ౧౬
(పిష్ట్వాహ్యర్ధాంశకాస్తథా)
మహాజాలినిజీమూతకృతవేధనవత్సకాన్,
తం లేహం సాధయేద్దర్వ్యా ఘట్టయన్ మృదునాగ్నినా. ౧౭

యావత్స్యాత్తస్తుమత్స్యే పలితం తు న శీర్యతే,
తం లిహ్యాన్మాత్రయా లేహం (కాలే) ప్రమథ్యాం చ పిబేదను.
కల్ప ఏషోఽగ్నిమన్థాదౌ చతుష్కే పృథగుచ్యతే,

వ్యా. చేదుసొరవిత్తనములను ఒకఅంజలి (నాల్గుపలముల) పరిమితము నలుగగొట్టి దాని కెనిమిదింతలు బిల్వవేరుకషాయమును జేర్చి నాల్గవపాలు(రెండుకుడవములమాత్రము) మిగులకాచి వడగట్టియుంచుకొనునది. ఈకషాయములు మూడుభాగములు, నాల్గనపాలు ఫాణితము (అర్ధపాకముగ కాచబడిన చెరకురసము), ఘృతము నాల్గవభాగము, చేదుసొర కాయలచూర్ణంబును నాల్గవవంతు మహాజాలిని (పచ్చనిపువ్వులుకల చేదుపుచ్చ), దేవదాళి, చేదుబీర, కొడిసెపాల ఈనాల్గిటిగింజలు ప్రత్యేకముగ నొక్కొకటి యర్ధభాగము, ఈవిత్తనముల నైదింటిని మెత్తని చూర్ణముచేసి పైజెప్పినవానితోకూడజేర్చి మృద్వగ్నిచే తీగెలు సాగునట్లును జలమున వైచిన కరుగకుండునట్లుగను పక్వమగునంతకాలము వండునది. ఈలేహమును తగిన ప్రమాణముతో సేవించి వెంటనే ప్రమథ్యమను కషాయమును త్రాగవలెను.

ఈకల్పవిధిప్రకారముగనే మహాపంచమూలములలో జేరిన తక్కిన కూరనెల్లివేళ్లు, దుండిగపువేళ్లు, గుమ్మడివేళ్లు, కలిగొట్టువేళ్లు, అను నీనాల్గిటిని వేరువేరుగ (పైజెప్పిన బిల్వకషాయమునుబోలె) నాల్గుకషాయముల సిద్ధముచేసి అందు చేదుసొరవిత్తులచే నాల్గువిధములుగ లేహయోగములను చేయునది. ఇత్తెరంగున మహాపంచమూలకషాయములతో చేదుసొర లేహయోగములు ఐదుగ నగును. (ఇయ్యది సంగ్రహమున "లేహాః పఞ్చ" అని నిర్దేశింపబడును.)

ఇచ్చట ప్రమథ్యమన—అతిసారచికిత్సితమున "పిప్పలీ నాగరం ధాన్యం—తిస్రః ప్రమథ్యా విహితాః" (చి. అ. ౧౯. శ్లో. ౨౭. ౨౮.) అని చెప్పబడిన ప్రమథ్యముల గ్రహించునది.

(౧) చేదుసొరగింజలమంథయోగ మొకటి.

మూ. సక్తుభిర్వా పిబేన్మన్థం తుమ్బ్యాస్స్వరసభావితైః. ౧౯
కఫజేఽథ జ్వరే కాసే కణ్ఠరోగేష్వరోచకే,

వ్యా. బొరుగులను చేదుబీరకాయలస్వరసమున భావనచేసి వానిని సత్తుపిండిచే యాస్వరసముననే కలిపి త్రాగవలెను. దానిని కఫముచే కల్గిన జ్వరమునందును, కాసమునందును, కంఠరోగములయందును, అరోచకమునందును ఉపయోగింపందగును. (ఇది యొకయోగము.)

—౭ మాంసరసయోగ మొకటి. ౭—

మూ. గుల్మే మేహే ప్రసేకే చ కల్కం మాంసరసైః పిబేత్. ౨౦
నరః సాధు వమత్యేవం న చ దౌర్బల్యమశ్నుతే,

వ్యా. గుల్మమునందును, ప్రమేహమునందును, నోట జొల్లుకారునపుడును, చేదు సొరవిత్తుల కల్కమును మాంసరసముతోఁగూర్చి త్రాగినచో మనుజునకు దౌర్బల్యము లేక చక్కగ వమనము లగును. (ఈయోగములు రెండును "మన్థోరసస్తథా" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

—౭ అధ్యాయవిషయసంగ్రహము. ౭—

మూ. పయస్యష్టౌ, సురామణ్డ-మస్తు-తక్రేషు చ త్రయః. ౨౧
క్షైరేయం, సపలలం, తైలం, వర్ధమానాః ఫలేషు షట్,
ఘృతమేకం, కషాయేషు నవ అన్యే మధుకాదిషు. ౨౨
అష్టౌ వర్తిక్రియాః, లేహాః పఞ్చ, మన్థో, రసస్తథా,
(మన్థే, రసే తథా)
యోగాః ఇక్ష్వాకుకల్పే తే (కల్పేఽస్మిన్) చత్వారింశచ్చ పఞ్చ చ.
ఉక్తా మహర్షిణా సమ్యక్ ప్రజానాం హితకామ్యయా,

వ్యా. ఈయిక్ష్వాకుకల్పమున చేదుసొరకు సంబంధించి పాలతో నెనిమిదియోగంబులును, సురామండముతో నొకటియు, మస్తుయోగ మొకటియు, తక్రయోగం బొకటియు, క్షైరేయ-మాంస-తైలయోగములు మూడును, మ్రంగకాయ మున్నగు ఆరుకషాయ యోగములతో వర్ధమానయోగము లారును, ఘృతయోగం బొకటియు, మధుకాది ద్రవ్యకషాయములతో వేరువేరుయోగములు తొమ్మిదియు, కోవిదారాదిద్రవ్యకషాయము లతో వర్తియోగము లెనిమిదియు, బిల్వాదిపంచమూలకషాయములతో వేరువేరుగ సిద్ధములైన లేహయోగము లైదును,మంథయోగం బొకటియు,మాంసరసయోగం బొకటియు కలిసి నలువదియైదు వమనయోగములు అగ్నివేశమహర్షిచే లోకమునకు హితమునుకోరి చెప్పబడినవి. (ఇచ్చట చందను ననుసరించి ఘృతము భిన్నక్రమముగ నిర్దేశింపబడినది.)

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే,
కల్పస్థానే ఇక్ష్వాకుకల్పో నామ తృతీయోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును, నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితమైన కల్పస్థానమున ఇక్ష్వాకుకల్పమనునది మూడవయధ్యాయము సంపూర్ణము.

---

# చతుర్థాధ్యాయము.

## (౪) ధామార్గవకల్పము.

అవతరణిక:—పైజెప్పిన సంబంధక్రమానుసారముగ ఇక్ష్వాకుకల్పమును చెప్పిన పిదప ధామార్గవకల్పము చెప్పబడును:—

మూ. అథాతో ధామార్గవకల్పం వ్యాఖ్యాస్యామః	౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః.	౨

వ్యా. ఇక్ష్వాకుకల్పమును జెప్పినపిదప ధామార్గవమునకు సంబంధించిన వమనౌషధ కల్పనవిధానమును తెలుపునధ్యాయము వివరించి చెప్పబడును. (ధామార్గవమన పెద్ద చేదుబీర).

## ధామార్గవ (పెద్దచేదుబీర) పర్యాయనామములు.

మూ. కర్కోటకీ కోఠఫలా (కటుఫలా) మహాజాలినిరేవ చ,
ధామార్గవస్య పర్యాయాః రాజకోశాతకీ తథా.	3

వ్యా. కర్కోటకి, కోఠఫల (కటుఫల), మహాజాలిని, రాజకోశాతకి, అనునవి పెద్దచేదుబీరకు పర్యాయనామములు. (ఇచ్చట "ధామార్గవః - పీతఘోషకః" అని చక్రపాణి వ్యాఖ్యానముచేసెను. కావున పసుపురంగుపువ్వులుకల చేదుబీరను గ్రహింప నగును).

## పెద్దచేదుబీరచే వమనములజేయింపదగిన రోగములు.

మూ. గరే గుల్మోదరే కాసే వాతే శ్లేష్మాశయస్థితే,
కఫే చ కణ్ఠవక్త్రస్థే కఫసఞ్చయజేషు చ.	౪
రోగేష్వేషు (తత్) ప్రయోజ్యం స్యాత్ స్థిరాశ్చ గురవశ్చ యే,

వ్యా. గరము (కృత్రిమవిషము, పెట్టుడుమందు) గుల్మము, ఉదరము, కాసము, ఈవ్యాధులయందును; కఫస్థానమున వాతము చేరినప్పుడును, కఫము కంఠమునందును నోటియందును చేరినప్పుడును, కఫసంచయముచే గల్గినవ్యాధులయందును, స్థిరములై గొప్పవిగనుండు వ్యాధులయందును పెద్దచేదుబీరను వమనమునకై యుపయోగింపనగును.

## పెద్దచేదుబీరను వమనౌషధమునకై గ్రహింపదగినయంగములు.

మూ ఫలం పుష్పం ప్రవాళం చ విధినా తస్య సంహరేత్.	౫

వ్యా. పైజెప్పబడిన పెద్దచేదుబీరయొక్క కాయలను, పువ్వులను, చిగుళ్లను, వమనౌషధముకొరకు విధ్యుక్తప్రకారము సంగ్రహించవలెను. (ఇచ్చట మదనకల్పమున "తత్రయాని కాలజాతాని......గృహ్ణీయాత్" (క. అ. ౧) అని చెప్పబడిన యోషధిగ్రహవిధి నెరుంగునది.)

(౯) ధామార్గవముతో వమనౌషధయోగములు అరువది, అందు పల్లవగుటికాయోగములు తొమ్మిది.

మూ. ప్రవాళస్వరసం శుష్కం కృతాశ్చ (కృత్వా చ) గుళికాః పృథక్,
కోవిదారాదిభిః పేయాః కషాయైః మధుకస్య చ. ౬

వ్యా. పెద్దచేదుబీర చిగుళ్లనుండి స్వరసము దీసి యెండించి యాస్వరసచూర్ణము అతిమధురము దేవకాంచనము మున్నగు తొమ్మిదిద్రవ్యముల వేరువేరుగ నొక్కొకదాని కషాయములో దేనియందైనను పక్వముచేసి గుటికలుగ జేసి యాగుటికలను ఆకషాయమునందే చేర్చి త్రాగవలెను. కషాయములసంఖ్యనుబట్టి యీయోగములు తొమ్మిది యగును. (ఇయ్యది సంగ్రహమున "పల్లవే నవ" అని నిర్దేశింపబడును).

మదనకల్పమున జెప్పబడిన మధుక-కోవిదారాదిద్రవ్యముల తొమ్మిదిటిని కషాయద్రవ్యముల గ్రహించునది.

ధామార్గవక్షీర-సురాయోగములు ఐదు.

మూ. పుష్పాదిషు పయోయోగాః చత్వారః పఞ్చమీ సురా,
పూర్వవత్

వ్యా. జీమూతకల్పమున "పయః పుష్పేఽస్య......హారితపాణ్డుకే" (క. అ. ౨. శ్లో ౬) అని చెప్పబడిన క్షీర-పేయా-మస్తు-దధిమస్తు యోగముల నాల్గిటి ననుసరించి నాల్గుక్షీరయోగములను; "ఆసుత్య చ సురామణ్డే మృదిత్వా ప్రస్రుతం పిబేత్" (క. అ. ౨. శ్లో. ౮.) అని చెప్పబడిన సురాయోగమును, ఈయైదుయోగములును ప్రకృతమున పెద్దచేదుబీరకు సంబంధించియు యోగములగల్పించునది. (ఈయైదుయోగములును సంగ్రహమున "చత్వారః క్షీర, ఏకస్సురాసవే" అని నిర్దేశించబడును.)

(౯) చేదుబీరకు సంబంధించినకషాయయోగములు తొమ్మిది.

మూ. జీర్ణశుష్కాణామతః కల్పః ప్రవక్ష్యతే. ౭
మధుకస్య కషాయేణ బీజకర్ణోద్ధృతం ఫలమ్,

సగుడం వ్యుషితం రాత్రిం కోవిదారాదిభి స్తథా. ౭
దద్యాద్గుల్మోదరా ర్తేభ్యో యే చాప్యన్యే కఫామయాః,

వ్యా. చక్కగా పండి యెండిన పెద్దచేదుబీరకాయను తెచ్చి తొడిమవద్ద విత్తనములు నిలచియుండుభాగమున తెగకోసి అతిమధురముచేసైన కషాయమును ఆబుఱ్ఱ నిండుగ పోసి, అందు బెల్లమునుకూడ నునిచి ఒకరాత్రియంతయుం నుంచునది. మరుసటి యుదయమున నాకషాయమును విధ్యుక్తప్రకారము త్రాగించవలయును. ఇత్తెరంగున నే మదనకల్పమున చెప్పబడిన దేవకాంచనము మొదలగు నేనిమిదికషాయములలో నొక్కొక్క దానిని వేరువేరుగ నుపయోగింపదగును. ఈకషాయయోగములను గుల్మములయందును, ఉదరములయందును, ఉదావర్తములందును, ఇతరములగు కఫవ్యాధులయందును నుపయోగింపదగును. (ఈకషాయయోగముల తొమ్మిదిటిని నధ్యాయాంతమున "జాత్యాః సౌమనసాయిన్యా" అని యుపక్రమించి చెప్పబడు పదునొకండుకషాయయోగములును చేర్చి ఇరువదికషాయయోగములను "కషాయే వింశతిః" అని సంగ్రహమున నిర్దేశింపబడినవి.)

జతూకర్ణతంత్రమున నీయోగ మిట్లు చెప్పబడినది:—"ధామార్గవఫలేషు ఉద్ధృతబీజమధ్యేషు సగుడోషితాః కోవిదారాదికషాయాః నవ." ఈవాక్యమునుపట్టి చేదుబీరకాయ మూతి తెగకోసి అందుండి విత్తనములను, గుంజును, వెలికిందీసి యాబుఱ్ఱలో మధుకాదికషాయములను వేరువేరుగ జేర్చుచు బెల్లమును కూడ కలిపి రాత్రియంతయు నందుండనిచ్చి మరుసటిదినము సేవింపవలయునని యర్థమగుచున్నది.

(౧) చేదుబీర కన్నముతో యోగ మొకటి.

మూ. దద్యాదన్నేన సంయుక్తం ఛర్దిహృద్రోగశాన్తయే. ౯

వ్యా. చేదుబీరవిత్తులచూర్ణమును అన్నముతో కలిసి తిన్నను వాంతియగును. దీనిని వాంతియందును హృద్రోగమునందును నుపయోగింపదగును.

(౧) ఆఘ్రేయయోగం బొకటి.

మూ. చూర్ణైర్వాఽప్యుత్పలాదీని భావితాని ప్రభూతశః,
రసక్షీరయవాగ్వాదితృప్తో ఘ్రాత్వా వమేత్సుఖమ్. ౧౦

వ్యా. పెద్దచేదుబీరచూర్ణముచేతను, రసముచేతను, నల్లకలువ, తామరపువ్వు మొదలగుపుష్పములను పలుమారు భావనచేసి రోగికి మాంసరసమునైనను, క్షీరముయవాగూ మున్నగు నాహారములను తృప్తిగ భుజింపజేసి పైజెప్పినపువ్వులను ఆఘ్రాణింప

జేసిన సుఖముగ వమనములగును. (ఇది యొకయోగము) ఈరెండుయోగములను "అస్న్వ ఏక స్తథా ఘ్రేయే" అని సంగ్రహముగ నిర్దేశింపబడినవి.

(౧౨) శకృద్రసయోగములు పండ్రెండు.

మూ. చూర్ణీకృతస్య వర్తిం వా కృత్వా బదరసంమితాం,
వినీయాంజలిమాత్రే తు పిబేద్గోఽశ్వశకృద్రసే. ౧౧
పృషతర్శ్యకురఙ్గాహ్వాగజోష్ట్రాశ్వతరావికే,
శ్వదంష్ట్రఖరఖడ్గానాం చైవం పేయాత్ శకృద్రసే. ౧౨

వ్యా. చేదుబీరవిత్తులను చూర్ణముచేసి దానికషాయముచే ఈచూర్ణమును కలిపి రేగుపండంత మాత్రను చేసి ఆవుపేడరసమునందైనను, గుఱ్ఱపులద్దెరసమునందైనను, నాల్గుపలముల పరిమితమున కలిపి త్రాగునది. ఇత్తెరంగుననే పొడలయిఱ్ఱి, దుప్పి, లేడి, యేనుగు, ఒంటె, కంచరగాడిదె, గొఱ్ఱె, తోడేలు, గాడిదె, ఖడ్గమృగము అను నీపది జంతువులయొక్క పేడ, రసమును, ఆవుపేడరసముతో కలుపుచు అందు పైజెప్పిన మాత్రను కలిపి త్రాగవలయును. ఇచ్చట గోవు మున్నగు పండ్రెండు జంతువులపేడ రసమును వేరువేరుగ నుపయోగించుటవలన నియ్యవి పండ్రెండు యోగములగును. (ఈయోగము "దశద్వౌ చ శకృద్రసే" అని సంగ్రహముగ నిర్దేశింపబడును.)

(౧౦) లేహయోగములు పది.

మూ. జీవకర్షభకౌ వీరామాత్మగుప్తాం శతావరీం,
కాకోలీం శ్రావణీం మేదాం మహామేదాం మధూలికామ్ ౧౩
ఏకైకశోఽభిసంచూర్ణ్య సహధామార్గవేణ తే,
శర్కరామధుసంయుక్తా లేహా హృద్దాహకాసినామ్. ౧౪
సుఖోదకానుపానాః స్యుః పిత్తోష్మసహితే కఫే,

వ్యా. జీవకము, ఋషభకము, క్షీరకాకోలి, దూలగొండివిత్తులు, పిల్లిపీచరగడ్డ, కాకోళి, బోడతరము, మేద, మహామేద, చాగ అనుపదింటిలో దేనినైన నొకదానిని మెత్తని చూర్ణముగచేసి యాచూర్ణమునకు సమభాగముగ పెద్దచేదుబీరవిత్తనముల చూర్ణమును కలిపి లేహపాకమునకు కావలసినంత చక్కెరను, తేనెను కలిపి లేహపాకవిధి ప్రకారము పక్వముచేయునది. ఇత్తెరంగున పైజెప్పిన పదిద్రవ్యములచూర్ణములలో నొక్కొక్కదానితో చేదుబీరచూర్ణమును కలుపుచు చేయబడినలేహయోగములు పది

యగును. ఈలేహమును పిత్తముయొక్క యుష్ణముతో కూడికఫమునందు సుఖోష్ణ మయిన జలము ననుపానముగ జేసికొని యుపయోగింపదగును. ఇయ్యది "దశలేహాః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౧) యూషముతో కల్కయోగ మొకటి.

మూ. ధాన్యతుమ్బురుయూషేణ కల్కాః సర్వవిషాపహాః.　　౧౫

వ్యా. దనియాలును, తుంబురుగింజలను చేర్చి సిద్ధము చేయబడిన యూషమునందు చేదుబీరగింజల కల్కమును కలిపి త్రాగిన వమనములగును. వీనిచే విషములన్నియు నశించును. (ఇయ్యది ఒకయోగము. "కల్కే" అని సంగ్రహమున నిర్దేశింపబడినది.)

(౧౧) పదునొకండుకషాయయోగములు.

మూ. జాత్యాః సౌమనసాయిన్యా రజన్యాశ్చోరకస్య చ,
వృశ్చికస్య మహాక్షుద్రసహాహైమవతస్య చ.　　౧౬
బిమ్బ్యాః పునర్నవాయా వా కాసమర్దస్య వా పృథక్,
ఏకం ధామార్గవం ద్వే వా కషాయే పరిమృద్య తు.　　౧౭
పూతం మనోవికారేషు పిబేద్వమనముత్తమమ్,

వ్యా. జాజి, అడవిమొల్ల, పసుపుకచోరములు, తెల్లగలిజేరు, అడవిపెసర, అడవి మినుము, వస, దొండ, యెఱ్ఱగలిజేరు, కసివెంద అను నీపదునొకండు ద్రవ్యములలో నొకదాని కషాయమును చేదుబీరకాయలను ఒకటియైనను, రెంటినైనను కలిపి పిసికి యాకషాయరసమును వడగట్టి మానసికవ్యాధులయందు వమనమునకై త్రాగించినయెడ చక్కగ వాంతియగును. ఇవి మిక్కిలి యుత్తమమైన కషాయయోగములు. ఇచ్చట జాజి మున్నగు పదునొకండుకషాయములలో చేదుబీరకాయలను వేరువేరుగ కల్పుచు పదు నొకండుయోగములుగ గల్పింపనగును.

(౧) ఘృతయోగ మొకటి.

మూ. తచ్ఛృతక్షీరజం సర్పిః సాధితం వా ఫలాదిభిః.　　౧౮

వ్యా. చేదుబీరకాయలచూర్ణమును కలిపి కాచబడిన పాలనుండి తీసిన వెన్నయందు మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యముల కషాయము దేనినైన నొకదానిని కలిపి ఘృత పాకవిధిప్రకారము పక్వముచేయబడిన ఘృతము నుపయోగించినను చక్కగ వమనము లగును.

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. పల్లవే నవ, చత్వారః క్షీరే, ఏకః సురాసవే,
కషాయే వింశతిః, కల్కే, దశ ద్వౌ చ శకృద్రసే. ౧౯
అన్న ఏకః, తథా ఘ్రేయే, దశ లేహా స్తథా ఘృతం,
కల్పే ధామార్గవస్యోక్తాః షష్టిర్యోగా మహర్షిణా. ౨౦

వ్యా. ఈధామార్గవకల్పమున చిగుళ్లతో తొమ్మిదియోగంబులును, క్షీరయోగములు నాల్గును, సురామద్యముతో నొకయోగంబును, కషాయయోగములు ఇరువదియు, కల్కయోగం బొకటియు. శకృద్రసయోగము పండ్రెండును, అన్నముతో యోగ మొకటియు, ఆఘ్రేయయోగం బొకటియు, పది లేహయోగంబులును, ఘృతయోగం బొకటియు, చేరి పెద్దచేదుబీరకాయకుచేరిన వమనయోగములు అరువది మునిపుంగవుడగు నగ్నివేశునిచే నుపదేశింపబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే
కల్పస్థానే ధామార్గవకల్పో నామ చతుర్థోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబునయిన చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందు దృఢబలసంపూరితమయిన కల్పస్థానమున ధామార్గవకల్పమనునది చతుర్థాధ్యాయము సమాప్తము.

---

## పంచమాధ్యాయము.

### (౫) వత్సకకల్పము.

అవతరణిక:—పైనిసూచించిన సంబంధానుసారముగ ధామార్గవకల్పమును జెప్పిన పిదప వత్సకకల్పము చెప్పబడును:—

మూ. అథాతో వత్సకకల్పం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. ధామార్గవకల్పమును జెప్పినపిదప వత్సకకల్పమును (కొడిసెపాలను వమనౌషధయోగములుగ గల్పించువిధానములు దెల్పునధ్యాయమును) భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెద.

మూ. అథ వత్సకనామాని భేదం స్త్రీపుంసయో స్తథా,
కల్పం చాస్య ప్రవక్ష్యామి విస్తరేణ యథాతథమ్. 3

వ్యా. వత్సక (కొడిసెపాల)మునకు సంబంధించిన పర్యాయనామంబులును, స్త్రీపురుషభేదంబును, వానికల్పంబును ఈక్రింద విస్తరముగ నాయాయోగానుగుణముగ జెప్పెద వినుము.

## వత్సక (కొడిసెపాల) పర్యాయనామములు.

మూ. వత్సకః కుటజశ్శక్రః వృక్షకో గిరిమల్లికా,
బీజానీన్ద్రయవా స్తస్య తథోచ్యన్తే కలిఙ్గకాః. ౪

వ్యా. వత్సకము, కుటజము, శక్రము, వృక్షకము, గిరిమల్లిక, అను నీనామములచే కొడిసెపాల చెప్పబడును. మరియు వానివిత్తనములు ఇంద్రయవములు, కలింగకములు, అని పర్యాయములచే తంత్రములలో జెప్పబడును.

## కొడిసెపాలలో స్త్రీపురుషభేదలక్షణములు.

మూ. బృహత్ఫలః శ్వేతపుష్పః స్నిగ్ధపత్రః పుమాన్ భవేత్,
శ్యామా చారుణపుష్పా స్త్రీఫలబృన్తైః (పుష్పైః) తథాణుభిః. ౫

వ్యా. పెద్దకాయలును, తెల్లనిపువ్వులును, స్నిగ్ధములైన యాకులును కల్గినది పురుషజాతితో జేరిన కొడిసెపాల యగును. శ్యామవర్ణంబైనను, అరుణవర్ణంబైన కల పుష్పములతోగూడి చిన్నవియగుపుష్పంబులును ఫలంబులును కల్గినది స్త్రీజాతియనియు నెరుంగునది.

ఇచ్చట కొడిసెపాలతో స్త్రీపురుషభేదములనుబట్టి గుణభేదంబును ప్రయోగ భేదంబును గానరావు. అయిన పైజెప్పిన లక్షణముల గ్రాహకులు సంశయించెదరని యయ్యది నివర్తించుటకు వస్తుభేదము లేదని దృఢపరచుటకు వానిభేదలక్షణములు మాత్రముపదేశింపబడినవి యని యెరుంగునది.

## కొడిసెపాలగుణాదులప్రాశస్త్యము.

మూ. రక్తపిత్తకఫఘ్నస్తు సుకుమారేష్వనత్యయః,
హృద్రోగజ్వరవాతాసృక్ వీసర్పాదిషు శస్యతే. ౬

వ్యా. కొడిసెపాలవిత్తనములు రక్తపిత్తమును హరించును. మిక్కిలి సుకుమారులుగ నుండువారికి శ్రమమును కల్గించక పనిచేయును. వీనిని హృద్రోగము, జ్వరము, వాత రక్తము, విసర్పము మున్నగువ్యాధులయం దుపయోగించుట చాల ప్రశస్తము.

(౯) కొడిసెపాలకు కషాయములతో చేరినయోగములు తొమ్మిది.

మూ. కాలే ఫలాని సఙ్గృహ్య తయోశ్శుష్కాణి సంక్షిపేత్,
తేషామన్తర్నఖం ముష్టిం జర్జరీకృత్య భావయేత్. ౭
మధుకస్య కషాయేణ కోవిదారాదిభిస్తథా,
నిశి స్థితం విమృద్యైతత్ లవణక్షౌద్రసంయుతమ్. ౮
పిబేత్తద్వమనం శ్రేష్ఠం పిత్తశ్లేష్మనిబర్హణం,

వ్యా. పైని స్త్రీపురుషభేదములచే రెండువిధములుగ జెప్పబడిన కొడిసెపాల చెట్టును చక్కగ పండి యెండినకాయలను (యుక్తమైనకాలమున ఔషధగ్రహణమున చెప్పబడిన విధిప్రకారము గ్రహించి వానివిత్తనములను నలియగొట్టి అందు పిడికిలి పరిమాణమును గ్రహించి అతిమధురకషాయమునందైనను, కోవిదారాది (యెఱ్ఱదేవకాంచ నము మొదలగు సెనిమిదికషాయద్రవ్యములలో నొకదానియందైనను, నొకరాత్రి యందు నునిచి భావనచేసి మరుసటినా డుదయమున చక్కగ పిసికి కషాయమును వడ గట్టుకొని యందు సైంధవలవణము తేనెను కలిపి విధ్యుక్తప్రకారము త్రాగవలెను. ఈవమనయోగము పిత్తకఫములను చక్కగ హరించును. మిక్కిలి యుత్తమమయినది.

ఇచ్చట మదనకల్పమున చెప్పబడిన యష్టిమధుకకోవిదారాది భావనకషాయ ద్రవ్యముల తొమ్మిదిటిని గ్రహించి వేరువేరుగ కషాయయోగములచే తొమ్మిదియోగ ములుగ గల్పింపనగును. ఈయోగములు "కషాయైర్నవా" అని సంగ్రహముగ నిర్దేశింప బడును.మరియు"సర్వేషు తు మధుసైన్ధవం కఫవిలయనచ్ఛేదనార్థం వమనేషు విదధ్యాత్" (క. అ. ౧.) అనుసామాన్యవాక్యము చేతనే మధుసైంధవములు చేర్పదగునని విధింప బడినను, ఇచ్చట మరల చెప్పుటచేత నీరెంటిని ఈయోగమునందు విశేషముగ చేర్పవలెనని తెలిసెడి.

(౮) కొడిసెపాలచూర్ణమునకు జీవకాదికషాయయోగములు ఐదును సర్షపాదిజలముతో కూడిన యోగములు మూడు.

మూ. అష్టాహం పయసార్కేన తేషాం చూర్ణాని భావయేత్. ౯
జీవకస్య కషాయేణ(జీమూతకీకషాయేణ)తతః పాణితలం పిబేత్,

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే
కల్పస్థానే వత్సకకల్పో నామ పఞ్చమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నైన చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితమైన కల్పస్థానమున వత్సకకల్పమనునది యైదవయధ్యాయము సంపూర్ణము.

---

## షష్ఠాధ్యాయము.

### (౬) కృతవేధనకల్పము.

అవతరణిక:—తొలుత జెప్పిన సంబంధమునుబట్టి క్రమప్రాప్తమైన కృతవేధనకల్పము క్రింద వివరింపబడును:—

మూ. అథాతః కృతవేధనకల్పం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వత్సకకల్పమును జెప్పినపిదప వమనకల్పములలో కడపటిదియగు కృతవేధనకల్పమును (చిన్నచేదుబీరకు సంబంధించిన వమనయోగకల్పనముల వివరించునధ్యాయమును) భగవానుడగు నాత్రేయు డుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదననియర్థము.

### కృతవేధనపర్యాయనామములు.

మూ. కృతవేధననామాని కల్పం చాస్య నిబోధత,
క్ష్వేడః కోశాతకీ చోక్తం (జాలీ) మృదఙ్గఫలమేవ చ. 3

వ్యా. కృతవేధనము (చిన్నచేదుబీర) యొక్క పర్యాయనామంబులును, దానిచే వమనయోగముల గల్పించువిధంబును చెప్పెద వినుడు:—క్ష్వేడ-కోశాతకీ-మృదంగఫల, అను పర్యాయనామములచే కృతవేధనము చెప్పబడును.

### కృతవేధనగుణాదులు.

మూ. అత్యర్థకటుతీక్ష్ణోష్ణం గాఢేష్విష్టం గదేషు చ,
కుష్ఠపాణ్డ్వామయప్లీహశోఫగుల్మగరాదిషు. ౪

వ్యా. చిన్నచేదుబీరకాయ అధికమైన కటురసంబును, మిక్కిలి తీక్ష్ణోష్ణగుణంబులును కల్గియుండును. కుష్ఠము, పాండురోగము, ప్లీహావృద్ధి, శోఫము, గుల్మము, గరమనువిషము, ఇవి మున్నగు మిక్కిలి గాఢములై క్రూరములగు రోగములలో నుపయోగింపదగియుండును. (దీనిని జాలిని యనియు కొందరు చెప్పెదరు.)

[ఇచ్చట నీవిషయము నెరుంగునది:—ఈకల్పములయందు నాల్గవయధ్యాయమున ధామార్గవశబ్దమును ప్రధానముగ జేసియు, ఈయధ్యాయమున కృతవేధనశబ్దమును ప్రధానముగ జేసికొనియు వమనకల్పములు చెప్పబడినవి. ఈరెండుపదములచే బోధింపబడు ద్రవ్యములు రెండుగ నుండితీరవలెను. నిఘంటువులయందు వీనిరెంటికిని పర్యాయనామము కలిసియే యుండుటంజేసి వస్తుభేదమును గమనింప సంశయము కల్గుచున్నది.—భావప్రకాశమున "మహాకోశాతకీ, రాజకోశాతకీ" యని రెండుభేదముల జూపుచు వీనిపర్యాయనామములరెంటియందును ధామార్గవపదమును చెప్పిరి, కాని రెండవదాని పర్యాయములలో మాత్రము కృతవేధనపదము కానవచ్చును. మరియు నివి రెండును బీరకాయలజాతిలో చేరినదని యాంధ్రవ్యాఖ్యానముచే దెలిసెడి. అందును పర్యాయపదములలో మహాకోశాతకీ, కోశాతకీ, అను రెండుపదములచేత, పెద్దది, చిన్నది, అని యీరెంటికిని భేదము కల్పింపదగియున్నది.

ఈతంత్రకారుడును ధామార్గవపర్యాయములయందు "మహాజాలినిరేవ చ...... రాజకోశాతకీ తదా" అని చెప్పిరి. ఈపదములచే పెద్దబీర ధామార్గవపదవాచ్యమని చెప్పదగియున్నది. కృతవేధనపర్యాయములయందు "క్ష్వేడః కోశాతకీ జాలీ" అని కోశాతకీ, జాలీ, అనుపదముల నిరుపపదములుగ జెప్పియుండుటచేత, చిన్నబీర కృతవేధనపదవాచ్యమని దృఢమగుచున్నది.

మరియు కృతవేధనగుణముల చెప్పునపుడు "అత్యర్థకటుతీక్ష్ణోష్ణం గాఢేష్విష్టం" అని చెప్పుటచేత నిది మిక్కిలి అధికమైన కటురసంబును తీక్ష్ణోష్ణగుణంబులు కల్గినదియు మిక్కిలి యుత్కటావస్థనుండు కుష్ఠాదులయం దుపయోగింపదగినదనియు తెలిసెడి. దీనిని పరికించినచో ధామార్గవము దీనికన్న తక్కువగ కటురసతీక్ష్ణోష్ణముల గల్గియుండుననియు, కుష్ఠాదుల సామాన్యావస్థయం దుపయోగింపదగినదనియు నూహింపదగియున్నది. దీనింబట్టి చూడ ధామార్గవము పెద్దచేదుబీర చిన్నదానికన్న మృదువమనకరంబని తేలినది.

మరియు అట్టి రెండువిధములైన బీరలలోను మధుర-కటు। భేదములు కల్గియుండును. అందు వమనయోగములకు చేదుబీరనే గ్రహింపవలెనని పైజెప్పినరసగుణాదినిర్ణయముచే తెలిసెడి.



—{ చిన్నచేదుబీరకు సంబంధించినవమనయోగము లరువది.
(౫) అందు క్షీరాదియోగము లైదు. }—

మూ. క్షీరాదికుసుమాదీనాం, సురా చైతేషు పూర్వవత్.

వ్యా. చిన్నచేదుబీరపువ్వుల చేర్చి కాచబడిన క్షీరయోగమును, కాయల చేర్చి కాచబడిన పాలను చేర్చి సిద్ధముచేయబడిన పేయాయోగమును, క్షీరసంతానికాయోగమును, సురాయోగమును, దధ్యుత్తర-దధ్యమ్లయోగములను, ఈయైదిటిని జీమూతకకల్ప విధానము ననుసరించి కల్పింపనగును.

ఇచ్చట జీమూతకల్పమున "పయః పుష్పేఽస్య నిర్వృత్తే...హరితపాణ్డుకే" (క. అ. ౧-శ్లో. ౬) అని చెప్పబడిన క్షీరాదియోగముల నాల్గిటిని, "ఆసుత్యాచ సురామణ్డే మృదిత్వా ప్రస్రుతం పిబేత్" అని చెప్పబడిన సురాయోగ మొకటిని యెరుంగునది. దీనివివరణ మచ్చటనే చూచునది. ఈయైదుయోగములును "క్షీరే ద్వౌ ద్వౌ, సురా చైకా" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

—(౯) చిన్నచేదుబీరకు కషాయములతో యోగములు తొమ్మిది.—

మూ. సుశుష్కాణాం తు జీర్ణానాం
(బీజానాం) ఏకం ద్వే వా యథాబలమ్. ౫
కషాయైర్మధుకాదీనాం నవభిః ఫలవత్పిబేత్,

వ్యా. చక్కగ పండి యెండిన చిన్నచేదుబీరకాయలనుండి విత్తనముల గ్రహించి అందు రోగియొక్క బలానుసారముగ నొకటినైనను రెంటినైనను మదనకల్పమున జెప్పబడిన మధుక-కోవిదారాదిద్రవ్యములచే వేరువేరుగ సిద్ధముచేయబడిన కషాయములలో నొకదానియందుచేర్చి రాత్రియంతయు భావనచేసి యుదయమున మదనకల్పమున జెప్పబడిన విధానప్రకారము త్రాగవలెను. (ఈకషాయములతో యోగములు తొమ్మిది.)

—(౯) లేహయోగములు తొమ్మిది.—

మూ. క్వాథయిత్వా ఫలం తస్య పూత్వా లేహం నిధాపయేత్. ౬
(క్వాథయిత్వా రసం తం చ కృత్వా
(రసం తస్య పక్త్వా) లేహం నిధాపయేత్)
కృతవేధనకల్కాంశం ఫలాద్యర్ధాంశసంయుతం,

వ్యా. చిన్న చేదుబీరకాయగింజలను చూర్ణముచేసి యాచూర్ణ మొకభాగంబును, మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యము లారిటిలో నొకదానిచూర్ణము అర్ధభాగంబును, పైజెప్పబడిన అతిమధురము దేవకాంచనము మున్నగు తొమ్మిది ద్రవ్యములచే వేరువేరుగ సిద్ధములైన కషాయములలో నొకదానియందు చేర్చి, లేహపాకమునకు కావలసినంత చక్కెరపాకమును తేనెను కలిపి, లేహపాకప్రకారము పక్వముచేయునది. (ఈలేహయోగములును తొమ్మిదికషాయములతో వేరువేరుగ గల్పించుటంజేసి తొమ్మిది యగును).

ఈలేహయోగముల తొమ్మిదిటిని "ఫలపిప్పలీనాం...అన్యతమకషాయేణ సిద్ధో లేహః" (క. అ. ౧. సూత్రము. 33) అని మదనకల్పమున జెప్పబడిన కల్పనము ననుసరించి కల్పింపనగును. మఱియు నీలేహయోగములు తొమ్మిదియు సంగ్రహమున జెప్పియుండుటలేదు; కాని పత్త్రిక్రియానంతరము 'లేహేాఽష్టౌ' అని యెనిమిదిలేహయోగములు నిర్దేశింపబడినవి. ఆవరుస-ననుసరించి "కోశాతకాని పక్వాని...కల్పయేత్పృథక్" అని యెనిమిదియోగములను తంత్రకారులు చెప్పియున్నారు. కావున నిచ్చట "క్వాథయిత్వా" అని చెప్పిన గ్రంథము అనార్షమని కొందరు చెప్పెదరు. జతూకర్ణతంత్రమున—"ఏత్ర జీర్ణబీజానాం మదనఫలవత్ కషాయై ర్లేహాః భవంతి నవ" అని యీ తొమ్మిది లేహయోగములు చెప్పబడినవి. ఈజతూకర్ణతంత్రమును ప్రమాణముగజేసి చక్రపాణివ్యాఖ్యాత "తచ్చ సంగతార్థం" అని స్వసిద్ధాంతమును వ్రాసిరి.

### (౧3) పదిమూడుకషాయయోగములు.

మూ. పృథక్పారగ్వధాదీనాం త్రయోదశభిరాసుతమ్. ౭

వ్యా. రేల-కోడిసెపాలవిత్తులు మున్నగు పదిమూడుద్రవ్యముల వేరువేరు కషాయములలో నొక్కొకదానియందు చిన్నచేదుబీరవిత్తనముల చూర్ణమును కలిపి రాత్రియంతయును భావనచేసి మరునాడుదయమున వడగట్టి త్రాగవలెను. పదిమూడుకషాయములలో వేరువేరుగ నుపయోగించుటంజేసి యీకషాయయోగములును పదిమూడగును.

ఇచ్చట—"మదనకల్పమున ఫలపిప్పలీనామారగ్వధ-వృక్షక-స్వాదుకణ్టక-పాఠా-పాటలీ-శార్ఙ్గేష్టా-మూర్వా-సప్తపర్ణ-నక్తమాల-పిచుమర్ద-పటోల-సుషవీ-గుడూచీ" అని నిర్దేశింపబడిన పదిమూడు కషాయద్రవ్యములను గ్రహించునది. ఈకషాయయోగములు పదిమూడును పైజెప్పబడిన తొమ్మిదియు కలిసి యిరువదిరెండు కషాయయోగములగును. ఈయోగములు "క్వాథా ద్వావింశతిస్తథా" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

### (౧౦) పిచ్ఛాయోగములు పది.

**మూ.** శాల్మలీమూలచూర్ణానాం (వృన్తానాం) పిచ్ఛాభిర్దశభిస్తథా,

వ్యా. బూరుగపట్ట చూర్ణముసైనను పువ్వులకాడలసైనను పిచ్ఛావిధానప్రకారము రసము దీసి యారసమునందు చేదుబీరకాయల చూర్ణమును కలిపి త్రాగవలెను. ఇత్తెరంగున విమానస్థానమున జెప్పబడిన శాల్మల్యాదిద్రవ్యముల పదిటెని వేరువేరుగ గల్పించి వానితో వేరువేరుగ చిన్నచేదుబీరకాయలచూర్ణమును కలిపి యుపయోగించుటచే పది యోగము లగును.

ఇచ్చట 'శాల్మలీమూల' అనుచోట మూలశబ్దము ఆదివాచకము. "శాల్మలీ,మూలం (ఆదిః) యేషాం తే-శాల్మలీమూలాః" అను విగ్రహముచే శాల్మలి మున్నగు పదిద్రవ్యములని యర్థమగును. అయ్యవి విమానస్థానమందలి రోగభిషగ్జితీయమున నిట్లు నిర్దేశింపబడినవి-"శాల్మలి-శాల్మలిక-భద్రప-ర్ణ్యేలాప-ర్ణ్యుపోదికోద్దాలక-ధన్వన-రాజాదన-ఉపచిత్రాగోపీ..." (వి. అ. ౮. సూ. ౧౭౩) బూరుగ, శాల్మలక (బూరుగలో భేదము), పెద్ద గుమ్మడి, సన్నరాష్టము, దుంపబచ్చలి, విరిగి, తడచెట్టు, మొరళిచెట్టు. నేపాళము, సుగంధపాల అనునవి పదియు పైవాక్యముచే జెప్పబడినవి. ఈపదిటిలో నేదైన నొకదానియొక్క- పచ్చిపట్టసైనను, పువ్వులసైనను గ్రహించి నలుగగొట్టి పచ్చియాకులసైనను దర్భలసైనను దానికి జుట్టి పొట్లము గట్టి పైన నల్లనిమట్టి కవచమిచ్చి పూసి పిడుకలలో పుటము పెట్టునది. ఆమృత్తిక యెండినసమయమున దాని గ్రహించి లోపలియౌషధమును రోట దంచి యందుండి రసమును పిండునది. ఇది పిచ్ఛావిధానము. ఈస్వరసమున చేదుబీరవిత్తనముల చూర్ణము కలిపి యుపయోగింపవలెనని పైమూలమునకు అర్థము.

ఈపిచ్ఛావిధానము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"పరివేష్ట్య కుశైరార్ద్రైః ఆర్ద్రవృన్తాని శాల్మలేః, కృష్ణమృత్తికయాఽఽలిప్య స్వేదయేత్ గోమయాగ్నినా. సుశుష్కాం మృత్తికాం జ్ఞాత్వా తాని వృన్తాని శాల్మలేః......మృద్నియాదాపోథ్యోలూఖలే తతః" ఇదియే పుటపాకవిధి యగును.

(ఈపిచ్ఛాయోగములు పదియు "దశ పిచ్ఛాః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

### ఆరు వర్తిక్రియాయోగములు, ఒక ఘృతయోగము.

**మూ. వర్తిక్రియాః షట్ ఫలవత్, ఫలాదీనాం ఘృతం తథా. ౭**

వ్యా. మ్రంగకాయ నుద్దేశించి మదనకల్పమున చెప్పబడినరీతిగ చిన్నచేదుబీరకు వర్తిక్రియాయోగము లారును కల్పించునది. మరియు చేదుబీరగింజలజేర్చి పక్వముచేయ బడిన క్షీరమునుండి తీయబడిన వెన్నలో మ్రంగకాయ మున్నగు నారుద్రవ్యములకల్కములను, ఆయారిటిని వేర్చి సిద్ధముచేయబడిన కషాయమునుజేర్చి ఘృతపాకవిధిప్రకారము ఘృతమును పక్వము చేయవలెను. (ఇది యొక యోగము. ఈఘృతయోగమును వర్తియ లారును ''ఘృతం చైకం, వర్తిక్రియాష్షట్'' అని విషయసంగ్రహమున నిర్దేశింప బడును.)

వర్తిక్రియావిధానము—మదనకల్పమున—''ఫలపిప్పలీచూర్ణాని పూర్వవత్ ఫలాదీనామన్యతమకషాయపరిస్రుతాని వర్తిక్రియాః ఫలాదికషాయోపసర్జనాః పేయాః'' (క. అ. ౧. సూ. ౩౧) అని నిర్దేశింపబడినప్రకారము ప్రకృతమున చిన్న చేదుబీరకాయగింజలచూర్ణమును వమనద్రవ్యములుగ జెప్పబడిన మ్రంగకాయ దేవదాళి మున్నగు నారుద్రవ్యములచే సిద్ధములైన యారుకషాయములలో నొకదానియందు భావనజేసి యాకషాయమున చూర్ణమును కలిపి లేహపాకవిధిప్రకారము మరల పక్వము చేసి వర్తులచేయునది. మ్రంగకాయ మున్నగు నారుద్రవ్యములకషాయములతో వేరు వేరుగ గల్పించుటంజేసి యారువర్తియోగము లగును.

మరియు ''ఫలపిప్పలీశృతక్షీరాత్'' అని మదనకల్పమున చెప్పబడిన ఘృతవిధా నము నెరుంగునది.

మూ. క్రోశాతకాని పఞ్చాశత్ కోవిదారరసే పచేత్,
తం కషాయం ఫలాదీనాం కల్కైర్లేహం పునః పచేత్. ౯
క్ష్వేడస్య తత్ర భాగస్స్యాత్ శేషాణ్యర్థాంశకాని తు,
కషాయైః కోవిదారాద్యైః ఏవం తత్కల్పయేత్పృథక్. ౧౦
(కషాయైః కోవిదారాద్యైః అష్టాభిస్తం పృథక్ పిబేత్.)

వ్యా. చిన్నచేదుబీరకాయవిత్తులను ఏబదిని ఎఱ్ఱదేవకాంచనముచే సిద్ధమైనకషాయ మున చేర్చి కాచవలెను. ఆకషాయమును గ్రహించి, అందు మ్రంగకాయ మున్నగు వమనద్రవ్యముల నారిటిని వేరువేరుగ నర్థాంశముగను, చిన్నచేదుబీరవిత్తుల నొకభాగము గను కల్కముచేసి కలిపి లేహపాకవిధిప్రకారము మరల పక్వముచేయునది. ఇత్తెరంగున దేవకాంచనము తెల్లదేవకాంచనము మున్నగు నెనిమిదిద్రవ్యముల వేరువేరు కషాయ ములలో నెనిమిదిలేహయోగముల గల్పించునది. అట్టియెడ నేకషాయమున లేహము పక్వముచేయుదురో ఆకషాయముచే అనుపానముగజేసి త్రాగవలెను.

ఇచ్చట కాలుభాగము కషాయమున కషాయమునకు నాల్గింత (ఒకభాగము) చేదుబీరగింజలచూర్ణమును ఆచూర్ణములో నర్ధభాగము తక్కిన మ్రంగకాయ మున్నగు నాపకల్కద్రవ్యములను (ప్రత్యేకము అర్ధభాగమువంతునను) కల్పించవలెను. కోవిదారాదిద్రవ్యముల సెనిమిదిటెని మదనకల్పమున జెప్పబడినవాని సెరుంగునది. (ఈలేహయోగములు 'లేహేఽష్టౌ' అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౭) చేదుబీరకు మాంసరసయోగము లేదు.

మూ. కషాయేషు ఫలాదీనా మానూపం పిశితం పృథక్,
కోశాతక్యా సమం పక్త్వా రసం సలవణం పిబేత్. ౧౧
ఫలాది పిప్పలీయుక్తం తద్వత్ క్ష్వేడరసం పిబేత్,

వ్యా. మ్రంగకాయగింజలు దేవదాళి మున్నగు నేడు వమనద్రవ్యముల వేరువేరు కషాయములయందు ఆనూపమాంసమును, చిన్నచేదుబీరకాయవిత్తులను సమభాగములుగ గూర్చి పక్వముచేసి, అందు సైంధవలవణమును మితముగ జేర్చి త్రాగనగును. (మ్రంగకాయ మున్నగునారిటికషాయములలో వేరువేరుగ గల్పించుటంజేసి యివి ఆరుయోగములు.)

మరియు చిన్నచేదుబీరగింజలను కషాయముచేసి, అందు మ్రంగకాయగింజలు మున్నగు నారుద్రవ్యముల సముదాయము చూర్ణమును ఆనూపమాంసమును సమభాగములుగ గూర్చి పక్వముజేసి, యామాంసరసమున లవణమును కలిపి త్రాగవలెను. ఇది యొకయోగము. ఇత్తెరంగున చిన్నచేదుబీరవిత్తులకు జేరిన మాంసరసయోగములు ఏడగును. (ఇవి "సప్త మాంసే చ" అని నిర్దేశింపబడును.)

(౧) ఇక్షురసయోగ మొకటి.

మూ. క్ష్వేడం కాసీ పిబేత్సిద్ధం మిశ్రమిక్షురసేన చ. ౧౨

వ్యా. చిన్నచేదుబీరగింజల చూర్ణమును చెరకురసమున కలిపి పక్వముచేసి కాసమున త్రాగవలెను. జతూకర్ణతంత్రమున "క్ష్వేడ మిక్షురసే శృతం" అని చెప్పియుండుటవలన (ఇచ్చట 'సిద్ధం' అనుపదమునకు పక్వముచేయబడినదని యర్థము. ఇయ్యది "యోగ ఇక్షురసేఽపరః" అని నిర్దేశింపబడును.)

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

మూ. క్షీరే ద్వౌ ద్వౌ, సురా చైకా, క్వాథాః ద్వావింశతి స్తథా,
దశ పిచ్ఛాః, ఘృతం చైకం, షట్చ వర్తిక్రియాః శుభాః. ౧౩

లేహేఽష్టౌ, సప్త మాంసే చ, యోగ ఇక్షురసేఽపరః,
కృతవేధనకల్పేఽస్మిన్ షష్టిర్యోగాః ప్రకీర్తితాః. ౧౮

వ్యా. ఈకృతవేధనకల్పమున చేదుబీరకు క్షీరమునకు జేరినయోగములు నాల్గును, సురాయోగం బొకటియు, క్వాథయోగము లిరువదిరెండును, పిచ్ఛాయోగములు పదియు, ఘృతయోగం బొకటియు, వర్తియోగము లారును, లేహయోగంబు లెనిమిదియు, మాంసయోగము లేడును, ఇక్షురసయోగం బొకటియు, వీరి యరువది వమనయోగములు చెప్పబడినవి.

(ఇత్తెరంగున ప్రథమాధ్యాయమున "తత్ర ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవ కుటజకృతవేధనానాం" అని నిర్దేశింపబడిన వమనౌషధములు ఆరిటికి వేరువేరుగ కల్పనాభేదములచే వమనౌషధయోగములు (౩౫౫) మూడువందలు యేబదియైదును వాని యుపయోగక్రమంబును పైయధ్యాయము లారిటివే సంతరించి చెప్పబడినవి.)

అధ్యాయసమాప్తిః.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే, చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే,
కల్పస్థానే, కృతవేధనకల్పో నామ షష్ఠోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరక సంహిత యను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితకల్పస్థానమున కృతవేధన కల్పమనునది యారవయధ్యాయము సంపూర్ణము.

---

## సప్తమాధ్యాయము.

### (౭) శ్యామా-త్రివృత్కల్పము.

అవతరణిక:—వమనకల్పములు నిరూపించినపిమ్మట, ప్రథమాధ్యాయమున "శ్యామా త్రివృత్...దన్తీద్రవన్తీనాం" అని నిర్దేశింపబడిన విరేచనసమిత్తమై యుపయోగింపదగిన నల్లతెగడ మున్నగునౌషధములను విరేచనోపయోగ్యముగ గల్పించువిధానములు చెప్పబడును. అందును విరేచనద్రవ్యములలో "త్రివృత్ విరేచనానాం" అని అగ్ర్యాధికారమున చెప్పబడిన ప్రకారము త్రివృత్తు మిగుల శ్రేష్ఠంబును సుఖవిరేచనంబును నగుటం జేసి ప్రధానమైన త్రివృత్కల్పము మొదట చెప్పబడును:—

### అధ్యాయప్రారంభము.

మూ. అథాతః శ్యామాత్రివృత్కల్పం వ్యాఖ్యాస్యామః.
ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

వ్యా. వమనకల్పనముల జెప్పినపిదప విరేచనద్రవ్యములలో శ్యామా (నల్ల తెగడ త్రివృత్ (ఎఱ్ఱ తెగడ) అను ద్రవ్యముల రెంటిని విరేచనోపయోగ్యములుగ గల్పించువిధానము వివరించునధ్యాయమును భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనా రేకము గాకుండునట్లు చెప్పెదనని యర్థము. (శ్యామాత్రివృత్కల్పమని యధ్యాయసంజ్ఞ

ఇచ్చట వివరణమున "మూలం తు...మూలం యదరుణప్రభం" అను వాక్యవ చేత ఎఱ్ఱ తెగడయే ముఖ్యమని చెప్పబడును. అయినను దోషనివృత్తియందు నల్ల తెగ మిగుల గుణోత్తరమని యారెంటిలో నల్ల తెగడయే తొలుత నిర్దేశింపబడినది.

మఱియు నీయధ్యాయమున జెప్పబడు యోగములన్నియు నల్ల తెగడవైనను, ఎఱ్ఱ తెగడవైనను, ఈరెంటిని చేర్చియైనను దోషశరీరబలాదుల గమనించి తత్తదనుగుణముగ గల్పింపనగును. కావుననే యధ్యాయోపక్రమమున రెంటినిచేర్చి నిర్దేశింపబడినది.

### విరేచనములలో తెగడకు శ్రేష్ఠత్వము.

మూ. విరేచనే త్రివృన్మూలం శ్రేష్ఠమాహుర్మనీషిణః (మహర్షయః),
తస్యాస్సంజ్ఞా గుణాః కర్మ భేదః కల్పశ్చ వక్ష్యతే. 3

వ్యా. విరేచనవిషయమై తెగడవేరు మిగుల శ్రేష్ఠమని జ్ఞానగరిష్ఠులగు మునిపుంగవులు చెప్పెదరు. అట్టి తెగడకు సంబంధించిన పర్యాయనామములును, గుణంబులును, కర్మభేదంబును, విరేచనౌషధముగ నుపయోగింపదగిన కల్పనావిధానంబును ఈక్రింద చెప్పబడును.(ఇచ్చట "త్రివృన్మూలం" అనుపదముచేత రెండువిధములైన తెగడ సామాన్యముగ గ్రహింపబడును).

### తెగడ పర్యాయనామములు.

మూ. త్రిభణ్డీ త్రివృతా చైవ శ్యామా కూటరణా తథా,
(శ్యామా సువహా కోటరా తథా)
సర్వానుభూతిస్సువహా (సరళా) శబ్దైః పర్యాయవాచకైః. ౪

వ్యా. త్రిభండి, త్రివృత, శ్యామ, కూటరణ, సువహా, కోటర, సర్వానుభూతి, సువహా, (సరళ), అను నీపర్యాయనామములచే తెగడ సామాన్యముగ జెప్పబడును.

### తెగడసామాన్యగుణములు.

మూ. కషాయా మధురా రూక్షా విపాకే కటుకా చ సా,
కఫపిత్తప్రశమనీ రౌక్ష్యాచ్చానిలకోపనీ. ౫
సేదానీమౌషధైర్యుక్తా వాతపిత్తకఫాఽపహైః,
కల్పవైశేష్యమాసాద్య సర్వరోగహరా భవేత్. ౬

వ్యా. తెగడ కషాయమధురరసంబులును రూక్షగుణంబును కటువిపాకంబును కల్గియుండును. స్వభావముచేతనే కఫపిత్తముల శమింపజేయును. రూక్షగుణము కల్గియుండుటంజేసి వాతమును మాత్రము ప్రకోపింపజేయును.

అట్టివిశేషగుణములు కల తెగడను వాతపిత్తకఫహరములైన యౌషధముల జేర్చి యీక్రింద జెప్పబడు కల్పనావిశేషముల ననుసరించి కల్గించినయెడ, వాతాదిదోషములచే వేరువేరుగనైనను అన్నింటిచేనైనను సంభవించినరోగముల నన్నిటిని శమింపగల్గియుండును. (వాతహరౌషధయోగముచే వాతరోగములను, నైసర్గికగుణవిశేషముచే పిత్తకఫరోగములను హరించునని యర్థము.)

### తెగడభేదములు, అందు ఎఱ్ఱతెగడవేరుగుణములు.

మూ. మూలం తు ద్వివిధం తస్యాః శ్యామం చారుణమేవ చ,
తయోర్ముఖ్యతమం విద్ధి (శ్రేష్ఠతరం విద్ధి)
మూలం యదరుణప్రభమ్. ౭
సుకుమారే శిశౌ వృద్ధే మృదుకోష్ఠే చ తచ్ఛుభం,

వ్యా. పైజెప్పబడిన తెగడవేరు శ్యామవర్ణముగ నుండునది యొకటి, అరుణవర్ణముగ నుండునది వేరొకటి. (ఇట్టి వర్ణభేదములచే తెగడ రెండువిధములని భావము). ఆ రెంటిలోఁ నెఱ్ఱని తెగడవేరు మిగుల శ్రేష్ఠముగనుండును. అయ్యది సుకుమారులకును పసిబాలురకును వృద్ధులకును మృదువైనకోష్ఠముకలవారికిని విరేచనమునకై చాల ప్రశస్తముగ నుండును.(ఎఱ్ఱతెగడవేరు వ్యాపత్తులు లేక సుఖముగ విరేచనముజేయుస్వభావము కల్గినది యగుటంజేసి సుకుమారులకును, బాల-వృద్ధ - మృదుకోష్ఠులకును ఉపయోగింపదగినదని భావము.)

### నల్లతెగడవేరుగుణములు.

మూ. మోహయేదాశుకారిత్వాత్ శ్యామా క్షిణ్వీత మూర్ఛయేత్.
(కణ్ఠం క్షిణోతి చ.)

తైక్ష్ణ్యాత్ కర్షతి హృత్కణ్ఠం ఆశు దోషం హరత్యపి,
శస్యతే బహుదోషాణాం క్రూరకోష్ఠాశ్చ యే నరాః. ౯

వ్యా. నల్లనిరంగుకల తెగడవేరు **ఆశు**కారియగుటంజేసి చిత్తభ్రమము నొందించును. ధాతువుల క్షీణింపజేయును. తీక్ష్ణగుణమువలన హృదయమును కంఠమును లాగిపట్టును. ఐనను దోషములను శీఘ్రముగ హరించును. కావున నియ్యది ప్రబలముగ దోషసంచయము కలవారికిని కోష్ఠము కఠినముగనుండువారికిని మిగుల శ్రేష్ఠముగ నుండును.

### త్రివృత్తును గ్రహించువిధి.

మూ. గుణవత్యాం తయోర్భూమౌ జాతం మూలం సముద్ధరేత్,
ఉపోష్య ప్రయతః శుక్లే శుక్లవాసాస్సమాహితః. ౧౦
గమ్భీరానుగతం శ్లక్ష్ణం అతిర్యగ్విస్సృతం చ యత్,
తద్విపాట్యోద్ధరేద్గర్భం త్వచం శుష్కాం నిధాపయేత్. ౧౧

వ్యా. మొదటియధ్యాయమునందు ఓషధిగ్రహణప్రస్తావమున జెప్పబడినగుణము గల ప్రశస్తభూమియందు పుట్టిన పైజెప్పినరీతిగ రెండువిధములైన తెగడవేరును, శుక్లపక్షమున నుపవాసముచేసి తెల్లనివస్త్రమును ధరించి నిశ్చలచిత్తుడై గ్రహించవలెను. అట్టివేరు భూమిలో మిక్కిలి లోతునకు దిగి గణుపులు లేక నునుపుకల్గి యుండవలెను. అడ్డముగ భూమిలో వ్యాపించియుండు వేరును గ్రహింపదగదు. అట్టి తెగడవేరును పైజెప్పిన నియమముతో గ్రహించి శుభ్రముగ కడిగి చీల్చి యందుండునరములను దూరంబుచ్చి పట్టను మాత్రము చక్కగ నెండించి విధ్యుక్తప్రకారము పదిలముగ నుంచునది.

ఇచ్చట ఔషధమున కుండవలసిన గుణంబులును, ఔషధగ్రహణస్థాపనవిధియు ప్రథమాధ్యాయమున జెప్పబడినరీతిగ నెరుంగునది.

### విరేచనౌషధోపయోగవిధి.

మూ. స్నిగ్ధస్విన్నో విరేచ్యస్తు పేయామాత్రోషితః సుఖం,

వ్యా. విరేచనముచేయించవలసిన వానికి తొలుత విధ్యుక్తప్రకారము స్నేహస్వేద విధులచేసి, ముందుదినమున పేయను మాత్రము ఆహారముచేయించి మరుసటినాడు సుఖముగ విరేచనము చేయించవలెను.

ఇచ్చట—సూత్రస్థానమున "అథైనం పునరేవ... పాయయేత్" (సూ. అ. ౧౫. సూ. ౨౫) అని చెప్పబడిన ఔషధసేవనవిధి ననుసరించునది.)

(110) ఈత్రివృత్కల్పమునందలి యోగములు నూటపది.
(9) అందు కాంజికాదులతో యోగములు తొమ్మిది.

మూ. అక్షమాత్రం తయోః పిణ్డం వినీయాఽమ్లేన నా పిబేత్. ౧౨
గోఽవ్యజామహిషీమూత్రసౌవీరకతుషోదకైః,
ప్రసన్నయా త్రిఫలయా శృతయా చ పృథక్ పిబేత్. ౧౩

వ్యా. పైజెప్పినరీతిగ గ్రహించి పదిలముగ నుంచబడిన నల్లతెగడ యెఱ్ఱతెగడల వేరుపట్టను వేరువేరుగనైనను రెంటినైనను (యథాయుక్తముగ) కర్షపరిమితమును నూరి ముద్దచేసి యాముద్దను పులిగంజిలో కలిపి విధ్యుక్తప్రకారము త్రాగవలెను. ఇత్తెరంగుననే గోమూత్రము, గొఱ్ఱెపంచితము, మేకపంచితము, బఱ్ఱెపంచితము, సౌవీరకము, తుషోదకము, సురామద్యముయొక్క తేట, త్రిఫలాకషాయము, అనునీద్రవములలో నొకదానిలో కలిపి త్రాగనగును (ఇత్తెరంగున త్రివృత్తునకు పైజెప్పిన కాంజికాది నవద్రవములలో వేరువేరుగనుపయోగముచే తొమ్మిదియోగములగును. ఈయోగములు "నీకోఽమ్లాదిభిరష్టౌ చ" అని సంగ్రహమున నిర్దేశింపబడును).

సైంధవాదులతో చేరిన త్రివృచ్చూర్ణరోగములు పండ్రెండు.

మూ. ఏకైకం సైన్ధవాదీనాం ద్వాదశానాం సనాగరం,
త్రివృద్ద్విగుణసంయుక్తం (త్రిగుణసంయుక్తం)
చూర్ణముష్ణాම్బునా పిబేత్ ౧౪

వ్యా. రోగభిషగ్జితీయాధ్యాయమునందలి లవణస్కంధమున జెప్పబడిన సైంధవాదిలవణములలో పండ్రెండులవణముల నొకదానిని గ్రహించి దానికి సమభాగము శుంఠిని, ఈరెంటికిని ద్విగుణము త్రివృత్తును చేర్చి చూర్ణముచేసి సుఖోష్ణముగనుండు వేడినీళ్లలో కలిపి త్రాగునది. (ఇత్తెరంగున పండ్రెండులవణముల నొక్కొకదానితో చేయబడినయోగములు పండ్రెండగును. ఇయ్యవి "దశ ద్వౌ సైన్ధవాదిభిః" అని సంగ్రహమున చెప్పబడును.)

ఇచ్చట "సైన్ధవాదిభిః" అనుపదముచేత రోగభిషగ్జితీయాధ్యాయమున— సైన్ధవ - సౌవర్చల - కాల-బిడ-పాక్య-అనూప - కూప్య-వాలుకైలమూలకసాముద్ర - రోమక-ఔద్భిద-ఔషర-పాతేయక-పాంసుజాని" (వి. అ. ౮. సూ. ౧౮౧) అని నిర్దేశింపబడినలవణములలో పండ్రెండు గ్రహింపబడును.

(౧౮) తెగడకు మూత్రముతో యోగములు పదునెనిమిది.

మూ. పిప్పలీ పిప్పలీమూలం మరిచం గజపిప్పలీ,
సరలః కిలిమం హిఙ్గు భార్ఙ్గీ తేజోవతీ తథా. ౧
ముస్తం హైమవతీ పథ్యా చిత్రకో రజనీ వచా,
స్వర్ణక్షీర్యజమోదా చ శృఙ్గవేరం చ తైః పృథక్. ౧
ఏకైకార్ధాంశసంయుక్తం పిబేద్గోమూత్రసంయుతం,

వ్యా. పిప్పళ్లు, మోడి, మిరియాలు, ఏనుగపిప్పళ్లు, సరళదేవదారు, కిలిమవ (దేవదారులోభేదము.), ఇంగువ, భారంగి, పెదవెక్కుడుతీగ, తుంగముస్తలు, తెల్లనివః కరక్కాయలు, చిత్రమూలము, పసుపు, వస, కంకుష్ఠము, ఓమము, శుంఠి, అనునీపద నెనిమిది ద్రవ్యములలో నొక్కొక్కవానిని అర్ధభాగంబుగను, తెగడచూర్ణము నొ భాగమును, కలిపి చూర్ణముచేసి గోమూత్రమున కలిపి త్రాగునది. పిప్పలిమున్నగ పదునెనిమిది ద్రవ్యములతో వేరువేరుగ గల్పించుటంజేసి యీయోగములు పదునెనిమి యగును. (ఇయ్యది "మూత్రే౽ష్టాదశ" అని సంగ్రహముగ నిర్దేశింపబడును.)

(౧) తెగడకు అతిమధురముతో యోగములురెండు, అందుమొదటియోగము.

మూ. మధుకార్ధాంశసంయుక్తం శర్కరాంబుయుతం పిబేత్. ౧౭

వ్యా. అర్ధభాగము నతిమధురమును నొకభాగమును తెగడచూర్ణమును చక్కెర పానకములో కలిపి త్రాగునది. ఈయోగమును క్రింద "యష్ట్యాహ్వావిధినా పిబేత్" అని చెప్పబడుయోగమును చేర్చి సంగ్రహమున "యష్ట్యాం ద్వౌ" అని నిర్దేశింపబడును.

(౧) తెగడకు జీవకాదులతో జేరినయోగములు పదునాల్గు అతిమధురయోగం బొకటియు.

మూ. జీవకర్షభకౌ మేదాం శ్రావణీం కర్కటాహ్వయం,
ముద్గమాషాఖ్యపర్ణ్యౌ చ మహతీం శ్రావణీం తథా. ౧౮
కాకోలీం, క్షీరకాకోలీం ఇన్ద్రాం భిన్నరుహాం తథా,
క్షీరశుక్లాం పయస్యాం చ యష్ట్యాహ్వాం విధినా పిబేత్. ౧౯
వాత-పిత్తహితాన్యేతాన్యన్యాని తు కఫానిలే,

వ్యా. జీవకము, ఋషభకము, మేద, పిన్నబోడతరము, కర్కాటకశృంగి, అడవి పెసర, అడవిమినుము, పెద్దబోడతరము, కాకోలి, క్షీరకాకోలి, పిన్నపాపర, తిప్పతీగ,

నేలగుమ్ముడు, మనుబాల, అతిమధురము, అను నీపదునైదు ద్రవ్యములలో నొక్కొక్క దానిని నర్ధభాగమును, తెగడచూర్ణము నొకభాగమును ప్రత్యేకముగా గలుపుచు పదునైదుయోగములుగ గల్పించి పైజెప్పిన విధ్యుక్తప్రకారము త్రాగునది. ఈయోగములు వాత-పిత్త-రోగములయందు విరేచనమునకై హితకరములుగా నుండును. తక్కినయోగములు కఫవాతసంసర్గమున నుపయోగింపదగును. (ఇచ్చట 'పయస్యా-అర్కపుష్పీ' యని చక్రపాణివ్యాఖ్యలో నున్నది. అర్కపుష్పి స్వనామఖ్యాతలతావిశేషమని భావప్రకాశమున నున్నది).

(ఇచ్చట జీవకాదిద్రవ్యముల పదునాల్గిటితో తెగడను వేరువేరుగ చేర్చిన నాల్గుయోగము లగును. అతిమధురముతో యోగముపై యోగముతో చేర్చి రెండుయోగములుగ నిర్దేశింపబడినది. తక్కిన పదునాల్గుయోగములును "జీవకాదౌ చతుర్దశ" అని నిర్దేశింపబడును).

### (౭) క్షీరాదులతో యోగము లేదు.

మూ. క్షీరమాంసేక్షుకాశ్మర్య ద్రాక్షాపీలురసైః పృథక్.　　　౨౦
సర్పిషా వా తయోశ్చూర్ణం అభయార్ధాంగికం పిబేత్,

వ్యా. ఆవుపాలు, మాంసరసము, చెరకురసము, నేలగుమ్మడిగడ్డరసము, ద్రాక్షపండ్ల రసము, కొండగోగుకాయలరసము, నెయ్యి అనునీద్రవములతో రెండువిధములయిన తెగడవ్రేళ్లలో నేదైన నొకదానిచూర్ణ మొకభాగమును, కరకకాయలచూర్ణ మర్ధభాగమును కలిపి త్రాగునది. ఇచ్చట క్షీరాదిద్రవము లేడిటితో నేడుయోగములుగ గల్పింపనగును. (ఇయ్యది 'క్షీరాదౌ సప్త' అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

### (౧౨) తెగడకు లేహయోగము లెనిమిది.

మూ. లిహ్యాద్వా మధుసర్పిర్భ్యాం సంయుక్తం ససితోపలమ్.　　　౨౧
అజగన్ధా తుగాక్షీరీ విదారీ శర్కరా త్రివృత్,
చూర్ణితం క్షౌద్రసర్పిర్భ్యాం లీఢ్వా సాధు విరిచ్యతే.　　　౨౨
సన్నిపాతజ్వరస్తంభదాహతృష్ణార్దితో నరః,

వ్యా. తెగడచూర్ణమును, శినాకలకండపొడిని, తేనెను, నేతిని వీనినన్నిటిని నొకటిగ కలిపి లేహము చేయదగును. ఓమము, వెదురుప్పు, నేలగుమ్మడిగెడ్డ, తెగడ వీనినన్నిటిని చూర్ణముచేసి అందు తేనెను నేతిని కలిపి నాకినను చక్కగ విరేచనమగును. ఈ

యోగములచేత సన్నిపాతజ్వరములను, మలమూత్రాదిస్తంభనమును, దప్పిని శమింప జేయును. (ఇవిరెండు లేహయోగములు).

—(3) మూడవలేహయోగము.—

మూ. శ్యామా త్రివృత్కషాయేణ కల్కేన చ సశర్కరమ్. ౨౩
సాధయేద్విధివల్లేహం లిహ్యాత్పాణితలం తతః,

వ్యా. రెండువిధములయిన తెగడవేళ్లయొక్క కషాయమును, వానికల్కచూర్ణమును, చక్కెరను కలిపి లేహపాకవిధిప్రకారము పక్వముచేసి, అందు కర్షప్రమాణము సేవించిన సుఖముగ విరేచనములగును. ఇచ్చట చక్కెరను, తెగడచూర్ణమును సమభాగములుగను, క్వాథమును, నాలవవంతును జేర్చి లేహపాకము చేయదగును. (ఇది మూడవలేహయోగము.)

—(౪) నాల్గవలేహయోగము.—

మూ. సక్షౌద్రాం శర్కరాం పక్త్వా కుర్యాన్మృద్భాజనే నవే. ౨౪
క్షిపేచ్ఛీతే త్రివృచ్చూర్ణం త్వక్పత్రమరిచైః సహ,
మాత్రయా లేహయేదేతత్ ఈశ్వరాణాం విరేచనమ్ ౨౫

వ్యా. తేనెను, చక్కెరను కలిపి పాకముచేసి యొకక్రొత్తమట్టిపాత్రలో నునిచి యందు తెగడచూర్ణమును, లవంగపుపట్ట, లవంగపుపత్రి, మిరియాలు, ఈమూడిటి చూర్ణమునుగూడ కలిపి యుక్తమైన పరిమాణములో సేవించిన చక్కగ విరేచనములగును. ఇయ్యది రాజయోగ్యములైన విరేచనయోగము.

ఇచ్చట శర్కరాపాకమునకు నాల్గవవంతు త్రివృచ్చూర్ణమును కలిపి, అందు సుగంధముకల్గుటకై లవంగపుపట్ట మున్నగువానిని యథోచితముగ చేర్పనగును. ఈయోగము కేవలము సుకుమారశరీరులును స్నిగ్ధశరీరులును నగువారికి నుపయోగింపదగియుండునని "ఈశ్వరాణాం విరేచనమ్" అని చెప్పబడినది. (ఇది నాల్గవలేహయోగము.)

—(౫) ఐదవలేహయోగము.—

మూ. కుడవాంశాక రసానిక్షుద్రాక్షాపీలుపరూషకాక,
సితోపలాపలం క్షౌద్రాత్ కుడవార్ధం చ సాధయేత్. ౨౬
తం లేహం యోజయేచ్ఛీతం త్రివృచ్చూర్ణేన శాస్త్రవిత్,
ఏతదుత్సన్న(దుత్కృష్ట)పిత్తానాం ఈశ్వరాణాం విరేచనమ్.

వ్యా. చెరకురసము, ద్రాక్షపండ్లరసము, వరగోగురసము, చిట్రీతరసము ఈరసములు ప్రత్యేక మొక్కొక కుడవము, చీనాకల్కుండ పలము, తేనె అర్ధకుడవము. వీనినన్నిటి నొకటిగ గూర్చి లేహపక్వముచేసి యది చల్లబడినపిదప తెగడచూర్ణమును లేహమునకు నాల్గవపాలు ప్రక్షేపన్యాయానుసారము కలిపి యుంచునది. ఈలేహమును మిక్కిలి వృద్ధినొందినపిత్తముల సుకుమారులకు విరేచనమునకై యుపయోగింపందగును. (ఇది యైదవ లేహయోగము.)

(౮) శర్కరామోదకాదియోగములు నాల్గు.

మూ. శర్కరామోదకా వర్తిః గులికామాంసపూపకాః,
అనేన విధినా కుర్యాత్ పైత్తికానాం విరేచనమ్. ౨౭

వ్యా. శర్కరయందు పైజెప్పబడిన చెరకురసము మున్నగు నాల్గురసములను ప్రత్యేక మొక్కొకకుడవమువంతునను, అర్ధకుడవము తేనెను కలిపి పైజెప్పినరీతిగ పక్వముచేసి, అందు త్రివృచ్చూర్ణమును కలిపి యాలేహపాకముచేతనే మోదకములను, వర్తులను, గులికలను, మాంసముతో కూడిన యపూపములను కూడ సిద్ధముచేయనగును. ఈనాల్గుయోగములును పిత్తవికారములయందు విరేచనమున కుపయోగింపందగును. (ఇచ్చట చెరకురసము మున్నగుద్రవములను చక్కెరతో కలిపి మోదకాదులనిర్మించుటకు దగునట్లు పాకముచేయదగును.) ఈయోగములు "చత్వారస్సితయాపి చ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౬) ఆరవది లేహయోగము.

మూ. పిప్పలీం నాగరం క్షారం శ్యామాం త్రివృతయా సహ,
లేహయేన్మధునా సార్ధం శ్లేష్మలానాం విరేచనమ్. ౨౮

వ్యా. పిప్పళ్లు, శుంఠి, యవక్షారము, నల్లతెగడవేళ్లు, ఎఱ్ఱతెగడవేళ్లు వీనినన్నిటిని చూర్ణముచేసి తేనెలో కలిపి సేవించనగును. ఇయ్యది కఫము ప్రకోపించినవారికి విరేచనమునకై యుపయోగింపనగును. (ఇది యారవలేహయోగము).

(౭) ఏడవది లేహయోగము.

మూ. మాతులుఙ్గాఽభయాధాత్రీశ్రీపర్ణీకోలదాడిమాత్,
సుభృష్టాః స్వ(సు)రసాః తైలే సాధయేత్ తత్ర చావపేత్.
సహకారాత్ కపిత్థాచ్చ మధ్యం, అమ్లం చ యత్ఫలమ్,

పూర్వవద్బహలీభూతే త్రివృచ్చూర్ణం సమావపేత్ 30
త్వక్పత్ర కేసరైలానాం చూర్ణం మధు చ మాత్రయా,
లేహోఽయం కఫపూర్ణానా మీశ్వరాణాం విరేచనమ్. 32

వ్యా. మాదీఫలములరసము, కరకకాయలస్వరసము, ఉసిరికకాయలస్వరసము, పెద్దగుమ్మడికాయస్వరసము, రేగుపండ్లస్వరసము, పుల్లదానిమ్మరసము ఈస్వరసములను తైలము చేర్చి చక్కగ కాచి లేహపాకముగ జేసి యందు తీయమామిడిపండు గిజరును, వెలగపండులోని గుజ్జును, మాదీఫలము మున్నగువానిరసమును ప్రత్యేకము కుడవము వంతునగూర్చి ముద్దయగునట్లు పక్వముచేసి, అందు తెగడచూర్ణమును, లవంగపుపట్ట, లవంగపుపత్రి, నాగకేసరములు, ఏలకులు వీనిచూర్ణమును కూడ కలిపి, తేనెను మితముగ కలిపి లేహముచేయునది. ఇయ్యది కఫము ప్రకోపించియుండు సుకుమారులకు విరేచనమునకై యుపయోగింపదగును. ఇది యేడవలేహయోగము. ఇవియును 'త్రివృచ్ఛాణామ తాస్త్రిస్రః' అని చెప్పబడు లేహయోగంబును చేరి యెనిమిది యగును.

(౫) తెగడతో పానకాదియోగము లైదు.

మూ. పానకాని రసాన్ యూషాన్ మోదకాన్ రాగషాడబాన్,
అనేన విధినా కుర్యాత్ విరేకార్థం కఫాధికే. 33

వ్యా. పైజెప్పబడిన లేహవిధి ననుసరించి తెగడచూర్ణముతో పానకములను, మాంసరసములను, యూషములను, మోదకములను, రాగములతో కూడిన షాడబములను సిద్ధముచేసి, కఫం బధికముగ నున్నపుడు విరేచనమునకై యుపయోగింపందగును. (ఈ యోగములైదును "పానకాదిషు పఞ్చచ" అని సంగ్రహమున నిర్దేశింపబడును).

ఇచ్చట రాగషాడబము నిట్లు తెలియదగును—"క్వథితం తు గుడోపేతం సహకారఫలం నవం, తైలనాగరసంయుక్తం విజ్ఞేయో రాగషాడబః" ఇయ్యది సూత్రస్థానము నందలి యన్నపానవిధ్యధ్యాయమున వివరింపబడినది.

(౧) తర్పణయోగములు రెండు; అందు మొదటియోగము.

మూ. భృజ్గైలాభ్యాం సమం నీలీ, తైస్త్రివృత్, తైశ్చ శర్కరా,
చూర్ణం ఫలరసక్షౌద్రసక్తుభిస్తర్పణం పిబేత్. 34
వాతపిత్తకఫోత్థేషు రోగేష్వల్పానలేషు చ,
నరేషు సుకుమారేషు నిరపాయం విరేచనమ్. 35

వ్యా. దాల్చినచెక్క, ఏలకులు ఈరెండును సమభాగములు, ఈరెంటికిని సమభాగము నీలి, ఈమూటికిని సమభాగము తెగడ వేళ్లు, ఈనాల్గిటికిని సమభాగము చక్కెర, ఈభాగముల ప్రకారము వీనినన్నిటిని కూర్చి చూర్ణముచేసి దానిమ్మపండ్లరసములో కలిపి అందు తేనెను సత్తుపిండిని కలిపిన నయ్యది సంతర్పణమగును. దీనిని వాత-పిత్త-కఫరోగములయందును, జాఠరాగ్ని మందగించినవారికిని, సుకుమారులకును విరేచనమునకై యుపయోగించినచో నిరపాయముగ విరేచనములగును. (ఇది యొక సంతర్పణ చూర్ణయోగము. రెండవది "త్రివృతాం త్రిఫలాం...తద్యోజ్యం తర్పణే...యుక్తిషు" అని (౬౫. శ్లో)సంతర్పణయోగము చెప్పబడును. ఈరెంటిని చేర్చి "ద్వౌ చూర్ణే తర్పణే తథా" అని సంగ్రహమున నిర్దేశింపబడును.) ఇచ్చట "ఫలరసః...దాడిమరసః" అని చక్రపాణివ్యాఖ్యలో నున్నది. ఇయ్యది త్రిదోష సామాన్యమగుటంజేసి సర్వర్తుసామాన్యమగును.

### (౫) ఐదు మోదకయోగములు, అందు మొదటియోగము.

మూ. శర్కరా త్రిఫలా శ్యామా త్రివృత్పిప్పలిమాక్షికైః,
మోదకస్సన్నిపాతోర్ధ్వరక్తపిత్తజ్వరాపహః. ౩౬

వ్యా. చక్కెర, త్రిఫలములు, నల్లతెగడ, ఎఱ్ఱతెగడవేళ్లు, తేనె వీనినన్నిటిని కూర్చి మోదకముల జేసి విరేచనమునకై యుపయోగించిన సన్నిపాతంబును, ఊర్ధ్వగత రక్తపిత్తంబును, జ్వరంబును శమించును. (ఇది యొక మోదకయోగము.)

ఇచ్చట త్రిఫలాదిద్రవ్యములను చూర్ణముచేసి చూర్ణమునకు ద్విగుణితమైన చక్కెరను పాకముబట్టి, యందు చూర్ణమును తేనెను కలిపి మోదకముల జేయునది.

### (౮) ఎనిమిదవ లేహయోగము.

మూ. త్రివృచ్ఛ్యామా మతాస్తిస్రః తిస్రశ్చ త్రిఫలాత్వచః,
విడఙ్గపిప్పలీక్షారశాణాస్తిస్రశ్చ చూర్ణితాః. ౩౭
లిహ్యాత్ సర్పిర్మధుభ్యాం చ, మోదకం వా గుడేన తు,
భక్షయేన్నిష్పరీహారం ఏతత్ శోధనముత్తమమ్
(ఏతత్ శ్రేష్ఠం విరేచనమ్). ౩౮
గుల్మం ప్లీహోదరం శ్వాసం (కాసం) హలీమకమరోచకం,
కఫవాతకృతాంశ్చాన్యాన్ వ్యాధీనేతద్వ్యపోహతి. ౩౯

వ్యా. తెగడవేళ్లు పట్ట మూడుశాణములు, త్రిఫలములబెరడు మూడుశాణములు, వాయువిడంగములును పిప్పళ్లును యవక్షారంబును చేరి మూడుశాణములు. ఇత్తెరంగున వీనినన్నిటిని కూర్చి చూర్ణముచేసి తేనెను నేతిని కలిపి సేవించునది. లేక పైజెప్పిన చూర్ణమును బెల్లముపాకమున కలిపి మోదకములుగ జేసి సేవించనగును. ఇయ్యది నిర పాయమైన విరేచనయోగము. దీనివలన గుల్మంబును, ప్లీహంబును, ఉదరంబును, శ్వాస కాసములును, హలీమకంబును, అరోచకంబును, కఫవాతములచే జనించిన యితరరోగంబు లును నివర్తించును. (ఇది యెనిమిదవ లేహయోగము. ఇచ్చట మోదకయోగంబును చెప్ప బడినది. అయినను "లిహ్యాద్వా మధుసర్పిర్భ్యాం......ఈశ్వరాణాం విరేచనం" (శ్లో. ౨౧-౩౨) అనుగ్రంథమున జెప్పబడిన లేహయోగముల నేడిటిని, ఈలేహయోగమును జేర్చి సంగ్రహమున 'లేహాోఽష్టౌ' అని పరిగణనముచేసియున్నది. ప్రకారాంతరముగ నీయోగమున జెప్పిన మోదకభేదంబును లేహమునందే యంతర్భూతమగునని యుద్దేశించి తంత్రకారులు చెప్పినట్లు తోచెడి.)

(౨) రెండవ మోదకయోగము; (కల్యాణగుడము).

మూ. విడఙ్గపిప్పలీమూలత్రిఫలాధాన్యచిత్రకాః,
మరిచేన్ద్రియవాఽజాజీ పిప్పలీహస్తిపిప్పలీః. ౪౦
లవణాన్యజమోదాం చ చూర్ణితం కార్షికం పృథక్,
తిలతైలత్రివృచ్చూర్ణభాగౌ చాష్టపలోన్మితే. ౪౧
ధాత్రీఫలరసప్రస్థాః త్రీః, గుడార్ధతులాం తథా,
పక్త్వా మృద్వగ్నినా ఖాదేత్ బదరోదుమ్బరోపమాః. ౪౨
గుడాః కృత్వా, న చాత్ర స్యాత్ విహారాహారయన్త్రణా,
మన్దాగ్నిత్వం జ్వరం మూర్ఛాం మూత్రకృచ్ఛ్రమరోచకమ్. ౪౩
అస్వప్నం గాత్రశూలం చ కాసం శ్వాసం భ్రమం క్షయం,
కుష్ఠార్శః కామలామేహగుల్మోదరభగన్దరాః. ౪౪
గ్రహణీపాణ్డురోగాంశ్చ హన్యుః పుంసవనాశ్చ తే,
కల్యాణకా ఇతి ఖ్యాతాః సర్వేష్వృతుషు యౌగికాః. ౪౫
(ఇతి కల్యాణకగుడః)

వ్యా. వాయువిడంగములు, మోడి, త్రిఫలములు, దనియాలు, చిత్రమూలము, మిరియాలు, కొడిసెపాలవిత్తులు, జీలకర, పిప్పళ్లు, ఏనుగుపిప్పళ్లు (పెద్దపిప్పళ్లు), పంచ

లవణములు, ఓమము వీనిని వేరువేరుగ ఒక్కొక కర్షమువంతున గ్రహించి చూర్ణముచేసి యుంచుకొనునది; నువ్వులనూనె యెనిమిదిపలములు, తెగడచూర్ణము ఎనిమిదిపలములు, ఉసిరికపండ్లరసము మూఁడుప్రస్థములు, ఏబదిపలములు బెల్లము, పైజెప్పిన ద్రవమున బెల్లము పాకముబట్టి, అందు పైజెప్పిన విడంగాదిచూర్ణమును తెగడచూర్ణమును కూడ కలిపి మృద్వగ్నిచే వండి పక్వమైనపిదప, రేగుపండంతేసియైనను అత్తిపండంతేసియైనను గుడికలుచేసి సేవింపదగు. దీనిని సేవించునపుడు ఆహారవిహారములవిషయమై నియమము లేదు. దీనివలన అగ్నిమాంద్యంబును, జ్వరంబును, మూర్ఛయు, మూత్రకృచ్ఛ్రంబును, అరోచకంబును, నిదురబట్టకుండుటయు, ఒడలినొప్పులును, శ్వాసకాసంబులును, ఒడలు తిరుగుటయు, ధాతుక్షయంబును, కుష్ఠంబును, అర్శోరోగంబును, కామలయు, ప్రమేహంబును గుల్మంబును, ఉదరంబును, భగందరంబును, గ్రహణిరోగంబును, పాండురోగంబును, నివర్తించును. మరియు నీగుడికలు పురుషసంతానమును కల్గించును. ఇవి కల్యాణకగుడికలని చెప్పబడును. మరియు నివి వసంతాదిఋతువులన్నిటియందు నుపయోగింపందగియుండును. (ఇది రెండవమోదకయోగము).

(3) తెగడను వ్యోషాదులతో మూఁడవ మోదకయోగము).

మూ. వ్యోషత్వక్పత్రముస్తైలావిడఙ్గామలకాఽభయాః,
సమభాగా భిషగ్దద్యాత్, ద్విగుణం చ మకూలకమ్. ౪౬
త్రివృతోఽష్టగుణం భాగం, శర్కరాయాశ్చ షడ్గుణం,
చూర్ణితం గుడికాః కృత్వా క్షౌద్రేణ పలసమ్మితాః. ౪౭
భక్షయేత్, కల్యముత్థాయ శీతం చాను పిబేజ్జలం,
మూత్రకృచ్ఛ్రే జ్వరే వమ్యాం కాసే శ్వాసే భ్రమే క్షయే. ౪౮
తాపే పాణ్డ్వామయేఽల్పేఽగ్నౌ శస్తా నిరత్యన్త్రణాశినః,
యోగస్సర్వవిషాణాం చ మతశ్శ్రేష్ఠో విరేచనే. ౪౯
మూత్రజానాం చ రోగాణాం విధిజ్ఞైనాఽవచారితః,

వ్యా. త్రికటుకములు, లవంగపుపట్ట, లవంగపుపత్రి, తుంగగెడ్డలు, ఏలకులు, వాయువిడంగము, ఉసిరికకాయలబెరడు, కరకకాయలబెరడు ఇవియన్నియు సమభాగములు, నేపాళపువేళ్లు రెండుభాగములు, తెగడవేళ్లపట్ట ఎనిమిదిభాగములు, చక్కెర యెనిమిదిభాగములు వీనినన్నిటిని పైజెప్పినభాగములప్రకారము చేర్చి ఔషధముల

నన్నిటిని మెత్తని చూర్ణముచేసి చక్కెరపాకములో కలిపి పక్వముచేసి, యందు మోదకములుగ చేయుటకు వలసినంత తేనెను కలిపి యొక్కొక పలపరిమితముగ మోదకముల గల్పించునది. ఈ మోదకములను పూటకొకటివంతున ప్రాతఃకాలముననే లేచి సేవించి వెంటనే చల్లనినీళ్లను (అనుపానముగ) త్రాగవలెను.

ఈ మోదకములను మూత్రకృచ్ఛ్రము, జ్వరము, వాంతి, శ్వాసకాసములు, భ్రమము (ఒడలుతిరుగుట), ధాతుక్షయము, తాపము, పాండురోగము, అగ్నిమాంద్యము, అను నీవ్యాధులయందెల్ల విరేచనమునకై సేవింపందగును. ఇయ్యది సర్వవిషములయందును శ్రేష్ఠమైనవిరేచనౌషధము. మూత్రవ్యాధు లన్నింటియందు నుపయోగింపందగును. దీనిని సేవించునపుడు ఆహారవిహారముల నియమము లేదు. దీనిని ప్రయోగసమర్థుడైన వైద్యుడు దేశకాలాదుల కనుగుణముగ నుపయోగించినచో పైజెప్పిన వ్యాధులన్నియు శమించును. (ఇది మూడవ మోదకయోగము.)

ఇచ్చట భాగకల్పనమున "ద్విగుణం చ మకూలకమ్" ఇది మున్నగుచోట నేపాళము మున్నగువానిభాగము పైజెప్పినసమభాగద్రవ్యములలో నొకద్రవ్యభాగమునకు ద్విగుణాదిగ నుండునట్లు కల్పింపవలెను. కొందరు త్రికటుకాదిద్రవ్యసముదాయమునకు ద్విగుణాదికభాగకల్పనము చెప్పిరి. ఈరెండు పక్షములును చక్రపాణివ్యాఖ్యానమున జూపియున్నాడు.

### (౪) తెగడకు పథ్యాదులతో మోదకయోగము నాల్గవది.

మూ. పథ్యా ధాత్ర్యోరుబూకాణాం ప్రసృతౌ ద్వౌ త్రివృత్పలమ్.
దశ తాన్ మోదకాన్ కుర్యాత్ ఈశ్వరాణాం విరేచనం,

వ్యా. కరకకాయలబెరడు, ఉసిరికకాయలబెరడు, ఆముదపువేళ్లు ఈమూడును చేరి రెండు ప్రసృతములు(నాల్గుపలములు), తెగడ యొకపలము, వీనిని చూర్ణముచేసి విధ్యుక్త ప్రకారము పది మోదకములుచేసి యుపయోగించునది. ఇయ్యది మిక్కిలి సుకుమారులగు ప్రభువులకు విరేచనమునకై యుపయోగింపదగును. (ఇది నాల్గవ మోదకయోగము.)

### (౫) ఐదవ మోదకయోగము.

మూ. త్రివృద్వైమవతీ శ్యామా నీలినీ హస్తిపిప్పలీ. ౫౧
సమూలా పిప్పలీ ముస్తమజమోదా దురాలభా,
కార్షికం నాగరపలం గుడస్య పలవింశతిమ్. ౫౨

చూర్ణితం మోదకాన్ కుర్యాత్ ఉదుమ్బరఫలోపమాన్,
హిఙ్గుసౌవర్చలవ్యోషయవానీబిడజీరకైః. ౫౩
వచాఽజగన్ధా త్రిఫలా చవ్యచిత్రకధాన్యకైః,
మోదకాన్ వేష్టయేచ్చూర్ణైః తాన్ సతుమ్బురుదాడిమైః. ౫౪
త్రికవంక్షణహృద్వస్తి కోష్ఠార్శః ప్లీహశూలినామ్. ౫౫
హిక్కా కాసాఽరుచిశ్వాసకఫోదావర్తినాం శుభాః (హితాః),

వ్యా. ఎఱ్ఱతెగడపట్ట, కరక్కాయలబెరడు, నల్లతెగడ, నీలివేళ్లు, పెద్దపిప్పళ్లు, మోడి, పిప్పళ్లు, తుంగగెడ్డలు, ఓమము, దురదగొండి ఇవి ప్రత్యేక మొక్కొక కర్షము; శుంఠి యొకపలము వీనినన్నిటిని చూర్ణముచేసి, యిరువదిపలములు బెల్లమును పాకముబట్టి, యందు పైజెప్పినచూర్ణమును కలిపి పక్వముజేసి యత్తిపండంతేసి మోదకముల జేయ నగును. మరియు ఇంగువ, సౌవర్చలలవణము, త్రికటుకము, ఓమము, బిడాలవణము, జీలకర, వస, వాయింట, త్రిఫలములు, చవ్యము, చిత్రమూలము, దనియాలు, తుంబురులు, దానిమ్మకాయలబెరడు వీనిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి యాచూర్ణమున పైని చెప్పబడిన మోదకములను నీమోదకములపై పూర్తిగ చూర్ణము కవచముభోలె నంటికొనియుండునట్లు చల్లి సేవించునది.

ఈమోదకములు—వెన్నెముకకు క్రిందిసంధియందును, గెజ్జలయందును, హృదయమునందును, వస్తియందును, కోష్ఠమునందును, నొప్పికలవారికిని; అర్శోరోగంబును, ప్లీహరోగంబును, హిక్కాకాసంబులును, అరుచియు, శ్వాసంబును, కఫరోగంబులును, ఉదావర్తంబును కలవారికిని విరేచనమునకై చాల హితకరములుగ నుండును. (ఇది యైదవమోదకయోగము. ఈమోదకయోగము లైదును "పఞ్చ మోదకాః" అని సంగ్రహమున నిర్దేశింపబడును. ఇచ్చట మోదక మనునది గుటికాపర్యాయము.)

(౬) వర్షాదిఋతువు లారిటియందును వేరువేరుగ నుపయోగింపదగిన త్రివృద్యోగము లారు, అందు వర్షర్తూపయోగ్యయోగము.

మూ. త్రివృతాం కౌటజం బీజం పిప్పలీం విశ్వభేషజం,
క్షౌద్రద్రాక్షారసోపేతం (సమృద్వీకారసక్షౌద్రం)
వర్షాస్వేతద్విరేచనమ్. ౫౬

వ్యా. తెగడ, కొడిసెపాలవిత్తులు, పిప్పళ్లు, శుంఠి, వీనిని సమభాగములు చూర్ణముచేసి తేనెను, ద్రాక్షపండ్లరసమును కలిపి వర్షఋతువునందు విరేచనమునకై సేవింపదగును.

శరత్కాలోపయోగ్యయోగము.

మూ. త్రివృద్దురాలభాముస్తశర్కరోదీచ్యచన్దనం,
ద్రాక్షామ్బునా సయష్ట్యాహ్వసాతలం జలదాత్యయే. ౫౭

వ్యా. తెగడ, దూలగొండివేళ్లు, తుంగగెడ్డలు, చక్కెర, వట్టివేరు, చందనము, అతిమధురము, సంబరేణు వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి ద్రాక్షపండ్లరసమున కలిపి శరదృతువునందు విరేచనమునకై సేవింపదగును. (ఇచ్చట సాతల అనునది తీగె జాతిలో చేరినది, అడవులలోనుండును. సంబరేణు అని లోకమున చెప్పబడును.

హేమంతోపయోగ్యయోగము.

మూ. త్రివృతాం చిత్రకం పాఠాం అజాజీం సరలం వచాం,
స్వర్ణక్షీరీం చ హేమన్తే పిష్ట్వా తూష్ణాంబునా పిబేత్. ౫౮

వ్యా. తెగడ, చిత్రమూలము, విషబొద్ది, జీలకర, సరలదేవదారుపట్ట, వస, స్వర్ణక్షీరి వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి వేడినీళ్లతో కలిపి నూరి హేమంతఋతువున విరేచనమునకై త్రాగునది.

గ్రీష్మోపయోగ్యయోగము.

మూ. శర్కరా త్రివృతా తుల్యా గ్రీష్మకాలే విరేచనం,

వ్యా. తెగడచూర్ణమును శర్కరతో సమభాగములుగ కలిపి గ్రీష్మఋతువునందు విరేచనమునకై యుపయోగింపదగును.

ఋతుసామాన్యముగను, శిశిరఋతువునందును ఉపయోగింపదగిన త్రివృద్యోగము.

మూ. త్రివృత్త్రాయన్తిహాపుషాః సాతలాం కటురోహిణీమ్. ౫౯
(హాపుషాం సప్తలాం శ్యామాం ద్రవన్తీం కటురోహిణీం)
స్వర్ణక్షీరీం చ సంచూర్ణ్య గోమూత్రే భావయేత్త్ర్యహం,
ఏష సర్వర్తుకో యోగః స్నిగ్ధానాం మలదోషహృత్. ౬౦

వ్యా. తెగడ, కలుకానుగ, బోడతరము, సంబరేణు, కటుకరోహిణి, స్వర్ణక్షీరి, వీనినన్నిటిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి గోమూత్రమునందు మూడుదినములు భావనచేసి యుంచుకొనునది. ఈచూర్ణమును శిశిరఋతువునందేకాక తక్కిన ఋతువు లన్నిటియందును సామాన్యముగ విరేచనమునకై యుపయోగింపదగును. మరియు స్నిగ్ధ శరీరులుగ నుండువారికి మలములను, త్రిదోషములను హరించుటకు ఇయ్యది ప్రశస్తముగ నుండును.

## వసంతర్తువునందును ఋతుసామాన్యముగను ఉపయోగింపందగిన త్రివృద్యోగము.

మూ. త్రివృచ్ఛ్యామా దురాలమ్భా వత్సకం హస్తిపిప్పలీ,
నీలినీ త్రిఫలా ముస్తం కటుకాచ సుచూర్ణితమ్. ౬౧
సర్పిర్మాంసరసోష్ణాంబుయుక్తం పాణితలం తతః,
పిబేత్సుఖతమం హ్యేతత్ (పిబేదేతత్ సర్వకాలం)
రూక్షాణామపి శస్యతే. ౬౨

వ్యా. యెఱ్ఱతెగడ, నల్లతెగడ, దూలగొండి, కొడిసెపాలవిత్తులు, ఏనుగపిప్పళ్లు, నీలివేరు, త్రిఫలములు, తుంగగడ్డలు, కటుకరోహిణి వీనినన్నిటిని మెత్తగ చూర్ణము చేసి నెయ్యి, మాంసరసము, వేడినీళ్లు అనుద్రవములతో కర్షమాత్రము కలిపి త్రాగవల యును. ఇయ్యది వసంతమునను సర్వఋతువుసామాన్యముగను ఉపయోగింపదగిన సుఖ మైన విరేచనయోగము. మరియు రూక్షశరీరులకును, ఇయ్యది ప్రశస్తముగ నుండును.

ఈవిరేచనయోగము లారును "షడృతౌ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

మూ. త్ర్యూషణం త్రిఫలా హిఙ్గు కార్షికం త్రివృతాపలం,
సౌవర్చలార్ధకర్షం చ ఫలార్ధం చామ్లవేతసాత్. ౬౩
తచ్చూర్ణం శర్కరాతుల్యం మద్యేనామ్లేన వా పిబేత్,
గుల్మపార్శ్వార్తినుత్ సిద్ధం జీర్ణే చాద్యాద్రసౌదనమ్. ౬౪

వ్యా. త్రికటుకములు, త్రిఫలములు, ఇంగువ, ఇవి ప్రత్యేక మొక్కకర్షము; తెగడ యొకపలము; సౌవర్చలవణము అర్థకర్షము, అమ్లవేతసము (పుల్లప్రబ్బలి) అర్థ పలము, ఈభాగము ప్రకారము అన్నిటిని చేర్చి చూర్ణముచేసి చూర్ణమునకు సమభాగము చక్కెరను కలిపి మద్యముతోనైనను, అమ్లకాంజికముతోనైనను చేర్చి త్రాగునది.

ఈయోగము గుల్మములయందును ప్రక్కనొప్పులయందును నుపయోగించినచో నవి శమించును. ఔషధము జీర్ణమైనపిదప మాంసరసముతో నన్నమును భుజింపనగును.

మూ. త్రివృతాం త్రిఫలాం దన్తీం సప్తలాం వ్యోషసైన్ధవం,
కృత్వా చూర్ణం తు సప్తాహం భావ్యమామలకీరసే. ౬౫
తదోజ్యం తర్పణే యూషే పిశితే రాగయుక్తిషు,

వ్యా. తెగడ, త్రిఫలములు, దంతి, (నేపాళపువేళ్లు) సంబరేణు, త్రికటుకములు, సైంధవలవణము వీనినన్నిటిని చూర్ణముచేసి ఉసిరికకాయలరసమునందు ఏడుదినములు భావనచేసి యూషమునందైనను, మాంసమునందైనను, రాగషాడబాదిపానకములందైనను, కలిపి త్రాగునది. ఇయ్యది సంతరణమునకై యుపయోగింపతగియుండును.

(౩) ఘృతయోగములు మూడు,
(౧) క్షీరయోగమొకటియు.

మూ. తుల్యామ్లం త్రివృతం కల్కసిద్ధం గుల్మహరం ఘృతమ్. ౬౬
శ్యామా త్రివృతయోర్మూలం పచేదామలకైః సహ,
జలే తేన కషాయేణ పక్త్వా సర్పిః పిబేన్నరః. ౬౭
శ్యామాత్రివృత్కషాయేణ సిద్ధం సర్పిః పిబేత్తథా,
సాధితం వా పయస్తాభ్యాం సుఖం తేన విరిచ్యతే. ౬౮

వ్యా. తెగడకల్కమును ఘృతమునకు నాల్గవవంతును ఘృతమునకు సమభాగము మాతులుంగాదిఫలముల పుల్లనిరసమును కలిపి ఘృతపాకవిధి ననుసరించి పక్వముచేసి త్రాగిన గుల్మముల హరించును. (ఇది యొకఘృతయోగము.)

ఎఱ్ఱని తెగడను నల్లతెగడను (ఈరెండిటివేళ్లను) ఉసిరికకాయలబెరడును జలమున జేర్చి విధ్యుక్తప్రకారము కషాయమును పక్వముచేసి, యాకషాయమును కలిపి ఘృతమును ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి విరేచనమునకై త్రాగనగును. (ఇది రెండవ ఘృతయోగము.)

రెండువిధములైన తెగడవేళ్లను రెంటినిమాత్రము సమభాగములుగ జలమునజేర్చి క్వాథముచేసి యాకషాయమున ఘృతమునుచేర్చి విధ్యుక్తప్రకారము ఘృతమును పక్వముచేసి విరేచనమునకై త్రాగనగును. (ఇది మూడవ ఘృతయోగము.)

ఎఱ్ఱతెగడవేళ్లను నల్లతెగడవేళ్లను ఆవుపాలలో చేర్చి క్షీరపాకవిధిప్రకారము క్షీరమును పక్వముచేసియైనను త్రాగునది.(ఇది క్షీరయోగమొకటి. పైజెప్పిన ఘృతయోగ

ముల మూటిని ఈక్షీరయోగ మొకటిని చేర్చి "చత్వారశ్చ ఘృతే క్షీరే" అని సంగ్రహమున నిర్దేశించియున్నది.)

(౨) తెగడకు సురాయోగములు రెండు.

మూ. త్రివృన్ముష్టీంస్తు సనఖాన్ అష్టౌ ద్రోణేఽమ్భసః పచేత్,
(జలద్రోణే త్రివృన్ముష్టీనష్టౌ తు సనఖాన్ పచేత్)
పాదశేషం కషాయం తం పూతం గుడతులాయుతమ్. ౬౯
స్నిగ్ధే స్థాప్యం ఘటే క్షౌద్రపిప్పలీఫలచిత్రకైః,
ప్రలిప్తే మధునా మాసం జాతం తత్ మాత్రయా పిబేత్. ౭౦
గ్రహణీపాణ్డురోగఘ్నం గుల్మశ్వయథునాశనం,
సురాం వా త్రివృతాయోగకిణ్వాం తత్క్వాథసంయుతామ్.
(సురాం వా త్రివృతా కిణ్వాం పిబేత్ తత్క్వాథసంయుతాం)

వ్యా. తెగడవేరుపట్టను ఎనిమిదిపిడికిళుల పరిమితమును ద్రోణపరిమితజలమున వైచి నాల్గవపాలు మిగుల కషాయముకాచి వడగట్టి, యందు నూరుపలములు బెల్లమును కలిపి, పిప్పళ్లను మ్రంగకాయవిత్తులను చిత్రమూలమును తేనె బోసి నూరి, నేతితో మాగిన యొకకుండలోభాగమున పూసి యాకుండయందు పైజెప్పినయౌషధమును బోసి వాసెనగట్టి యొకమాసము పదిలముగ నుంచునది. అయ్యది చక్కగ రసము దిగినపిదప యుక్తమైన పరిమితముగ గ్రహించి తేనెలో కలిపి సేవించునది. ఇయ్యది గ్రహణి రోగములను, పాండురోగములను, గుల్మములను, శోఫములను హరించును. (ఇది యొక సురాయోగము.)

లేక తెగడను కూడ చేర్చి సిద్ధముచేయబడిన సురాబీజముతో విధ్యుక్తప్రకారము సాధితమైన సురామద్యమునందు తెగడకషాయమును కలిపియైనను త్రాగవలెను.ఇది రెండవ సురాయోగము. (ఈయోగములు రెండును "ద్వే మద్యే" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౨) తెగడకు కాంజికముతో యోగములు రెండు, అందు సౌవీరకయోగము.

మూ. యవైః శ్యామా త్రివృత్క్వాథస్విన్నైః కుల్మాషమమ్భసా,
ఆసుతం షడహం పక్వే జాతం సౌవీరకం పిబేత్. ౭౧

వ్యా. యవలను తెగడకషాయమున నుడికించి పైపొట్టు నొలిచి నూరి యాపిష్ట మును నీళ్లతో కలిపి కుండలో బోసి మూతమూసి చీలమన్ను లేపనముచేసి ఆరుదినములు ధాన్యరాశినడుమ నునిచి, చక్కగ రసము దిగినపిదప నారసమును విరేచనమునకై త్రాగ నగును. (ఇది సౌవీరకమను కాంజికయోగము.)

సౌవీరకలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"సౌవీరం తు యవై రామైః పక్వై ర్వా నిస్తుషైః కృతమ్.

—● తుషోదకమను రెండవ కాంజికయోగము. ●—

మూ. భృష్టాన్వా సతుషాన్ శుద్ధాన్ యవాం_స్తచ్చూర్ణసంయుతాన్,
ఆసుతానమ్భసా తద్వత్ పిబేజ్జాతం తుషోదకమ్ 23

వ్యా. పొట్టుతోడి శుభ్రమైనయవలను వేయించి నలుగగొట్టి తెగడచూర్ణముతో కలిపి నీళ్లలోబోసి మూతమూసి వాసెనగట్టి పైజెప్పినరీతిగ నారుదినములు ధాన్యరాశి నడుమ నునిచి చక్కగ రసము కల్గినపిదప వడియగట్టి త్రాగునది. (ఇది తుషోదకమను రెండవకాంజికయోగము. ఈయోగముల రెంటిని జేర్చి "కాంజికే ద్వేచ" అని సంగ్రహమున నిర్దేశించియున్నది).

తుషోదకలక్షణము తంత్రాంతరమున నిట్లున్నది:—"తుషోదకం యవై రామైః సతుషైశ్శకలీకృతైః".

—● (౧౦) తెగడకు పాడబాదులతో పదియోగములు. ●—

మూ. యథా మదనకల్పోక్తాన్ షాడబాదీన్ పృథగ్దశ,
త్రివృచ్చూర్ణేన సంయోజ్య విరేకార్థం ప్రయోజయేత్. 24

వ్యా. తెగడచూర్ణమును షాడబ-రాగ-లేహ-మోదక-ఉత్కారికా-తర్పణ-పానక-మాంసరస-యూష-మద్యములను పదిటితో వేరువేరుగ చేర్చి పదియోగములను మదన కల్పోక్తప్రకారము కల్పించి విరేచనమునకై యుపయోగించునది. ఈయోగములు "దశాన్యే షాడబాదిషు" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

ఇచ్చట మదనకల్పమున—"తథా-బదర-షాడబ-రాగ-లేహ-మోదకో-త్కారికా-తర్పణ-పానక-మాంసరస-యూష-మద్యానాం" (క. అ. ౧) అని నిర్దేశింపబడిన షాడ బాదుల నెరుంగునది. దీనివివరణ మచ్చటనే చూచునది.

## { విరేచనౌషధమును సేవించునపుడు వాంతికాకుండుటకై మూడుయోగములు, ఉపచారములును. }

భవతశ్చాత్ర:—

మూ. త్వక్కేసరాఽఽమ్రాతకదాడిమైలా
సితోపలామాక్షికమాతులుఙ్గైః,
మద్యై స్తథాఽమ్లైశ్చ మనోఽనుకూలైః
యుక్తాని దేయాని విరేచనాని. ౭౫

శీతామ్బునా పీతవతశ్చ తస్య
సిఞ్చేన్ముఖం ఛర్దివిఘాతహేతోః,
హృద్యాంశ్చ మృత్పుష్పఫలప్రవాళా-
అమ్లం చ దద్యాదుపజిఘ్రణార్థమ్. ౭౬

వ్యా. మరియు లవంగపుపట్ట, నాగకేసరములు, ఆమ్రాతకము (అంబాళము, లేక రాచమామిడి), దానిమ్మపండ్లు, ఏలకులు, కండచక్కెర, తేనె, మాదీఫలములు ఈద్రవ్యములతో యథాలాభముగ జేర్చియైనను, మద్యములతో జేర్చియైనను దానిమ్మ మున్నగు పుల్లనిరసములతో గూర్చియైనను రోగికి వమనము గాకుండుటకై మనస్సు కింపుగానుండునట్లు సంస్కరించి విరేచనౌషధమును త్రాగింపనగును.(రోగికి ఔషధమువలన వమనము గాకుండుటకై విరేచనౌషధమునందు పైజెప్పిన త్వక్కేసరాదులు, మద్యములు, అమ్లరసములు అనుమూడుయోగములలో రోగిమనసు కింపైనదానిని చేర్చి త్రాగించవలెనని భావము.)

మరియు విరేచనౌషధమును త్రాగినవెంటనే వమనము రాకుండుటకై చల్లని నీళ్లను ముఖముపై చిలకరించి మనసుకు రమ్యమైన మృత్తు (మట్టిపెళ్లలు), పుష్పములు, ఫలములు, చిగుళ్లు, అమ్లరసములు మున్నగువాని మూర్కొనుటకై యియ్యవలెను. (పైజెప్పినవానిలో నెద్దానినైన నాఘ్రాణించినచో వమనముగాకుండునని భావము).

తత్ర శ్లోకాః.—

మూ. ఏకోఽమ్లాదిభిరష్టౌ చ, దశ ద్వే సైన్ధవాదిభిః,
మాత్రేఽష్టాదశ, యష్ట్యాం ద్వే, జీవకాదౌ చతుర్దశ. ౭౭

క్షీరాదౌ సప్త, లేహేఽష్టౌ, చత్వారస్సితయాపి చ,
పానకాదిషు పఞ్చైవ, షడ్ఋతౌ, పఞ్చ మోదకాః. ౭౮
చత్వారశ్చ ఘృతే క్షీరే, ద్వౌ చూర్ణే తర్పణే తథా,
ద్వౌ మద్యే, కాఞ్జికే ద్వౌ చ, దశాన్యే పాడబాదిషు. ౭౯
శ్యామాయాస్త్రివృతాయాశ్చ కల్పేఽస్మిన్ సముదాహృతం,
శతం దశోత్తరం సిద్ధం యోగానాం పరమర్షిణా. ౮౦

వ్యా. రెండువిధములయిన తెగడలకు సంబంధించిన ఈశ్యామాత్రివృత్కల్పమున అమ్లాదుల తోమ్మిదియు, సైంధవాదులతో చేరినయోగములు పండ్రెండును, గోమూత్రముతో పదునెనిమిదియోగంబులును, అతిమధురముతో రెండుయోగంబులును, జీవకాదులయందు పదునాల్గుయోగంబులును, క్షీర-మాంసాదులతో ఏడుయోగంబులును, లేహయోగంబులెనిమిదియు, మోదకాదిరూపమయిన సితా (శర్కరా) యోగములు నాల్గును, పానకాదులతో నైదుయోగంబులును, వర్షాదిఋతువులకు సంబంధించిన వేరువేరుయోగంబులారును, మోదకయోగము లైదును, ఘృతయోగములు మూడును, క్షీరయోగం బొకటియు కలిసి నాల్గు యోగంబులును, తర్పణచూర్ణయోగంబులు రెండును, మద్యయోగంబులు రెండును, సౌవీరక-తుషాంబురూపములగు కాంజియోగంబులు రెండును, పాడబాదియోగములు పదియు, ఇవియన్నియు కలిసి నూటపది విరేచనసిద్ధయోగములు ఋషివర్యుడగు నగ్నివేశునిచే నీయధ్యాయమున చెప్పబడినవి. ఈయోగములవివరణమంతయు నాయా యోగములయందే వ్యాఖ్యానము చేయబడినది.)

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే
కల్పస్థానే శ్యామాత్రివృత్కల్పో నామ సప్తమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నైన చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితంబైన కల్పస్థానమున శ్యామాత్రివృత్కల్పమనునది సప్తమాధ్యాయము సంపూర్ణము.

## అష్టమాధ్యాయము.

### (౧) చతురఙ్గుళకల్పము.

అవతరణిక:—మృదువిరేచనంబగు శ్యామాత్రివృత్కల్పంబుల జెప్పినపిదప వానిం బోలే మృదువిరేచనంబగు చతురంగుల (రేల) మునకు సంబంధించిన విరేచనకల్పములు చెప్పబడును.

మూ. అథాతః చతురఙ్గుళకల్పం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. శ్యామాత్రివృత్కల్పమును చెప్పినపిదప చతురంగుళమునకు (రేలకు) సంబంధించిన విరేచనకల్పనముల దెల్పునట్టి యధ్యాయమును భగవానుడగు నాత్రేయుడుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము

### చతురఙ్గులపర్యాయనామములు.

మూ. ఆరగ్వధో రాజవృక్షః శమ్పాకశ్చతురఙ్గుళః,
ప్రగ్రహః కృతమాలశ్చ కర్ణికారోఽవఘాతకః. 3

వ్యా. ఆరగ్వధ, రాజవృక్ష,శంపాక, చతురంగుళ, ప్రగ్రహ, కృతమాల, కర్ణికార, అవఘాతక అను నీపర్యాయనామములచే చతురంగుళము వ్యవహరింపబడును.

### చతురఙ్గుల (రేల) గుణములు వానియుపయోగము.

మూ. జ్వరహృద్రోగవాతాసృగుదావర్తాదిరోగిషు,
రాజవృక్షోఽధికం పథ్యో మృదుర్మధురశీతలః,
బాలే వృద్ధే క్షతే క్షీణే సుకుమారే చ మానవే,
యోజ్యో(దేయో) మృద్వనపాయిత్వాద్విశేషాచ్చతురఙ్గుళః. ౪

వ్యా. చతురంగుళమనునది మృదువిరేచనంబును, మృదుగుణము కల్గినదియు, శీతవీర్యముగ నైయుండును. జ్వరము, హృద్రోగము, వాతరక్తము, ఉదావర్తము, మున్నగురోగములచే పీడితులగువారలకు విరేచనమునకై యుపయోగించిన చాల హితకరముగనుండును. మరియు బాలురకును, వృద్ధులకును, ఉరఃక్షతముచే బాధితులకును, ధాతుక్షయముకలవారికిని, సుకుమారులకును, గూడ నియ్యది మృదువిరేచనంబై అనపాయముగ నుండుటనుపట్టి విశేషముగ నుపయోగింపదగియుండును.

## రేలను ఔషధోపయోగముగ చేయువిధము.

మూ. ఫలకాలే ఫలం తస్య గ్రాహ్యం పరిణతం చ యత్,
(రేచనార్థే పరిణతం ఫలం తస్యా హరేద్బుధః),
తేషాం గుణవతాం భారం (జాతం) సికతాసు నిధాపయేత్
సప్తరాత్రాత్ సముద్ధృత్య శోషయేదాతపే భిషక్,
తతో మజ్జానముద్ధృత్య శుచౌ భాణ్డే నిధాపయేత్.

వ్యా. రేలచెట్టు ఫలించుకాలమున చక్కగ పండి శుభ్రముగను, ఓషధిస్థాన మునను చెప్పియుండు ప్రశస్తగుణములు కల్గినవియునగు రేలపండ్లను సమృద్ధిగ గ్రహి ఇసుకలో ఏడురాత్రులు గడచునంతదాక పాతిపెట్టవలయును. పిదప నాఫలము గ్రహించి యెండలో చక్కగ నెండించి వానినొక్కొకదానిని చీల్చి వానిలోపలను మజ్జను (గిజరును) గ్రహించి పరిశుభ్రమయిన యొకమట్టిపాత్రలో నునిచి యౌషధ నుంచవలసిన పద్ధతిప్రకారము పదిలముగ నుంచుకొనవలయును.

(ఇచ్చట ఓషధిగుణములను ఓషధిగ్రహణవిధిని దానిని భద్రపరచువిధానవ మదనకల్పమున చెప్పినరీతి నెరుంగునది.)

## (౧-౨) రేలకు సంబంధించిన విరేచనయోగములు పండ్రెండు.
## (౧) అందు మొదటిది ద్రాక్షారసయోగము.

మూ. ద్రాక్షారసయుతం దద్యాత్ దాహోదావర్తపీడితే,
చతుర్వర్షసుఖే బాలే యావద్ద్వాదశవార్షికే.
చతురఙ్గులమజ్జస్తు ప్రసృతం వాఽథ వాఽఞ్జలిమ్,

వ్యా. రేలజిగురును రెండుపలములనైనను, నాలుగుపలములనైనను, ద్రాక్షపం రసమున కలిపి నాలుగువత్సరములమొదలు పండ్రెండువత్సరముల వయస్సుకు లోబడ బాలురకు ఉదావర్తము, తాపము అనువ్యాధులు సంభవించినపుడు విరేచనమున్న త్రాగించవలయును. (ఈయోగము "ద్రాక్షారసే" అని సంగ్రహమున చెప్పబడును.)

## (౨-౬) చతురంగులమునకు సురామున్నగు నైదిటితో నైదుయోగములు.

మూ. సురామణ్డేన సంయుక్తం, అథ వా కోలశీధునా. ౬
దధిమణ్డేన వా యుక్తం (సమ్యక్) రసేనామలకస్య వా,
కృత్వా శీతకషాయం తం పిబేత్సౌవీరకేణ వా. ౧౦

వ్యా. పైజెప్పబడిన రేలజిగురును సురయను మద్యముయొక్క పై తేటతోనైనను; రేగుపండ్లచే సిద్ధమయిన శీధుమద్యముతోనైనను; పెరుగుమీది తేటనీటితోనైనను; ఉసిరికపండ్ల రసముతోనైనను; కలిపి విరేచనమునకై త్రాగవలయును. మరియు రేలగుజ్జును శీతకషాయముగ సిద్ధముచేసి, యాకషాయమును సౌవీరకమను కాంజికముతో చేర్చియైనను త్రాగవలయును. (ఇవి యైదుయోగములు. ఈయోగము లైదును, "సురాశీధ్వోః దధ్ని చామలకీరసే సౌవీరకే" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౭-౮) రేలమజ్జకు కషాయయోగములు రెండు.

మూ. త్రివృతో వా కషాయేణ మజ్జః కల్కం తథా పిబేత్,
తథా బిల్వకషాయేణ లవణక్షౌద్రసంయుతమ్ ౧౧

వ్యా. తెగడను విధ్యుక్తప్రకారము క్వాథముచేసి, అందు రేలమజ్జను కలిపి త్రాగవలయును. ఇది ఏడవయోగము. మరియు బిల్వవేరును క్వాథముచేసి, అందు సైంధవలవణమును తేనెను కలిపి రేలమజ్జను చేర్చి త్రాగవలయును. ఇది యెనిమిదవ యోగము. (ఈకషాయయోగములు రెండును "కషాయే చ త్రివృతో బిల్వకస్య చ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౯) లేహయోగము తొమ్మిదవది.

మూ. కషాయేణాథవా తస్య త్రివృచ్చూర్ణం గుడాన్వితం,
సాధయిత్వా శనైర్లేహం లేహయేన్మాత్రయా నరమ్. ౧౨

వ్యా. రేలగుజ్జును చేర్చి క్వాథముచేసి యాక్వాథమున బెల్లము పాకముపట్టి, అందు తెగడచూర్ణమును కలిపి లేహపాకవిధిప్రకారము మందాగ్నిచే పక్వముచేసి తగిన పరిమాణముతో నాలేహమును విరేచనమునకై సేవింపతగును. ఈలేహము తొమ్మిదవ యోగము. (ఇయ్యది "లేహో" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౧౦) ఘృతయోగములు రెండు, అందు మొదటియోగము.

మూ. చతురఙ్గులసిద్ధాద్వా క్షీరాద్యదుదియాద్ఘృతం,
మజ్జః కల్కేన ధాత్రీణాం రసే తత్సాధితం పిబేత్. ౧౩

వ్యా. రేలగుజ్జును పాలలో కలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వముచేసి యా పాలనుండి తీయబడిననేతిలో రేలగుజ్జుకల్కమును ఉసిరికపండ్లరసమును చేర్చి ఘృతపాక

విధిప్రకారముచేసి యాఘృతమును విరేచనమునకై త్రాగవలయును. ఇది మొదటి ఘృత యోగము.

### (౧౧) రెండవ ఘృతయోగము.

మూ. తదేవ దశమూలస్య కులుత్థానాం యవస్య చ,
కషాయే సాధితం సర్పిః కల్కైః శ్యామాదిభిః పిబేత్. ౧౪

వ్యా. పైజెప్పబడినరీతిగ చతురంగులసిద్ధ క్షీరమునుండి తీయబడిన ఘృతమునందు దశమూలములను ఉలవలను చేర్చి క్వాథముచేయబడిన కషాయమును కలిపి మదనకల్పమున చెప్పబడిన యెఱ్ఱతెగడ నల్లతెగడ మున్నగు (శ్యామాది) ద్రవ్యముల తొమ్మిదిటిని కల్కముగజేసి కలిపి ఘృతపాకవిధిప్రకారము ఘృతమును సిద్ధముచేసి విరేచనమునకై త్రాగునది. ఇది రెండవఘృతయోగము. (ఈఘృతయోగములు రెండును 'ఘృతే ద్వేచ'అని సంగ్రహమున నిర్దేశింపబడును.

ఇచ్చట మదనకల్పమున "శ్యామా త్రివృత్ చతురఙ్గుళ తిల్వకమహావృక్ష సప్తలా శంఖినీ దన్తీ ద్రవన్తీనాం చ" (క. అ. ౧ సూ.) అని నిర్దేశింపబడిన శ్యామాది ద్రవ్యముల తొమ్మిదిటిలో యథాయోగ్యముగ వ్యాధ్యాదిబలానుసారముగ చేర్చి ఈఘృతమును సిద్ధముచేయనగును.

### (౧౨) అరిష్టయోగం బొకటి.

మూ. దన్తీక్వాథేఽఞ్జలిం మజ్జః శమ్యాకస్య గుడస్య చ,
దత్వా మాసార్ధమాసస్థమరిష్టం పాయయేత చ. ౧౫

వ్యా. నేపాళపువేళ్ల కషాయమున నాలుగుపలముల రేలగుజ్జును కలిపి బెల్లమును చేర్చి యొకమట్టిపాత్రలో పోసి పైన మూతమూసి యొకటిన్నరమాసమువరకు ధాన్యరాశిలో నునిచి సిద్ధమయిన యాయరిష్టమును విరేచనమునకై తగుప్రమాణము త్రాగనగును. ఈయరిష్టయోగము పండ్రెండవది. (ఇయ్యది "అరిష్టే" అని సంగ్రహమున నిర్దేశింపబడును. ఇచ్చట అరిష్టసంధానమునకు కావలసినపాత్ర సంస్కారము మున్నగునవి పరిభాషానుసారముగ నెరుంగదగు.

మూ. యస్య యత్పానమన్నం చ,(అమ్లం చ) హృద్యం స్యాద్వాథవా కటు,
లవణం వాభవే త్తేన యుక్తం దద్యాద్విరేచనమ్. ౧౬

వ్యా. మరియు మనుజునకు మధుర-కటు-లవణరసములలో నేరసముతో కూడిన యన్నపానములు రుచించునో, అట్టి యన్నపానములయందు విరేచనౌషధమును చేర్చి విరేచనమున కుపయోగింపదగును. (అట్లు చేసినచో మనస్సున కింపగుటచేత ఔషధము వాంతికాక ఇమిడి చక్కగ పనిచేయును.)

### అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

మూ. ద్రాక్షారసే సురాశీధ్వోః దధ్ని చామలకీరసే,
సౌవీరకే, కషాయే చ త్రివృతో బిల్వకస్య చ. ౧౭
లేహే, అరిష్టే, ఘృతే ద్వే చ, యోగాః ద్వాదశ కీర్తితాః,
చతురఙ్గులకల్పేఽస్మిన్ సుకుమారాః సుఖోదయాః. ౧౮

వ్యా. చతురఙ్గులకల్పమను నీయధ్యాయమున రేలకు ద్రాక్షారసముతో నొక యోగంబును; సురా-శీధు-దధి-ఆమలకరస-సౌవీరకముల నైదిటితో నైదుయోగంబులును; తెగడయొక్కయు, మారేడుయొక్కయు కషాయములు రెంటితో రెండుయోగంబులును; లేహయోగం బొకటియు, అరిష్టయోగం బొకటియు; ఘృతయోగంబులు రెండును; ఇవియన్నియు కలిసి పండ్రెండుయోగములు చెప్పబడినవి. ఈచతురఙ్గులయోగములు మిక్కిలి సుకుమారుల కుపయోగింపదగినవియు, సుఖమును కల్గించునవియునై యుండును.

### అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే
కల్పస్థానే చతురఙ్గులకల్పో నామ అష్టమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశప్రణీతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితమైన కల్పస్థానమున చతురఙ్గులకల్పమనునది యెనిమిదియవయధ్యాయము సమాప్తము.

---

## నవమాధ్యాయము.

(౯) తిల్వకకల్పము.

అవతరణిక:— రేలనుబోలె తిల్వకంబును (లొద్దుగ) అపాయము లేకయే విరేచన కారియగుటంజేసి చతురంగుళ (రేల) కల్పమును జెప్పినపిదప తిల్వకకల్పము (లొద్దుగను విరేచనౌషధముగ గల్పించువిధానము తెలుపుప్రకరణము) ఈక్రింద చెప్పబడును:—

మూ. అథాత స్తిల్వకకల్పం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. చతురంగుళకల్పమును జెప్పినపిదప తిల్వక(లొద్దుగ)మును విరేచనోపయోగ్య యోగములుగ గల్పించువిధానమును దెల్పునట్టియధ్యాయమును, భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

(తిల్వక(లొద్దుగ)పర్యాయనామములు.)

మూ తిల్వక స్తు మతో లోధ్రః బృహత్పత్త్ర స్తిరీటకః,

వ్యా. "తిల్వక-లోధ్ర-బృహత్పత్ర-తిరీటక" అను పర్యాయనామములచే లొద్దుగు చెప్పబడును.

(లొద్దుగచెట్టు పర్వతప్రాంతముల విశేషముగ పెరుగును. దీనిపువ్వులు తెలుపు పసుపు ఎరుపు రంగులుకల్గి యుండును).

లొద్దుగ నుపయోగించువిధి.

మూ. తస్య మూలత్వచం శుష్కాం అన్తర్వల్కలవర్జితామ్. 3
చూర్ణయేత్తు త్రిధా కృత్వా ద్వౌ భాగౌ శ్చోతయే త్తతః,
లోధ్రస్యైవ కషాయేణ తృతీయం తేన భావయేత్. ౪
భాగం తం దశమూలస్య పునః క్వాథేన భావయేత్,
శుష్కం చూర్ణం పునః కృత్వా తత ఊర్ధ్వం ప్రయోజయేత్.

వ్యా. దోషరహితమై ఓషధుల కుండవలసినగుణములతో కూడియుండు లొద్దుగ చెట్టువేళ్లను ఓషధిగ్రహణవిధ్యుక్తప్రకారము యుక్తకాలమున గ్రహించి, వానిలోనుండు కఠినములైన నరములను పీచును దూరంబుచ్చి, పట్టను మాత్రము గ్రహించి చూర్ణముచేసి మూడుభాగములుచేసి, యందు రెండుభాగములను క్వాథము (షడ్గుణజలమున)చేసి, యిరు

వదియొకసారి యాక్వాథమును వడగట్టి కషాయమును వంచుకొనునది. పిమ్మట మూడవ వంతు లొద్దుగపట్టను కల్కము(చూర్ణము)చేసి పైజెప్పినకషాయముననే భావనచేసి యెండించి మరల దశమూలములకషాయమున భావనచేసి మెత్తనిచూర్ణముచేసి యెండించి పదిలముగ (ఔషధము నుంచువిధిప్రకారము) నుంచుకొని ఆయాయోగముల నుపయోగింపందగును.

(ఇచ్చట మదనకల్పమున "ఫలపిప్పలీనాం ద్వౌ భాగౌ...త్రిస్సప్తకృత్వస్స్రావయేత్" (క. అ. ౧. సూ. ౨౬) అని చెప్పబడిన విధిప్రకారము తిల్వక(లొద్దుగ) వేళ్లను మూడుభాగములుచేసి, అందు రెండుభాగములచూర్ణమును లొద్దుగకషాయముననే యిరువదియొకసారి భావనచేసి వంచుకొని, యాకషాయమునందే లొద్దుగవేళ్లలో మూడవ భాగమును భావనచేసి, యెండించి, మరల దశమూలకషాయమున భావనచేసి యెండించి చూర్ణముచేయునది).

(౧౬) తిల్వకముతో విరేచనయోగములు పదునారు,
(౫) అందు దధిమండాదులతో నైదుయోగములు.

మూ. దధిమణ్డ సురామణ్డ మూత్రైః బదరశీధునా,
రసేనామలకానాం వా తతః పాణితలం పిబేత్. ౬

వ్యా. పెరుగుమీదితేట, సురయనుమద్యముపైతేట, గోమూత్రము, రేగుపండ్లరసముతో సిద్ధముచేయబడిన శీధుమద్యము, ఉసిరికకాయలరసము, ఈయైదుద్రవములలో వేరువేరుగ పైజెప్పబడిన లొద్దుగచూర్ణమును కర్షప్రమాణముకలిపి విరేచనమునకై త్రాగవలెను. (ఇవి యైదుయోగములు. ఈయోగము లైదును "పఞ్చ దధ్యాదిభిః" అని సంగ్రహమున నిర్దేశింపబడును).

(౬) లొద్దుగకు సౌవీరకముతో యోగ మొకటి.

మూ. మేషశృఙ్గ్యభయాకృష్ణా చిత్రకైః సలిలే శృతే,
మరుజా౯ సునుయాత్, తచ్చ జాతం సౌవీరకం యదా. ౭
భవేదఞ్జలినా తస్య లోధ్రకల్కం పిబేత్సదా,

వ్యా. మేషశృంగి (దుష్టుపువేరు), కరకకాయలబెరడు, పిప్పళ్లు, చిత్రమూలము, వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి నలుగగొట్టి నీళ్లలో బోసి క్వాథముచేసి వడగట్టి, యందు వేయించినబియ్యమును నలుగగొట్టి వైచి మూతమూసి వాసెనగట్టి ధాన్యరాశిలో

నునిచి అయ్యది జాతరసమైన సౌవీరక మనబడును. అందు అంజలి (నాల్గుపలముల) పరిమితమును గ్రహించి యొకకర్షప్రమాణము లొద్దుగచూర్ణమును కలిపి విరేచనమునకై త్రాగనగును. (ఇది సౌవీరకయోగము.)

(౭-౮) లొద్దుగ సురాయోగమొకటియు, అరిష్టయోగమొకటియు.

మూ. సురాం లోధ్రకషాయేణ జాతాం పక్షస్థితాం పిబేత్. ౭
దన్తీచిత్రకయోర్ద్రోణే సలిలస్యాఢకం పృథక్,
సముత్క్వాథ్య గుడస్యైకాం తులాం లోధ్రస్య చాఞ్జలిమ్. ౮
ఆవపేత్తత్ పరం పక్షాత్ మద్యపానాద్విరేచనం,

వ్యా. లొద్దుగుపట్టను జలమున జేర్చి క్వాథముచేసి, యాకషాయమున వరిపిండి మున్నగుపిష్టమును జేర్చి సురాసంధానవిధిప్రకారము మూసి వానెనగట్టి, అయ్యది చక్కగ రసము (పులుపు) గల్గునట్లు పదునైదుదినములు ధాన్యరాశిలో నుంచి, యాసురను మిత ప్రమాణముతో త్రాగిన విరేచనమగును. (ఇది సురాయోగము.)

మరియు నేపాళపువేళ్లు ఒక ఆఢకమును, చిత్రమూలము ఒకయాఢకమును ద్రోణ పరిమితజలమున వైచి క్వాథముకాచి యాకషాయమును వడగట్టి, యందు నూరుపలములు బెల్లమును, నాల్గుపలములు లొద్దుగుచూర్ణమును కలిపి, అన్నిటి నొకభాండమున బోసి యరిష్టసంధానవిధిప్రకారము మూతమూసి బిగించి, యొకపక్షముపరకును ధాన్యరాశిలో నునిచి, చక్కగ రసము కల్గినపిదప నామద్యమును లొద్దుగచూర్ణమును కలిపి త్రాగినచో చక్కగ విరేచనములగును. (ఇది యరిష్టయోగరూప విరేచనయోగము.)

పైజెప్పిన సౌవీరక-సురా-అరిష్టయోగములు మూడును సంగ్రహమున "ఏకా సురా-సౌవీరకేణ చ ఏకోఽరిష్టస్తథా యోగః" అని నిర్దేశింపబడును.

ఇచ్చట "శాలిషష్టికపిష్టాదికృతం మద్యం సురా స్మృతా" యను సురాలక్షణము నెరుంగునది. సౌవీరక-అరిష్టలక్షణములు స్థలాంతరమున జెప్పబడినవి.

(౯) కంపిల్లకయోగ మొకటి.

మూ. కమ్పిల్లక (తిల్వకస్య) కషాయేణ దశకృత్వస్సుభావితాం. ౧౦
మాత్రాం కమ్పిల్లకస్యైవ కషాయేణ పునః పిబేత్,

వ్యా. కంపిల్లకమను గంధద్రవ్యమును విధ్యుక్తప్రకారము కషాయము కాచి యాకషాయమున తిల్వక (లొద్దుగ) చూర్ణమును మితమైన ప్రమాణమును పదిమార్లు

మూ చూర్ణమును కమ్పిల్లకకషాయాను పానమున నే త్రాగినచో విరేచనమగును.
కమ్పిల్లకేన చ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౧౦) తిల్వకలేహయోగములు మూడు, అందు మొదటిది.

తురఙ్గులికకల్పేన లేహోఽస్యాః కార్య ఏవ చ. ౧౧

. చతురంగుళికల్పమున జెప్పబడిన లేహయోగవిధిప్రకారము లొద్దుగపట్టను
సారముగ కషాయము కాచి, యందు త్రివృచ్చూర్ణమును కలిపి బెల్లము
విధిప్రకారము లేహముచేయునది. ఇది యొక లేహయోగము. (ఇచ్చట
థవా తస్య... లేహయేన్మాత్రయా నరమ్" (క. అ. ౮. శ్లో.౧౨) అని చెప్ప
యోగవిధి నెరుంగునది.)

(౧౧) తిల్వకలేహయోగము రెండవది.

ఫలాయాః కషాయేణ ససర్పిర్మధుఫాణితః,
ధ్రచూర్ణయుతస్సిద్ధో లేహశ్శ్రేష్ఠో విరేచనే. ౧౨

. త్రిఫలముల క్వాథముచేసి యందు లొద్దుగుచూర్ణమును కలిపి చక్కెర
హపాకవిధిప్రకారము పక్వముచేసి, చల్లారినపిదప తేనెకలిపి యుపయోగించు
ష్ఠమైన విరేచనయోగము.

(౧౨) తిల్వకలేహయోగము మూడవది.

ల్వకస్య కషాయేణ కల్కేన చ సశర్కరః,
సృతః సాధితో లేహః స చ శ్రేష్ఠో విరేచనే(శ్రేష్ఠం విరేచనమ్.)

. లొద్దుగుపట్టను పరిభాషానుసారముగ కషాయము కాచి చక్కెరపాకమున
ను లొద్దుగచూర్ణమును నేతిని జేర్చి లేహపాకవిధిప్రకారము లేహమును
యుపయోగింపదగును. ఇది శ్రేష్ఠమైన విరేచనౌషధము. (ఈలేహయోగములు
లేహాస్త్రయః" అనువాక్యముచే సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౧౩-౧౬) ఘృతయోగములు నాల్గు, అందు మొదటియోగము.

స్థాఽష్టౌ త్రివృతాదీనాం ముష్టీంస్తు సనఖాన్ పృథక్,
ణేఽపాం సాధయేత్పాదశేషే ప్రస్థం ఘృతాత్పచేత్. ౧౪
స్తైరేవ బిల్వాంశైః సమూత్రలవణైరథ,
మాత్రాం పిబేత్కాలే శ్రేష్ఠమేతద్విరేచనమ్. ౧౫

వ్యా. 'శ్యామా-త్రివృత్......ద్రవంతీనాం చ' (కల్ప. అ. ౧.) అని చెప్ప బడిన నల్లతెగడ, తెల్లతెగడ, రేల, లొద్దుగు, జెముడు, దింటెన, సంబరేణు, నేపాళము, పెద్దనేపాళము అను నీతొమ్మిదివిరేచనద్రవ్యములను ప్రత్యేకము ఎనిమిదేసి పిడికెళ్లవంతున గ్రహించి ద్రోణపరిమితమైన జలమునజేర్చి నాల్గవభాగము మిగుల క్వాథముచేసి, యందు ప్రస్థమాత్రమును నేతిని పైజెప్పబడిన తెగడ మున్నగు తొమ్మిదిద్రవ్యములను ప్రత్యేక మొక్కొకపలమువంతున గూర్చి కల్కముచేసి, యాకల్కమును కూడ కలిపి ఘృతమునకు సమభాగము గోమూత్రమును, పలమాత్రము సైంధవలవణమును జేర్చి ఘృతపాకవిధి ప్రకారము పక్వముజేసి, యాఘృతమును అగ్నిబలాద్యనుసారముగ పరిమాణము గల్పించి త్రాగినచో విరేచనమగును. ఇదియును శ్రేష్ఠమైన విరేచనయోగము.

ఇచ్చట "సనఖాన్ ముష్టీన్" అనుచోట చేతనుండు గోళ్లను బొటనవ్రేలి గోరుతో కలియబట్టిన పిడికిలిలో నిముడునంత పరిమాణమని యర్థము. మరియు నీఘృత యోగమున లొద్దుగు ప్రధానము కావున తెగడ మున్నగువినుసుల నొక్కొకముష్టి ప్రమాణముగను, లొద్దుగునుమాత్రము ద్విగుణముగ(రెండుముష్టులుగ)ను గ్రహించవలెను. ఈవిషయమయనే జతూకర్ణతంత్రమున—"త్రివృదాది ద్విగుణో లోధ్రక్వాథః" అని స్ఫుటముగ జెప్పియున్నది.

### ఘృతయోగములు మూడు.

మూ. లోధ్రకల్కేన మూత్రామ్లలవణైశ్చ పచేద్ఘృతం,
చతురఙ్గుళకల్కేన సర్పిషీ ద్వే చ సాధయేత్. ౧౬

వ్యా. లొద్దుగుయొక్క కల్కమును ఘృతమునకు నాల్గవవంతును, అమ్లవర్గములో జేరిన నిమ్మకాయలు దానిమ్మ మున్నగువాని పులుపురసమును జేరి ఘృతమునకు నాలుగింత లును ఘృతమునగూర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి యుపయోగించునది.

మరియు చతురంగులకల్పమున"కషాయేణాథవా తస్య......లేహయేన్మాత్రయా నరమ్" (కల్ప అ. ౮. శ్లో. ౧౨.) అనియు; "చతురఙ్గుళసిద్ధాద్వా......సాధితం పిబేత్" (కల్ప అ.౮. శ్లో. ౧౩) అనియు చెప్పబడిన రెండుఘృతయోగముల ప్రకారము ఇచ్చట లొద్దుగునుకూర్చియు రెండుఘృతయోగముల గల్పించునది.ఎట్లులన:—లొద్దుగుచే సిద్ధమయిన క్వాథమున లొద్దుగుచూర్ణమును ఘృతమును కలిపి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయునది. ఇది యొకఘృతయోగము.

మరియు లొద్దుగుచూర్ణమును ఆవుపాలలో కలిపి క్షీరమును పక్వముచేసి దాన జనించినఘృతమున లొద్దుగుకల్కమును, ఉసిరికకాయలరసమును కలిపి ఘృతపాకవిధి ప్రకారము పక్వముచేయునది. ఇది యొక ఘృతయోగము. ఇత్తెరంగున "అష్టాష్టా త్రివృతాదీనాం" అని యుపక్రమించి ఘృతయోగములు నాల్గు చెప్పబడినవి. ఈనాల్గు యోగములును, "ఘృతేనాపి చత్వారః సంప్రకీర్తితాః" అని సంగ్రహమున నిర్దేశింప బడును.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

మూ. పఞ్చ దధ్యాదిభిః, త్వేకా సురా సౌవీరకేణ చ,
ఏకోఽరిష్టస్తథా యోగః, ఏకః కంపిల్లకేన చ. ౧౭
లేహాస్త్రయో, ఘృతేనాపి చత్వారస్సంప్రకీర్తితాః,
యోగాస్తే లోధ్రమూలానాం కల్పే షోడశ కీర్తితాః. ౧౮

వ్యా. లొద్దుగుప్రేళ్లకు సంబంధించిన విరేచనకల్పమున పెరుగు మున్నగువానితో నైదుయోగంబులును; సురా, సౌవీరకము, అరిష్టము అనువానితో నొక్కొక్క యోగంబును; కంపిల్లముతో నొకయోగంబును; లేహయోగములు మూడును; నాల్గు ఘృత యోగంబులును; చేరి విరేచనయోగములు పదునారు ఈతిల్వకకల్పాధ్యాయమున చెప్పబడినవి.

## అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే
కల్పస్థానే తిల్వకకల్పో నామ నవమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును, నయినచరక సంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితకల్పస్థానమున తిల్వకకల్ప మనునది నవమాధ్యాయము సమాప్తము.

## దశమాధ్యాయము.

### (౧౦) సుధాకల్పము.

అవతరణిక:—పదునారు విరేచనయోగముల దెల్పుతిల్వకకల్పమను పైయధ్యాయమును దెలిపినపిదప సంఖ్యాక్రమము ననుసరించి పైసంఖ్యకన్న నధికసంఖ్యాయైన యిరువది యోగముల దెల్పునట్టి సుధాకల్పము చెప్పబడును. ఇట్టి క్రమసంఖ్యాధిక్యమునుబట్టియే పైయధ్యాయముల రెంటికింగూడ ఆనంతర్యసంబంధము నెరుంగునది.

మూ. అథాతస్సుధాకల్పం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. తిల్వకకల్పమును జెప్పినపిదప సుధాకల్పము (బొంతజెముడు విరేచనయోగములుగ గల్పించువిధానమును దెలుపునధ్యాయము) భగవానుడగు నాత్రేయు డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరింపబడును.

### సుధా (జెముడు) ప్రయోగమునకర్హులు.

మూ. విరేచనానాం సర్వేషాం సుధా తీక్ష్ణతమా మతా,
సంఘాతం హి భినత్త్యాశు దోషాణాం కష్టవిభ్రమా. 3
తస్మాన్నైషా మృదౌ కోష్ఠే ప్రయోక్తవ్యా కదాచన,
న దోషనిచయే చాల్పే సతి మార్గపరిక్రమే (చాన్యపరిక్రమే). ౪

వ్యా. పలుదెరంగులైన విరేచనద్రవ్యములలో జెముడు మిక్కిలి తీవ్రమైనది. ఇయ్యది చాలకాలమునుండి వృద్ధిజెంది చేరియుండు దోషసంచయమును శీఘ్రముగ భేదించును. మిగుల కష్టసాధ్యములగు నుపద్రవముల గల్గించునది. కావున నట్టి తీవ్రమైన జెముడును మృదుకోష్ఠము కలవారికిని, దోషసంచయము స్వల్పముగ నుండువారికిని ఒకప్పుడు నుపయోగింపంజనదు. మరియు వ్యాధి యెట్టి క్రూరదశయందున్నను చికిత్స జేయ వేరుతెరవున్నపుడు దీని నుపయోగింపంజనదు. (వేరే చికిత్సాంతరముచే సాధ్యముగాక గత్యంతరాభావమున మాత్రము దీని నుపయోగింపదగుంగాని, ఇతరౌషధముల కవకాశమున్నపుడు జెముడును మానుట మంచిదని భావము.)

మరియు "మృదౌ కోష్ఠేఽబలే బాలే స్థవిరే దీర్ఘరోగిణి" (అ. హృ. కల్ప. అ. ౨) అని వాగ్భటులు చెప్పిరి కావున బలహీనులకును, బాలురకును, వృద్ధులకును, చిరకాలము రోగపీడితులకును దీని నుపయోగింపదగదని తెలిసెడి.

## జెముడు నుపయోగింపదగనివారు.

మూ. పాణ్డురోగోదరే గుల్మే కుష్ఠే దూషీవిషార్దితే,
శ్వయథౌ మధుమేహే చ దోషవిభ్రాన్తచేతసి. ౫
రోగైరేవంవిధైర్గ్రస్తం జ్ఞాత్వా సప్రాణమాతురం,
ప్రయోజయేన్మహావృక్షం సమ్యక్ స హ్యవచారితః. ౬
సద్యో హరతి (సుదతి) దోషాణాం మహాన్తమపి సంచయం,

వ్యా. పాండురోగము, ఉదరము, గుల్మము, కుష్ఠము, దూషీవిషము, వాపు, ప్రమేహములు, దోషప్రకోపముచే మనస్సు చంచలమైయున్న యున్మాదము అను నీరోగముల చేతను, వీనికి సమానములైన యితరవ్యాధులచేతను పీడితుడగురోగి బలము కల్గి యున్నయెడ ఆట్టిబలానుసారముగ జెముడును విరేచనమునకై యుపయోగింపదగును. అట్టి వ్యాధులయందు జెముడును విధ్యుక్తప్రకారముగ నుపయోగించినచో మిక్కిలి వృద్ధి నొందియున్న దోషసంఘాతమునైనను అతిశీఘ్రముగ హరించును.

(మధుమేహము అసాధ్యము కావున నిచ్చట మధుమేహశబ్దముచేత ప్రమేహసామాన్యము గ్రహింపబడును.)

## సుధాభేదములు.

మూ. ద్వివిధస్స మతోఽల్పైశ్చ బహుభిశ్చైవ కణ్టకైః. ౭
సుతీక్ష్ణైః కణ్టకైరల్పైః ప్రవరో బహుకంటకః,

వ్యా. జెముడు రెండు తెరంగులు. అందొకటి మిక్కిలి వాడికలముండ్లు కొద్దిగ కల్గియుండును. ఇంకొకటి దట్టముగ ముండ్లుకల్గి యుండును. రెంటిలో దట్టముగ ముండ్లు కల్గినది మిక్కిలి శ్రేష్ఠము.

## సుధాపర్యాయనామములు.

మూ. స నామ్నా స్నుక్ గుడాఽఽనన్దా సుధా నిస్త్రింశపత్రకః. ౮

వ్యా. పైచెప్పబడిన జెముడు స్నుక్, గుడ, ఆనంద, సుధ, నిస్త్రింశపత్ర, అను పర్యాయనామములచే జెప్పబడును.

## సుధాక్షీరగ్రహణవిధి; కాలము.

మూ. తం విపాట్యాఽఽహరేత్ క్షీరం శస్త్రేణ మతిమాన్ భిషక్,
ద్వివర్షం వా త్రివర్షం వా శిశిరాన్తే విశేషతః. ౯

వ్యా. పైఁజెప్పబడిన రెండువిధములైన జెముడును శిశిరఋతువునం
ములతో కత్తితో చీల్చి యందుండి స్రవించు జెముడుపాలను గ్రహించవ
మూడుసంవత్సరములకాలము గడచిన జెముడుచెట్టుపాలను గ్రహించుటకు
డును. (క్షీరగ్రహణమునకు "శరది త్వక్కన్దక్షీరాణాం" సామాన్యముగ
శింపబడినను, విశేషవిధిచే జెముడుపాలను మాత్రము శిశిరాంతమున గ్రహిం

—(౭) సుధాయోగములు ఇరువది. అందు సౌవీరకాదియోగములు ఏ

మూ. బిల్వాదీనాం బృహత్యా వా కణ్టకార్యా స్తథైకశః,
కషాయేణ సమాంశం తం కృత్వాఽఙ్గారేషు శోషయే
తతః కోలసమాం మాత్రాం పిబేత్ సౌవీరకేణ వా,
తుషోదకేన కోలానాం రసేనామలకస్య వా.
సురయా దధిమణ్డేన మాతులుఙ్గరసేన వా,

వ్యా. మారేడు మున్నగు మహాపంచమూలముల వేళ్లు, చిన్నములక
వేళ్లు, వీనిలో దేనినైన నొకదాని గ్రహించి క్వాథవిధిప్రకారము నాల్గవప
కషాయము కాచి దానికి సమభాగముగ (పైఁజెప్పినరీతిగ గ్రహింపబడిన) జెమ
గూర్చి యొకపాత్రలో బోసి నిప్పులమీద నునిచి, అయ్యది చుండి ముద్దగుగ
కాచి రేగుపండంతేసి మాత్రల జేయనగును. పిమ్మట నామాత్రను సౌవీరకవ
కము, తుషోదకము, రేగుపండ్లరసము, ఉసిరికకాయలరసము, సురయనుమద్యప
మీది తేటనీరు, మాదీఫలరసము, అను నీద్రవములతో నొకదాని యనుపానమ
నగును.

ఇచ్చట సౌవీరకాదిద్రవము లేడిటితో వేరువేరుగ నుపయోగించుటం
సుధాయోగములని యెరుంగునది. ఈయేడుయోగములును "సౌవీరకాదిభిః
సంగ్రహమున నిర్దేశింపబడును. కావున నే బిల్వాదికషాయభేదముల ననుసరిం
సంఖ్యను నిర్ణయింపదగదు.

—(౮-౯) ఘృత, మాంసరసములతో రెండు సుధాయోగములు.

మూ. సాతలాం కాఞ్చనక్షీరీం శ్యామాదీని కటుత్రికమ్
(ఫలత్రికమ్).
యథోపపత్తి సప్తాహం సుధాక్షీరేణ భావయేత్,
కోలమాత్రాం ఘృతేనాతః పిబేన్మాంసరసేన వా.

వ్యా. సంబరేణు, స్వర్ణక్షీరి, ప్రథమాధ్యాయమున "శ్యామాత్రివృత్ చతురంగుళ...ద్రవన్తీనాం చ"అని చెప్పబడిన తెగడ మున్నగు విరేచనద్రవ్యములు తొమ్మిది, త్రికటుకములు, అనునీద్రవ్యము దొరకినంతమట్టుకు గ్రహించి చూర్ణముచేసి, జెముడు పాలలో నేడుదినములవరకు భావనావిధిప్రకారము భావనజేసి అర్ధకర్షపరిమితమును నేతిలోనైనను మాంసరసములోనైనను కలిపి త్రాగునది. (ఇచ్చట ఘృత-మాంసరసములతో జేరిన సుధాయోగములు రెండని యెరుంగునది. ఈరెండుయోగములును "సర్పిషా చ రసేన చ"అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

మరియు "శ్యామాదీని" అను పదముచేత ప్రథమాధ్యాయమున జెప్పబడిన తెల్లతెగడ, నల్లతెగడ, రేల, లొద్దుగు, బొంతజెముడు, దంతెన, సంబరేణు, నేపాళము, పెద్దనేపాళము అను తొమ్మిది విరేచనద్రవ్యములు గ్రహింపబడు. మరియు శ్యామాది పదముచేతనే సాతల (సంబరేణు) గ్రహింపబడినను 'సాతలాం' అని వేరుగ చెప్పియుండుటచేత సంబరేణును మాత్ర మొక్కదానినే ప్రదానముగ గ్రహించి యౌషధమును కల్పించునపుడు తక్కినవానిలో దొరకినంతవరకు జేర్చవలెనని భావము.

(౧౦) పానకముతో జేరిన సుధాయోగ మొకటి.

మూ. త్ర్యూషణం త్రిఫలాం దన్తీం చిత్రకం త్రివృతాం తథా,
స్నుక్షీరభావితం సమ్యక్ విదధ్యాత్ గుడపానకమ్. ౧౪

వ్యా. త్రికటుకములు, త్రిఫలములు, నేపాళము, చిత్రమూలము, తెగడ ఈద్రవ్యములను యథాలాభముగ గ్రహించి చూర్ణముచేసి, పైయోగమున జెప్పినరీతిగ నేడుదినములు చక్కగ భావనజేసి బెల్లముచుజేర్చి సంస్కరించి సిద్ధముచేయబడిన పానకమున తగుమాత్రము కలిపి త్రాగినను చక్కగ విరేచనమగును. (ఇయ్యది సంగ్రహమున 'పానకం' అని నిర్దేశింపబడును.)

(౧౧) ఘ్రేయరూపమైనసుధాయోగ మొకటి.

మూ. త్రివృతారగ్వధం దన్తీం శఙ్ఖినీం సప్తలాం సమం,
గోమూత్రే రజనీం కృత్వా (నిశి స్థితాం గవాం మూత్రే)
శోషయేదాతపే తతః. ౧౫

సప్తాహం భావయిత్వైవం, స్నుక్షీరేణాఽపరం పునః,
సప్తాహం భావయేచ్ఛుష్కం తత స్తేనాపి భావితమ్. ౧౬

గన్ధమాల్యం తదాఘ్రాయ (సమాఘ్రాయ) ప్రావృత్యపట మేవ చ,
సుఖమాశు విరిచ్యన్తే మృదుకోష్ఠా నరాధిపాః. ౧౭

వ్యా. తెగడ, రేల, నేపాళము, కడిల, సంబరేణు వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి గోమూత్రమున నొకరాత్రియంతయు నూరబెట్టి మరుసటిదినము పగలంతయు ఎండలో నెండబెట్టునది. (ఇది యొకభావన.) ఇత్తెరంగున నేడు రేయింబవలును భావన చేయనగును. పిమ్మట జెముడుపాలలో పైజెప్పినవిధముగ భావనజేయునది. పిదప నెండించి చూర్ణము చేసి యాచూర్ణము పుష్పమాలికలపై జల్లి భావనజేసి యాగంధము (పరిమళము) మూర్కొనినచో చక్కగ విరేచనములగును. లేక భావనచేసిన యాచూర్ణమును గుడ్డపైజల్లి భావనచేసి యాగుడ్డను ముఖముపై గప్పికొనినను సుఖముగ విరేచనమగును. (ఇది ఘ్రేయ (ఆఘ్రాణింపదగిన) రూపమైన సుధావిరేచనయోగము.) ఇది మిక్కిలి సుకుమారులకును మృదుకోష్ఠముగల రాజమాత్రులకు నుపయోగింపందగినది.

(౧౨) లేహరూపమైన సుధాయోగమొకటి.

మూ. శ్యామాత్రివృత్కషాయేణ స్నుక్ క్షీరఘృతఫాణితైః,
లేహం పక్త్వా (కృత్వా) విరేకార్థం లేహయేన్మాత్రయా నరమ్.

వ్యా. నల్లతెగడ, తెల్లతెగడ, ఈరెంటిని నాల్గింతలు జలముగూర్చి నాల్గవపాలు మిగులునట్లు కషాయముకాచి యాకషాయమును జెముడుపాలను ఆవునేతిని యొకటిగ గూర్చి చక్కెరపాకమున లేహపాకవిధిప్రకారము పక్వముజేసి యగ్నిబలానుసారముగ సేవించిన విరేచనమగును. (ఈలేహయోగంబును పైజెప్పబడిన ఘ్రేయయోగంబును సంగ్రహమున "ఘ్రేయలేహౌ చ" అని నిర్దేశింపబడును.)

{ (౧౩-౧౭) యూషాదులతో సుధాయోగములు మూడును మత్స్య మాంసములతో రెండుయోగములును. }

మూ. పాయయేత సుధాక్షీరం యూషైర్మాంసరసైః ఘృతైః,
భావితాన్ శుష్కమత్స్యాన్వా మాంసం వా భక్షయేన్నరః.౧౯

వ్యా. జెముడుపాలను యూషము(పెసలు మున్నగువానికట్టు)నందైనను, మాంస రసములయందైనను, ఆయాఘృతములయందైనను కలిపి విరేచనమునకై త్రాగవలెను. (ఇవి యూష-మాంసరస-ఘృతయోగరూపములైన సుధాయోగములు.)

మరియు ఎండిన మత్స్యములనైనను, ఎండిన మాంసమునైనను జెముడుపాలలో పలుమారు భావనజేసి విరేచనమునకై తినవలెను. (పైజెప్పబడిన యూషాదియోగములు యూడును, మత్స్యమాంసయోగములు రెండును సంగ్రహమున "యోగాః యూషాదిభి స్త్రయః, ద్వౌ శుష్కమత్స్యమాంసాభ్యాం" అని నిర్దేశింపబడును.)

(౧౮-౨౦) ఘృతయోగములు రెండు, సురాయోగ మొకటియు.

మూ. క్షీరేణామలకైస్సర్పిః చతురఙ్గుళవత్ పచేత్,
సురాం వా కారయేత్ క్షీరే ఘృతం వా పూర్వవత్ పచేత్.

వ్యా. "చతురంగుళసిద్ధాద్వా...తత్సాధితం పిబేత్" అని చతురంగుళకల్పమున క. అ. ౮) జెప్పబడిన ఘృతయోగప్రకారము ఘృతమును సుధాక్షీరముతో సిద్ధము చేయవలెను. ఎట్టులన:— జెముడుపాలను ఆవుపాలతో జేర్చి [illegible], [illegible] తీయ బడిన నేతితో జెముడుపాలను ఉసిరికకాయల కల్కమును జేర్చి ఘృతపాకవిధిప్రకారము సిద్ధముచేయునది. ఇది యొకఘృతయోగము.

మరియు జెముడుపాలను సురామద్యమున కలిపి పదునైదుదినములు ధాన్యపుట మున నునిచి రసము చక్కగ కల్గినపిదప పానము చేయదగును. (ఇది సురాతో [illegible] సుధాయోగము.)

మరియు—"లోధ్రకల్కేన మూత్రామ్లలవణైశ్చ పచేత్ ఘృతమ్" (కల్ప-అ-౯) అని చెప్పబడిన ఘృతయోగప్రకారము, ఘృతమున గోమూత్రమును, పులుపురసమును, జెముడుపాలను కలిసి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేసి విరేచనమునకై [illegible] యింపవలెను. (ఇది రెండవ ఘృతయోగము. ఈయోగములు మూడును 'సురైకా, ద్వే చ సర్పిషీ' అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

అధ్యాయవిషయసంగ్రహము.

త్రిశ్లోకా:—

మూ. సౌవీరకాదిభిస్సప్త, సర్పిషా చ, రసేన చ,
పానకం, ప్రేయ-లేహౌ చ, యోగాః యూషాదిభిస్త్రయః. ౨౧
ద్వౌ శుష్కమత్స్యమాంసాభ్యాం, సురైకా, ద్వే చ సర్పిషీ,
మహావృక్షస్య యోగాస్తే వింశతిస్సముదాహృతాః. ౨౨

వ్యా. జెముడుకు సౌవీరకాదులతో నేడుయోగంబులును, ఘృతయోగం బొకటి యు, పానకయోగం బొకటియు, ప్రేయయోగం బొకటియు, లేహయోగం బొకటియు,

యూష-మాంస-రస-ఘృతములతో మూడుయోగంబులును, మత్స్యమాంసములతో రెండు యోగంబులును, సురాయోగం బొకటియు, ఘృతయోగములు రెండును కలిసి విరేచన మునకైన సుధాయోగము అరువదియు నీసుధాకల్పమున జెప్పబడినవి.

—అధ్యాయసమాప్తి.—

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే కల్పస్థానే సుధాకల్పో నామ దశమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నైన చరక సంహిత యను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితకల్పస్థానమున సుధాకల్ప మనునది దశమాధ్యాయము సమాప్తము.

---

## ఏకాదశాధ్యాయము.

—(౧౧) సప్తళాశంఖినీకల్పము.—

అవతరణిక:—సుధాకల్పమును జెప్పినపిదప యోగసంఖ్యాధిక్యక్రమరూపసంబంధముచే సప్తలాశఙ్ఖినీకల్పము చెప్పబడును.

మూ. అథాతస్సప్తలాశఙ్ఖినీకల్పం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. సుధాకల్పమును జెప్పిన పిదప సప్తల-(సంబరేణు) శంఖిని (దింటెన) అను రెంటిని విరేచనౌషధముగ నుపయోగింప దగువిధానమును దెల్పు సప్తలాశంఖినీకల్పమును భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము కాకుండునట్లు, వివరించి చెప్పెదనని భావము.

(ఈయధ్యాయమున జెప్పబడు విరేచనయోగములన్నియు శ్యామాత్రివృత్కల్పమున జెప్పిన యోగములవలె సంబరేణునైనను, దింటెననైనను, రెండిటినైనను జేర్చి కల్పింపనగును.

—సప్తలాశంఖినీపర్యాయనామములు:—

మూ. సప్తలా చర్మసాహ్వా చ బహుఫేనరసా చ సా,
శఙ్ఖినీ తిక్తలా చైవ (తిక్తకా జ్ఞేయా) యవతిక్తాక్షి(క్షీ)పీడకః. 3

వ్యా. సప్తల, చర్మసాహ్వా, బహుఫేనరస, అను నీపర్యాయపదములచేత సంబరేణు చెప్పబడును. శంఖిని, తిక్తల, (తిక్తక), యవతిక్త, అక్షిపీడక, అను నీపర్యాయపదములచేత శంఖిని (దింటెన) చెప్పబడును.

సప్తలాశంఖినుల నుపయోగింపదగినవ్యాధులు.

మూ. తే గుల్మగరహృద్రోగకుష్ఠశోఫోదరాదిషు,
వికాసి తీక్ష్ణరూక్షత్వాత్ యోజ్యే శ్లేష్మాధికేషు తు. ౪

వ్యా. పైజెప్పబడిన సప్తలశంఖినులను గుల్మము, విషము, హృద్రోగము, శోషము, ఉదరము మున్నగు క్రూరవ్యాధులయందు నుపయోగింపందగును. మరియు నవిరెండును వికాసి-తీక్ష్ణ-రూక్షగుణముల గల్గియుండును కావున శ్లేష్మము అధికముగ కల్గియుండువ్యాధులలో విశేషముగ నుపయోగింపందగియుండును.

సప్తలాశంఖినులనుండి గ్రహింపదగినయంగములు.

మూ. నాతిశుష్కం ఫలం గ్రాహ్యం శఙ్ఖిన్యా నిస్తుషీకృతం,
సప్తలాయాశ్చ మూలాని గృహీత్వా భాజనే క్షిపేత్. ౫

వ్యా. దింటెనచెట్టునుండి కాయలను అవి కొంచెముగ యెండియుండునపుడు గ్రహించి పైపొట్టు నొలిచి పదిలముగ నుంచవలెను. సంబరేణునుండి వేళ్లను గ్రహించి యుంచవలెను.

(౧—౧౬) సప్తలాశంఖినీలతో చేరిన విరేచనయోగములు ముప్పదితొమ్మిది, అందు కషాయయోగములు పదునారు.

మూ. అక్షమాత్రం తయోః పిణ్డం ప్రసన్నా లవణాయుతం,
హృద్రోగే కఫవాతోత్థే (హృద్రోగకఫవాతార్తే)
గుల్మే చైవ ప్రయోజయేత్. ౬
ప్రియాలపీలు-కర్కన్ధు కోలామ్రాతకదాడిమైః,
ద్రాక్షాపనసఖర్జూరబదరామ్లపరూషకైః. ౭
మైరేయే దధిమణ్డేఽమ్లే సౌవీరకతుషోదకే,
శీధౌ చాప్యేష కల్పస్స్యాత్ సుఖం శీఘ్రవిరేచనః. ౮

వ్యా. సంబరేణు, దింటెన, ఈరెంటిని నొకటిగనైనను వేరువేరుగనైనను సైంధవలవణమునుకూడచేర్చి మద్యము పైతేటను కూర్చి నూరి ముద్దచేసి యుంచుకొనునది.

యాకల్కములో కర్షప్రమాణము గ్రహించి మొరళి, వరగోగు, కమ్మరేగు, పెద్దరేగు, అడవిమామిడి, దానిమ్మ, ద్రాక్షపండు, పనస, ఖర్జూరము, పుల్లనిరేగు, చిట్టీత అను నీపదకొండుద్రవ్యములలో నొకదాని కషాయమునందైనను, మైరేయమను మద్యమునందైనను, పుల్లని పెరుగుపై తేటయందైనను సౌవీరకతుషోదకములయందైనను, శీధుమద్యమునందైనను (పైజెప్పినకల్కమును) కలిపి త్రాగినచో శీఘ్రముగ సుఖముగ విరేచనమగును. ఈయౌషధమును హృద్రోగమునందును, కఫ-వాతములచే గల్గినరోగమునందును, గుల్మమునందు నుపయోగింపదగును.

ఇచ్చట మొరళి మున్నగువాని కషాయములు మొదలగు ద్రవద్రవ్యములను పైజెప్పిన కల్కౌషధమును పరిభాషానుసారముగ నాల్గింతలు చేర్పనగును. "కల్కే-మధుఘృతం తైలం......ద్రవా దేయాశ్చతుర్గుణాః" అని పరిభాష. మరియు ప్రియాలాదికషాయములు మొదలగు పదునారుద్రవద్రవ్యములతో సంబరేణు దింటెనల కల్కమునకు పదునారువిరేచనయోగములని యెరుంగునది. మరియు మైరేయాదిద్రవములు కషాయములు గాకున్నను కషాయసముదాయసాహచర్యమునంజేసి సంగ్రహమున "కషాయా దశ షట్చైవ" అని నిర్దేశింపబడును.

(౧౭) ఆరు తైలయోగములు, అందు మొదటియోగము.

మూ. తైలం విదారిగన్ధాద్యైః పయసి క్వథితే పచేత్,
సప్తలాశంఖినీకల్కే త్రివృచ్ఛ్యామార్ధభాగికే. ౯
దధిమణ్డేన సన్నీయ సిద్ధం తత్పాయయేత చ,

వ్యా. విదారిగంధాదిద్రవ్యములను చేర్చి క్వాథముచేసి యాక్వాథమునకు నాల్గవపాలు తైలమును (నువ్వులనూనెను), సప్తలా-శంఖినీకల్కమునకు అర్ధభాగముండునట్లు తెల్లతెగడ, నల్లతెగడ కల్కమును చేర్చి తైలమునకు సమభాగముగ పెరుగుమీది తేటను కలిపి (వీనినన్నిటిని నొకటిగ గూర్చి) తైలపాకవిధిప్రకారముచేసి విరేచనమునకు నుపయోగించునది. (ఇది యొక తైలయోగము.)

ఇచ్చట సప్తలా-శంఖినీకల్కమును రెండుభాగములును, త్రివృత్ (తెగడ) శ్యామాకల్కములు ఒకభాగమును చేరిన కల్కసముదాయము తైలమునకు నాల్గవవంతు నుండవలెను.

(౧౮-౨౨) ఐదు తైలయోగములు.

మూ శంఖినీచూర్ణభాగౌ ద్వౌ తిలచూర్ణస్య చాపరః. ౧౦
(నీలీచూర్ణస్య చాపరా)

హారీతకీకషాయేణ తైలం తత్పీడితం పిబేత్,
అతసీసర్షపైరణ్డకరఞ్జేష్వేష సంవిధిః. ౧౧

వ్యా. దింటెనచూర్ణమును రెండుభాగములును, నువ్వులపిండి యొకభాగమును కరకకాయకషాయమున కలిపి మర్దనచేసి, అందుండి తైలమును తీసి యాతైలమును విరేచనమునకై త్రాగవలయును. ఇత్తెరంగుననే అవిశెగింజలు, ఆవాలు, ఆముదపుగింజలు, కానుగగింజలు అను నీనాల్గిటిలో ఒక్కొక్కదానిని చూర్ణముచేసి, నువ్వులచూర్ణమునకు బదులు కలుపుచు పైజెప్పినరీతిగ తైలముదీసి విరేచనమునకు త్రాగనగును.

పైజెప్పబడిన తైలయోగ మొకటియు నీతైలయోగము లైదును చేరి ఆరుతైలయోగము లగును. ఈతైలయోగములు "షట్తైలేషు" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౨౩) ఘృతయోగము లెనిమిది, అందు మొదటిఘృతయోగము.

మూ. శఙ్ఖినీసప్తలాసిద్ధాత్ క్షీరాద్యదుదియాద్ఘృతం,
కల్కభాగే తయోరేవ త్రివృచ్ఛ్యామార్ధసంయుతే. ౧౨
క్షీరేణాలోడ్య సంపక్వం (విపచేత్) పిబేత్తచ్చ విరేచనం,

వ్యా. దింటెనను, సంబరేణును పాలలో కలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వముచేసి, యాక్షీరమునందు నేతిని తీసికొని ఆఘృతమునందు శంఖినీ-సప్తలాకల్కము రెండు భాగములను, ఆకల్కమునకు అర్ధభాగము త్రివృత్ శ్యామాకల్కమును కలిపి ఘృతమునకు నాల్గింతలు ఆవుపాలను కూర్చి ఘృతపాకవిధిప్రకారము చేయునది. ఈఘృతమును విరేచనమునకై యుపయోగింపదగును. ఇది యొక ఘృతయోగము.

(౨౪-౩౦) ఏడు ఘృతయోగములు.

మూ. దన్తీద్రవన్తీకల్కోఽయం అజశృఙ్గ్యజగన్ధయోః. ౧౩
క్షీరిణ్యా నీలికాయాశ్చ తథైవ చ కరంజయోః,
మసూరవిదలాయాశ్చ ప్రత్యక్పర్ణ్యాస్తథైవ చ. ౧౪
ద్వివర్గార్ధాంశకల్కేన తద్వత్సాధ్యం ఘృతం పునః,
శఙ్ఖినీసప్తలాధాత్రీకషాయే చాపరం ఘృతం,
త్రివృత్కల్పేన సర్పిశ్చ......(సాధయేద్ఘృతమ్). ౧౫

వ్యా. నేపాళము, పెద్దనేపాళము; వాయింట, దుష్టుపువేరు; పాలగుమ్మడి, నీలి, కానుగ, కలుకానుగ, నల్లతెగడ, ఉత్తరేణి ఈచెప్పిన ద్రవ్యములవరుసలో రెండేసి ద్రవ్యములను కల్కముచేసి ఈకల్కమునకు రెట్టింపు శంఖినీ-సప్తలాకల్కమును కల్పించి పైయోగమున చెప్పినరీతిగ శంఖినీ-సప్తలాసిద్ధమయిన క్షీరమునుండి తీయబడిన ఘృతమున కలిపి ఆవుపాలను చేర్చి పైజెప్పినవిధముగనే ఘృతపాకవిధిప్రకారము ఐదు ఘృతములను సిద్ధముచేయునది. (ఈయోగములయందు పైజెప్పబడిన యోగమువలెనే తెగడకు, నల్ల తెగడకును బదులు దంతీ,ద్రవంతీ మున్నగు రెండేసిద్రవ్యములకల్కమును శంఖినీ-సప్తలా కల్కమునకు అర్ధభాగముగ చేర్చుచు పైకల్పప్రకారముగనే ఘృతయోగముల సిద్ధము చేయునది.)

మరియు దింటెన, సంబరేణు, ఉసిరికకాయలు, ఈమూడిటిని కషాయముచేసి, యాకషాయమునకు నాల్గవవంతు ఘృతమును, ఘృతమునకు నాల్గవపాలు శంఖినీ-సప్తలా కల్కమును కలిపి ఘృతపాకవిధిప్రకారము ఘృతమును సిద్ధముచేయునది.

మరియు త్రివృత్కల్పమున చెప్పినప్రకారము తెగడకు బదులు దింటెన-సంబ రేణువునుచేర్చి ఘృతమును సిద్ధముచేయునది. ఇచ్చట "శ్యామాత్రివృత్ కషాయేణ సిద్ధం సర్పిః పిబేత్తథా (కల్ప.అ.౭. శ్లో ౬౮.)" అను ఘృతయోగకల్పము ననుసరించి తెగడకు బదులు శంఖినీ-సప్తలాకషాయమును జేర్చి ఘృతమును సిద్ధముచేయునది. ఇత్తెరంగున "శంఖినీ-సప్తలాసిద్ధాత్" అని యుపక్రమించి యెనిమిదిఘృతయోగములు చెప్పబడినవి. ఈయెనిమిది ఘృతయోగములును "అష్టా చ సర్పిషి" అని సంగ్రహమున నిర్దేశింప బడును.

(3—3½) లేహయోగములు మూడు, సురాకంపిల్లయోగములు రెండు.

మూ. త్రయో లేహాశ్చ లోధ్రవత్,
సురాకమ్పిల్లయోర్యోగః కార్యో లోధ్రవదేవ చ. ౧౬

వ్యా. తిల్వకకల్పమునందు "చతురఙ్గులకల్పేన" అని యుపక్రమించి "సఘృత స్సాధితో లేహః స చ శ్రేష్ఠో విరేచనే" (కల్ప. అ. ౯.శ్లో.౧౧. ౧౩.) అని చెప్పబడిన కల్పము ననుసరించి లొద్దుగకుబదులు దింటెనను, సంబరేణును, చేర్చుకొనుచు లేహయోగ ముల మూటిని సిద్ధముచేయనగును.

మరియు లోధ్రకల్పమున "సురాం లోధ్రకషాయేణ.........మద్యపానా ద్విరేచనమ్. (కల్ప అ. ౯. శ్లో. ౮. ౯) అని చెప్పబడిన సురాకల్పము ననుసరించి

లొద్దుగకు బదులు దింటెన-సంబరేణును చేర్చుచు సురాయోగమును సిద్ధముచేయునది. అత్తెరంగుననే "కమ్పిల్లకకషాయేణ......కషాయేణ పునః పిబేత్." (కల్ప. అ. ౧౦. శ్లో. ౧౦) అని చెప్పబడిన కంపిల్లకయోగమును కూడ గల్పించునది. ఎట్టులన—కంపిల్లక మనుగంధద్రవ్యమును విధ్యుక్తప్రకారము క్వాథముచేసి, అందు సంబరేణుదింటెనల చూర్ణమును పదిమార్లు భావనచేసి, యాచూర్ణమును కంపిల్లకషాయానుపానముననే త్రాగ వలెను. (ఇది సంబరేణుదింటెనలకు కంపిల్లకముతో యోగము) ఇచ్చట జెప్పబడిన లేహ-కంపిల్లకయోగములు "త్రయో లేహాః, యోగః కమ్పిల్లకే తథా" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

### (౩౬-౩౯) సౌవీరకాదియోగములు నాల్గు.

మూ. దన్తీద్రవన్త్యోః కల్పేన సౌవీరకతుషోదకే,
అజగన్ధాఽజశృఙ్గ్యోశ్చ తద్వత్ స్యాతాం విరేచనే. ౧౭

వ్యా. దంతీద్రవంతీకల్పమున "అజగంధాకషాయేణ సౌవీరకతుషోదకే" (కల్ప-అ. ౧౨-శ్లో-౩౫) అని చెప్పబడినప్రకారము సంబరేణు దింటెనలకషాయమును దంతీ ద్రవంతీకషాయమునకు బదులుగ జేర్చి (పరిభాషానుసారముగ) సౌవీరకమును, తుషోదక మును కల్పింపనగును.

మరియు "తథా దంతీద్రవన్త్యోశ్చ కషాయే సాజగంధయోః గౌడః కార్యోఽజ శృఙ్గ్యా వా సవై సుఖవిరేచనః" (కల్ప-అ-౧౨-శ్లో, ౩౩) అని చెప్పబడిన అరిష్టకల్పము ననుసరించి రెండరిష్టయోగముల సిద్ధముచేయనగును. ఎట్టులన:—సంబరేణుదింటెనలను వాయింటను జేర్చి విధ్యుక్తముగ కషాయము గాచి, యొకకుండకు లోభాగమున పిప్పలి మున్నగువాని కల్కమును లేపనముచేసి, పైజెప్పిన కషాయమును బోసి బెల్లమును జేర్చి మూతిమూసి చీలమన్ను బూసి సంధానవిధిప్రకార ముంచునది. ఇది యొకయరిష్టము. మరియు సంబరేణుదింటెనలతో దుష్టపువేరును జేర్చి కషాయము కాచి పైజెప్పినరీతిగ సంధానవిధిప్రకార ముంచునది. ఇది రెండవయరిష్టము.

ఇత్తెరంగున పైని పదునారవశ్లోకమున జెప్పబడిన సురాయోగం బొక్కటియు, ఇచ్చట జెప్పబడిన సౌవీరక-తుషోదకయోగంబులును, అరిష్టయోగములు రెండును జేరి సంబరేణుదింటెనలకు సంధానరూపయోగములు ఐదగును. ఇయ్యవి 'పఞ్చ మద్యే' అని సంగ్రహమున నిర్దేశింపబడును. (మరియు సౌవీరక-తుషోదక-అరిష్టసంధానము స్థలాంతర మున విస్తరముగ జెప్పబడినది.)

### అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

మూ. కషాయా దశ షట్ చైవ, షట్తైలే, ఽష్టౌ చ సర్పిషి,
పఞ్చ మద్యే, త్రయో లేహాః, యోగః కమ్పిల్లకే తథా. ౧౮
సప్తలాశంఖినీభ్యాం తే త్రింశదుక్తాః నవాధికాః,
యోగాః సిద్ధాః సమస్తాభ్యాం ఏకశోఽపి చ తే హితాః. ౧౯

వ్యా. ఇత్తెరంగున పదునారు కషాయయోగంబులును, ఆరు తైలయోగంబులును, ఎనిమిది ఘృతయోగములును, ఐదు మద్యయోగంబులును, మూడు లేహయోగంబులును, కంపిల్లకముతో నొకయోగంబును జేరి ముప్పదితొమ్మిది విరేచనౌషధయోగములు సంబరేణు దింటెనల నుద్దేశించి యీయధ్యాయమున జెప్పబడినవి. ఈయోగములను ఈరెంటెని గూర్చియైనను, ఒక్కొకదానిని గూర్చియైనను సిద్ధముచేసి యుపయోగించునెడ మిక్కిలి హితకరములుగ నుండును. (ఇచ్చట "పంచ మద్యే" అనుచోట మద్యశబ్దముచే సంధాన సామాన్యముచే సురా-సౌవీరక-తుషోదక-అరిష్టములు గ్రహింపబడును.)

### అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే
కల్పస్థానే సప్తలాశఙ్ఖినీకల్పో నామ ఏకాదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితకల్పస్థానమున సప్తలాశఙ్ఖినీకల్పమనునది యేకాదశాధ్యాయము సమాప్తము.

---

## ద్వాదశాధ్యాయము.

### (౧౨) దంతీద్రవంతీకల్పము.

అవతరణిక:—సంఖ్యాధికక్రమసంబంధము ననుసరించి సప్తలాశంఖినీకల్పానంతరము దంతీద్రవంతీకల్పము చెప్పబడును:—

మూ. అథాతో దన్తీద్రవన్తీకల్పం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. సప్తలాశంఖినీకల్పమును జెప్పినపిదప దంతీద్రవంతీకల్పమును (చిన్న నేపాళము పెద్దనేపాళము అనుద్రవ్యములను విరేచనోపయోగ్యముగ నౌషధమును సిద్ధముచేసి యుపయోగించువిధానమును దెల్పునధ్యాయమును) భగవానుడగు నాత్రేయు లుపదేశించినదాని కన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించెదనని యర్థము.

దంతీ-ద్రవంతీపర్యాయనామములు.

మూ. దన్త్యుదుమ్బరపర్ణీ స్యాత్ నికుమ్భోఽథ ముకూలకః.
ద్రవన్తీ నామతః చిత్రా న్యగ్రోధీ మూషికాహ్వయా. 3
(తథా మూషికపర్ణీ చాప్యుపచిత్రా చ శామ్బరీ,
ప్రత్యక్శ్రేణీ సుతశ్రేణీ దన్తీర(చ)ణ్డా చ కీర్తితా.)

వ్యా. దంతి, ఉదుంబరపరి (అత్తిమాకులవంటియాకులుకలది), నికుంభము, ముకూలకము, అనుపర్యాయనామములచే (దంతి చిన్న నేపాళము) చెప్పబడును. ద్రవంతి, చిత్ర, న్యగ్రోధి, మూషికాహ్వ, మూషికపర్ణి, ఉపచిత్ర, శాంబరి, ప్రత్యక్శ్రేణి, సుతశ్రేణి, దంతి, రండ, చండ, అనుపర్యాయనామములచే ద్రవంతి (పెద్దనేపాళము) చెప్పబడును. (ఈరెండును క్షుపజాతిలోఁ జేరినవి.)

దంతీద్రవంతుల గ్రహ్యాంగములు, వానిసంస్కారము

మూ. తయోర్మూలాని సఙ్గృహ్య స్థిరాణి బహులాని చ,
హస్తిదన్తప్రకారాణి శ్యావతామ్రాణి బుద్ధిమాన్. ౪
పిప్పలీమధులిప్తాని స్వేదయేత్ మృత్కుశాన్తరే,
శోషయేదాతపేఽర్కాగ్నీ (దాతపేఽగ్న్యర్కౌ)
హతో హ్యేషాం వికాసితామ్. ౫

వ్యా. పైజెప్పిన రెంటిలోఁ జిన్న నేపాళపు వేరు శ్యామవర్ణముగను, పెద్దనేపాళపు వేరు తామ్రవర్ణముగను ఉండును. అట్టి దంతీద్రవంతులవేళ్లలోఁ సారవంతములై ఘనమైన చర్మముకల్గి యేనుగుదంతములబోలె లావుగ నుండువానిని గ్రహించి వానిపైని పిప్పళ్లను అతిమధురమును నూరి కల్కముచేసి పూసి, పైన దర్భల జుట్టి, దానిపై మట్టితోఁ గవచమిచ్చి, నిప్పుసెగలోఁ నునిచి యుడికించి, యెండ నెండించవలెను. అట్టి యగ్నిసంబంధము చేతను, ఎండనెండించుటచేతను దంతీద్రవంతీమూలములకుం గలవికాసిగుణము శమించును.

(ఇచ్చట వికాసి యన—సంధిబంధములను శిథిలముగ జేసి రసాదిధాతువులనుండి యోజస్సును వేరుపరచుగుణము. దంతీద్రవంతులకుండు అట్టి తీవ్రమైనగుణము పైజెప్పిన రీతిగ నిప్పున నుడికించి యెండనెండించినచో శమించుననని భావము. మరియు 'శ్యావ తామ్రాణి' అనుచోట దంతీ-ద్రవంతులకు యథాసంఖ్యముగ నన్వయించి దంతి శ్యామ వర్ణంబనియు, ద్రవంతి యరుణవర్ణంబనియు వస్తుస్వరూపము జెప్పబడినది.)

## దంతీద్రవంతీగుణములు.

మూ. తీక్ష్ణోష్ణాన్యాశుకారీణి వికాసీని గురూణి చ,
విలాయయన్తి దోషౌ ద్వౌ మారుతం కోపయన్తి చ. ౬

వ్యా. పైజెప్పబడిన దంతీద్రవంతులు రెండును తీక్ష్ణ-ఉష్ణ-గురుగుణంబులును, ఆశుకారిత్వంబును (శీఘ్రముగ పనిచేయుశక్తియు),వికాసిత్వంబును కల్గియుండును. పిత్త కఫముల హరించును. వాతమును ప్రకోపింపజేయును.

## (౧—౭) దంతీద్రవంతీవిరేచనౌషధయోగములు నలువదెని మిది, అందు దధ్యాదులతో నేడుకల్కయోగములు.

మూ. దధితక్రసురామణ్డైః పిణ్డమక్షసమం తయోః,
ప్రియాలకోలబదరపీలుశీధుభిరేవ చ. ౭
పిబేద్గుల్మోదరీ దోషైః అభిఖన్నశ్చ (అభిష్యణ్ణశ్చ) యో నరః,

వ్యా. పైజెప్పినరీతిగ గ్రహించి యుడికించి యెండ నెండింపబడిన దంతీద్రవంతీ మూలములను నూరి ముద్దచేసి యందొకకర్షమాత్రము గ్రహించి పెరుగుమీది తేట నీటితోనైనను మజ్జిగతేటతోనైనను, సురామద్యముయొక్క తేటతోనైనను కలిపి త్రాగ వలెను. మరియు మొరళివేరు, రేగువేరు, పెద్దరేగువేరు, వరగోగువేరు ఈనాల్గిటిని వేరు వేరుగ చేర్చి సిద్ధముచేయబడిన శీధుమద్యములనాల్గిటిలో నొక్కొకమద్యమున వేరువేరుగ నైనను దంతీద్రవంతీకల్కమును కలిపి త్రాగనగును. ఈయేడుయోగములను గుల్మరోగి యును, ఉదరరోగియు నుపయోగింపనగును. మరియు పైరోగములయందు మిక్కిలి దోష ప్రకోపము కల్గినపుడు యుక్తముగ నుండును. ఇచ్చట దధ్యాదియోగములు మూడును, ప్రియాలాదిశీధువులతోగూడిన యోగములు నాల్గును జేరి యేడుదంతీద్రవంతీయోగములు అగును.

(౮—౧౦) దంతీద్రవంతీయోగములు మాంసరసములతో మూడు.

మూ. గోమృగాఽజరసైః పాణ్డుః క్రిమికోష్ఠీ భగన్దరీ. ౮

వ్యా. పైజెప్పబడిన దంతీద్రవంతీకల్కపుముద్దను గోమాంసరసముతోనైనను, జింకమాంసరసముతోనైనను, మేకమాంసరసముతోనైనను కలిపి పాండురోగము కలవారును, కోష్ఠమున క్రిములుచేరియున్నవారును, భగందరపీడితులును త్రాగవలెను. (ఈమాంసరసయోగములు మూడును "త్రయో రసే" అని సంగ్రహమున నిర్దేశింప బడును.)

(౧౩) స్నేహయోగములు మూడు.

మూ. తయోః కల్కే కషాయే చ దశమూలరసాయుతే,
కక్ష్యాలజీవిసర్పేషు దాహే చ విపచేత్ ఘృతమ్. ౯
తైలం మేహే చ గుల్మే చ సోదావర్తే కఫాఽనిలే,
చతుస్స్నేహం శకృచ్ఛుక్రవాతసఙ్గానిలార్తిషు. ౧౦

వ్యా. దంతీద్రవంతులకల్కమును నాల్గవవంతును,వానికషాయమును,దశమూలముల రసమును ఘృతమున జేర్చి స్నేహపాకవిధిప్రకారము పక్వముజేసి కక్ష్య-అలజి, విసర్పము అనురోగములయందు విరేచనమున కుపయోగింపనగును. (ఇచ్చట ఘృతమునకు నాల్గవ వంతు దంతీద్రవంతీకల్కమును, దంతీద్రవంతీకషాయమును దశమూలరసమును సమభాగ ములుగ జేర్చి ఘృతమునకు నాల్గింతలును జేర్చి స్నేహపాకవిధిప్రకారము ఘృతమును సిద్ధముచేయునది. ఇది సామాన్యపరిభాషానుసారకల్పనము. ఈకల్పమునే క్రిందజెప్పబడు స్నేహయోగముల రెండిటికి నెరుంగునది.)

మరియు పైజెప్పినరీతి తైలమునందును దంతీద్రవంతీకల్కమును వానికషాయమును దశమూలరసమునుగూర్చి పక్వముజేసి ప్రమేహమునందును, గుల్మమునందును, ఉదావర్తము నందును, కఫవాతరోగములయందును విరేచనమున కుపయోగింపనగును.

ఇత్తెరంగుననే స్నేహచతుష్కమును (ఘృతము, నువ్వులనూనె, వస, మజ్జ అను నీనాల్గును చేరిన సముదాయమును) సిద్ధముచేసి మల-శుక్ర-వాతములబంధమునందును, వాతరోగములయందును విరేచనమున కుపయోగింపనగును. (ఈస్నేహయోగములు మూడును "స్నేహేషు వై త్రయః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

## (౧౪—౧౫) దంతీ-ద్రవంతుల లేహయోగములు ఆరు. అందు రెండు లేహయోగములు.

మూ. రసే దన్త్యజశృఙ్గ్యోశ్చ గుడక్షౌద్రఘృతాన్వితః,
లేహస్సిద్ధో విరేకార్థే దాహసన్తాపమేహనుత్. ౧౧
వాతవర్చే జ్వరే పైత్తే స్యాత్ స ఏవాఽజగన్ధయా,

వ్యా. దంతివేళ్లను, దుష్టపుతీగవేళ్లను స్వరసముచేసి, అందు బెల్లమును చేర్చి లేహపాకవిధిప్రకారము పక్వముచేసి, యందు తేనెను, ఆవునేతినిచేర్చి సిద్ధముచేయబడిన లేహమును దాహము, సంతాపము, ప్రమేహము అను నీరోగములయందు విరేచనమునకు నుపయోగించిన శమించును. (ఇది మొదటి లేహయోగము.)

మరియు దంతివేళ్లను, వాయింటవేళ్లను చేర్చి స్వరసముచేసి పైజెప్పినరీతిగ బెల్లమును తేనెను నేతిని కలిపి సిద్ధముచేయబడిన లేహమును వాతముచేకల్గిన దప్పి యందును, పిత్తజ్వరమునందును విరేచనమునకై ంనుపయోగింపదగును. (ఇయ్యది రెండవ లేహయోగము.)

## (౧౬) మూడవ లేహయోగము.

మూ. దన్తీద్రవన్త్యోర్మూలాని పచేదామలకీరసే. ౧౨
త్రీంస్తు తస్య కషాయస్య భాగౌ ద్వౌ ఫాణితస్య చ,
తప్తే సర్పిషి తైలే చ భర్జయేత్, తత్ర చావపేత్. ౧౩
కల్కం దన్తీద్రవన్త్యోశ్చ శ్యామాదీనాం చ భాగశః,
తత్సిద్ధం ప్రాశయేల్లేహం సుఖం తేన విరిచ్యతే. ౧౪

వ్యా. చిన్నదంతియొక్క, పెద్దదంతియొక్కయు వేళ్లను ఉసిరికకాయలరసమున నునిచి కాచవలయును. ఆ కషాయమును మూడుభాగములును, చక్కెరపాకము రెండుభాగములును, చేర్చి కాగుచున్న నేతియందైనను, నూనెయందైనను పోసి పక్వముచేయుచు, అందు దంతీద్రవంతులకల్కమును, నల్లతెగడ మున్నగు ద్రవ్యములను ప్రత్యేక మొక్కొక్కభాగమువంతునగూర్చి కల్కముచేసి, కలిపి లేహపాకవిధిప్రకారము సిద్ధముచేయునది. ఈలేహమును సేవించినచో సుఖముగా విరేచనమగును. (ఇయ్యది మూడవ లేహయోగము.)

ఇంతవఱకు దధ్యాదియోగములు మొదలుజేసి చెప్పబడినవి దంతీద్రవంతులకు పదునారు విరేచనయోగము లగును. ఇది యొకషోడశికమని సంగ్రహమున పరిగణింప బడును.

ఇచ్చట 'శ్యామాదీనాం' అనుచోట "శ్యామా త్రివృ... ద్రవంతీనాం చ" (క.అ.౧) అని చెప్పబడిన నల్లతెగడ మున్నగువానిని గ్రహించునది.

(౧౭—౧౯) లేహయోగములు మూడు.

మూ. రసే చ దశమూలస్య తథా వైభీతకే రసే,
హారీతకీరసే చైవ లేహానేవం పచేత్పృథక్. ౧౯

వ్యా. దంతీద్రవంతీమూలములను దశమూలకషాయమునందైనను; తునికాయల కషాయమునందైనను, కరకకాయలకషాయమునందైనను, పక్వముచేసి యాకషాయమును మూడుభాగములును; చక్కెరపాకము మూడుభాగములును, కాగిన నేతియందైనను, నూనెయందైనను, చేర్చి దంతీద్రవంతీమూలములను, నల్లతెగడ మున్నగువానిని ఒక్కొక్కభాగముగ కల్కముచేసి కలిపి పైజెప్పిన లేహవిధిప్రకారము లేహముల మూటిని వేరువేరుగ సిద్ధముచేయునది. ఈయోగములు మూడును, పైజెప్పిన లేహ యోగములు మూడునుచేరి ఆరులేహయోగములగును. ఇవి "లేహ్యాః షట్" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౨౧) చూర్ణయోగ మొకటి.

మూ. తయోః బిల్వసమం చూర్ణం తద్రసేనైవ భావితం,
అస్పృష్టే విశి వాతోత్థే గుల్మే చామ్లయుతం శుభమ్. ౧౬

వ్యా. దంతీద్రవంతీమూలములను చూర్ణముచేసి, యాచూర్ణమున నొకపలపరిమిత మును గ్రహించి దంతీద్రవంతీమూలకషాయముననే విధ్యుక్తప్రకారము భావనచేసి, యాచూర్ణమును దానిమ్మరసము మున్నగు పుల్లనిరసములలో కలిపి మలబంధమునందు వాతముచే గల్గినగుల్మమునందును విరేచనమునకై త్రాగవలయును. (ఇది చూర్ణయోగము) ఇయ్యది "చూర్ణే ద్వేకఏవచ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౨౧) ఇక్షుయోగ మొకటి.

మూ. పాటయిత్వేక్షుకాండం వా కల్కేనాలిప్య చాన్తరా,
స్వేదయిత్వా తతః (నరః) ఖాదేత్ సుఖం తేన విరిచ్యతే. ౧౭

వ్యా. దంతీద్రవంతీమూలములను కల్కముచేసి యాకల్కమును నొకచెరుకు తుంటను చీల్చి దాని లోభాగమున దట్టముగపూసి నిప్పుసెగ నుడికించి యాచెరుకుతుంటను నమలి రసమును మ్రింగినచో సుఖముగ విరేచనమగును. (ఇయ్యది ఇక్షుయోగము. ఇయ్యది "ఇక్షావేకః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౨౨—౨౯) మాంసరసయోగములు ఎనిమిది.

మూ. మూలం దన్తీద్రవన్త్యోశ్చ సహాముద్గైర్విపాచయేత్,
లావవర్తీరికాద్యైశ్చ తే రసాస్సుఖరేచనే. ౧౭

వ్యా. దంతీద్రవంతులయొక్క మూలములను, పెసలపప్పులో చేర్చి యూషపాకవిధి ప్రకారము కాచి, యారసమును సూత్రస్థానమున చెప్పబడిన లావుకపిట్ట, వార్తీరకము మున్నగు విష్కిరిజాతిలో చేరిన యెనిమిదిపక్షులలో నొక్కొక్కదానిమాంసరసమున కలిపి పక్వముచేసి త్రాగినచో సుఖముగ విరేచనమగును.

ఇచ్చట సూత్రస్థానమున "లావో వర్తీరకశ్చైవ వార్తీకః స కపిఞ్జలః, చకోర శ్చోపచక్రశ్చ కకుభో రక్తవర్త్మకః" (సూత్ర. అ.౨౭. శ్లో.౪౭)అని చెప్పబడిన లావుక పిట్ట, ఆర్తీరకము, వాతీకము, కపింజలము, చకోరము, ఉపచక్రకము, కుకుభము, కారు కోడి అను నీయెనిమిదిపక్షులయొక్క మాంసరసములను వేరువేరుగ సిద్ధముచేసుకొని వాని యనుపానములతో ముద్గరససిద్ధమయిన దంతీద్రవంతీరసము లుపయోగించుటచే మాంసరస యోగములు ఎనిమిది యగును. (ఈయోగములు "ముద్గమాంసానాం చ రసాః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

(౩౦—౩౨) యవాగ్వాదియోగములు మూడు.

మూ. తయోర్వాపి కషాయేణ యవాగూం జాంగలం రసం,
మాష(మాసం)యూషం చ సంస్కృత్య దద్యాత్తైశ్చ విరిచ్యతే.

వ్యా. దంతీద్రవంతులవేళ్లను విధ్యుక్తప్రకారము కషాయము కాచి యాకషాయ ముచేత యవాగువును, జాంగలమాంసరసమును, ఉద్దిపప్పుచే సిద్ధముచేయబడిన యూష (కట్టు)ను, సిద్ధముచేసి విధిప్రకారము సంస్కరించి త్రాగినచో విరేచనము సుఖముగ నగును. (ఈయవాగువు, జాంగలరస, మాషయూషములు మూడును; "యవాగ్వాదౌ త్రయశ్చ" అని సంగ్రహమున నిర్దేశింపబడును.) ఇత్తెరంగున "రసే చ దశమూలస్య" (శ్లో. ౧౫) అని యుపక్రమించి చెప్పబడిన పదునారుయోగములు ద్వితీయషోడశికమని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౩౩-౩౪) ఉత్కారికా-మోదకయోగములు రెండు.

మూ. తత్కషాయాత్త్రయో భాగాః ద్వౌ సితాయాస్తథైవ చ,

ఏకో గోధూమచూర్ణానాం కార్యా చోత్కారికా శుభా. ౨౦
మోదకో వాస్య కల్పేన (కల్కేన) కార్యస్తచ్చ విరేచనం,

వ్యా. దంతీద్రవంతీమూలములను క్వాథముచేసి యాకషాయము మూడుభాగ
చక్కెర రెండుభాగములును, గోధుమపిండి యొకభాగమును చేర్చి మర్దనచేసి
కయను యపూపవిశేషముగ చేయవలయును. (ఉత్కారికయన:—గోధుమ
ంతీద్రవంతీకషాయమున పైచెప్పిన భాగప్రకారముగ చేర్చి చక్కెరను కలిపి
రిచే నుడికించిన యపూపవిశేషము.)

మరియు పైచెప్పినరీతిగా గోధుమపిండి మున్నగువానిని మోదకముగనైనను,
ను. (మోదకమన లడ్డువలె చేయబడినయుండలు.) నీరెండుయోగములును
ోత్కారికావిధా" "ఏకశ్చ మోదకే" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౩౫) మద్యయోగమొకటి.

త యోశ్చాపి కషాయేణ మద్యాన్యప్యుపకల్పయేత్. ౨౧

వ్యా. దంతీద్రవంతీమూలములకషాయమును మద్యసంధానవిధిప్రకారము మద్య
మ్యముచేసి విరేచనమున కుపయోగింపదగును. ఇది మూడవయోగము. ఇయ్యది
ౖకః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౩౬) భక్ష్యయోగ మొకటి.

ద స్తీక్వాథేన చాలోడ్య దస్తీతైలేన సాధితాః,
గుడలావణికాస్ఛక్ష్యాన్నివిధాన్భక్షయేన్నరః. ౨౨

వ్యా. దంతీద్రవంతీకషాయమున గోధుమపిండి మున్నగువానిలో కలిపి, అందు
నను, లవణమునైనను కలిపి దంతీద్రవంతులతైలమున భక్ష్యవిశేషములుగ కాల్చి
భక్షించినయెడ సుఖముగ విరేచనములగును. ఈభక్ష్యయోగమును నాల్గవది.
ఏకస్తత్క్వాథతైలకే" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

(౩౭) చూర్ణయోగ మొకటి.

స్తీం ద్రవస్తీం మరిచం యవానీముపకుఞ్చికాం,
నాగరం హేమదుగ్ధాం చ చిత్రకం చేతి చూర్ణితమ్. ౨౩
ప్తాహం భావయేన్మూత్రే గవాం, పాణితలం తతః,

పిబేత్ ఘృతేన, జీర్ణే తు విరిక్తేశ్చాపి తర్పణమ్. ౨౪
సర్వరోగహరం ముఖ్యం సర్వేష్వృతుషు యౌగికం,
చూర్ణం తదనపాయిత్వాద్బాలవృద్ధేషు పూజితమ్. ౨౫
దుర్భక్తాజీర్ణపార్శ్వార్తిగుల్మప్లీహోదరేషు చ,
గణ్డమాలాసు వాతే చ (ప్రవాతే చ) పాణ్డురోగే చ శస్యతే.

వ్యా. దంతివేళ్లు, పెద్దదంతివేళ్లు, మిరియాలు, ఓమము, నల్లజీలకర్ర, శుంఠి, స్వర్ణక్షీరి (కంకుష్టము), చిత్రమూలము, వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి చూర్ణము చేసి గోమూత్రమున నేడుదినములు విధ్యుక్తప్రకారము భావనచేయునది. ఆచూర్ణము కర్షమాత్రము ఆవునేతిలో కలిపి త్రాగునది. అయ్యది జీర్ణమై విరేచనములై నపిదప సత్తుపిండి మొదలగుసంతర్పణమును ఆహారముచేయునది. ఈచూర్ణయోగము రోగముల నన్నిటిని హరించునది. వసంతాదిఋతువు లన్నిటియందును ముఖ్యముగ సేవింపదగి యుండును. మరియు నియ్యది యేవిధమయిన యపాయము లేక విరేచనముల చేయును గాన బాలులకును, వృద్ధులకును, సేవించుటకు యుక్తమైనది. మరియు నాహారపదార్థముల వ్యత్యాసముచే కల్గినరోగములయందును, అజీర్ణమునందును, పార్శ్వశూలయందును, గుల్మము, ప్లీహము, ఉదరము, గణ్డమాల; వాతరోగము, వాతరక్తము, పాండురోగము అనునీరోగములయందును; విరేచనమునకై యుపయోగించుటకు మిగుల శ్రేష్ఠములై యుండును. ఇది శ్రైదవయోగము. ఇయ్యది "చూర్ణ మేకం" అని సంగ్రహమున నిర్దేశింపబడును.

### (౩౮) మరియొక మోదకయోగము.

మూ. పలం చిత్రకదన్త్యోశ్చ హరీతక్యాశ్చ వింశతిః,
త్రివృత్పిప్పలీకర్షౌ ద్వౌ గుడస్యాష్టపలేన తత్. ౨౭
వినీయ మోదకాన్కుర్యాత్ దశ; ఏకం భక్షయేత్తతః,
ఉష్ణాంబు చ పిబేచ్చాను (చ్ఛేషాణ్) దశమే దశమేఽహ్ని చ.
ఏతే నిష్పరిహారాః స్యుః సర్వరోగనిబర్హణాః,
గ్రహణీపాణ్డురోగార్శః కణ్డూకోఠానిలాపహాః. ౨౯

వ్యా. చిత్రమూలము దంతివేళ్లను చేరి ఒకపలము; కరకకాయలు ఇరువది కాయలు; తెగడయు, పిప్పళ్లను ఒక్కొక్కకర్షముగను; వీనినన్నిటిని చూర్ణముచేసి

రెనిమిది పలములు బెల్లమును కలిపి పక్వముచేసి పదునొకండు ఉండలుగ చేయనగును. వానిలో నొకయుండను వేడినీళ్ల యనుపానముచే సేవించనగును. పిమ్మట తక్కినపది యుండలును పదేసిదినముల కొక్కటివంతున పైజెప్పినరీతిగ పుచ్చుకొననగును. ఈమోదకములు నిర్బాధకములు రోగముల నన్నిటిని హరించును. మరియు గ్రహణి, పాండురోగము, అర్శోరోగము, జిల, మండలకుష్ఠము అను నీరోగములను హరించును. ఇయ్యది యారవయోగము. దీనిని "పునశ్చైకో మోదకః" అని సంగ్రహమున చెప్పబడును.

(౩౯) ఆసవయోగములు అయిదు, అందు మొదటియాసవయోగము.

మూ. దన్తీద్విపలనిర్యూహో ద్రాక్షార్ధప్రస్థసంయుతః (సాధితః),
విరేచనం పిత్తకాసే పాణ్డురోగే చ శస్యతే. ౩౦

వ్యా. రెండుపలములు దంతివేళ్లను చేర్చి కషాయము కాచి, అందు అర్ధప్రస్థము ద్రాక్షపండ్లను చేర్చి ఆసవకల్పనావిధిప్రకారము ఆసవమును సిద్ధముచేసి త్రాగినచో సుఖముగ విరేచనమగును. ఇయ్యది పిత్తకాసమునందును, పాండురోగమునందును, ప్రశస్తముగ నుండును. ఇది యేడవయోగము.

(౪౦) ఆసవయోగము రెండవది.

మూ. దన్తీకల్కం సమగుడం శీతవారియుతం పిబేత్,
విరేచనం ముఖ్యతమం కామలాహరముత్తమమ్. ౩౧

వ్యా. దంతివేళ్లకల్కమునకు సమభాగము బెల్లమును చేర్చి చల్లనినీళ్లలో కలిపి యొకభాండమున వైచి మూతమూసి, చీలమన్ను లేపనముచేసి, ఆసవసంధానవిధిప్రకారము భూస్థాపితముచేసి సిద్ధముచేయునది. ఇయ్యది మిక్కిలి ముఖ్యమైన విరేచనౌషధము. కామలారోగమును హరించుటకు ఉత్తమమైనది. ఇది యెనిమిదవయోగము.

(౪౧) ఆసవయోగము మూడవది.

మూ. శ్యామా దన్తీరసే గాఢః పిప్పలీఫలచిత్రకైః,
లిప్తేఽరిష్టోఽనిలశ్లేష్మప్లీహపాణ్డూదరాపహః. ౩౨

వ్యా. నల్లతెగడను, దంతివేళ్లను సమభాగములుగ గూర్చి క్వాథముచేసి, బెల్లములో కలిపి యుంచుకొని పిప్పళ్లను చిత్రమూలమును, మెత్తగ నూరి లోభాగమున వ్రాయబడిన యొకక్రొత్తకుండలో పోసి అరిష్టసంధానవిధిప్రకారము సిద్ధముచేయునది. ఈయరిష్టము సేవించినచో వాతకఫంబులును, ప్లీహపాండురోగములును, ఉదరమును హరించును. ఇది తొమ్మిదవయోగము.

(౪౨-౪౩) ఆసవయోగములు రెండు.

మూ. తథా దన్తీద్రవన్త్యోశ్చకషాయే సాజగన్ధయోః,
గౌడః కార్యః; అజశృఙ్గ్యా వా సర్వై సుఖవిరేచనః. 33

వ్యా. దంతీద్రవంతీమూలములు, వాయింటవేరును చేర్చి క్వాథముచేసి పైజెప్పిన రీతిగ పిప్పళ్లను చిత్రమూలమును నూరి లోభాగమున పూయబడినకుండలో బోసి సంధానవిధిప్రకారము అరిష్టమును సిద్ధముచేయునది. ఇది పదియవయోగము.

మరియు దంతీద్రవంతీమూలమును, దుష్టుపువేరును చేర్చి క్వాథముచేసి, యందు బెల్లమును పైజెప్పినరీతిగ అరిష్టమును సిద్ధముచేయునది. ఇయ్యది పదునొకండవయోగము, (పైజెప్పబడిన ఆసవయోగములు ఐదును క్రిందజెప్పబడు మదిరాయోగంబును. "ఏకః ......షట్చ చాసవే" అని నిర్దేశింపబడును.)

(౪౪) మదిరాయోగమొకటి.

మూ. తచ్చూర్ణక్వాథమాషామ్బుకిణ్వలోయసముద్భవాః,
మదిరా కఫగుల్మోఽల్పవహ్ని పార్శ్వకటిగ్రహే. 3౪

వ్యా. దంతీద్రవంతీమూలమును చూర్ణముచేసి యుంచుకొని అందు దంతీద్రవంతీ క్వాథమును, మినుములకషాయమును గూర్చి సురాబీజముగ చేసుకొని, జలముచే మదిరాకల్పప్రకారము మద్యమును సిద్ధముచేయునది. ఇయ్యది కఫరోగము, గుల్మ, మందాగ్ని, ప్రక్కశూల; నడుమునొప్పి అను నీరోగములయందు విరేచనమునకై యుపయోగింపదగును. ఇది పండ్రెండవయోగము.

(౪౫-౪౮) సౌవీరకాదియోగములు నాల్గు.

మూ. అజగన్ధాకషాయేణ సౌవీరకతుషోదకే,
సురాకమ్పిల్లకే యోగౌ లోధ్రవచ్చ తయోః స్మృతౌ. 3౫

వ్యా. దంతీద్రవంతీమూలములను వాయింటవేరు కషాయమునకూర్చి సంధానవిధి ప్రకారము సౌవీరకమును, తుషోదకమును, కల్పింపనగును. మరియు తొమ్మిదివ అధ్యాయమున "సురాం లోధ్రకషాయేణ......మద్యపానాద్విరేచనమ్" (కల్ప. అ. ౯. శ్లో. ౯.) అని చెప్పబడినప్రకారము లోధ్రకషాయమునకు బదులు దంతీద్రవంతీకషాయమును చేర్చి సురాయోగమును కల్పించునది. మరియు "కమ్పిల్లకకషాయేణ......పునః పిబేత్" (కల్ప. అ. ౯. శ్లో. ౧౦) అని చెప్పబడిన కమ్పిల్లకయోగమును గల్పించునది.

ఇచ్చట సౌవీరకయోగమున లోధ్రకషాయమునకు బదులు దంతీద్రవంతీకషాయ మును జేర్చియు, కంపిల్లకయోగమున లొద్దుగుచూర్ణమునకు బదులు దంతీద్రవంతీ చూర్ణమును కంపిల్లక కషాయము చేర్చియు సేవింపనగునని విశేషము నెరుంగునది.

ఇచ్చట సౌవీరక-తుషోదక-సురా-కమ్పిల్లకయోగములు నాల్గును "ఏకస్సౌవీరకేఽ థైకో యోగః స్యాత్తు తుషోదకే,ఏకాసురా కమ్పిల్లకేచైకః"అని సంగ్రహమున నిర్దేశింప బడును. ఈనాల్గుయోగములును, పైనవివరించిన పండ్రెండుయోగములును చేరినమొత్తము మూడవషోడశిక మగును. ఈమూడు షోడశికయోగములు చేరి దంతీద్రవంతీ విరేచన యోగములు నలువదియెనిమిదియోగము లగును. ఇవియే "దంతీద్రవంతీకల్పేఽస్మిన్ ప్రోక్తాః షోడశికాః త్రయః" అని సంగ్రహమున పరిగణనముచేయబడినవి.

## అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. దధ్యాదిషు త్రయః, పఞ్చ ప్రియాలాద్యేష్వథో రసే,
స్నేహేషు వై త్రయో, లేహాః షట్, చూర్ణే త్వేక ఏవచ.
ఇక్షావేకం, తథా ముద్గమాంసానాం చ రసాః త్రయః,
యవాగ్వాదౌ త్రయః, చైక ఉక్త ఉత్కారికావిధౌ. ౩౭
ఏకశ్చ మోదకే, మద్యే చైకస్తత్క్వాథతైలకే,
చూర్ణమేకం, పునశ్చైకో మోదకః, పఞ్చ చాసవే. ౩౮
ఏకః సౌవీరకేఽథైకో యోగః స్యాత్తు తుషోదకే,
ఏకా సురా, కమ్పిల్లకే చైకః, పఞ్చ ఘృతే స్మృతాః. ౩౯
దన్తీద్రవన్తీకల్పేఽస్మిన్ ప్రోక్తాః షోడశికాస్త్రయః,
నానావిధానాం యోగానాం భక్తిదోషామయాన్ప్రతి. ౪౦

వ్యా. ఈయధ్యాయము దంతీద్రవంతులతో చేరినవిరేచనయోగములు దధి-తక్ర-సురామండములతో మూడును, ప్రియాల-కోల-బదర-పీలు -. శీధు-పులన నైదుటితో నాల్గును; మాంసరసములతో మూడును, స్నేహములతో మూడుయోగంబులును, లేహ్యరూపముగ నారుయోగంబులును, చూర్ణయోగం బొకటియు, ఇక్షుయోగం బొకటియు, ముద్గమాంసరసములతో మూడుయోగంబులను యవాగువు మున్నగువానితో మూడు యోగంబులును, ఉత్కారికామోదకయోగంబులు రెండును, మద్యయోగం

బొకటియు, చూర్ణమోదకయోగంబులు రెండును, ఆసవయోగము లైదును, సౌవీరక-తుషోదక-సురా-కంపిల్లయోగములు నాల్గును చేరి నలువదియెనిమిది విరేచనయోగము లగును. దంతీద్రవంతులను ప్రధానముగ జేసి పైచెప్పినరీతిగా పలుతెరంగులైన విరేచ నౌషధయోగములును రోగియొక్క యభిరుచిని వాతాదిదోషములను ఆయారోగములను పట్టి చెప్పబడినవి తత్తదనుసారముగ వీని నుపయోగింపనగును. ఈవిషయసంగ్రహశ్లోక ములలో "పఞ్చ ఘృతే స్మృతాః"అని చెప్పినవానికి అర్థము కానరాదు. లేక "తయోః కల్కే...అని లాత్రిషు" (౯.౧౦) అని చెప్పబడిన స్నేహయోగములు మూడును; "రసే దంత్యాజశృఙ్గ్యోశ్చ గుడక్షౌద్రఘృతాన్వితః" (౧౧) అని చెప్పబడిన లేహరూప ఘృతయోగం బొకటియు, "దంతీం ద్రవంతీ మరిచం...పిబేద్ఘృతేన" (౨౩) అని చెప్పబడిన ఘృతానుపానంబును జేరి ఐదుఘృతయోగములగునని "పంచఘృతే స్మృతాః" అని నిర్దేశించియుండవచ్చునని తోచెడి.

మరియు—"పఞ్చ ప్రియాలాద్యైః" అనుచోట పంచశబ్దము ప్రియాల-కోల-బదర - పీలు - శీధువులను ద్రవ్యసంఖ్యను నిర్దేశించియున్నదికాని యోగసంఖ్యా నిర్దేశము కానేరదు. అచ్చట శీధుశబ్దము ప్రియాలాదులనాల్గిటితో వేరువేరుగ నన్వ యించుటచే నాల్గుయోగములే యగునుకాని, ఐదుయోగములు కాదు. అట్లులైనచో యోగసంఖ్యలో వ్యత్యాసము తప్పక సంభవించును. కావున "పంచ ప్రియాలాద్యైః" అనుసంఖ్యానిర్దేశము ద్రవ్యముల నుద్దేశించినదికాని యోగనిర్దేశము కాదనుట సమంజసము.

### వమనవిరేచనౌషధయోగసంఖ్యావివరణము.

మూ. త్రిశతం పఞ్చపఞ్చాశత్ యోగానాం వమనే స్మృతం,
ద్వే శతే నవకాః పఞ్చ యోగానాం తు విరేచనే. ౪౧
ఊర్ధ్వానులోమభాగానామిత్యుక్తాని శతాని షట్,
ప్రాధాన్యతః సమాశ్రిత్య ద్రవ్యాణి దశ పఞ్చచ. ౪౨

వ్యా. శరీరమునం- దూర్ధ్వభాగమునందలి దోషములను వెడలింపజేయుటకై మూడువందలయేబదియైదు వమనయోగములును; అధోభాగమునందలి దోషములను అధోమార్గముగ వెడలింపజేయుటకై రెండువందలనలుబదియైదు విరేచనౌషధయోగ ములును; ఈరెండునుచేరి ఆరువందల ఔషధయోగములు ఈకల్పస్థానమున చెప్పబడినవి. అందు మొదటిఅధ్యాయమున "ఫలజీమూత......కృతవేధనానాం" అని నిర్ధేశింపబడి

అరువమనద్రవ్యములను ప్రధానముగజేసి వమనౌషధయోగంబులును; "శ్యామాత్రివృత్......ద్రవంతీనాంచ" అని నిర్దేశింపబడిన తొమ్మిదివిరేచనద్రవ్యములను ప్రధానముగజేసి విరేచనౌషధయోగంబులును, కల్పనాభేదములచే వివరింపబడినది. మొత్తమున వమనవిరేచనద్రవ్యముల పదునైదిటిని ప్రధానముగ నుంచుకొని ఆ యాకల్పనాభేదములచే ఔషధరూపములుగ కల్పించి వమనవిరేచనయోగములు ఆరువందలుగ విభజించి చెప్పబడినది.

## కల్పస్థానమునందలి వమనవిరేచనౌషధయోగములపట్టిక.

| అధ్యాయము. | కల్పనామములు. | యోగసంఖ్య. | |
|---|---|---|---|
| 1 | ఫలకల్పము. | 133 | |
| 2 | జీమూతకల్పము. | 39 | |
| 3 | ఇక్ష్వాకుకల్పము. | 45 | |
| 4 | ధామార్గవకల్పము. | 60 | |
| 5 | వత్సకకల్పము. | 18 | |
| 6 | కృతవేధనకల్పము. | 60 | |
| | వమనౌషధయోగములమొత్తము | | 355 |
| 7 | శ్యామాత్రివృత్కల్పము. | 110 | |
| 8 | చతురంగుళకల్పము. | 12 | |
| 9 | తిల్వకకల్పము. | 16 | |
| 10 | సుధాకల్పము. | 20 | |
| 11 | సప్తలా-శంఖినీకల్పము. | 39 | |
| 12 | దంతీ-ద్రవంతీకల్పము. | 48 | |
| | విరేచనౌషధయోగములమొత్తము. | | 245 |
| | రెండిటిసముదాయము. | | 600 |

## ప్రధానద్రవ్యమునుబట్టి ఆయాయోగసంజ్ఞ.

భవన్తి చాత్ర:—

మూ. యద్ధి యేన ప్రధానేన ద్రవ్యం సముపసృజ్యతే,
　　తత్సంజ్ఞకః స సంయోగో భవతీతి వినిశ్చితమ్.　　౪3

ఫలాదీనాం ప్రధానానాం గుణభూతాః సురాదయః,
తే హి తాన్యనువర్తన్తే మనుజేన్ద్రమివేతరే. ౪౪

వ్యా. ఏ ఔషధయోగములయందు ఏద్రవ్యము ప్రధానముజేసి చేర్పబడునో అట్టి ప్రధానద్రవ్యము పేరుచేతనే ఆయౌషధయోగము వ్యవహరింపబడును. మరియు పైజెప్పిన ఔషధయోగములయందు ఫలజీమూతాదియోగములయందు ప్రధానములుగ నున్నను సురాసౌవీరకము మున్నగునప్రధానములైన ఇతరద్రవ్యములు జేర్పబడినను అయ్యవి (యొకప్రభువును తక్కినజనులందరును ఆశ్రయించి ప్రధానభూతుడయిన రాజుకు ప్రతికూలములేక తదనుకూలకృత్యముల చేయుభంగి) ప్రధానభూతములైన విరేచనాదిద్రవ్యములకు అనుకూలముగనే విరేచనాదికృత్యముల నెరవేర్చుచుండును.

విరుద్ధవీర్యసంయోగముచే గల్గుగుణములు.

మూ. విరుద్ధవీర్యమప్యేషాం ప్రధానానామబాధకం,
అధికం తుల్యవీర్యే హి క్రియాసామర్థ్యమిష్యతే. ౪౫
(సమానవీర్యేఽప్యధికం క్రియాసామాన్యమిష్యతే,)

వ్యా. పైజెప్పినరీతిగ వమనాద్యౌషధములయందు ప్రధానములుగనుండు ఫలజీమూతాదిద్రవ్యములు విరుద్ధవీర్యములైన మాంసరసాది అప్రధానద్రవ్యములు చేరియున్నను, ప్రధానద్రవ్యగుణాదులను బాధించి తత్కార్యమునకు భంగము కల్గింపనేరవు. మరియు ప్రధాన అప్రధానద్రవ్యములు రెండు నసమానవీర్యమును గల్గియున్నయెడ విరేచనాదిక్రియాసామర్థ్యము మిక్కిలి యధికముగా నాయౌషధమునకు కల్గియుండును. ఇదియె విశేషము.

విరుద్ధవీర్యద్రవ్యసంయోజనమునకు కారణములు.

మూ. ఇష్టవర్ణరసస్పర్శగన్ధార్థం ప్రతి చామయం,
అతో విరుద్ధవీర్యాణాం ప్రయోగ ఇతి నిశ్చితమ్. ౪౬

వ్యా. సమానవీర్యగుణాదులుగల యౌషధముల కల్పించినచో నయ్యవి యధికముగ క్రియాసమర్థము లైయుండునని పైన చెప్పబడినది; ఐనను రోగికి మనస్సున కింపైన రసంబును, స్పర్శంబును, గంధంబును, ఔషధమున గల్గియుండుటకును; రోగములయొక్క బలానుసారముగ ఔషధము తీవ్రతనుడిగి వానిపనులను మిక్కిలి తీవ్రములుగాక

సామాన్యములుగ నుండుటకు విరుద్ధవీర్యద్రవ్యములను సంయోగరూపములుగ జేర్చి యౌషధములు గల్పింపబడును.

ఔషధమునకు వీర్యాధిక్యకల్పనమునకు విధి.

మూ. భూయశ్చైషాం బలాధానం కార్యం స్వరసభావనైః,
సుభావితం హ్యల్పమపి ద్రవ్యం స్యాద్బహుకర్మకృత్. ౪౭
స్వరసైస్తుల్యవీర్యైర్వా తస్మాద్ద్రవ్యాణి భావయేత్,

వ్యా. మరియు స్వల్పమైనబలముగల యౌషధమును క్రియాసమర్థముకాకుండును గాన అట్టిద్రవ్యము స్వరసము మున్నగువానియందు విధ్యుక్తప్రకారము పలుమారు భావనచేసి యుపయోగించినచో నయ్యది బలవత్తరవీర్యముకల్గి అనేకక్రియలజేయ సమర్థమగును. కావున కొన్నియౌషధద్రవ్యములను స్వరసములచేతను, వానికి సమానగుణములైన ఇతరద్రవ్యములచేతను, పలుమారు భావనచేసి యౌషధమును గల్పించవలెనని చెప్పబడినది.

ద్రవ్యాంతరసంయోగాదిప్రయోజనము.

మూ. అల్పస్యాపి మహార్థత్వం ప్రభూతస్యాల్పకర్మతామ్, ౪౮
కుర్యాత్సంయోగవిశ్లేషకాలసంస్కారయుక్తిభిః,

వ్యా. పైజెప్పబడిన వమనవిరేచనౌషధములలో స్వల్పమైన వీర్యముగలవారికి అధికవీర్యము కలుగునట్లు సమానగుణవీర్యముగల వస్త్వంతరసంయోగముచేతను, కాలవిశేషమునుబట్టియు, భావన మున్నగు సంస్కారవిశేషముచేతను, యుక్తియుక్తమై వస్త్వంతరవిసంయోగ విశేషముచేతను గల్పింపనగును. అధికవీర్యముగల యౌషధమునకు సమానగుణవీర్యములైన ఇతరవస్తువులను చేర్పకుండుటచేతను, కాలవిశేషమునుపట్టియు, భావన, స్వేదనము మున్నగు సంస్కారవిశేషములచేతను, వానికి స్వభావమైన వీర్యమును తగ్గించవలయును.

వివరణము:—ఈస్థానమున చెప్పబడిన యేదైన నొకయౌషధయోగము మిక్కిలి వీర్యహీనమై స్వల్పముగ పనిచేయునదిగ నున్నయెడ అట్టియౌషధమున సమాన-అధిక-వీర్యముగల ఇతరవస్తుసంయోగముచేతనైనను; కాలవిశేషమునుపట్టియైనను; భావన మున్నగు సంస్కారవిశేషములచేతను, ఆయౌషధమునకు స్వాభావికశక్తికన్న వీర్యమును కల్పించినయెడ తీవ్రముగ పనిచేయును. అట్టి యౌషధమును రోగియొక్క అగ్నిదీప్తిని,

కారణమును, కోష్ఠభేదమును, పట్టి తీవ్రముగా వ్యాపించుటకై యుపయోగింపనగును. మరియు ఔషధము మిక్కిలి తీవ్రమైన వీర్యముకల్గి తీవ్రముగ పనిచేయునదిగ నున్నచో అట్టియోగమునందు చెప్పబడిన సమానాధికగుణము కల ద్రవ్యములను దూరము బుచ్చి కల్పించినచో వాని నైజమైన వీర్యాధిక్యము నుడిగి స్వల్పవీర్యమై వమనవిరేచ నాదికృత్యములను స్వల్పముగనే చేయును. ఇయ్యది మృదుకోష్ఠమునందును, వ్యాధి స్వభావము సామాన్యముగ నున్నపుడు నుపయోగింపదగును అని భావము.

### అనుక్తవమనాద్యౌషధకల్పనావిధి.

మూ. ప్రదేశమాత్రమేతావద్ద్రష్టవ్యమిహ షట్సుతమ్. ౪౯
స్వబుద్ధ్యైవం సహస్రాణి కోటీర్వాపి ప్రకల్పయేత్,
బహుద్రవ్యవికల్పత్వాద్యోగసంఖ్యా న విద్యతే. ౫౦

వ్యా. వమనవిరేచనవిషయమై ఈకల్పస్థానమున చెప్పబడిన ఆరువందలయోగములను దిఙ్మాత్రముగ నిర్దేశింపబడినవి. అట్టి విరేచనద్రవ్యంబులును; వాని వికల్పకల్పనాభేదంబులును సంఖ్యాతీతములై లెక్కిడ నలవికాకయుండును. కావున పైజెప్పినరీతిగ అల్పవీర్యములను సంయోగాదులచే నధికవీర్యములుగను, అధికవీర్యములను విరుద్ధగుణాది ద్రవ్యముల వీడదీయుట సంస్కారము మున్నగువానిచేతను స్వల్పవీర్యముగను చేసికొని యౌషధయోగములను కల్పించినచో వేలు కోట్లసంఖ్యకన్న నధికములగును. కావున రోగియొక్కబలము, అగ్నిదీప్తి, కోష్ఠభేదము మున్నగువానిని గమనించి తత్తదనుగుణముగ నౌషధయోగముల స్వబుద్ధిచే గల్పించి యుపయోగింపవలయునని భావము.

### వమనాద్యౌషధములలో తీక్ష్ణ-మధ్య-మృదుభేదములు, వానిలక్షణములును.

మూ. తీక్ష్ణమధ్యమృదూనాం తు తేషాం శృణుత లక్షణం,
సుఖం క్షిప్రం మహావేగమసక్తం యత్ప్రవర్తతే. ౫౧
నాతిగ్లానికరం పాయౌ హృదయే న చ రుక్కరం,
అంతరాశే మక్షీణ్వాక్ కృత్స్నం దోషం నిరస్యతి. ౫౨
విరేచనం నిరూహో వా తత్తీక్ష్ణమితి నిర్దిశేత్,

వ్యా. వమనవిరేచనౌషధముల నిర్దేశించి తీక్ష్ణ - మధ్య-మృదుభేదంబులును; వాని లక్షణంబులును, నీక్రింద వేర్వేరుగ వివరింపబడును.—శరీరమునకు శ్రమకల్గించక గుదస్థానమున విశేషముగ బాధను కల్గించకయు, హృదయమునందు తీవ్రమైననొప్పిని

గల్గించకయు, ఆమాశయము పక్వాశయము మున్నగు నంతరవేగములను బాధించకయు, శరీరమునందలి దోషము నిశ్శేషముగ బద్ధకములేక యతివేగముతో బయట వెడలింపజేయు వమనవిరేచననిరూహావస్త్యౌషధములు తీవ్రమైనదని యెఱుంగునది. (ఇచ్చట "విరేచనమ్" అనుశబ్దముచే "ఉభయం హి శరీరదోషమలవిరేచనాత్ విరేచనశబ్దం లభతే" (కల్ప. అ. ౧) అను ప్రమాణము ననుసరించి దోషనిర్హరణరూపక్రియాసామాన్యమును పట్టి వమనవిరేచనౌషధములు రెండును గ్రహింపబడును.

### తీక్ష్ణౌషధలక్షణము.

మూ. జలాగ్నికీటైరస్పృష్టం దేశకాలగుణాన్వితమ్. ౫౩
ఈషన్మాత్రాధికైర్యుక్తం తుల్యవీర్యైః సుభావితం,
స్నేహస్వేదోపపన్నస్య తీక్ష్ణత్వం యాతి భేషజమ్. ౫౪

వ్యా. జలముచేతను, నిప్పుచేతను, పురుగులచేతను, స్పృశింపబడక దేశమునకును, కాలమునకును చెప్పబడిన గుణములతోకూడిన యౌషధంబును; యథోక్తప్రమాణమునకన్న కొంచెమధికమైన ప్రమాణముకల ద్రవ్యములతోకూడిన యౌషధంబును; సమానవీర్యములైన ద్రవ్యాంతరములచే చక్కగ భావనచేయబడిన యౌషధంబులును; మిక్కిలి తీక్ష్ణమై తీవ్రముగపనిచేయును. మరియు స్నేహస్వేదములచే విధ్యుక్తప్రకారము శోధనపూర్వాంగముగ దోషములు శిథిలమైయున్నపుడు పైజెప్పినగుణములుగ నౌషధములు తీక్ష్ణములై చక్కగ పనిచేయును.

### మధ్యౌషధలక్షణము.

మూ. కిఞ్చిదేభిర్గుణైర్హీనం పూర్వోక్తైః మాత్రయా తథా,
స్నిగ్ధస్విన్నస్య వా సమ్యక్ మధ్యం భవతి భేషజమ్. ౫౫

వ్యా. పైజెప్పబడినగుణములలో కొన్నిగుణములు మాత్రము కల్గి కొద్దిగ పరిమాణముగల యౌషధము మధ్యవీర్యముగ నుండును. అయ్యది చక్కగ స్నేహస్వేదవిధుల నాచరించినవారికిని మధ్యవీర్యముగనే యుండును.

### మృద్వౌషధలక్షణము.

మూ. మన్దవీర్యం విరూక్షస్య హీనమాత్రం తు భేషజం,
అతుల్యవీర్యైః సంయుక్తం మృదుస్యాన్మందవేగవత్. ౫౬

వ్యా. మిక్కిలి వీర్యము మందమై స్వల్పపరిమాణముగలి సమానగుణములుగాక విరుద్ధవీర్యములైన యౌషధములతో సంయోగముకల్గి వమనవిరేచనౌషధములు మృదువుగ నుండును. మరియు స్నేహస్వేదముల నాచరింపక రూక్షశరీరముగలవారికి నుపయోగింప బడిన యౌషధమును మృదువుగనుండును. అట్టి మృదువైనయౌషధము వమనవిరేచన వేగములను స్వల్పముగనే చేయును.

తీక్ష్ణాద్యౌషధముల నుపయోగింపదగినవిషయము.

మూ. అకృత్స్నదోషహరణాదశుద్ధీ తే బలీయసాం,
మధ్యావరబలానాం తు ప్రయోజ్యే సిద్ధిమిచ్ఛతా. ౫౭

వ్యా. పైజెప్పబడిన మధ్య - మృదు - విరేచనముల రెండును మిక్కిలి బలశాలు లైన రోగులకును, ప్రబలమైన దోషములవారికిని, ఉపయోగించినయెడ దోషములను పూర్తిగ వెడలింప సమర్థములు కానేరవు. కావున మధ్యమమైన బలముగలరోగులకు, మధ్యవీర్యమైన విరేచనౌషధమును, హీన బలులైనవారికిని, స్వల్పదోషముకలవారికిని మృదువిరేచనౌషధంబు నుపయోగింపదగును. ఇత్తెరంగున బలతారతమ్యమును గమనించి కార్యసిద్ధికాగోరు వైద్యుడు మధ్యమృదువిరేచనౌషధముల నుపయోగింపవలయును.

ఇచ్చట "అకృత్స్నదోషహరణాత్" అని కారణమును జెప్పుటవలన బలిష్ఠు లైనవారికిని దోషము స్వల్పముగ నున్నపుడు దోషముల పూర్తిగ వెడలించునని తోచినయెడ మధ్యమృదువిరేచనములగూడ నుపయోగింపదగునని యెరుంగునది. మధ్య-అల్పబలులకుమాత్రము దోషమును పూర్తిగ వెడలింపగల్గునుగాన మధ్య-మృదువిరేచనముల నియతముగ నుపయోగింపదగునని భావము.

తీక్ష్ణ-మధ్య-మృదువ్యాధిలక్షణములు.

మూ. తీక్ష్ణో మధ్యో మృదుర్వ్యాధిః సర్వమధ్యాల్పలక్షణః,
తీక్ష్ణాదీని బలాపేక్షీ భేషజాన్యేషు యోజయేత్. ౫౮
(తీక్ష్ణాదీని భిషక్ తేషు బలాపేక్షీ ప్రయోజయేత్)

వ్యా. తీక్ష్ణ - మధ్య - మృదుభేదములచే జ్వరాదిరోగంబులును మూడుతెరంగు లగును. అందు ఆయావ్యాధికి చెప్పినలక్షణములన్నియు పూర్ణముగ నుండినచో నవ్యాధి తీక్ష్ణము. వ్యాధికి చెప్పబడినలక్షణములు మధ్యమముగ నుండినచో మధ్యమవ్యాధి యనియు, లక్షణములు స్వల్పముగ నుండినచో మృదువనియు నెరుంగునది. అట్టివ్యాధి

భేదములు గమనించి రోగియొక్కబలము ననుసరించి మృదు - మధ్య - తీక్ష్ణరూపములైన యౌషధములను యథాసంఖ్యముగ ప్రయోగింపదగును. (తీక్ష్ణరోగమునకు తీక్ష్ణౌషధమును, మధ్యమరోగమునకు మధ్యమౌషధమును, మృదువ్యాధికి మృద్వౌషధమును వరుసగ నుపయోగింపదగునని భావము. అందును తీక్ష్ణరోగముగలవానికి బలము చక్కగనున్నపుడే తీక్ష్ణౌషధము నుపయోగింపదగునని "బలాపేక్షీ" అనుపదముచేత సూచింపబడినది.)

పిత్తము కనబడునందాక వమనౌషధప్రయోగవిధి.

మూ. దేయం త్వనిర్హృతే పూర్వం పీతే పశ్చాత్పునః పునః,
భేషజం వమనార్థీయం ప్రాయ ఆపిత్తదర్శనాత్. ౫౯

వ్యా. వమనౌషధమును త్రాగినపుడు దోషము చక్కగ వెడలకున్నయెడ వమనము నకైతొలుత నుపయోగింపబడిన యౌషధమునే మరల పలుమారు నుపయోగింపవలయును. ఇత్తెరంగున ఆమాశయమునుండి పిత్తపసరు వెడలువరకును వమనౌషధము నుపయోగింప వలయును. (వమనౌషధము త్రాగినచో నామాశయమునందలి కఫము తొలుత పూర్తిగ వెడలి, వెంటనే పిత్తము వెడల నారంభించును. కఫము నిశ్శేషముగ వెడలినవెనుక పిత్తము వెడలకమునుపే వమనముల నాపవలయును. ఈవిషయమే "పిత్తాంతమిష్టం వమనం" అని సిద్ధిస్థానమున (అ. ౧. శ్లో. ౧౪) చెప్పబడినది. కావున వమనౌషధమును సేవించినపుడు కఫరూపదోషమును వమనరూపముగ వెడలకున్నయెడ కఫము నిశ్శేషముగ వెడలి పిత్తము పొడసూపువరకు వమనౌషధమునే పలుమా రుపయోగించవలయును. లేశమాత్రమయిన పిత్తపసురు అగుపడినచో నంతట వమనౌషధము నాపవలయునని భావము.)

త్రివిధబలానుసారముగ నౌషధప్రయోగవిధి.

మూ. బలత్రైవిధ్యమాలక్ష్య దోషాణామాతురస్య చ,
పునః ప్రదద్యాద్భైషజ్యం సర్వశో వా వివర్జయేత్. ౬౦

వ్యా. దోషముయొక్కయు, రోగియొక్కయు ప్రవర - మధ్యమ - అవరబల భేదములను గమనించి, అందు దోషంబును, రోగియు, బలవత్తరమైయున్నపుడే పైజెప్పిన రీతిగ వమనౌషధమును మాటిమాటికి నుపయోగింపవలయును. అటుగాక రోగికిని దోషమునకు సంబంధించిన బలము మధ్యమముగ నున్నయెడ నొకసారి మాత్రము వమనౌషధము త్రాగింపవలయును; అట్టిబలము మిక్కిలి హీనస్థితి నున్నపుడు దోషశోధన మునకై వమనౌషధము నుపయోగింపక బొత్తుగ నుపయోగింపవలయును.

ఔషధాంతరము నుపయోగించవలసినసమయము.

మూ. నిర్హృతే వాపి జీర్ణే వా దోషనిర్హరణే బుధః,
భేషజేఽన్యత్ప్రయుఞ్జీత ప్రార్థయన్సిద్ధిముత్తమామ్. ౬౧

వ్యా. దోషమును బైటవెడలింపజేయుటకైన యౌషధము నుపయోగించినపుడు అయ్యది దోషమును వెడలింపకయే (ఔషధము మాత్రము) బైటవెడలినను, అట్టి యౌషధము (వమనారంభమైన సంక్షోభాదుల గల్గింపక) జీర్ణాభిముఖమైనను, చికిత్సా ఫలమునుగోరు విద్వద్వైద్యుడు ఆదినముననే మరల వమనౌషధమును ప్రయోగింపవలెను. (వమనౌషధము పక్వముకాకయే వమనముల గల్గించును కావున వమనమునకు తొలుత నుపయోగింపబడిన యౌషధము వమనమును గల్గించునుద్రేకము లేకయున్నపుడు జీర్ణావస్థ నొంది మందవీర్యమై యున్నదని యెరింగి, మరల నాదినముననే వేరు వమనౌషధమును ప్రయోగింపవలెనని భావము.) ఇచ్చట 'దోషనిర్హరణే' అనుపదమునకు దోషముల వెడలించుటకు సాధనమైనదని యర్థము. అయ్యది 'భేషజే' అనుపదమునకు విశేషణము.

వమనౌషధప్రయోగమున ఔషధజీర్ణకాలమును నిరీక్షింప నవసరము లేదనుట.

మూ. అపక్వం వమనం దోషం (దోషాన్) పచ్యమానం విరేచనం,
నిర్హరేత్; వమనస్యాతః పాకం న ప్రతిపాలయేత్. ౬౨

వ్యా. వమనౌషధము పాకమునొందకయే దోషములను వెడలించుస్వభావము కల్గియుండును. విరేచనౌషధము పాకమునొందుదోషముల వెడలించును. కావున వమనౌషధమును తొలుత ప్రయోగించినపుడు దోషముల వెడలించుప్రయత్నము లేకున్నపుడు దానిపాకకాలమును ప్రతీక్షించక వెంటనే మరల వమనౌషధమును ప్రయోగించవలెనని యర్థము.

అవస్థావిశేషముచే విరేచనౌషధమున పునఃప్రయోగవిధి.

మూ. పీతే ప్రస్రంసనే (ప్రస్కన్దనే) దోషాన్ న నిర్హృత్య జరాం గతే,
వమితే చౌషధే ధీరః పాయయేదౌషధం పునః. ౬౩

వ్యా. విరేచనౌషధమును ప్రయోగించినపుడు దోషములను వెడలించకయే జీర్ణమై యున్నను, ఔషధమును త్రాగినవెంటనే అయ్యది వమనరూపముగ(ఔషధముమాత్రము) బైటవెడలినను, ఆదినముననే మరల విరేచనౌషధమును త్రాగించవలెను.

మూ. దీప్తాగ్నిం బహుదోషం తు దృఢస్నేహగుణం నరం,
దుశ్ఛర్దం తదహర్భుక్తం శ్వోభూతే (భూయః) పాయయేత్పునః.

వ్యా. విరేచనమునకై ఔషధము నుపయోగించినపుడు విరేచనములు చక్కగ కాక దోషము కొద్దిగ వెడలినప్పుడు, అట్టిరోగికి జఠరాగ్నిదీప్తమై దోషము ప్రబలముగ నుండి శరీరమున స్నేహగుణము దృఢముగ కల్గి స్నిగ్ధమైయుండినచో నాటిదినము యుక్తమైన పథ్యాహారమును వానికి బెట్టి మరునాడు మరల విరేచనౌషధమును వానికి త్రాగించవలెను.

ఇచ్చట "దృఢస్నేహగుణం" అని చెప్పుటవలన దోషము పూర్తిగ వెడలక శరీరము స్నిగ్ధముగనుండువానికే మరునాడు విరేచనౌషధమును మరల ప్రయోగింపనగును, కాని శరీరము స్నిగ్ధముకానినాడు మరల విరేచనమును ప్రయోగింపదగదని తెలిసెడి. అట్టి యెడ నస్నిగ్ధావస్థయందు విరేచనౌషధము నుపయోగించినచో చక్కగ శోధనచేయ లోపడు; కావున స్నేహనమునే యాచరించుట యుక్తమని భావము.

దుర్బలాదులకు స్వల్పవిరేచనమున జేయదగినవిధి.

మూ. దుర్బలో బహుదోషశ్చ దోషపాకేణ యో నరః,
విరిచ్యతే శనైరోభ్షజ్యైః (రసైరోభ్షజ్యైః)
భూయస్తమనుసారయేత్. ౬౫

వ్యా. విరేచనౌషధమును త్రాగినరోగి బలహీనుడై దోషములు ప్రబలములుగ నుండు నపుడు దోషములు పరిపక్వములై యుండుటచే మెలమెల్లగ విరేచనములగు చున్నచో అట్టి యవస్థయందు వాతము ననులోమముగ జేయు భోజనపదార్థముల నుపయోగించి దానిమూలముగ దోషముల వెడలింపనగును. (దోషములు పక్వములై గమనోన్ముఖములుగ నున్నపుడు మరల విరేచనౌషధమును ప్రయోగించినచో విరేచనము లధికములై అతియోగదోషము సంభవించును గాన భోజ్యపదార్థముల నుపయోగించియే దోషముల వెడలింపవలెనని భావము.)

దోషశేషశమనోపాయము.

మూ. వమనైశ్చ విరేకైశ్చ విశుద్ధస్యాఽప్రమాణతః (ప్రమాణతః),
భోజనాన్తరపానాభ్యాం (భోజనోత్తరపానాభ్యాం)
దోషశేషం శమం నయేత్. ౬౬

వ్యా. వమనములును విరేచనములును తీవ్రముగనైనను (దోషబాహుళ్యముచే) కోష్ఠము చక్కగ శుద్ధముకాక కొంచెము శేషించి యున్నచో పావనమైన యవాగువు మున్నగు తేలికగనుండు నాహారముతో కూడ కషాయాదుల త్రాగించియైనను, భోజనా

నంతరము కషాయము త్రాగించియైనను దోషశేషమును శమింపజేయనగును. (మరల విరేచనౌషధము నుపయోగింపజనదనుట). ఇచ్చట "ప్రమాణతః" అను పాఠాంతరమున—సమ్యగ్యోగమునందును భోజనకషాయములను, కోష్ఠమున కొంచెముగ నంటికొనియుండు దోషము శమించుటకై యుపయోగింపవలెనని యర్థము.

—మృదుశోధనౌషధమును ప్రయోగింపదగినవారు.—

మూ. దుర్బలం శోధితం పూర్వం అల్పదోషం చ మానవం,
అపరిజ్ఞాతకోష్ఠం చ పాయయేదౌషధం మృదు. ౬౭

వ్యా. బలహీనుడైనవానికిని, తొలుత శోధనముచేసినపిదప దోషశేషముకలవానికిని, దోషము స్వల్పముగ నుండువానికిని, కోష్ఠము మృదుమధ్యాదిభేదములచే నిర్ణయించి తెలిసికొన వలనుపడనిస్థితి నుండువానికిని మృదువీర్యమైన యౌషధమును శోధనమునకై యుపయోగింపనగును. (పైజెప్పినవారికి తీక్ష్ణౌషధము నుపయోగించినచో శోధనాతియోగంబును బలహీనంబును కల్గును కావున మృదుశోధనము నుపయోగింపవలెనని భావము.)

మూ. శ్రేయో మృద్వసకృత్పీతం అల్పబాధం నిరత్యయం,
న చాఽతితీక్ష్ణం యత్ క్షిప్రం జనయేత్ప్రాణసంశయమ్. ౬౮

వ్యా. పైజెప్పబడిన దుర్బలాదులకు మృదువైన శోధనౌషధమును పలుమారుపయోగించినను, తీక్ష్ణౌషధమున కన్న స్వల్పముగనే బాధగల్గించును. అపాయమును గల్గింపనేరదు; కావున మృదుశోధనమునే యుపయోగించుట మంచిది. అట్టివారికి మిక్కిలి తీక్ష్ణమైన శోధనౌషధము శీఘ్రముగ ప్రాణసందేహమును కల్గించును; కావున నొకప్పుడును తీక్ష్ణౌషధము నుపయోగింపంజనదు.

మూ. దుర్బలోఽపి మహాదోషో విరేచ్యో బహుశోఽల్పశః,
మృదుభిర్భేషజైః దోషాః హన్యుర్హ్యేనమనిర్హృతాః. ౬౯

వ్యా. ప్రబలమైన దోషముకల్గినవాడు బలహీనుడైయున్నను మృదువీర్యములైన శోధనౌషధములను స్వల్పపరిమాణముగ పలుమారుపయోగించి విరేచనము చేయించవలెను. బలహీనావస్థనుండినను దోషము మిక్కిలి బలిష్ఠములుగ నున్నపుడు వానిని వెడలింపజేయకున్నయెడ రోగిని తప్పక చంపును; (కావున దుర్బలుడుగ నున్నవానికి దోషములు బలిష్ఠముగ నున్నచో మృదుశోధనముల పలుమారుపయోగించి వెడలించవలెనని భావము).

## విరేచనౌషధ మూర్ధ్వముగ వ్యాపించినపుడు జేయదగినచికిత్స.

మూ. యస్యోర్ధ్వం కఫసంసృష్టం పీతం యాత్యానులోమితం,
వమితం కబలైశ్శుద్ధం లఙ్ఘితం పాయయేత్తు తమ్. ౭౦

వ్యా. విరేచనకై త్రాగబడిన ఔషధము కఫముతో కూడి యూర్ధ్వమార్గముగ వెడలుచున్నచో, నాఔషధమును పూర్తిగ వమనము చేయించి, యాహారము నిడక లంకణముచేయించి, వేడినీళ్లచే శుభ్రముగ నోరును కుత్తుకను పుక్కిలించి మరల విరేచనౌషధమును త్రాగింపవలెను. (ఇచ్చట 'ఆనులోమిక' మన అనులోమముగ విరేచనముల జేయు ఔషధమని యెరుంగునది.)

## దోషము వెడలకున్నపుడు చేయదగినచికిత్స.

మూ. విబద్ధే(న్ధే)ఽల్పే చిరాద్దోషే స్రవత్యుష్ణం పిబేజ్జలం,
తేనాధ్మానం తృషాచ్ఛర్దిః విబన్ధశ్చైవ శామ్యతి. ౭౧

వ్యా. విరేచనౌషధమును త్రాగినపుడు ఆశయమునందలిదోషము బద్ధగింపబడి దోషము కొంచెము కొంచెముగ చిరకాలమునకు స్రవించుచున్నచో కడుపులో గడబిడ చేయుచు నుబ్బరించి దప్పియు వాంతియు కల్గును; అట్టియెడ మిక్కిలి వేడిగనుండు జలమును త్రాగించినచో బద్ధకము సడలి దోషము చక్కగ వెడలి కడుపుబ్బరము మొదలగు నుపద్రవములు శమించును.

## దోషముచే నౌషధము నిరోధింపబడినప్పుడు చేయుచికిత్స.

మూ. భేషజం దోషరుద్ధం చేత్ నోర్ధ్వం నాధః ప్రవర్తతే,
సోద్గారం సాఙ్గశూలం చ; స్వేదం తత్రాఽవచారయేత్. ౭౨

వ్యా. ఔషధము దోషములచే బద్ధగింపబడినపుడు ఔషధ మూర్ధ్వమార్గముగనైనను అధోమార్గముగనైనను వెడలక కుక్షిలోనే బద్ధగింపబడియుండును. దానంజేసి యొకలింతలును ఒడలినొప్పులును కల్గును. అట్టియెడ స్వేదవిధిచే చెమటబట్టించవలెను.

## దోషాతిప్రవృత్తియందు చికిత్స.

మూ. సువిరిక్తే తు (సువిరిక్తస్తు) సోద్గారం ఆశ్వేవౌషధముల్లిఖేత్,
అతిప్రవర్తనం జీర్ణే (అతిప్రవృత్తం జీర్ణే తు)
సుశీతైః స్తమ్భయేద్భిషక్. ౭3

వ్యా. (విరేచనౌషధమును సేవించినపుడు కఫము బైటవెడలునందాక విరేచనములు అగునెడ చక్కగ విరేచనములయినవని యెరుంగవలెను. ఈవిషయము "కఫాంతం తు విరేకమాహుః" (సి. అ. ౧.) అని చెప్పబడును). అట్టి సమ్యగ్విరిక్తలక్షణములు కానవచ్చినపుడును ఔషధము పూర్తిగ జీర్ణముగాక పచ్యమానావస్థనుండి ఔషధస్వరూపము గానవచ్చుచు త్రేనుపులు వెడలుచున్నయెడ అట్టి జీర్ణశేషౌషధమును వెంటనే వమనము చేయించి బైటవెడలింపవలెను. (లేనియెడ నాఔషధము పూర్తిగ జీర్ణమగుసరికి విరేచనములు ప్రమాణాధికములై విరేచనాతియోగమునంజేసి కల్గునుపద్రవములు సంభవించును; కావున నాదినముననే వమనము చేయించవలెనని భావము. ఇచ్చట త్రేనుపులబట్టి ఔషధమును పచ్యమానావస్థనున్నదని యెరుంగునది.)

మరియు విరేచనౌషధము పూర్తిగ జీర్ణమై సువిరిక్తలక్షణములు కానవచ్చిన పిమ్మటకూడ విరేచనములు అంతట నిలువక యధికముగ నగుచున్నయెడ శీతోపచారముల జేసి విరేచనములు కాకుండ స్తంభింపజేయవలెను.

### ఔషధముకఫముచే నిరుద్ధమగునెడ చేయదగినవిధి.

మూ. కదాచిత్ శ్లేష్మణా రుద్ధం తిష్ఠత్యురసి భేషజం,
క్షీణే శ్లేష్మణి సాయాహ్నే రాత్రౌ వా తత్ ప్రవర్తతే. ౨౪

వ్యా. విరేచనౌషధమును సేవించినపు డొకానొకసమయమున నాఔషధము కఫముచే నడ్డగింపబడి రొమ్మునందే నిలచియున్నయెడ కఫము క్షీణించిన పిదప సాయంకాలమునందైనను; రాత్రియందైనను ఔషధము వ్యాపించి విరేచనముల వెడలింపజేయును.

ఇచ్చట ప్రతీకారము జెప్పకున్నను రొమ్ము బరువుగనుండుట మున్నగులక్షణముల బట్టి పైజెప్పినరీతిగ నౌషధము వ్యాపింపనీయక శ్లేష్మము అడ్డగించియున్నదని గమనించి, అట్టి యవస్థయందు రాత్రిపర్యంతము ప్రతీక్షించినచో ఔషధము జీర్ణమై తమంతటనే విరేచనములగునని యెరుంగునది. రాత్రివరకు నిరీక్షించి యుండుటయే ప్రతీకారమని పైవాక్యముచే సూచితము.

### విరేచనౌషధమువాతముచే నావరింపబడునెడ కల్గులక్షణములు, చికిత్స.

మూ. రూక్షాఽనాహారయోర్జీర్ణే (విరూక్షాఽఽనాహా యోర్జీర్ణే)
విష్టభోర్ధ్వం గతేఽపి వా,
వాయునా భేషజే, త్వన్యత్ సస్నేహలవణం పిబేత్. ౨౫

వ్యా. కోష్ఠము స్నిగ్ధముకాక రూక్షముగ నుండువారికిని, ఆహారమును భుజింపక యుండువారికిని, విరేచనౌషధము జీర్ణించియున్నను, వాతముచే నడ్డగింపబడి యౌషధ మూర్ధ్వభాగమున జేరియున్నను విరేచనములు కానేరవు; అట్టియెడ నితరవిరేచనౌషధ మున సైంధవలవణమును స్నేహమును జేర్చి త్రాగింపవలెను.

పిత్తావృతలక్షణము దానిచికిత్స.

మూ. తృణ్మోహభ్రమమూర్ఛాయాః స్యుశ్చేత్ జీర్యతి భేషజే
(స్యుర్జీర్యతి హి భేషజే),
పిత్తఘ్నం స్వాదు శీతం చ భేషజం తత్ర శస్యతే. ౭౬

వ్యా. విరేచనౌషధము జీర్ణమగునపుడు (అయ్యది పిత్తముచే నావరింపబడినచో) దప్పి కల్గును. మైకము గ్రమ్మును. ఒడలు తిరుగును. మూర్ఛ గ్రమ్మును. అట్టియెడ పిత్త హారంబును, మధురరసంబును, శీతవీర్యంబును నగునౌషధమును సేవించుట ప్రశస్తము.

విరేచనౌషధము కఫముతో గూడినపుడు కల్గులక్షణములు, చికిత్సయును.

మూ. లాలాహృల్లాసవిష్టమ్భలోమ(శీత)హర్షాః కఫావృతే,
భేషజం తత్ర తీక్ష్ణోష్ణం కట్వాది కఫనుద్ధితమ్. ౭౭

వ్యా. విరేచనౌషధము కఫముచే నావరింపబడినప్పుడు నోట జొల్లుకారును. ఓకళింతలు కల్గును. విష్టంభంబును రోమహర్షంబును కల్గును. (దానంజేసి విరేచనములు చక్కగ గానేరదు). అట్టియెడ తీక్ష్ణంబును, ఉష్ణవీర్యంబును, కటురసంబును కలఔషధ మును సేవించుట మిక్కిలి హితకరము.

ఔషధము నిరుద్ధమైనపుడు అవస్థావిశేషమునుబట్టి లంఘనవిధి.

మూ సుస్నిగ్ధం క్రూరకోష్ఠం చ లఙ్ఘయేదవిరేచితం,
తేనాస్య స్నేహజః శ్లేష్మా సఙ్గశ్చోపశామ్యతి. ౭౮

వ్యా. మిక్కిలి స్నిగ్ధమైన కోష్ఠముకలవానికిని, క్రూరకోష్ఠునకును విరేచనములు చక్కగకాక కొంచెముగనైనచో వానికి లంకణము చేయించవలెను. దానివలన స్నేహ ముచే కల్గినకఫము హరించి దోషసంగము శమించును.

విరేచనముకాకయె ఔషధము జీర్ణమైనచో జేయవలసిన చికిత్స.

మూ. రూక్షబహ్వానిలక్రూరకోష్ఠవ్యాయామశాలినాం (శీలినాం),
దీప్తాగ్నీనాం చ భైషజ్యం అవిరిచ్యైవ జీర్యతి. ౭౯
తేభ్యో వస్తిం పురా దత్వా పశ్చాద్దద్యాద్విరేచనం,
వస్తిప్రవర్తితం దోషం (వస్తిప్రచాలితం దోషం)
హరేచ్ఛీఘ్రం విరేచనమ్. ౮౦

వ్యా. రూక్షమైన కోష్ఠముకలవారికిని, కోష్ఠమున వాతము ప్రబలముగ నుండు వారికిని, క్రూరమైన కోష్ఠముకలవారికిని, జఠరాగ్ని మిక్కిలి ప్రబలముగ నుండువారికిని విరేచనౌషధము విరేచనముల గావింపకయే జీర్ణమగును. అట్టివారికి తొలుత (స్నేహ) వస్తిప్రయోగముచేసి పిమ్మట విరేచనౌషధము నియ్యవలెను. అటుచేసినచో వస్తిప్రయోగముచే స్వస్థానమునుండి చలించి బైటవెడలనున్నదోషమును విరేచనౌషధము శీఘ్రముగ బైటవెడలింపజేయును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—"నిరూహదానాత్పవనాద్భయం స్యాత్" నరో విరిక్తస్తు నిరూహదానం వివర్జయే త్సప్తదినాన్యవశ్యమ్, శుద్ధో నిరూహేణ విరేచనం తు" (సిద్ధి. అ. ౧) అనువాక్యములచే విరేచనానంతరము వెంటనే నిరూహవస్తిచేయ దగదనియు, నిరూహవస్తిని చేసినపిదప నేడుదినములవరకును నిరూహవస్తిని ప్రయోగింప దగదనియు చెప్పబడినది. కావున నిచ్చట "వస్తిం పురా దత్వా" అనుచోట స్నేహవస్తి యని యర్థముచేయు టుచితమని కొందరు చెప్పెదరు. మరికొందరు:—కేవల నిరూహవస్తిమాత్రము వాతవర్ధకముకాని స్నేహవస్తిని నిరూహవస్తిని (రెండిటిని) ప్రయోగించునెడ వాతరోగముల కవకాశము కల్గదు కావున నిచ్చట నిరూహాస్నేహవస్తులు రెండును విధింపబడునని చెప్పెదరు. మరియు నిరూహానంతరము వెంటనే విరేచనము నుపయోగింపక సప్తాహకాలవ్యవధిచే నుపయోగించునెడ నిర్బాధకము కావున రూక్షాదికోష్ఠులకు తొలుత స్నేహనిరూహవస్తులజేసి పిదప విరేచనౌషధము నుపయోగించుట సమంజసమగునని యెరుంగునది.

విరేచనముగాకయే దోషములు క్షీణించువారికి చేయదగినయుపాయము.

మూ. రూక్షాశనాః కర్మనిత్యాః యే నరాః దీప్తపావకాః,
తేషాం దోషాః క్షయం యాన్తి కర్మవాతాఽఽతపాఽగ్నిభిః.
(వాయుకర్మాఽగ్నిభిస్తేషాం యాన్తి దోషాః క్షయం సదా)

విరుద్ధాఽధ్యశనాఽజీర్ణదోషానపి సహన్తి తే,
స్నేహ్యాస్తే మారుతాత్ రక్ష్యాః
నాఽవ్యాధౌ తాన్ విశోధయేత్ (విరేచయేత్). ౮౨

వ్యా. కేవలము రూక్షమైన యాహారమును భుజించువారికిని, నిరంతరముగ వ్యాయామము మున్నగుపనుల నభ్యాసముగ జేయువారికిని, మిక్కిలి దీప్తమైన జాఠరాగ్ని కలవారికిని, వాతాదిదోషములు వ్యాయామాదికర్మలచేతను, గాలిచేతను, ఎండచేతను, నిప్పువేడిమిచేతను శమించియుండును. వారికి విరుద్ధాశనముచేనైనను, అధ్యశనముచే నైనను, అజీర్ణభోజనముచేనైనను సంభవించుదోషములను వారు సహింపనోపుదురు. కావున వారికి వాతమువలన బాధ సంభవించకుండునట్లు స్నేహనమును జేయు టుచితము కాని, వ్యాధివిశోధనముచేతనే సాధింపవలసినప్పుడుతప్ప సామాన్యముగ వారికి శోధనము నుపయోగింపంజనదు. (ఈవిషయమునే స్థలాంతరమున నిట్లుపదేశించిరి:—"అనీరితానాం దోషాణామీరణం న ప్రశస్యతే, ఉపర్యుపరి సక్తానాం అశ్మనామివ ఘట్టనం(తాడనమ్)." దోషములుగ మనోస్సుఖములు కాకుండునపుడు వానిని రేపెట్టుటకై శోధనము జేయుట యుక్తముకాదు. అటుచేసినచో నొకదానిపై నొకటి వరుసగ నిమిడి బిగిసియుండురాతిని పెకలించినచో నది చలించనిభంగి దోషములు వెడలనేరవు. కావున దోషములు స్వస్థానము నుండి చలింపకుండుదోషములను వెడలింపదగదని భావము.)

స్నిగ్ధరూక్షవిరేచనౌషధముల నుపయోగింపదగినవారు.

మూ. నాతిస్నిగ్ధశరీరాయ దద్యాత్ స్నేహవిరేచనం,
స్నేహోత్క్లిష్టశరీరాయ రూక్షం దద్యాద్విరేచనమ్. ౮౩

వ్యా. మిక్కిలి స్నిగ్ధమైన శరీరముకలవానికి స్నేహరూపమైన విరేచనౌషధము నుపయోగింపంజనదు. ఆట్టి స్నేహముచే దోషములు సడలియున్న వారికి రూక్షమైన విరేచనౌషధము నియ్యవలెను.

విధిపూర్వకసంశోధనప్రయోజనము.

మూ. ఏవం జ్ఞాత్వా విధిం ధీరః దేశకాలప్రమాణవిత్,
విరేచనం విరేచ్యేభ్యః ప్రయచ్ఛన్నాపరాధ్యతి. ౮౪
విభ్రంశో విషవద్యస్య సమ్యగ్యోగో యథాఽమృతం,
కాలేష్వవశ్యం పేయం చ తస్మాద్యత్నాత్ ప్రయోజయేత్.

వ్యా. పైజెప్పబడిన సంశోధనవిధానమును చక్కగ గమనించి, దేశపరిస్థితిని కాలస్వభావము ఔషధముయొక్క పరిమాణమును చక్కగ దెలిసినవైద్యవరుడు విరేచనమున కర్హులైనవారికి విరేచనౌషధము నిచ్చినచో పొరబాటులేనివాడగును. మరియు సంశోధనౌషధమును చక్కగ విధానము ననుసరింపక వ్యతిరేకముగ నుపయోగించినచో నయ్యది విషతుల్యమై హింసింపజూచును. సంశోధనము చక్కగ పనిచేసినచో నమృతమునుబోలె కాపాడ సమర్థమై యుండును; కావున శోధనౌషధము నుపయోగింపదగిన సమయమున శోధనము నవశ్యముగ త్రాగింపవలెను.

కోష్ఠబలాద్యనుసారముగ శోధనౌషధమాత్రాకల్పనవిధి.

మూ. ద్రవ్యప్రమాణం తు యదుక్తమస్మిన్ మధ్యేషు తత్ కోష్ఠ వయో బలేషు, తస్మూలమాలమ్బ్య భవేద్వికల్ప్యం (తస్మూలమాలమ్బ్య భవేద్వికల్పః), తేషాం వికల్పోఽభ్యధికోనభావః.

వ్యా. ఈశోధనప్రకరణమున కొన్నిద్రవ్యములకు ఔషధములకును ఉపయోగించుటకై కర్షము మున్నగుపరిమాణము అచ్చటచ్చట జెప్పబడినది; అట్టిప్రమాణము మధ్యకోష్ఠములను మధ్యవయస్సును మధ్యబలమును ఉద్దేశించి చెప్పబడినది. కావున అట్టిప్రమాణమును ప్రధానముగజేసికొని కోష్ఠము, వయస్సు, బలము ఉత్తమముగ నున్నపుడు అధికపరిమాణమును; కోష్ఠాదులు హీనములుగ నున్నపుడు తక్కువపరిమాణమును గల్పించి తత్తదనుసారముగ నుపయోగింపదగును.

ఔషధములకు సంబంధించిన మానపరిభాష. అందు వంశీమొదలు శాణమువరకుంగల మానములు.

మూ. షడ్వంశ్యస్తు మరీచిస్స్యాత్, షణ్మరీచ్యస్తు సర్షపః,
అష్టౌ తే సర్షపాః రక్తాః తణ్డులశ్చాపి; తద్ద్వయమ్. ౧౭
ధాన్యమాషో భవేదేకః, ధాన్యమాషద్వయం యవః,
అణ్డ(ణ్డీ)కాస్తే తు చత్వారః, తాశ్చతస్రస్తు మాషకః. ౧౮
హేమశ్చ ధాన్యకశ్చోక్తః, భవేచ్ఛాణస్తు తే త్రయః,

వ్యా. ఆరువంశీలు ఒక మరీచి యనబడును. ఆరు మరీచులు ఒక సర్షప మనియు, ఎనిమిది రక్తసర్షపములు (ఎఱ్ఱనియావాలు) ఒక తండులమనియు, రెండు తండులములు ఒక ధాన్యమాషమనియు, రెండు ధాన్యమాషములు ఒక యవమనియు, నాల్గు యవలు

ఒక అండికయనియు, నాల్గు అండికలు ఒక మాషమనియు చెప్పబడును. మాషమనునది హేమమనియు, ధాన్యకమనియు పర్యాయపదములచే జెప్పబడును. అట్టి మాషములు మూడు ఒకశాణ మనబడును.

ఇచ్చట ధ్వంశి యన గవాక్షరంధ్రములనుండి ప్రసరించు సూర్యకిరణములలో గానంబడు రేణువని యెరుంగునది. ఇయ్యది "జాలాంతరగతైస్సూర్యకరైర్వంశీ విలోక్యతే" అని వంశీయనునామాంతరముచే చెప్పబడినది.

### ద్రంక్షణమానము.

మూ. శాణౌ ద్వౌ ద్రక్షణం విద్యాత్ కోలం బదరమేవ చ.　　౮౯

వ్యా. రెండు శాణములు ఒకకోల మనబడును. ఇయ్యది ద్రంక్షణము, బదరము ననుపర్యాయపదములచే జెప్పబడును.

### కర్షమానము.

మూ. విద్యాత్ ద్వౌ ద్రక్షణౌ కర్షం సువర్ణం చాఽక్షమేవ చ,
బిడాలపదకం చైవ పిచుం పాణితలం తథా.　　౯౦
తిన్దుకం చ విజానీయాత్ కవలగ్రహమేవ చ,

వ్యా. రెండు ద్రంక్షణములు (శాణములు నాల్గు) ఒకకర్ష మనబడును. ఇయ్యది సువర్ణము, అక్షము, బిడాలపదకము, పిచువు, పాణితలము, తిందుకము, కవలగ్రహముననుపర్యాయపదములచే (కర్షము) చెప్పబడును.

### శుక్తి-పల-ప్రసృతమానములు.

మూ. ద్వే సువర్ణే పలార్ధం స్యాత్ శుక్తిరష్టమికా తథా.　　౯౧
ద్వే పలార్ధే పలం ముష్టిః ప్రకుఞ్చోఽథ చతుర్థికా,
బిల్వం షోడశికా చామ్రం; ద్వే పలే ప్రసృతం విదుః.　　౯౨

వ్యా. రెండు సువర్ణములు (కర్షములు)అర్ధపలమని చెప్పబడును. ఇయ్యది శుక్తి, అష్టమిక యనుపర్యాయపదములచే జెప్పబడును. రెండు అర్ధపలములు (శుక్తులు) ఒక పలమగును. ఇయ్యది ముష్టి, ప్రకుంచము, చతుర్థిక, బిల్వము, షోడశిక, ఆమ్రము, ననుపర్యాయపదములచే జెప్పబడును. రెండుపలములు ఒక ప్రసృతమని చెప్పబడును. (ఇయ్యది ప్రసృతియని తంత్రాంతరమున జెప్పబడినది.)

### కుడవ-మానికామానములు.

మూ. పలం చతుర్గుణం విద్యాత్ అఞ్జలిం కుడవం తథా,
అష్టమానం తు విజ్ఞేయం, కుడవౌ ద్వౌ తు మానికా. ౯౩

వ్యా. నాల్గుపలములు ఒక కుడవము, ఇయ్యది అంజలి, అష్టమానము ననుపర్యాయపదములచే జెప్పబడును. రెండు కుడవములు ఒక మానిక యనంబడును.

### ప్రస్థ-ఆఢకమానములు.

మూ చత్వారః కుడవాః ప్రస్థః, చతుః ప్రస్థమథాఽఽఢకం,
పాత్రం తదేవ విజ్ఞేయం.

వ్యా. నాల్గు కుడవములు ఒక ప్రస్థము, నాల్గు ప్రస్థములు ఒక ఆఢకము, ఆఢకమనునది పాత్రము, అనుపర్యాయపదముచే జెప్పబడును.

### కంస-ద్రోణమానములు.

మూ. కంసః ప్రస్థాష్టకం తథా. ౯౪
కంసశ్చతుర్గుణో ద్రోణశ్చాఽర్మణం నల్వణం చ తత్,
స ఏవ కలశః ఖ్యాతో ఘట ఉన్మానమేవ చ. ౯౫

వ్యా. ఎనిమిది ప్రస్థము లొక కంసము, నాల్గు కంసము లొక ద్రోణము. ఈ ద్రోణమనునది అర్మణము, నల్వణము, కలశము, ఘటము, ఉన్మానము అను నీపర్యాయపదములచే జెప్పబడును.

### శూర్ప-గోణీమానములు.

మూ. ద్రోణస్తు ద్విగుణశ్శూర్పః విజ్ఞేయః కుమ్భ ఏవ చ,
గోణీం శూర్పద్వయం విద్యాత్, ఖారీం భారం తథైవ చ. ౯౬

వ్యా. రెండు ద్రోణము లొకశూర్పమనియు, కుంభమనియు చెప్పబడును. రెండు శూర్పము లొకగోణియగును. గోణి యనునది ఖారి; భారము అనుపర్యాయపదములచే జెప్పబడును.

### వాహ-తులామానములు.

మూ. ద్వాత్రింశతం విజానీయాత్ వాహం శూర్పాణి బుద్ధిమాన్,
తులాం పలశతం విద్యాత్ పరిమాణవిశారదః. ౯౭

వ్యా. ముప్పదిరెండు శూర్పము లొక వాహ మనబడును. నూరుపలము లొకతుల యని చెప్పబడును. ఇత్తెరంగున పరిమాణమును తెలిసినపండితులు చెప్పెదరు.

### ద్రవ-ఆర్ద్రద్రవ్యములకు ద్వైగుణ్యవిధి.

మూ. శుష్కద్రవ్యేష్విదం మానం ఏవమాది ప్రకీర్తితం,
ద్విగుణం తు ద్రవేష్విష్టం తథా సద్యోద్ధృతేషు చ. ౯౮

వ్యా. ఏదైన నొక యోగమునందు కొన్నిద్రవ్యముల నిర్దేశించినపుడు ఆయా ద్రవ్యముల నిర్దేశించిన పరిమాణమును ఎండఁనెండిన ద్రవ్యములకు మాత్రము నియతముగ నుండును. ఆద్రవ్యములలో కొన్నిటిని ఎండినవానిని కొన్నిటిని ద్రవములను కొన్నిటిని పచ్చిగను జేర్చునెడ అట్టిద్రవార్ద్రద్రవ్యములను వానికి జెప్పిన పరిమాణమునకు ద్విగుణముగ (రెట్టింతగ) జేర్చుకొనవలెను.

ఎండినద్రవ్యములయందు గురుతీక్ష్ణగుణములు కల్గియుండును కావున వానిని వానికి నియమింపబడిన పరిమాణముగనే జేర్పనగును. పచ్చివిగనుండు ద్రవ్యముల జేర్చునెడ వానికి తీక్ష్ణాదిగుణము లుండవు కావున రెట్టింతపరిమాణముగ జేర్పనగునని భావము. ఈవిషయమునే తంత్రాంతరమున నిట్లు నిర్ణయించిరి:—"శుష్కద్రవ్యస్య యా మాత్రా త్వార్ద్రస్య ద్విగుణా హి సా, శుష్కస్య గురుతీక్ష్ణత్వాత్ తస్మాదర్థం ప్రయోజయేత్."

మరియు నిచ్చట పరిమాణసామాన్యముగ శుష్క - ఆర్ద్ర - ద్రవముల మూటికిని భేదము చెప్పబడినది. కాని తంత్రాంతరములయందు కొన్నివిశేషవచనములబట్టి వ్యవస్థ యేర్పడుచున్నది. ఎట్టులన:—"గుఞ్జాదిమానమారభ్య యావత్స్యాత్ కుడవస్థితిః, ద్రవార్ద్రశుష్కద్రవ్యాణాం తావన్మానం సమం మతమ్, ప్రస్థాదిమానమారభ్య ద్విగుణం తత్ ద్రవార్ద్రయోః. మానం; తథా తులాయాశ్చ ద్విగుణం న క్వచిత్ స్మృతమ్." ద్వైగుణ్యం న తులామానాత్ ఇతి మానవిదో విదుః" ఈవాక్యములనుబట్టి గుంజాపరిమాణము మొదలుజేసి కుడవపరిమాణమువరకుంగల పరిమాణములను శుష్క - ఆర్ద్ర - ద్రవములయందు తారతమ్యము లేక యథోక్తపరిమితములుగనే గ్రహింపవలెననియు, ప్రస్థము (పదునారుపలములు) మొదలుచేసి తులా (నూరుపలముల) పరిమాణమువరకుంగల పరిమాణములను ద్రవ-ఆర్ద్రములకు రెట్టింతగ గ్రహింపవలెననియు, తులామానము మొదలుజేసి ద్రవార్ద్రములకు ద్వైగుణ్యము లేదనియు వ్యవస్థ యేర్పడును.

మఱియు నీద్వైగుణ్యము ఏద్రవ్యము ఆర్ద్రముగనైనను పచ్చిగనైనను ఉపయోగింపందగియుండునో అట్టి యార్ద్రద్రవ్యమునకేగాని, నియతముగ నార్ద్రముగనే యుపయోగింపవలసిన అడ్డసరము, కొడిసెపాల, కూశ్మాండము మున్నగు ద్రవ్యములకు ద్వైగుణ్యము లేదు. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"వాశాకుటజకూశ్మాణ్డశతావర్యమృతా లతా, కురణ్టైరణ్డలశునఖర్జూరబిసకత్తృణాః, పఞ్చమూలం లఘు మహత్ తృణాఖ్యం మాంసమార్ద్రకమ్, శారీబామ్బుఘనోశీరం కమలం కందమౌషధం. నిత్యార్ద్రమేవ యోజ్యం స్యాత్ న తేషాం ద్విగుణం భవేత్" పైజెప్పిన వాశాది ద్రవ్యములు పచ్చిగనున్ననే వీర్యవంతములు కావున వానికి ద్వైగుణ్యా మవసరములేదని భావము.

### తులా-పలములకు ద్వైగుణ్యనిషేధము.

మూ. (యత్ర)యద్ధి మానం తులా ప్రోక్తా పలం వా తత్ ప్రయోజయేత్

వ్యా. ఎచ్చటనైనను తులాశబ్దమునుగాని పలశబ్దమునుగాని పరిమాణమునకు నిర్దేశించియున్నయెడ నచ్చట మాత్రము ఆర్ద్రద్రవ్యమునకు ద్వైగుణ్యము లేక యథోక్త పరిమాణముగనే గ్రహింపవలెను.

### అనుక్తమానాదినిర్ణయపరిభాష: స్నేహపాకపరిభాష.

మూ. అనుక్తే పరిమాణే తు తుల్యం మానం ప్రకీర్తితమ్. ౯౯
ద్రవకార్యేఽపి చానుక్తే సర్వత్ర సలిలం స్మృతం,
యతశ్చ పాదనిర్దేశః చతుర్భాగస్తతశ్చ సః. ౧౦౦

వ్యా. ఔషధయోగములయందు ద్రవ్యముల మాత్రము నిర్దేశించి వానికి వేరువేరుగ పరిమాణమును నిర్దేశించకుండునెడ నాద్రవ్యములను సమభాగములుగ గ్రహింపవలెనని యెఱుంగునది.

మఱియు ద్రవముల జేర్చి సాధింపవలసిన తైలాదియోగములయందు స్వరసకషాయాది రూపద్రవవిశేషములను నిర్దేశించకుండునెడ సామాన్యముగ జలమును ద్రవమునకై గ్రహింపనగును. ఎచ్చటనైన పాదాంశమని నిర్దేశించినయెడ నాల్గవవంతుగ నెఱుంగునది.

### స్నేహపాకవిధియందు అనుక్తద్రవానిర్ణయపరిభాష.

మూ. జలస్నేహౌషధానాం తు ప్రమాణం యత్ర నోదితం,
తత్ర స్యాదౌషధాత్ స్నేహః స్నేహాత్తోయం చతుర్గుణమ్

వ్యా. (స్నేహపాకవిధియందు జలంబును కల్కంబును స్నేహంబును నియతముగ నుండవలెను. అట్టియెడ) జలమునకును స్నేహమునకును కల్కౌషధమునకును పరిమాణము నిర్దేశింపకున్నయెడ నచ్చట కల్కౌషధమునకన్న స్నేహంబును, స్నేహమునకన్న జలంబును నాల్గింత లుండవలెనని యెరుంగునది. (వానిపరిమాణమును విశేషవిధిగ నిర్దేశించియున్నచో 'నిర్దిష్టే తత్తదేవతు' అనుప్రమాణాంతరముచేత నిర్దేశింపబడిన పరిమాణమునే గ్రహింపవలెనని భావము.)

### త్రివిధస్నేహపాకములు, వానిలక్షణములు.

మూ. స్నేహపాకస్త్రిధా జ్ఞేయః మృదుర్మధ్యః ఖరస్తథా,
తుల్యే కల్కేన నిర్యాసే భేషజానాం మృదుస్స్మృతః. ౧౦౨
సంయావ ఇవ నిర్యాసే మధ్యో దర్వీం విముఞ్చతి,
శీర్యమాణే తు నిర్యాసే వ ర్త(ర్త్య)మానే ఖరస్తథా. ౧౦౩

వ్యా. స్నేహపాకము మృదు - మధ్య - ఖరభేదములచే మూడు తెరంగులు. స్నేహమునందు కల్కాదులను యథోక్తముగ జేర్చి పక్వముచేయునపుడు అందు జేర్పబడిన యౌషధములకల్కము, పక్వమగునపుడు నాకల్కముతో సమముగనే యున్నయెడ నయ్యది మృదుపాకము. స్నేహమునం దడుగుననుండుకల్కమును గరిటెతో దీసి చేతపట్టి చూచినచో నయ్యది గరిటె కంటికొనక నేతిని గోధుమపిండితో కలిపి మర్దించి చేయబడినయుండవలె చేతికంటక మెత్తపడియున్నచో నయ్యది మధ్యపాకము. అట్టి కల్కమును పాకమగుచున్నపుడు గరిటెతో దీసి వ్రేళ్లలో నలిపినచో నయ్యది కరకుగల్గి విడిసి పోవుచున్నచో నయ్యది ఖరపాకమని యెరుంగునది.

ఈ త్రివిధపాకభేదము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినవి:—''ఈషత్సరస కల్కస్తు స్నేహపాకో మృదుర్భవేత్, మధ్యపాకే చ సిద్ధశ్చ కల్కే నీరసకోమలే. ఈషత్కఠినకల్కశ్చ స్నేహపాకో భవేత్ ఖరః'' స్నేహమును పక్వముచేయునపుడు అందు జేర్పబడిన యౌషధకల్కమును పరీక్షించినచో నయ్యది కొంచెము ద్రవముతో గూడియున్నయెడ మృదుపాకమనియు, కల్కమున ద్రవము కొంచెమైనను లేక మెత్తపడి

యున్నచో మధ్యపాకమనియు, కల్కము కొంచెము కఠినముగ నున్నచో ఖరపాక మనియు నర్థము.

త్రివిధపాకోపయోగ్యములు.

మూ. ఖరోఽభ్యఙ్గే స్మృతః పాకః, మృదుర్నస్యక్రియాసు చ,
మధ్యపాకస్తు పానార్థే వస్తౌ చ వినియోజయేత్. ౧౦౪

వ్యా. ఖరపాక మభ్యంగనమునకును, మృదుపాకము నస్యకర్మకును, మధ్యపాకము త్రాగుటకును వస్తిప్రయోగమునకును, ఉపయోగింపదగును.

మానద్వైవిధ్యము.

మూ. మానం చ ద్వివిధం ప్రాహుః కాలిఙ్గం మాగధం తథా,
కాలిఙ్గాత్ మాగధం శ్రేష్ఠం ఏవం మానవిదో విదుః. ౧౦౫

వ్యా. కాలింగమానమనియు, మాగధమానమనియు మానము (పరిమాణము రెండుతెరంగుల నుండును. అందు కాలింగమానమునకన్న మాగధమానము శ్రేష్ఠమని పరిమాణమును చక్కగ దెలిసిన వైద్యవరులు చెప్పెదరు.

ద్రవ్యములగూర్చి పరిమాణము ఆయాదేశముల ననుసరించి పలుదెరంగుల నుండును. అందు కలింగమానమనియు మాగధమానమనియు రెండువిధముల మానమును ఆయుర్వేదతంత్రములయందు సామాన్యముగ గ్రహింపబడినది. అందు కలింగదేశమున వాడుకలోనుండునది కాలింగమానమనియు, మగధదేశమున ప్రాయికముగ వాడబడు మానము మాగధమనియు నన్వర్థముగ జెప్పబడినది. ఈమానభేదములన్నియు నాయుర్వేద పరిభాషయందు వివరింపబడినవి. విస్తరభీతిచే నిచ్చట వివరింపబడలేదని యెరుంగునది.

కల్పస్థానోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. కల్పార్థశ్శోధనం, సంజ్ఞా పృథక్షేతుః ప్రవర్తనే,
దేశాదీనాం ఫలాదీనాం గుణాః, యోగశతాని షట్. ౧౦౬
వికల్పహేతుర్నామాని తీక్ష్ణమధ్యాఽల్పలక్షణం,
విధిశ్చావస్థికో మానం స్నేహపాకశ్చ దర్శితః. ౧౦౭

వ్యా. శోధనౌషధమును పలుతెరంగుల కల్పించుటకు ప్రయోజనము, వమన విరేచనములకు శోధనసంజ్ఞ, శోధనౌషధములు కొన్ని వమనరూపముగ నూర్ధ్వమార్గముగను, విరేచనరూపమున నధోమార్గముగను దోషముల వెడలించుటకు వేరువేరు కారణములు, జాంగలాదిదేశములు మున్నగువానియొక్కయు మ్రంగకాయ మున్నగువానియొక్కయు వేరువేరుగుణములు, అట్టియౌషధములచే వేరువేరుగ గల్పింపబడిన యాఱువందల శోధనౌషధయోగంబులు, శోధనయోగముల పలువిధములుగ గల్పించుటకు కారణము, మ్రంగకాయ మున్నగుశోధనౌషధముల పర్యాయనామములు (ఇవి ప్రత్యధ్యాయము నందును ఆయాద్రవ్యము నుద్దేశించి ప్రారంభమున చెప్పబడినవి.) శోధనౌషధములయొక్క తీక్ష్ణ - మధ్య - మృదులక్షణంబులు, అవస్థాభేదము ననుసరించి శోధనౌషధము నుపయోగించువిధానము (అట్టి యవస్థావిశేషములయందు చేయదగినవిధానము), ద్రవ్యమానపరిభాష, త్రివిధస్నేహపాకభేదములు వానిలక్షణములు ఇవియన్నియు నీకల్పస్థానమున విపరముగ జెప్పబడినవి.

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే, చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే కల్పస్థానే దన్తీద్రవన్తీకల్పో నామ ద్వాదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితకల్పస్థానమున దంతీద్రవంతీకల్పమనునది ద్వాదశాధ్యాయము (స్థానంబును) సమాప్తము.

ఇతి విశ్వనాథవిరచితసద్వ్యాఖ్యాయాం తు చరకకౌముద్యామ్,
కల్పస్థానం చేదం సువినాస్ట్రలోపమపనితేతి.

ఇది శ్రీశ్రీశ్రీ ఈశహస్తిసంస్థానాధిపాస్థానవిద్వదవతంస సర్వతంత్రస్వతంత్ర బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రివరేణ్య చరణకమలసంసేవాసమాసాదిత పాణినీయాదిశాస్త్రవిజ్ఞానసముల్లసితుండును, అష్టాఙ్గహృదయ - చరకసంహితా - మాధవనిదానాద్యాయుర్వేద తంత్రాంధ్రవ్యాఖ్యాతయు, శ్రీవైఖానసకులతిలక - ఆయుర్వేదమార్తాండ-భిషఙ్మణి - వైద్యరత్న-పండిత డి. గోపాలాచార్యసంస్థాపితాయు

ర్వేదాశ్రమాస్థానవిద్వాంసుండును, ఉభయభాషాకవితావిరాజితుండును, శ్రౌతప్రక్రియాధౌరేయుండును, ఆపస్తంబసూత్ర - కౌండిన్యగోత్రపవిత్ర నుదురుపాటి వంశపయఃపారావారసుధాకరుండును, వేదవేదాఙ్గశ్రౌతాభిజ్ఞ బ్రహ్మశ్రీ మహాగ్నిచిత్ సీతారామవాజపేయయాజి శ్రీమతీసీతామ్బాసోమపీథినీ సాధ్వీమతల్లికాతనూభవుండును, ఉభయభాషాకవితాధురీణ శ్రౌతాగమధౌరేయ-బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యయాయజూకానుజుండును నగు వైయాకరణవిద్వాన్ బ్రహ్మశ్రీ పండిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రిచే విరచితమగు కౌముది యను చరకసంహితాంధ్రవ్యాఖ్యానమున కల్పస్థానము సమాప్తము.

---

శ్రీరస్తు.

# చరకసంహిత

## ఆంధ్రవ్యాఖ్యానసహితము



## సిద్ధిస్థానము

### ప్రథమాధ్యాయము.

మూ. అథాతః కల్పనాసిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యాఖ్యానప్రారంభము.

జగదిదమన్తర్లీనం వ్యాకృత్యాఽనుప్రవిశ్య బహుధా తత్,
యః క్రీడతే నిరన్తరమీశమనీశం హృదా తమాకలయే.
యోగేన మానసభవం మలినం తథైవ వాచోఽపి శబ్దవితతేరనుశాసనేన,
శారీరకం త్వమలవైద్యకబోధనేన యోఽపాకరోద్భువి పతఞ్జలిమానతస్తమ్.
బ్రహ్మాణం దక్షమహం బలసూదనమశ్వినౌ భరద్వాజమ్,
నత్వా సిద్ధిస్థానం వ్యాకుర్వే చరకసంహితాయాశ్చ.
స ఏవ పూర్ణాం చరకస్య కౌముదీవ్యాఖ్యాం తనోత్యార్యజనోపయోగినీమ్,
స విశ్వనాథో లఘుధీరయం స్వయం విమోహమాయాన్తి చ యత్ర యోగినః.

అవతరణిక:—వమన విరేచనకల్పనాదిభేదముల నిరూపించుకల్పస్థానమును జెప్పిన పిదప అట్టివమనాదులను విధ్యుక్తముగ జేయక తద్విపరీతముగ జేసినదానిచేగల్గు (అయోగాతియోగాదులచే సంభవించు) వ్యాపత్తులకు దగినచికిత్సావిధానమును దెల్పుసిద్ధిస్థానము చెప్పబడును.

వ్యా. కల్పస్థానమును జెప్పినపిదప సిద్ధిస్థానము జెప్పబడును. అందును సిద్ధిస్థానమున జెప్పబడు పంచకర్మలకు సామాన్యమగు పంచకర్మల కల్పనావిధానము మున్నగువిషయముల

తెల్పుకల్పనాసిద్ధియను నధ్యాయమును త్రికాలజ్ఞానసంపన్నుడగు ఆత్రేయమహర్షి యుపదేశించినదానికన్న న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

పంచకర్మకల్పనావిషయమై యగ్నివేశుల పండ్రెండుప్రశ్నములు.

మూ. కా కల్పనా పఞ్చసు కర్మసూక్తా ?(1)
క్రమశ్చ కః ?(2) కిం చ కృతాకృతేషు,
లిఙ్గం తథైవాతికృతేషు ?(3) సంఖ్యా
కా ?(4) కిం గుణః ?(5) కేషు చ కశ్చ వస్తిః ?(6) 3
కిం వర్జనీయం ప్రతికర్మకాలే ?(7)
కృతే క్రియాః వా పరిహారకాలః ?(8)
ప్రణీయమానశ్చ న యాతి కేన ?(9)
కేనైతి శీఘ్రం ?(10) సుచిరాచ్చ వస్తిః ?(11) ౪
సాధ్యా గదాః సైవ్విశ్మమనైశ్చ కేచిత్,
కస్మాత్ప్రియుక్తైః న శమం వ్రజన్తి ?(12);
(సాధ్యా యథాస్వం శమనైశ్చ కేచిత్
కస్మాద్గదాః న ప్రశమం వ్రజన్తి)
ప్రచోదితశ్శిష్యవరేణ సమ్యక్
ఇత్యగ్నివేశేన భిషగ్వరిష్ఠః. ౫
(ఇత్యగ్నివేశో భిషజాం వరిష్ఠం
పప్రచ్ఛ తస్మై స చ సర్వమాహ)
పునర్వసుస్తన్త్రవిదాహ తస్మై
సర్వప్రజానాం హితకామ్యయేదమ్.

వ్యా. (వమనము, విరేకము, ఆస్థాపనము, అనువాసనము, నస్యకర్మము, అనునీ) పంచకర్మములయందును (వానికంగములు) కల్పనావిధానమెద్ది? (1); అట్టిపంచకర్మముల కును, వానిని విధ్యుక్తప్రకారము చేసినపిదప అన్నసంసర్జనమునకును క్రమమెద్ది ? (2); అట్టి వమనాదికర్మలసమ్యగ్యోగ - అయోగ - అతియోగములయందు వేరువేరులక్షణము లెవ్వి? (3); (దోషానుసారముగ) వస్తివిధానసంఖ్య యెద్ది? (4); (ఏయేదోషమునందు ఎన్నెసిమార్లు వస్తిప్రయోగము చేయవలెనని యర్థము), వస్తికర్మలచే గల్గుగుణము

ఇచ్చట మృదుకోష్ఠముకలవారికి మూడుదినంబులును, క్రూరకోష్ఠులకు ఏడుదినంబులును స్నేహనము చేయవలెనని కోష్ఠభేదమునుబట్టి స్నేహవిధికాలము నిర్దేశింపబడినది. ఈవిషయము సూత్రస్థానమున నిట్లుపదేశింపబడినది:—"మృదుకోష్ఠస్త్రిరాత్రేణ స్నిహ్యత్యచ్ఛోపసేవయా, స్నిహ్యతి క్రూరకోష్ఠస్తు సప్తరాత్రేణ మానవః." (సూ. అ. ౧౩ శ్లో. ౬౫) మధ్యకోష్ఠమునుద్దేశించి స్నేహకాలావధి నిర్దేశింపకున్నను ఏడుదినములపరమావధి కాలమనకు మధ్యమైన యైదుదినములవరకును మధ్యకోష్ఠమున పరమావధి స్నేహకాలమని యూహింపదగును.

ఇచ్చట నీనియమము నెరుంగనగును:—మృదు-మధ్య-క్రూరకోష్ఠులు పైజెప్పిన త్రిదిన-పంచాహ-సప్తదినములకు వరుసగ సుస్నిగ్ధులగుదురని యుద్దేశించి పైని కాలావిధి నిర్దేశింపబడినది. ఇచ్చట వివక్షితము ముఖ్యముగ సుస్నిగ్ధత్వము, కావున నొకవేళ స్నేహము స్వల్పమాత్రగ నుపయోగించుటచేతనైనను కారణాంతరములచేనైనను పైజెప్పిన నియతకాలమునకు సుస్నిగ్ధలక్షణము కానంబడనియెడ అట్టి త్రిరాత్రాదికాలమునకు నధికముగ కూడ (సుస్నిగ్ధుడగునందాక) స్నేహవిధి నాచరింపదగును. ఈవిషయమునే వాగ్భటాచార్యులిట్లు సూచించిరి:—"త్ర్యహమచ్ఛం మృదౌ కోష్ఠే క్రూరే సప్తదినం పిబేత్, సమ్యక్ స్నిగ్ధోఽథవా యావత్, అతస్సాత్మ్యీ భవేత్పరమ్" (అ. హృ; సూ. అ. ౧౬. శ్లో. ౨౯). ఇచ్చట సమ్యక్స్నిగ్ధలక్షణములు పూర్తిగ గానవచ్చునందాక స్నేహవిధి చేయనగుననియు, స్నిగ్ధలక్షణములు కానవచ్చినపిదప స్నేహపానము సాత్మ్యమై స్నిగ్ధత నధికముగ జేయజాలదనియు వీరియాశయము. ఈనిర్ణయముచేత నొకవేళ మాత్రాధిక్యాదికారణములచే పైజెప్పిన నియతకాలమునకు ముందుగనే సుస్నిగ్ధలక్షణములు కానవచ్చినచో స్నేహపానమును విరమించవలెననియు ననుజ్ఞనొసంగినట్లు చెప్పదగును.

స్నేహము సాత్మ్యమైనచో మలాదుల వెడలింప నేరదనియు, స్నేహాతియోగమునం జేసి తంద్ర, ఉత్క్లేశము మున్నగునుపద్రవములు కల్గుననియు నెరుంగునది. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"సాత్మ్యీభూతే చ కురుతే న మలానాముదీరణం, అతియోగేన వా వ్యాధీన్ యథామ్భోభ్యతియోజనాత్." ఈవివరణమునుబట్టి కోష్ఠభేదానుసారముగ స్నేహపానావధి సామాన్యముగ జెప్పబడినదనియు, సుస్నిగ్ధలక్షణములు కనవచ్చునందాక స్నేహపానమునకు పరమావధియనియు సిద్ధాంతమేర్పడును.

## స్నేహవిధిగుణము.

మూ. స్నేహోఽనిలం హన్తి మృదూ కరోతి
　　దేహం మలానాం వినిహన్తి సఙ్గమ్.　　౭

వ్యా. సంశోధనాంగముగ జేయబడిన స్నేహవిధి వాతమును హరించును. శరీరమును మృదువుగ జేసి మలబద్ధకమును సడలించును.

## స్వేదకర్మగుణము.

మూ. స్నిగ్ధస్య సూక్ష్మేష్వయనేషు లీనం
　　స్వేదస్తు దోషం నయతి ద్రవత్వమ్,

వ్యా. స్నేహవిధిజేసినపిమ్మట స్నిగ్ధశరీరమునకు స్వేదము విశిష్ప్రకారముచేసి నచో సూక్ష్మరంధ్రములయం దణగియున్నదోషమును ద్రవముగ జేయును.

## వమనవిరేచనముల దోషోత్క్లేశనమునకై యాహారవిధి.

మూ. గ్రామ్యౌదకానూపరసైస్సమాంసైః (సమాషైః)
　　ఉత్క్లేశనీయః పయసా చ వమ్యః.　　౮
　　రసైస్తథా జాఙ్గలజైస్సయూషైః
　　స్నిగ్ధైః (స్నిగ్ధః) కఫాఽవృద్ధికరైర్విరేచ్యః,

వ్యా. వమనము చేయింపవలసినవానికి స్నేహవిధిజేసినపిదప గ్రామములబుట్టిన జంతువులయొక్కయు, జలమున సంచరించుజంతువులయొక్కయు, జలప్రాంతముననుండు జంతువులయొక్కయు మాంసరసములతోనైనను, మాంసములతోనైనను పాలతోనైనను ఆహారమును భుజింపజేసి కఫము వృద్ధినొంది యూర్ధ్వమార్గమున వెడల నుద్యుక్తమగు నట్లు చేయవలెను.

విరేచనము జేయింపదలచిన వానికి స్నేహకర్మ జేసినపిదప (మూడుదినములు) కఫమును వృద్ధినొందింపని జాంగలజంతువులమాంసరసములతోడను యూషములతోడను ఆహారమును భుజింపజేయింపవలెను.

ఇచ్చట విరేచనాంగముగ స్నేహపానము జేసినయెడ స్నేహపానానంతరము మూడుదినములవరకును పైజెప్పినరీతిగ జాంగలమాంసరసాదులతో భుజించి పిదప విరేచనౌషధమును త్రాగవలెననియు, వమనాంగముగ స్నేహపానముజేసినపిదప నొకదినము

మాత్రము గ్రామ్యాది జంతుమాంసరసాదులతో నాహారము భుజించి వమనౌష
త్రాగవలెననియు కాలనియమము నెరుంగునది. ఈవిషయము సూత్రస్థానమున
కారు లిట్లుపదేశించిరి:—"స్నేహాత్ ప్రస్కన్దనం జన్తుః త్రిరాత్రోపరతః
స్నేహవద్ద్రవముష్ణం చ త్ర్యహం భుక్త్వా రసౌదనం, ఏకాహోపరతస్తద్వత్
ప్రచ్ఛర్దనం పిబేత్." (సూ. అ. ౧౩ శ్లో. ౮౧) (ఇచ్చట "ఉత్క్లేశనమన" క
స్వస్థానమునుండి చలింపజేసి యూర్ధ్వమార్గగమనోన్ముఖముగ జేయుట).

—॥ పైజెప్పిన యాహారనియమమునకు కారణము. ॥—

మూ. శ్లేష్మోత్తరః ఛర్దయతి హ్యదుఃఖం (ప్రసృష్టం);
విరిచ్యతే మన్దకఫస్తు సమ్యక్.
అధః కఫేఽల్పే వమనం విరేచయేత్ (విగచ్ఛేత్, నియచ్ఛే
విరేచనం వృద్ధకఫే తథోర్ధ్వమ్,

వ్యా. కఫము వృద్ధినందియున్నపుడు వమనౌషధమును త్రాగినచో శరీర
కష్టములేక సుఖముగ వమనమూలమున కఫమును వెడలించును. కఫము తక్కువగ
తరి విరేచనౌషధమును త్రాగినచో సుఖముగ విరేచనములగును. అటుగాక కఫము
ముగనున్నపుడు వమనౌషధమును త్రాగినచో నయ్యది యధోమార్గమున వెడ
కఫంబధికముగనున్నపుడు విరేచనౌషధమును త్రాగినచో నయ్యది యూర్ధ్వమా
వెడలును. (కావున పైజెప్పినరీతిగ స్నేహపానానంతరము ఒకదినము కఫవర్ధకాహా
భుజించి వమనౌషధమును త్రాగవలెననియు, మూడుదినములు కఫమును తగ్గించున
మును భుజించి విరేచనౌషధమును త్రాగవలెననియు భావము).

ఇచ్చట "త్ర్యహావరం" అని యుపక్రమించి యింతదనుక చెప్పబడినవి.
కల్పనా పంచసు కర్మసూక్తా" అనుమొదటిప్రశ్నమున కుత్తరమని యెరుంగునది.

—॥ { (2) "క్రమశ్చ కః?" అను రెండవప్రశ్నమున కుత్తరము. అందు వమన-విరేచన సేవనక్రమము. } ॥—

మూ. స్నిగ్ధాయ దేయం వమనం యథోక్తం
వాన్తస్య పేయాదిరనుక్రమశ్చ,
(స్నిగ్ధస్య చ స్విన్నవతశ్చ కార్యం
విరేచనం యోగ్యతమం తతశ్చ)

స్నిగ్ధస్య సుస్విన్నతనోర్యథావత్
విరేచనం యోగ్యతమం ప్రయోజ్యం,

వ్యా. పైని జెప్పినరీతిగ స్నేహనవిధిచే సుస్నిగ్ధుడైనవానికి వమనము చేయించు దినమున మరల నభ్యంగనముచే శరీరమును స్నిగ్ధముగజేసి మదనకల్పోక్తవిధిప్రకారము వమనౌషధమును త్రాగించవలెను. చక్కగ వమనములైన పిదప (క్రింద జెప్పబడువిధముగ) పేయాదిక్రమము ననుసరించవలెను. మరియు స్నేహపానముచే సుస్నిగ్ధుడై స్వేదవిధిచే శరీరముపై చక్కగ చెమటబట్టించినవెనుక (శరీర-దోష-బలాద్యనుసారముగ యుక్తమైన) విరేచనౌషధమును విధ్యుక్తప్రకారము త్రాగింపవలెను.

ఇచ్చట పానజనితస్నేహము మందే నిర్దేశింపబడినది. కావున 'స్నిగ్ధాయ దేయం' అనుచోట వమనముల చేయించుదినమున మరల నభ్యంగనముచే స్నిగ్ధశరీరునకు వమనౌషధమును త్రాగింపవలెనని యర్థము. ఈయర్థము చక్రపాణిదత్తవ్యాఖ్యానసమ్మతము.

వమన-విరేచనానంతరము పేయాదిక్రమముగ నన్నసంసర్జనక్రమము.

మూ. పేయాం విలేపీమకృతం కృతం చ
యూషం రసం త్రిర్ద్విరథైకశశ్చ. ౧౧
క్రమేణ సేవేత విశుద్ధకాయః
ప్రధానమధ్యాఽవరశుద్ధిశుద్ధః,

వ్యా. (వమన-విరేచనరూపమైన శోధనమును సేవించునెడ నాయౌషధముచే గల్గుశోధనతారతమ్యభేదమునుబట్టి ప్రధానశుద్ధియనియు, మధ్యమశుద్ధియనియు, అవర (అధమ)శుద్ధియనియు మూడువిధముల నుండును. ఈమూడిటిస్వరూపము "జఘన్య మధ్య" అనుగ్రంథముచే జెప్పబడును.)

అట్టి ప్రధాన-మధ్య-అవరశుద్ధులచే శుద్ధులైనవారిలో ప్రధానశుద్ధిచే చక్కగ శుద్ధశరీరముకలవాడు శోధనానంతరము (నాడుసాయంకాలమునందైనను మరుసటిదినమునందైనను ఉపక్రమించి) మూడు అన్నకాలములయందు పేయను (మెతుకులతోకూడి ద్రవముగనుండునట్లు కాచబడిన) గంజిని త్రాగవలెను. పిమ్మట మూడుఅన్నకాలములయందు విలేపి (కొంచెము ద్రవముగ పక్వముచేయబడిన) యనుగంజిని త్రాగవలెను. అందుపై మూడుఅన్నకాలములయందు అకృత (స్నేహ-లవణములచేర్చి సంస్కరింపక సిద్ధముచేయబడిన) యూషమును, కృత(స్నేహలవణములజేర్చి సంస్కరించి సిద్ధము చేయబడిన) యూషముతోగూర్చిన శాల్యన్నమును ఆహారము చేయవలెను. దానిపై

మూడుఅన్నకాలములయందు అకృత-కృతమాంసరసముతో శాల్యన్నమును భుజింపవలెను. (ఇత్తెరంగున పండ్రెండుఅన్నకాలముల గడపి పిమ్మట మధురాదిరసయుక్తమైనయన్నమును మామూలుగ భుజించునట్లు భుజింపనగునని భావము.)

మరియు మధ్యమశుద్ధిచే విశుద్ధకాయుఁడు శోధనానంతరము పైజెప్పిన పేయ - విలేపి - అకృతకృతయూష-అకృతకృతమాంసరసములను నాల్గిటిని వరుసరెండేసి యన్నకాలములయం దొక్కొకదానిని భుజింపవలెను.

అవరశుద్ధి శుద్ధశరీరుఁడు శోధనానంతరము పేయాదుల నాల్గిటిని ఒక్కొకదాని నొక్కొకయన్నకాలమువంతున వరుసగ భుజించుచు నాల్గుఅన్నకాలములను గడపి పిమ్మట మామూలుగ నన్నమును భుజింపవలెను.

వివరణము:—పేయాదిలక్షణము తంత్రాంతరమున నిట్లుచెప్పబడినది:—"సిక్థైః రహితో మణ్డః, పేయా సిక్థసమన్వితా, యవాగూర్బహుసిక్థా స్యాత్, విలేపీ విరళద్రవా." మెతుకులు లేకుండునట్లు సిద్ధము చేయబడినగంజి మండమనియు, కొంచెముగ మెతుకులతో కూడినది పేయయనియు, మెతుకులు దట్టముగ కల్గినది యవాగువనియు, కొంచెము పలుచక కాచబడినది విలేపియనియు నర్థము.

మరియు అకృత-కృతలక్షణములు సూద (పాక) శాస్త్రమున నిట్లు చెప్పబడినది:— "అస్నేహలవణం సర్వం అకృతం కటుకైర్వినా, విజ్ఞేయం లవణస్నేహకటుకైః సంస్కృతం కృతమ్." నెయ్యిమున్నగుస్నేహములను ఉప్పును కారమును జేర్పక సిద్ధము చేయబడినయూష-మాంసరసాదులన్నియు అకృతమనియు; స్నేహలవణములను కారము జేర్చి సిద్ధముచేసి సంస్కరింపబడినది కృతమనియు నర్థము.

ఇచ్చట "అకృతం కృతం చ" అనుపదములు "యూషం రసం" అను రెండిటికిని విశేషణములుచేసి కృత-అకృతయూషంబును, అట్టిరసంబును, అని యర్థముచేయునది. ప్రధాన-మధ్య-అవర అనుపదములను "త్రిః, ద్విః, ఏకశః" అనువానితో యథాక్రమముగ నన్వయించుటచే ప్రధానశుద్ధియందు మూడేసియన్నకాలములయందును, మధ్యమశుద్ధియందు రెండేసికాలములయందును, అధమశుద్ధియందు నొక్కొకకాలమునందును పేయాదుల నాహారము చేయవలెనని యర్థమగును. ఈయర్థమునే "క్రమేణ" అను పదము దెల్పుచున్నది.

మరియు పైజెప్పబడిన పేయాదిక్రమవివరణము నిట్లెరుంగునది:—మనుజసామాన్యముగ ప్రతిదినమున నుదయంబును సాయంకాలంబును భోజనకాలములగును. ఈవిషయమునే శివదాసుఁడు "అన్నకాలస్తు ఉత్సర్గతస్సిద్ధః సాయంప్రాతశ్చ" అని వివరించెను.

ప్రధానశుద్ధిచే శుద్ధశరీరుడు నాడుసాయంకాలమునందు పేయను నాహారముగ భుజింపవలెను. అత్తెరంగుననే మరుసటిదినమున రెండుకాలములయందును పేయను ఆహారము చేయనగును. పిమ్మట మూడవదినమున రెండుఅన్నకాలములయందును, నాల్గవదినమున నొకయన్నకాలమునందును (చేరి మూడుకాలములయందును) విలేపిని ఆహారము చేయవలెను. నాల్గవదినమున రెండవయన్నకాలమునందును, ఐదవదినమున రెండుఅన్నకాలములయందును (చేరి మూడుఅన్నకాలములయందును) అకృత-కృతయూషములను విభజించి యన్నముతో గలిపి భుజింపనగును. పిదప నారవదినమున రెండన్నకాలములయందును ఏడవదినమున మొదటియన్నకాలమునందును (చేరి మూడుకాలములయందును) అకృత-కృతమాంసరసముల విభజించి యన్నమున జేర్చి భుజింపవలెను. ఇత్తెరంగున నేడవదినమున ప్రథమాన్నకాలమునకు పండ్రెండు అన్నకాలములతో పేయాదిక్రమము పూర్తియగును. పిమ్మట నేడవదినము రెండవయన్నకాలము మొదలుజేసి మామూలుగ మధురాదిరసయుక్తములైన వ్యంజనాదులతో యథేచ్ఛముగ భుజింపనగును. ఈవివరము నే సూత్రస్థానమున "అథైనం సాయాహ్నేఽపరేఽహ్ని సుఖోదకనిషిక్తం,..... సప్తరాత్రేణ ప్రకృతిభోజనమాగచ్ఛేత్." (సూ. అ. ౧౫. సూత్ర. ౨౧. ౨౪) అను వాక్యములచే నాచార్యులు శాసించిరి.

మధ్యమశుద్ధిశుద్ధుడు పైజెప్పినరీతి పేయను ప్రథమదినసాయంకాలమునను, రెండవదినమున నుదయకాలమును ఆహారము చేయునది. పిదప నిత్తెరంగుననే రెండేసి యన్నకాలములయందు విలేపి-అకృతకృతయూష-మాంసరసములను వరుసగ నాహారము చేయునది. ఇట్లు చేసినచో నైదవదినమున ప్రథమాహారకాలమునకు పేయాదిక్రమము ఎనిమిదికాలములు పూర్తియగును. ఐదవదిన సాయంకాలము మొదలు మామూలుభోజనము జేయనగును.

అవరశుద్ధియందు పేయాదుల నాల్గిటిని వరుసగ నొక్కొక భోజనకాలమున నుపయోగించినచో మూడవదినము మొదటియన్నకాలముతో పేయాదిక్రమము పూర్తియగును. పిమ్మట మూడవదినము సాయంకాలము మొదలుచేసి మామూలుగ మధురాదిరసయుక్తమైన యాహారమును భుజింపనగును.

మరియు మొదటి పేయాక్రమమున అకృత-కృత యూషముతో తొలుత రెండుఅన్నకాలములయందు అకృతమును, మూడవయన్నకాలమున కృత (సంస్కరింపబడిన) యూషమును అన్నముతో జేర్చి భుజింపవలెను. అకృతకృతమాంసరసమునకు నిచే విభజన నెరుంగునది. రెండవ పేయాక్రమమున అకృతయూషము నొకయన్నకాలమునను,

కృతయూషము రెండవయన్నకాలమునను జేర్చి భుజింపవలెను. మాంసరసమునకు నిదే పద్ధతి. మూడవపేయాక్రమమున కాలభేదమున కవకాశము లేకుండుటచే నొకయన్న కాలముననే అకృతకృతయూషముల విభజించి యన్నమున జేర్చుచు భుజింపనగును. మాంసరసమునకు నిదే విభాగము.

మరియు ప్రధానశుద్ధియందు వమనాదులవేగము లధికసంఖ్యాకములుగ నుండు టంజేసి దోషము బాహుళ్యముగ వెడలి సంక్షోభం బధికముగనుండును; దానంజేసి యగ్ని మిక్కిలి మందగించియుండును; కావున ప్రధానశుద్ధియందు అగ్ని నానాట దీపించుటకై పేయాదిక్రమము సప్తరాత్రాధికముగ జెప్పబడినది. మధ్యమశుద్ధియందు అగ్నిదీప్తి మధ్యమముగను, అవరశుద్ధియందు కొంచెము హీనముగను ఉండును, కావున తత్తదను సారముగ పేయాదిక్రమమునకు కాలావధి తక్కువగ విధింపబడినది. పేయాదిక్రమా వధికాల తారతమ్యమునకు జాఠరాగ్నిబలతారతమ్యమే కారణమని ముఖ్యభావము నెరుంగునది.

## పేయాదిక్రమ ప్రయోజనము.

మూ. యథాణురగ్నిస్తృణగోమయాద్యైః
సన్ధుక్ష్యమాణో భవతి క్రమేణ. ౧౨
మహాన్ స్థిరః సర్వపచస్తథైవ (సర్వసహస్తథైవ)
శుద్ధస్య పేయాదిభిరన్తరగ్నిః,

వ్యా. లోకమునందు బాహ్యాగ్ని మిక్కిలి సూక్ష్మముగ నున్నయెడ మిక్కిలి సూక్ష్మములైన గడ్డిపోచలు పిడకపొడి పొట్టు మున్నగువానిని క్రమముగ నగ్నిపై నునిచి రగిలింపజేసినచో నయ్యది క్రమక్రమముగ రగిలి మిక్కిలి బలిష్ఠమై గాఢమైన పదార్థ ముల నన్నిటిని పచింప (తుదకు కఠినమైన లోహములనైన కరిగింప) సమర్థమగును; (ఇది యనుభవసిద్ధము). అత్తెరంగుననే శోధనమునంజేసి బలహీనమై సూక్ష్మావస్థనొందిన జాఠ రాగ్నియు పైజెప్పిన పేయాదిక్రమముచే నాహారమును భుజించుటవలన నానాట రగిలి వృద్ధినొంది యెట్టి ఘనపదార్థములైనను పచనము నొందింప సమర్థమై యుండును.

## త్రివిధశుద్ధిలక్షణములు.

మూ. జఘన్య-మధ్య-ప్రవరేషు వేగాః
చత్వార ఇష్టాః వమనే షడష్టౌ; ౧౩
దశైవ తే ద్వి త్రిగుణా విరేకే;
ప్రస్థస్తథా ద్వి త్రి చతుర్గుణశ్చ,

పిత్తాన్తమిష్టం వమనం విరేకా
దర్ధం; కఫాన్తం చ విరేకమాహుః. ౧౪
ద్విత్రాన్ సవిట్కానపనీయ వేగాన్
మేయం విరేకే వమనే తు పీతమ్,

వ్యా. వమనౌషధమును సేవించినపుడు నాల్గుమార్లు వమనములైనచో స్వల్పముగ శుద్ధమైనదనియు, ఆరుపర్యాయములు వమనములైనయెడ మధ్యమముగ శుద్ధమైనదనియు, ఎనిమిదిపర్యాయములు వమనములైన నాడు ఉత్తమముగ శుద్ధమైనదనియు నెరుంగునది.

విరేచనౌషధమును సేవించినపుడు పదిసార్లు విరేచనములైనయెడ స్వల్పముగ శుద్ధమైనదనియు, ఇరువదిమార్లు విరేచనములైనయెడ మధ్యమముగ శుద్ధమైనదనియు, ముప్పదిపర్యాయములు విరేచనములైనచో నుత్తమముగ శుద్ధమైనదనియు నెరుంగదగును.

మరియు విరేచనములు రెండుప్రస్థములపరిమితముగ దోషము వెడలినచో స్వల్పముగ శుద్ధమైనదనియు, మూడుప్రస్థములపరిమితముగ దోషము వెడలినచో మధ్యమముగ శుద్ధమైనదనియు, నాల్గుప్రస్థముల పరిమితముగ దోషము బైటవెడలినచో నుత్తమముగ శుద్ధమైనదనియు నెరుంగునది. (ఇవి దోషపరిమాణమునుబట్టి విరేచనజఘన్యాది శుద్ధలక్షణములు.)

మరియు విరేచనముల జఘన్యాదిశుద్ధలక్షణములకు జెప్పినపరిమాణములయం దర్ధపరిమాణముగ దోషము వెడలినచో వమనములచే జఘన్యాదిశుద్ధముల నెరుంగునది—(ఒక ప్రస్థపరిమితముగ దోషము వెడలినయెడ స్వల్పముగ వమనముచే శుద్ధమైనదనియు, ఒకటిన్నరప్రస్థపరిమితముగ దోషమువెడలినచో మధ్యమముగ శుద్ధమైనదనియు, రెండుప్రస్థములపరిమితముగ దోషము వెడలినయెడ వమనముచే నుత్తమముగ శుద్ధమైనదనియు భేదము నెరుంగునది).

మరియు పైజెప్పిన మూడువిధములైన శుద్ధులయందును పిత్తము వెడలునప్పటికి వమనముచే చక్కగ శుద్ధమైనదనియు, కఫము వెడలునప్పటికి విరేచనములచే చక్కగ శుద్ధమైనదనియు సమ్యగ్యోగలక్షణము నెరుంగునది.

పైజెప్పిన వేగపరిగణము మలముతోగూడిన మొదటి రెండుమూడువిరేచన వేగములను విడిచి లెక్కపెట్టవలెను. వమనమునందు మొదట నౌషధముతోగూడిన వేగముల విడచి లెక్కపెట్టవలెను.

ఇచ్చట వమనవిరేచనములకొలతకు పదుమూడున్నర పలముల పరిమితమైనప్రస్థ

మును గ్రహించునది. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"వమనే చ విరేకే చ తథా శోణితమోక్షణే, సార్ధ త్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః."

(౩) "కింకృతాఽకృతేషు లింగం? తథైవాతికృతేషు?" అను మూడవ ప్రశ్నమున కుత్తరము. అందు వమనసమ్యగ్యోగలక్షణము.

మూ. క్రమాత్ కఫః పిత్తమథాఽనిలశ్చ
యస్యైతి సమ్యగ్వమితస్స ఇష్టః.                                        ౧౪
హృత్పార్శ్వమూర్ధేన్ద్రియమార్గశుద్ధౌ
తథా లఘుత్వేఽపి చ లక్ష్యమాణే,

వ్యా. వమనౌషధమును త్రాగినపుడు తొలుత కఫంబును, పిదప పిత్తపసరును, దాని కంటె వాతంబును వరుసగ వెడలి, హృదయంబును, ఇరుప్రక్కలును, శిరస్సును, చక్షు రాదీంద్రియములు, శరీరమునందలి మార్గంబులును శుద్ధములై శరీరము చులుకనైయున్న యెడల వమనౌషధముచే చక్కగ శుద్ధమైనదని సమ్యగ్యోగలక్షణము నెరుంగునది.

ఇచ్చట "క్రమాత్ కఫః పిత్తమథానిలశ్చ" అనువచనముచేత కఫమును వెడలించి పిమ్మట పిత్తమును, పిదప వాతమును వరుసగ వెడలించిననే సమ్యగ్యోగమగును; కాని యట్టి క్రమము దప్పి తొలుత పిత్తంబైనను వాతంబైనను వెడలిన నయ్యది సమ్యగ్యోగము కానేరదు. ఆమాశయమున పైభాగమున కఫంబును దానిక్రింద పిత్తాశయమున పిత్తంబును, దానిక్రింద వాతంబును వరుసగనుండును కావున ఆవరుస ననుసరించియే క్రమముగ దోషము వెడలినయెడ సమ్యగ్యోగమని నిష్కృష్టార్థము.

వమనాఽసమ్యగ్యోగలక్షణము.

మూ. దుశ్ఛర్దితే స్ఫోటకకోఠకణ్డూ
హృత్ ఖాఽవిశుద్ధిః గురుగాత్రతా చ.                                      ౧౬

వ్యా. వమనములు చక్కగకానియెడ శరీరముపై బొబ్బలును దద్దులును దురదయును కల్గును. హృదయంబును ఇంద్రియములును నిర్మలములుగ నుండవు, శరీరము బరువై యుండును. (ఈలక్షణములబట్టి వమనాఽయోగము నెరుంగునది).

వమనాఽతియోగలక్షణములు.

మూ. తృణ్మోహమూర్ఛాఽనిలకోపనిద్రా
బలాది (తి) హానిః వమనేఽతి చ స్యాత్,

వ్యా. వమనము లధికముగ నైనచో దప్పియు, చిత్తభ్రమంబును, మూర్ఛయును కల్గును. వాతము ప్రకోపము నొందును, నిద్రయు శరీరబలంబును స్వరవర్ణాదులును నశించును. (ఈలక్షణములచే వమనాతియోగము నెరుంగునది).

## విరేచనసమ్యగ్యోగలక్షణములు.

మూ. స్రోతోవిశుద్ధీన్ద్రియసమ్ప్రసాదో
లఘుత్వమూర్జోఽగ్నిరనామయత్వమ్.  ౧౭
ప్రాప్తిశ్చ విట్పిత్తకఫానిలానాం
సమ్యగ్విరిక్తస్య భవేత్క్రమేణ,

వ్యా. విరేచనములు చక్కగనైనయెడ స్రోతోమార్గములు పరిశుద్ధములుగ (నిర్మలముగ) నుండును. చక్షురాదీంద్రియములు నిర్మలములై యుండును. శరీరము తేలికగ నుండును. జఠరాగ్ని బలిష్ఠముగనుండును. శరీరమునం దెట్టిరోగములు లేక యుండును. మరియు విరేచనములగునపుడు తొలుత పురీషంబును, పిదప పిత్తంబును, దానివెంట కఫంబును, పిమ్మట అపానవాతంబును క్రమముగ వెడలును. (ఈలక్షణములబట్టి విరేచనసమ్యగ్యోగము నెఱుంగునది.)

ఇచ్చట 'క్రమేణ' అని చెప్పుటవలన విట్ - పిత్త - కఫ - వాతములు వరుసగ వెడలిననే విరేచనసమ్యగ్యోగ మగునుకాని వ్యత్యస్తముగ వెడలినయెడ సమ్యగ్యోగము కాదని యెఱుంగునది.

## విరేచనాఽయోగలక్షణములు.

మూ. స్యాత్ శ్లేష్మ-పిత్తాఽనిలసమ్ప్రకోపః
సాదస్తథాఽగ్నేః గురుతా ప్రతిశ్యా
(స్వేదోఽల్పవహ్నిః గురుగాత్రతా స్యాత్).  ౧౮
తన్ద్రా తథా ఛర్దిః అరోచకశ్చ
వాతానులోమం న చ దుర్విరిక్తే,

వ్యా. విరేచనములు చక్కగ కానియెడ కఫ - పిత్త - వాతములు ప్రకోపము నొందును. జఠరాగ్ని మందగించును. శరీరము బరువుగనుండును. పడిసెము పట్టును. (చెమటబట్టును), కునికిపాటును వాంతియు అరోచకంబును కల్గును. వాతము అనులోమముగ సంచరించక ప్రతిలోమమై బద్ధగించును. (ఇవి విరేకాయోగలక్షణములు.)

## విరేచనాఽతియోగలక్షణములు.

మూ. కఫాఽస్రపిత్తక్షయజాఽనిలోత్థాః
సుప్త్యఙ్గమర్దక్లమవేపనాద్యాః.  ౧౯

నిద్రాబలాఽభావతమఃప్రవేశాః
సోన్మాదహిక్కాశ్చ విరేచనేఽతి,

వ్యా. విరేచనములు అధికముగనైనయెడ కఫంబును రక్తంబును పిత్తంబును క్షయించుటచే సంభవించురోగములును, వాతరోగంబులును కల్గును. మరియు శరీరమున స్పర్శము నెరుంగక మొద్దుబారియుండుట, ఒడలినొప్పులు, బడలిక, వణకు మున్నగు రోగములును సంభవించును. నిదురబట్టదు. శరీరబలము నశించును. చీకటిలోనున్నవిధముగ మైకము గ్రమ్మును. ఉన్మాదంబును వెక్కిళ్లును కల్గును. (ఇవియన్నియు విరేచనాతియోగ లక్షణములు.)

## నిరూహాఽనువాసనవిధానము.

మూ. సంసృష్టభక్తం నవమేఽహ్ని సర్పిః
తం పాయయేతాఽప్యనువాసయేద్వా. ౨౦
తైలాక్తగాత్రాయ తతో నిరూహం
దద్యాత్ త్ర్యహాత్ నాఽతిబుభుక్షితాయ,
ప్రత్యాగతే ధన్వరసేన భోజ్యః
సమీక్ష్య వా దోషబలం యథార్హమ్. ౨౧
నరస్తతో నిశ్యనువాసనార్హః
నాత్యాశితస్స్యాదనువాసనీయః,
(ప్రత్యాగతే మాంసరసేన భోజ్యః
సాయం చ భుక్తోఽల్పబలోఽనువాస్యః)

వ్యా. పైజెప్పినరీతిగ వమనవిరేచనములచే చక్కగ కోష్ఠము శుద్ధమైనపిదప పేయాదిక్రమము ననుసరించి సంసర్జనక్రమముగ నెనిమిదవదినమున మామూలుపద్ధతి ప్రకారము అన్నమును భుజించినవానికి తొమ్మిదవదినమున ఘృతమును త్రాగించవలెను. లేక అనువాసనవస్తినైన చేయవలెను.

(ఇచ్చట వమనము శుద్ధమైనవానికి విరేచనము చేయించవలసియున్నచో సంసర్జనక్రమానంతరము తొమ్మిదవదినమున ఘృతము త్రాగించవలెననియు, విరేచనముచే శుద్ధమైనవానికి నిరూహవస్తి చేయవలసియున్నయెడ సంసర్జనక్రమానంతరము తొమ్మిదవ దినమున అనువాసనవస్తిని చేయవలెననియు 'సర్పిస్తం పాయయేతాఽప్యనువాసయేద్వా' అనువికల్పమునకు వ్యవస్థ నెరుంగునది.)

పైజెప్పినరీతిగ ననువాసనవస్తి జేసినపిదప మూడుదినములకులోపల రోగికి శరీరముపై నభ్యంగనముచేయించి మిక్కిలి యాకలిలేక మితముగ భుజించినవానికి నిరూహవస్తి నియ్యవలెను. నిరూహవస్తిచే దోషములు బైటవెడలినవెనుక రోగియొక్క జఠరాగ్నిబలమును గమనించి జాంగలజంతుమాంసరసముతో నైనను, ఇతరపదార్థములతో నైనను అన్నమును భుజింపజేయవలెను.

పిదప ననువాసనవస్తి కర్హుడగువానికి నాటిరాత్రియందు వానికి మితముగ నాహారము భుజింపజేసి అనువాసనవస్తిని చేయవలెను.

అనువాసనవస్తి కాలనియమము.

మూ. శీతే వసన్తే చ దివానువాస్యః
రాత్రౌ శరద్గ్రీష్మఘనాగమేషు.
తానేవ దోషాన్ పరిరక్షతా యే
స్నేహస్య పానే పరికీర్తితాః ప్రాక్, ౨౨

వ్యా. హేమంతశిశిరరూపమైన శీతకాలమునందు పగలు (సాయంకాలమున) అనువాసనవస్తిని చేయవలెను. శరత్కాలమందును గ్రీష్మవర్షఋతువులయందును రాత్రికాలమున (దినప్రారంభమునకు మునుమున్ను) అనువాసనవస్తిని ప్రయోగింపవలెను. అటుగాక పైజెప్పినకాలమునకు వ్యత్యయముగ ననువాసనము జేసినయెడ అకాలమున చేసిన స్నేహపానముచే సంభవించువ్యాధులు కల్గును; కావున వైద్యుడు అట్టిరోగముల కెడమియ్యక రోగిని కాపాడుటకై పైజెప్పిన శీతాదికాలమునకు నియమింపబడిన కాలముననే అనువాసనవస్తిని ప్రయోగింపవలెనని భావము.

ఇచ్చట 'పరికీర్తితాః ప్రాక్' అనుచోట స్నేహాధ్యాయమున 'అత్యుష్ణేవా దివా శీతః'' అని యుపక్రమించి చెప్పబడిన స్నేహపానకాలవ్యత్యయమున గల్గురోగముల నెరుంగునది.

అనువాసనమున కొన్నినియమములు.

మూ. ప్రత్యాగతే వాప్యనువాసనీయే
దివా ప్రదేయం వ్యుషితాయ భోజ్యమ్.
సాయం చ భోజ్యం పరతో ద్వ్యహే వా
త్ర్యహేఽనువాస్యోఽహని పఞ్చమే వా ౨౩

(త్ర్యహే త్ర్యహే వాప్యథ పఞ్చమే వా
దద్యాన్నిరూహాదనువాసనం చ),
(ప్రత్యాగతే వాప్యుషితస్య కాలే
భోజ్యం దివాసాయమతఃపరన్తు.) ౨౮

వ్యా. పైజెప్పినరీతిగ ననువాసనము చేసినపుడు అనువాసనస్నేహౌషధము బైట వెడలినపిదప నాటిరాత్రియం దాహారమిడక నుండనిచ్చి మరుసటిదినము పగలు ఆహార కాలమున నన్నముబెట్టి సాయంకాలమందును భోజ్యము నిడవలెను. పిమ్మట రెండవదినమునందైనను మూడవదినమునందైనను ఐదవదినమునందైనను మరల ననువాసనవస్తిని ప్రయోగింపదగును.

### (4) "సంఖ్యా? కా" అను నాల్గవప్రశ్నమున కుత్తరము. అందు దోషానుసారముగ వస్తిసంఖ్యానియమము.

మూ. ఏకం తథా త్రీన్ కఫజే వికారే
పిత్తాత్మకే పఞ్చ తు సప్త వాపి;
వాతే నవైకాదశ వా పునర్వా
వస్తీనయుగ్మాన్ కుశలో విదధ్యాత్. ౨౯

వ్యా. (వస్తిసంఖ్య దోషానుసారముగ నెన్ని? అను ప్రశ్నమున కుత్తరము.) అనువాసనవస్తులను కఫవ్యాధులయందు ఒకటినైనను మూడువస్తులనైనను చేయదగును. పిత్తజనితవ్యాధులయందు ఐదువస్తులనైనను, ఏడువస్తులనైనను ప్రయోగింపదగును. వాతవ్యాధులయందు తొమ్మిదివస్తులనైనను, పదునొకండువస్తులనైనను ప్రయోగింపవలెను. ఇంతకన్న నధికముగ చేయించవలసినప్పుడు బేసిసంఖ్యగ వస్తుల నుపయోగింపవలెనుకాని, రెండు నాల్గు మున్నగుసమసంఖ్యగ వస్తుల నొకప్పుడు నుపయోగింపంజనదు.

ఇచ్చట బేసిసంఖ్యగ అనువాసనమును ప్రయోగింపవలెననువిధి ప్రభావవిశేషమునంజేసి యుపకారకమగునని యాచార్యాభిప్రాయము. మరియు 'త్రీన్ పఞ్చవాఽఽహుః చతురోఽథ షడ్వా' (శ్లో. ౪౯) అనువిధింపబడు ననువాసనవస్తులు నిరూహాంగముగ స్నేహనమునకై విధింపబడినవి. ఇచ్చట ప్రధానముగ ననువాసనము జేయునపుడు బేసిసంఖ్యగ నుండవలెనని విధింపబడినది. కావున పరస్పరవిరోధములేదని యెరుంగునది.

మరియు కఫపిత్తములకు వస్తి విధింపకున్నను వాతానుగత కఫపిత్తవికారములయందు వస్తివిధి ఆచరణీయమని యెరుంగునది.

శోధనానంతరము మరల శోధనము జేయుటకు కాలావధి.

మూ. నరో విరి క్తస్తు నిరూహదానం
విసర్జయేత్స ప్త దినాన్యవశ్యమ్,
శుద్ధో నిరూహేణ విరేచనం చ
తద్ధ్యస్య శూన్యం వికషేచ్ఛరీరమ్. ౨౬

వ్యా. విరేచనముచే శుద్ధశరీరుడు ఏడుదినములవరకును నిరూహవస్తిని విసర్జింపవలెను. నిరూహవస్తిచే శుద్ధశరీరము కలవాడును ఏడుదినములు గడచునందాక విరేచనమును చేయదగదు. తొలుత విరేచనముచేనైనను నిరూహవస్తిచేనైనను శరీరము శుద్ధమై శూన్యముగ (బలహీనముగ) నున్నపుడు మరల సంశోధనమును చేసికొనినచో శరీరమును మరింత కృశతనొందించి బలహీనము చేయును; కావున పైజెప్పిన నియమప్రకారము కాలవ్యవధి గుండవలెనని భావము.

{ (౫) "కింగుణో వస్తిః?" అను నైదవప్రశ్నమునకు త్తరము. అందు ఆస్థాపనవస్తి గుణములు. }

మూ. వస్తిర్వయస్థాపయితా సుఖాయు
ర్బలాగ్ని మేధాస్వరవర్ణకృచ్చ,
సర్వార్థకారీ శిశువృద్ధయూనాం
నిరత్యయః సర్వగదాపహశ్చ. ౨౭
విట్ శ్లేష్మపిత్తానిలమూత్రకర్షీ
దార్ఢ్యావహః శుక్రబలప్రదశ్చ,
(స్థిరత్వకృత్ శుక్రసుతప్రదశ్చ,)
విష్వక్ స్థితం దోషచయం నిరస్య
సర్వాన్వికారాన్ శమయేన్నిరూహః. ౨౮

వ్యా. నిరూహవస్తి శరీరమునందలిదోషమును వెడలింపజేయునదిగాన వయస్సును స్థిరముగజేయును. శరీరసుఖమును, ఆయువును, బలమును, కాయాగ్నిని, బుద్ధిని, కంఠస్వరమును, శరీరకాంతిని కలిగించి వృద్ధినొందించును. ఇతరచికిత్సలచే కల్గుప్రయోజనములనన్నిటిని కల్గింపనోపును. శిశువులకును, వృద్ధులకును, యౌవనవంతులకును కూడ నిరపాయముగ రోగములనన్నిటిని పోగొట్టను సమర్థమైయుండును. శరీరమునందలి పురీషమును, శ్లేష్మమును, పిత్తమను, వాతమును, వెడలింపజేసి శరీరమునకు దృఢత్వమును

గల్గించును. శుక్రమునకు బలమును కల్గించును. శరీరమునందంతటను వ్యాపించియుండును. దోషసంచయమును బయిట వెడలించి రోగములనన్నిటిని శమింపజేయును. (ఇచ్చట వమన విరేచనరూపమయిన శోధనములు శిశువులకును, వృద్ధులకును నిషిద్ధములు. నిరూహవస్తి యటుగాక శిశువృద్ధులకుగూడ నుపయోగింప దగియుండునని "శిశువృద్ధయూనాం నిరత్యయః" అనువాక్యముచే వస్తిప్రాశస్త్యము చెప్పబడినది. (వస్తిగుణములు "శాఖా గతాః" అను గ్రంథముచే గూడ క్రిందజెప్పబడును.)

నిరూహానంతరము అనువాసనవస్తిచే కల్గుగుణములు.

మూ. దేహే నిరూహేణ విశుద్ధమార్గే
సంస్నేహనం వర్ణబలప్రదం చ,
న తైలదానాత్పరమస్తి కిఞ్చిత్
ద్రవ్యం విశేషేణ సమీరణార్తే. ౨౯
(నాన్వాసనాత్ కిఞ్చిదిహాస్తి కర్మ
పరం విశేషేణ సమీరణార్తే)
స్నేహేన రౌక్ష్యం లఘుతాం గురుత్వాత్
ఔష్ణ్యాచ్చ శైత్యం పవనస్య హత్వా,
తైలం దదాత్యాశు మనః ప్రసాదం
వీర్యం బలం వర్ణమథాగ్నిపుష్టిమ్. ౩౦
మూలే నిషిక్తో హి యథా ద్రుమస్స్యాత్
నీలచ్ఛదః కోమలపల్లవాగ్ర్యః,
కాలే మహాన్ పుష్పఫలప్రదశ్చ
తథా నరః స్యాదనువాసనేన. ౩౧

వ్యా. నిరూహవస్తిని ప్రయోగించుటచే శరీరమునందలి మార్గములన్నియు శుద్ధములయిన పిమ్మట అనువాసనవస్తిచే స్నేహనమును చేయించినయెడ యాస్నేహము శరీర బలమును, వర్ణమును కల్గించును. మరియు వాతవ్యాధిపీడితునకు వాతము హరించుటకై తైలమునకన్న వేరొకద్రవ్యము శ్రేష్ఠమయినది లేదు. తైలమునందలి స్నిగ్ధత్వగుణముచేత వాతమునందలి రూక్షగుణమును హరించును. గురుత్వముచేత వాతమునందలి లఘుత్వ గుణమును హరించును. ఉష్ణగుణముచేత వాతమునందలి శీతగుణమును హరించును.

(తైలము స్నిగ్ధత్వ, గురుత్వఉష్ణగుణములు కల్గియుండుటచే వాతమునందలి రూక్షలాఘవ శీతగుణములను హరించునని భావము.)

మరియు తైలము మనస్సునకు నిర్మలత్వమును, వీర్యపటుత్వమును, శరీరబలమును వర్ణమును, జాఠరాగ్నిబలమును, కల్గించును. లోకమున ఒకచెట్టుకు మొదట నీళ్లుపోసినచో నయ్యది నల్లనియాకులను కోమలములైన చిగుళ్లను, కల్గి వృద్ధినొంది పెద్దదియై సకాలమున పుష్పములను ఫలములను కల్గియుండును. అట్లే రంగుననే నిరూహవస్తిచే శుద్ధశరీరునకు తైలముచే అనువాసనవస్తిని ప్రయోగించినయెడ పైజెప్పినగుణముల నన్నిటిని గల్గించు ఆరోగ్యమును పెంపొందించునని భావము.

### నిరూహానువాసనవస్తుల సామాన్యగుణములు.

మూ. స్తబ్ధాశ్చ యే సంకుచితాశ్చ యేఽపి
యే పఙ్గవో యేఽపి చ భగ్నరుగ్ణాః,
యేషాం చ శాఖాసు చరన్తి వాతాః
శస్తో విశేషేణ హి తేషు వస్తిః. ౩౨

ఆధ్మాపనే విగ్రథితే పురీషే
శూలే చ భక్తానభినన్దనే చ,
ఏవంప్రకారాశ్చ భవన్తి కుక్షౌ
యే చామయాస్తేషు చ వస్తిరిష్టః. ౩౩

యాశ్చ స్త్రియో వాతకృతోపసర్గాః
గర్భం న గృహ్ణన్తి నృభిః సమేతాః,
క్షీణేన్ద్రియా యే చ నరాః కృశాశ్చ
తేషాం చ వస్తిః పరమః ప్రదిష్టః. ౩౪
(వస్తిః ప్రశస్తః పరమం చ తేషు)

వ్యా. అవయవములు స్తంభించినవారికిని, ముడుచుకొని యుండువారికిని, కాళ్లు కుంటిగనుండువారికిని, కీళ్లు శిథిలము లయినవారికిని, హస్తపాదాది శాఖలయందు వాతము వ్యాపించియున్నవారికిని, వస్తికర్మ మిగులప్రశస్తమై యుండును. మరియు కడుపుబ్బరమునందును, మలము ద్రవములేక యుండలుకట్టి యున్నపుడును, శూలనొప్పి యందును, అరోచకముచే అన్నమునం దభిలాష లేనప్పుడును, కుక్షియందు సంభవించు ఇట్టిరోగము లన్నిటియందును; వస్తి మిగులప్రశస్తమై యుండును.

మరియు వాతవ్యాధిచే పీడింపబడినస్త్రీలు ఋతుకాలమున పురుషులతో సంభోగించినను అట్టివాతప్రకోపముచే గర్భమును ధరించకున్నయెడల అట్టిస్త్రీలకు వస్తికర్మ మిగులప్రశస్తమై యుండును. ఇంద్రియము (శుక్రము) క్షీణించి శరీరము కృశతనొందియున్న పురుషులకును, వస్తి మిక్కిలి ప్రశస్తమైయుండును.

{ (6) "కేషుచ కశ్చ వస్తిః?" అను నారవప్రశ్నమున కుత్తరము. అందు విపరీతగుణవస్తికల్పనవిధి. }

మూ. ఉష్ణాభిభూతేషు వదన్తి శీతా
శీతాభిభూతేషు తథా సుఖోష్ణాన్,
తత్ప్రత్యనీకౌషధసంప్రయుక్తా
న్సర్వత్ర వస్తీన్ ప్రవిభజ్య యుఞ్జ్యాత్. 31

వ్యా. ఉష్ణప్రధానమైన వ్యాధులచే పీడింపబడినవారికి అట్టియుష్ణగుణాదులకు విరుద్ధములయిన యౌషధములచే సిద్ధములై చల్లగనుండువస్తులను ప్రయోగింపదగును. అత్తెరంగుననే శీతప్రధానమైనవ్యాధులు కలవారికి అట్టిశీతమునకు విరుద్ధమయినగుణాదులు గలయౌషధములచే సిద్ధములై సుఖోష్ణముగ నుండువస్తులను ప్రయోగించవలయును. ఇత్తెరంగుననే వ్యాధులన్నిటియందును వ్యాధ్యాదులకు విపరీతములయిన గుణాదులుగల యౌషధములచే వస్తులను సిద్ధము చేసి యుపయోగింపవలయును.

నియతముగ శోధనముచే నుదగినవ్యాధులు.

మూ. న బృంహణీయాన్విదధీత వస్తీ న్విశోధనీయేషు గదేషు వైద్యః,
కుష్ఠప్రమేహాదిషు మేదురేషు నరేషు యే చాపి విశోధనీయాః.

వ్యా. శోధనము చేయింపవలసినకుష్ఠము, ప్రమేహము మున్నగురోగముల యందును, మేదస్సు వృద్ధినొంది బలిసియున్నవారికిని, సంశోధనమున కర్హులగు ఇతరులకును, బృంహణవస్తుల నియ్యదగదు. (ఇచ్చట 'ప్రమేహాదిషు' అను ఆదిశబ్దముచేత అరోచకము, తంద్ర, శ్లీపద మున్నగురోగములుకూడ గ్రహింపబడును).

సంశోధనవస్తికి అనర్హులు.

మూ. క్షీణక్షతానాం న విశోధనీయా
న శోషిణాం నో భృశదుర్బలానామ్,
న మూర్ఛితానాం న విశోధితానాం
యేషాం చ దోషేషు నిబద్ధమాయుః. 32

వ్యా. ఉరఃక్షతముచే క్షీణించినవారికిని, ధాతువులు శోషించినవారికిని, మిక్కిలి బలహీనులకును, మూర్ఛరోగము గలవారికిని, వమనాదిసంశోధనముల జేసినవారికిని, శోధనవస్తుల నియ్యరాదు. మఱియు రోగములచేతనే ప్రాణములు ఆధారపడి సంశోధనము చేసినయెడల తగ్గినబడలేనిదో మరణమునొందుస్థితి నున్నవారికిని సంశోధనవస్తిని ప్రయోగింపఁజనదు.

### వస్తియొక్క విశేషగుణములు.

మూ. శాఖాగతాః కోష్ఠగతాశ్చ రోగాః
మర్మోర్ధ్వసర్వావయవాఙ్గజాశ్చ,
యే సన్తి తేషాం న హి కశ్చిదన్యో
వాయోః పరం జన్మని హేతురస్తి. ౩౮

విణ్మూత్రపిత్తాదిమలాశయానాం
విక్షేపసంఘాతకరః స యస్మాత్,
తస్యాతివృద్ధస్య శమాయ నాన్యత్
వస్తిం వినా భేషజమస్తి కించిత్. ౩౯

తస్మాచ్చికిత్సార్ధమితి బ్రువన్తి
సర్వాం చికిత్సామపి వస్తిమేకే,

వ్యా. రోగములగునట్టి శాఖలును, కోష్ఠమును, మర్మములను, శరీరమునందలి యూర్ధ్వభాగములును, సర్వావయవములును, సూక్ష్మములుగా నున్నగు ఏకాంగములను, ఆశ్రయించి సంభవించునట్టి రోగములకు వాయువుకంటె వేఱొండు కారణము లేదు. మఱియు మూత్రపురీషములను, పిత్తకఫములను, ధాత్వాదులయందలి మలములను, వానియాశయములును సంఘాతవిభాగములు గల్గించునది ప్రధానముగ వాతమే యగును. అట్టివాతము వృద్ధినొందినపుడు దానిని శమింపజేయుటకు వస్తికంటె వేఱొండు చికిత్స శ్రేష్ఠమైనది కానరాదు. కావున వస్తికర్మ సర్వచికిత్సలలో సగభాగముగ నుండుననియు కొందరు చెప్పుదురు. రోగములన్నిటికిని ప్రధానకారణవాతమును శమింప సమర్థమగుటం జేసి సంపూర్ణమైనచికిత్స వస్తికర్మమగునని మఱికొందరాచార్యులు చెప్పుదురు. (ఇదియు, "కిం గుణో వస్తిః" అను పైదవప్రశ్నమునకే యుత్తరమగును.)

వస్తియొక్క సమ్యగ్యోగ-అయోగ-అతియోగముల విశేషలక్షణములు.
అందు తాత్కాలికసమ్యగ్యోగసామాన్యలక్షణము.

మూ. నాభిప్రదేశం కటిపార్శ్వకుక్షిం
గత్వా శకృద్దోషచయం విలోడ్య.  ౪౦
సంస్నేహ్య కాయంసపురీషదోషః
సమ్యక్ సుఖేనైతి చ యస్య వస్తిః,

వ్యా. ప్రయోగింపబడిన వస్త్యౌషధము నాభిప్రదేశమునందును, ఇరుప్రక్కల యందును కుక్షియందును పూర్తిగవ్యాపించి పురీషమును దోషసంచయమును చక్కగ కలియబెట్టి, తనయందలి వీర్యరూపమైనసారమును శరీరమున వ్యాపింపజేసి, పురీషముతోడను దోషములతోడనుకూడి, శరీరమున కాయాసమును కల్గింపక నిరవశేషముగ బైట వెడలినచో నట్టివస్తి చక్కగ పనిచేసినదని యెరుంగునది. (ఇదియును "కిం చ కృతాకృతేషు" అనుమూడవప్రశ్నమున కుత్తరము.)

నిరూహవస్తి సమ్యగ్యోగలక్షణములు.

మూ. ప్రసృష్టవిణ్మూత్రసమీరణత్వం
రుచ్యగ్నివృద్ధ్యాశయలాఘవాని.
రోగోపశాన్తిః ప్రకృతిస్థతా చ
బలం చ తత్ స్యాత్ సునిరూఢలిఙ్గం,

వ్యా. నిరూహవస్తి బాగుగపనిచేసినచో పురీష-మూత్ర-వాతములు ధారాళముగ వెడలును. నోట రుచికల్గును. జఠరాగ్ని వృద్ధినొందును. ఆమాద్యాశయములు చులకనగ నుండును. నిరూహవస్తిచే శాంతినొందతగిన వ్యాధులు శమించును. శరీరము వికృతిలేక స్వాభావికస్థితి నొందును. శరీరమునకు బలము కల్గును. ఈలక్షణమునుబట్టి నిరూహవస్తి సమ్యగ్యోగయుక్తమని యెరుంగునది. (ఈలక్షణములు నిరూహవస్తిని ప్రయోగించిన వెంటనే కల్గును.)

నిరూహవస్త్యయోగలక్షణములు.

మూ. స్యాత్ రుక్ శిరోహృద్గుదవస్తిలిఙ్గే
శోఫః ప్రతిశ్యాయవికర్తికే చ.  ౪౧
హృల్లాసికామారుతమూత్రసఙ్గః
శ్వాసో న సమ్యక్ చ నిరూహితే స్యుః,

వ్యా. నిరూహవస్తి చక్కఁగపనిచేయనిచో శిరస్సునందును, హృదయమునందును, వస్తియందును, మేఢ్రమునందును వాపుకల్గును. పడిశముపట్టును. కడుపులోఁ గోత పుట్టును. ఓకరింతలుకల్గి నోట నీరుకారును. వాతమూత్రములు సరళముగ వెడలక బద్ధ గించును. శ్వాసముపుట్టును. (ఇవియన్నియు నిరూహవస్తికి అయోగలక్షణములు.)

నిరూహవస్త్యతియోగలక్షణములు.

మూ. లిఙ్గం యదేవాతివిరేచితస్య భవేత్తదేవాతినిరూహితస్య. ౪౩

వ్యా. విరేచనాతియోగమునకు చెప్పినలక్షణములే నిరూహాతియోగమునందును సంభవించును. ఇచ్చట "కఫాస్రపిత్తక్షయజానిలోత్థాః......విరేచనేతి." (సి. అ. 1, శ్లో. 19) అనిచెప్పబడిన విరేచనాతియోగలక్షణములను నతిదేశించుకొనునది.

అనువాసనవస్తి సమ్యగ్యోగలక్షణములు.

మూ. ప్రత్యేత్యసక్తం సశకృచ్చ తైలం
రక్తాదిబుద్ధీన్ద్రియసంప్రసాదః,
స్వప్నానువృత్తిః లఘుతా బలం చ
సృష్టాశ్చ వేగాః స్వనువాసితే స్యుః. ౪౪

వ్యా. అనువాసనవస్తి చక్కఁగపనిచేసినచో తైలము లోపల చిక్కక మలముతోఁ గూడి సరళముగ బైటవచ్చును. రక్తాదిధాతువులును, బుద్ధియు, చక్షురాదిఇంద్రియంబులును, నిర్మలములై వానివానికృత్యముల జేయుచుండును. చక్కఁగ నిదురపట్టును. శరీరము తేలికకల్గియుండును. శరీరబలము కల్గును. మలమూత్రాదివేగములు బద్ధములేక సరళముగ వెడలుచుండును. ఇవియన్నియు అనువాసనవస్తి సమ్యగ్యోగలక్షణములు.

అనువాసనవస్త్యయోగలక్షణములు.

మూ. అధశ్శరీరోదరబాహుపృష్ఠ
పార్శ్వేషు రుక్, రూక్షఖరం చ గాత్రమ్ (వర్చః),
గ్రహశ్చ విణ్మూత్రసమీరణానాం
అసమ్యగేతాన్యనువాసితస్య (తేస్యుః). ౪౫

వ్యా. అనువాసనవస్తిచే చక్కఁగ పనిచేయనిచో శరీరమునం దధోభాగమునను, ఉదరమునను, బాహువులయందును, వీపునందును, ఇరుప్రక్కలయందును, నొప్పిపుట్టును. శరీరంబును, పురీషంబును, రూక్షమై కఠినముగ నుండును. మూత్రపురీషవాతములు సరళ

ముగ వెడలక బద్ధగించును. ఇవియన్నియు అనువాసనవస్తి అయోగమువలన గల్గులక్షణములు. (ఈలక్షణములు శరీరము చక్కగ స్నిగ్ధముకాకుండుటవలన సంభవించును.)

అనువాసనవస్తి అతియోగలక్షణములు.

మూ. హృల్లాసమోహక్లమసాదమూర్ఛా
వికర్తికా చాత్యనువాసితస్య,

వ్యా. అధికముగ ననువాసనముచేయుటవలన ఓకరింతలు వచ్చును, మైకము గ్రమ్మును, బడలిక సంభవించును, ప్రాలుమాలికయు, మూర్ఛయు, వికర్తికయు కల్గును. ఇవి అనువాసన అతియోగలక్షణములు.

అనువాసనవస్తియందు స్నేహము బయటవెడలదగినకాలము.

మూ. యస్యేహ యామాననువర్తతే త్రీన్
స్నేహో నరస్స్యాత్ స విశుద్ధదేహః. ౪౬
ఆశ్వాగతేఽన్యస్తు పునర్విధేయః
స్నేహో న సంస్నేహయతి హ్యతిష్ఠన్,

వ్యా. అనువాసనవస్తి నుపయోగించునపుడు స్నేహరూపయౌషధము మూడు జాములకాలము లోపలనే యుండి పిమ్మట బయటవెడలినచో అట్టిమనుజుడు పరిశుద్ధమైన దేహము కలవాడగును. అటుగాక వస్తిని ప్రయోగించినవెంటనే శీఘ్రముగ స్నేహము బయలువెడలినయెడల చక్కగ స్నేహనమును చేయనోపదు. కావున అట్టియెడ మరల అప్పుడే స్నేహవస్తిని జేయవలయును.

కర్మ-కాల-యోగవస్తులస్వరూపము. వానికి వేరువేరుగ సంఖ్యావిభాగము.

మూ. త్రింశన్మతాః కర్మసు వస్తయో హి,
కాలస్తతోఽర్ధేన తతశ్చ యోగః. ౪౭
సాన్వాసనాః ద్వాదశ వై నిరూహాః
ప్రాక్ స్నేహ ఏకః పరతశ్చ పఞ్చ,
కాలే త్రయోఽన్తే పురతస్తథైకః
స్నేహా నిరూహాన్తరితాశ్చ షట్ స్యుః. ౪౮
యోగే నిరూహాస్త్రయ ఏవ దేయాః
స్నేహాశ్చ పఞ్చైవ పరాదిమధ్యాః,

వ్యా. ముప్పదివస్తులును వరుసగా చేసినయెడ నయ్యది కర్మవస్తి యనబడును. అందు అర్ధసంఖ్యయగు పదునైదువస్తులను చేయించినయెడ కాలవస్తి యనబడును. దానిలో సగము సంఖ్యగల యెనిమిదివస్తులను చేసినయెడ యోగవస్తి యనబడును. అందు తొలుత ఒక అనువాసనవస్తిని ప్రయోగించి పిదప పండ్రెండు అనువాసనవస్తులతో అంతరితములైన పండ్రెండు నిరూహవస్తులను ప్రయోగించి పిమ్మట అయిదు అనువాసనవస్తులను వరుసగ ప్రయోగించినచో నీముప్పదియును చేరి కర్మవస్తియగును. (ఇచ్చట "సాన్వాసనాః ద్వాదశ" అనుచోట ఒక అనువాసనవస్తిని ఒకనిరూహవస్తిని మార్చిమార్చి చేసినయెడ అనువాసనవస్తి అంతరితనిరూహవస్తులు పండ్రెండు అగును.)

కాలవస్తివివరణము—మొదట ఒకఅనువాసనవస్తిచేసి పిమ్మట ఐదునిరూహవస్తులతో అంతరితములైన ఆరుఅనువాసనవస్తులను కడపట మూడుఅనువాసనవస్తులను వరుసగ చేసినయెడ నీపదునైదువస్తులును చేరి కాలవస్తియగును.

యోగవస్తి వివరణము—మొదట నొకయనువాసనవస్తిని పిమ్మట మూడుస్నేహవస్తులతో నంతరితములైన మూడునిరూహవస్తుల కడపట నొకఅనువాసనవస్తిని చేయించినయెడ యీయెనిమిదివస్తులును చేరి యోగవస్తి యగును. (ఇదియును "సంఖ్యా కా"? అను నాల్గవప్రశ్నమున కుత్తరమగును.)

పైజెప్పినవస్తులుమూడును ఆయుర్వేదశాస్త్రమున కర్మకాలయోగసంజ్ఞలచే వ్యవహరింపబడుటలేదు, అయినను యీసంజ్ఞలు వివాదసమయమున పండితవ్యవహారమునకై చెప్పబడినదని యెరుంగునది.

నిరూహాంగముగ చేయబడు అనువాసనవస్తి సంఖ్యావివరణము.

మూ. త్రీన్పఞ్చ వాఽఽహుశ్చతురోఽథ షడ్వా
వాతాది (ధి) కానాం అనువాసనీయాన్. ౪౯
స్నేహాన్ప్రదాయాశు భిషగ్విదధ్యాత్
స్రోతోవిశుద్ధ్యర్థమతో నిరూహాన్,

వ్యా. వాత మధికముగ గలవారికి తొలుత మూడు, లేక ఐదు, అనువాసనవస్తులనైనను; నాలుగు, లేక ఆరు అనువాసనవస్తులనైనను; (నిరూహవస్తికి పూర్వాంగముగ స్నేహనార్థము) అనువాసనవస్తులను చేయించి పిమ్మట స్రోతస్సులు పరిశుద్ధమగుటకై (శోధనార్థము) నిరూహవస్తులను ప్రయోగింపవలయును. ఇచ్చట నీయనువాసనవస్తి నిరూహవస్తికి పూర్వాంగముగ జెప్పబడినది. కావున సమసంఖ్యలైన అనువాసనవస్తులు

చెప్పబడినవి. "ఏవం తథా త్రీ౯......వ స్తీనయుగ్మా౯ కుశలో విదధ్యాత్." (సి. అ.1 శ్లో. 25) అని విధింపబడిన (ప్రధానముగ) స్నేహవస్తియందుమాత్రము "అయుగ్మా౯" అని బేసిసంఖ్యగ అనువాసనవస్తులు విధింపబడినది. కాన పరస్పరవిరుద్ధములేదని యెరుంగునది. (ఈవిషయమునే ఆశ్లోకవ్యాఖ్యయందును సూచితము.) ఇదియును సంఖ్యాప్రశ్నమున కుత్తరమగును.

### శిరోవిరేచన నస్యకల్పనావిధి. అందు నస్యప్రయోగము.

మూ. విశుద్ధదేహస్య తతః క్రమేణ
స్నిగ్ధం తలస్వేదితముత్తమాఙ్గమ్. ౫౦
విరేచయేత్ త్రిర్ద్విరథైకశో వా
బలం సమీక్ష్య త్రివిధం మలానామ్,

వ్యా. (ఇంతదనుక పంచకర్మలలో వమన - విరేచన - నిరూహ - అనువాసనములను నాల్గిటియొక్క కల్పనావిధానము సాంగముగ జెప్పబడినది. పిమ్మట క్రమప్రాప్తమయిన నస్యకర్మకల్పనము వివరింపబడును.) విరేచనాదులచే కాయశోధనము తొలుత చేసినవానికి పిమ్మట స్నేహనముచేసి (శిరోభ్యంజనాదులచే స్నేహవిధిచేసి) అరచేతితో శిరస్సుపై మర్దనచేసి నాటిదినమే నస్యవిధిచేత రోగియొక్క (వాతాదిదోషములయొక్క) ఉత్తమమధ్యమ అధమబలములను గమనించి తదనుసారముగ వరుసగ మూడు, లేక రెండు, లేక నొకసారియైనను శిరోవిరేచనము చేయించవలయును.

### శిరోవిరేచనసమ్యగ్యోగ - అయోగ - అతియోగలక్షణములు.

మూ. ఉరఃశిరో లాఘవమిన్ద్రియాచ్ఛ్యం (యాణాం)
స్రోతోవిశుద్ధిశ్చ భవేద్విశుద్ధే. ౫౧
గలోపలేపః శిరసో గురుత్వం
నిష్ఠీవనం చాప్యథ దుర్విరిక్తే;
శిరోక్షిశఙ్ఖశ్రవణార్తితోదా
అత్యర్థశుద్ధే తిమిరం చ పశ్యేత్. ౫౨
స్యాత్తర్పణం తత్ర మృదు ద్రవం చ
స్నిగ్ధస్య తీక్ష్ణం తు పునర్న్యయోగే,

వ్యా. నస్యకర్మము చక్కగపనిచేసినయెడ రొమ్మునందును, శిరస్సునందును తేలికగనుండును. చక్షురాదిఇంద్రియములు తేటయై తమకృత్యముల నెరవేర్చుసామర్థ్యము

ియుండును. స్రోతస్సులు పరిశుద్ధములై యుండును. ఇవి నస్యకర్మ సమ్యాగ్యోగ
ణములు.

నస్యకర్మ అయోగమునందు కంఠమున జిగురుకల్గి శిరస్సు బరువుగనుండును. నోట
్ఠ వెడలును.

నస్యకర్మ అతియోగమునందు శిరస్సునందును, కండ్లయందును, కణతలయందును,
ఏదము, పోటునుపుట్టును. కన్నులు చీకట్లుక్రమ్మునట్లు మైకమువచ్చును. అట్టిఅతియోగ
ి మృదువును ద్రవరూపము యిన తర్పణరూపనస్యమును మరల ప్రయోగించవలయును.
ోగమునందు మరల స్నేహనముచేసి తీక్ష్ణనస్యమును ప్రయోగించవలయును.

## పంచకర్మప్రయోగోపసంహారము.

ా. ఇత్యాతురస్వస్థసుఖప్రయోగే
బలాయుషోః వృద్ధికృదామయఘ్నః. ॥౩

వ్యా. ఇత్తెరంగున రోగపీడితులకును, స్వస్థతనుండువారికిని, బలమును ఆయువును
నొందించుటకును, రోగములు హరించుటకును తగినపంచకర్మకల్పము చెప్పబడినది.
ఏట స్వస్థతనుండువారికి బలఆయువులు వృద్ధినొందించుననియు, రోగులకు ఆయా
ములు నివర్తించుననియు విభాగము నెరుంగునది.)

## (7-8)వస్తికర్మ జేసికొనునపుడు విసర్జించవలసినకృత్యములు,వానికాలనియమము.

ం. కాలస్తు వస్త్యాదిషు యాతి యావాన్
తావాన్భవేత్ ద్విః పరిహారకాలః,
అత్యాసనస్థానవచాంసి, యానం
స్వప్నం దివా మైథునవేగరోధాన్. ॥౪
శీతోపచారాతపశోకరోషాన్
త్యజేదకాలాహితభోజనం చ,

వ్యా. చాలాకాలము కూర్చునియుండుట, నిలబడియుండుట, అధికముగ మాట
ుట, గుఱ్ఱము మొదలగువానిపై సవారిచేయుట, పగలునిదురించుట, స్త్రీసంభోగము
ుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, చల్లనియుపచారముల జేసికొనుట,
కలోనుండుట, దుఃఖపడుట, కోపపడుట, అకాలమునభుజించుట, హితముకాని
హారమును భుజించుట ఈకృత్యముల నన్నిటిని వస్తికర్మనుచేసికొనునపుడు విసర్జించ

వలయును. (ఇయ్యది "కిం వర్జ్యనీయం ప్రతికర్మకాలే" అను నేడవప్రశ్నమున కుత్తరము.)

మరియు పైజెప్పిన అత్యాసనము మొదలగు నిషిద్ధవిషయములనే వస్తికర్మ చేసిన పిమ్మటను వస్తికర్మ చేసికొనినకాలమునకన్న రెట్టింపుకాలము విసర్జించి యుండవలయును. (ఇయ్యది "కృతే కియాన్వా పరిహారకాలః" అను యెనిమిదవప్రశ్నమున కుత్తరము.)

(9-11) వస్త్యౌషధము లోనప్రవేశించకుండుటకును, చిరకాలమునకు బైటవెడలుటకును కారణములు.

మూ. బద్ధే ప్రణీతే విషమం (మే) చ నేత్రే,
మార్గే తథాఽర్శః కఫవిడ్విబద్ధే (న్ధే). ౫౫
న యాతి వస్తిః; న సుఖం నిరేతి
దోషావృతోఽల్పో యది వాఽల్పవీర్యః,

వ్యా. వస్తియంత్రముయొక్క నేత్రమున (గొట్టమున) యేదైన అడ్డముపడి యున్నను, వస్తియంత్రమును విషమముగ ప్రవేశింపజేసినను, అర్శస్సులచేనైనను, పురీషముచేనైనను, గుదమార్గము అడ్డగింపబడియున్నను, వస్త్యౌషధము లోపలికి ప్రవేశింప నేరదు (ఇయ్యది "ప్రణీయమానశ్చ న యాతి వస్తిః కేన"అను తొమ్మిదవప్రశ్నమున కుత్తరము.)

మరియు దోషము మిక్కిలిప్రబలమై ఆట్టిదోషముచే నిరోధింపబడినను, ఔషధము స్వల్పపరిమాణముగనున్నను, స్వల్పవీర్యమైయున్నను, ఆట్టి యౌషధము చిరకాలమునకు బయటవెడలును. (ఇయ్యది "సుచిరాచ్చ కే నైతి" అను పదునొంకడవ ప్రశ్నమున కుత్తరము.)

(10) వస్త్యౌషధము శీఘ్రముగబయటవెడలుటకు కారణములు.

మూ. ప్రాప్తే తు వర్చోనిలమూత్రవేగే
వాతేఽతివృద్ధేఽల్పబలే గుదే వా. ౫౬
అత్యుష్ణతీక్ష్ణశ్చ మృదౌ చ కోష్ఠే
ప్రణీతమాత్రః పునరేతి వస్తిః,

వ్యా. పురీషము, అపానవాతము, మూత్రము, వీనివేగము కల్గియున్నప్పుడును, వాతము మిక్కిలియధికముగ నున్నప్పుడు, గుదప్రదేశమునందలి సంవరణి అనువళి బల

హీనముగనున్నప్పుడును, ప్రయోగింపబడి వస్త్యౌషధంబును; కోష్ఠము మృదువుగానున్నప్పుడు మిక్కిలియుష్ణంబును తీక్ష్ణంబును నైనయౌషధమును వస్తిచేసినను; అట్టియౌషధము లోపల క్షణమాత్రమైన నిలుపక వెంటనే బయలువెడలివచ్చును. ఇయ్యది "క్షే నైతి శీఘ్రం" అను పదియవప్రశ్నమున కుత్తరము.

## (12). చక్కఁగ వస్తిప్రయోగముచేసినను సాధ్యములైన కొన్ని వ్యాధులును శమింపకుండుటకు కారణములు.

మూ. మేదఃకఫాభ్యాం అనిలో నిరుద్ధః
శూలాఙ్గసుప్తిశ్వయథూన్ కరోతి. ౫౭
స్నేహాన్తు యుఞ్జన్నబుధస్తు తస్మై
సంవర్ధయత్యేవ హి తాన్వికారాన్,
రోగా స్తథాఽన్యేఽప్యవితర్క్యమాణాః
పరస్పరేణావగృహీతమార్గాః. ౫౮
సన్దూషితా ధాతుభిరేవ చాన్యైః
స్వైర్భేషజైః నోపశమం ప్రజన్తి,

వ్యా. మేదస్సుతోడను, కఫముతోడను, అడ్డగింపబడినవాతము; శూలమును, అవయవములయందు స్పర్శజ్ఞానము లేకుండుటను, వాపును గల్గించును. అట్టియెడ రోగికి వస్తిప్రయోగనిమిత్తము స్నేహకర్మను చేయించినచో అవస్తిని చక్కఁగప్రయోగించినను, పైజెప్పినవ్యాధులు మిక్కిలి వృద్ధినొందును. మరియు ఇత్తెరంగుననే వాతాదిదోషములు నొండొంట నిరోధింపబడినపుడు వానివానిమార్గముల అడ్డగింపబడినపుడును; ఇతరధాతువులచే దూషింపబడినపుడును, అట్టివిషయములను, తెలివిమాలినవైద్యులు చక్కఁగగమనింపక ఆయాదోషమునకు దగినచికిత్సల చక్కఁగజేసినను, ఆయౌషధములచే శాంతినొందదగిన రోగములుగూడ శమింపనేరవు. ఇయ్యది "సాధ్యాగదాః స్వైఃశమనైశ్చ కేచిత్ కస్మాత్ప్రయుక్తైః న శమం, ప్రజన్తి?" అను పండ్రెండవప్రశ్నమున కుత్తరము.

## కొన్ని రోగములు తగుచికిత్సచే శమించకుండుటకు మరికొన్ని ఇతరకారణములు.

మూ. సర్వం చ రోగప్రశమాయ కర్మ
హీనాతిమాత్రం విపరీతకాలమ్. ౫౯

మిథోఽపచారాచ్చ న తం వికారం
శాంతిం నయేత్పథ్యమపి ప్రయుక్తమ్,

వ్యా. ఆయారోగముల శమింపజేయుటకై చేయబడిన పంచకర్మలు మున్నగు చికిత్సలన్నియు హీనముగనైనను, అధికముగనైనను, దానికి విధింపబడిన కాలమునకు వ్యత్యస్తముగనైనను, ప్రయోగించినను; అపథ్యములగు నాహారవిహారాదుల సల్పినను అట్టి యౌషధము రోగమునకు మిక్కిలిహితకరమైనను; ఆయారోగముల శమింపజేయ సమర్థముకానోపదు.

అధ్యాయోక్త విషయసంగ్రహము.

తత్ర శ్లోకః:—

మూ. ప్రశ్నానిమాన్ద్వాదశ పఞ్చకర్మా
ణ్యుద్దిశ్య సిద్ధావిహ కల్పనాయామ్. ౬౦
ప్రజాహితార్థం భగవాన్ మహార్థాన్
సమ్యక్ జగాదర్షివరోఽత్రిపుత్రః.

వ్యా. పంచకర్మములనుద్దేశించి సిద్ధిస్థానమునందలి కల్పనాసిద్ధియను నీయధ్యాయమున నుద్దేశింపబడి పండ్రెండు ప్రశ్నములకును వరుసగ నుత్తరములను ప్రజలకు హితము కొరకు ఋషివర్యుడైన నాత్రేయుఁలు సవిస్తరముగ చక్కఁగ వివరించిచెప్పెను.

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే కల్పనాసిద్ధిర్నామ ప్రథమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున కల్పనాసిద్ధియను ప్రథమాధ్యాయము సమాప్తము.

# ద్వి తీ యా ధ్యా య ము.

అవతరణిక:—పూర్వాధ్యాయమున పంచకర్మలకల్పనాదులు వివరింపబడినవి. అట్టిపంచకర్మల నుపయోగింపదగినవిషయములను, వానినుపయోగింపదగని విషయములను వివరించు పంచకర్మీయసిద్ధియను నధ్యాయము ఈక్రింద వివరింపబడును.—

## అధ్యాయప్రారంభము.

మూ. అథాతః పఞ్చకర్మీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. పైయధ్యాయమున వమనాదిపంచకర్మలకల్పనము మున్నగువిషయములు సంగ్రహముగ జెప్పబడినవి. దానివలన పంచకర్మముల నుపయోగించుక్రమము తెలియును. పిమ్మట నట్టిపంచకర్మముల నుపయోగింపదగినవిషయములను, ఉపయోగింప దగని విషయములను అధికరించి నిరూపించు పంచకర్మీయసిద్ధి యనునధ్యాయమును భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించెదనని యర్థము.

## విషయనిర్దేశము.

మూ. యేషాం, యస్మాత్ పంచకర్మాణ్యగ్నివేశ! న కారయేత్,
యేషాం చ కారయేత్ తాని, తత్సర్వం సంప్రచక్ష్యతే. 3

వ్యా. పంచకర్మలను ఎవరికి ఏకారణముచే చేయంజనదు. వాని నెవరికి చేయదగును. అనునీవిషయము పూర్తిగ నీక్రింద వివరింపబడును.

ఇచ్చట వమనాదిపంచకర్మముల జేయదగనివారిని సామాన్యముగనిర్దేశించి, పిదప వమనము విరేచనము మొదలగుపంచకర్మలనుద్దేశించి నిషేధవిషయముల వేరువేరుగ జెప్పబడును.

## సామాన్యముగ పంచకర్మానర్హులు, అర్హులును.

మూ. చణ్డస్సాహసికో భీరుః కృతఘ్నో వ్యగ్ర ఏవ చ,
సద్వైద్యనృపవిద్వేష్టా (సద్రాజభిషజాం ద్వేష్టా)
తద్విష్టః శోకపీడితః. ౪
యాదృచ్ఛికో ముమూర్షుశ్చ విహీనః కరణైశ్చ యః,
వైరీ వైద్యవిదగ్ధశ్చ శ్రద్ధాహీనః సుశఙ్కితః. ౫

భిషజామవిధేయశ్చ నోపక్రమ్యాః భిషగ్విదా,
ఏతానుపచరన్ వైద్యో బహూన్ దోషానవాప్నుయాత్. ౬
ఏభ్యోఽన్యే సముపక్రమ్యాః నరాస్సర్వైరుపక్రమైః,
అవస్థాం ప్రవిభజ్యైషాం వర్జ్యం కార్యం చ వక్ష్యతే. ౭

వ్యా. కోపస్వభావముకలవాడు, సాహసికుడు, (యుక్తాయుక్తముల నెరుంగక పనులజేయువాడు), భయపడు స్వభావముకలవాడు, చేసినయుపకారమును మరచువాడు, స్థిరచిత్తము లేనివాడు, సత్పురుషులను వైద్యులను, పరిపాలనముచేయు ప్రభువులను ద్వేషించువాడును, అట్టిసత్పురుషులు మున్నగువారిచే కారణాంతరములవలన ద్వేషింపబడినవాడును, ధనాదుల గోలుపోవుట మున్నగుకారణములచే దుఃఖపడువాడును, దేవుడు లేడని నాస్తికమతమును బూనినవాఁడును, అరిష్టలక్షణములు కల్గి చావసిద్ధముగ నున్నవాడును, చికిత్సకుకావలసిన యుపకరణ (సాధన) సంపత్తి లేనివాడును, తనకు (వైద్యునకు) వైరిగ నున్నవాడును, తాను వైద్యమును చక్కఁగ తెలిసినవాడని దురభిమానము కలవాడును, చికిత్సచేసికొనుటకు శ్రద్ధలేనివాడును, అనుమానస్వభావము కలవాడును, వైద్యుడుచెప్పిన నియమములవినక నడుచుకొనువాడును, (వీరందరును) చికిత్సనొందుటకు అర్హులుకారు. పైజెప్పబడినవారికి వైద్యముచేసినయెడ చికిత్సకుడు అనేకదోషముల నొందును; (కావున చికిత్సజేయం జనదనుట).

పైజెప్పినవారికన్న నితరులగువారికి సంశోధనరూపములైన వమనాదిపంచకర్మల చేతను, సంశమనరూపమైన చికిత్సావిధానము లన్నిటిచేతను చికిత్స చేయదగును.మరియు చికిత్సార్హులని చెప్పదగినవారికి ఆయాదోషాద్యవస్థాభేదమునుబట్టి పంచకర్మల నాచరించవలసిన విధానములును, అట్టియవస్థాభేదముచే చికిత్స మానవలసినవిషయమును విభజించి యీక్రింద వివరింపబడును.

ఇచ్చట—కృతఘ్నుడును నాస్తికుడును ధర్మవిరుద్ధముగ నుండుటంజేసి యట్టి యధర్మముచే వానిచేయుచికిత్స ఫలవంతము కానోపదనియు, సత్పురుషాదిద్వేషులకు చికిత్సచేయుటయే ధర్మవిరుద్ధమనియు, చండసాహసికాదులకు చికిత్స నిష్ఫలమగుననియు నెరుంగునది. మరియు విమానస్థానమునందలి జనపదోద్ధ్వంసనీయమున "అనపవాద ప్రతీకారస్య" అని యుపక్రమించియు, రోగభిషగ్జితీయంబునందు చికిత్సానర్హవిషయములు నిరూపింపబడినను ఇచ్చట ప్రకరణానుసారముగ ననువదింపబడినవని యెరుంగునది.

### వమనకర్మానర్హులు.

మూ. అవమ్యాస్తావత్ — క్షత క్షీణాఽతిస్థూలాఽతికృశబాలవృద్ధ దుర్బలశ్రాన్తపిపాసితక్షుధితకర్మభారాఽధ్వహతోప వాసమైథు నాధ్యయనవ్యాయామచిన్తా ప్రసక్త క్షామగర్భిణీసుకుమార సంవృతకోష్ఠదుశ్ఛర్దనోర్ధ్వరక్తపిత్తప్రసక్తచ్ఛర్ద్యూర్ధ్వ వాతా స్థాపితాఽనువాసితహృద్రోగోదావర్తమూత్రాఘాతప్లీహగుల్మో దరాష్ఠీలాస్వరోపఘాతతిమిరశిరశ్శఙ్ఖకర్ణాక్షిశూలార్తాః. ౮

వ్యా. ఉరఃక్షతరోగముకలవాడు, ధాతువులు క్షీణించినవాడు, మిక్కిలిస్థూల మైన శరీరముకలవాడు, మిక్కిలికృశించినవాడును, బాలుడు, వృద్ధుడు, హీనబలుడు, పనులచే బడలినవాడు, దప్పిగొనినవాడు, ఆకలి తీవ్రముగకల్గినవాడు, పనులజేయుట చేతను, భారమును మోచుటచేతను, త్రోవనడుచుటచేత అభిఘాతము నొందినవాడును, ఉపవాసముచేసినవాడును, స్త్రీసంభోగమును వేదాదులజదువుట దేహపరిశ్రమమును చేయుట, చింత అనునీవ్యాపారములయందు మిక్కిలివ్యాసంగము కలవాడును, శరీరము కృశించినవాడును, గర్భవతియు, సుకుమారశరీరుడును, వాతప్రకోపముచే సంకుచితమైన కోష్ఠముకలవాడును, మిగులకష్టముచే వాంతియగు స్వభావముకలవాడను, ఊర్ధ్వగత రక్తపిత్తము కలవాడును, తనంతనే వాంతియగుచున్నవాడును, వాత మూర్ధ్వముగ సంచ రించువాడును, నిరూహవస్తి చేసికొనినవాడును, అనువాసనవస్తి చేసికొనినవాడును, హృద్రోగపీడితుడును, ఉదావర్తబాధితుడును, మూత్రాఘాతము, ప్లీహవృద్ధి, గుల్మము, ఉదరము, అష్ఠీల, స్వరభేదము, తిమిరము, శిరశ్శూలము, శంఖశూలము, కర్ణశూలము, నేత్రశూల, అనునీవ్యాధులచే పీడితులును; వీరందరును వమనకర్మమును చేసికొనుటకు అర్హులుకారు. (చండ-సాహసికాదులుదక్క తక్కినవారికి వమనముచేయదగునని "ఏభ్యోఽన్యేసముపక్రమ్యాః" అను పైవాక్యముచే నిర్దేశింపబడినది; అట్టివమనార్హులకు గూడ క్షతక్షీణాదివ్యాధులచే బాధకల్గినపుడు వ్యాధ్యవస్థాభేదమునుబట్టి వమనమును జేయంజనదని యీవాక్యముచే నిషేధింపబడినది.

### వమనానర్హులకు వమనముచేగల్గు వ్యాపత్తులు.

మూ తత్ర క్షతస్య భూయః క్షణనాత్ రక్తాతిప్రవృత్తిస్స్యాత్, క్షీణాఽతిస్థూల కృశబాలవృద్ధదుర్బలానాం ఔషధబలాఽసహ

త్వాత్ ప్రాణోపరోధః; శ్రాన్తపిపాసితక్షుధితానాం చ తద్వత్; కర్మభారాఽధ్వహతోపవాసమైథునాధ్యయన వ్యాయామచిన్తా-ప్రసక్తక్షామాణాం రౌక్ష్యాత్ వాతరక్తచ్ఛేదక్షతభయం స్యాత్, గర్భిణ్యాః గర్భవ్యాపదామగర్భభ్రంశాచ్చ దారుణా రోగప్రాప్తిః; సుకుమారస్య హృదయాపకర్షణాత్ (హృదయ వికర్షణాత్) ఊర్ధ్వమధో వా రుధిరాతిప్రవృత్తిః; సంవృతకోష్ఠ దుశ్ఛర్దనయోః అతిమాత్రప్రవాహణాద్దోషాః సముత్క్లిష్టాః అన్తఃకోష్ఠే జనయన్త్యన్తర్విసర్పం స్తమ్భం జాడ్యం వైచిత్త్యం మరణం వా, (అన్తఃకోష్ఠే విసర్పన్తః స్తమ్భం జాడ్యం వైచిత్త్యం మరణం వా జనయన్తి). ఊర్ధ్వగతరక్త పిత్తినః ఉదానముత్క్షిప్య ప్రాణాన్ హరేత్, రక్తం వాతి ప్రవర్తయేత్; ప్రసక్తచ్ఛర్దే స్తద్వత్; ఊర్ధ్వవాతాఽఽస్థాపితానువాసితానాం ఊర్ధ్వం వాతపిత్తప్రవృత్తిః; హృద్రోగిణో హృదయోపరోధః; ఉదా వర్తినో ఘోరతరఉదావర్తస్స్యాత్ శీఘ్రతరహన్తా; మూత్రా ఘాతాదిభిరార్తానాం తీవ్రతరశూలప్రాదుర్భావః; తిమిరార్తా నాం తిమిరాతివృద్ధిః; శిరశ్శూలాదిషు శూలాతివృద్ధిః; తస్మాత్ ఏతే న వమ్యాః.

సర్వేష్వపి తు ఖల్వేతేషు విషగరవిరుద్ధాఽజీర్ణాఽభ్యవహారామ కృతేషు అప్రతిషిద్ధం శీఘ్రతరకారిత్వాత్ ఏషామితి శీఘ్రతర కారిత్వాద్దోషాణామ్.

వ్యా. పైజెప్పబడినవారిలో నురఃక్షతపీడితులకు వమనముజేయించినచో నురమున నధికముగపుండై రక్తం బధికముగ వాంతియగును. ధాతువులు క్షీణించినవారికిని, స్థూల శరీరులకును, కృశించినవారికిని, బాలులకును, వృద్ధులకును, బలహీనులకును, వమనమును చేయించినయెడ వారు ఔషధవీర్యము నోరువజాలకుందురు కావున ప్రాణహాని సంభ వించును. శ్రమనొందినవారికిని, దప్పిగొన్నవారికిని, ఆకలికల్గినవారికిని, వమనము నుప యోగించినచో పైజెప్పినరీతిగ నౌషధవీర్యము నోరువజాలక ప్రాణముల గోలుపోవుదురు. పనులచేయుట భారమును మోచుట, త్రోవనడుచుట, ఉపవాసము, అతిసంభోగము, అధ్య

యనము, వ్యాయామము, చింత అనునీవ్యాపారములచే క్షీణించినవారికి శరీరము (కోష్ఠము) రూక్షమై యుండుటంజేసి వమనయోగమువలన వాతము మిగులప్రకోపము నొంది కోష్ఠముపుండై రక్త మధికముగ వెడలును. గర్భిణిస్త్రీకి వమనము చేయించినచో గర్భమునకు హానికల్గును, పక్వముకాకుండుగర్భ మూడిపడి దానంజేసి క్రూరములగు రోగములు సంభవించును. సుకుమారులకు వమనమువలన హృదయమున బాధకల్గి యూర్ధ్వాధోమార్గములనుండి రక్తం బధికముగ వెడలును. కోష్ఠము సంకుచితముగనున్న వారికిని మిగులకష్టముచే వమనములగువారికిని వమనములగుటవలన దోషములు మిక్కిలి సంక్షోభమునొంది కోష్ఠమున పలుదెరంగుల వ్యాపించి స్తబ్ధత్వమును జడత్వమును కల్గించి మనోవైకల్యమునుకూడ కల్గించి తుదకు మరణమునుకూడ కల్గించును. ఊర్ధ్వగత రక్త పిత్తముకలవానికిని వమనముఁరానున్నవానికిని వమనము నుపయోగించినయెడ ఉదాన వాతము ఊర్ధ్వమార్గమునొంది ప్రాణముల పైకి వెడలించి రక్తము నధికముగ వెడలించి తుదకు ప్రాణహానిని చేయును. ఊర్ధ్వముగ వాతముసంచరించువానికిని, ఆస్థాపన-అనువాసన వస్తి ప్రయోగము చేసినవారికిని వమనముచే వాతం బధికముగ వెడలును. హృదయరోగము కలవారికి వమనమువలన హృదయబాధ యధికమగుచు. ఉదావర్తరోగికి వమనమువలన ఉదావర్తమధికమై యతిశీఘ్రముగ చంపును. మూత్రాఘాతము మున్నగువ్యాధులచే బాధింపబడినవారికి వమనముచే వస్తి మున్నగుప్రదేశములయందు తీవ్రమైనశూలనొప్పి సంభవించును. తిమిరరోగులకు తిమిరం బధికమగును. శిరస్సు కణతలు చెవులు మున్నగు వానియందు శూలకల్గినవానికి వమనయోగము శూలనొప్పి యధికమగును. కావున పైజెప్ప బడిన ఉరఃక్షతాదిరోగములచే బాధితులకు వమనౌషధము నుపయోగింపంజనదు.

మరియు:—విషము, గరము (కృత్రిమవిషము), విరుద్ధాహారము, ఆమము అను నీదోషములచే రోగములు సంభవించినపుడు శీఘ్రముగ ప్రాణముల హింసించును, కావున విషాదిసంబంధము కల్గినపుడు వమననిషిద్ధులగు నురఃక్షతాదిరోగులకును కూడ వమనము (కాలాద్యనుగుణముగ) నుపయోగింపవలెను.

### వమనము చేయదగినవారు.

మూ. శేషాస్తు వమ్యాః; (విశేషతస్తు) పీనసకుష్ఠనవజ్వరరాజయక్ష్మ కాసశ్వాసగలగ్రహగలగణ్డశ్లీపదమేహమన్దాగ్నివిరుద్ధాఽజీర్ణాన్న విసూచికాలసక విషగరపీత దష్టదగ్ధవిద్ధాధశ్శోణితపిత్తకఫ ప్రసేక (దుర్నామ) హృల్లాసాఽరోచకాఽవిపాకాఽపచ్యపస్మా రోన్మాదాతిసారశోఫ పాణ్డురోగముఖపాకదుష్టస్తన్యాదయః

శ్లేష్మవ్యాధయో, విశేషేణ రోగాధ్యాయోక్తాశ్చ; ఏతేషు హి వమనం ప్రధానతమమిత్యుక్తం, కేదారసేతుభేదే శాల్యాద్యశోష దోషవినాశవత్. ౧౦

వ్యా. పైజెప్పబడినక్షతక్షీణాదులకన్న నితరరోగులకు వమనము చేయింపదగును. అందును పీనసము, కుష్ఠము, జ్వరము, రాజయక్ష్మము, కాసము, శ్వాసము, గలగ్రహము, గలగండము, శ్లీపదము, (బోదకాలు) ప్రమేహము, అగ్నిమాంద్యము, విరుద్ధాశనము, భుజించినయాహారము జీర్ణముగాకుండునపుడు మరల భుజించుట, (లేక అజీర్ణకరములగు పదార్థముల భుజించుట), విషూచిక, అలసకము, విషమును కృత్రిమవిషమును త్రాగుట, సర్పము మున్నగువిషజంతువులచే కరవబడుట, విషసంబంధములగునాయుధములచే కొట్టబడుట, అధోగతరక్తపిత్తము, నోటకఫము వెడలుట, దుర్నామవ్యాధి, హృల్లాసము (ఓకరింతలు), అరోచకము, చక్కగ జీర్ణముకాకుండుట, అపచి, అపస్మారము, ఉన్మాదము, అతిసారము, శోఫ, పాండురోగము, నోటిపుండు, స్తన్య (చనుబాల) దోషము, మున్నగువ్యాధులచే పీడితులును, మహారోగాధ్యాయమున పరిగణనముచేయబడిన కఫవ్యాధులచే పీడింపబడినవారును, విశేషముగ వమనమునకర్హులు పైజెప్పబడినవ్యాధుల యందు వమనముచే కఫమును వెడలించినయెడ (వరిపైరునందు నీళ్లు నిలచి కుళ్లు మొదలగు దోషములు పైరు కయ్యలగెనిమెలనరికి నీళ్లువెళ్లగొట్టినపుడు అట్టిజలసంపర్కదోషము హరించి చక్కగ పెరుగుచుండువిధమున) కోష్ఠమునందలికఫము వెడలి దానజనించిన పీనసాది రోగములు పుట్టుచెడనశించును; కావున పైజెప్పినవ్యాధులయందు ప్రధానముగ వమనము చేయింపదగునని భావము.

ఇచ్చట "శ్లేష్మవ్యాధయో విశేషేణ రోగాధ్యాయోక్తాశ్చ" అనువాక్యముచేత, మహారోగాధ్యాయమున "శ్లేష్మవికారాంశ్చ వింశతిమతఊర్ధ్వం వ్యాఖ్యాస్యామః, తద్యథా—తృప్తిశ్చ, తన్ద్రాచ...అవిష్కృతతమాః వ్యాఖ్యాతాః" (సూత్ర. ౨౦ అ. ౨౨ సూత్రము) అని నిర్దేశింపబడిన యిరువదికఫరోగములును అనువదింపబడును.

మరియు మహారోగాధ్యాయమున "వమనన్తు సర్వోపక్రమేభ్యః శ్లేష్మణి ప్రధానతమం... ప్రశోషమాపద్యన్తే తద్వత్" (సూత్ర. అ. ౨౦ సూత్రము. ౨౫) అనువాక్యముచే నిర్దేశింపబడిన వమనప్రాధాన్యము "ఏతేషు హి వమనం ప్రధానతమ మిత్యుక్తం..... దోషవినాశవత్" అనునీవాక్యముచే ననువదింపబడును. ఇత్తెరంగున నే క్రిందజెప్పంబడు విరేచనప్రాధాన్యమును వస్తిప్రాధాన్యమునుగూడ ననువాదరూపముగ నెరుంగనగును.

### విరేచనము జేయదగనివారు.

మూ. అవిరేచ్యాస్తు—సుభగక్షతగుదముక్తనాలాధోభాగ రక్తపిత్త విలఙ్ఘిత దుర్బలేన్ద్రియాఽల్పాగ్ని నిరూఢకామాదివ్యగ్రాఽజీర్ణనవజ్వర మదాత్యయితాధ్మాత శల్యార్దితాభిహతాఽతి స్నిగ్ధ రూక్షదారుణకోష్ఠాః, క్షతాదయశ్చ గర్భిణ్యన్తాః. ౧౧

వ్యా. సుకుమారముగ పెరిగినవారును, గుదస్థానమున గాయపడిపుండైనవారును, గుదద్వారమును మూసికొనకయుండువారును, అధోగతరక్తపిత్తము కలవారును, లంకణము చేసినవారును, చక్షురాదీంద్రియములు బలహీనములుగ నున్నవారును, మందగించి స్వల్పమైన జాఠరాగ్నికలవారును, నిరూహవస్తిచేసికొనినవారును, కామక్రోధాదులచే కలతనొందినమనస్సు కలవారును, అజీర్ణరోగముకలవారును, నూతనముగ జ్వరమువచ్చిన వారును (జ్వరము పక్వముగాకుండునపుడు అని యర్థము), మదాత్యయపీడితుడును, కడుపుబ్బరముకలవారును, శల్యముచే బాధితుడును, అభిఘాతము నొందినవారును, మిక్కిలి స్నిగ్ధంబును, మిక్కిలిరూక్షంబును, క్రూరంబునైనకోష్ఠముకలవారును విరేచనమునకు అర్హులుకారు. మరియు వమనానర్హులపరిగణనముచేయుతరి చెప్పబడిన "క్షతక్షీణ... గర్భిణీ" అను నంతవరకుగల వాక్యముచే నిర్దేశింపబడినక్షతక్షీణాదులును విరేచనమునకును అర్హులుకారు.

### అనర్హులకు విరేచనమువలనగల్గువ్యాపత్తులు.

మూ. తత్ర సుభగస్య సుకుమారోక్తో దోషః స్యాత్, క్షతగుదస్య క్షతే గుదే ప్రాణోపరోధకరీం రుజాం జనయేత్, ముక్తనాళ మతిప్రవృత్త్యా హన్యాత్, అధోభాగరక్తపిత్తినం తద్వత్; విలఙ్ఘితదుర్బలేన్ద్రియాఽల్పాగ్నినిరూఢాః ఔషధవేగం నసహేరన్; కామాదివ్యగ్రమనసో న ప్రవర్తతే, కృచ్ఛ్రేణ వా ప్రవర్తమానం అయోగదోషాన్ కుర్యాత్; అజీర్ణినః ఆమదోషస్స్యాత్; నవజ్వరిణోఽవిపక్వాన్ దోషాన్ న నిర్హరేత్, వాతమేవచ కోపయేత్; మదాత్యయితస్య మద్యక్షీణే దేహే వాయుః ప్రాణోపరోధం కుర్యాత్, ఆధ్మాతస్యాధ్మాయమానస్య వా పురీషకోష్ఠే (పురీషగ్రథితకోష్ఠే) నిచితో వాయుర్విసర్పన్

సహసాఽఽనాహం తీవ్రతరం మరణం వా జనయేత్, శల్యార్దితాఽభిహతయోః క్షతే వాయురాశ్రితో జీవితం హింస్యాత్; అతిస్నిగ్ధస్య అతియోగభయం భవేత్; రూక్షస్య వాయురఙ్గప్రగ్రహం కుర్యాత్; దారుణకోష్ఠస్య విరేచనోద్ధతాః దోషాః హృచ్ఛూలపర్వభేదాఽఽనాహాఙ్గమర్దచ్ఛర్దిమూర్ఛాక్లమాన్ జనయిత్వా ప్రాణాన్ హన్యుః; క్షతాదీనాం గర్భిణ్యన్తానాం ఛర్దనోక్తో దోషస్స్యాత్; తస్మాదేతే న విరేచ్యాః. ౧౨

వ్యా. పైజెప్పబడినవిరేచనానర్హులలో సుకుమారులకు విరేచనము చేయించినయెడ వమననిషేధమునకు చెప్పినదోషమే సంభవించును. (హృదయమున బాధకల్గి ఊర్ధ్వమార్గమునసైనను, అధోమార్గమునసైనను, రక్తంబధికముగ వెడలునని భావము. మరియు గుదమున గాయపడినవానికి విరేచనము చేయించిన గాయము అధికమై ప్రాణాంతకమైన తీవ్రమగుబాధను కల్గించును. గుదము మూసికొనకయున్నవానికి విరేచనౌషధమువలన అధికముగ విరేచనంబులై చంపును. అధోగతరక్తపిత్తముగలవారికిని అట్టియుపద్రవమే కల్గును. లంకణము చేసినవారికిని, దుర్బలములైన ఇంద్రియములు కలవారికిని, అగ్నిమందగించినవారికిని, నిరూఢవస్తిచేసినవారికిని, శరీరబలము చాల తక్కువగనుండుటంజేసి వారు విరేచనౌషధవేగమును సహింపజాలకుందురు. కామము, క్రోధము, శోకము మున్నగువానిచే కలతనొందినమనస్సుగలవానికి విరేచనము నుపయోగించినచో విరేచనములు కానోపదు. లేక మిక్కిలికష్టముచే విరేచనము స్వల్పముగనగును, దానంజేసి విరేచనఅయోగమునగల్గు విభ్రంశము, హిక్క, స్తంభము, మున్నగుదోషములు సంభవించును. జీర్ణశక్తిలేనివానికి ఆమదోషము సంభవించును. దోషములు పక్వముగాకుండు నవీనజ్వరితునకు విరేచనము నుపయోగించినయెడ పక్వముగానిదోషములను బైటవెడలింపనేరక కేవలము వాతమునే ప్రకోపింపజేయును. మదాత్యయము కల్గినవానికి మద్యపానముచే శరీరము క్షీణించియుండుటవలన వాతము మిగుల ప్రకోపమునొంది ప్రాణముల మిగుల హింసించును. కడుపుబ్బరించినవానికి విరేచనము నుపయోగించినయెడ వాతము ప్రకుపితమై పురీషసంచితమైన కోష్ఠమున పలుతెరంగుల సంచరించుచు కోష్ఠమున గడబిడజేసి అట్టియానాహమును తీవ్రతరముగజేసి యొకవేళమరణమునుగూడ కలిగించును. శల్యముచే బాధితునకును, అభిఘాతము నొందినవానికిని, గాయమున వాతముజేరి ప్రాణహానిజేయును. మిక్కిలి స్నిగ్ధకోష్ఠులకును, విరేచనాతియోగభయము కలుగును. రూక్షశరీరులకును వాతము ప్రకుపితమై అవయవములయందు బాధ కల్గించును. క్రూరకోష్ఠునకు

విరేచనముపయోగించనియెడ దోషములు ప్రకోపమనొంది హృదయశూలను, పర్వ భేదము, ఆనాహము, ఒడలినొప్పులు, వాంతి, మూర్ఛ, బడలిక అనునీయుపద్రవముల గల్గించి ప్రాణముల హింసించును. క్షతక్షీణులు మొదలు జేసి గర్భిణీవరకును చెప్పబడినవారికిని విరేచనమునుపయోగించినయెడ వమనౌషధముచేగల్గు నాయాయుపద్రవములే సంభవించును. కావున పైజెప్పబడిన సుకుమారాదులకు విరేచనౌషధము నుపయోగింపదగదని భావము.

## విరేచనము చేయదగినవారు.

మూ. శేషాస్తు విరేచ్యాః; (విశేషతస్తు) కుష్ఠజ్వరమేహోర్ధ్వరక్తపిత్త భగన్దరోదరార్శోబ్రధ్నప్లీహగుల్మార్బుద గలగణ్డ గ్రన్థివిసూచి కాలసక మూత్రాఘాత క్రిమికోష్ఠవిసర్ప పాండురోగశిరఃపార్శ్వ శూలోదావర్తనేత్రాస్యదాహ హృద్రోగవ్యఙ్గనీలికానేత్రనాసి కాస్యస్రవణహలీమక శ్వాసకాసకామలాఽపచ్యపస్మారోన్మాదవాత రక్తయోనిరేతోదోష తైమిర్యారోచకావిపాకచ్ఛర్దిశ్వయథూ దరవిస్ఫోటకాదయః, పిత్తవ్యాధయో విశేషేణ రోగాధ్యా యోక్తాశ్చ;ఏతేషు హి విరేచనం ప్రధానతమమిత్యుక్తం అగ్న్యు పశమే అగ్నిగృహవత్.　　　　౧౩

వ్యా. పైజెప్పబడిన సుభగక్షతగుదాదులకన్న ఇతరములగురోగములు గలవారికి విరేచనౌషధముచే విరేచనము చేయింపదగును. అందును-కుష్ఠము, జ్వరము, ప్రమేహము, ఊర్ధ్వగతరక్తపిత్తము, భగందరము, ఉదరము, అర్శోరోగము, బ్రధ్నరోగము, ప్లీహము, గుల్మము, అర్బుదము, గలగండము, గ్రంధి, విసూచిక, అలసకము, మూత్రాఘాతము, కోష్ఠమున క్రిములు జేరియుండుట, విసర్పము, పాండురోగము, శిరశ్శూల, పార్శ్వ శూలము, ఉదావర్తము, కండ్లుమంటలు, నోరుమంట, హృద్రోగము, వ్యంగము, నీలిక, నోటనుండియు, నాసారంధ్రములనుండియు, కన్నులనుండియు నీరుగారుట, హలీమకము, శ్వాసకాసములు, కామలారోగము, అపచి, అపస్మారము, ఉన్మాదము, వాతయోని, రక్త యోని, శుక్రదోషము, తిమిరరోగము, అరోచకము, అజీర్ణము, వమనరోగము, శోఫ, మహోదరము, విస్ఫోటము ఇవిమున్నగురోగములును; మహారోగాధ్యాయమున జెప్ప బడినపిత్తరోగములును; ముఖ్యముగ విరేచనమునకు అర్హములైయుండును. పైజెప్పబడిన రోగములయందు పిత్తము ప్రకుపితమైయుండును, గాన అట్టిపిత్తమునకు ప్రధానమై

విరేచనరూపచికిత్సను చేసినయెడ పిత్తదోషము బయలువెడలి దానజనించినరోగములన్నియు (నిప్పుచే తగలబడుచుండుగృహము నిప్పును చల్లార్చినయెడ బాగుపడువిధముగ) నిశ్శేషముగ శమించును. ఇచ్చట మహారోగాధ్యాయమున "పిత్తవికారాః—ఓషశ్చ ప్లోషశ్చ......వ్యాఖ్యాతాః" (సూ. అ. 20 సూ. 18) అని నిర్దేశింపబడిన పిత్తరోగములు ఇచ్చట "రోగాధ్యాయోక్తాశ్చ" అనువాక్యముచే ననువదింపబడెను.

మరియు "విరేచనం తు సర్వోపక్రమేభ్యః పిత్తే ప్రధానతమం మన్యన్తే భిషజః ......యథాగ్నౌ వ్యపోఢే కేవలమగ్నిగృహం చ శీతీ భవతి తద్వత్" (సూ. అ. 20 సూ. 21) అని మహారోగాధ్యాయమున చెప్పబడినవాక్యార్థము ఇచ్చట "విశేషు హి విరేచనమ్......గృహవత్" అనువాక్యముచే అనువదింపబడును.

## ఆస్థాపనవస్తికనర్హులు.

మూ. అనాస్థాప్యాస్తు—అజీర్ణ్యతి స్నిగ్ధపీతస్నేహోత్క్లిష్ట దోషాల్పాగ్నియానక్లాన్తాతిదుర్బలక్షుత్తృష్ణా శ్రమార్తాతికృశభుక్తభక్తపీతోదకవమిత విరిక్త కృతనస్తః కర్మక్రుద్ధభీతమత్తమూర్ఛిత ప్రసక్తచ్ఛర్ది నిష్ఠీవికాశ్వాసకాసహిక్కాబద్ధచ్ఛిద్రోదకోదరాధ్మానాలసకవిసూచికామప్రజాతామాతిసారమధుమేహకుష్ఠార్తాః.

వ్యా. అజీర్ణరోగియు, అతిస్నిగ్ధుడును, స్నేహమును పానముచేసినవాడును, దోషములు స్వస్థానమునుండి సడలి గమనోన్ముఖములైయున్నవాడును, జాఠరాగ్ని మందగించినవాడును, రథము గుఱ్ఱములు మున్నగువానిపై నెక్కి సవారిచేయుటచే బడలినవాడును, మిక్కిలి బలహీనుడును, ఆకలిచేనైనను దప్పిచేనైనను శ్రమముచేనైనను పీడింపబడినవాడును, మిక్కిలి కృశించినవాడును, అన్నమును భుజించినవాడును, జలమును త్రాగినవాడును, వమన-విరేచన-నస్యకర్మలలో నెద్దానినైన చేసికొనినవాడును, క్రోధమునొందినవాడును, భయపడినవాడును, మత్తుగొనినవాడును, మూర్ఛనొందినవాడును, వమనము రానున్నవాడును, నోట కఫము వెడలనున్నవాడును, శ్వాసము కాసము ఎక్కిళ్లు బద్ధోదరము ఛిద్రోదరము జలోదరము కడుపుబ్బరము అలసకము విసూచిక ఆమ, గర్భస్రావము, ఆమాతిసారము,మధుమేహము (ప్రమేహసామాన్యము) కుష్ఠము అనునీవ్యాధులలో నెద్దానిచేనైన బాధింపబడినవారును, ఆస్థాపనవస్తినిజేయ నర్హులుకారు. (ఇచ్చట మధుమేహ శబ్దముచేత ప్రమేహములన్నియు గ్రహింపబడును.)

అనర్హుల కాస్థాపనవస్తిచే గల్గువ్యాపత్తులు.

మూ. తత్ర—అజీర్ణ్యతిస్నిగ్ధపీతస్నేహానాం దూష్యోదరం, మూర్ఛా
శ్వయథుర్వా స్యాత్; ఉత్క్లిష్టదోషమన్దాగ్న్యోః అరోచక
స్తీవ్రః; యానక్లాన్తస్య క్షోభవ్యాపన్నో వస్తిః ఆశు దేహం
శోషయేత్; అతిదుర్బలక్షుత్తృష్ణాశ్రమార్తానాం పూర్వోక్తో
దోషస్స్యాత్, అతికృశస్య కార్శ్యం పునర్జనయేత్; భుక్తభక్త
పీతోదకయోః ఉత్క్లిశ్యోర్ధ్వమధో వా వాయుర్వస్తిముత్క్షిప్య
క్షిప్రం ఘోరాన్ వికారాన్ జనయేత్; వమితవిరిక్తయోస్తు
రూక్షం శరీరం నిరూహః క్షతం క్షారఇవ దహేత్; కృత
నస్తః కర్మణో విభ్రంశం భృశసంరుద్ధస్రోతసః కుర్యాత్, (భృశం
సన్నిరుద్ధస్రోతసం కుర్యాత్) క్రుద్ధభీతయోః వస్తిరూర్ధ్వముప
ప్లవేత్; మత్తమూర్ఛితయోః భృశం విచలితాయాం
సంజ్ఞాయాం చిత్తోపఘాతాత్ వ్యాపత్ స్యాత్; ప్రసక్తచ్ఛర్ది
నిష్ఠీవికాశ్వాసకాసహిక్కార్తానాం ఊర్ధ్వీభూతో వాయుః
ఊర్ధ్వం వస్తిం నయేత్;బద్ధచ్ఛిద్రోదకోదరాధ్మానార్తానాం భృశ
తరమాధ్మాప్య వస్తిః ప్రాణాన్ హింస్యాత్;అలసకవిసూచికామ
ప్రజాతాఽఽమాతిసారిణాం ఆమకృతో దోషస్స్యాత్, మధు
మేహకుష్ఠినోః వ్యాధేః పునర్వృద్ధిః; తస్మాదేతే నాఽఽ
స్థాప్యాః. ౧౫

వ్యా. అజీర్ణరోగముకలవారికిని, అతిస్నిగ్ధునకును, స్నేహపానముచేసినవానికిని ఆస్థాపనవస్తికర్మ జేసినచో సన్నిహితముచే గల్గుదూష్యోదరంబైనను, మూర్ఛయైనను, శ్వయథు (వాపు) వైనను సంభవించును. దోషముత్క్లేశము నొందినవారికిని, అగ్నిమందగించినవారికిని, తీవ్రమైనయరోచకము కల్గును. రథముమున్నగువానిపై సవారిచేసి బడలినవానికి సంక్షోభముచే వస్తి వ్యాపత్తునొంది శరీరమును శీఘ్రముగ శోషింపజేయును. మిక్కిలి బలహీనులకును, ఆకలిదప్పులచేతను శ్రమముచేతను పీడింపబడినవారికిని కూడ పైజెప్పినరీతిగ శరీరము శోషించును. శరీరము మిక్కిలి కృశించినవారికి మరింతకార్శ్యమధికముగ నగును. అన్నమును భుజించినవానికిని జలమును త్రాగినవానికిని ఆస్థాపనవస్తి

వలన వాతము ప్రకోపించి వస్తిని యూర్ధ్వముగనైనను అధోమార్గముగనైనను వెడలించి శీఘ్రముగ క్రూరములైనరోగముల గల్గించును. వమనమునైనను విరేచనమునైన నుపయోగించినవారికి నిరూహావస్తిజేసినయెడ నయ్యది వమనవిరేచనములచే రూక్షమైన కోష్ఠమున జేరి (గాయమునందుంచబడినక్షారము గాయమును మరింత దహించుభంగి,) దహింప జేయును. నస్యకర్మజేసినవానికి ఆస్థాపనవస్తి నుపయోగించినయెడ స్రోతోమార్గమును మిక్కిలి యడ్డగించి చక్షురాదీంద్రియములకు వైకల్యమును కల్గించును. క్రోధముచేతను భయముచేతను వ్యాకులమైనవారికుపయోగించినచో వస్త్యౌషధము నోరుమున్నగుమార్గముల నుండి బైటవెడలును. మత్తుగొనినవానికిని మూర్ఛనొందినవానికిని ఆస్థాపనవస్తి నుపయోగించినయెడ ప్రజ్ఞ తప్పియుండునపుడు చిత్తమును బొత్తుగ చెరిచి మరింతమూర్ఛను వృద్ధి నందించును. వమనంబును,జొల్లును నోటవెడలనున్నవారికిని, శ్వాస-కాస-హిక్కలచే బాధితులకు నుపయోగించినయెడ వాతము ప్రకుపితమై యూర్ధ్వమార్గమున వస్తిని చేర్చును. బద్ధోదరము, ఛిద్రోదరము, జలోదరము, ఆధ్మానము, అనుసీరోగములచే బాధితులకు వస్తిప్రయోగముజేసిన నయ్యది మిక్కిలి యధికముగ నాధ్మానమును (కడుపుబ్బరమును) కల్గించి, తుదకు ప్రాణముల హింసించును. అలసకవిసూచికలచే బాధితులకును ఆమగర్భమును ప్రసవించినవారికిని, ఆమాతిసారపీడితులకును ఆస్థాపనవస్తి నుపయోగించినచో నామదోషము సంభవించును. మధుమేహము(ప్రమేహము)చేతను,కుష్ఠముచేతను బాధింపబడినవారికిని ఆస్థాపన నుపయోగించినయెడ ఆయావ్యాధులు మరింత వృద్ధినొందును; కావున పైజెప్పబడినయజీర్ణాదిరోగములచే బాధింపబడినవారికి ఆస్థాపనవస్తి నుపయోగింపం జనదు.

## ఆస్థాపనవస్తిచేయదగినవారు.

మూ. శేషాస్త్వాస్థాప్యాః; విశేషతస్తు సర్వాఙ్గైకాఙ్గకుక్షిరోగవాతవర్చో
మూత్రశుక్రసఙ్గబలవర్ణమాంసరేతఃక్షయ దోషాధ్మానాఙ్గసుప్తి
క్రిమికోష్ఠోదావర్త శుద్ధాతిసారపర్వభేదాభితాపప్లీహగుల్మశూల
హృద్రోగభగన్దరోన్మాద జ్వరబ్రధ్నశిరః కర్ణశూలహృదయ
పార్శ్వపృష్ఠకటీగ్రహవేపనాక్షేపక గౌరవాతిలాఘవరజఃక్ష
యార్తవిషమాగ్నిస్ఫిగ్జానుజఙ్ఘోరు గుల్ఫపార్ష్ణి ప్రపదయోని
బాహ్వఙ్గులిస్తనాన్తదన్తనఖపర్వాస్థిశూలశోషస్తమ్భాన్త్రకూజన
పరికర్తికాల్పాల్పశశబ్దోగ్రగన్ధోత్థానాదయో వాతవ్యాధయో

విశేషేణ మహారోగాధ్యాయోక్తాశ్చ; ఏతేష్వాస్థాపనం ప్రధాన
తమమిత్యుక్తం వనస్పతేర్మూలచ్ఛేదవత్.			౧౬

వ్యా. పైనిషేధింపబడిన అజీర్ణాతిస్నిగ్ధాదిరోగులకన్న నితరులగువారికి ఆస్థాపన వస్తి చేయందగును. మరియు సర్వాంగవాతము, ఏకాంగవాతము, కుక్షిలో జనించు వ్యాధి, అపానవాతంబును, మలమూత్రములును, శుక్రంబును బంధించుట; బలము నశించుట, శరీరకాంతియు, మాంసంబును, శుక్రంబును క్షీణించుట; ఆధ్మానము, శరీరముపై స్పర్శజ్ఞానము తెలియకుండుట, కోష్ఠమున క్రిములు జేరుట, ఉదావర్తము, శుద్ధాతిసారము, వ్రేలిగణుపులయందు పగిలి బాధ కల్గుట, శరీరతాపము, ప్లీహము, గుల్మము, శూల, హృద్రోగము, భగందరము, ఉన్మాదము, జ్వరము, బ్రధ్నరోగము, శిరఃశూలము, చెవిపోటు, గుండెనొప్పి, ప్రక్కలయందును, వీపునందును, కటిప్రదేశమునందును నొప్పి; కంపవాతము, ఆక్షేపకవాతము, శరీరము బరువుగనుండుట, లేక మిక్కిలి తేలికగనుండుట, స్త్రీలకు ఋతురక్తము క్షీణించుట, జఠరాగ్ని విషమముగ నుండుట, పిరుదులు, మోకాళ్లు, పిక్కలు, తొడలు, చీలమండ, కాలిమడిమ, మీగాళ్లు, యోని, బాహువులు, వ్రేళులు, స్తనాగ్రములు, దంతములు, గోళ్లు, వ్రేలికీళ్లు, అస్థులు, వీనిలో దేనియందైనను శూల కల్గుట; లేక శుష్కించుట; లేక స్తంభించుట; ఆంత్రకూజనము; (ప్రేవులలోకూతలు); పరికర్తిక (గుదస్థానమున కత్తిరించినవిధముగ బాధ); కొంచెము కొంచెముగనైనను, శబ్దముతోడియైనను, తీవ్రమైనవాసనకల్గియైనను, మలము వెడలుట; ఇవి మున్నగువ్యాధులచే పీడింపబడినవారు మహారోగాధ్యాయమున చెప్పబడినవాతవ్యాధులు కలవారును, విశేషముగ (ప్రధానముగ) ఆస్థాపనవస్తి చేయుటకు తగుదురు.

పైజెప్పిన వ్యాధులయందు వస్తికర్మచేసినచో అయ్యది పక్వాశయమున తొలుతనే ప్రవేశించి వాతవ్యాధికి మూలకారణమైన హేతువును నిర్మూలనముచేయును దానంజేసి వాతవ్యాధులన్నియు (ఒకవృక్షమునకు ఆధారభూతమయినవ్రేళ్లను పెకలించినచో ఆచెట్టుకు సంబంధించిన శాఖోపశాఖలతోకూడ నిర్మూలమై మరల పొడమకుండునట్లు), నిర్మూలములై మరల పొడసూపకుండును. కావున వస్తికర్మప్రధానమని చెప్పబడినది. ఈవిషయమునే సూత్రస్థానమునందలి మహారోగాధ్యాయమున "ఆస్థాపనానువాసనంతు ఖలు......ఫలపలాశానాం నియతో వినాశః తద్వత్" (సూ. అ. ౨౦ శ్లో. ౧౭) అని చెప్పబడినది. అదియే ఇచ్చట "ఏతేష్వాస్థాపనం......చ్ఛేదవత్" అనువాక్యముచే ననువదింపబడెను. మరియు "నఖభేదశ్చ......అశీతిర్వాతవికారాః" (సూ. అధ్యా. ౨౦. శ్లో. ౧౮) అనువాక్యముచే మహారోగాధ్యాయమున చెప్పబడినవాతరోగములను

ఇచ్చుట "వాతవ్యాధయో విశేషేణ మహారోగాధ్యాయోక్తాశ్చ" అని యనువదింప బడినది.

## అనువాసనవస్తికనర్హులు.

మూ. య ఏవ అనాస్థాప్యాః త ఏవ అననువాస్యాః స్యుః, విశేషతస్తు—అభుక్తభక్తనవజ్వరపాణ్డురోగకామలాప్రమేహార్శః ప్రతిశ్యాయారోచకమన్దాగ్ని దుర్బలప్లీహకఫోదర - ఊరుస్తంభవర్చోభేదవిషగరపీతపిత్తకఫాభిష్యన్ద గురుకోష్ఠశ్లీపదగలగణ్డాపచీక్రిమికోష్ఠినః. ౧౭

వ్యా. ఎవరికి ఆస్థాపనవస్తి చేయదగదని పైని నిషేధింపబడినదో వారికే అనువాసనవస్తినికూడ ప్రయోగింపజనదు. అందును—అన్నమును భుజించకుండువారును, నవ (ఆమావస్థయందున్న) జ్వరపీడితులును, పాండురోగులును, కామలాపీడితులును, ప్రమేహరోగముకలవారును, అర్శోరోగబాధితులును, పతిశ్యాయము (పీనస)చే బాధపడువారును, అగ్ని మందగించినవారును, బలహీనులును, ప్లీహరోగులును, కఫముచేనైనను ఉదరరోగముకలవారును, ఊరుస్తంభము, మలభేదము కలవారును; విషమును, గరమును (పెట్టుడుమందును) త్రాగినవారును, పిత్తకఫములచేనైన అభిష్యందము కలవారును, గురుకోష్ఠము కలవారును, శ్లీపదము, గలగండము, అపచీ, యనురోగములు కలవారును; కోష్ఠమున క్రిములు కలవారును, విశేషముగ ఆస్థాపనవస్తికి అర్హులుకారు.

## అనర్హులకనువాసనముచే గల్గువ్యాపత్తులు.

మూ. తత్ర—అభుక్తభక్తస్య అనావృతమార్గత్వాత్, ఊర్ధ్వమతివర్తతే స్నేహః; నవజ్వరపాణ్డురోగకామలాప్రమేహిణాం దోషానుత్క్లిశ్య ఉదరం జనయేత్; అర్శసస్య అర్శాంస్యభిష్యంద్యాధ్మానం కుర్యాత్; అరోచకార్తస్య అన్నగృద్ధిం పునర్హన్యాత్; మన్దాగ్నిదుర్బలయోః మన్దతరమగ్నిం కుర్యాత్; ప్రతిశ్యాయప్లీహాదిమతాం భృశముత్క్లిష్టదోషాణాం భూయ ఏవ దోషం వర్ధయేత్; తస్మాదేతే నానువాస్యాః. ౧౮

వ్యా. పైనిషేధింపబడినవారలలో అన్నమును భుజింపకుండువారికి అనువాసనవస్తిప్రయోగము చేసినయెడ ఊర్ధ్వమార్గము అడ్డులేకయుండుటచేత వస్తితో ప్రయో

గింపబడిన స్నేహము నిరాటంకముగ పైకివ్యాపించును. నవజ్వరము, పాండురోగము, కామల, ప్రమేహము అనునీరోగములు గలవారికి ప్రయోగించినచో దోషములు కలత నొంది ఉదరవ్యాధిని కల్గించును. అర్శోరోగముకలవానికి గుదాంకురములను ద్రవింప జేసి ఆధ్మానమును కల్గించును. అరోచకము కలవారికి అన్నమునందభిలాషను బొత్తుగ నశింపజేసును. అగ్నిమాంద్యము కలవారికిని, బలహీనులకును, అగ్నిని మరింత మందగింప జేయును. ప్రతిశ్యాయము, ప్లీహము, కఫోదరము, ఊరుస్తంభము, వర్చోభేదము కల వానికిని; విషమును గరమును పానముచేసినవారికిని, పిత్తఅభిష్యందములుకలవారికిని, గురు కోష్ఠములకును, శ్లీపదగలగండఅపచిరోగములు కలవారికిని, క్రిమికోష్ఠులకును, అనువాసన వస్తి నుపయోగించినచో ఉత్క్లిష్టమైనదోషములను మరింత మిక్కుటముగ వృద్ధి నొందించును. కావున పైచెప్పినవారికందరకును అనువాసనవస్తిని చేయందగదు.

## అనువాసనవస్తికర్హులు.

మూ॥ య ఏ వాస్థాప్యాః త ఏ వానువాస్యాః; విశేషతస్తు— రూక్ష తీక్ష్ణాగ్నయః కేవలవాతరోగార్తాశ్చ; ఏతేషు హ్యనువాసనం ప్రధానతమమిత్యుక్తం వనస్పతిమూలే ద్రుమప్రసేకవత్. ౧౮

వ్యా. యెవరికి ఆస్థాపనవస్తిచేయదగునో వారికే అనువాసనవస్తినిగూడ చేయ దగును. మరియు—రూక్షశరీరులకును, తీక్ష్ణాగ్నికలవారికిని, కేవలవాతరోగము గలవారి కిని, ప్రధానముగ అనువాసనవస్తిని ప్రయోగింపదగును. అట్టివారికి అనువాసనవస్తిచేసి నచో వస్త్యౌషధమునందలి స్నేహముచే వాతముయొక్క రూక్షాదిగుణములను శమింపజేసి (యొకచెట్టునకు మొదట నీరును పోసినయెడ నయ్యది శాఖోపశాఖలుగ వృద్ధినొందు భంగి) శరీరవర్ణబలాదులను వృద్ధినొందించును. కావున పైజెప్పినవాతవ్యాధులయందు స్నేహాభూయిష్ఠమయిన అనువాసనవస్తిని ప్రయోగించుట చాలముఖ్యమని చెప్పబడినది.

ఈవివరణము కల్పనాసిద్ధియను పైయధ్యాయమున నిట్లు చెప్పబడినది. "మూలే నిషిక్తో హి......అనువాసనేన" (చ. సి. అ. ౧ శ్లో. ౩౧) దానినే ఇచ్చట "ఏతేషు హ్యనువాసనం, ప్రధానతమమిత్యుక్తం మూలే ద్రుమప్రసేకవత్" అను వాక్యముచే ననువదించబడినది.

## శిరోవిరేచనమునకనర్హులు.

మూ. అశిరోవిరేచనార్హాస్తు— అజీర్ణిభుక్తభక్తపీతస్నేహమద్యతోయ పాతుకామః, స్నాతశిరాః, స్నాతుకామః, క్షుత్తృష్ణాశ్రమార్త

మత్తమూర్ఛితశస్త్రదణ్డహతవ్యవాయవ్యాయామపానక్లాన్త నవ జ్వరశోకాభితప్త విరిక్తానువాసిత గర్భిణీనవప్రతిశ్యాయార్తాః; అన్యతౌదుర్దినేచేతి (అన్యతుదుర్దినేచేతి). ౨౦

వ్యా. అజీర్ణరోగియు, అన్నమును భుజించినవాడును, స్నేహముసైనను మద్యముసైనను ఉదకముసైనను త్రాగినవారును, స్నేహాదుల త్రాగ నిచ్ఛగొనినవారును, శిరస్స్నానము జేసినవారును, శిరస్స్నానము చేయదలచినవారును, ఆకలిదప్పులచేతను పరిశ్రమముచేతను శ్రమనొందినవారును, మత్తుగొనినవాడును, మూర్ఛనొందినవారును, ఆయుధములచేసైనను కఱ్ఱలచేసైనను కొట్టబడినవారును, స్త్రీసంభోగముచేతను వ్యాయామముచేతను మద్యపానముచేసైనను బడలినవారును, నవజ్వరము కలవాడును, దుఃఖముచే సంతాపము నొందినవాడును, విరేచనముచేసికొనినవాడును, అనువాసనవస్తిచేసికొనినవాడును, గర్భిణియు, నూతనముగ పీనసము సంభవించినవాడును, శిరోవిరేచనము చేసికొన నర్హులు కారు. మరియు నస్యకర్మకు నిషిద్ధమైన శీత-గ్రీష్మ-వర్ష ఋతువులయందును, మేఘము లావరించియున్న దినములయందును ఎవరికైన శిరోవిరేచనము చేయంజనదు. (ఇచ్చట "అన్యతుదుర్దినే" అను సమస్తపదపాఠమున వర్షఋతువునకన్న నితరకాలమున మేఘాచ్ఛాదనము కల్గినప్పుడని యర్థము.)

### అనర్హులకు శిరోవిరేచనముచే గల్గువ్యాపత్తులు.

మూ. తత్ర—అజీర్ణిభుక్తభక్తయోః దోషఊర్ధ్వవహాని స్రోతాంస్యావృత్య కాసశ్వాసచ్ఛర్దిప్రతిశ్యాయాన్ జనయేత్, పీతస్నేహమద్యతోయపాతుకామానాం, కృతే చ పిబతాం, ముఖనాసాస్రావాఽక్ష్యుపదేహాతిమిరశిరోరోగాన్ జనయేత్; స్నాతశిరసః, కృతే చ స్నానాచ్ఛిరసః ప్రతిశ్యాయం (స్నాతస్య ప్రతిశ్యాయమ్); క్షుధార్తస్య వాతప్రకోపం; తృష్ణార్తస్య పునః తృష్ణాభివృద్ధిం ముఖశోషం చ; శ్రమార్తమత్తమూర్ఛితానాం ఆస్థాపనోక్తం దోషం జనయేత్; శస్త్రదణ్డహతయోః తీవ్రతరాం రుజం జనయేత్; వ్యవాయవ్యాయామపానక్లాన్తానాం శిరస్స్కన్ధనేత్రోరఃపీడనమ్; నవజ్వరశోకాభితప్తయోః ఊష్మా నేత్రనాడీరనుసృత్య తిమిరం జ్వరవృద్ధిం చ కుర్యాత్; విరిక్తస్య

వాయురిన్ద్రియోపఘాతం కుర్యాత్; అనువాసితస్య కఫః శిరో గురుత్వకణ్డూక్రిమిదోషాన్ జనయేత్; గర్భిణ్యాః గర్భం స్తమ్భయేత్; స కాణః కుణిః పక్షహతః, పీఠసర్పీ వా జాయతే; నవప్రతిశ్యాయార్తస్య స్రోతాంసి వ్యాపాదయేత్; అన్ృతౌ (తు)దుర్దినే చ శీతదోషాన్ పూతినస్యం శిరోరోగం చ జనయేత్, తస్మాదేతే న శిరోవిరేచనార్హాః. ౨౧

వ్యా. పైనిషేధింపబడినవానిలో అజీర్ణరోగికిని ఆహారమును భుజించినవారికిని శిరోవిరేచనము జేసినయెడ నాసారంధ్రములయందలి దోషము (మలము) ఊర్ధ్వముగ వ్యాపించియుండు స్రోతోమార్గముల జేరి యడ్డగించి కాసశ్వాసములను, వమనము, పీనసమును కల్గించును. స్నేహముసైనను మద్యముసైనను జలముసైనను త్రాగినవారికిని, త్రాగనిచ్ఛగొనినవారికిని, (శిరోవిరేచనమును చేసినవెంటనే స్నేహ-మద్య-జలముల త్రాగువారికని యర్థము). శిరోవిరేచనముచేసినయెడ నోటినుండియు నాసారంధ్రములనుండియు ద్రవము స్రవించును, కన్నులరెప్ప లుబ్బును, తిమిరరోగంబును శిరోరోగంబును కల్గును. శిరస్నానముచేసినవానికిని, శిరోవిరేచనము చేయించినవెంటనే స్నానముచేయువానికిని, ప్రతిశ్యాయము సంభవించును; ఆకలిగొన్నవానికి వాతము ప్రకోపము నొందును; దప్పిగొన్నవానికి దప్పి మిక్కిలి యధికమై నోటద్రవములేక యెండును; శ్రమనొందినవానికిని, దప్పిగొన్నవానికిని, మూర్ఛనొందినవానికిని, ఆస్థాపనవస్తివలనగలుగుదోషములే సంభవించును; (శ్రమపీడితునకు దేహము శోషించుననియు, మదమూర్ఛలచే బాధితులకు చిత్తోపఘాతములు గల్గుననియు భావము.) ఆయుధములచేతను, కర్రలచేతను, కొట్టబడినవానికి శిరోవిరేచనము చేయించినయెడ తీవ్రమైననొప్పి కల్గును స్త్రీసంభోగముచేతను, వ్యాయామముచేతను బడలినవానికి శిరస్సునందును, మూపులయందును, కన్నులయందును, బొమ్మనందును బాధకల్గును; నవజ్వరముచేతను, శోకముచేతను సంతాపము నొందినవానికి శిరోవిరేచనము చేయించినయెడ శరీరమునందలి వేడి నేత్రమునకు సంబంధించిననాడులయందు ప్రవేశించి తిమిరరోగమును గల్గించుచు, జ్వరమును వృద్ధినొందించును; విరేచనముచేసినవానికి వాతము ప్రకుపితమై చక్షురాదిఇంద్రియములకు బాధకల్గించును; అనువాసనవస్తిని చేసినవానికి కఫము ప్రకుపితమై తలభారమును, దురదను, క్రిమిరోగములను కల్గించును; గర్భిణీస్త్రీకి గర్భమును కదలనీయక స్తంభింపజేయును. లేక గర్భమునందలి యాశిశువు గ్రుడ్డిగనైనను, చేతులుముడుచుకొనినయైనను, పక్షవాతము కల్గినయైనను, కుంటిగనైనను పుట్టును; నూతనముగ ప్రతిశ్యాయము సంభవించినవానికి

వెంటనే శిరోవిరేచనము చేయించినయెడ స్రోతస్సులను చెరచును; అనుకూలముకాని ఋతువునందు మేఘము లావరించియుండునపుడును; (లేక వర్ష ఋతువుకన్న నితరకాలమున మేఘములావరించియున్నపుడును); శిరోవిరేచనము చేయించినయెడ శీతదోషములను, పూతి (దుర్గంధ)నస్యమును, శిరోరోగమును కల్గించును; కావున పైజెప్పిన అజీర్ణ రోగిమున్నగువారికి శిరోవిరేచనము జేయించుట యుక్తముకాదని సముదితార్థము.

## శిరోవిరేచనమున కర్హులు.

మూ. శేషాస్త్వర్హాః; విశేషతస్తు—శిరోదన్తమన్యాస్తమ్భగలహనుగ్రహపీనసగలశుణ్డికాశాలూకశుక్రతిమిరవర్త్మరోగవ్యఙ్గోపజిహ్వికార్ధావభేదకగ్రీవాస్కంధాంసాస్యనాసికాకర్ణాక్షిమూర్ధకపాలశిరోరోగార్దితాపతన్త్రకాపతానకగలగణ్డదన్తశూలహర్షచాలాక్షిరాజ్యర్బుదస్వరభేదవాగ్గ్రహగద్గదక్రథనాదయః, ఊర్ధ్వజత్రుగతాశ్చ వాతాదివికారాః పరిపక్వాశ్చ; ఏతేషు శిరోవిరేచనం ప్రధానతమమిత్యుక్తం; తద్ధ్యుత్తమాఙ్గమనుప్రవిశ్య ముంజాదీషికామివ ఆసక్తాం కేవలం వికారకరం దోషమపకర్షతి. ౨౨

వ్యా. పైజెప్పిన అజీర్ణాదిరోగములకన్న ఇతరరోగములయందు శిరోవిరేచనము చేయనగును. మరియు—శిరస్తంభము, దంతస్తంభము, మన్యాస్తంభము, గలగ్రహము, హనుగ్రహము, పక్వమైనపీనసము, గలశుండికాశాలూకము అనుగళరోగములు,శుక్రము, తిమిరము అనునేత్రరోగములు, వర్త్మరోగము (కనురెప్పలయందలి వ్యాధులు), వ్యంగము (మంగు), ఉపజిహ్వికా (కొండనాలుక), అర్ధావభేదనము అనుశిరోరోగము, కంఠము మూపులు అంసదేశము నోరు నాసిక చెవులు కండ్లు శిరస్సు కపాలము అనునీప్రదేశముల యందు కల్గువ్యాధులు, శిరోరోగము, అర్దితము, అపతంత్రకము, అపతానకము అను వాతరోగములు: గలగండము, దంతశూల, దంతహర్షము, దంతచలనము, కన్నులయందు రేఖలుగ జనించునేత్రవ్యాధి; నేత్రార్బుదము, స్వరభేదము, వాగ్గ్రహము, మాట పట్టినట్లు వెడలుట, గద్గదస్వరముతో మాటలాడుట, క్రథనము (ముక్కుతో మాటలాడుట), ఇవిమున్నగువ్యాధులు కలవారును; కంఠమునకు పైభాగమునందలి పరిపక్వములైన వాతవ్యాధులుకలవారును; ప్రధానముగ నస్యకర్మను జేసికొన నర్హులగుదురు. మరియు పైజెప్పిన వ్యాధులయందు శిరోవిరేచనము నుపయోగించినచో నాయౌషధము నాసా

రంధ్రములనుండి శిరస్సున ప్రవేశించి వ్యాపించి అందలిదోషములనెల్ల (ముంజదర్భనాళములోనుండి లోపలనుండు సుడిని బైట విడదీయుభంగి) బైట వెడలించి వ్యాధుల కల్గించుదోషమును పూర్తిగ హరించును. కావున పైజెప్పినవ్యాధులయందు శిరోవిరేచనము ప్రధానమైనచికిత్సితమని చెప్పబడినది.

ఇచ్చట తరుణావస్థనుండు పీనసమునందు శిరోవిరేచనము నిషిద్ధముగావున నిచ్చట పీనసశబ్దముచేత పక్వమైన ప్రతిశ్యాయము గ్రహింపబడునుగాన విరోధములేదు.

### శిరోవిరేచనము చేయదగినకాలము.

మూ. ప్రావృట్ఛరద్వసన్తేషు ఇతరేషు ఆత్యయికేషు రోగేషు నావనం కుర్యాత్ కృత్రిమగుణోపధానాత్; గ్రీష్మే పూర్వాహ్ణే, శీతే మధ్యాహ్నే, వర్షాస్వదుర్దినే చేతి. ౨౩

వ్యా. ప్రావృట్కాలమునందును, శరదృతువునందును, వసంతఋతువునందును, నస్యకర్మను చేయనగును. మరియు నస్యకర్మచేతనే నివర్తింపదగినరోగములయందు పైజెప్పినఋతువులకన్న నితరములైన శిశిరహేమంతగ్రీష్మములయందును ఆయాఋతుధర్మములకు విపరీతములగు గుణముల నౌషధాదులకు సంస్కారసంయోగముచే గల్పించి సమవీర్యముగనుండునట్లు చేసి నస్యవిధిచేయనగును. మరియు గ్రీష్మఋతువునందు పూర్వాహ్ణము (ప్రాతఃకాలము)నను, శీతకాలమునందు మధ్యాహ్నమునందును, వర్షఋతువునందు మేఘావరణములేని సమయమునను, నస్యకర్మ చేయనగును.

ఇచ్చట నిషిద్ధకాలమున నస్యకర్మచేతనే సాధింపతగినరోగములు తటస్థించినపుడు కాలఔషధాదులకు ఉపాయాంతరసంయోగాదులచే కృత్రిమగుణాదుల కల్పించి నస్యకర్మ చేయవలయునని "కృత్రిమగుణోపధానాత్" అనుపదముచే విధింపబడినది. ఈ కృత్రిమగుణోపధానవిధానము రోగభిషగ్జితీయాధ్యాయమున నిట్లు చెప్పబడినది — "ఆత్యయికే పునఃకర్మణి కామమృతుం వికల్ప్య కృత్రిమగుణోపధానేన యథర్తుగుణవిపరీతేన, భేషజం సంయోగసంస్కారప్రమాణవికల్పేనోపపాద్య ప్రమాణవీర్యసమం కృత్వా, తతఃప్రయోజయేదుత్తమేన యత్నేన అవహితః." (చ. వి. అ. ౮ సూ. ౧౬౫.)

### అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. ఇతి పఞ్చవిధం కర్మ విస్తరేణ నిదర్శితం,
ఏభ్యో యన్నహితం యస్మాత్ కర్మ యేభ్యశ్చ యద్ధితమ్. ౨౪

వ్యా. ఇత్తెరంగున వమనము, విరేచనము, ఆస్థాపనవస్తి, అనువాసనవస్తి, నస్య విధి అనునీపంచకర్మలను ఎవరికి నుపయోగింపదగినదియు, ఎవరికి నుపయోగార్హము గానిదో అట్టినిషేధమునకు తగినకారణములును, యెవరికి ఈపంచకర్మలలో నెయ్యది హితమైనదియు, నీపంచకర్మీయసిద్ధియను నధ్యాయమున వివరింపబడినది.

పైవిధినిషేధములయందు వైద్యునియూహఆవశ్యకము.

మూ. న చైకాన్తేన నిర్దిష్టేఽప్యర్థేఽభినివిశేద్బుధః,
(న చైతదేవం నిర్దిష్టం ఏకాన్తేన సమాశ్రయేత్.)
స్వయమప్యత్ర వైద్యేన తర్క్యం బుద్ధిమతా భవేత్. ౨౫
ఉత్పద్యేత హి సావస్థా దేశకాలబలం ప్రతి,
యస్యాం కార్యమకార్యం స్యాత్ కర్మ కార్యంచ వర్జితమ్. ౨౬
ఛర్దిహృద్రోగగుల్మానాం వమనం స్వే చికిత్సితే,
అవస్థాం ప్రాప్య నిర్దిష్టం కుష్ఠినాం వస్తికర్మ చ. ౨౭
తస్మాత్సత్యపి నిర్దేశేకుర్యాదూహ్య స్వయంధియా,
వినా తర్కేణ యా సిద్ధిః యదృచ్ఛాసిద్ధిరేవ చ. ౨౮

వ్యా. ఇత్తెరంగున పైని పంచకర్మలవిషయమై నిర్దేశింపబడినవిధినిమాత్రమే యను సరించి పండితుడగువైద్యుడు చికిత్సావిషయమున ప్రవర్తింపక తనబుద్ధిచే సమయోచి తము నెరింగి యూహాపోహలచే దేశ-కాల-బల-సాత్మ్యాదుల చక్కగ గమనించి తత్త దనుసారముగ అవసరమైనమార్పుల చికిత్సావిధానమున గల్పించి చికిత్స జేయుట యుక్తము. యేలనన దేశ-కాల-బలాదుల ననుసరించి వ్యాధులయొక్క అవస్థాభేదమును మార్పుగల్గుచుండును. అట్టియవస్థానుసారముగ నివ్యాధియందు ఏచికిత్స విధింపబడి నదియో నయ్యది యాచరింపవలనుపడకయు నుండును. అట్టియెడ నిషిద్ధమయిన చికిత్సా విధానమును ఆచరింపవలసియుండును. ఎట్టులన—ఛర్ది, హృద్రోగము, గుల్మము అను నీవ్యాధులయందు వమనము నిషిద్ధమైనను అవస్థాభేదముచే చేయవలసినట్లు నిర్దేశింపబడి నది. కుష్ఠరోగికి వస్తికర్మయు నత్తెరంగుననే విధింపబడినది. కావున అవస్థాభేదమును పట్టి, నిర్దేశింపబడినచికిత్సలను కొన్నిటిని వదలి దేశకాలాద్యనుసారముగ నూహించి నిషిద్ధమైనచికిత్సను కూడ స్వయముగ నూహించి చేయవలసివచ్చును. కావున బుద్ధిమంతు డగువైద్యుడు స్వబుద్ధిచేత వ్యాధ్యవస్థాభేదములను, దేశకాలాదిభేదములను చక్కగ గమనించి కేవలము నిర్దిష్టమైనచికిత్సనే అవలంబింపక తత్తదనుగుణముగ చికిత్సావిధాన

మును కల్పించుకొని యుక్తియుక్తముగ చేయవలయునని భావము. కొన్నిసమయముల యందు అట్టివితర్కములేక చేయబడినచికిత్సయు ఘుణాక్షరన్యాయముగ ఫలవంతమగును. అయ్యది యాదృచ్ఛికసిద్ధియేకాని యుక్తిసాధితము కానేరదని యెఱుంగునది.

—అధ్యాయసమాప్తి.—

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే సిద్ధిస్థానే పఞ్చకర్మీయసిద్ధిర్నామ ద్వితీయోఽధ్యాయః

వ్యా. ఇత్తెఱంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును, నగుచరక సంహితయను నాయుర్వేదతంత్రమున దృఢబలసంపూరితసిద్ధిస్థానమున పంచకర్మీయసిద్ధి యను రెండవయధ్యాయము సమాప్తము.

---

## తృ తీ యా ధ్యా య ము.

అవతరణిక:—పైయధ్యాయమున పంచకర్మల ప్రవృత్తి - నివృత్తివిషయములు మున్నగునవి వివరింపబడెను. పిదప కల్పనాసిద్ధియందు జెప్పబడినవస్తికల్పనావిధానమును విస్తరముగ వివరించుటకై వస్తిసూత్రీయసిద్ధియను నీయధ్యాయము చెప్పబడును. (వస్తిని చేయవలసినపద్ధతిని దెలుపునట్టి సూత్రమునధికరించి చెప్పబడునధ్యాయము వస్తిసూత్రీయ మని యర్థము.)

—అధ్యాయప్రారంభము.—

మూ. అథాతో వస్తిసూత్రీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతిహ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. పంచకర్మలయొక్క ప్రవృత్తి నివృత్తివిషయాదుల వివరించు పంచకర్మీయ సిద్ధియను నధ్యాయమును జెప్పినపిదప వస్తికల్పనావిధానమును వివరించుసూత్రము నధి కరించి చెప్పునట్టి వస్తిసూత్రీయసిద్ధియను నధ్యాయమును త్రికాలజ్ఞానవేత్తయగు నాత్రేయు డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

—వస్తివిషయమై యగ్నివేశుని ప్రశ్నములు.—

మూ. కృతక్షణం శైలవరస్య రమ్యే స్థితం ధనేశాయతనస్య పార్శ్వే,
మహర్షిసిద్ధైర్వృతమగ్నివేశః పునర్వసుం ప్రాఞ్జలిరన్వపృచ్ఛత్. 3

వ స్తిర్న రేభ్యః కిమపేక్ష్య ద త్త
స్స్యాత్ సిద్ధిమార్గ? కిమ్మయమస్య నేత్రం?
కీదృక్ప్రమాణాఽఽకృతి కిం గుణం చ?
కేభ్యశ్చ కిం యోనిగుణశ్చ వస్తిః? ౪
నిరూహకల్పః ప్రణిధానమాత్రా
స్నేహస్య కా వా? శయనే విధిః కః?
కే వ స్తయః కేషు హితాః ఇతీదం
శ్రుత్వోత్తరం ప్రాహవచో మహర్షిః. ౫

వ్యా. పర్వతశ్రేష్ఠమగుహిమవంతమందలి రమ్యమైనయొక ప్రదేశమున సావధాన చిత్తుడై మునిబృందపరివేష్టితుడై విశ్రాంతిగనుండు నాత్రేయమహర్షిని శిష్యుడగునగ్ని వేశులు కృతాంజలియై క్రింద జెప్పబడువిధముగ వస్తివిషయమై ప్రశ్న జేసెను.

(1) వేనిని పర్యాలోచన జేసి గమనించి మనుజులకు ప్రయోగింపబడువస్తి కార్య సిద్ధికరమగును?

(2) వస్తియొక్క నేత్రమును (గొట్టమును) దేనితో జేయవలెను?

(3) వస్తినేత్రము ఎంతప్రమాణము కల్గియుండవలెను?

(4) వస్తియొక్కయాకృతి యెట్టిది?

(5) వస్తికి ముఖ్యముగ నుండవలసిన గుణములెవ్వి?

(6) ఎవరికి దేనితో నిర్మింపబడినవస్తి నుపయోగింపవలెను?

(7) నిరూహవస్తికల్పనమెద్ది?

(8) నిరూహవస్తికల్పనమున స్నేహకాద్యర్థభాగకల్పనమెట్టిది?

(9) నిరూహవస్తియందు శయనవిధి యెట్లు?

(10) ఎవరికి ఏవస్తుల నుపయోగించిన హితకరములగును? అనునీపది ప్రశ్నము లను అగ్నివేశులు ఆత్రేయులనుద్దేశించి యడిగెనని పైవాక్యముతో నన్వయము.

(1) వస్తివిషయమై ముఖ్యముగ గమనించవలసినవిషయములు.

మూ. సమీక్ష్య దోషౌషధదేశకాల
సాత్మ్యాగ్నిసత్వాది (సత్వౌక) వయోబలాని,
వస్తి ప్రయుక్తో నియతం గుణాయ
స్యాత్సర్వకర్మాణి చ సిద్ధిమన్తి. ౬

వ్యా. వస్తికర్మ చేయునపుడు వాతాదిదోషములు, ఔషధములు,జాంగలాదిదేశము, కాలము, సాత్మ్యము, జఠరాగ్ని, మనోబలము, ఓకసాత్మ్యము (వారివారి కలవాటున నుండునది). బాల్యాదివయోభేదము, శరీరబలము, అనుసీపదిటిని నిర్మలమైనజ్ఞానముతో చక్కగ పరిశీలించియు, తత్తదనుగుణముగ వస్తిని ప్రయోగించినచో నయ్యది నియత ముగ గుణవత్తమమగును. మరియు వమనాదిసర్వకర్మలుకుకూడ పైనజెప్పినదోషాదుల గమ నించి యుక్తియుక్తముగ నుపయోగించినచో అన్నివిధములయినచికిత్సలును ఫలవంతము లగును. ఇచ్చట పైజెప్పినదేశకాలాదులనుపదిటిని ఉపకల్పనీయాధ్యాయమున నిట్లు నిర్దే శింపబడినది. ''శక్యం తథా ..సూక్ష్మాణి హి దోష-భేషజ-దేశకాల-బల-శరీర-ఆహార-సాత్మ్య-సత్త్వ-ప్రకృతివయసాం, అవస్థాంతరాణి'' (సూ. అ. 15. సూ. 5) ఈవాక్య మునగల వివరమంతయు యోనివ్యాపచ్చికిత్సితమున 326 వ శ్లోకమునకు గలవ్యాఖ్యాన మును మాచే విపులముగ వివరింపబడినది. ఇయ్యది ''వస్తిర్న రేభ్యః...సిద్ధిమార్గ'' అను మొదటిప్రశ్నమున కుత్తరము.

(2). వస్తినేత్రమును నిర్మించుటకు దగిన లోహాదిద్రవ్యములు.

మూ. సువర్ణరూప్యత్రపుతామ్రరీతి
కాంస్యాస్థిశస్త్రద్రుమవేణుదన్తైః
(కాంస్యాయసాస్థిద్రుమవేణుదన్తైః),
నలైర్విషాణైర్మణిభిశ్చ తైస్తైః
నేత్రాణి కార్యాణి సు(త్రి)కర్ణికాని. ౭
(నేత్రాణి శృంగైః మణిభిర్నలైశ్చ
త్రికర్ణికాని ప్రవదన్తి తత్‌జ్ఞాః)

వ్యా. బంగరు, వెండి, సీసము, రాగి, ఇత్తడి, కంచు, యెముకలు, ఇనుము, కొయ్య, వెదురు, (యేనుగుమొదలగువాని) దంతములు, వెట్టిచెరుకు మొదలగువాని గొట్టము, యెనుబోతుమొదలగువానికొమ్ములు, మొదలగువానిలో వేనిచేనైనను, వస్తి నేత్రమును సిద్ధముచేయవలయును. దీనికి మూడుకర్ణికలుండవలయును. (ఇయ్యది ''కిమ్మ యమస్య నేత్రం'' అను రెండవప్రశ్నమునకుత్తరము) నేత్రమన—''నీయతే (ప్రాప్యతే) స్నేహకల్కాది, అనేన, ఇతి నేత్రం'' అనువ్యుత్పత్తిచేత మేహకల్కాదులను గుద ద్వారమునుండి లోనికి ప్రవేశపెట్టుటకు సాధనమైన, చిమ్మనగ్రోవి మున్నగునవియని యెరుంగునది.

(3-5). వయోఽనుగుణముగ వస్తినేత్రప్రమాణవిధి, ఆకృతి, గుణంబును.

మూ. షడ్ద్వాదశాఽష్టాఙ్గులసమ్మితాని
షడ్వింశతిద్వాదశవర్షజానాం,
స్యుః ముద్గకర్కన్ధుసతీనవాహి
చ్ఛిద్రాణి వర్త్యా పిహితాని చైవ. ౪
యథావయోఽఙ్గుష్ఠకనిష్ఠికాభ్యాం
మూలాగ్రయోః స్యుః పరిణాహవన్తి,
ఋజూని గోపుచ్ఛసమాకృతీని
శ్లక్ష్ణాని చ స్యుః గుడికాముఖాని. ౬
స్యాత్ కర్ణికైకాగ్రచతుర్థభాగే
మూలాశ్రితే వస్తినిబన్ధనే ద్వే,

వ్యా. వస్త్యౌషధమును ప్రయోగించుటకైన సాధనము (చిమ్మనగ్రోవి) ఆరు సంవత్సరములవయసుకలవారి కుపయోగించుటకై ఆరుఅంగుళముల నిడివియు, కొస యందు పెసలగింజదూరునంతటి రంధ్రంబును కల్గియుండవలెను. ఇరువదిసంవత్సరములు వయసుకలవారికుపయోగించుటకైనది పండ్రెండంగుళముల నిడివియు, కొసయందు రేగు గింజ దూరునంత రంధ్రముకల్గియు నుండవలెను. పండ్రెండుసంవత్సరములవయసు కలవారి కుపయోగించువస్తియంత్రము ఎనిమిదియంగుళములనిడివియు, కొసయందు బటాణిగింజ దూరునంతటి రంధ్రంబును కల్గియుండవలెను. అట్టిరంధ్రములలో క్రిములుమున్నగునవి చొరబడక యుండునటు రంధ్రములపై గప్పియుంచవలెను. మరియు వస్తినేత్రము యొక్క మొదటచుట్టుకొలతపైజెప్పిన ఆయావయోభేదముకల రోగియొక్క బొటన వ్రేలిపరిమాణంబును, కొసయందు చుట్టుకొలత రోగియొక్క చిటికెనవ్రేలిపరిమాణంబును కల్గియుండవలెను. (ఇయ్యది "కీదృక్ప్రమాణ-ఆకృతి?" అను (మూడు, నాల్గు) ప్రశ్నముల కుత్తరము.

మరియు నీవస్తియంత్రము వంకరలేక ఋజువుగను, ఆవుతోకవలె మొదట స్థూలమై కొసయందు సన్నగను నునుపునుకల్గియు గుటికలవలె గుండ్రనైన యగ్రభాగము కల్గియు నుండవలెను. ఈయంత్రముచివర నాల్గవభాగమున నొకకర్ణికయు, మొదటి యందు వస్తిని బిగించుటకు ఇరుప్రక్కల రెండుకర్ణికలు నుండవలెను. (ఇయ్యది "కిం గుణం చ?" అనునైదవప్రశ్నమున కుత్తరము).

## (6). వ స్తియం త్ర నిర్మాణవిధి.

మూ. జారద్గవో మాహిషహారిణౌ వా
స్యాత్ సౌకరో వ స్తిరజస్య వాపి. ౧౦
దృఢ స్తనుర్నష్టసిరో విగన్ధః
కషాయర క్తః సుమృదుస్సుశుద్ధః (బద్ధః,)
నృణాం వయో వీక్ష్య యథానురూపం
నేత్రేషు యోజ్యస్తు సుబద్ధసూత్రః
వ స్తేరలాభే ప్లవజో గళో వా
స్యాదఙ్కపాదః సుఘనఃపటో వా. ౧౧

వ్యా. ముసలియెద్దు, ఎనుబోతు, జింక, అడవిపంది, మేక అనునీజంతువులలో నొక దానియొక్క దృఢమై పలుచనైనవ స్తిని (మూత్రపుసంచిని) గ్రహించి అందుసంక్రమించిన నరములను విడదీసి దూరంబుచ్చి, దుర్గంధముపోవునట్లు శుభ్రపరిచి, తుమ్మపట్ట త్రిఫలములు మున్నగు వగరుకలవానికషాయముతో భావనజేసి రంగుకల్గించి, మెత్తబడజేసి పైజెప్పబడినప్రమాణాదుల ననుసరించి సిద్ధముచేయబడిన నేత్రము (గొట్టము) న (మొదట) చక్కగనిమిడియుండునట్లు చేర్చి దారముతో గట్టిగ కట్టవలెను. మరియు రోగియొక్క (బలాదులను), వయస్సు గమనించి తదనురూపముగ నుండునట్లు నిర్మించవలెను.

మరియు పైజెప్పినజంతువులవ స్తి (మూత్రపుతి త్తి) దొరకనియెడ నీరుకోడియొక్క కంఠమునైనను ఇట్టిమొదలగు జంతువులయొక్క అంకపాదమనెడు నవయవవిశేషమునైనను, దట్టమైనపట్టనైనను పైజెప్పినవిధముగ గొట్టమున నిమిడియుండున ట్లమర్చవలెను. పైజెప్పబడిన వ స్తిమున్నగుదానిని వస్త్యౌషధమును (కషాయాదులను) నిండింప యుక్తముగ నుండునట్లు గొట్టమున పైభాగముననుండు రెండుకర్ణికలయందు ఇమిడియుండునట్లు కట్టవలెనని భావము. ఈవిషయము వాగ్భటమున నిట్లు చెప్పబడినది.— గ్రంథితం సాధు సూత్రేణ సుఖసంస్థాప్య భేషజమ్" (అ. హృ. సూ. అ. ౧౯)

ఇచ్చట అంకపాదమన "అఙ్కపాదః—చర్మచటకః" అని చక్రపాణిదత్త వ్యాఖ్యలో నున్నది. అష్టాంగహృదయవ్యాఖ్యానమున "వ స్తేరభావే సతి, అఙ్కపాదం-ఛాగైణాద్యవయవవిశేషం వా న్యసేత్-నేత్రే యోజయేత్" (సర్వాంగసుందరి) అని యున్నది. (ఇయ్యది "కేభ్యశ్చ కిం యోనిగుణశ్చ వ స్తిః" అనునారవప్రశ్నమున కుత్తరము).

## (7.) నిరూహవస్తిప్రయోగవిధి (కల్పము).

మూ. ఆస్థాపనార్హం పురుషం విధిజ్ఞః
సమీక్ష్య పుణ్యేఽహాని శుక్లపక్షే. ౧౨
ప్రశస్తనక్షత్రముహూర్తయోగే
జీర్ణాన్నమేకాగ్రముపక్రమేత,
(జీర్ణాన్నమేకాగ్రముపాచరేత్తమ్.)

వ్యా. రోగిని చక్కగ పరీక్షించి ఆస్థాపనవస్తికి అర్హుడని తోచినయెడ శుక్లపక్షమున ప్రశస్తమైనదినమునందు ప్రశస్తములగు నక్షత్రయోగలగ్నముతోఁగూడిన శుభముహూర్తమున, రోగి భుజించినయాహారము జీర్ణమై వానిమనస్సును వస్తికర్మయందే నిశ్చలముగ నాసక్తి కల్గియుండువేళ వానికి వస్తికర్మ జేయ నుపక్రమించవలెను.

ఇచ్చట శుక్లపక్షము సర్వారంభములకును ప్రశస్తమని దైవజ్ఞులసిద్ధాంతము కావున, "పుణ్యేఽహాని శుక్లపక్షే" అని తంత్రకారునిచే నిర్దేశింపబడినది. రోగములును రాక్షసులును కృష్ణపక్షమున జనించిరి. కావున రోగములకు జన్మసమయమైన కృష్ణపక్షమునందు వానికి చికిత్స జేసినయెడ నయ్యవి నిర్మూలములై మరలపొడసూపకుండును; కావున కృష్ణపక్షమున నానావిధచికిత్సలకును ప్రారంభము మిగులప్రశస్తమని హారీతసంహితయందిట్లు చెప్పబడినది:—"కృష్ణపక్షే కార్యం, జన్మని సర్వరోగాః హతాః సుహతా భవన్తీతి వదన్తి శాస్త్రజ్ఞాః; శుక్లే దేవా జాతాః, కృష్ణే అసురాశ్చ సర్వరోగాశ్చ; తస్మాత్ రోగచికిత్సా కృష్ణే సదైవ కర్తవ్యా."

## నిరూహవస్తివిధానము.

మూ. బలాం గుడూచీం త్రిఫలాం సరాస్నాం
ద్వే పఞ్చమూలే చ పలోన్మితాని. ౧౩
అష్టౌ ఫలాన్యర్ధతులాం చ మాంసాత్
ఛాగాత్పచేత్ అప్సు చతుర్థశేషం,
పూతం యవానీఫలబిల్వకుష్ఠ
వచాశతాహ్వాఘనపిప్పలీనామ్. ౧౪
కల్కైః గుడక్షౌద్రఘృతైస్సతైలైః
యుక్తం సుఖోష్ణైస్తు పిచుప్రమాణైః,

గుడాత్పలం ద్విప్రసృతాం తు మాత్రాం
స్నేహస్య యుక్త్వా మధుసైన్ధవం చ (మధుసైన్ధవాది). ౧౪
ప్రక్షిప్య వస్తౌ మథితం ఖజేన
సుబద్ధముచ్ఛ్వాస్య చ నిర్వ్యలీకం,
అఙ్గుష్ఠమధ్యేన ముఖం పిధాయ
నేత్రాగ్రసంస్థామపనీయ వర్తిమ్. ౧౫
తైలాక్తగాత్రం కృతమూత్రవిట్కం
నాతిక్షుధార్తం శయనే మనుష్యం,
సమేఽథవేషన్నతశీర్ష (మస్త) కే వా
నాత్యుచ్ఛ్రితే స్వాస్తరణోపపన్నే. ౧౬
సవ్యేన పార్శ్వేన సుఖం శయానం
కృత్వర్జుదేహం స్వభుజోపధానం,
సంకోచ్య సవ్యేతరదస్య సక్థి
వామం ప్రసార్య ప్రణయేత్తతస్తత్. ౧౭
స్నిగ్ధే గుదే నేత్రచతుర్థభాగం
స్నిగ్ధం శనైః ఋజ్వనుపృష్ఠవంశం,
అకమ్పనావేపనలాఘవాదీన్
పాణ్యోర్గుణాంశ్చాపి విదర్శయంస్తమ్. ౧౮
ప్రపీడ్య చైకగ్రహణేన దత్తం
నేత్రం శనైరేవ తతోఽపకర్షేత్,

వ్యా. చిట్టాముట్టి, తిప్పతీగె, త్రిఫలములు (కరక-తాని-ఉసిరికకాయలు) హ్రస్వపంచమూలములు, మహాపంచమూలములు, వీనిని ప్రత్యేకమొక్కొకపలప్రమాణంబును; ఎనిమిదిమ్రంగకాయలను, అర్ధతులము (ఏబదిపలములు) మేకపోతుమాంసమును (ఇవి యన్నియుచేరిన సముదాయము అరువదియారుపలంబులును ఎనిమిదిమ్రంగకాయలును అగును.) చేర్చి ఈక్వాథ్యద్రవ్యసముదాయమున నాలుగింతలుజలమును చేర్చి నాల్గవపాలు (క్వాథ్యద్రవ్యసమానముగ నాల్గవవంతు) క్వాథము మిగులునట్లు కాచి వడగట్టియుంచుకొనునది; అందు ఓమము, మ్రంగకాయ, బిల్వవేరు, చెంగల్వకోష్టు, వస,

సదాపవిత్తులు, తుంగగడ్డలు, పిప్పళ్లు అనువీనిని ప్రత్యేకము కర్షప్రమాణమువంతున గూర్చి కల్కముచేసి యాకల్కమును; ఒకపలము బెల్లమును, రెండుపలములు నేతిని, రెండుపలములునూనెను, తేనె సైంధవలవణమును ప్రకృత్యాద్యనుసారముగ తగుపరిమాణమును కల్పించియు, వీనినన్నిటిని (పైజెప్పినక్వాథమున) జేర్చి, అయ్యది గోరువెచ్చగనున్నపుడు క్వాథ-కల్క-స్నేహాదులన్నియు నొకటిగ కలియునట్లు కవ్వముతో చిలికి కలియత్రిప్పి, పైజెప్పినవిధిప్రకారము సిద్ధముచేయబడినవస్తియం దోసి యావస్తిని యెడమచేతితో గట్టిగ పట్టుకొని వస్తి నేత్రముతో జేర్చి బిగగట్టి, వస్తిని నోటితో నూది ముడుతలు లేకుండజేసి, నేత్రాగ్రమునందుండు ద్వారమునందలి మూతను (బిరడాను) ఊడదీసి బొటనవ్రేలిమధ్యభాగముతో నేత్రద్వారమును నొక్కి పట్టుకొనవలెను.

పిమ్మట వస్తికర్మచేయవలసినరోగికి శరీరముపై తైలమును బూసి (స్వేదవిధి ననుసరించి) మలమూత్రముల విసర్జించి మిక్కిలి యాకలియు తృప్తియు లేక సమస్థితి నున్నపుడు రోగిని సుఖమైన పడకతోగూడ మిక్కిలియెత్తును తగ్గునుగాక మితప్రమాణముగ నుండుశయ్యపై సమముగనైనను కొంచెము తలప్రక్కవంగి (తగ్గుగ)యుండునట్లైనను ఎడమప్రక్కగ నొత్తిగిలి యెడమకాలిని చక్కగ చాచి, కుడికాలిని ముడిచికొని యెడమపంగలితొడపైనిడి, తనచేతిని ముడిచి తలక్రింద తలగడగనిడికొని, చక్కగ పరుండునట్లు నియమించవలెను.

పిమ్మట రోగియొక్క గుదస్థానమున వస్తినేత్రము (గొట్టము)యొక్క కర్ణికా భాగమునను ఆముదమును బూసి గొట్టముయొక్క నాల్గవవంతుననుండు కర్ణికవరకు గుదమునను ప్రవేశపెట్టవలెను. అప్పుడు వైద్యుడు చేతులను కదలించకయు వణకించకయు తొందరపాటులేకయు నొకేసారి నొక్కి వెన్నెముకకు సరిగ ప్రవేశింపజేసి రోగికి బాధలేకుండునట్లు వస్తియంత్రములోని కల్కాద్యౌషధమంతయు లోనప్రవేశించునట్లు చేయవలెను. పిమ్మట రోగికి బాధ గల్గనీయక వస్తియంత్రమును మెలకువతో వెలికింతీయవలెను.

ఇప్పుడు నిరూహగణము చెప్పుచున్నాడు:—"బలాం గుడూచీం.....ఫలాన్మితాని" అనుచోట త్రిఫలములను లఘు మహాపంచమూలములను ఆయాగణములోని యొక్కొక ద్రవ్యమును పేరుగ నొక్కొకపలమువంతున గ్రహించవలెను. "అష్టౌ ఫలాని" అనుచోట మ్రంగ(బ)కాయలను ఆకృతినిబట్టి యెనిమిదికాయలను గ్రహించవలెను. ఛాగమాంసమును ఆర్ధతులమును (ఏబదిపలములు) గ్రహించునది. ఇవియన్నియు పైజెప్పినప్రమాణానుసారము చేరినవస్తుసముదాయము అరువదియారుపలములును, ఎనిమిదిమ్రంగకాయలును

క్వాథ్యద్రవ్యమగును. అట్టిక్వాథ్యమునకు నాలుగింతలునీళ్లు పోసి చతుర్థాంశము మిగులు నట్లు కాచబడినక్వాథము "క్వాథ్యాత్ క్వాథస్సమో మతః" అను పరిభాషానుసారముగ అరువదియారుపలములపరిమితము మిగులును. ఈక్వాథమును వాతాదిత్రిదోషములకు వేరువేరుగ పదేసిపలములవంతున జేర్చి మూడుమార్లు వస్తికర్మ జేసినను ముప్పది పలములుమాత్రమే క్వాథ ముపయుక్తమై తక్కినక్వాథమంతయు నిష్ప్రయోజనమగును: గాని మహర్షివచనప్రమాణముననుసరించి యథోక్తముగ క్వాథమును నిర్మించినగాని యౌషధము వీర్యవంతముగ నుండనోపదు. కావున నుపయోగింపగ మిగిలినయౌషధ (క్వాథ)శేషము వ్యర్థమైనను దోషావహముకానేరదని యెరుంగునది. ఈవిషయమును సూత్రస్థానమున "యథా కుర్వన్తి సఉపాయః" అని తంత్రకారులచే నుపదేశింపబడినది. మరియు ఓమము మున్నగుద్రవ్యములు ప్రత్యేకము కర్షమాత్రమువంతున ప్రతినిరూహవస్తి యందును జేర్పనగును. "యుక్త్యా మధుసైన్ధవంచ" అనుటవలన తేనెను సైంధవ లవణమును ప్రకృత్యాద్యనుసారముగ తగుపరిమాణముతో జేర్పవలెనని యెరుంగునది. చకారసముచ్చయముచేత మాంసరస-క్షీర-గోమూత్రాదులను యథోచితముగ జేర్చవలెనని యర్థము. మరియు "తైలాక్తగాత్రమ్" అనుచోట అభ్యంగసాహచర్యముచే స్వేదవిధి కూడ గ్రహింపబడును. ఈవిషయము సుశ్రుతమున "అనువాసితమాస్థాపయేత్, అభ్యక్తస్విన్నశరీరమ్" (సుశ్రుత. చి. అ. ౩౮) అనువాక్యముచే నుపదేశింపబడినది. "సమోఽథ వేషన్నతశీర్షకే వా" అనుచోట రోగిసౌకర్యము ననుసరించి సమముగనైనను లేక శిరోభాగమున తగ్గుగనైననుండునట్లు శయనము గల్పింపవలెనని భావము.

### నిరూహవస్తి అసమ్యగ్యోగమున గల్గువ్యాపత్తులు.

మూ. తిర్యక్ప్రణీతే తు న యాతి ధారా
గుదే వ్రణస్స్యాచ్చలితే తు నేత్రే      ౨౦
దత్తశ్శనైః నాఽఽశయమేతి వస్తిః
కణ్ఠం ప్రధావత్యతిపీడితశ్చ,
శీతస్త్వతిస్తమ్భకరో విదాహం
మూర్ఛాం చ కుర్యాదతిమాత్రముష్ణః.      ౨౧
స్నేహోఽతిజాడ్యం, పవనం తు రూక్షః,
తన్వల్పమాత్రాలవణస్త్వయోగం,
కరోతి మాత్రాఽభ్యధికోఽతియోగం
క్షామం తు సాన్ద్రః సుచిరేణ చైతి.      ౨౨

దాహోఽతిసారౌ లవణోఽతికుర్యాత్
తస్మాత్సుయుక్తం సమమేవ దద్యాత్,

వ్యా. వస్తినేత్రమును గుదస్థానమునం దడ్డముగ ప్రవేశింపజేసినయెడ గుదవళు లడ్డపడుటంజేసి ఔషధధార చక్కగ లోనికి బ్రవేశింపదు. నేత్రమును కదలించుచు ప్రవేశింపజేసినచో గుదస్థానమున పుండగును. వస్తిని మెల్లగ నొక్కినయెడ నౌషధము మలాశయమున జేరదు. అధికముగ నొక్కినయెడ కంఠము ప్రక్కకు వెడలును. వస్త్యౌషధము చల్లగనున్నచో శరీరమును స్తంభింపజేయును. మిక్కిలి వేడిగనున్నయెడ సంతాపము మూర్ఛను కల్గించును (కావున సుఖోష్ణముగ నుండవలెను.) మిక్కిలి స్నిగ్ధముగ నున్నచో జడత్వము కల్గించును. రూక్షముగ నున్నయెడ వాతమును ప్రకోపింపజేయును. ఔషధము పలుచగనున్నను స్వల్పపరిమాణముగనున్నను సైంధవలవణమును జేర్పకున్నను ఔషధము చక్కగ పనిచేయక దోషమును చక్కగ వెడలింపజాలదు. అతి ప్రమాణముగ నుపయోగించినచో నతియోగముచే గల్గుదోషము సంభవించును. ఔషధము మిక్కిలి చిక్కనైయున్నచో చిరకాలమునకు లోన ప్రవేశించి రోగిని కృశింపజేయును. లవణ మధికమైనచో సంతాపంబును అతిసారంబును కల్గును. కావున తిర్యక్ప్రణిధానము శీతత్వము మున్నగుదోషముల కెడమియ్యక విధ్యుక్తప్రకారము వస్తి ప్రయోగము చేయవలెనని భావము.

### వస్త్యౌషధమున ద్రవ్యనిక్షేపక్రమము.

మూ. పూర్వన్తు దద్యాత్ మధుసైన్ధవన్తు
స్నేహం వినిర్మథ్య తతోఽనుకల్కమ్. ౨3
విమథ్య సంయోజ్య పునర్ద్రవైస్తం
వస్తౌ నిదధ్యాత్ మథితం ఖజేన
(నిదధ్యాద్భిషగప్రమత్తః),

వ్యా. వస్త్యౌషధమును సిద్ధముచేయునపుడు తొలుత తేనెను సైంధవలవణమును స్నేహమును ఒకటిగగూర్చి యొకపాత్రలో బోసి చక్కగ కలియునట్లు మథించి, పిమ్మట ఓమము మున్నగువానికల్కమును కషాయముతో గూర్చి యారెంటిని కలియునట్లు కలియబెట్టి పిమ్మట నీకషాయమును తేనెమున్నగువానిలో గూర్చి యన్నిటి నొకటిగ కలియునట్లు కవ్వముతో కలియబెట్టి వస్తియంత్రమునబోసి పైజెప్పినవిధముగ ప్రయోగింపవలెను.

ఈయౌషధసంయోజనక్రమము సుశ్రుతమున నిట్లు చెప్పబడెను:—"దత్వాఽఽదౌ సైన్ధవస్యాఽక్షం మధునశ్చ పలద్వయం, (మధునః ప్రసృతద్వయం) పాత్రే తలేన మథ్నీయాత్" (సు. చి. అ. ౩౮) పైమూలమునకు ఇది సమానార్థకము.

### వామపార్శ్వశయనమునకు ప్రయోజనము.

మూ. వామాశ్రయే హి గ్రహణీ గుదే చ
(వామాశ్రయోఽగ్నిర్గ్రహణీగుదం చ)
తత్పార్శ్వసంస్థస్య సుఖోపలబ్ధిః. ౨౪
లీయన్త ఏవం వళయశ్చ తస్మాత్
సవ్యం శయానోఽర్హతి వస్తిదానం,

వ్యా. మనుజులకు కుక్షియందు ఎడమప్రక్కన గ్రహణియు గుదంబును జాఠరాగ్నియు చేరియుండును; కావున నెడమప్రక్కనొత్తిగిలి శయ్యపై పరుండియున్న వారికి వస్తిని ప్రయోగించినచో ద్రవరూపమైన వస్త్యౌషధము సుఖముగ నాశయమున జేరును. గుదమునందలివళులు (ముడతలు) అణగియుండును. కావున నెడమపైపుగ పరుండినవారికి వస్తిప్రయోగము చేయుట యుక్తమని భావము.

### వాత-పురీష వేగముకల్గినపుడు నిరూహవస్తిప్రయోగవిధి.

మూ. విడ్వాతవేగో యది చార్ధదత్తే
నిష్కృష్య ముక్తే ప్రణయేచ్ఛేషమ్. (ప్రణయేత్తు శేషమ్). ౨౫
ఉత్తానదేహశ్చ కృతోపధానః
స్యాత్ వీర్యమాప్నోతి తథాస్య దేహః,

వ్యా. వస్తిద్రవము కొంతవరకు లోపల ప్రవేశించినపుడు మలంబైనను అపానవాతంబైనను బైటవెడలనున్నపుడు వస్తినేత్రమును వెలికిం దీసి యించుకసేపు నిదానించి పిమ్మట తక్కినయౌషధమునంతటిని మరల నెక్కించవలెను. మరియు వస్త్యౌషధమును పూర్తిగ లోపల ప్రవేశింపజేసినవెంటనే తలక్రింద నెత్తుగ తలగడ నిడికొని వెలికిల బరుండవలెను. ఇత్తెరంగున వస్తిప్రయోగము చేసినచో శరీరమునకు చక్కగ బలము కల్గును.

### వాత-పిత్త-కఫములకు ప్రత్యేకముగ నిరూహవస్తిసంఖ్యావిధి.

మూ. ఏకోఽపకర్షత్యనిలం స్వమార్గాత్
పిత్తం ద్వితీయస్తు కఫం తృతీయః, ౨౬

వ్యా. పైజెప్పినవిధిప్రకారము ఒకతూరి వస్తిని ప్రయోగించినచో వాతమును స్వస్థానమునుండి వెడలించి తగ్గించును. రెండవవస్తి (రెండుసారులు ప్రయోగింపబడిన వస్తి) పిత్తమును స్వస్థానమున హరించును. మూడవతూరి (మూడుసార్లు) ప్రయోగింపబడినవస్తి కఫమును స్వస్థానమున హరించును. (వాతప్రకోపమున నొకసారి వస్తిని ప్రయోగింపవలెననియు, పిత్తమున రెండుసారులు వస్తిని ప్రయోగించవలెననియు, కఫమున మూడుసార్లు వస్తిని ప్రయోగింపవలెననియు వాతాదిదోషముల ననుసరించి వేరు వేరుగ నిరూహవస్తికి సంఖ్యావిధాన మీవాక్యముచే విధింపబడినదని యెరుంగునది.)

ఇదియే సమంజసమైన యర్థముగాని త్రిదోషసన్నిపాతమున వాత-పిత్త-కఫముల హరించుటకై ఏక-ద్వి-త్రిసంఖ్యావిధియని యర్థము జేయంజనదు. ఈవిధిననుసరించియే తంత్రకారులు—"స్నిగ్ధోష్ణఏకః పవనే...ద్వౌ స్వాదు శీతౌ పయసా చ పిత్తే. త్రయస్సమూత్రాః......కఫే నిరూహాః" (శ్లో. ౬౯) అనుగ్రంథముచే వాతాదులకు ప్రత్యేకముగ నొకటి, రెండు, మూడువస్తుల విధించిరి. వాతమునకామాశయము స్థానము. అయ్యది సన్నిహితముగనుండుటచే నొకవస్తికే శీఘ్రముగ హరించునుకావున నొకపుటమే విహితము. అంతకన్న పిత్తస్థానంబును, దానికన్న కఫస్థానంబును వ్యవహితముగనుండుటం జేసి పిత్తమునకు రెండును, కఫమునకు మూడును విధింపబడినది.

వస్తిప్రయోగముచే కేవలము పక్వాశయమునందలివాతము మాత్రము శమించునని చెప్పబడినది. అయినను ఈవిశేషవిధిచే స్థానాంతరగతపిత్తకఫదోషములగూడ హరించునని తెలిసెడి. మరియు పిత్తకఫముల హరణమునకు వస్తిప్రయోగము సుఖమైన చికిత్సకానోపదు; అయినను వాతం బనుబంధముగనున్న పిత్తకఫములయందు వస్తిప్రయోగ ముచితమని తంత్రకారులయభిమతము. ఈవిషయమును సుశ్రుతాచార్యు లిట్లుపదేశించిరి.—"వస్తిర్వాతే చ పిత్తే చ కఫే రక్తే చ శస్యతే." (సు. చి. అ. 3౫.)

## నిరూహవస్తి బైటవెడలినపిదప చేయవలసినకృత్యము.

మూ. ప్రత్యాగతే కోష్ణజలావసిక్తః
శాల్యన్నమద్యాత్తనునా రసేన,
జీర్ణే చ సాయం లఘు చాల్పమాత్రం
భుక్తోఽనువాస్యః పరిబృంహణార్థమ్. ౨౭

వ్యా. వస్త్యౌషధద్రవము మలముతో కూడి గుదమునుండి బైటవెడలినపిదప కొంచెము వేడిగనుండుసీళ్లతో సుఖముగ స్నానముచేసి జీర్ణమైనపిదప పలుచనిమాంసరసముతో

కూడినయన్నమును భుజించి, అది జీర్ణమైనపిదప సాయంకాలమున తేలికయైనయాహార మును కొంచెముగ భుజించి, పిమ్మట బలముకల్గుటకై యనువాసనవస్తిని ప్రయోగించవలెను.

ఇచ్చట ఆస్థాపనవస్తి ప్రయోగముచేసినప్పుడు ఔషధలేపము కోష్ఠముననుండి నచో నయ్యది జీర్ణమైనపిదప నాహారము భుజింపవలెనని 'జీర్ణే చ' అని చెప్పబడినది. మరియు నిరూహవస్తిచే కోష్ఠాగ్ని కొంచెము మందగించియుండును కావున తేలికయైన యాహార ముచితమని "తనునా రసేన" అని చెప్పబడినది.

మరియు విరేచనమునందువలె నిచ్చట ఆమానుబంధము లేదు. కావున పేయాది క్రమము నపేక్షింపక యన్నాహారము విధింపబడినది. కావుననే సుశ్రుతమునందును పేయాదిక్రమమును రసాదిక్రమానుసారముగ నాహారము విధింపబడినది. మరియు లేఖ నార్థమువిధింపబడిన నిరూహవస్తిని చేసినవెనుక కార్శ్యము బలహీనము కలుగకుండుటకై నాటిదినముననే బృంహణరూపమగు అనువాసనవస్తి చేయవలెనని "సాయం లఘు చాల్ప మాత్రం భుక్తోనువాస్యః పరిబృంహణార్థమ్" అని అనువాసనవస్తి విధింపబడినది. కావుననే కల్పనాసిద్ధియందును "నరస్తతో నిశ్యనువాసనార్హః" (సి. అ. ౧) అను వాక్యముచే నిరూహవస్తిచేసిననాడే యనువాసనవస్తిని చేయవలెనని చెప్పబడినది. జతూ కర్ణతంత్రమునందును "జీర్ణే సాయం కృతాన్నం చ పుష్ట్యర్థమనువాసయేత్" అను వాక్యముచేత ననువాసనవస్తి విధింపబడినది.

స్నేహము శీఘ్రముగ బైట రాకుండుటకై చేయుకృత్యము.

మూ. నిరూహపాదాంశసమేన తైలే
నాఽమ్లానిలఘ్నౌషధసాధితేన,
దత్వా స్ఫిచౌ పాణితలేన హన్యాత్
స్నేహస్య శీఘ్రాగమరక్షణార్థమ్. ౨౮

ఈషచ్చ పాదాఙ్గులియుక్తమాఞ్ఛేత్
ఉత్తానదేహస్య తలౌ ప్రమృజ్యాత్,
స్నేహేన పార్ష్ణ్యఙ్గులిపిణ్డికాశ్చ
యే చాస్య గాత్రావయవాః రుజార్తాః. ౨౯

తాంశ్చాఽవమృద్నీత సుఖం తతశ్చ
నిద్రాముపాసీత కృతోపధానః,

వ్యా॰ నిరూహవస్తికి జెప్పబడినతైలమునకు నాల్గవవంతుతైలమును పులుపురసమును వాతహరౌషధములను జేర్చి పక్వముజేసి యాతైలముచే ననువాసనవస్తిచేయవలెను. పిమ్మట కటిప్రదేశమున అరచేతులతో మర్దనము చేయవలెను. అట్లు చేసినచో లోపలనున్నతైలము వెలికి శీఘ్రముగ రాకుండును. మరియు రోగిని వెలికిల బరుండబెట్టి కాళ్లయందలి బొటనవ్రేళ్లను కొద్దిగ లాగవలెను. మరియు అరకాళ్లు మడమలు వ్రేళ్లు పిక్కలు మున్నగుస్థలములయందు బాధకల్గినచో నాస్థలములయందెల్ల పైజెప్పినతైలమును బూసి మర్దనము చేయవలెను. పిదప రోగి సుఖముగ నిదురజెందవలెను.

(8) నిరూహవస్తియందు కషాయస్నేహముల పరిమాణము.

మూ॰ భాగాః కషాయస్య తు పఞ్చ పిత్తే
స్నేహస్య షష్ఠః ప్రకృతౌ స్థితే చ. 30
వాతే వివృద్ధే తు చతుర్థభాగః
మాత్రానిరూహేషు కఫేఽష్టభాగః,

వ్యా॰ నిరూహవస్తియందు ద్రవరూపమైనయౌషధము పండ్రెండు ప్రసృతములు (ఇరువదినాల్గుపలములు)గ నుండవలెను. ఇది పరమప్రమాణము. అట్టి ద్వాదశప్రసృతపరిమితద్రవమున ఐదుభాగములు క్వాథముండవలెను. పిత్తంబధికముగ నున్నపుడును స్వస్థునకు ఆరవవంతు (రెండుప్రసృతములు నాల్గుపలములు) స్నేహమును జేర్చి యుపయోగించవలెను. వాతము వృద్ధినందియున్నపుడు పండ్రెండుప్రసృతముల పరిమితములో నాల్గవవంతు (మూడుప్రసృతములపరిమితముగ) స్నేహమును జేర్చవలెను. కఫాధిక్యమున నెనిమిదవవంతు (ఒకటిన్నరప్రసృతము) స్నేహమును జేర్చవలెను. (మూడు పలములు స్నేహమును జేర్చవలెనని భావము.) ఈపద్ధతిననుసరించియే వాగ్భటాచార్యులు ఇట్లు చెప్పెను—"తతః క్వాథాచ్చతుర్థాంశం స్నేహం వాతే ప్రకల్పయేత్, పిత్తే స్వస్థే చ షష్ఠాంశం, అష్టమాంశం కఫాధికే" (ఇది "ప్రణిధానమాత్రా స్నేహస్య కా?" అను నెనిమిదవప్రశ్నమున కుత్తరము.)

వయోభేదము ననుసరించి నిరూహవస్తిప్రమాణము.

మూ॰ నిరూహమాత్రా ప్రసృతార్ధమాద్యే
వర్షే, తతోఽర్ధప్రసృతాభివృద్ధిః. 31
ఆద్వాదశాత్ స్యాత్, ప్రసృతాభివృద్ధిః
అష్టాదశాత్ ద్వాదశతః పరం స్యుః,

ఆస ప్తతే స్తద్విహితం ప్రమాణం
(ఆస ప్తతేరు క్తమిదం ప్రమాణం)
అతఃపరం షోడశవద్విధేయమ్. 3౨
నిరూహమాత్రా ప్రసృతప్రమాణా
బాలే చ వృద్ధే చ మృదుర్విధేయః,

వ్యా. బాలులకు నిరూహవస్తి చేయవలసినయెడ నొకసంవత్సరము నిండునంతవరకును క్వాథస్నేహాదులుచేరిన సముదాయౌషధము అర్ధప్రసృతపరిమాణము (ఒకపలము)గ గల్పింపనగును. (ఈసముదాయప్రమాణముననే క్వాథస్నేహములభాగమును "భాగాః కషాయస్య" అని పైజెప్పబడినభాగముల ప్రకారము క్వాథస్నేహాదుల జేర్పనగును. క్రింద జెప్పబడు తక్కినపరిమాణములయందును క్వాథస్నేహభాగముల నీప్రకారమే గల్పింపవలెను.) పిమ్మట రెండవసంవత్సరము మొదలు జేసి ప్రతిసంవత్సరమునను అర్ధప్రసృతము వంతున వృద్ధిచేయుచుండవలెను. ఈవిధముగ పండ్రెండవసంవత్సరము పూర్తియగువరకు వృద్ధిచేయఁనది. (ఇట్లు అర్ధప్రసృతము వృద్ధిచేసినచో పండ్రెండవవత్సరమునకు ఆరు ప్రసృతములు (పండ్రెండుపలములు) పూర్తియగును.) పిమ్మట పదుమూడవసంవత్సరము మొదలు జేసి పదునెనిమిదవసంవత్సరము పూర్తియగునంతవరకును సంవత్సరమునకొక ప్రసృతమువంతున వస్త్యౌషధమును వృద్ధిచేయవలెను. (పదునెనిమిదవవత్సరము పూర్తియగుసరికి క్వాథాదివస్త్యౌషధము పండ్రెండుప్రసృతములు (ఇరువదినాల్గుపలములు) పూర్తియగును. పందొమ్మిదవసంవత్సరము మొదలు జేసియు డెబ్బదిసంవత్సరములు పూర్తియగునందాకకూడ పండ్రెండుప్రసృతములపరిమితముననే యుపయోగింపవలెను. డెబ్బది సంవత్సరములకు పిమ్మట పదునారవవత్సరమునకు జెప్పినపరిమాణమును (పదిప్రసృతములు, ఇరువదిపలములను) వస్త్యౌషధమును కల్పింపవలెను.

మరియు బాలురకును వృద్ధులకును పైజెప్పినవిధిప్రకారమే వస్త్యౌషధప్రమాణమును కల్పింపవలెను; కాని బాలవృద్ధులకు వస్తికుపయోగించునౌషధము తీక్ష్ణముగాక మృదువుగ నుండునట్లు గల్పింపనగును. ఇదియే విశేషము.

ఇచ్చట "ద్వాదశతః పరం స్యుః, ఆస ప్తతే స్తద్విహితం ప్రమాణం" అని నియమించుటవలన పండ్రెండవసంవత్సరమునకు విధించిన పండ్రెండుప్రసృతములపరిమాణముననే డెబ్బదిసంవత్సరములవయసు పూర్తియగునందాక నుపయోగింపవలెగాని పరిమాణవృద్ధి జేయంజనదని నిషేధము సూచింపబడినది. ఈనియమముచేత తంత్రాంతరములయందు "అర్ధాఢకం పరమతమం ప్రమాణం" (హారీత) "ద్వాదశప్రసృతం కేచిత్ త్రింశత్పల

మథాపరే'' (సుశ్రుత) ఇవి మున్నగువాక్యములచే విధింపబడిన పరమప్రమాణము అనర్థదాయకముకావున ఆదరణీయముకాదని తెలిసెడి.

మరియు ఔషధముయొక్క తీక్ష్ణమార్దవభేదములు ఇట్లు చెప్పంబడును— ''తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్నిలవణక్షారసర్షపైః, ప్రాప్తకాలం విధాతవ్యం క్షీరాద్యైర్మార్దవం తథా'' (సి. అ. ౨.) అవసరమునుబట్టి మూత్రాదులజేర్చి తీక్ష్ణత్వమును, క్షీరాదులజేర్చి మార్దవమును వస్త్యౌషధమునకు గల్పింపవలెనని యర్థము. (ఇత్తెరంగున ''ఆస్థాపనార్హం పురుషం'' అని యుపక్రమించి చెప్పబడినగ్రంథముచేత 'నిరూహకల్పః కః' అను నేడవ ప్రశ్నమునకును 'స్నేహస్య ప్రణిధానమాత్రా కా'? అను నెనిమిదవప్రశ్నమునకును నుత్తరము సవిస్తరముగ నిరూహవస్తి నుద్దేశించి చెప్పబడినది).

## (9) వస్తినిచేసినవెనుక శయనము, ప్రశస్తశయ్య.

మూ. నాత్యుచ్ఛ్రితం నాప్యతినీచపాదం
సపాదపీఠం శయనం ప్రశస్తమ్. 33
ప్రధానమృద్వాస్తరణోపపన్నం
ప్రాక్ శీర్షకం శుక్లపటోత్తరీయమ్,

వ్యా. వస్తివిధినిచేసినపిదప రోగి సుఖముగ పరుండుటకు శయనము మిక్కిలి పొడవును కురుచయుంకాక మితమైన యెత్తుకల్గినకాళ్లు కల్గి, యాకాళ్లక్రింద పాదపీఠములతో కూడి, మిక్కిలి మెత్తనైనపరుపును, దానిపైన తెల్లనిబట్టయు కల్గియుండవలెను. అట్టి శయ్య తూర్పున శిరోభాగముకల్గియుండిన చాల ప్రశస్తము. (ఇంతకు మున్ను. ౧౭. శ్లోకమున ''నాత్యుచ్ఛ్రితే స్వాస్తరణోపపన్నే సవ్యేన పార్శ్వేన సుఖం శయానం'' అని చెప్పినది వస్తికర్మ చేయునపు డుండవలసినశయనవిధి యనియు, ఇచ్చటచెప్పినది వస్తికర్మ జేసినవెనుక నుండవలసినశయనవిధి యనియు నెరుంగునది.) మరియు తూర్పు దేవతలు నివసించెదరు కావున తూర్పుతలనిడి శయనించినయెడ దేవతలకు నమస్కరించిన ట్లగును; దానంజేసి శుభము గల్గునని ''ప్రాక్ శీర్షం'' అని చెప్పబడినది. ఈవిషయము సుశ్రుతమున నిట్లుచెప్పబడినది—''ప్రాచ్యాం దిశి స్థితాః దేవాః తత్పూజార్థం చ ప్రాక్ శిరాః'' (సు. సూ. అ. ౧౯.) (ఇది ''శయనే విధిః కః?'' అనుతొమ్మిదవప్రశ్నమున కుత్తరము).

## అనువాసనానంతరము భోజ్యవిధానము.

మూ. భోజ్యం పునః వ్యాధిమపేక్ష్య తద్వత్
ప్రకల్పయేత్ యూషపయోరసాద్యైః. 34

సర్వేషు విద్యాద్విధిమేతమాద్యం;
వక్ష్యామి వస్తీనతఉత్తరీయాన్,

వ్యా. ఈచెప్పబడినవస్తివిధానమున నాయావ్యాధిని, అగ్నిబలమును, వాత-పిత్త-కఫములను చక్కగ గమనించి తదనుగుణముగ యూషము, క్షీరము, మాంసరసము మున్నగువానితో నన్నమును భుజింపనగును. ఈప్రకరణమున జెప్పబడినవిధానమంతయు వస్తివిధానము లన్నిటియందును సామాన్యముగ ముఖ్యమైయుండును. తత్తద్దోషాద్యనుసారముగ వస్తియోగము లీక్రింద వివరింపబడును. ("సర్వేషు విద్యాద్విధిమేతమాద్యం" అనుటచే నీశయనభోజనాదివిధులన్నియు వస్తిసామాన్యముగ నాచరింపదగినదనియు, దీనికపవాదముగ విశేషవిధులున్నచో నవి యచ్చటచ్చట జెప్పబడుననియు తెలుపబడినది).

**(10) కొన్నిదోషహరనిరూహవస్తులు, అందు వాతహరవస్తులు ఐదు, (అందు మొదటివస్తి).**

మూ. ద్విపఞ్చమూలస్య తసోఽమ్లయుక్తః
సచ్ఛాగమాంసస్య సపూర్వపేష్యః. 3౫
త్రిస్నేహయుక్తః ప్రవరో నిరూహః
సర్వాఽనిలవ్యాధిహరః ప్రదిష్టః,

వ్యా. దశమూలములను (లఘు-మహాపంచమూలములను) వీనికిసమభాగముగ మేకపోతుమాంసమును ఒకటిగగూర్చి పరిభాషానుసారము నాలుగింతలునీళ్లుపోసి క్వాథముచేసి వడగట్టి, అందు కాంజికమును "బలాం గుడూచీం" అని చెప్పబడిన నిరూహవస్తితో నిర్దేశింపబడిన ఓమము, మ్రంగకాయలు, బిల్వవేరు, చెంగల్వకోష్టు, వస, సదాప, తుంగగెడ్డలు, పిప్పళ్లు, అనునీద్రవ్యములకల్కమును యథోక్తపరిమాణముగగూర్చి, తైలము, ఘృతము, వస, యను మూడుస్నేహములను గూర్చి విధ్యుక్తప్రకారము, నిరూహవస్తిప్రయోగముచేసినచో సకలవాతవ్యాధులను హరించుటకు చాలప్రశస్తముగ నుండును.

ఇచ్చట "విజ్ఞేయస్త్రివిధస్స్నేహో వస్త్యర్థం మజ్జవర్జితః" అనుప్రమాణమును బట్టి యిచ్చట 'త్రిస్నేహయుక్తః' అనుచోట మజ్జను వదలి తక్కినతైల-ఘృత-వసలు మూడును గ్రహింపనగును. పైవాక్యముచేతనే యీయర్థము తెలియుచున్నను జ్ఞాపకార్థమిచ్చుట మరల చెప్పబడినది.

## (2) స్థిరాదినిరూహవస్తి (వాతహరము, రెండవది).

మూ. స్థిరాదివర్గస్య బలాపటోల
త్రాయన్తికైరణ్డయవైర్యుతస్య. 3౬
ప్రస్థో రసాత్, ఛాగరసార్ధయుక్తః
సాధ్యః పునః ప్రస్థసమస్తు యావత్,
ప్రియఙ్గుకృష్ణాఘునకల్కయుక్తః
సతైలసర్పిర్మధుసైన్ధవశ్చ. 3౭
స్యాద్దీపనో మాంసబలప్రదశ్చ
చక్షుర్బలం చాపి దదాతి వస్తిః (సద్యః),

వ్యా. స్థిరాది (హ్రస్వపంచమూల) వర్గమున జెప్పబడిన ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు, అను నీపంచమూలములు, చిట్టాముట్టి, చేదుపొట్ల, కానుగ, ఆముదపువేళ్లు, యవలు వీనినన్నిటిని క్వాథ్యముగ చేర్చి పరిభాషానుసారముగ క్వాథ్యమునకు నాలుగింతలు (నాల్గుప్రస్థములు) జలము బోసి క్వాథ్యసమముగనొకప్రస్థము (నాల్గవవంతు) మిగులునట్లు కషాయముకాచి, యాక్వాథమున నర్ధప్రస్థమేకపోతుమాంసరసమును జేర్చి యొకప్రస్థము మిగులునట్లు మరలకాచి, అందు ప్రేంకణము, పిప్పళ్లు, తుంగగడ్డలు, అనునీద్రవ్యములకల్కమును నూరి కలిపి, తైలమును, ఘృతమును, తేనెను, సైంధవలవణమును, సామాన్యవస్తి విధిలో జెప్పబడిన పరిమాణముగ జేర్చి నిరూహవస్తి ప్రయోగించిన నయ్యది అగ్నిని దీపింపజేసి శరీరమాంసపుష్టిని బలమును కల్గించును. కన్నులకును బలమును కల్గించును.

ఇచ్చట స్నేహక్వాథాదిభాగమును "భాగాః కషాయస్య తు పంచ... భాగః" అని చెప్పబడిన సామాన్యసూత్రముచే నిర్ణయించునది. తైలాదులును మధుసైంధవములును సామాన్యవస్తివిధిచే లబ్ధమైనను స్మారకార్థము మరల చెప్పబడినది. తక్కినస్థలములయందెల్ల పునరుక్తముల నిట్లూహించునది.

## (3) ఏరండనిరూహవస్తి (వాతహరము మూడవది.)

మూ. ఏరణ్డమూలం త్రిపలం పలాశా (పలాని)
హ్రస్వాని మూలాని చ యాని పఞ్చ. 3౮
రాస్నాశ్వగన్ధాఽతిబలాగుడూచీ

పునర్న వాఽఽరగ్వధ దేవదారు,
భాగాః పలాంశాః మదనాష్టయుక్తాః (మదనాష్టకం చ)
జలద్వికంసే క్వథితేఽష్టశేషే. ౩౯

పేష్యాశ్శతాహ్వా హపుషా ప్రియఙ్గుః
సపిప్పలీకం మధుకం బలా చ (వచాచ),
రసాఞ్జనం వత్సకబీజముస్తం
భాగాఽక్షమాత్రం (అక్షప్రమాణం) లవణాంశయుక్తమ్. ౪౦

సమాక్షికస్తైలయుతస్సమూత్రో
వస్తిర్నృణాం దీపన లేఖనీయః,
జఙ్ఘోరుపాదత్రికపృష్ఠశూలం
కఫావృతం మారుతనిగ్రహం చ. ౪౧

విణ్మూత్రవాతగ్రహణం సశూలం
ఆధ్మాత (న) తామశ్మరిశర్కరే చ,
ఆనాహమర్శోగ్రహణీప్రదోషా
నేరణ్డవస్తిః శమయే త్ప్రయుక్తః. ౪౨

వ్యా. ఆముదపువేళ్లు మూడుపలములు, పలాశ (కచోరములు), ముయ్యాకుపొన్న, మున్నగు హ్రస్వపంచమూలములైదును ఐదుపలములు, సన్నరాష్ట్రము, పెన్నేరుగెడ్డ, పేరాముట్టి, తిప్పతీగె, గలిజేరు, రేల, దేవదారు ఇవిప్రత్యేకమొక్కొకపలము; మ్రంగకాయలు ఎనిమిది వీనినన్నిటిని పైభాగముప్రకారముగగూర్చి రెండుకంస (అఢక) ముల (నూట యిరువదిపలముల) నీటిలో వేసి యెనిమిదవపాలు (ఒకప్రస్థము) మిగులునట్లు క్వాథముచేసి వడగట్టి యుంచుకొని, అందు సదాపవిత్తులు, బోడతరము, ప్రేంకణము, పిప్పళ్లు, అతిమధురము, చిట్టాముట్టి,(వస), రసాంజనము, కొడిసెపాలవిత్తులు, తుంగగడ్డలు, వీనిని ప్రత్యేక మొక్కొకకర్షమువంతున జేర్చి కల్కముచేసి కలిపి, తేనెను సైంధవలవణమును యథోచితముగ జేర్చి, తైలమును గోమూత్రమును వీనిని ప్రకృత్యాద్యనుసారముగ కలిపి, విధ్యుక్తప్రకారము వస్తి నుపయోగించునది.

దీనివలన—అగ్నిదీప్తి కల్గును, దోషాదుల వెడలించును. మరియు పిక్కలు, తొడలు, పాదములు, త్రికసంధి, వీపు, ఈస్థలములయందలి శూలమును హరించును,

కఫముచే నావరింపబడినవాతమును హరించును. మలమూత్రవాతములబంధమును సడలించును. శూలమును, ఆధ్మానమును (కడుపుబ్బరమును), అశ్మరిని, శర్కరను హరించును. ఆనాహమును గ్రహణీదోషమును అర్శస్సులను హరించును. (ఇచ్చట పలాశా అనుచోట 'పలాశాశటీ' అని వ్యాఖ్యానమున నున్నది.)

(4) వాతహర నిరూహవస్తి (నాల్గవది).

మూ. చతుష్పలే తైలఘృతప్రభృష్టాత్
ఛాగాచ్ఛతార్ధాద్దధిదాడిమామ్లః,
రసస్స పేష్యో బలమాంసవర్ణ
రేతోఽగ్నిదశ్చాన్ధ్య శిరోఽర్తిశస్తః (శిరోరుజాఘ్నః). 43

వ్యా. మేకమాంసరసమును ఏబదిపలములను నాల్గుపలములు తైలఘృతమున పక్వము చేసి, అందు పెరుగును దానిమ్మరసమును జేర్చి, నిరూహవస్తికల్పమున (బలాదికల్పమున) జెప్పబడిన ఓమము మున్నగుకల్కద్రవ్యముల నూరి కలిపి వస్తిప్రయోగమును విధ్యుక్త ప్రకారము చేసినచో శరీరమున బల-మాంస-వర్ణంబులును శుక్రంబును అగ్నియు వృద్ధి నొందును. అంధత్వమునందును శిరోరోగమునందును ఇయ్యది మిగుల ప్రశస్తము.

(5) వాతహరనిరూహవస్తి (ఐదవది).

మూ. జలద్వికంసేఽష్టపలం పలాశాత్
పక్త్వా రసోఽర్ధాఢకమాత్రశేషః,
కల్కైర్వచా (బలా) మాగధికాపలాభ్యాం
యుక్తశ్శతాహ్వాద్విపలేన చాపి. 44
ససైన్ధవః క్షౌద్రయుతస్సతైలః
దేయో నిరూహో బలవర్ణకారీ,
ఆనాహపార్శ్వామయయోనిదోషాన్
గుల్మానుదావర్తరుజం చ హన్యాత్. 45

వ్యా. మోదుగపట్ట ఎనిమిదిపలములు రెండుకంస (అఢకముల) జలములో వైచి అర్ధాఢకము (రెండుప్రస్థములు) మిగులునట్లు క్వాథముచేసి వడగట్టి, అందు వస (లేక చిట్టాముట్టి)ఒకపలమునుపిప్పళ్లు ఒకపలమును కల్కముచేసి నూరి కలిపి సైంధవలవణమును, తేనెను, తైలమును యథాయోగ్యముగ జేర్చి నిరూహవస్తిని సిద్ధముచేసి యుపయోగించు

నది. ఇయ్యది శరీరమునకు బలమును వర్ణమును కల్గించును. ఆనాహమును ప్రక్కనొప్పులను, యోనిరోగములను, గుల్మమును, ఉదావర్తమును హరించును.

(1) పిత్తహరనిరూహవస్తులు నాల్గు. (అందు మొదటిది.)

మూ. యష్ట్యాహ్వాయస్యాఽష్టపలేన సిద్ధం
పయశ్శతాహ్వాఫలపిప్పలీభిః,
యుక్తం ససర్పిర్మధు వాతరక్త
వైస్వర్యవీసర్పహితో నిరూహః. ౪౬

వ్యా. అతిమధురము ఎనిమిదిపలములు నలియగొట్టి, అందు ఆవుపాలు కలిపి (క్షీరపాకవిధిప్రకారము) పక్వముచేసి వడగట్టి, అందు సదాపవిత్తులను మ్రంగకాయలను పిప్పళ్లను కల్కముచేసి కలిపి, నేతిని తేనెను, యథోచితముగ కూర్చి, సిద్ధముచేయబడిన వస్తి వాతరక్తమును, స్వరభేదమును, విసర్పమును హరించుటకు హితముగ నుండును.

ఇచ్చట పిత్తమునకు జెప్పబడు నాల్గునిరూహములయందును "భాగాః కషాయస్య తు పంచ పిత్తే స్నేహస్య షష్ఠః" అను సామాన్యవిధి ననుసరించి ఐదుభాగములు ద్రవంబును, ఆరవభాగము ఘృతమును జేర్పనగును. తేనెను యథోచితముగ చేర్చి సిద్ధముచేయవలెను. మరియు "ద్రవ్యాదష్టగుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణం, క్షీరావశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః" అను పరిభాషానుసారముగ నిచ్చట అతిమధురము ఎనిమిదిపలములును అరువదినాల్గుపలములు ఆవుపాలును పాలకు నాలుగింతలు నీళ్లను కలిపి, పాలుమాత్రము మిగులునట్లు కాచవలెనని యెరుంగునది.

(౨) పిత్తహరనిరూహవస్తి (రెండవది).

మూ. యష్ట్యాహ్వాలోధ్రాభయచన్దనైశ్చ
శృతం పయోఽగ్ర్యం కమలోత్పలైశ్చ,
సశర్కరం క్షౌద్రయుతం సుశీతం
పిత్తామయాన్ హన్తి సజీవనీయమ్. ౪౭

వ్యా. అతిమధురము, లొద్దుగుపట్ట, కరకకాయలబెరడు, చందనము, తామరపువ్వులు, కలువలు వీని పాలలో కలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వముచేసి, అందు చక్కెరను తేనెను యథోచితముగ కలిపి, జీవనీయగణద్రవ్యములను కల్కముచేసి కలిపి చల్లగచేసి విధ్యుక్తప్రకారము వస్తిని ప్రయోగించిన పిత్తవ్యాధులనన్నిటిని హరించును.

ఇచ్చట మృదుకోష్ఠమునందును పిత్తమునందును ఔషధము చల్లగనుండుట మిగుల ప్రశస్తము. కావున 'సుశీతం' అని చెప్పబడినది. పిత్తమునకు విధించువస్తులయందెల్ల దీనిని సామాన్యవిధిగ నెరుంగునది.

### (3) పిత్తహరనిరూహవస్తి (మూడవది).

మూ. ద్వికార్షికాశ్చన్దనపద్మకర్ధి
యష్ట్యాహ్వరాస్నావృషసారిబాశ్చ,
సలోధ్రమఞ్జిష్ఠమథాప్యనన్తా
బలాస్థిరాదితృణపఞ్చమూలమ్. ౪౮
(సలోధ్రమఞ్జిష్ఠబలాయవాస
స్థిరాశరాదిద్వయపఞ్చమూలం)
తోయే సముత్క్వాథ్య రసేన తేన
శృతం పయోఽర్ధాఢకమమ్బుహీనం,
జీవన్తిమేదర్ధిశతావరీభిః
వీరాద్వికాకోలికశేరుకాభిః. ౪౯
సితోపలాజీవకపద్మరేణు
ప్రపౌణ్డరీకైః కమలోత్పలైశ్చ,
లోధ్రాఽఽత్మగుప్తా మధుకైర్విదారీ
ముఞ్జాతకైః కేసరచన్దనైశ్చ. ౫౦
పిష్టైః ఘృతక్షౌద్రయుతైర్నిరూహం
ససైన్ధవం శీతలమేవ దద్యాత్,
ప్రత్యాగతే ధన్వరసేన శాలీన్
క్షీరేణ వాద్యాత్, పరిషిక్తగాత్రః. ౫౧
దాహాఽతిసారప్రదరాఽస్రపిత్త
హృత్పాణ్డురోగాన్ విషమజ్వరం చ,
సగుల్మమూత్రగ్రహకామలాదీన్
సర్వామయాన్ పిత్తకృతాన్నిహన్తి. ౫౨

వ్యా. చందనము, పద్మకము, ఋద్ధి, అతిమధురము, సన్నరాష్ట్రము, అడ్డసరము, సుగంధపాలవేరు, లొద్దుగుపట్ట, మంజిష్ఠి, నల్లసుగంధిపాలవేరు, చిట్టాముట్టి, ముయ్యాకు పొన్న మొదలగు హ్రస్వపంచమూలములు, తృణపంచమూలములు (కుశదర్భ, రెల్లుదర్భ, కాకివెదురు, దర్భ, వరిపైరు (అనుసీయైదింటివేళ్లు), వీనిని ప్రత్యేకము రెండేసికర్షముల వంతున గూర్చి, క్వాథపరిభాషానుసారముగ క్వాథముచేసి, యాకషాయమున అర్ధాఢకము (రెండు ప్రస్థములు,) ఆవుపాలు కలిపి కషాయమంతయు చుండి పాలుమాత్రము మిగులునట్లు కాచి, వడగట్టి, అందు—పాలకూర, మేద, ఋద్ధి, పిల్లిపీచరగడ్డలు, కోల పొన్న, కాకోలి, క్షీరకాకోలి, నమ్మదుంప, శీనాకల్కుండ, జీవకము, తామరపువ్వులలోని కేసరములు (పుప్పొడి), ప్రపౌండరీకమను గంధద్రవ్యము, తామరపువ్వులు, నల్లకలువలు, లొద్దుకుపట్ట, దూలగొండి, అతిమధురము, నేలగుమ్మడి, ముంజాతకము, నాగకేసరములు, చందనము వీనినన్నిటిని నూరి కల్కముచేసి కలిపి, అందు ఘృతమును భాగప్రకారముగను, తేనెను యథోచితముగను కొంచెము సైంధవలవణమును కలిపి, అన్నిటి నొకటిగ గూర్చి చక్కగ చల్లారినపిదప విధిప్రకారము వస్తిప్రయోగము చేయునది.

వస్త్యౌషధము బైటవెడలినపిదప స్నానముచేయించి శాల్యన్నమును జాంగలజంతువులమాంసరసముతోనైనను, ఆవుపాలతోనైనను భుజింపనగును. ఈనిరూహవస్తివలన తాపము, అతిసారము, స్త్రీలరక్తప్రదరము, రక్తపిత్తము, హృద్రోగము, పాండురోగము, విషమజ్వరము, గుల్మము, మూత్రబంధము, కామల, ఇవి మున్నగుపిత్తవ్యాధులన్నియు నివర్తించును.

ఇచ్చట "శరేక్షుదర్భకాశానాం శాలీనాం మూలమేవ చ" (చ. చి. అ. ౧. పాద. ౧.) అని చెప్పబడినతృణపంచమూలముల గ్రహించునది.

### (4) పిత్తహరనిరూహవస్తి (నాల్గవది).

మూ. ద్రాక్షాదికాశ్మర్యమధూకసేవ్యైః
ససారిబాచన్దనశీతపాకైః,
పయశ్శృతం శ్రావణిముద్గపర్ణి
తుగాత్మగుప్తామధుయష్టికల్కైః. ॥ 3

గోధూమచూర్ణైశ్చ తథాషమాత్రైః
సక్షౌద్రసర్పిర్మధుయష్టితైలైః,

పథ్యావిదారీక్షురసైర్గుడేన
వస్తిం యుతం పిత్తహరం విదధ్యాత్. ౫౪
హృన్నాభిపార్శ్వోత్తమదేహదాహే
దాహేఽన్తరస్థే చ సకృచ్ఛ్రమూత్రే,
క్షీణే క్షతే రేతసి చాపి నష్టే
పైత్తేఽతిసారే చ నృణాం ప్రశస్తః. ౫౫

వ్యా. ద్రాక్షాదిగణద్రవ్యములు, పెద్దమ్మడు, ఇప్ప, వట్టివేళ్లు, సుగంధపాల, చందనము, శీతపాకి (బండిగురిగింజ), వీనిని చేర్చి (క్షీరపాకవిధిప్రకారము) ఆవుపాలను పక్వముచేసి, అందు—బోడతరము, అడవిపెసర, తవక్షీరి, దూలగొండి, అతిమధురము, గోధుమచూర్ణము వీనిని ప్రత్యేకమొక్కొకకర్షమువంతున నూరి కల్కముచేసి, కలి, తేనెను, ఘృతమును, అతిమధురముచేర్చి కాచబడినతైలమును యథోచితముగ కలిపి, కరకకాయకషాయమును నేలగుమ్మడిరసమును చెరకురసమును బెల్లమునుకూడ కలిపి వస్తి ప్రయోగముచేసినచో నియ్యది పిత్తమును హరించును. మరియు హృదయము, నాభి, ఇరుప్రక్కలు, ఉత్తమదేహము, (శిరస్సు), ఈస్థలముల గల్గినతాపమునందును, శరీరాంతర్భాగమున కల్గినతాపమునందును, మూత్రకృచ్ఛ్రమునందును, క్షతక్షీణమునందును, శుక్రనష్టమునందును, పిత్తాతిసారమునందును మిగుల ప్రశస్తముగనుండును. (ఇచ్చట శీతపాకి యన—"శీతపాకీ—కాకణంతికాభేదః" అని వాగ్భటవ్యాఖ్యానమున నున్నది.)

**(1) కఫరోగములయం దుపయోగింపదగిన నిరూహవస్తులునాల్గు. (అందు మొదటిది.)**

మూ. కోశాతకారగ్వధదేవదారు
శార్ఙ్గేష్టమూర్వాకుటజాఽర్కపాఠాః,
పక్త్వా కులుత్థాన్ బృహతీం చతోయే
రసస్య తస్య ప్రసృతాః దశస్యుః. ౫౬
తాన్ సర్షపైలామదనైస్సకుష్ఠైః
అక్షప్రమాణైః ప్రసృతైశ్చ యుక్తాన్,
ఫలాహ్వతైలస్య సమాక్షికస్య
క్షారస్య తైలస్య చ సార్షపస్య. ౫౭

దద్యాన్నిరూహం కఫరోగిణే జ్ఞః
మన్దాగ్నయే చాప్యశనద్విషేచ,

వ్యా. చేదుబీర, రేల, దేవదారు, చాగ, పల్లేరు, కొడిసెపాలవిత్తులు, జిల్లేడువేరు, చిరుబొద్ది, ఉలవలు, వాకుడు వీనినన్నిటిని గ్రహించి జలముపోసి, పదిప్రసృతములు (ఇరువదిపలములు) మిగులునట్లు చుండకాచి, అందు ఆవాలు, ఏలకులు, మ్రంగకాయలు, చెంగల్వకోష్టు వీనిని ప్రత్యేక మొక్కొకకర్షమువంతున చేర్చి కల్కముగ నూరి కలిపి, మ్రంగకాయలనుచేర్చి పక్వముచేయబడినతైలమును, తేనె, యవక్షారము, ఆవనూనె వీనిని ప్రత్యేకము ప్రసృత (రెండేసిపలముల) ప్రమాణమువంతున కలిపి, కఫరోగము కల వారికి నిరూహవస్తి చేయందగును. దీనివలన మందాగ్నియు అరోచకంబును శమించును.

ఇచ్చట పదిప్రసృతములు క్వాథంబును, తేనె, తైలములు మున్నగునవి నాల్గు ప్రసృతములును చేరి పంద్రెండుప్రసృతములకన్న నధికమగును, ఐనను పైజెప్పబడిన భాగములవంతుననే ఔషధమును గూర్చి, అందు పంద్రెండుప్రసృతములపరిమితముగ నౌషధమును గ్రహించవలెను. కాని అధికముగ గ్రహింపదగదు. సంయోజనము మాత్రము పైజెప్పినరీతిగ గూర్చినగాని యౌషధము వీర్యవంతము కానేరదని యార్ష మతము.

(2) కఫరోగమున రెండవనిరూహవస్తి.

మూ. పటోలపథ్యాఽమరదారుభిర్వా
సపిప్పలీకైః క్వథితైర్జలేఽగ్నే. ౫౮

వ్యా. చేదుపొట్ల, కరకకాయలబెరడు, దేవదారు, పిప్పళ్లు, వీనిని జలమున విధ్యుక్తప్రకారము క్వాథము పైజెప్పినరీతిగ పదిప్రసృతములు మిగులకాచి, అందు పై యోగమునజెప్పబడినరీతిగ సర్షపాదికల్కమును, ఫలతైలాదులనుకూడ చేర్చి విధిప్రకారము నిరూహవస్తిని కఫరోగముకలవారికి చేయనగును.

(3) కఫహరనిరూహవస్తి (మూడవది).

మూ. ద్విపఞ్చమూలే త్రిఫలాం సబిల్వాం
ఫలాని గోమూత్రయుతః కషాయః,
కాలిఙ్గపాఠాఫలముస్తకల్కైః
ససైన్ధవః క్షారయుతః సతైలః. ౫౯

నిరూహముఖ్యః కఫజాన్ వికారాన్
సపాణ్డురోగాఽలసకాఽఽమదోషాన్,
హన్యాత్తథా మారుతమూత్రసఙ్గం
వస్తేస్తథాఽఽటోపమథాపి ఘోరమ్ ౬౦

వ్యా. రెండుపంచములు (మహాపంచమూలములు, హ్రస్వపంచమూలములు), త్రిఫలములు, బిల్వవేరు, మ్రంగకాయలు, ఈక్వాథ్యములను గోమూత్రమున జేర్చి పరిభాషానుసారముగ కషాయముకాచి వడగట్టి, అందు—కొడిసెపాలవిత్తులు, చిరుబొద్ది, మ్రంగకాయలు, తుంగగెడ్డలు వీనిని కల్కముగ నూరి కలిపి, సైంధవలవణమును యవక్షారమును తైలమును కూడకలిపి వస్తిచేయునది. ఇయ్యది కఫరోగములకు ముఖ్యమైన నిరూహవస్తి. కఫరోగములను, పాండురోగములను, అలసకమును, ఆమదోషములను, అపానవాతబాధమును, మూత్రబంధమును, వస్తి (మూత్రాశయము) యందలి క్రూరమైన యాటోపమును శమింపజేయును.

(4) కఫహరనిరూహవస్తి (నాల్గవది.)

మూ. రాస్నాఽమృతైరణ్డవిడఙ్గదార్వీ
సప్తచ్ఛదోశీరసురాహ్వనిమ్బైః,
శమ్యాకభూనిమ్బపటోలపాఠా
తిక్తాఽఽఖుపర్ణీదశమూలముస్తైః ౬౧
త్రాయన్తికాశిగ్రుఫలత్రికైశ్చ
క్వాథస్సపిణ్డీతకతోయమూత్రః,
యష్ట్యాహ్వకృష్ణా ఫలినీశతాహ్వా
రసాఽఞ్జనశ్వేతవచావిడఙ్గైః. ౬౨
కలిఙ్గపాఠాఽమ్బుదసైన్ధవైశ్చ
కల్కైస్ససర్పిర్మధుతైలమిశ్రః,
అయం నిరూహః క్రిమికుష్ఠమేహ
బ్రధ్నోదరాజీర్ణకఫాతురేభ్యః. ౬౩
రూక్షౌషధైరప్యపతర్పితేభ్యః
ఏతేషు రోగేష్వపి సత్సు దత్తః,

నిహత్య వాతం జ్వలనం ప్రదీప్య
విజిత్య రోగాంశ్చ బలం కరోతి. ౬౪

వ్యా. సన్నరాష్ట్రము, తిప్పతీగె, ఆముదపువేళ్లు, వాయువిడంగములు, మ్రాని పసుపు, ఏనుగులపొన్న, నట్టిపేళ్లు, దేవదారు, వేపపట్ట, రేలపట్ట, నేలవేము, చేదుపొట్ల, చిరుబొద్ది, (విషబొద్ది), కటుకరోహిణి, ఎలుకచెవికూర, దశమూలములు, (మహా-హ్రస్వ పంచమూలములు రెండును), తుంగగడ్డలు, కానుక, మునగపట్ట, త్రిఫలములు వీనినన్నిటిని చేర్చి విధ్యుక్తముగ కషాయముకాచి; అందు స్రుంగకాయక్వాథమును గోమూత్రమును కూడ ఆవాపకల్పమునను సరించి చేర్చి, మరియు అతిమధురము, పిప్పళ్లు, ప్రేంకణము, సదాపవిత్తులు, రసాంజనము, తెల్లనివస, వాయువిడంగములు, కొడిసెపాలవిత్తులు, చిరుబొద్ది, తుంగగడ్డలు, సైంధవలవణము వీనినన్నిటిని కల్కముగనూరి కలిపి, ఘృతమును, తేనెను, తైలమును ఒసిటి నియమించినభాగములుగ కలిపి నిరూహవస్తిని విధ్యుక్తప్రకారము చేయునది.

ఈనిరూహవస్తిని క్రిమిరోగము, కుష్ఠము, ప్రమేహము, బ్రధ్నమనురోగము, ఉదరము, అజీర్ణము, కఫరోగములు అనునిరోగములచే పీడింపబడినవారికిని, రూక్షములగు ఔషధములచే కృశించి, వైదిట్టునరోగములచే బాధింపబడుచుండువారికిని ముఖ్యముగ నుపయోగింపదగును. పైవ్యాధులన్నియును నివర్తించి శరీరమునకు బలమును కల్గించును.

(ఇప్పటి మదనకషాయము ఆవాపవిధిననుసరించి రాస్నాదిసిద్ధక్వాథమున జేర్చునది.)

సంసర్గ-సన్నిపాతములయందు చేయదగిననిరూహవస్తి.

మూ. పునర్నవైరణ్డవృషాశ్మభేద
వృశ్చీరభూతీకబలాపలాశాః,
ద్విపంచమూలం చ పలాంశికాని
క్షుణ్ణాని ధౌతాని పలాని చాష్టౌ. ౬౫
బిల్వం యవాః కోలకులుత్థధాన్య
ఫలాని చైవ ప్రసృతోన్మితాని,
పయోజలద్వ్యాఢకవచ్ఛృతం తత్

(పయోజలార్ధాధకపాచితం తత్)
(పయోజలద్వ్యాధకయోశ్శృతంతత్)
క్షీరావశేషం సితవస్త్రపూతమ్. ౬౬
వచాశతాహ్వాఽమరదారుకుష్ఠ
యష్ట్యాహ్వసిద్ధార్థకపిప్పలీనాం,
కల్కైర్యవాన్యామదనైశ్చ యుక్తం
నాత్యుష్ణశీతం గుడసైన్ధవాక్తమ్. ౬౭
క్షౌద్రస్య తైలస్య చ సర్పిషశ్చ
తథైవ యుక్తం ప్రసృతైస్త్రిభిశ్చ,
దద్యాన్నిరూహం విధినా విధిజ్ఞః
స సర్వసంసర్గకృతామయఘ్నః. ౬౮

వ్యా. ఎఱ్ఱగలిజేరు, ఆముదపువేళ్లు, అడ్డసరము, పాషాణభేది (కొండపిండి), తెల్లగలిజేరు, భూతీక (కామంచికసవు), చిట్టాముట్టి, మోదుగ, మహాపంచమూలములు, హ్రస్వపంచమూలములు, (ఈరెండునుచేరి ద్విపంచమూలములు), వీనిని ప్రత్యేకమొక్కొకపలమువంతునను; మారేడువేళ్లు ఎనిమిదిపలములును, యవలు రేగు ఉలవలు దనియాలు మ్రంగకాయలు ఇవిప్రత్యేకము, (ఒక్కొకప్రసృతమును) రెండేసిపలములును గ్రహించి, రెండుప్రస్థములు నీళ్లను రెండుప్రస్థములు పాలును అందుబోసి, పాలుమాత్రము మిగులునట్లు కాచి తెల్లనిగుడ్డతో వడగట్టియుంచుకొని; అందు వస, సదాపవిత్తులు, దేవదారుచెక్క, చంగల్వకోష్టు, అతిమధురము, ఆవాలు, పిప్పళ్లు, ఓమము, మ్రంగకాయలు వీనికల్కమును కలిపి, బెల్లమును సైంధవలవణమును యథోచితముగ జేర్చి, తేనె నూనె నెయ్యి వీనిని ప్రత్యేకప్రసృతము (రెండేసిపలముల) వంతున కలిపి సమశీతోష్ణముగ నౌషధమును కల్పించి విధ్యుక్తప్రకారము నిరూహవస్తిని చేయునది. ఈనిరూహవస్తి వాతాదిత్రిదోషములసంసర్గమున కల్గినరోగముల నన్నిటిని హరించును. (ఇచ్చట "పయోజలాఽర్ధాధకయోః శృతం తత్" అనుపాఠము సమంజసము).

వాతాదిదోషానుసారముగ నిరూహవస్తి సంఖ్యానిర్ణయము.

మూ. స్నిగ్ధోష్ణ ఏకః పవనే సమాంసః
ద్వౌ స్వాదుశీతౌ పయసా చ పిత్తే,

త్రయస్సమూత్రాః కటుకోష్ణతీక్ష్ణాః
కఫే నిరూహాః న పరం విధేయాః. ౬౯

వ్యా. దోషానుసారముగ పైజెప్పబడిన ఆయావస్తులనుపయోగించునపుడు వాతమునందు స్నిగ్ధంబును ఉష్ణంబును మాంసముతో కూడినదియునగువస్తిని ఒకదానినే యుపయోగింపవలెను. (కాని రెండవతూరి యుపయోగింపకూడదు.) పిత్తమున మధురరసంబును శీతంబును నగువస్తిని పాలతో రెండుపర్యాయములుమాత్రముపయోగింపవలెను. కఫమునందు మూత్రముతోకూడి కటురసంబును ఉష్ణవీర్యంబును తీక్ష్ణంబులునైన వస్తులను మూడు పర్యాయములుమాత్రమే ఉపయోగింపవలెను. అంతకన్న నధికముగ నొకప్పుడును ప్రయోగింపదగదని భావము.

ఇచ్చట "న పరం విధేయాః" అనుటవలన మూటికిపై నధికముగ ప్రయోగించినచో శరీరమునకు చాలకష్టమును కల్గించును కావున వాతమున నొకటియు, పిత్తమున రెండును, కఫమున మూడును నిరూహవస్తు లుపయోగింపదగునుకాని, అంతకన్ననధికముగ వస్తుల నుపయోగింపంజనదని యెరుంగునది. సుశ్రుతమున—ద్వితీయం వా తృతీయం వా చతుర్థం వా యథార్థ్హతః, సమ్యఙ్నిరూఢలిఙ్గే తు ప్రాప్తే వస్తిం నివర్తయేత్" (సు. చి. అ. 38) అని నాల్గిటికన్న నధికముగ చెప్పబడినది యీతంత్రకారునకు సమ్మతముకాదని తెలిసెడి. ఇచ్చట "ద్విపంచమూలస్య" (3౫) అనుశ్లోకము మొదలుచేసి ఇంతదనుకచెప్పబడినగ్రంథము "కే వస్తయః కేషు హితాః" అనుపదియవప్రశ్నమున కుత్తరమని యెరుంగునది.

{ నిరూహానంతరము వాతాద్యనుసారముగ భోజననియమము, దోషానుసారముగ ననువాసనవస్తి విశేషవిధియు. }

మూ. రసేన వాతే ప్రతిభోజనంస్యాత్
క్షీరేణ పిత్తే తు కఫే చ యూషైః,
తథానువాస్యేషు చ బిల్వతైలం
స్యాజ్జీవనీయం ఫలసాధితం చ. ౭౦

వ్యా. వాతమునందు నిరూహవస్తిని జేసినపిమ్మట మాంసరసముతో నన్నమును భుజించవలెను. పిత్తమున నిరూహానంతరము పాలతో నన్నమును భుజించవలెను, కఫమున నిరూహానంతరము యూషములతో నన్నమును భుజించవలెను. మరియు ననువాసనవస్తి

చేయవలసినచో వాతమున బిల్వతైలమును, పిత్తమున బిల్వతైలమును, కఫమున మ్రంగ కాయలచేర్చి సిద్ధముచేయబడినఫలతైలమును చేర్చి అనువాసనవస్తిని చేయవలెను.

ఇచ్చట స్నేహవ్యాపత్సిద్ధియను క్రింది నాల్గవయధ్యాయమున "దశమూలాం బలాం......సాధితా" (అ. ౪. శ్లో. ౪౭.) అని చెప్పబడు బిల్వతైలమును; "జీవన్తీం మదనం......పిత్తఘ్నమనువాసనమ్" (అ. ౪. శ్లో. ౯. ౧౨) అని చెప్పబడు జీవనీయ యమకస్నేహంబును; "మదనైర్వాఽమ్లసంయుక్తైః......కల్పయేద్భిషక్" అని చెప్ప బడు మదనతైలమును ఎరుంగునది.

## —అధ్యాయోక్తవిషయసంగ్రహము.—

మూ. ఇతీదముక్తం నిఖిలం యథావత్
వస్తిప్రదానస్య విధానమగ్ర్యం,
యోఽధీత్య విద్వానిహ వస్తికర్మ
కరోతి లోకే లభతే స సిద్ధిమ్. ౭౦

వ్యా. ఇత్తెరంగున నీయధ్యాయమున నగ్నివేశప్రశ్నానుసారముగ వస్తికర్మవిధాన ముల శ్రేష్ఠమైనవస్తుల నుపయోగించువిధానము తత్తదుచితముగ నాత్రేయునిచే ప్రధా నముగ నిరూపింపబడినది. విద్వద్వైద్యుడు ఈవిధిననుసరించి నిరూహవస్తిని యుక్తియుక్త ముగ వస్తికర్మను జేసినచో కార్యసిద్ధిని తప్పక పొందకలడు.

## —అధ్యాయసమాప్తి.—

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే వస్తిసూత్రీయసిద్ధిర్నామ
తృతీయోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగుచరక సంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితసిద్ధిస్థానమున వస్తిసూత్రీయ సిద్ధియను మూడవయధ్యాయము సంపూర్ణము.

# చ తు ర్థా ధ్యా య ము.

అవతరణిక:—పైయధ్యాయమున అభ్యంగ-సేక-అనువాసనములకు బిల్వతైలము, జీవనీయతైలము, ఫలతైలంబును నిర్దేశింపబడినవి. అట్టితైలముల వివరించుస్నేహవ్యాపదికీసిద్ధియను నీయధ్యాయము క్రింద జెప్పబడును. (అనువాసనోపయోగ్యములగు స్నేహములను, అట్టి స్నేహములయొక్క మిథ్యాయోగముచే గల్గువ్యాపత్తులను, అట్టివ్యాపత్తులకు చేయవలసినచికిత్సలను దెలుపునట్టి సిద్ధిస్నేహవ్యాపత్సిద్ధి యనబడును).

అధ్యాయప్రారంభము.

మూ. అథాతస్స్నేహవ్యాపదికీం సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వస్తిసూత్రీయమును వివరించినపిదప అనువాసనికస్నేహాదుల వివరించునట్టి వస్తివ్యాపత్సిద్ధియను నధ్యాయమును భగవానుడగునాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించెదనని యర్థము.

అధ్యాయవక్తవ్యవిషయనిర్దేశము.

మూ. స్నేహవస్తీన్నిబోధేమాన్ వాత-పిత్త-కఫాపహాన్,
మిథ్యాప్రణిహితానాం చ వ్యాపదః సచికిత్సితాః 3

వ్యా. వాత-పిత్త-కఫహారములుగ ననువాసనవస్తిప్రయోగమున నుపయోగింపదగిన స్నేహములను, అట్టిస్నేహముల విధినియమమునకు వ్యత్యస్తముగ నుపయోగించినచో గల్గువ్యాపత్తులను, అట్టిస్నేహవ్యాపత్తులకు జేయదగినచికిత్సితములను వివరించి యీయధ్యాయమున జెప్పెదనని భావము.

అనువాసనవస్తి తైలయోగములు. అందు వాతహారబిల్వాదితైలము.

మూ. దశమూలం బలాం రాస్నాం అశ్వగన్ధాం పునర్నవాం,
గుడూచ్యేరణ్డభూతీకభార్గీవృషకరోహిషమ్. ౪
శతావరీం సహచరం కాకనాసాం పలాంశికం (పలోన్మితాం),
యవమాషాతసీకోలకులుత్థాన్ ప్రసృతోన్మితాన్. ౫
చతుర్ద్రోణేఽమ్భసః పక్త్వా ద్రోణశేషేణ తేన చ,
తైలాఢకం సమక్షీరం (పచేత్తైలాఢకం క్షీరైః)
జీవనీయైః పలోన్మితైః ౬

అనువాసనమేతద్ధి సర్వవాతవికారనుత్,
ఆనూపానాం వసా తద్వత్ జీవనీయోపసాధితా. ౭

వ్యా. దశమూలములు (మహాపంచమూలములు, హ్రస్వపంచమూలములు), చిట్టాముట్టి, సన్నరాష్ట్రము, పెన్నేరుగెడ్డ, గలిజేరు, తిప్పతీగె, ఆముదపువేరు, కామంచిగడ్డి (లేక ఓమము), భారంగి, అడ్డసరము, రోహిష (తృణవిశేషము ఆవురుగడ్డి), పిల్లిపీచర, గోరింట, కాకిదొండ, ఇవి ప్రత్యేకము పలప్రమాణము; యవలు, ఉద్దులు, ఆగసివిత్తులు, ఉలవలు, ఇవి ప్రత్యేకము ప్రసృత (రెండుపలముల) ప్రమాణము; పైభాగముల ప్రకారము దశమూలాదిద్రవ్యముల క్వాథ్యముగజేసి, అందు నాల్గుద్రోణములుజలమును బోసి ద్రోణమాత్రము మిగులునట్లు చుండ కషాయముకాచి వడగట్టి, అందు ఆఢకపరిమితముగ తైలమును, తైలమునకు సమభాగముగ (ఆఢకమాత్రము) ఆవుపాలను కలిపి, జీవనీయ గణద్రవ్యములను ఒక్కొకపలమువంతున కల్కముచేసి కలిపి తైలపాకవిధిప్రకారము పక్వము చేయునది. ఈతైలముచే ననువాసనవస్తి చేసినయెడ వాతరోగములన్నియు నివర్తించును.

మరియు ఆనూపజంతువుల వసను పైజెప్పినదశమూలాదిక్వాథమును జేర్చి జీవనీయగణద్రవ్యములకల్కమును కలిపి తైలపాకవిధిప్రకారము పక్వముజేసి యనువాసనవస్తి జేసినయెడ వాతవ్యాధులను హరించును. ఇచ్చట "జీవన్తీ కాకోల్యౌ మేదే ద్వే ముద్గ మాషపర్ణ్యౌచ, ఋషభకజీవకమధుకంచేతి గణో జీవనీయాఖ్యః" అనుజీవనీయగణద్రవ్యముల గ్రహించునది.

మరియు నీతైలయోగమునగల దశమూలములలోని బిల్వమును ప్రధానముగజేసి యీతైలము బిల్వాదితైలమని స్థలాంతరమునను పైయధ్యాయాంతమునను జెప్పబడినది.

### అనువాసనమునకు శతాహ్వాదితైలము.

మూ. శతాహ్వాయవబిల్వామ్లైః సిద్ధం తైలం సమీరణే,
సైన్ధవేనాఽగ్నితప్తేన తప్తం చాఽనిలనుత్ ఘృతమ్ ౮

వ్యా. సదాపవిత్తులు, యవలు, బిల్వము, అనునీద్రవ్యములను కల్కముగను పులిగంజిని ద్రవముగను జేర్చి తైలపాకవిధిప్రకారము పక్వముజేసి యనువాసనవస్తి చేసినను, సైంధవలవణమును నిప్పునకాచి దానినిచేర్చి కాచబడినఘృతమును అను వాసనవస్తి చేసినను వాతమును హరించును. (ఇచ్చట శతాహ్వేత్యాదియోగాంతరం "సైంధవేత్యపి యోగాంతరం" అని వ్యాఖ్యానమున పైనిచెప్పబడినయోగముల రెండుగ విభజించియున్నది).

### అనువాసనమునకు జీవనీయ (యమక) స్నేహము.

మూ. జీవన్తీం మదనం మేదాం శ్రావణీం మధుకం బలాం,
శతాహ్వర్షభకౌ కృష్ణాం కాకనాసాం శతావరీమ్. ౯
స్వగుప్తాం క్షీరకాకోలీం కర్కటాఖ్యాం శటీం వచాం,
పిష్ట్వా తైలం ఘృతం క్షీరే సాధయే త్తచ్చతుర్గుణే. ౧౦
బృంహణం వాతపిత్తఘ్నం బలశుక్రాఽగ్నివర్ధనం,
మూత్రరేతోరజోదోషాన్ హరే త్తదనువాసనమ్. ౧౧

వ్యా. పాలకూర, మ్రంగకాయలు, మేద, బోడతరము, అతిమధురము, చిట్టాముట్టి, సదాపవిత్తులు, ఋషభకము, పిప్పళ్లు, కాకిదొండ, పిల్లిపీచరగడ్డలు, దూలగొండి, క్షీరకాకోలి, కర్కాటకశృంగి, కచోరములు, వస వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి నూరి కల్కముగగూర్చి (స్నేహమునకు నాల్గవవంతుకలిపి), తైలమును ఘృతమును రెంటిని సమభాగములుగ గూర్చి, అందు స్నేహమునకు నాలుగింతలు ఆవుపాలు కలిపి స్నేహపాకవిధిప్రకారము పక్వముచేయునది. (ఈయది రెండుస్నేహములు కలిసి యుండుటచే యమకస్నేహమనబడును). దీని ననువాసనవస్తి కుపయోగించినచో శరీరమును బలియజేసి బలమును కల్గించును. వాతపిత్తములను హరించును. బలమును శుక్రమును జాఠరాగ్నిని వృద్ధినొందించును. మూత్రదోషమును, శుక్రదోషమును, ఆర్తవదోషమును హరించును. (ఈయమకస్నేహము పైయధ్యాయాంతమున—"స్యాజ్జీవనీయమ్" అను వాక్యముచే జీవనీయతైలమని నిర్దేశింపబడినది.)

### పిత్తహర చందనాదితైలానువాసనవస్తి.

మూ. లాభతశ్చన్దనాద్యైశ్చ పిష్టైః క్షీరచతుర్గుణం,
తైలపాదం (పాత్రం) ఘృతం సిద్ధం పిత్తఘ్నమనువాసనమ్ ౧౨

వ్యా. జ్వరచికిత్సితమున జెప్పబడిన చందనాదిగణమునందలి ద్రవ్యములలో దొరకి నంతమట్టుకు గ్రహించి నూరి కల్కముచేసి, నాల్గవవంతుతైలమును మూడుభాగములు ఘృతమును నొకటిగ కల్పి, యా స్నేహమునకు నాల్గవవంతు పైజెప్పినచందనాదికల్కమును కలిపి, స్నేహములకు నాల్గింతలు ఆవుపాలను కలిపి స్నేహపాకవిధిప్రకారము పక్వముచేసి యనువాసనవస్తి కుపయోగించునది. ఇయ్యది పిత్తహరమగు ననువాసనము.

ఇచ్చట 'చన్దనాద్యైశ్చ' అనుచోట జ్వరచికిత్సితమున "చన్దనభద్రశ్రీకాలాను సార...ఆత్మగుప్తా మధూకానామ్" (చ. చి. అ. 3 సూత్ర. ౨౧౮) అని చెప్పబడిన చందనాదిగణమును గ్రహించునది.

కఫరోగముల కనువాసనవస్తితైలము.

మూ. సైన్ధవం మదనం కుష్ఠం శతాహ్వాం నిచుళం వచామ్ (బలాం,)
హ్రీబేరం మధుకం భార్గీం దేవదారు సకట్ఫలమ్ ౧౩
నాగరం పుష్కరం మేదాం చవికాం చిత్రకం శటీం,
విడఙ్గాఽతివిషే శ్యామాం హరేణుం నీలినీం స్థిరామ్. ౧౪
బిల్వాఽజమోదే కృష్ణాం చ దన్తీం రాస్నాం చ పేషయేత్,
సాధ్యమేరణ్డజం తైలం తైలం వా కఫరోగనుత్. ౧౫
బ్రధ్నోదావర్తగుల్మార్శః ప్లీహమేహాఢ్యమారుతాన్,
ఆనాహమశ్మరీం చైవ హన్యాత్తదనువాసనాత్. ౧౬

వ్యా. సైంధవలవణము, మ్రంగకాయలు, చెంగల్వకోష్టు, సదాపవిత్తులు, నీరుప్రబ్బలి, వస, కురువేరు, అతిమధురము, భారంగి, దేవదారు, కాయఫలము, శుంఠి, పుష్కరమూలము, మేద, చవ్యము, చిత్రమూలము, కచోరములు, వాయువిడంగములు, అతివస, నల్లతెగడ, రేణుకలు, నీలివేళ్లు, ముయ్యాకుపొన్న, బిల్వవేరు, ఓమము, పిప్పళ్లు, నేపాళపువేళ్లు, సన్నరాష్ట్రము వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి నూరి కల్కము జేసి, కల్కమునకు నాలుగింతలు ఆముదమునైనను నూనెనైనను కలిపి (స్నేహమునకు నాలుగింతలు జలమును చేర్చి) తైలపాకవిధిప్రకారము పక్వముచేసి యనువాసనవస్తిచేసినచో కఫరోగములన్నియు నివర్తించును. మరియు బ్రధ్నము, ఉదావర్తము, గుల్మము, అర్శోరోగము, ప్లీహాభివృద్ధి, ప్రమేహము, ఆఢ్యవాతము, ఆనాహము, అశ్మరి, అనునీవ్యాధులన్నియు నీయనువాసనవస్తిచే నివర్తించును.

ఇచ్చట ద్రవమును చెప్పియుండలేదు కావున "స్నేహసిద్ధౌ ద్రవేనుక్తే సర్వత్రాంభశ్చ తుర్గుణమ్" అనుపరిభాషచే స్నేహమునకు నాల్గింతలుజలమును చేర్చుకొనవలెను. ద్రవనిర్దేశము లేని స్థలములయందెల్ల నీపరిభాష నెరుంగునది.

కఫహరమదన ఫలతైలానువాసనవస్తి.

మూ. మదనైర్వాఽమ్లసంయుక్తైః బిల్వాద్యేన గణేన వా,
తైలం కఫహరైర్వాపి కఫఘ్నం కల్పయేద్భిషక్ ౧౭

వ్యా. మ్రంగకాయలను కల్కముగను, కాంజికము మున్నగువానిని ద్రవముగను గూర్చి తైలమును సిద్ధముచేసి యనువాసనముచేసినచో కఫమును హరించును (ఇది మదన తైలమని చెప్పబడును. ఇదియే పైయధ్యాయాంతమున 'ఫలసాధి తం చ' అని నిర్దేశించ బడినది).

మరియు బిల్వాదిగణముచే జెప్పబడిన పదిద్రవ్యములనైనను,కఫహరములగు త్రికటుకము పంచకోలములు మున్నగుద్రవ్యములనైనను కల్కక్వాథములుగజేసి తైలమును సిద్ధముచేసినయెడ నయ్యది కఫహరమగునను వాసనమునకై యుపయోగింపనగును. (ఇచ్చట బిల్వాదిగణమన "బిల్వోగ్నిమంథ...ద్వయం తథా" అని చెప్పబడిన దశమూలములని యెరుంగునది. మరియు—"క్వాథకల్కావనిర్దేశే గణాత్తస్మాత్ సమావపేత్" అనుపరి భాషానుసారము ఆగణోక్తద్రవ్యములనే క్వాథమునకు కల్కమునకు నుపయోగింప దగును).

## విడంగాదితైలము.

మూ. విడఙ్గైరణ్డరజనీపటోలత్రిఫలాఽమృతాః,
జాతీప్రవాళనిర్గుణ్డీదశమూలాఖుపర్ణికాః. ౧౮
నిమ్బపాఠాసహచరశమ్యాకకరవీరకాః,
ఏషాం క్వాథేన విపచేత్ తైలమేభిశ్చ కల్కితైః. ౧౯
ఫలబిల్వత్రివృత్కృష్ణారాస్నాభూనిమ్బదారుభిః,
సప్తపర్ణవచోశీరదార్వీకుష్ఠకలిఙ్గకైః. ౨౦
లతాగౌరీశతాహ్వాఽగ్నిశటీచోరకపౌష్కరైః,
(లతాయష్టీశతాహ్వాగ్నిశటీసౌరాష్ట్రిపౌష్కరైః)
తత్ కుష్ఠాని క్రిమీన్ మేహానర్శాంసి గ్రహణీగదమ్. ౨౧
క్లీబతాం విషమాగ్నిత్వం మలం దోషత్రయం తథా,
ప్రయుక్తం ప్రణుదత్యాశు పానాఽభ్యఙ్గాఽనువాసనైః. ౨౨

వ్యా. వాయువిడంగములు, ఆముదపువేళ్లు, పసుపు, చేదుపొట్ల, త్రిఫలములు, తిప్పతీగె, జాజిచిగుళ్లు, వావిలివేళ్లు, దశమూలములు, ఎలుకచెవియాకు, వేపపట్ట, చిరుబొద్ది, గోరంట, రేలజిగురు, గన్నేరు వీనిని సమభాగములుగగూర్చి విధ్యుక్తప్రకారము క్వాథము చేసి వడగట్టియుంచునది; మ్రంగకాయలు, బిల్వవేరు, తెగడవేళ్లు, పిప్పళ్లు

సన్నరాష్ట్రము, నేలవేము, దేవదారు, ఏడాకులపొన్న, వస, వట్టివేళ్లు, మ్రానిపసుపు, చెంగల్వకోష్టు, కొడిసెపాలవిత్తులు, మంజిష్ఠి, పసుపు, సదాపవిత్తులు, చిత్రమూలము, కచోరములు, చోరకము (గడ్డి దవనము) పుష్కరమూలము (మెట్టదామర) వీనినన్నిటిని సమభాగములుగకూర్చి కల్కముచేసి, ఈకల్కమునకు నాల్గింతలు నూనెను, తైలమునకు నాల్గింతలు పైజెప్పిన విడంగాదికషాయమును కలిపి స్నేహపాకవిధిప్రకారము పక్వము చేసి యనువాసనమున కుపయోగించినచో కుష్ఠములును, క్రిములను, మేహములను, అర్శస్సులను, గ్రహణీరోగములను, షండత్వమును, విషమాగ్నిని, మలదోషములను, వాతాదిదోషత్రయమును వీనినన్నిటిని శీఘ్రముగ హరించును. మరియు నీతైలమును పానమునకు అభ్యంగనమునకును అనువాసనవస్తికిని ఉపయోగించినచో పైజెప్పిన కుష్ఠాది వ్యాధులన్నియు పూర్తిగ నశించును. (ఇచ్చట "లతా మఞ్జిష్ఠా, గౌరీ-హరిద్రా" అని వ్యాఖ్యలో నున్నది).

స్నేహవస్తి (అనువాసనవస్తి) గుణములు.

మూ. వ్యాధివ్యాయామకర్మాఽధ్వక్షీణాఽబలనిరోజసాం,
క్షీణశుక్రస్య చాతీవ స్నేహవస్తిర్బలప్రదః. ౨౩
పాదజఙ్ఘోరుపృష్ఠాంసకటీనాం స్థిరతాం పరాం,
జనయేదప్రజానాం చ ప్రజాం స్త్రీణాం తథా నృణామ్. ౨౪

వ్యా. పైజెప్పబడినతైలములచే చేయబడినయనువాసనవస్తి వ్యాధిచేతను వ్యాయామముచేతను పనుల చేయుటచేతను త్రోవనడచుటచేతను శరీరము కృశించి బలము నశించి యోజస్సుచెడినవారలకు మిక్కిలి బలమును కల్గించును. అందును శుక్రము క్షీణించిన వారికి ముఖ్యముగ శుక్రమును వృద్ధినొందించి బలమును కల్గించును. మరియు—పాదములు, పిక్కలు, తొడలు, వీపు, మూపులు, నడుము, ఈస్థలములయందు దార్ఢ్యమును పటుత్వమును కల్గించును. సంతతికల్గకుండు స్త్రీలకును పురుషులకును సంతానము కల్గును.

స్నేహవస్తి అనువాసనమిథ్యాయోగవ్యాపత్తులు.

మూ. వాతపిత్తకఫాఽత్యన్నపురీషైః ఆవృతస్య చ,
అభుక్తే చ ప్రణీతస్య స్నేహవస్తేః షడాపదః. ౨౫

వ్యా. వాతము, పిత్తము, కఫము, అధికాహారము, పురీషము వీనిచే నడ్డగింపబడుట చేతను, భుజింపక పరగడుపున నున్నపుడు ప్రయోగించుటచేతను, స్నేహవస్తికి సంబంధించి ఆరువిధములైన వ్యాపత్తులు సంభవించును.

ఇచ్చట చెప్పబడినవ్యాపత్తులు అనువాసనవస్తి చేయునపు డుపయోగింపబడు స్నేహములను విధికి విరుద్ధముగ నుపయోగించుటచే గల్గునవియని యెరుంగునది. స్నేహము యొక్క అయోగ-అతియోగములచే గల్గువ్యాపత్తులు ఇచ్చట చెప్పబడవు. కావుననే అధ్యాయారంభమున "మిథ్యాప్రణిహితానాం చ వ్యాపదః స చికిత్సితాః" అని ప్రతిజ్ఞాసూత్రమున జెప్పబడినది. మరియు అను వాసనవస్తియొక్క అయోగాఽతియోగమున గల్గువ్యాపత్తులు కల్పనాసిద్ధియందు "అథశ్శరీరోదరబాహుపృష్ఠ...అనువాసితస్య" (సి. అ. ౧ శ్లో.౪౫) అనువాక్యముచే జెప్పబడినవి. కావున నిచ్చట వివరణ మనవసరము, కావున స్నేహమిథ్యాయోగమున గల్గువ్యాపత్తులు ఆరును ఈశ్లోకమున నిర్దేశింపబడినవని యెరుంగునది.

## వాతాద్యావరణమునకు కారణములు.

మూ. శీతోఽల్పో వాఽధికే వాతే పిత్తేఽత్యుష్ణః కఫే మృదుః,
అతిభుక్తే గురుర్వర్చః సఞ్చయేఽల్పబలస్తథా. ౨౮
దత్తస్తైరావృతః స్నేహః న యాత్యభిభవాదపి (దధః),
అభుక్తేఽనావృతత్వాచ్చ యాతూర్ధ్వం తస్య లక్షణమ్. ౨౯

వ్యా. వాతమధికముగనున్నపుడు శీతవీర్యంబును అల్పపరిమాణంబునగు స్నేహమును అనువాసనమున కుపయోగించినచో వాతం బధికమై స్నేహమును అడ్డగించును. పిత్తం బధికముగనున్నపుడు మిక్కిలి యుష్ణవీర్యంబగుస్నేహము నుపయోగించినచో పిత్తము మిక్కిలి వృద్ధినొంది స్నేహమును నిరోధించును. కఫంబధికముగనున్నపుడు మృదువైనస్నేహము నుపయోగించినచో కఫము మిక్కుటముగ నధికమై స్నేహమును నిరోధించును. అధికముగ భుజించినపుడు గురుగుణముకలస్నేహముచే అనువాసనముచేసినను, మలము సంచితమైయున్నపుడు అల్పవీర్యముగనున్న స్నేహము నుపయోగించినను అయ్యావి స్నేహమును నిరోధించును. ఇత్తెరంగున వాతాదులచే నావరింపబడిన స్నేహము అధోమార్గముగ బైటవెడలజాలదు. మరియు భుజించక పరగడుపుగ నున్నపుడు స్నేహవస్తి ప్రయోగించినచో స్నేహము ఊర్ధ్వమార్గమున నడ్డములేకుండుటవలన నూర్ధ్వమార్గమున స్నేహము చేరునుగాని అధోమార్గమున వెడలనేరదు. వీని ప్రత్యేకలక్షణము లీక్రింద వివరింపబడును.

## వాతావృతస్నేహలక్షణము, దానిచికిత్స.

మూ. అఙ్గమర్దజ్వరాధ్మానశీతస్తమ్భోరుపీడనైః,
(స్తమ్భోరుకృదనాధ్మానజ్వరశూలాఽఙ్గమర్దనైః)

పార్శ్వరుగ్వేష్టనైర్విద్యాత్ స్నేహం వాతావృతం భిషక్. ౨౮
స్నిగ్ధామ్లలవణోష్ణైస్తం రాస్నాపీతద్రుతిల్వకైః,
సౌవీరకసురాకోలకులుత్థయవసాధితైః. ౨౯
నిరూహైర్నిర్హరేత్సమ్యక్ సమూత్రైః పాఞ్చమూలికైః,
తాభ్యామేవ చ తైలాభ్యాం సాయం భుక్తేఽనువాసయేత్. ౩౦

వ్యా. వాతముచే స్నేహము ఆవరింపబడునపుడు ఒడలినొప్పులు, జ్వరము, కడుపుబ్బరము, శీతము, స్తంభము, తొడలనొప్పులు, ఇరుప్రక్కలయందు శూలనొప్పి, మెలిపెట్టినట్లు కడుపులోబాధ ఇవియన్నియు కల్గును.

అట్టియెడ సన్నరాష్ట్రము, దేవదారు, లొద్దుగు వీనికల్కమును, సౌవీరకము (కాంజికభేదము), మద్యము, రేగుపండ్లు, ఉలవలు, యవలు అనువానిని చేర్చి కషాయము సిద్ధముచేసి, అందు స్నేహమును, కాంజికమును, సైంధవలవణమును యథోచితముగ జేర్చి యాయౌషధముచే నిరూహవస్తిజేసి లోపల చిక్కియుండుస్నేహమును వెడలించవలెను. మరియు పంచమూలకషాయముతోనైనను నిరూహవస్తి చేయనగును. పిమ్మట వాతవ్యాధిచికిత్సితమున జెప్పినరాస్నాతైలముచేనైనను, పైజెప్పినదేవదారు, లొద్దుగు, పంచమూలములు మున్నగుద్రవ్యకల్కమును, సౌవీరకకాంజికాదిద్రవమును జేర్చి సిద్ధము చేయబడినతైలముచేనైనను అనువాసనవస్తిని సాయంకాలము భుజించినపిదప ప్రయోగింపవలెను.

ఇచ్చట "తాభ్యామేవ చ తైలాభ్యాం" అనుచోట—వాతవ్యాధిచికిత్సితమున "రాస్నాసహస్రనిర్యూహే...అనిలార్తిఙుత్" (చ. చి. అ. ౨౮ శ్లో. ౧౬౫) అని చెప్పబడిన రాస్నాతైలమును, పైజెప్పబడిన దేవదారుమున్నగుద్రవ్యముల జేర్చి సిద్ధము చేయబడినతైలమును గ్రహించునది.

పిత్తావృతస్నేహలక్షణము, దానిచికిత్స.

మూ దాహరాగతృషామోహతమకజ్వరదూషణైః,
విద్యాత్ పిత్తావృతం; స్వాదుతిక్తైస్తం వస్తిభిర్హరేత్. ౩౧

వ్యా. స్నేహము పిత్తముచే నిరోధింపబడినపుడు తాపము కల్గును. శరీరము రక్తవర్ణముగనుండును. దప్పి కల్గును. మూర్ఛ గ్రమ్మును. చీకటిలోనున్నట్లు మైకము గ్రమ్మును. జ్వరమువచ్చును. అట్టియెడ మధురద్రవ్యములను తిక్తరసములనుగూర్చి సిద్ధముచేయబడిన నిరూహవస్తులచే స్నేహమును బైటవెడలింపవలెను.

### కఫావృతస్నేహలక్షణము.

మూ. తన్ద్రాశీతజ్వరాలస్యప్రసేకారుచిగౌరవైః,
సమ్మూర్ఛాగ్లానిభిర్విద్యాత్ శ్లేష్మణా స్నేహమావృతమ్. ౩౨

వ్యా. స్నేహము కఫముచే నావరింపబడునప్పుడు కునికిపాటు, చలితోకూడిన జ్వరము, పనులయందు ప్రాలుమాలిక, నోట జొల్లు కారుట, అరోచకము, శరీరము బరువుగనుండుట, మూర్ఛ, బడలిక ఈలక్షణములు కల్గును. (అనువాసనవస్తి చేసినపుడు ఈలక్షణములు కల్గినచో స్నేహము కఫముచే నావరింపబడినదని యెరుంగునది.)

### కఫావృతస్నేహవ్యాపచ్చికిత్స.

మూ. కషాయకటుతీక్ష్ణోష్ణైః సురామూత్రోపసాధితైః,
ఫలతైలయుతైస్సాన్ద్రైః వస్తిభిస్తం వినిర్హరేత్. ౩౩

వ్యా. పైజెప్పినకఫావృతస్నేహవ్యాపత్తునందు కటుకషాయరసములును తీక్ష్ణగుణంబులును ఉష్ణవీర్యంబును కలద్రవ్యములతోడను, సురామద్యము, మూత్రముతోడను, మ్రంగకాయలతో సిద్ధముచేయబడిన తైలముతోడను, కాంజికములతోడను సిద్ధము చేయబడిన నిరూహవస్తుల నుపయోగించి బైట వెడలకుండుస్నేహమును వెడలింపవలెను. ('ఫలతైలయుతైః' అనుచోట పైయధ్యాయమున చెప్పబడిన మదనఫలతైలమని గ్రహించునది.)

### అధికాహారావృతస్నేహలక్షణము.

మూ. ఛర్దిమూర్ఛారుచిగ్లాని శూలనిద్రాఙ్గమర్దనైః,
ఆమలిఙ్గైస్సదాహైస్తం విద్యాదత్యశనావృతమ్. ౩౪

వ్యా. భుజింపబడినయాహారముచే స్నేహము ఆవరింపబడినయెడ వాంతి యగును. మూర్ఛ సంభవించును. అరుచియు బడలికయు (జ్వరంబును) శూలంబును, నిద్రయు, ఒడలినొప్పులును కల్గును. మరియు నజీర్ణముచే గల్గులక్షణంబులును కానవచ్చును.

### ఆహారావృతస్నేహవ్యాపచ్చికిత్స.

మూ. కటూనాం లవణానాం చ క్వాథైశ్చూర్ణైశ్చ పాచనం,
విరేకో మృదురత్రామవిహితా చ క్రియా హితా. ౩౫

వ్యా. అట్టియెడ కటురసంబులును లవణరసంబులునగు ద్రవ్యములయొక్క క్వాథములచేనైనను, వానిచూర్ణములచేనైన నుపయోగించి, పాచనము (ఆమాహారమును పచింపజేయుచికిత్స) జేయుట హితము. మరియు మృదువిరేచనము నుపయోగించుటయు, ఆమమునకు జెప్పినలేఖనచికిత్సయు హితముగ నుండును. (ఇచ్చట "ఆమం ప్రదుష్ట మన్నాభిభూతం పునరుల్లిఖేత్" (వి. అ. ౨.) అని చెప్పబడినలేఖనవిధి నెరుంగునది.)

—— మలావృతస్నేహలక్షణము, చికిత్సయు. ——

మూ. విణ్మూత్రానిలసఙ్గార్తిగురుత్వాధ్మానహృద్గ్రహైః,
స్నేహం విడావృతం జ్ఞాత్వా స్నేహస్వేదైస్సవర్తిభిః. ౩౮
శ్యామాబిల్వాదిసిద్ధైశ్చ నిరూహైస్సానువాసనైః,
నిర్హరేద్విధినా సమ్యక్ ఉదావర్తహరేణ చ. ౩౭

వ్యా. స్నేహము సంచితమైనమలముచే నిరోధింపబడినపుడు మలమూత్ర-అపానవాతములు వెడలక యడ్డుపడును. కుక్షి బరువుగనుండును. కడుపుబ్బును. రొమ్మునొప్పి సంభవించును. (మలము అధికముగనున్నపుడు అనువాసనవస్తిచేసినచో నయ్యది స్వల్పమగుటంజేసి మందవీర్యమై మలమును బైట వెడలింపనేరకుండును. దానంజేసి మలమూత్ర సంగాదులు సంభవించుననియు భావము.)

అట్టియెడ స్నేహస్వేదములను వర్తిప్రయోగములను చేసియు, తెగడతోగూడిన బిల్వాదిదశమూలములచే సిద్ధములైన నిరూహవస్తుల చేసియు, అనువాసనవస్తుల చేసియు, ఉదావర్తహరచికిత్స చేసియు బైట వెడలింపవలెను. (లేక "శ్యామాబిల్వాది" అనుచోట "శ్యామాది, బిల్వాది" అని యర్థముచేసి కల్పస్థానమున "శ్యామాత్రివృచ్చతురఙ్గుళతిల్వక మహావృక్షసప్తలాశఙ్ఖినీ దన్తీద్రవన్తీనాం చ" (కల్ప-అ. ౧. సూ. ౬.) అని నిర్దేశింపబడిన తెగడ మున్నగుతొమ్మిదిద్రవ్యములును; బిల్వాదిదశమూలములును గ్రహింపబడును. అట్టి రెండుగణముల ద్రవ్యములను చేర్చి వస్త్యౌషధమును సిద్ధముచేసి నిరూహాన్వాసములజేసి స్నేహమును వెడలింపవలెనని యర్థము. మరియు "ఉదావర్తహరేణ" అనుచోట, త్రిమర్మీయచికిత్సితమునం దు "రక్షోఘ్నతుమ్బా" (చి. అ. ౨౬. శ్లో. ౧౬.) అనియుపక్రమించి చెప్పబడిన ఉదావర్తచికిత్సల యుక్తానుసారముగ గ్రహించునది.)

—— స్నేహ మూర్ధ్వగతమైనపుడుగల్గు లక్షణములు. ——

మూ. అభుక్తే శోస్య పాయసా వా వేగాత్ స్నేహోఽతిపీడితః,
ధావత్యూర్ధ్వం తతః కణ్ఠాత్ ఊర్ధ్వేభ్యః ఖేభ్య ఏత్యపి. ౩౮

వ్యా. అనువాసన వస్తిప్రయోగమున "జీర్ణే తు సాయం లఘు చాల్పమాత్రం ...క్తోఽనువాస్యః" (సి-అ-3. శ్లో. ౨౭) అని స్వల్పభోజనానంతరము అనువాసనవస్తి ...ధింపబడినది. మరియు గుదస్థానమున తైలాదుల పూసి వస్తిప్రయోగము చేయవలెననియు, ...స్తిని మెల్లగ నొక్కి పట్టవలెననియు చెప్పబడినది.) అట్టినియమముల మూటినతిక్రమించి ...జనము చేయించక పరగడుపుననే అనువాసనవస్తిని ప్రయోగించినను, గుదస్థానముల ...తైలమును బూయక ప్రయోగించినను, వస్తిని మిక్కిలివేగముతో నధికముగ నొక్కినను ...స్నేహము అడ్డులేమింజేసి మిక్కిలివేగముతో (ఆమాశయమును దాటి) పైకి వ్యాపించును. ...ట్టియెడ కంఠమునకు పైనుండునోరు, నాసారంధ్రములు మున్నగురంధ్రములనుండియు ...కవేళ స్నేహము బైట వెడలును. (దానంజేసి యుపాధి యధికమగును.)

ఇచ్చట 'ఏతి అపి' అనుటవలన ఒకసమయమున స్నేహము పైకి వ్యాపించినను ముఖాదిద్వారములనుండి వెడలకయు నుండునని తెలిసెడి. మరియు వ్యాపత్తుల కారణములను ...ర్దేశించునపుడు ""అభుక్తే చ ప్రణీతస్య" అని భోజనాభావముమాత్రము కారణముగ జెప్పబడినది. అయినను శూన్యగుదంబును, అతిపీడనంబునుకూడ స్నేహమూర్ధ్వముగ వ్యాపించుటకు కారణములగుటచేతను సమానచికిత్సిత మగుటచేతను ఇచ్చట చెప్పబడినదని యెరుంగునది.

## ఊర్ధ్వగతస్నేహవ్యాపచ్చికిత్స.

మూ. మూత్రశ్యామాత్రివృత్సిద్ధో యవకోలకులుత్థవాన్,
తత్సిద్ధతైలఇష్టోఽత్ర నిరూహస్సాఽనువాసనః. ౩౯
కణ్ఠాదాగచ్ఛతః స్తమ్భకణ్ఠగ్రహావిరేచనైః,
ఛర్దిఘ్నైభిః క్రియాభిశ్చ తస్య కార్యం నివర్తనమ్. ౪౦

వ్యా. గోమూత్రమును, నల్లతెగడ, తెల్లతెగడ, యవలు అను నీద్రవ్యములను చేర్చి చేయబడిననిరూహవస్తిని, ఆద్రవ్యములచేర్చి సిద్ధముచేయబడిన తైలముతోగూడిన అను ...వాసనవస్తిని ప్రయోగించుట పైజెప్పిన యూర్ధ్వగమనవ్యాపత్తుకు ప్రశస్తము. మరియు ...ంఠమునుండి (దాటి) స్నేహము నోటవెడలనున్నపుడు, వెడలనీయక వీవనలచే విసరుట, ...నల్లనినీళ్లు చల్లుట మున్నగు స్తంభనోపాయముల జేయనగును. వెడలనీయక కంఠమును ...గబట్టవలెను. లేక విరేచనమును చేయించవలెను. వమనరూపముగ నోట స్నేహము ...వెడలుచున్నయెడ వమనహరములగు చికిత్సల జేయనగును. (ఇచ్చట ఛర్దిచికిత్సితమున— 'మనోఽభిఘాతే తు మనోఽనుకూలాః...సుఖమేవ జేతుమ్" (చి-అ. ౨౦. శ్లో. ౪౧- ...౪) అని చెప్పబడినఛర్దిచికిత్సల నెరుంగునది.)

స్నేహము బైటవెడలకున్నను ఉపద్రవములేనపుడు చికిత్సానిషేధము.

మూ. యస్య నోపద్రవం కుర్యాత్ స్నేహవస్తిరనిస్సృతః,
సర్వోఽల్పోవాఽఽవృతో రౌక్ష్యాత్ ఉపేక్ష్యస్స విజానతా.

వ్యా. మిక్కిలి రూక్షమైనశరీరము కలవారికి స్నేహవస్తిని ప్రయోగించినపుడు ఒకసమయమున రూక్షాధిక్యముచే స్నేహము బైటవెడలకయుండియు పైజెప్పిన యుపద్రవముల గల్గింపక యుండును. అట్టిస్నేహము పూర్తిగ వెడలకున్నను, కొంచెము నిలిచి కొంచెము వెడలినను పైజెప్పిన స్తంభనము నొప్పి మున్నగుబాధల గల్గింపకున్నచో బుద్ధిమంతుడగు వైద్యుడు వానికి చికిత్సచేయక యుపేక్షించి యుండవలెను. (అట్టి స్నేహము జీర్ణమై రూక్షతను హరించి వాతమును హరించును కావున చికిత్స అనవసరమని భావము.)

ఈవిషయము సుశ్రుతమున నిట్లు చెప్పబడినది. "అహోరాత్రాదపి స్నేహః ప్రత్యాగచ్ఛన్న దుష్యతి, కుర్యాద్వస్తిగుణాంశ్చాపి జీర్ణస్త్వల్పగుణో భవేత్" (సు. చి. అ. 38) ఒకయహోరాత్రమునకు పిమ్మట స్నేహము బైటవెడలినను ప్రత్యవాయము లేదు. వస్తిప్రయోగమున గల్గవలసినసుగుణములు కల్గును. ఒకవేళ నయ్యది పూర్తిగ బైట వెడలకయే జీర్ణమైన యెడల గుణములు మాత్రము స్వల్పముగ నుండును అని యర్థము.

అనువాసనవస్తియందు స్నేహము వెడలిన పిదప నాహారనియమము, జలపానము

మూ. యుక్త(ముక్త) స్నేహం ద్రవోష్ణం చ లఘుపథ్యోపసేవనమ్,
భుక్తవాన్ మాత్రయా భోజ్యం అనువాస్యస్త్ర్యహాత్ త్ర్యహాత్
ధాన్యనాగరసిద్ధం వా తోయం దద్యాద్విచక్షణః,
వ్యుషితాయ నిశాం కల్యం ఉష్ణం వా కేవలం జలమ్. 83

వ్యా. అనువాసనవస్తిజేసినపుడు పైజెప్పినస్నేహవ్యాపత్తులు లేక స్నేహము చక్కగ పనిచేసి బైటవెడలినపిమ్మట ద్రవముగను, సుఖోష్ణముగను (ఉష్ణవీర్యములగు ద్రవ్యములతో కూడినదియు), తేలికగ జీర్ణమగునదిగను, హితకరములగు వ్యంజనములతో కూడినదిగనుండు ఆహారమును మితమైనపరిమాణముతో భుజించవలెను. ఇత్తెరంగున పథ్యాహారము చేయుచు మూడుదినములకొకతూరి యనువాసనమును చేసికొనవలెను. భోజనముచేసి పిమ్మట ననువాసనమును చేయవగును. మరియు అనువాసనము చేసిన నాడు

రాత్రి యాహారములేకుండ గడపిన పిదప మఱునటినాడుదయమున దనియాలను శుంఠిని చేర్చి కాచబడినజలమునైనను, కేవలము వేడిగకాచబడిన వేడినీళ్లనైనను త్రాగించవలెను.

### ఉష్ణోదకపానగుణము.

మూ. స్నేహోఽజీర్ణం జరయతి శ్లేష్మాణం తద్భినత్తి చ,
మారుతస్యానులోమ్యం చ కుర్యాదుష్ణోదకం నృణామ్. ౪౪
వమనే చ విరేకే చ నిరూహే సానువాసనే,
తస్మాదుష్ణోదకం దేయం వాతశ్లేష్మోపశాన్తయే. ౪౫

వ్యా. వేడినీళ్లు కోష్ఠమునచిక్కి జీర్ణముకాకుండు స్నేహశేషమును జీర్ణింపజేయును. కఫమును భేదించును. వాతమును అనులోమముగ సంచరింపజేయును. కావున వమనమునైనను, విరేకమునైనను, నిరూహ-అనువాసనవస్తులనైనను సేవించునపుడు వాతకఫములు హరించుటకై యుష్ణోదకము త్రాగుట చాలమంచిది.

మూ. రూక్షనిత్యస్తు దీప్తాగ్నిః వ్యాయామీ మారుతామయీ,
వఙ్క్షణశ్రోణ్యుదావర్తవాతార్తాశ్చార్తాః దినే దినే. ౪౬
ఏషాం చాశు జరాం స్నేహః యాత్యంబు సికతాస్వివ,
అతోఽన్యేషాం త్ర్యహాత్ప్రాయః స్నేహం పచతి పావకః. ౪౭

వ్యా. ఎల్లప్పుడును రూక్షమైనశరీరము కలవాడును, లేక ప్రతిదినము, రూక్షపదార్థముల సేవించువాడును, మిక్కిలి తీవ్రమైనజాఠరాగ్ని కలవారును, దేహపరిశ్రమము చేయువాడును, వాతవ్యాధిపీడితుడును, గెజ్జలయందును పిరుదులయందును వాతముచేరియున్నవాడును, ఉదావర్తవాతపీడితుడును, ప్రతిదినమునందును అనువాసనవస్తి చేయదగినవారు. పైజెప్పినవారికి స్నేహము నుపయోగించినచో నయ్యది (యిసుకలోనుంచబడిననీళ్లు శీఘ్రముగ నింకి పోవునట్లు) వెంటనే జీర్ణమగును. (కావున వారికి ప్రతిదినమునం దనువాసనవస్తిని ప్రయోగింపదగునని భావము.) పైజెప్పినవారుదక్క తక్కినవారికి మూడుదినములకు స్నేహమును జాఠరాగ్ని జీర్ణింపజేయ సమర్థముగనుండును, కావున వారికి మూడుదినములకొకతూరి అనువాసనవస్తిని ప్రయోగింపవలెనని భావము.

ఈవిషయమునే సుశ్రుతు లిట్లుపదేశించిరి:—"రూక్షస్య బహువాతస్య స్నేహవస్తిం దినేదినే, దద్యాద్వైద్యస్తతోఽన్యేషాం అగ్న్యాబాధభయాత్ త్ర్యహాత్" (సు. చి. అ. ౩౭) మఱియు జాఠరాగ్ని ఆమాశయమునకు చేరియుండును. అయ్యది

క్రిందిభాగమున పక్వాశయమునందలిస్నేహమును ఎట్లు పచించును? అన్నచో జాఠ రాగ్నికి సమీపించియుండు అవయవములసంబంధముచేత ఆమాశయమునందలి స్నేహనం బును జీర్ణమగునని యాచార్యసమ్మతాభిప్రాయము.

ఇచ్చట "ప్రాయః త్ర్యహాత్" అనుటవలన స్నేహము మూడుదినములకును జీర్ణముకానియెడ కాలాంతరమున (స్నేహము జీర్ణమైనపిదప) అనువాసనము చేయదగునని తెలిసెడి, కావుననే కల్పనాసిద్ధియందు "పరతస్త్ర్యహే వా ద్వ్యహేఽనువాస్యోఽహాని పఞ్చమే వా" (సి. అ. ౧) అని చెప్పబడినది.

అనువాసనవస్తి విషయమై కొన్నినియమములు.

మూ. న త్వామం ప్రణయేత్ స్నేహం సహ్యాభిష్యన్దయేద్గుదం,
సావశేషం చ కుర్వీత వాయుశ్శేషే హి తిష్ఠతి. ౪౮
న చైవ గుదకణ్ఠాభ్యాం దద్యాత్ స్నేహమనన్తరం,
ఉభయస్మాత్ సమం గచ్ఛన్ వాతమగ్నిం చ దూషయేత్. ౪౯
(సంగతస్సహ్యుభయతః వాతాగ్నీ దూషయేత్సమం),

వ్యా. అగ్నిసంబంధముచే పక్వముగాక పచ్చిగనుండు ఘృతతైలాది స్నేహములను అనువాసనవస్తి కుపయోగింపదగదు. పచ్చిగనుండుస్నేహము గుదమున ద్రవమును కల్గించును, (కావున నుపయోగింపందగదు.) వస్తిప్రయోగము చేయునపుడు స్నేహమును పూర్తిగ లోనికి ప్రవేశింపజేసినచో వస్తిలోః పూరింపబడియుండు వాతముకూడ లోనికి ప్రవేశించును, కావున స్నేహము కొంచము మిగిలియుండునపుడే విరమించవలెను. మరియు స్నేహమును అనువాసనమూలముగ గుదమునుండియు, పానరూపముగ కంఠమునుండియు నొకేసమయమున ప్రయోగింపంజనదు. అట్లుచేసినచో రెండుమార్గములనుండియు లోన ప్రవేశించుస్నేహము లొకటిగ కలిసి, యేకకాలముననే వాతమును ప్రకోపింపజేసి జాఠ రాగ్నిని చెరచును. (కావున రెండుమార్గములనుండియు నేకకాలమున స్నేహమును ప్రవేశింపజేయకూడదు.)

{ అనువాసననిరూహవస్తులలో నొక్కదానినే యుపయోగింపంజనదని నిషేధము. }

మూ. స్నేహవస్తిం నిరూహం వా నైకమేవాఽతిశీలయేత్,
ఉత్క్లేశాఽగ్నివధౌ స్నేహాత్ నిరూహాత్పవనాద్భయమ్. ౫౦

తస్మాన్నిరూఢస్సంస్నేహ్యః నిరూఢశ్చానువాసితః,
స్నేహశోధనయుక్త్యైవం వస్తికర్మ త్రిదోషనుత్. ౫౧

వ్యా. స్నేహవస్తి (అనువాసనవస్తి) నైనను నిరూహవస్తినైనను ఒకదానినే యధికముగ ప్రయోగింపందగదు. అట్లుచేసినచో స్నేహవస్తి నధికముగ నుపయోగించుట వలన నయ్యది పిత్తకఫముల రేపెట్టి జాఠరాగ్నిని నశింపజేయును. నిరూహవస్తి నధికముగ నుపయోగించుటవలన (శోధనాతియోగమునంజేసి) వాతము ప్రకోపమునొంది కష్టపెట్టును. కావున నిరూహవస్తిచేసినపిదప అనువాసనవస్తిచే స్నిగ్ధముగ జేయవలెను. అనువాసనవస్తిచే స్నిగ్ధుడైనవానికి మరల నిరూహవస్తి నుపయోగింపవలెను. ఇత్తెరంగున స్నేహశోధనవస్తులను యుక్తియుక్తముగ నొకదానివెనుక నొకదానిని ప్రయోగించినచో నట్టివస్తికర్మ త్రిదోషముల హరించి సమస్థితికి దెచ్చును.

ఇచ్చట నీవివరము నెరుంగునది:—స్నేహనమునకై యనువాసనవస్తి విధింపబడినది. దానినే అధికముగ ప్రయోగించినయెడ స్నేహాతియోగమునంజేసి కఫపిత్తములు రెండు నుత్కటములై జఠరాగ్ని మందగించును. నిరూహవస్తి శోధనమునకై విధింపబడినది. దాని నొక్కదానినే యధికముగ నుపయోగించునెడ శోధనాధిక్యమునంజేసి వాతము ప్రకోపము నొందును, కావున తొలుత స్నేహనమునకై యనువాసనము నుపయోగించి, పిమ్మట శోధనమునకై నిరూహవస్తి నుపయోగించినచో వాతపిత్తకఫములను మూటిని హరించి సమస్థితికి దెచ్చును; కావున నిరూహానువాసములలో నొక్కదానినే యధికముగ నుపయోగించక మార్చి రెంటిని ఉపయోగించవలెనని భావము.

## మాత్రావస్తికి అర్హులు, దానిపరిమాణము.

మూ. కర్మవ్యాయామభారాధ్వయా(పా) నస్త్రీకర్శితేషు చ,
దుర్బలే వాతభగ్నే చ (రుగ్ణేచ) మాత్రావస్తిః సదా మతః. ౫౨
యథేష్టాహారచేష్టస్య సర్వకాలం నిరత్యయః,
హ్రస్వాయాః స్నేహమాత్రాయా మాత్రావస్తిః సమో భవేత్.

వ్యా. పనులచేయుట, శరీరవ్యాయామముచేయుట, భారమును మోచుట, త్రోవ నడచుట, అశ్వాదివాహనములపై సవారిచేయుట, (మద్యపానము), స్త్రీసంభోగము అను నీపనులచే శరీరము కృశించినవారును; బలహీనులును, వాతవ్యాధిపీడితులును, మాత్రావస్తిని సేవింప నర్హులుగ నుందురు. అట్టివారికెల్లప్పుడును మాత్రావస్తిని చేయుటకు ఆటంకము లేదు. ఈవస్తివిషయమై ఆహారవిషయమునను, చేష్టావిషయమునను యెట్టి నిర్బంధ

మును లేక స్వేచ్ఛగ నుండతగును. కావున నియ్యది యెల్లప్పుడు సేవించినను బాధకము కానేరదు. మరియు నీవస్తియందును స్నేహపరిమాణము స్వల్పముగ నుండుటవలన త్రిదోషములను రేపెట్టక సమస్థితినుంచును.

స్నేహముయొక్క మాత్రాభేదములు సూత్రస్థానమున నిట్లుపదేశింపబడినది:— "అహోరాత్రమహః కృత్స్నం అర్ధాహం చ ప్రతీక్ష్యతే, ప్రధానా మధ్యమా హ్రస్వా స్నేహపాత్రా జరాం ప్రతి' ఇతి తిస్రః సముద్దిష్టాః మాత్రాః స్నేహస్య మానతః." (సూ. అ. 13 శ్లో. 29) ఈవాక్యమునుబట్టి పగలు రెండుజాములకు జీర్ణమగునంతపరిమాణము గలస్నేహము హ్రస్వమాత్ర యనబడును. అట్టిమాత్రచే నుపయోగించుటవలన నియ్యది మాత్రావస్తి యనబడును. స్వల్పమాత్రవలననే ఇయ్యది నిర్బాధకముగనుండి గుణకరమగు నని భావము.

(తంత్రాంతరమున ఈయనువాసనవస్తి మాత్రాభేదపరిమాణమును విభజించి ఇట్లు చెప్పబడినది. "షట్పలీ తు భవేత్ జ్యేష్ఠా మధ్యమా త్రిపలీ భవేత్, కనీయసీ సార్ధపలా త్రిధా మాత్రానువాసనే" అనువాసనవస్తియందు స్నేహముయొక్క మాత్ర ఆరుపలములు ఉత్తమమనియు మూడుపలములు మధ్యమమనియు ఒకటిన్నరపలము హ్రస్వమనియు యర్థము. అనువాసనవస్తినే స్వల్పమాత్రముగ స్నేహమును చేర్చినచో నదియే మాత్రావస్తియని యెరుంగునది.)

## మాత్రావస్తిగుణము.

మూ. బల్యం సుఖోపచర్యం చ సుఖం సృష్టపురీషకృత్,
స్నేహమాత్రావిధానం హి బృంహణం వాతరోగనుత్. ౫౮

వ్యా. పైజెప్పబడిన మాత్రావస్తి బలకరమైనది. సుఖముగా నాచరింపదగినది. (ఆహారవిహారనియమము లేమింజేసి యాచరించుటకు సుఖకరమని భావము.) పురీషమును శరీరమున కాయాసమును గలిగించక బైటవెడలించును. స్నేహమాత్ర కొద్దిగనుండుటవలన వాతమును హరించుచు శరీరమునకు పుష్టిని కల్గించును.

## అధ్యాయోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

వాతాదీనాం శమా యోక్తాః ప్రవరాః స్నేహవస్తయః,
తేషాం చాజ్ఞప్రయుక్తానాం వ్యాపదః సచికిత్సితాః. ౫౯

ప్రాగ్భోజ్యం స్నేహవస్తేర్యత్ ధ్రువం యేఽర్హాః త్ర్యహాచ్చ యే,
స్నేహవస్తివిధిశ్చోక్తో మాత్రావస్తివిధిస్తథా. ౫౬

వ్యా. వాతాదిదోషములు ననుసరించి వేరువేరుగా చేయదగినశ్రేష్ఠములగు స్నేహా
సన) వస్తులును, అట్టివస్తులు తెలివితక్కువగానుండు వైద్యునిచే నుపయోగింప
వలన సంభవించువస్తివ్యాపత్తులును, అట్టివ్యాపత్తులకు చేయవలసినచికిత్సలును,
యోగమునకు ముందుచేయదగిన భోజననియమములును, స్నేహవస్తిని నియతముగ
గింపదగినవారి నిర్దేశంబును, మూడుదినములకొకతూరి వానినుపయోగింపతగిన
ర్దేశంబును, స్నేహవస్తికి సంబంధించినవిశేషవిధులును, మాత్రావస్తివిధియు, దాని
ములును, ఈవిషయమునంతయు స్నేహవ్యాపత్సిద్ధియను నీయధ్యాయమున వివరింప

—అధ్యాయసమాప్తి.—

త్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే స్నేహవ్యాపత్సిద్ధిర్నామ
చతుర్థోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగుచరక
తయను నాయుర్వేదగ్రంథమునందలి దృఢబలసంపూరితమైన సిద్ధిస్థానమున స్నేహ
త్సిద్ధియనునది చతుర్థాధ్యాయము సమాప్తము.



## పంచమాధ్యాయము

అవతరణిక:—పైయధ్యాయముచే స్నేహవస్తివ్యాపత్సిద్ధి చెప్పబడినది. అట్టి
మును ప్రయోగించుటకు సాధనమైన నేత్ర(వస్తికి చేరియుండుగొట్టం)మును, వస్తి
మును, విధ్యుక్తప్రకారమునకు వ్యత్యస్తముగనుంచి ప్రయోగించుటచే గల్గువ్యాపత్తు
తొలగించి సరియైనపద్ధతి నుపయోగించువిధానమును దెలుపునట్టి నేత్ర-వస్తివ్యాప
యనునధ్యాయ ముపక్రమింపబడును.

—అధ్యాయప్రారంభము.—

అథాతో నేత్రవస్తివ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. స్నేహవ్యాపత్సిద్ధిని చెప్పినపిదప వస్తికర్మయందు ఉపయోగింపబడునేత్రము (గొట్టము) యొక్కయు, వస్తి (ఔషధము నింపుటకై నిర్ణయించుకొనిన మూత్రపు సంచిమొదలగు) యంత్రముయొక్కయు అన్యథోపయోగమువలన కల్గువ్యాపత్తులను దాని ప్రతివిధానమును బోధించునట్టి నేత్రవస్తివ్యాపత్సిద్ధియను నధ్యాయమును భగవంతుడగు నాత్రేయు డుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

అధ్యాయవిషయనిర్దేశము.

మూ. అథ నేత్రాణి వస్తీంశ్చ శృణు వర్జ్యాని కర్మసు,
నేత్రస్యాజ్ఞ ప్రణీతస్య వ్యాపదః సచికిత్సితాః. 3
(దోషాంశ్చ సచికిత్సితాన్.)

వ్యా. వస్తివ్యాపత్తులు మున్నగువానిని చెప్పినపిదప కర్మానర్హములగుటవలన విడువందగినవస్తినేత్రములను, వస్తులను (వస్తియంత్రములను,) అట్టివస్తియంత్రమునకు చేరియుండుగొట్టమును విధివిహితమునకు వ్యత్యస్తముగ జ్ఞానహీనులగువైద్యు లుపయోగించుటచే గల్గువ్యాపత్తులను, అట్టివ్యాపత్తులకు తగినచికిత్సితములను వివరించి చెప్పెద వినుము.

అగ్రాహ్యవస్తినేత్రములు, వానిదోషములు.

మూ. హ్రస్వం దీర్ఘం తను స్థూలం జీర్ణం శిథిలబన్ధనం,
పార్శ్వచ్ఛిద్రం తథా వక్రం అష్టౌ నేత్రాణి వర్జయేత్ ౪
అప్రాప్త్యతిగతిక్షోభకర్షణక్షణనస్రవాః,
గుదపీడా గతిర్జిహ్మా తేషాం దోషా యథాక్రమమ్. ౫

వ్యా. మిక్కిలి హ్రస్వముగను, దీర్ఘముగను, సన్నగను, స్థూలముగను, ప్రాతదిగను, సడలినకట్టు కలదిగను, ప్రక్కలయందు రంధ్రము కలదిగను, వంకరగను నుండు వస్తినేత్రము (గొట్టము) విడువందగును.

అందు హ్రస్వమయినచో, లోనికి ప్రవేశింప నోపదు, దీర్ఘమయినచో మిక్కిలి లోపలికి ప్రవేశించును. సన్నగిలియున్నచో గుదస్థానమున నలుప్రక్కల పోవుచుండును. స్థూలమయినచో గుదస్థానమున నొరసికొనును. ప్రాతదియయినచో గీచుకొనును. బంధనము (కట్టు) శిథిలముగనున్నచో జారిపోవును. ఛిద్రము (రంధ్రము) కల్గియున్నచో

షము కారిపోవును. గుదస్థానమున బాధ కల్గును. వంకరగనున్నచో వంకరగనే ప్రవేశించునుకావున పైజెప్పినయెనిమిదిదోషములు గలవస్తినేత్రము నుపయోగింప

## అగ్రాహ్యావస్తులు, వానిదోషములెనిమిదియు.

విషమం మాంసలచ్ఛిద్ర (న్న) స్థూలజాలికవాతలాః,
స్నిగ్ధః క్లిన్నశ్చ తా నష్టా వస్తీః కర్మసు వర్జయేత్. ౬
గతివైషమ్య - విస్రత్వ - స్రావ - దౌర్గ్రాహ్య - నిస్రవాః,
ఫేనిలచ్యుత్యధార్యత్వం వస్తేః స్యుర్వస్తిదోషతః. ౭

వ్యా. వ్యత్యస్తముగనుండుట, మాంసముతో కూడియుండుట, చినిగియుండుట, లముగ నుండుట, సన్ననిరంధ్రములు కల్గి యుండుట, వాతముతో కూడియుండుట, కల్గియుండుట, తడిసియుండుట, అనునీ యెనిమిదిదోషములుగలవస్తి గ్రహింపదగదు.

అందు వ్యత్యస్తముగ నున్నచో వక్రగతి కల్గియుండును. మాంసముతో డియున్నయెడ దుర్గంధముగ నుండును. చినిగి యున్నచో ఔషధము కారిపోవును. లముగ నున్నచో పట్టుకొనుటకు కష్టముగ నుండును. సన్నని రంధ్రములున్నచో షధము స్రవించును. వాతము కల్గియున్నచో ఔషధము నురుగుకట్టును. జిడ్డు కల్గి న్నచో జారిపోవును. చెమ్మకల్గియున్నచో పట్టుకొనుటకు వలనుపడదు. (కావున షధమును నింపుటకై నిర్ణయించుకొనబడినవస్తియంత్రము పైజెప్పబడిన యెనిమిది షములలో నేదోషమున్నను గ్రహింపదగదని భావము.)

## వస్తిప్రయోగముచేయు వైద్యునిదోషములు.

రా. సవాతాతిద్రుతోత్క్షిప్తతిర్యగుల్లుప్తకమ్పితాః,
అతిబాహ్యగమన్దాతివేగదోషాః ప్రణేతృతః. ౮

వ్యా. వస్తియంత్రమును గాలి చేరియుండుట, (ఈదోషము వస్తిలోనుండు లిని బైట వెడలించకున్నను ఔషధమును నిశ్శేషముగ ప్రయోగించినను కల్గును. శీఘ్రముగనైనను, పైకి యెత్తియైనను అడ్డముగనైనను, వస్తిని పట్టుకొని ప్రయో ంచుట, వస్తిని ఒకేతూరి నొక్కకనిలిపినిలిపి నొక్కుట, వస్తిని కదలించుట, వస్తి త్రమును లోనికి పూర్తిగ ప్రవేశింపనీయక గుదమునకు వెలుపటనేయుంచుట, మందముగ నను, అతివేగముగనైనను ప్రయోగించుట ఇవియన్నియు వస్తికర్మను చేయువైద్యుని లన కల్గుదోషములు.

### వస్తియంత్రమును బిగించక యుపయోగించిన గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. అనుచ్ఛ్వాస్య చ బద్ధే వా దత్తే నిశ్శేష ఏవ వా,
ప్రవిశ్య కుపితో (క్షుభితో) వాయుః శూలతోదకరో భవేత్.
తత్రాభ్యఙ్గో గుదే స్వేదో వాతఘ్నాన్యశనాని చ,

వ్యా. వస్తియంత్రమును బిగించక బంధించినను, ఔషధమును నిశ్శేషముగ ప్రవేశింపజేసినను వాయువు లోపల ప్రవేశించి ప్రకోపము నొంది శూలనొప్పిని పోటును కల్గించును. అట్టియెడ తైలాదులచే నభ్యంగనంబును గుదస్థానమును కాపడముబెట్టి చెమట వెడలించుటయు, వాతహరములగు నాహారముల దినుటయు యుక్తముగ నుండును.

### ద్రుతప్రణీతాదిదోషములచే గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. ద్రుతం ప్రణీతే నిష్కృష్టే సహసోత్క్షిప్త ఏవ వా. ౧౦
స్యాత్కటీగుదజఙ్ఘార్తిర్వస్తిస్తమ్భోరువేదనాః,
భోజనం తత్ర వాతఘ్నం స్నేహాః స్వేదాః సవస్తయః. ౧౧

వ్యా. వస్తినేత్రమును వేగముగ ప్రవేశపెట్టినను, వేగముగ లాగినను, వస్తిని ఊర్ధ్వముగ ప్రవేశపెట్టినను, కటిప్రదేశమునందును గుదస్థానమునను పిక్కలయందును నొప్పి కల్గును. మూత్రాశయము స్తంభించును తొడలయందు నొప్పి పుట్టును. అట్టియెడ వాతహరమగునాహారమును భుజించుటయు, స్నేహస్వేదవిధుల జేయుటయు, వాతహరములగువస్తుల ప్రయోగించుటయు నుచితమగు చికిత్సయగును.

### వస్తి యూర్ధ్వముగ బోవుటకు కారణము, దానిచికిత్స.

మూ. తిర్యగ్వల్యావృతే ద్వారే బద్ధే వాపి న గచ్ఛతి,
నేత్రే తదృజు నిష్కృష్య సంశోధ్య చ ప్రవేశయేత్. ౧౨

వ్యా. వస్తినేత్రమును (గొట్టమును) గుదమునం దడ్డముగ ప్రవేశింపజేసినను గుదవళులచే వస్తినేత్రరంధ్రము అడ్డగింపబడును. లేక గొట్టముయొక్క ద్వారమునందేదేని యడ్డుపడినను, ఈరెండుకారణములచే వస్త్యౌషధము లోపల ప్రవేశింపనేరదు. అట్టియెడ వస్తినేత్రమును చక్కగ లాగి అండడ్డపడియుండుదానిని తీసివైచి మరల వక్రములేకుండ ప్రవేశింపజేయనగును.

## వస్తిని ప్రయోగించునపుడు నడుమ నిలిపినచో గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. పీడ్యమానేఽన్తరా ముక్తే గుదే ప్రతిహతోఽనిలః,
ఉరశ్శిరోఽర్తిమూర్వోశ్చ సదనం జనయేద్బలీ. ౧౩
వస్తిస్స్యాత్తత్ర బిల్వాదిఫలశ్యామాదిమూత్రవాన్,

వ్యా. వస్తి ప్రయోగముచేయునపుడు నడుమ కొంతసేపు నిలిపి యూరకుండి మరల యంత్రమును నొక్కినయెడ గుదమున వాతము ప్రతిహతమై వృద్ధినొంది, రొమ్మునందును శిరంబునను నొప్పిని కల్గించును. తొడలు కృశత నొందును. అట్టియెడ బిల్వాది (దశమూల) గణద్రవ్యములను, త్రివృత్తు మున్నగువిరేచనగణద్రవ్యములను మ్రంగకాయలను చేర్చి సిద్ధముచేయబడినదియు గోమూత్రమును చేర్చినదియు నగువస్తిని ప్రయోగించవలెను. (ఇచ్చట "శ్యామా త్రివృ" అని కల్పస్థానమున జెప్పబడినవిరేచనగణమును గ్రహించునది).

## వస్తినేత్రకంపనముచే గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. స్యాద్దాహో దవథుశ్శోఫః కమ్పనాభిహతే గుదే. ౧౪
కషాయమధురాశ్శీతాః సేకాస్తత్ర సవస్తయః,

వ్యా. వస్తిప్రయోగముచేయునపుడు వైద్యుడు చేతిని కదలించుటచే గుదస్థానమున నభిఘాతము కల్గినపుడు మంటయు, వణకును, శోఫము కల్గును. అట్టియెడ కషాయ-మధురరసంబులును శీతవీర్యంబులునగు క్వాథాదులచే తడుపుటయు వస్తిప్రయోగించుటయు ప్రశస్తము.

## ప్రమాణాధికముగ వస్తినేత్రమును ప్రవేశింపజేయుటవలన గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. అతిమాత్రప్రణీతేన నేత్రేణ క్షణనాద్వలేః. ౧౫
స్యాత్ సార్తిదాహనిస్తోదగుదవర్చః ప్రవర్తనం,
తత్ర సర్పిః పిచుః క్షీరం పిచ్ఛావస్తిశ్చ శస్యతే. ౧౬

వ్యా. వస్తినేత్రమును ప్రమాణాధికముగ ప్రవేశింపజేసినయెడ గుదవళులయందు రాపిడి కల్గి మంటయు పోటును నొప్పియు కల్గి, మలము గుదమునుండి మిగుల కష్టముతో వెడలును. అట్టియెడ నేతితో తడపబడినవ్రత్తిని గుదస్థానమున నుంచవలెను. క్షీరమును పిచ్ఛావస్తిని ఉపయోగించుట చాలప్రశస్తము. (ఇచ్చట స్థలాంతరమున చెప్పబడు పిచ్ఛావస్తివిధానము నెరుంగునది).

వస్తియంత్రమును మెల్లగ ప్రవేశింపజేయుటవల్ల గల్గువ్యాపత్తులు, వానిచికిత్స.

మూ. న భావయతి (న వా వహతి) మన్దస్తు బాహ్యస్త్వాశు నివర్తతే,
స్నేహస్తత్ర పునస్సమ్యక్ ప్రణేయస్సిద్ధిమిచ్ఛతా. ౧౭

వ్యా. వస్తిని మెల్లమెల్లగ ప్రవేశపెట్టినయెడ ఔషధము లోపల (పక్వాశయమున) ప్రవేశింపక బైటనుండియే వెలువడును. అట్టియెడ మరల వస్తిని చక్కగ ప్రయోగించి స్నేహమును ప్రవేశింపజేయవలెను.

అతిపీడనమున గల్గువ్యాపత్తు, దానిచికిత్స.

మూ. అతిప్రపీడితః కోష్ఠే తిష్ఠత్యాయాతి వా గలం,
తత్ర వస్తిర్విరేకశ్చ గలపీడాదికర్మ చ. ౧౮

వ్యా. వస్తిక్వాథాదులను అతివేగముతో తీవ్రముగ ప్రవేశింపజేసినచో ఔషధము పక్వాశయమును దాటి కోష్ఠమున ప్రవేశించును ఒకసమయమున నూర్ధ్వభాగమున జేరి కంఠము నాసారంధ్రములు మున్నగుద్వారములనుండి బైటవెడలును. అట్టియెడ వస్తిప్రయోగంబును విరేచనంబును హితముగ నుండును. ఊర్ధ్వముగ వెడలినప్పుడు పై యధ్యాయమున జెప్పబడిన కుత్తుక బిగబట్టుట, వమనచికిత్స మున్నగునవి యుక్తముగ నుండును.

ఇచ్చట పైయధ్యాయమున అభుక్తాదికారణములచే గల్గువ్యాపత్తునకు జెప్పినరీతి గనే అతిప్రపీడనమునను వ్యాపత్తు కల్గును. అయినను కారణాంతరమగుటవలన మరల నిర్దేశింపబడినది. 'గలపీడాదికర్మ చ' అనుచోట "కణ్ఠాదాగచ్ఛతః స్తమ్భ కణ్ఠగ్రహవిరేచనైః" (సి. అ. ౮) అనిచెప్పబడిన క్రియావిధానము నెరుంగునది.

అధ్యాయోక్త విషయసంగ్రహము.

తత్ర శ్లోకః:—

మూ. నేత్రవస్తి ప్రణేతౄణాం దోషానేతాన్ సభేషజాన్,
వేత్తి యస్తేన మతిమాన్ వస్తికర్మాణి కారయేత్. ౧౯

వ్యా. వస్తి నేత్రముయొక్కయు వస్తియొక్కయు వస్తిప్రయోగించు వైద్యుని యొక్కయు పొరబాటువలన సంభవించుదోషములును, దానగల్గు వ్యాపత్తులును, వాని చికిత్సలును ఈయధ్యాయమున వివరింపబడినవి. వీనినన్నిటిని చక్కగ నెరింగినవైద్యుడు వస్తికర్మను చేయ నర్హుడగును.

—— అధ్యాయసమాప్తి. ——

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే నేత్రవస్తివ్యాపత్సిద్ధిర్నామ
పఞ్చమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగుచరక సంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరితమైన సిద్ధిస్థానమున నేత్రవస్తివ్యాపత్సిద్ధి యను పంచమాధ్యాయము సమాప్తము.

---

## ష ష్ఠా ధ్యా య ము

అవతరణిక:—పైయధ్యాయములయందు స్నేహవ్యాపత్సిద్ధియు, నేత్రవస్తి వ్యాపత్సిద్ధియు చెప్పబడినవి. అట్టివ్యాపత్సిద్ధి ప్రస్తావవశమునంజేసి పిమ్మట వమన-విరేచన వ్యాపత్సిద్ధి (వమన-విరేచనవ్యత్యాసమున గల్గువ్యాపత్తులకు చేయదగినయుపాయముల దెలుపునట్టి) అధ్యాయము చెప్పబడును.

—— అధ్యాయోపక్రమము. ——

మూ. అథాతో వమనవిరేచనవ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. నేత్రవస్తి వ్యాపత్సిద్ధిని చెప్పినపిదప వమనవిరేచనములయొక్క అయోగాతి యోగములచే గల్గువ్యాపత్తులను, వానిచికిత్సితములను దెలుపునట్టి వమనవిరేచనవ్యాపత్సిద్ధి యనునధ్యాయమును భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికి న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

—— విషయనిర్దేశము. ——

మూ. అథ శోధనయోస్సమ్యక్ విధిమూర్ధ్వానులోమయోః,
అసమ్యక్కృతయోశ్చైవ దోషాన్ వక్ష్యామి సౌషధమ్. 3

వ్యా. పిమ్మట శరీరమునందలి యూర్ధ్వభాగశోధనము లగువమనములయొక్క, అధోభాగశోధనములగు విరేచనములయొక్కయు సమ్యగ్యోగవిధిని (వమనవిరేచనముల చక్కగ నుపయోగించవలసినపద్ధతిని తెలుపువిధానము ను), అట్టివమనవిరేచనములను

విధ్యుక్తవిధానము ననుసరింపక వ్యత్యస్తముగ నాచరించుటవలన గల్గుదోషములను, అట్టి దోషముల (వ్యాపత్తుల) యం దుపయోగింపదగిన యౌషధములను వివరముగ నీక్రింద చెప్పెదనని యర్థము.

వమనవిరేచనవిధి యింతకుమున్ను కల్పనాసిద్ధియందును ఉపకల్పనీయాధ్యాయమునను ఇతరస్థలములయందును అచ్చటచ్చట చెప్పబడినది; అయినను అచ్చట చెప్పబడని విషయము లిచ్చట కొన్ని చెప్పబడును. ప్రస్తావవశమునంజేసి కొన్ని యనుక్తవిషయములు కూడ నుండును.

సంశోధనయోగ్యకాలవిభాగ-నిర్ణయములు.

మూ. అత్యుష్ణవర్షశీతా హి గ్రీష్మవర్షహిమాగమాః,
తదన్తరే ప్రావృడాద్యాః తేషాం సాధారణాస్త్రయః. ౪

వ్యా. వత్సరాత్మకమగు కాలమునందలి గ్రీష్మ-వర్ష-హేమంతఋతువులు మూడును అత్యుష్ణమును, అతివర్షమును, అతిశీతమును వరుసగ కల్గియుండును. (గ్రీష్మఋతువునం దుష్ణంబును, వర్షఋతువునందు వర్షంబును, హేమంతఋతువున శీతంబును అధికముగనుండునని భావము.) ఈఋతువులకు నడుమనడుమనుండు ప్రావృట్-శరత్-వసంతఋతువులుమూడును వరుసగ ఉష్ణ-వర్ష-శీతంబులను సాధారణముగ కల్గియుండును. (ప్రావృట్కాలమున ఉష్ణంబును, శరత్కాలమున వర్షంబును, వసంతఋతువున శీతంబును మిక్కిలి యధికంబును తక్కువయుకాక సమస్థితినుండును. ఈమూడుఋతువుల యందు వరుసగ నుష్ణ-వర్ష-శీతంబులు అత్యుత్కటములుకాక సమస్థితినుండుటంజేసి యీఋతువులు మూడును సాధారణములని భావము.)

ఇచ్చట 'తదంతరే' అనుచోట గీష్మవర్షఋతువున రెంటికి నడుమనుండు ప్రావృదృతువును, వర్ష-హేమంతఋతువులకు నడుమనుండు శరదృతువును, హేమంత-గ్రీష్మములకు నడుమనుండు వసంతఋతువును గ్రహింపబడును.

సంశోధనమునకైన ప్రావృడాదిఋతువిభాగము.

మూ. ప్రావృట్ శుచినభౌ జ్ఞేయౌ, శరత్ ఊర్జ-సహౌ పునః,
తపస్యశ్చ - మధుశ్చైవ వసన్తః, శోధనం ప్రతి. ౫
ఏతానృతూన్ వికల్ప్యైవం దద్యాత్ సంశోధనం భిషక్,
స్వస్థవృత్తమభిప్రేత్య; వ్యాధౌ వ్యాధివశేన తు. ౬

వ్యా. ఆషాఢ-శ్రావణమాసములు రెండును ప్రావృట్కాలము. (వర్షమునకు ప్రారంభదశగ నుండుకాలము), కార్తీక-మార్గశీర్షమాసములు రెండునుచేరి శరదృతువు. (ఈఋతువున శీతము ప్రారంభదశయం దుండును.) ఫాల్గున-చైత్రమాసములు రెండును చేరి వసంతఋతువు. (ఈఋతువున ఉష్ణము ప్రారంభదశయందుండును కావున నియ్యది సమశీతోష్ణముగ నుండును.)

(ఇవిదక్క తక్కినమాసములలో వైశాఖజ్యేష్ఠమాసములు గ్రీష్మంబును, భాద్రపద-అశ్వయుజమాసములు వర్షఋతువును, పుష్యమాఘమాసములు హేమంతఋతువును నగునని యెరుంగునది.)

ఈజెప్పిన ప్రావృడాదిఋతువిభాగము స్వస్థవృత్తమున నుండువారికి సంశోధనమును గురించి చెప్పబడినది. (కావున పైజెప్పినవిధముగ ఫాల్గునాదిమాసములలో రెండేసి మాసముల నొక్కొక్కఋతువుగ విభజించి వసంత-గ్రీష్మ - ప్రావృట్, వర్ష - శరత్, హేమంతఋతువులుగ గల్పించి, అందు ఉష్ణ - వర్ష - శీతములకు సాధారణములైన ప్రావృట్ - శరత్ - వసంతఋతువుల మూటియందును స్వస్థవృత్తముగ నుండువారికి విధి ప్రకారము వమనవిరేచనాదిసంశోధనముల జేయనగునని భావము.)

ఇది స్వస్థతనుండువారికి శోధనమునకు నియమితకాలము. కావున వ్యాధిపీడితులై కేవలము సంశోధనముచేతనే వ్యాధి నివృత్తించుపరిస్థితి నుండువారికి, నిషిద్ధమైన గ్రీష్మాది ఋతువులయందునుకూడ నుచితముగ సంశోధనము చేయవచ్చును. (ఈవిషయము "వ్యాధౌవ్యాధివశేన తు" అనువాక్యముచే ననుగ్రహింపబడినది.)

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—ఋతువిభాగము రెండువిధములు. అందొకటి పైజెప్పినరీతిగ ఫాల్గునాదిమాసక్రమము ననుసరించి రెండేసిమాసము లొక్కొక ఋతువువంతున వసంత-గ్రీష్మ-ప్రావృట్-వర్ష-శరత్-హేమంతములుగ విభజింపబడినది. ఈఋతువిభాగము ప్రావృట్ - శరత్ - వసంతములయందు వమనాదిశోధనములజేయుట కనువుగ నిర్మింపబడినది. శోధనమునకు ఈవిభాగము ననుసరించియే రోగభిషగ్జితీయాధ్యాయమున "కాలః పునః... హేమన్తరేష్వితరే సాధారణలక్షణాః త్రయః ఋతవః ప్రావృట్-శరత్ - వసన్తాః...ఏవమేతే సంశోధనమధికృత్య షడ్విభజ్యన్తే ఋతవః" (విమా. అ. ౮ సూ. ౧౬౧) అనువాక్యముచే విధింపబడినది. మరియు "మాధవప్రథమే మాసి నభస్యప్రథమే పునః, సహస్యప్రథమే చైవ హారయేద్దోషసంచయమ్" (సూ. అ. ౭ శ్లో. ౪౬) అనువాక్యముచే, నవేగాన్ ధారణీయమునను సంశోధనమునకు పైజెప్పిన కాలమునే నిర్దేశించియున్నది.

రెండవది శిశిరాదిఋతువిభాగము. ఈవిభాగమున మాఘమాసము మొదలుజేసి రెండేసిమాసము లొక్కొకఋతువువంతున వరుసగ శిశిర - వసంత - గ్రీష్మ - వర్ష - శరత్ - హేమంతములను నారుఋతువులుగ గల్పింపబడును. ఈవిభాగమును వాగ్భటమున నిట్లు చెప్పియున్నది. "మాసైర్ద్వి సంఖ్యైః మాఘాద్యైః...నృణాం ప్రతిదినం బలమ్" (అ. హృ; సూ. అ. 3 శ్లో. ౧౨) ఈఋతువిభాగము ఋతుచర్యాది స్వస్థవృత్తముల నాచరించుటకును, బలనిర్ణయమునకును మధురాది షడ్రసోత్పత్తి విషయనిర్ణయమునకును గ్రహింపదగినది. రసోత్పత్తివిషయమై ఆత్రేయ భద్రకాప్యీయమున నిట్లు చెప్పబడినది. "ఏవమేషాం షణ్ణాం రసానాం షట్త్వముపపన్నం, ఊనాతిరేక......షడృతుకత్వాచ్చ కాలస్యోపపన్నో మహాభూతానాం ఊనాతిరేక విశేషః" (చ. సూ. అ. ౨౬ సూ. ౫౭) ఈవాక్యముచే రసోత్పత్తివిషయమై మాఘాదిమాసక్రమముగ శిశిరాదిఋతుకల్పనమునే చెప్పియున్నది. ఈవివరణమంతయు పైగనపరచిన స్థలములయందు మాచే విస్తరముగ జెప్పబడినది కావున నచ్చట జూచునది.

### వమనాదిశోధనముల వరుసగ జేయునపుడు నడుమ స్నేహస్వేద కర్తవ్యతానిర్ణయము.

మూ. కర్మణాం వమనాదీనాం అన్తరేష్వన్తరేషు చ,
(అన్తరే చాన్తరే పునః)
స్నేహస్వేదౌ ప్రయుఞ్జీత స్నేహం చాన్తే ప్రయోజయేత్. ౭

వ్యా. (పంచకర్మములకు పూర్వాంగముగ స్నేహస్వేదవిధులు చెప్పబడినవి. కావున స్నేహస్వేదవిధుల జేసినపిదప స్నిగ్ధస్విన్నశరీరునకు వమనాదికర్మలజేయుట విధ్యుక్తము.) అట్టివమనవిరేచనాది పంచకర్మముల జేయుతరి నొకదానినిచేసి వేరొకకర్మను జేయవలసినప్పుడు మరల నారెంటినడుమ మరల స్నేహస్వేదముల జేసియె యింకొకదాని నుపక్రమింపవలెను.(వమనవిధిచేసి, పిదప విరేచనమునైనను, విరేచనానంతరము వస్తివిధినైనను చేయవలసియున్నపుడు నడుమ స్నేహస్వేదవిధులజేసియే వేరొకవిధిని చేయవలెనుగాని మొట్టమొదట చేసిన స్నేహస్వేదములమాత్రము చరితార్థము కానేరదని భావము.)మరియు వమనాదిశోధనకర్మలను చేసి పూర్తియైనపిదప (సంశోధనముచే గల్గిన బడలిక శమించుటకై) మరల సంశమనీయస్నేహ ముపయోగింపవలెను.

### కొంచెముగ స్నేహనముచేసి విరేచనము చేయింపవలసినవారు.

మూ. విసర్పపిడకాశోథకామలాపాణ్డురోగిణః,

(కుష్ఠవీసర్పపిడకకామలాపాణ్డురోగిణః)
అభిఘాతవిషార్తాంశ్చ నాతిస్నిగ్ధాన్ విరేచయేత్. ౮

వ్యా. (కుష్ఠము) విసర్పము, ప్రమేహపిటిక, శోఫము, కామల, పాండురోగము, అనునీరోగములచే పీడింపబడువారికిని, అభిఘాతము నొందినవారికిని, విషపీడితులకును విరేచనము చేయవలసినప్పుడు వారిశరీరమును కొంచెముగ స్నిగ్ధముచేసి పిదప విరేచనమును చేయించవలెను.

స్నేహవిరేచనము నెవ్వరికి? రూక్షవిరేచన మెవ్వరికి?

మూ. నాతిస్నిగ్ధశరీరాయ దద్యాత్ స్నేహవిరేచనం,
స్నేహోత్క్లిష్టశరీరాయ రూక్షం దద్యాద్విరేచనమ్ ౯

వ్యా. కొంచెముగ స్నిగ్ధమైనశరీరము కలవానికి స్నేహముతోగూడిన విరేచనౌషధమును ఇయ్యవలెను.(కొంచెముగ స్నిగ్ధమైనశరీరము కలవానికి దోషములు స్వస్థానము నుండి చక్కగ సడలకుండును, కావున వానికి కొంచెము స్నిగ్ధముగనుండు ఔషధము నిచ్చినచో నయ్యది దోషములను చక్కగ వెడలింప సమర్థము కానోపదు, దానంజేసి అయోగవ్యాపత్తు కల్గును; కావున అట్టివానికి పూర్తిగ స్నిగ్ధమైన విరేచనౌషధము నియ్యవలెనని భావము.)

మరియు స్నేహాతియోగమునంజేసి మిక్కిలి యుత్క్లిష్టమగు శరీరము కలవానికి స్నేహవిరేచనము నిచ్చినయెడ నయ్యది దోషము లధికముగ సడలియుండినను, వానిని హరింప సమర్థముకానేరదు. దోషములు స్రోతస్సునందే యణగియుండును కావున రూక్షమైన విరేచనౌషధము నియ్యవలెను.

సంశోధనమున సమ్యగ్యోగోపపత్తి.

మూ. స్నేహస్వేదోపపన్నేన జీర్ణే మాత్రావదౌషధం,
ఏకాగ్రమనసా పీతం సమ్యగ్యోగాయ కల్పతే. ౧౦

వ్యా. విధ్యుక్తప్రకారము స్నేహస్వేదవిధుల సమ్యగ్యోగముచే స్నిగ్ధస్విన్నశరీరుడు, భుజంచినయాహారము జీర్ణమైనసమయమున క్రిందజెప్పబడురీతిగ స్వల్పపరిమాణము కలయౌషధమును నిశ్చలమైన మనస్సుకలవాడై సేవించిన నయ్యది సమ్యగ్యోగమును కల్గింప సమర్థమగును. (ఔషధమును సేవించువాడు మనసు నిల్కడలేక కామాదులయం దాసక్తమైయున్నయెడ వమనాదివేగముల నిరోధించును, దానంజేసి సంశోధనము చక్కగ గల్గనేరదు; కావున 'ఏకాగ్రమనసా' అని చెప్పబడినది.)

### స్నేహస్వేదవిధుల ప్రయోజనము.

మూ. స్నిగ్ధాత్పాత్రాద్యథా తోయం అయత్నేన ప్రణుద్యతే,
కఫాదయః ప్రణుద్యన్తే స్నిగ్ధాద్దేహాత్తథౌషధైః. ౧౧
ఆర్ద్రం కాష్ఠం యథా వహ్నిః విష్యన్దయతి సర్వతః,
తథా స్నిగ్ధస్య వై దోషాన్ స్వేదో విష్యన్దయేత్థ్సిరాన్. ౧౨
క్లిష్టం వాసో యథోత్క్లేశ్య మలః సంశోధ్యతేఽమ్భసా,
స్నేహస్వేదైస్తథోత్క్లేశ్య శోధ్యతే శోధనైర్మలః ౧౩
(క్షారోత్క్లిష్టే యథా వస్త్రే మలః శుధ్యతి వారిణా,
స్నేహస్వేదైః తథోత్క్లిష్టో దోషశ్శుధ్యతి శోధనైః)

వ్యా. స్నేహవిధులచే శరీరము స్నిగ్ధమైనయెడ అట్టిశరీరమునుండి (నూనె మున్నగువానిచే జిడ్డుకల్గిన పాత్రమునుండి జలమును స్వల్పప్రయత్నముతో పాత్రము నందు అంటుకొనక విడదీయుటకు వలనుపడువిధముగ) కఫాదిదోషములను వమనాది శోధనములచే సుఖముగ వెడలింప వలనుపడును. మరియు తడసినకొయ్యను నిప్పున కాచి విడచినచో అందలిద్రవమంతయు బైటఁ స్రవించువిధముగ స్నిగ్ధశరీరులకు స్వేదవిధి చేసినచో శరీరమున స్థిరముగ నాటియుండుదోషము లన్నియు సడలి స్రవింపజేయ వలనుపడును. మరియు పైజెప్పినరీతిగ స్నేహస్వేదవిధుల రెంటిచే శరీరమునందలి స్థిరముగ నాటియుండుదోషములు కఫాదిదోషములు స్వస్థానమునుండి చలించి గమనోన్ముఖ ములై యుండునపుడు సంశోధనముల నుపయోగించినచో, అట్టియౌషధములచేత (వస్త్రమునందు దృఢముగ నంటికొనియుండుమలినము క్షారప్రయోగముచే సడలి యగ్ని సంబంధముచే శిథిలమైయుండునపుడు జలముచే సులభముగ శుభ్రపరుపదగియుండునట్లు) కఫాదిదోషములను సులభముగ వెడలింపదగియుండును.(కావున సంశోధనము చేయవలసిన వారికి తొలుత స్నేహవిధి చేసినయెడ దోషములను మృదువుగజేయును. పిమ్మట స్వేదవిధి చేసినయెడ శిథిలమై స్వస్థానమునుండి చలించును అట్టిగమనోన్ముఖము లయినదోషములను శోధనము సులభముగ వెడలింప సమర్థమగునని భావము. ఈయభిప్రాయము చేతనే ''స్నేహ స్వేదోపపన్నేన'' అని నిర్దేశింపబడినది.)

### ఆహారము జీర్ణముకానియపుడు సంశోధనము త్రాగినచో గల్గులక్షణములు.

మూ. అజీర్ణే వర్ధతే గ్లానిః విబన్ధశ్చాపి జాయతే,
పీతం సంశోధనం చైవ విపరీతం ప్రవర్తతే. ౧౪

వ్యా. భుజింపబడినయాహారము జీర్ణముకాకుండునపుడు సంశోధనౌషధము సేవించి నచో బడలిక యధికమగును. దోషము బైటవెడలక బంధింపబడును. లేక వ్యత్యస్తముగ వెడలును. (వమనౌషధము విరేచనంబుగను, విరేచనౌషధము వమనముగను విరుద్ధముగ వెడలునని భావము.) ఇది "జీర్ణే" అనుదానికి వ్యతిరేకదృష్టాంతము.

మాత్రావదౌషధగుణములు.

మూ. అల్పమాత్రం మహావేగం బహుదోషహరం సుఖం,
లఘుపాకం సుఖాస్వాదం ప్రీణనం వ్యాధినాశనమ్. ౧౫
అవికారి చ వ్యాపత్తౌ నాతిగ్లానికరం చ యత్,
గన్ధవర్ణరసోపేతం విద్యాన్మాత్రావదౌషధమ్. ౧౬

వ్యా. స్వల్పమైన పరిమాణముకలదియు, అట్లైనను మిక్కిలివేగముతో పనిచేయు నదియు, సుఖముగనే ప్రబలమైనదోషములను హరించునదియు, తేలికగ జీర్ణమగునదియు, నోటికి సుఖమైన రుచికల్గినదియు, రోగికి యిష్టమయినదియు, వ్యాధులను హరించు నదియు, వ్యాపత్తుకల్గినను వికారమును చేయకుండునదియు, స్వల్పముగ బడలికను కల్గించు నదియు, ప్రశస్తమైన గంధ-వర్ణ-రసములు కల్గినదియు నగునౌషధము "మాత్రావత్" అని చెప్పబడును. (ఇయ్యది "మాత్రావదౌషధవమ్" అనుదానికి వివరణము.)

ఔషధసేవనసమయమున మనస్సున కేకాగ్రత యావశ్యకము.

మూ. విధూయ మానసాన్ దోషాన్కామాదీనశుభోదయాన్
(కామక్రోధభయాదికాన్),
ఏకాగ్రమనసా పీతం సమ్యగ్యోగాయ కల్పతే ౧౭

వ్యా. కామము, క్రోధము, భయము, లోభము మున్నగు మనస్సునకు సంబంధించిన చెడ్డమానసికదోషములను వదలి నిర్మలమై నిశ్చలముగనుండు మనస్సుతో త్రాగబడిన యౌషధము సమ్యగ్యోగమున సమర్థమగును. (వ్యత్యాసములేక చక్కగ పనిచేయునని భావము). (ఇయ్యది "ఏకాగ్రమనసా" యనుదానికి వివరణము.)

వమనవిరేచనములకు ముందుదినము చేయవలసినభోజననియమము.

మూ. నరః శ్వో వమనం పాతా భుఞ్జీత కఫవర్ధనం,
సుజరం ద్రవభూయిష్ఠం లఘ్వశీతం విరేచనమ్ ౧౮
ఉత్క్లిష్టాల్పకఫత్వే న క్షిప్రం దోషాః స్రవన్తిహి,

వ్యా. మనుజుడు వమనౌషధమును సేవించవలసిననాటికి ముందుదినము కఫమును వృద్ధిపొందించు నాహారమును భుజించవలయును. అట్లు భుజించినచో నామాశయమున నుండుకఫాదిదోషములు గమనోన్ముఖముగ నుండును. విరేచనౌషధమును త్రాగుటకు ముందటిదినమున సుఖముగ జీర్ణమగునదియు, ద్రవాధికముగను, కొంచెము సుఖోష్ణముగ నుండునదియు శీతవీర్యంబును, తేలికగనుండునదియు నగు నాహారమును భుజించ వలయును. ఈభోజనముచేత పక్వాశయమునందలి దోషము శిథిలమై యుండును. కఫము స్వల్పముగ క్షీణించును. కావున నట్టి దోషములు సుఖముగ బైటవెడలును. ఈవిషయము కల్పనాసిద్ధియందు "గ్రామ్యాదకానూపరసైః......విరిచ్యః" (సి. అ. ౧. శ్లో.౮) అను వాక్యముచే చెప్పబడినను ఇచ్చట ప్రకరణానుసారముగ ననువదింపబడినది.

## సమ్యక్ శుద్ధిలక్షణములు.

మూ. పీతౌషధస్య తు భిషక్ శుద్ధిలిఙ్గాని లక్షయేత్. ౧౯
ఊర్ధ్వం కఫానుగే పిత్తే విట్పిత్తేనుకఫేత్వధః,
హృతదోషం వదేత్ కార్శ్యదౌర్బల్యే చేత్ సలాఘవే. ౨౦

వ్యా. వమనవిరేచనౌషధములను త్రాగినపుడు శుద్ధిలక్షణములను ఇత్తెరంగున నెరుంగవది. అందు వమనము లగునపుడు తొలుత కఫము వెడలి పిమ్మట పిత్తద్రవము వెడలినచో వమనముచే దోషము చక్కగ వెడలినదని యెరుంగునది. విరేచనము లగు నపుడు తొలుత పురీషంబును, పిదప పిత్తపసరును ఈరెంటికికడపట కఫమును వెడలిన యెడ విరేచనముచే దోషము చక్కగ హరించినదని యెరుంగునది. మరియు వమనవిరేచ నముల రెంటియందును శరీరకార్శ్యము బలహీనము తేలిక ఈమూడులక్షణములు కల్గి నచో వమనవిరేచనములు రెంటిచేతను దోషములు చక్కగ వెడలినవని యెరుంగునది. (అవి రెంటికిని సమానమైన లక్షణములు.)

ఈశుద్ధిలక్షణములు కల్పనాసిద్ధియందు "క్రమాత్ కఫః పిత్తమథానిలశ్చ... లక్ష్యమాణే" (సి. అ. ౧. శ్లో. ౧౫) యనువాక్యముచే వమనసమ్యగ్శుద్ధిలక్షణంబును; "స్రోతోవిశుద్ధీన్ద్రియ...భవేత్క్రమేణ" (సి. అ. ౧-౧౭ శ్లో) అనువాక్యముచే విరే చనసమ్యగ్శుద్ధి లక్షణములను వివరింపబడినవి. అయినను ప్రకరణానుసారముగ సూచింప బడినది. (మరియు ఔషధసేవన విశేషవిధానమును చెప్పుటకై యనువదింపబడినదని యెరుంగునది.)

సమ్యగ్యోగానంతరము ఔషధశేషమున్నచో వమనము చేయించవలెననుట.

మూ. వామయేత్తు తతః శేషమౌషధం న త్వలాఘవే,
స్తైమిత్యేఽనిలసంగే చ నిరుద్ధారేపి వామయేత్. ౨౧
అలాఘవాత్తనుత్వాచ్చ కఫస్యాపత్ పరం భవేత్,

వ్యా. విరేచనౌషధమును త్రాగినపుడు పైజెప్పబడినరీతిగ సమ్యక్ శుద్ధిలక్షణములు కానవచ్చిన వెంటనే ఔషధశేషము నిలచియున్నయెడ దానిని వమనముచే బైట వెడలించవలయును. లేనియెడ విరేచన అతియోగము సంభవించును. మరియు తక్కినశుద్ధి లక్షణములు గానవచ్చినను శరీరము తేలికలేక గురుత్వముగ నున్నయెడ ఔషధశేషమును వమనము చేయింపదగదు.

వమనౌషధమును త్రాగినపుడు శరీరము ఎంతకాలము స్తిమితమై (జడమై) వాతము నిరుద్ధమై త్రేనుపులు రాకుండునో అంతవరకు వమనమును చేయించవలయును. అట్టివమనములను శరీరమునకు తేలికయై చులకనగ నున్నంతవరకు చేయించి వెంటనే వమనము నాపవలయును. లాఘవాదిగుణములు కల్గినతిమ్మటకూడ వమనము చేయించినచో వమనాతియోగ వ్యాపత్తు కల్గును; కావున లాఘవాదిగుణములు గమనించి వమనముల నివర్తింపజేయవలయునని భావము.

సమ్యగ్యోగయుక్తవమనప్రయోజనము.

మూ. వమితే వర్ధతే వహ్నిః శమం దోషాః వ్రజన్తి హి. ౨౨
వమితం లఙ్ఘయేత్సమ్యక్ జీర్ణలిఙ్గాన్యలక్షయన్,
తాని దృష్ట్వా తు పేయాదిక్రమం కుర్యాత్ న లఙ్ఘయన్. ౨౩

వ్యా. విధ్యుక్తప్రకారము వమనము చక్కగనైనయెడ జాఠరాగ్ని వృద్ధినొందును. దోషములు శమించును. మరియు వమనములైనపిదప వమనౌషధము చక్కగ జీర్ణమైన లక్షణములు కనుబడనిచో వానికి లంకణము చేయించవలెను. క్రింద "అనులోమోఽనిలః" అని యుపక్రమించి చెప్పబడు జీర్ణౌషధలక్షణములు గానవచ్చినపుడు పేయాదిక్రమముగ నన్నసంసర్జనవిధి నాచరించవలెను. (పేయాదిక్రమముపకల్పనీయాధ్యాయమున నిట్లు చెప్పబడినది:—"అథైనం సాయాహ్నే...సప్తరాత్రేణ ప్రకృతిభోజనమాగచ్ఛేత్" సూత్ర. అ. ౧౫. సూ. ౨౮)

వమనవిరేచనానంతరము పేయాదిక్రమమునకు ప్రయోజనము.

మూ. సంశోధనాభ్యాం శుద్ధస్య
హృతదోషస్య (లఙ్ఘితస్య చ) దేహినః,
యాత్యగ్నిర్మన్దతాం (రణుతాం) తస్మాత్
క్రమం పేయాదిమాచరేత్. ౨౮

వ్యా. వమనవిరేచనరూప సంశోధనములచే దోషములు చక్కగ వెడలి శుద్ధ కోష్ఠము కలవానికి వమన-విరేచనముల సంక్షోభమునంజేసి జాఠరాగ్ని మందగించి మిగుల స్వల్పముగ నుండును; కావున అట్టిజాఠరాగ్ని క్రమముగ వృద్ధినొందుటకు పేయాది క్రమము ననుసరించి యాహారమును చేయవలెను.

ఇచ్చట 'సంశోధనాభ్యాం' అను ద్వివచనముచే వమనంబును విరేచనంబును గ్రహింపబడును. వమనముచేనైనను, విరేచనముచేనైనను అగ్ని మందగించునని యర్థము. నిరూహవస్తి చేయించినవానికిని అగ్నిమందగించునుగాని, అయినను వానికి పేయాది క్రమము ననుసరించవలసినంత పరిస్థితిగ మందగించదని యుద్దేశించి వమనవిరేచనములు మాత్రము నిర్దేశింపబడినదని యెరుంగునది. కావుననే "ప్రత్యాగతే కోష్ణజలావసిక్తః శాల్యన్నమద్యాత్ తనునా రసేన" (సిద్ధి. అ. 3. శ్లో. ౨౭) అనువాక్యముచే వస్తి సూత్రీయమున శాల్యన్నభోజనము విధింపబడినది సంగతము. మరియు విరేచనసమ్యగ్యోగలక్షణముల జెప్పునపుడు "స్రోతోవిశుద్ధీన్ద్రియ...లఘుత్వమూర్జోఽగ్నిః అనామయత్వమ్" (సి. అ. ౧. శ్లో. ౧౭) అనువాక్యముచే కల్పనాసిద్ధియందు విరేచనసమ్యగ్యోగమున అగ్నిదీప్తి బాగుండునని చెప్పబడినది. అయినను విరేచనౌషధముచేనైన సంక్షోభమువలన నగ్నిమాంద్యము సంభవించును, కావున నిచ్చట "యాత్యగ్నిర్మన్దతాం" అని చెప్పబడినది.

తర్పణాదిక్రమము నాచరించవలసినవిషయము.

మూ కఫపిత్తే విశుద్ధేఽల్పం మద్యపే వాతపైత్తికే,
తర్పణాదిక్రమం కుర్యాత్ పేయాఽభిష్యన్దయేద్ధి తాన్. ౨౯

వ్యా. కఫపిత్తములు స్వల్పముగ శుద్ధినందినపుడును, మద్యపానము చేయుఅలవాటు కల్గినవానికిని, వాతపిత్తప్రకృతి కలవానికిని సంశోధనానంతరము పేయాదిక్రమము ననుసరించినచో నభిష్యందము (జలుబు) కల్గును; కావున వారలకు తర్పణాదిక్రమము ననుసరించి (పేయకు బదులు అచ్ఛతర్పణమును, విలేపికి బదులు ఘనతర్పణమును) యాహారము నిడవలెను.

## జీర్ణౌషధలక్షణములు.

మూ. అనులోమోఽనిలః స్వాస్థ్యం క్షుత్తృష్ణోర్జో మనస్వితా,
లఘుత్వమిన్ద్రియోద్గారశుద్ధిః జీర్ణౌషధాకృతిః. ౧౬

వ్యా. శోధనౌషధము జీర్ణమైనపుడు వాతము అనులోమముగ సంచరించును. శరీరము స్వస్థతనుండును. ఆకలియు, దప్పియు, శరీరబలంబును కల్గును. మనస్సు నిర్మలముగ నుండును. శరీరము తేలికయై యుండును. చక్షురాదీంద్రియములు పాటవముకల్గి తమతమవ్యాపారములయందు సమర్థములై యుండును. త్రేనుపులు ఔషధమునకు సంబంధించిన గంధరసాదిస్పర్శము లేక శుభ్రముగ వెడలును. (ఔషధమును త్రాగినవెనుక యీలక్షణములు కనబడినయెడ ఔషధము పూర్తిగ జీర్ణమైనదని యెరుంగునది.)

## ఔషధాఽజీర్ణలక్షణములు.

మూ. క్లమో దాహోఽఙ్గసదనం భ్రమో మూర్ఛా శిరోరుజా,
(క్లమో దాహోఽఙ్గమర్దశ్చ భ్రమో మూర్ఛాఽరుచిస్తథా)
అరతిర్బలహానిశ్చ సావశేషౌషధాకృతిః. ౧౭

వ్యా. శోధనౌషధము పూర్తిగ జీర్ణముకాక కొంచెము మిగిలియున్నపుడు బడలికయు, తాపంబును, ఒడలినొప్పులును కలుగును. ఒడలు తిరుగును, మూర్ఛగ్రమ్మును, తలనొప్పి కల్గును. పనులయం దిచ్ఛ బొడమకుండును. శరీరబలము తగ్గును. (ఈలక్షణములు కల్గియున్నపుడు శోధనౌషధము జీర్ణము కాలేదని యెరుంగునది.)

## వ్యాపత్తును కల్గించునౌషధము.

మూ. అకాలేఽల్పాతిమాత్రం చ పురాణం న చ భావితం,
అసమ్యక్ సంస్కృతం చైవ వ్యాపద్యేతౌషధం ద్రుతమ్. ౧౮

వ్యా. శోధనౌషధమును సేవించుటకు విధించినకాలముగాక యితరకాలమున సేవింపబడిన యౌషధంబును, పరిమాణమునకు తక్కువగనైనను అధికముగనైనను త్రాగబడినయౌషధంబును, ప్రాతదియు సమానవీర్యములైన రసాదులచే భావనచేయబడనిదియు విధ్యుక్తముగ సంస్కరింపబడనిదియు నగునౌషధంబును అతిశీఘ్రముగ వ్యాపత్తుల గల్గించును.

—— వమనవిరేచనవ్యాపత్తులు పది, అవి కల్గుటకు హేతువులు. ——

మూ. ఆధ్మానం పరికర్తిశ్చ స్రావో హృద్గాత్రయోర్గ్రహః,
జీవాదానం సవిభ్రంశః స్తమ్భః సోపద్రవః క్లమః. ౨౯
అయోగాదతియోగాచ్చ దశైతాః వ్యాపదో మతాః,
ప్రేష్యభైషజ్యవైద్యానాం వైగుణ్యాదాతురస్య చ ౩౦

వ్యా. ఆధ్మానము (కడుపుబ్బరము), పరికర్తిక (గుదమునందును కోష్ఠమునందును, రోతకల్గుట), నోట నీరువెడలుట, హృదయమునందును, అవయవములయందును పట్టుపట్టినవిధముగ బాధ కల్గుట; జీవశక్తి కాధారమైనరక్తము నశించుట, విభ్రంశము (గుదము స్వస్థానమునందుండి జారుట),(లేక ప్రజ్ఞతప్పుట), స్తంభము (శరీరము స్తంభించుట), ఉపద్రవములు, బడలిక ఈపదియును సంశోధనమున గల్గువ్యాపత్తులు. ఇయ్యవి సంశోధనముయొక్క అయోగాతియోగములవలనను, పరిచారకునియొక్కయు, ఔషధముయొక్కయు, రోగియొక్కయు పొరబాటువలనను సంభవించును. (ఆధ్మానము, పరికర్తిక, స్రావము, హృద్గ్రహము, అంగగ్రహము, జీవాదానము, విభ్రంశము, స్తంభము, ఉపద్రవము, క్లమము అనునీపదియును శోధన (వమన-విరేచన)ముల అయోగ-అతియోగములచే గల్గువ్యాపత్తులు).

పైజెప్పబడిన పది వ్యాపత్తులలో కొన్ని ఔషధములయొక్క అయోగముల వలనను, మరికొన్ని అతియోగమువలనను సంభవించును. ఈవిభాగము, లక్షణము చికిత్స మున్నగునవి క్రింద వివరింపబడును. అట్టి అయోగాతియోగములకు పరిచారక-ఔషధ-వైద్య-రోగులయొక్క పొరబాటే కారణమగును. మరియు దోషములయొక్క ప్రవృత్తి నాల్గు తెరంగులు—అతిప్రవృత్తి (అధికముగా వ్యాపించుట), అసమ్యక్ప్రవృత్తి (యథోక్తముగ కాక వ్యతిరేకముగ ప్రవర్తించుట), ఈరెండును ఔషధాయోగముచే కల్గును. అప్రవృత్తి, అల్పప్రవృత్తి ఈరెండును అయోగజన్యములు. పైజెప్పిన నాల్గు భేదములును, అయోగాతియోగభేదములయందే అంతర్భూతము లగును. కావున నిచ్చట మిథ్యాయోగము ప్రత్యేకముగ జెప్పబడదయ్యె.

—— సంశోధన (వమనవిరేచన) సమ్యగ్యోగ-అతియోగ-అయోగములస్వరూపము. ——

మూ. యోగః సమ్యక్ప్రవృత్తిః స్యాత్ అతియోగోఽతివర్తనం.
అయోగః ప్రాతిలోమ్యేన న చాల్పం వా ప్రవర్తనమ్. ౩౧

వ్యా. వమనమునకైనను విరేచనమునకైనను (ఔషధమును) త్రాగినపుడు ఆయా షధమువలన నేదోషము వెడలవలెనో ఆదోషము పూర్తిగ బైట వెడలినయెడ నయ్యది సమ్యగ్యోగము, (వమనమున కఫంబును, విరేచనమున పిత్తంబును చక్కగ వెడలినచో సమ్యగ్యోగమని భావము). అట్టిదోషమునకంటె నధికముగ వెడలిన నయ్యది అతియోగము (పిత్తాంతము వమన మనియు, కఫాంతము విరేచన మనియు నియమము. కఫము పూర్తిగ వెడలి అంతట నిలువక పిత్తంబును, నురుగుతో కూడిన రక్తంబును మున్నగునవి వెడలిన నయ్యది వమనాతియోగము. విరేచనమున పిత్త పసరు పూర్తిగ వెడలి కఫము మున్నగునవికూడ వెడల నారంభించిన నయ్యది విరేకాతియోగంబునని భావము).

మఱియు ఏయుద్దేశముతో నౌషధ ముపయోగింపబడునో దానికి ప్రతిలోమముగ దోషము వెడలినను, దోషము బొత్తిగ వెడలకున్నను, పూర్తిగ వెడలక స్వల్పముగ వెడలినను అయోగ మనబడును. (వమనమునకు ఔషధమును త్రాగినపుడు దానికి బదులు విరేచనంబును, విరేచనమునకు త్రాగినపుడు వమనంబును ఐనచో, నయ్యది ప్రాతిలోమ్య ప్రవృత్తి యనబడును. ఇయ్యదియు తాను కోరిన దోషము వెడలక ఇతర దోషమును వెడలించుటంజేసి అయోగ మనబడును. పూర్తిగ వెడలకున్నపుడును అయోగమనియే చెప్పబడును. సమ్యగ్యోగ - అయోగాతియోగముల సామాన్యస్వరూప మిచ్చట చెప్పబడినది. వీనిచే గల్గు విశేషలక్షణములు సూత్రస్థానమున ఉపకల్పనీయ-చికిత్సాప్రాభృతీయాధ్యాయములయందును, కల్పనాసిద్ధి మున్నగుస్థలములయందును విపులముగ జెప్పబడినది).

### అయోగవివరణము.

మూ. శ్లేష్మోత్క్లిష్టేన దుర్గన్ధం అహృద్యమతి వా బహు,
విరేచన మజీర్ణే చ పీతమూర్ధ్వం ప్రవర్తతే. ౩౨
క్షుధార్తమృదుకోష్ఠాభ్యాం స్వల్పోత్క్లిష్టకఫేన వా,
తీక్ష్ణం పీతం స్థితం క్షుబ్ధం వమనం స్యాద్విరేచనమ్. ౩౩
ప్రాతిలోమ్యేన దోషాణాం హరణాత్తే హ్యకృత్స్నశః,
అయోగసంజ్ఞే కృచ్ఛ్రేణ యాఽతి దోషో న వాఽల్పశః.
(న వాఽఽగచ్ఛతిచాల్పశః) ౩౪

వ్యా. కఫము ఉత్క్లిష్టమై (శిథిలమై) వెడల నున్నపుడు విరేచనౌషధమును త్రాగినను, దుర్గంధంబును మనసు కింపు కానిదియు నగు నౌషధమును త్రాగినను, అధికముగ

నైనను, అనేకపర్యాయములుగనైనను విరేచనౌషధమును త్రాగినను, ఆహారము జీర్ణము కానియపుడు త్రాగినను, అయ్యది విరేచనముల జేయింప నోపక యూర్ధ్వమార్గమున నే చేరి వమనరూపముగ బైట వెడలును.

మరియు ఆకలిచే పీడింపబడినవాడును, కోష్ఠము మృదువుగ నున్న వాడును, కఫము స్వల్పముగ సడలి యున్నవాడును, మిక్కిలి తీక్ష్ణగుణము కల వమనౌషధమును త్రాగిన నయ్యది సంక్షోభము నొంది పక్వాశయమున జేరి విరేచనరూపముగ బైట వెడలును.

ఇత్తెరంగున వమన విరేచనౌషధములు ప్రతిలోమముగ దోషముల వెడలించుట వలనను, పైజెప్పిన రీతిగ స్వల్పముగ వెడలును, లేక కష్టముచే క్రమముగ వెడలును, లేక బొత్తుగ వెడలక యుండును, కావున పైజెప్పిన వమనవిరేచనౌషధములు ప్రతిలోమముగ వెడలుటవలన నయోగరూపవ్యాపత్తి సంభవించునని భావము.

శోధనాఽయోగమున చికిత్స.

మూ. పీతౌషధో న శుద్ధశ్చేత్ జీర్ణే తస్మిన్ పునః పిబేత్,
ఔషధం న త్వజీర్ణే న్యత్ భయం స్యాదతియోగతః 3౫
కోష్ఠస్య గురుతాం జ్ఞాత్వా లఘుత్వం బలమేవ చ,
అయోగే మృదు వా దద్యాత్ ఔషధం తీక్ష్ణమేవ వా. 3౬

వ్యా. శోధనౌషధమును త్రాగినపుడు వమనముచేనైనను విరేచనముచే నైనను శోధనము కాక యున్నయెడ త్రాగిన యౌషధము జీర్ణమైన పిదప నాటిదినముననే మరల నౌషధమును త్రాగవలెను. తొలుత త్రాగిన యౌషధము జీర్ణము కాకుండునపుడు మరల త్రాగినచో నతియోగమునంజేసి భయము కల్గును.

మరియు పైజెప్పిన రీతిగ నయోగము కల్గినపుడు రోగియొక్క కోష్ఠము గురుత్వముగను బలిష్ఠముగ నున్నదా, లేక లఘుత్వముగను మృదువుగ నున్నదా, అని గమనించి క్రూరముగ నైనను బలిష్ఠముగనైన నున్నచో తీక్ష్ణౌషధమును, మృదువుగ లఘువుగ నున్నపుడు, మృద్వౌషధమును ఇయ్యవలెను.

రెండవతూరి శోధనము చేయదగనివారు.

మూ. వమనం న తు దుశ్ఛర్దం దుష్కోష్ఠం న విరేచనం,
పాయయేదౌషధం భూయో హన్యాత్పీతం పునర్హి తౌ. 3౭

వ్యా. పైజెప్పిన శోధనాయోగమునందును, మిక్కిలి కష్టముచే వమనమగు స్వభా
కల్గినవానికి మరల వమనౌషధమును ఇయ్యకూడదు. మరియు క్రూరమైన కోష్ఠము
ానికి విరేచనాయోగమునందును మరల విరేచనమున కియ్యకూడదు. అటుగాక
వ విరేచనౌషధముల మరల రెండవతూరి యిచ్చినచో వారలను తప్పక ఔషధము
ను. (ఈనిషేధము "పీతౌషధో న శుద్ధశ్చేత్" అని విధింపబడిన పునశ్శోధనమునకు
ాదము.)

—◎ శోధనాయోగమునగల్గు వ్యాపత్తులు. ◎—

౦. అస్నిగ్ధాఽస్విన్న దేహస్య రూక్షస్యాఽనవమౌషధం,
దోషానుత్క్లిశ్య నిర్హర్తుం అశక్తం జనయేద్గదాన్. 3౮
విభ్రంశం శ్వయథుం హిక్కాం తమసో దర్శనం భృశమ్(క్లమం),
పిణ్డికోద్వేష్టనం కణ్డూః ఊర్వోస్సాదం వివర్ణతామ్. 3౯

వ్యా. స్నేహస్వేదముల చక్కగ జేయకుండుటవలన కొంచెముగ స్నిగ్ధంబును
ంబునైన శరీరము కలవానికిని, కొంచెమైన స్నిగ్ధముకాక కేవలము రూక్షమైన శరీ
కలవానికిని ప్రాతదియగు నౌషధము నిచ్చినయెడ, నయ్యది దోషముల నుత్క్లేశము
ంచియు నిశ్శేషముగ బైట వెడలింపజాలక విభ్రంశమును (విపరీతప్రవృత్తిని—
ౌషధము విరేచనమును, విరేచనౌషధము వమనమును) కల్గించును. మరియు
ను ఎక్కిళ్లను కల్గించును. చీకటిక్రమ్మినవిధముగ కన్నులు కానరాకుండును. మిక్కిలి
క కల్గును. పిక్కలయందు మెలిబెట్టినవిధముగ బాధకల్గును. శరీరమునం దెల్ల దురద
. తొడలనొప్పి కల్గును. శరీరమున వివర్ణత కల్గును.

—◎ అయోగమునగల్గు మరికొన్ని వ్యాపత్తులు. ◎—

. స్నిగ్ధస్విన్నస్య చాఽత్యల్పం దీప్తాగ్నేర్జీర్ణమౌషధం,
శీతైర్వా స్తబ్ధమామేవా దోషానుత్క్లిశ్య నాహరేత్. ౪౦
తానేవ జనయేద్రోగాన్ అయోగస్సర్వ ఏవ సః,
విజ్ఞాయ మతిమాం స్తత్ర యథోక్తాం కారయేత్ క్రియామ్.౪౧

వ్యా. స్నేహస్వేదవిధుల చక్కగ నిర్వర్తించుటవలన బాగుగ స్నిగ్ధస్విన్న శరీ
కలవాడై తీవ్రముగ దీప్తమైన జాఠరాగ్నికలవానికి మిక్కిలి కొంచెముగ నుండు
ౌషధమును త్రాగించినయెడ నయ్యది (అగ్నిదీప్తి యధికముగ నుండుటవలన)

శ్రిష్టముగా జీర్ణము కాను. లేక శీతోపచారములచే నౌషధము స్తంభించును. అట్టి (హీన వీర్యములైన) యౌషధంబును, దోషములు పక్వము కాకుండునపుడు త్రాగబడిన యౌషధంబును, దోషముల మాత్రము క్లేశము నొందించియు (రేపెట్టి) బైట వెడలింప సమర్థము కానోపదు. దానంజేసియు పైజెప్పబడిన విభ్రంశాదిరోగములనే కల్గించును. ఈచెప్పబడిన అయోగము లన్నిటియందును వానికారణములను లక్షణములను చక్కగ గమనించి బుద్ధిమంతుడగు వైద్యుడుపైని "పీతౌషధో న శుద్ధశ్చేత్" అని యుపక్రమించి చెప్పబడిన చికిత్సనైనను, ఈ క్రింద "తం తైల" అని చెప్పబడు చికిత్సనైనను చేయవలెను.

ఇచ్చట 'జీర్ణ చూషధం' అనునది యొకకారణము, 'శీతైర్వా స్తబ్ధం' అనునది రెండవది. "ఆమే పీతం" అనునది మూడవకారణము. ఈకారణములమూటిచే వేరువేరసంభవించు నయోగములు మూడు, పైని "అస్నిగ్ధాస్విన్న" అని చెప్పబడిన అయోగ మొకటి. ఈయయోగములచే సంభవించు వ్యాపత్తులకన్నిటికిని అయోగరూపకారణ మొక్కటియే యగుటంజేసి చికిత్సయు నేకరూపమని యెరుంగునది.

## శోధనాఽయోగజన్యవ్యాపత్తులకు చికిత్స.

మూ. తం తైలలవణాఽభ్యక్తం స్విన్నం ప్రస్తరసంకరైః,
పాయయేత పునర్జీర్ణే సమూత్రైర్వా నిరూహయేత్. ౪౨
నిరూహం చ రసైర్ధాన్వైః భోజయిత్వానువాసయేత్,
ఫలమాగధికాదారుసిద్ధతైలేన మాత్రయా. ౪౩
స్నిగ్ధం వాతహరైః స్నేహైః పునస్తీక్ష్ణేన శోధయేత్,
(న చాఽతితీక్ష్ణేన తతో హ్యతియోగస్తు జాయతే). ౪౪

వ్యా. శోధనమును జేసినపుడు పైజెప్పినరీతిగ నయోగముచే వ్యాపత్తుకల్గినయెడ, అట్టిరోగికి సైంధవలవణముతోగూడిన తైలముచే సర్వాంగమునందు నభ్యంగనముచేసి, పిదప ప్రస్తరసంకరస్వేదములచే స్వేదవిధిచేసి చక్కగ చెమట వెడలినపిదప మరల శోధనౌషధమును త్రాగించవలెను. లేక గోమూత్రముతో గూడిన నిరూహవస్తిని నిరూహప్రకారము చేయవలెను. నిరూహవస్తి సమ్యగ్యోగము కనబడినపుడు జాంగల జంతువుల మాంసరసములతో భుజింపజేసి, పిమ్మట మ్రంగకాయలు, పిప్పళ్లు, దేవదారుపట్ట వీనిని వేసి సిద్ధముచేయబడిన తైలముచేతను పరిమితముగ ననువాసనవస్తిని చేయవలెను. పిమ్మట వాతహరములగు స్నేహములచేత స్నిగ్ధశరీరునిగ జేసి తీక్ష్ణములగు శోధనౌషధములచే మరల శోధనము చేయవలెను. అప్పుడును మిక్కిలితీక్ష్ణౌషధము నుపయోగించినచో

ము సంభవించునుకావున కోష్ఠాదిపరిస్థితి నెరింగి తదనుగుణముగ కొంచెముగ యౌషధమును త్రాగింపవలెను. (ఇచ్చట "తత్ర వస్త్రాన్తరితైః...సంకరస్వేద ృత్" "శూకశమీధాన్య......ప్రస్తరస్వేద ఇతి విద్యాత్" (సూ. అ. ౧౪. ౨. ౪౨) అనిచెప్పబడిన సంకరప్రస్తరస్వేదవిధుల నెరుంగునది.)

### శోధనాఽతియోగమున గల్గువ్యాపత్తులు.

అతితీక్ష్ణం క్షుధార్తస్య మృదుకోష్ఠస్య భేషజం,
హృత్వాశు విట్పిత్తకఫాన్ ధాతూన్ విస్రావయేద్ద్రవాన్.
బలస్వరక్షయం దాహం కణ్ఠశోషం భ్రమం (క్లమం) తృషాం,
కుర్యాచ్చ మధురైస్తత్ర శేషమౌషధముల్లిఖేత్. ౪౬

వ్యా. మిక్కిలి యాకలి కల్గియున్నవానికిని, మృదుకోష్ఠము కలవానికిని, మిక్కిలి శోధనౌషధమును (విరేచనౌషధమును), త్రాగించినయెడ నాయౌషధము ుంగ పురీషమును, పిత్తపసరును, కఫమును (వరుసగ) వెడలించి (యంతట నిలువక) ముల్లైన రసరక్తాదిధాతువులనుకూడ స్రవింపజేయును. దానంజేసి శరీరబలంబును, ంబును క్షీణించును. తాపము కల్గును. కుత్తుక ద్రవములేక యెండును. ఒడలు దప్పి యధికమగును. అట్టియెడ నిలచియున్న యౌషధశేషమును వెంటనే లగు లేఖనౌషధములచేత వెడలించవలెను.

ఇచ్చట "క్షుధార్తస్య, మృదుకోష్ఠస్య, హృత్వాశు విట్-పిత్త-కఫాన్" అని త నియ్యది కేవలము విరేచనాతియోగమునకు చెప్పబడిన కారణాదులని యున్నది. అయినను దీనిని బట్టియే వమనాతియోగమునకును కారణసామగ్రి ంపదగును. ఎట్లులన—తీక్ష్ణౌషధము వమనాతియోగమునకును కారణమగును. ఫకఫాన్" అనుచోట పిత్తాంతము వమనమనున్యాయము ననుసరించి కఫము డలి పిత్తంబును వెంటనే వెడలి పిమ్మట ద్రవరూపములైన ధాతువులు కూడ స్థ నయ్యది వమనాతియోగమని యెరుంగదగును. బలక్షయాదులు వమన ంల రెంటికిని సమానలక్షణము లగునని యెరుంగునది.

### శోధనాతియోగజన్యవ్యాపత్తుల సామాన్యచికిత్స

వమనే తు విరేకస్స్యాత్ విరేకే వమనం పునః (మృదు),
పరిషేకావగాహాద్యైః సుశీతైః స్తమ్భయేచ్చ తత్. ౪౭

కషాయమధురైశ్శీతైరన్నపానౌషధైస్తథా,
రక్తపిత్తాఽతిసారఘ్నైః దాహజ్వరహరైరపి. ४८

అఞ్జనం చన్దనోశీరమజ్జాసృక్ శర్కరోదకం,
లాజచూర్ణైః పిబేన్మన్థం అతియోగహరం పరమ్. ४९

శుఙ్గాభిర్వా వటాదీనాం శుద్ధాం పేయాం సమాక్షికాం,
వర్చస్సాఙ్గ్రాహికైస్సిద్ధం క్షీరం భోజ్యం చ దాపయేత్. ५०

జాఙ్గలైర్వా రసైర్భోజ్యం పిచ్ఛాభస్తిశ్చ శస్యతే,
మధురైరనువాస్యశ్చ సిద్ధేన క్షీరసర్పిషా. ५१

వ్యా. శోధనాతియోగమునం జేసి వమనము లధికముగ నున్నయెడ మృదువైన విరేచనంబును, విరేకాతియోగమున మృదువైనవమనంబును ఇయ్యవలెను. మరియు గుణవీర్యస్పర్శములచే చల్లనైన పరిషేకములచేతను, అవగాహనము మున్నగువానిచేతను, శీతములైన యన్న - పాన - ఔషధములచేతను, రక్తపిత్త - అతిసారహరములును, తాప - జ్వరహరములును నగునన్నపానౌషధములచేతను విరేచనమును స్తంభింపజేయవలెను. రసాంజనము, చందనము, వట్టివేళ్లు, మజ్జ, రక్తము, చందనోదకము అనునీద్రవ్యములను యథోచితముగ నుపయోగించవలెను. మరియు పేలాలపిండిచే సిద్ధముచేయబడిన మంథమును త్రాగినచో నతియోగమున గల్గినవ్యాపత్తును హరించును. మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, కలజువ్వి, అను నీయైదిటియూడలను జేర్చి పేయయనుగంజిని సిద్ధముచేసి, యందు తేనెను కలిపి త్రాగించవలెను మలమును బంధించునట్టి ద్రవ్యములను జేర్చి పక్వముచేయబడిన పాలను భోజ్య (ఆహార) పదార్థములను భుజింపజేయవలెను. లేక జాంగలజంతువులమాంసరసముతో నాహారమును భుజింపజేయవలెను. లేక విధ్యుక్త ప్రకారము పిచ్ఛాబస్తి నీయవలెను. మధురద్రవ్యములను పాలను నేతిని చేర్చి సిద్ధము చేయబడిన అనువాసనవస్తిని ప్రయోగింపవలెను. (ఇచ్చట మంథమన పేలాలపిండిని నేతిని నీళ్లలోకలిపి చేయబడిన ద్రవపదార్థమని యెరుంగునది.)

### వమనాఽతియోగచికిత్స.

మూ. వమనస్యాఽతియోగే తు శీతామ్బుపరిషేచితః,
పిబేత్ఫలరసైర్మన్థం సఘృతక్షౌద్రశర్కరమ్. ५२

వ్యా వమనౌషధమును త్రాగినపుడు అతియోగముచే మితిమీరి వమనము లగుచున్నయెడ రోగిని చల్లనినీటితో స్నానము చేయించి పరిపేలాలపిండిలో దానిమ్మపండు

మున్నగువానిరసమును నేతిని, తేనెను, చక్కెరను కలిపి మంథమును సిద్ధముచేసి త్రాగించవలయును.

### వమనాతియోగమునం దవస్థానుసారముగ చికిత్స.

మూ. సోద్గారాయాం భృశంవమ్యాంమూర్ఛాయాంధాన్యముస్తయోః,
సమధూకాఞ్జనం చూర్ణం లేహయేన్మధుసంయుతమ్. ౫౩

వ్యా. వమనాతియోగమున త్రేనుపులతోకూడి వమనము లధికముగా వెడలుచున్నను, మూర్ఛగ్రమ్మినను, దనియాలు, తుంగగెడ్డలు, అతిమధురము, స్రోతోంజనము అనునీద్రవ్యములను సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి తేనెలో కలిపి నాకించవలయును.

### వమనాతియోగమున మరికొన్ని విశేషచికిత్సలు.

మూ. వమతోఽన్తః ప్రవిష్టాయాం జిహ్వాయాం కవలగ్రహాః,
స్నిగ్ధామ్లలవణైః హృద్యైః యూషక్షీరరసైర్హితాః. ౫౪
ఫలాన్యమ్లాని ఖాదేయుః తస్య చాన్యేఽగ్రతో నరాః,
నిస్సృతాం తు తిలద్రాక్షాకల్కలిప్తాం ప్రవేశయేత్. ౫౫
వాగ్గ్రహానిలరోగే(ధే)షు ఘృతమాంసోపసాధితాం,
యవాగూం తనుకాం దద్యాత్ స్నేహస్వేదౌ చ బుద్ధిమాన్ ౫౬

వ్యా. వమనాతియోగమున వమనము లధికముగ నగుటంజేసి నాలుక లోనికి లాగికొనిపోయి యున్నచో నెయ్యి మొదలగు స్నేహములతోడను, దానిమ్మపండ్లు మొదలగు పులుపురసములతోడనుకూడి మనస్సున కింపుగనుండునట్లు యూషములను, పాలను, మాంసరసములను సిద్ధముచేసి యాద్రవములచే కవల గ్రహమును చేయుట చాలహితకరము. మరియు దానిమ్మపండ్లు మున్నగు పుల్లనిపండ్లను ఇతరులు కొందరు కూర్చుని తినుచుండవలయును. (అట్లు చేసినచో రోగికి నోటికి చెమ్మగల్గి లాగికొనిన నాలుక వెలుపలికి వచ్చునని భావము.)

మరియు వాంతులు అధికముగనగుటవలన నాలుక బైటపడి స్తంభించియున్నయెడ నువ్వులను, ద్రాక్షపండ్లను కల్కము చేసి నాలుకకు పూసి మెల్లగ నోటిలో ప్రవేశపెట్టవలయును. మరియు నాలుక స్తంభించి వాతమునకు సంబంధించినవ్యాధులు సంభవించినపుడు నేతిని మాంసమును చేర్చి పలుచనగ సిద్ధముచేయబడిన యవాగువును త్రాగించి, వెంటనే స్నేహస్వేదవిధుల చేయించవలయును.

## శోధనాతియోగమున పేయాదిక్రమవిధి.

మూ. వమితశ్చ విరిక్తశ్చ మన్దాగ్నిశ్చ విలఙ్ఘితః,
అగ్నిప్రాణవివృద్ధ్యర్థం క్రమం పేయాదికం భజేత్. ౫౭

వ్యా. శోధన అతియోగమునంచేసి వమనములైనను, విరేచనములైనను అధికములై జఠరాగ్ని మందగించినయెడ వానికి తొలుత లంకణము చేయించి, పిమ్మట జాఠరాగ్నియు, శరీరబలంబును, నానాట వృద్ధినొందుటకై పేయాదిక్రమము నవలంబించి యాహారము నిడవలయును.

## (1) ఆధ్మానాదిపదివ్యాపత్తులలక్షణంబులును చికిత్సలును. అందు ఆధ్మానమను వ్యాపత్తులక్షణము.

మూ. బహుదోషస్య రూక్షస్య హీనాగ్నేరల్పమౌషధం,
సోదావర్తస్య చోత్క్లిష్టదోషాన్మార్గాన్నిరుధ్య చ. ౫౮
భృశమాధ్మాపయేన్నాభిం పృష్ఠ పార్శ్వశిరోరుజాం,
శ్వాసవిణ్మూత్రవాతానాం సఙ్గం కుర్యాచ్చ దారుణమ్. ౫౯

వ్యా. దోషములు ప్రబలముగ నున్నవారికిని రూక్షశరీరునకును, స్వల్పమైన జాఠరాగ్ని కల్గినవారికిని, ఉదావర్తరోగికిని, స్వల్పమైనమాత్రగల యౌషధము నిచ్చినచో నయ్యది దోషములను రేపెట్టి స్రోతోమార్గముల నడ్డగించి నాభిస్థానమున మిక్కిలి యుబ్బరమును కల్గించును. దానంజేసి వీపునందును, ఇరుప్రక్కలయందును, శిరస్సునందును బాధ కల్గును. శ్వాసమును మలమూత్రములును అపానవాతమును వీనినన్నిటిని మిక్కిలి క్రూరమై వెడలనీయక బంధించును.

ఇయ్యది "ఆధ్మానం పరికర్తిశ్చ......దశైతా వ్యాపదో మతాః" (సి అ. ౬. శ్లో. ౨౯. ౩౦) అని నిర్దేశింపబడిన శోధనాయోగాతియోగములచే గల్గుపదివ్యాపత్తులలో మొదటిదియగు ఆధ్మానమునకు లక్షణము. మరియు నీపదియును అయోగాతియోగములయందు అవశ్యము సంభవించువ్యాపత్తులు కావు. ఉపద్రవములే యగును. కావు ననే ఉపకల్పనీయాధ్యాయమున "తత్ర అతియోగాయోగ నిమిత్తాన్ ఇమానుపద్రవాన్ విద్యాత్. ఆధ్మానం పరికర్తికా......ఉపద్రవ ఇతి". (సూ. అ. ౧౫. సూ. ౧౮.) అని నిర్దేశింపబడినది.

### అధ్మానచికిత్స.

మూ. అభ్యఙ్గస్వేదవర్త్యాదిసనిరూహానువాసనం,
ఉదావర్తహరం సర్వం కర్మాధ్మాతస్య శస్యతే. ౬౦

వ్యా. అట్టిఉదావర్తవ్యాపత్తునందు అభ్యంగము స్వేదము ఫలవర్తిప్రయోగము మున్నగునవియు, నిరూహఅనువాసనవస్తి ప్రయోగంబును, ఉదావర్తహరమైన చికిత్స లన్నియు, ఆధ్మానమునకు చెప్పినచికిత్సయు, మిగుల ప్రశస్తము లగును.

### (2) పరికర్తికాలక్షణము సంప్రాప్తియు.

మూ. స్నిగ్ధేన గురుకోష్ఠేన సామే బలవదౌషధం,
క్షామేణ మృదుకోష్ఠేన శ్రాన్తేనాల్పబలేన వా. ౬౧
పీతం గత్వా గుదం సామం ఆశు దోషం నిరస్య చ,
తీవ్రశూలాం సపిచ్ఛాస్రాం కరోతి పరికర్తికామ్ ౬౨

వ్యా. స్నిగ్ధుడును, గురుకోష్ఠము కలవాడును, ఆమదోషముకలవాడును, క్షీణించిన వాడును, మృదుకోష్ఠము కలవాడును, కార్యాంతరములచే బడలిక నొందినవాడును, స్వల్ప మైన బలము కలవాడును, వీరలకు బలవత్తరమైన యౌషధమును త్రాగించినచో నయ్యది తీవ్రముగ గుదమున ప్రవేశించి ఆమముతో కూడిన దోషసంచయమును వెంటనే వెడలించి, జిగురుతో కూడిన రక్తమును వెడలించును. దానివలన శూలతో కూడి కత్తెరతో కత్తిరించిన విధముగ కోశమున కోత బుట్టును. (ఇయ్యది విరేచనాతియోగమున గల్గుపరికర్తిక యను రెండవవ్యాపత్తు.)

ఇచ్చట "పీతం గత్వా గుదం సామం" అని చెప్పుటవలన నియ్యది విరేచనాతి యోగమున గల్గునని చెప్పదగియున్నది. ఉపకల్పనీయాధ్యాయమున ఆధ్మానాదులు పదియు వమనాతియోగాయోగమున కల్గునని నిర్దేశింపబడినది. కావున నిచ్చట వమనాతి యోగమునందును పరికర్తికను కల్పింపవలెను. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్ప బడినది —"యా తు పరికర్తికా విరేచనే తద్వమనే కణ్ఠకర్షణమ్, యోఽధః పరిస్రవః స వమనే కఫప్రసేకః" (సుశ్రుత. చి. అ. 34) విరేచనాతియోగమున గుదస్థానమున కల్గుకర్షణంబును, అది వమనాతియోగమున కంఠమున కల్గునదియు, అధస్స్రావమునకు బదులు నోటనుండి కఫము స్రవించుననియు పరికర్తికాభేదమును గల్పింపవలెనని భావము.

## పరికర్తికాచికిత్స.

మూ. లఙ్ఘనం పాచనం (దీపనం) సామే రూక్షోష్ణం లఘుభోజనం,
బృంహణీయో విధిస్సర్వః క్షామస్య మధురస్తథా. ౬౩

వ్యా పైజెప్పినపరికర్తికయందు దోషము సామముగనున్నపుడు లంకణము చేయించి పాచనదీపనౌషధములను, రూక్షంబును ఉష్ణంబునైన లఘుభోజనమును ఉపయోగింపవలెను. అయ్యది కృశించినవానికి సంభవించిన బృంహణీయవిధియంతయు హితముగ నుండును. మధురములగు నాహారాదుల నుపయోగించవలెను.

## పరికర్తికయం దామావస్థికచికిత్స.

మూ. ఆమే జీర్ణేఽనుబద్ధశ్చేత్ క్షారామ్లం లఘు శస్యతే,
పుష్పకాసీసమిశ్రం వా క్షారేణ లవణేన వా. ౬౪
సదాడిమరసం సర్పిః పిబేత్ వాతేఽధికే సతి,
దధ్యమ్లం(న్నం)భోజనే పానే సంయుక్తం దాడిమత్వచా. ౬౫
దేవదారుతిలానాం వా కల్కముష్ణామ్బునా పిబేత్,
అశ్వత్థోదుమ్బరప్లక్షకదమ్బైర్వా శృతం పయః ౬౬
కషాయమధురం శీతం (వస్తిం) పిచ్ఛావస్తిమథాపి వా,
యష్టీమధుకసిద్ధం వా స్నేహవస్తిం ప్రదాపయేత్. ౬౭

వ్యా. ఆమావస్థయందు ఔషధము జీర్ణమై ఆమము అనుబంధముగ వెడలుచున్న యెడ క్షారమును అమ్లమును నగునాహారమును స్వల్పముగ భుజింపనగును. మరియు వాత మధికముగ నున్నచో పుష్పకాసీసముతోనైనను, క్షారలవణములతోనైనను, దానిమ్మపండ్ల రసముతోనైనను కూడినఘృతమును త్రాగవలెను. మరియు భోజనమునకు పెరుగన్నమును, పానమునకు దానిమ్మబెరడు చూర్ణముతో కూడిన పేరును ఉపయోగించవలెను. లేక దేవదారుచెక్కను నువ్వులను కల్కముచేసి వేడినీళ్లలో కలిపి త్రాగవలెను. లేక రావి అత్తి, జువ్వి, కడిమి, వీనిపట్టెను చేర్చి కాచబడిన ఆవుపాలనైన త్రాగవలెను. లేక కషాయ (వగరు) రసము కలద్రవ్యములను, మధురరసద్రవ్యములను చేర్చి పక్వముచేసి చల్లగనుండు కషాయాదులచే వస్తిని చేయవలెను. లేక పిచ్ఛావస్తినైనను, అతిమధురమును చేర్చి సిద్ధముచేయబడిన స్నేహవస్తినైన నుపయోగింపవలెను.

## (3) పరిస్రావమను వ్యాపత్తులక్షణము.

మూ. అల్పం తు బహుదోషస్య దోషముత్క్లిశ్య భేషజమ్,

అల్పాఽల్పం స్రావయేత్ కణ్డూం శోఫం కుష్ఠాని గౌరవమ్ ౬౮
కుర్యాచ్చాగ్నిబలోత్క్లేశ స్తైమిత్యాఽరుచిపాణ్డుతాః,
పరిస్రావః సః

వ్యా. ప్రబలమైనదోషము కలవానికి స్వల్పపరిమాణము కలయౌషధము నుపయోగించినచో నయ్యది దోషమును స్వస్థానమునుండి వెడలించిఁ దోషమును ధారాళముగ వెడలింప సమర్థము కానేరక) కొంచెముకొంచెముగ వెడలింపజేయును. మరియు దురద, శోఫము, కుష్ఠము, శరీరము బరువుగనుండుట, అగ్నిమాంద్యము, ఉత్క్లేశము (ఓకళింతలు), జడత్వము, అరుచి, పాండురోగము అను నీబాధల గల్గించును ఇయ్యది పరిస్రావ మను వ్యాపత్తు. (ఈవ్యాపత్తు అయోగముచేకల్గు మూడవది.)

పరిస్రావచికిత్స.

మూ. తం దోషం శమయేద్వామయేదపి. ౬౯
స్నేహితం వా పునస్తీక్ష్ణం పాయయేత విరేచనం,
శుద్ధే చూర్ణాఽఽసవాఽరిష్టాన్ సంస్కృతాంశ్చ ప్రదాపయేత్.

వ్యా. పైజెప్పినరీతిగ స్వస్థానమునుండి చలించినదోషమును శమింపచేయవలెను. లేక వమనముచే బైట వెడలింపవలెను. (దోషము స్వల్పముగనున్నచో శమనౌషధముచే శమింపజేయవలెననియు, దోషము అధికమైనను ఊర్ధ్వగతమైనను వాంతి చేయించి వెడలించవలెననియు భావము. వాంతిచేయించునపుడును స్నేహముచేసి వాంతి చేయించవలెను)

అట్టివమనముచేత శుద్ధమైనపిదప మరల స్నేహమునుచేసి మరల తీక్ష్ణమైన విరేచనౌషధమును త్రాగించవలెను. విరేచనములచే శుద్ధమైనపిదప (గ్రహిణీచికిత్సయందును అర్శశ్చికిత్సితమునందును జెప్పబడిన) చూర్ణములను, ఆసవములను, అరిష్టములను సంస్కరించి యుపయోగించవలెను.

(4) హృద్గ్రహము వ్యాపత్తులక్షణము.

మూ. పీతౌషధస్య వేగానాం నిగ్రహాత్ మారుతాదయః,
కుపితాః హృదయం గత్వా రోధం కుర్వన్తి హృద్గ్రహమ్. ౭౦
సహిక్కాకాసపార్శ్వార్తిదైన్యలాలాక్షివిభ్రమైః,
జిహ్వాం ఖాదతి నిస్సంజ్ఞో దన్తాన్ కిటకిటాపయన్. ౭౧

వ్యా. శోధనౌషధమును త్రాగినపుడు దోషములు బైటవెడలనున్నపుడు వాని (మలమూత్రవాతాదుల) వేగములను నిరోధించి వెడలనీయక నాపినచో వాతాది దోషములు ప్రకోపమునొంది హృదయమునజేరి యడ్డగించి హృద్గ్రహమును కల్గించును. (ఇదిసంప్రాప్తి). అట్టియెడ ఎక్కిళ్లు, దగ్గు, ప్రక్కనొప్పి, దీనత్వము, నోట జొల్లుకారుట, కండ్లుతిరుగుట అనుసీలక్షణములతోకూడి, పండ్లు పటపట కొరుకుచు నాలుకను కొరుకుచు చేష్టల దక్కి మైమరచి పడియుండును. (ఇయ్యవి హృద్గ్రహలక్షణములు) ఇయ్యది శోధనాయోగమువలన సంభవించు నాల్గవవ్యాపత్తు.

## హృద్గ్రహ చికిత్స.

మూ. న గచ్ఛేద్విభ్రమం తత్ర వామయేదాశు తం భిషక్,
మధురైః పిత్తమూర్ఛార్తం కటుభిః కఫమూర్ఛితమ్. ౭౩
పాచనీయైస్తతశ్చాస్య దోషశేషం విపాచయేత్,
కాయాగ్నిం చ బలం చాస్య క్రమేణోత్థాపయేత్తతః,
(క్రమేణాభిప్రవర్ధయేత్). ౭౪
వమనేనాఽతివమతః హృదయం యస్య పీడ్యతే,
తస్మై స్నిగ్ధాఽమ్లలవణం దద్యాత్ పిత్తకఫేఽన్యథా. ౭౫

వ్యా. పైజెప్పినరీతిగ హృద్గ్రహముచే మూర్ఛనొందినపుడు (వీడు చావనున్నాడా యని) సంశయింపక వానికి ముందుగ వాంతి చేయించవలెను. అందు పిత్తాధిక్యముచే మూర్ఛకల్గియున్నయెడ మధురద్రవ్యములతోను, కఫాధిక్యముచే మూర్ఛనొందినయెడ కటురసద్రవ్యములచేతను వాంతి చేయించవలెను. పిమ్మట పాచనీయద్రవ్యములచేత మిగిలిన దోషశేషమును పచింపచేయవలెను. పిమ్మట రోగి కాయాగ్నిని శరీరబలమును నానాట వృద్ధినొందింపవలెను. (ఇచ్చట మూర్ఛనొందినవానికి వమనము చేయించుట దుర్ఘటముకావున మూర్ఛాప్రారంభముననే గమనించి వమనము చేయించవలెను. ఒకవేళ మూర్ఛనొందినను వ్రేళ్లతో పెళ్లగించియైనను వాంతి చేయించుట ముఖ్యము.)

మరియు అధికముగ వమనములగునపుడు హృదయమున వాతముచే బాధకలిగినపుడు స్నిగ్ధ అమ్ల-లవణముల నియ్యవలెను. పిత్త-కఫములచే బాధకల్గినపుడు మధురాదులకు విరుద్ధములైన రూక్ష-తిక్త-కటుకాదిద్రవ్యములచే నుపచరించవలెను.

(5) అంగగ్రహవ్యాపత్తులక్షణము, చికిత్సయు.

మూ. పీతౌషధస్య వేగానాం నిగ్రహేణ కఫేన వా, [మారుతః.
రుద్ధోఽతి వావిశుద్ధస్య (రుద్ధోఽతీవ విశుద్ధస్య) గృహ్ణాత్యఙ్గాని
స్తమ్భవేపథునిస్తోదసాదోద్వేష్టనమన్థనైః,
తత్ర వాతహరం సర్వం స్నేహస్వేదాది కారయేత్. ౭౭

వ్యా. శోధనౌషధమును త్రాగినవాడు మలమూత్రాదివేగముల నిరోధించిన, లేక కఫము ప్రకోపించినను శోధనము చక్కగ పనిచేయక దోషములు వెడలనేరవు. దానంజేసి వాతము నిరోధింపబడి అవయవములను స్తంభింపజేయును. అట్టియెడ అవయవముల యందు వణకు, పోటు, కృశత్వము, మెలిబెట్టినవిధముగ బాధ, మూర్ఛయు కల్గును. (ఇది అయోగమునగల్గిన అంగగ్రహము). మరియు శోధనౌషధముచేత మితిమీరి వమన విరేచనము లైనయెడ వాతము మిక్కిలి ప్రకోపించి పైజెప్పిన స్తంభాదుల గల్గించును. (ఇది శోధనాతియోగమున కల్గిన అంగగ్రహము.) పైవాక్యముచేత శోధనాతియోగము నందును అయోగమునందును అంగగ్రహము కలుగునని తెలిసెడి. (ఇది యైదవవ్యాపత్తు.)

అట్టియంగగ్రహమునందు వాతహరములగు స్నేహస్వేదాది-చికిత్సలన్నియు చేయదగును.

(6) జీవాదానమను వ్యాపత్తులక్షణము.

మూ. అతితీక్ష్ణం మృదౌ కోష్ఠే లఘుదోషస్య భేషజం,
దోషాన్ హృత్వా వినిర్మథ్య జీవం హరతి శోణితమ్ ౭౨

వ్యా. కోష్ఠము మృదువుగ నుండువానికైనను, దోషము స్వల్పముగ నుండువాని కైనను మిక్కిలి తీక్ష్ణమైనయౌషధము నిచ్చినచో, నయ్యది దోషములను వరుసగ వెడలించి యంతనిలువక ప్రాణమునకు ముఖ్యాధారమై ధాతురూపమైన రక్తమును సంక్షోభము నొందించి బైట వెడలించును. ఇయ్యది జీవాదానమను నారవవ్యాపత్తు. (ఇది అతి యోగముచే కల్గును.)

జీవరక్తపరీక్ష.

మూ. తేనాన్నం మిశ్రితం దద్యాత్ వాయసాయ శునేఽపి వా,
భుఙ్క్తే తచ్చేత్ వదేజ్జీవం న భుఙ్క్తే పిత్తమాదిశేత్. ౭౯

శుక్లం వా భావితం వస్త్రం ఆవానం కోష్ణవారిణా,
ప్రక్షాళితం వివర్ణం స్యాత్ పిత్తే శుద్ధం తు శోణితే,
(పిత్తం శుద్ధంతుశోణితమ్). ౮౦

వ్యా. (పైజెప్పినరీతిగ శోధనాతియోగమువలన శరీరమునందలి పిత్తమిశ్రితమైన రక్తమైనను, జీవితమునకు హేతువైన ధాతురూపరక్తమైనను వెడలవచ్చును. అట్టిరక్త భేదమును నిర్ణయించుటకై పరీక్షావిధాన మిాక్రింద చెప్పబడును):—పైజెప్పినవిధముగ వాంతియైన రక్తమును అన్నముతో కలిపి దానిని కాకికైనను కుక్కకైనను పెట్టవలెను. అప్పు డాయన్నమును ఆజంతువులు తినినయెడ నయ్యది జీవరూపమైన రక్తమనియు, ఆయన్నమును తినకున్నచో రక్తపిత్తమనియు నెరుంగునది. మరియు అట్టిరక్తమున (వాంతియైన రక్తమున) తెల్లనిగుడ్డను తడిపి ఎండి కొంచెము వెచ్చనైననీళ్లచే పులిమి కడిగినయెడ (తెల్లగనుండక) వివర్ణముగనుండెనేని రక్తపిత్తమనియు, శుభ్రమై తెల్లగనుండు నేని జీవరక్తమనియు నిర్ణయించునది.

### జీవాదానవ్యాపచ్చికిత్స.

మూ. తృష్ణామూర్ఛామదార్తస్య కుర్యాదామరణాత్ క్రియాం,
తస్య పిత్తహరం సర్వామతియోగే చ యా హితా (మతా) ౮౧

వ్యా. అందు జీవరక్తము వెడలినప్పుడు దప్పియు మూర్ఛయు మదంబును కల్గును. అట్టివానికి వాడు జీవించియున్నంతవరకును తృష్ణా-మూర్ఛా-మదాత్యయములకు జెప్పబడిన చికిత్సావిధానములను చేయుచుండవలెను. మరియు అతియోగమున జెప్పబడిన పిత్తహరములగు పరిషేకాభ్యంగాదుల నన్నిటిని చేయవలెను. (ఇచ్చట నతియోగమున "పరిషేకావగాహైశ్చ సుశీతైః స్తమ్భయేచ్చ తత్" అని యుపక్రమించి చెప్పబడిన పిత్తహరచికిత్సల గ్రహించునది). ఇచ్చట 'వస్త్రం ఆవానం' అనుచోట "ఆవానమితి, ఆవానం శుష్కం" అని వ్యాఖ్యలో నున్నది.

### జీవాదానవిశేషచికిత్స.

మూ. మృగగోమహిషాజానాం సద్యస్కం జీవతామసృక్,
పిబేజ్జీవాభిసన్ధానం జీవం తద్ధ్యాశు గచ్ఛతి. ౮౨
తదేవ దర్భమృదితం రక్తం వస్తిం ప్రదాపయేత్,
శ్యామాకాశ్మర్యబదరీదూర్వోశీరైః శృతం పయః. ౮౩

ఘృతమణ్డాఞ్జనయుతం శీతం వస్తిం ప్రదాపయేత్,
పిచ్ఛావస్తిం సుశీతం వా ఘృతమణ్డాఽనువాసనమ్. ౧౪

వ్యా. మరియు జీవించియున్న జింక గోవు ఎనుబోతు మేక వీనియొక్క రక్తమును అప్పుడే (జీవించియుండగనే) గ్రహించి వెంటనే వానికి త్రాగించినచో వాంతి రక్తముతో వెడలిన జీవాణువులు మరల వానికి రక్తముతో శీఘ్రముగ సంక్రమింపజేయును. (రక్తము సజాతీయ మగుటంజేసి శీఘ్రముగ శరీరమునందలి రక్తముతో నేకీభవించి జీవరక్తముగ పరిణమించునని భావము.) మరియు నాజంతువులరక్తమున దర్భవేళ్లను నూరి కల్కముచేసి కలిపి విధిప్రకారము వస్తిప్రయోగము చేయవలెను. నల్లతెగడ, నేలగుమ్మడి, రేగువేరు, గఱికవేళ్లు, వట్టివేళ్లు వీనినిచేర్చి కాచబడినపాలలో నేతిమీదితేటను రసాంజనమును చేర్చి చల్లగజేసి వస్తిచేయవలెను. లేక చల్లగనుండు పిచ్ఛావస్తినైనను, నేతిమీది తేటతో ననువాసనవస్తి నైనను చేయవలెను.

## (7) విభ్రంశభేదములు మూడు, వానిచికిత్స.

మూ. గుదం భ్రష్టం కషాయైశ్చ స్తమ్భయిత్వా ప్రవేశయేత్,
సామగాన్ధర్వశబ్దాంశ్చ సంజ్ఞానాశేఽస్య కారయేత్. ౧౫

వ్యా. విభ్రంశమనునది మూడు విధములు. అందొకటి గుదభ్రంశము, సంజ్ఞాభ్రంశము రెండవది. (ప్రజ్ఞతప్పుట), (ఈరెండును అతియోగమున కల్గును). ఈ రెంటిలో గుదభ్రంశమున (విరేచనము లధికముగ నగుటవలన గుదము స్వస్థానమునుండి జారి బైటవచ్చినప్పుడు) వగరుకల వస్తువులరసముచే స్తంభింపజేసి గుదమును లోనికి జొనిపి స్వస్థానమున జేర్పనగును. సంజ్ఞానాశమునందు సామగానశబ్దమును సంగీతశబ్దమును వినిపించి మూర్ఛ దేరునట్లు చేయవలెను.

మూ. యదా విరేచనం పీతం విడ స్తమవతిష్ఠతే,
వమనం భేషజాన్తం వా దోషానుత్క్లిశ్య నాఽవహేత్. ౧౬
తదా కుర్వన్తి కణ్డ్వాదీన్ దోషాః ప్రకుపితాః గదాన్,
స విభ్రంశో మతస్తత్ర స్యాత్ యథావ్యాధి భేషజమ్. ౧౭

వ్యా. విరేచనౌషధమును త్రాగినప్పుడు అయ్యది పురీషమును మాత్రము వెడలించియు, వమనౌషధమును త్రాగినపుడు దోషములను స్వస్థానమునుండి సడలింపజేసియు, నౌషధముమాత్రము వెడలించియు, దోషములను వెడలింపనేరకున్నయెడ, దానంజేసి వాతాదిదోషములు ప్రకోపము నొంది దురద మన్నగురోగములను కల్గించును. అయ్యది

విభ్రంశమని పారిభాషికముగ జెప్పబడును. (ఇది మూడవవిభ్రంశము; అయోగమున కల్గును.) అట్టివ్యాపత్తులయందు ఆయావ్యాధికి తగినచికిత్సను యథాసంభవముగ జేయ నగును. (ఈమూడు విభ్రంశభేదములనుచేరి యేడవవ్యాపత్తగును.)

### (8) స్తమ్భమను వ్యాపత్తులక్షణము, చికిత్స.

మూ. పీతం స్నిగ్ధేన సస్నేహం తద్దోషైర్మార్దవాత్ వృతం,
న వా వహతి దోషాంస్తు స్వస్థానాత్ స్తమ్భయేత్ చ్యుతాన్. ౮౮
వాతసఙ్గగుద స్తమ్భశూలైః క్షరతి చాఽల్పశః,
తీక్ష్ణం వస్తిం విరేకం వా సోఽర్హో లఙ్ఘితపాచితః. ౮౯

వ్యా. స్నేహవిధిచే మిక్కిలి స్నిగ్ధమైన శరీరముకలవాడు స్నేహముతో కూడిన విరేచనౌషధమును త్రాగినచో నాయౌషధము మృదువు అగుటవలన దోషములచే నావరింపబడి స్వస్థానమునుండి సడలినదోషములను (పురీషాదులను) స్తంభింపజేసి బైట వెడలింపనేరదు. దానివలన వాతము స్తంభించి గుదమును స్తంభింపజేసి శూలనొప్పిని కల్గించి స్వల్పముగ దోషమును వెడలింపజేయును. ఇయ్యది అయోగమునకల్గిన స్తంభ మను యెనిమిదియవ వ్యాపత్తు. ఈవ్యాపత్తునందు తొలుత లంకణమును చేసి, పిమ్మట పాచనముచే నౌషధశేషమును పచింపజేసి, పిమ్మట తీక్ష్ణమైన వస్తినైనను తీక్ష్ణవిరేచనమునైనను వాని కుపయోగింపవలెను.

### (9) ఉపద్రవరూపవ్యాపత్తులక్షణము, దానిచికిత్సయు.

మూ. రూక్షం విరేచనం పీతం రూక్షేణాఽల్పబలేన వా,
మారుతం కోపయిత్వాఽఽశు కుర్యాత్ ఘోరానుపద్రవాన్.
స్తమ్భశూలాని ఘోరాణి సర్వగాత్రేషు మూర్ఛాతః,
స్నేహస్వేదాదిక స్తత్ర కార్యో వాతహరో విధిః. ౯౦

వ్యా. మిక్కిలి రూక్షమైనశరీరము కలవాడైనను, స్వల్పమైన బలము కలవాడైనను రూక్షమైన విరేచనౌషధమును త్రాగినయెడ, నయ్యది వాతమును ప్రకోపింపజేసి వెంటనే మిక్కిలి క్రూరములగు నుపద్రవములను కల్గించును. మరియు అవయవముల నన్నిటిని స్తంభింపజేసి క్రూరమైననొప్పిని కల్గించును. దానివలన మూర్ఛకూడ సంభవించును. ఇయ్యది యుపద్రవమను తొమ్మిదవ వ్యాపత్తు. (ఇది అయోగమున కల్గినది). ఈవ్యాపత్తు నందు వాతహరములగు స్నేహస్వేదాదివిధులన్నియు చేయదగును. (ఇచ్చట నతియోగ

మునం జేసి సంభవించిన స్తంభశూలాదులు స్వతంత్రములగుటచే నుపద్రవరూపములు కాకున్నను పారిభాషికముగ నుపద్రవరూపమైన వ్యాపత్తని నిర్దేశింపబడినది.)

(10) క్లమమనువ్యాపత్తు, దానిచికిత్స.

మూ. స్నిగ్ధస్య మృదుకోష్ఠస్య మృదూల్పిష్టౌషధం కఫం,
పిత్తం వాతం చ సంరుధ్య సతన్ద్రాగౌరవం క్లమమ్. ౯౨
దౌర్బల్యం చాఽఙ్గసాదం చ కుర్యాదాశు తదుల్లిఖేత్,
లఙ్ఘనం పాచనం చాత్ర (కాలే) స్నిగ్ధం తీక్ష్ణం చ శోధనమ్. ౯౩

వ్యా. మిక్కిలి స్నిగ్ధమైనశరీరము కలవాడైనను, మృదువైన కోష్ఠము కలవాడైనను మృదువైనయౌషధమును త్రాగినచో నయ్యది కఫపిత్తములను స్వస్థానమునుండి సడలింపజేయును. అట్టికఫపిత్తములు వాతమును నిరోధించి, కునికిపాటుతోడను గౌరవము (శరీరము బరువుగనుండుట) తోడను కూడినక్లమమును బడలికను కల్గించును. మరియు బలహీనమును ఒడలినొప్పులనుకూడ కల్గించును. అయ్యది క్లమమను పదియవ వ్యాపత్తు. (ఇది అయోగమున కల్గును.)

ఈవ్యాపత్తునందు తొలుత నౌషధశేషమును కఫపిత్తములను వెడలింపజేసి, పిమ్మట స్నేహస్వేదవిధులజేసి స్నిగ్ధంబును తీక్ష్ణంబునైన శోధనౌషధమును ఇయ్యవలెను.

అధ్యాయోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః—

మూ. ఇత్యేతాః వ్యాపదః ప్రోక్తాః సరూపాః సచికిత్సితాః,
వమనస్య విరేకస్య కృతస్యాఽకుశలైర్నృణామ్. ౯౪
(విరేచనస్యాఽకుశలైః దత్తస్య వమనస్య చ)
ఏతాః విజ్ఞాయ మతిమాన్ అవస్థాశ్చైవ తత్వతః,
(ధీమాన్ విజ్ఞాయ తాస్తస్మాత్ అవస్థాశ్చైవ తత్త్వతః)
దద్యాత్ సంశోధనం సమ్యక్ ఆరోగ్యార్థీ నృణాం సదా. ౯౫

వ్యా. ఇత్తెరంగున నసమర్థులగువైద్యులు పొరబాటుచే ప్రయోగించిన వమనవిరేచనౌషధముల నీమనుజులకు సంభవించు వమనవిరేచనవ్యాపత్తులును, వానిస్వరూపలక్షణంబులును, వానిచికిత్సలును ఈయధ్యాయమున విస్తరముగ జెప్పబడినవి. బుద్ధిమంతుడగువైద్యుడు వీనినన్నిటిని వీనియవస్థాభేదములను వాస్తవ్యముగ పూర్తిగ నెరింగి

మనుజులకు ఆట్టివ్యాపత్తుల గల్గకుండునట్లు తగురీతిగ నారోగ్యము గల్గునట్లు వమనవిరేచనముల విస్పష్టప్రకారముగ నియ్యవలెను.

—అధ్యాయసమాప్తి.—

ఇత్యగ్నివేశకృతే తన్త్రే, చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే, సిద్ధిస్థానే వమనవిరేచనవ్యాపత్సిద్ధిర్నామ షష్ఠోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగుచరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున వమనవిరేచనవ్యాపత్సిద్ధి యను షష్ఠాధ్యాయము సమాప్తము.

---

## సప్తమాధ్యాయము

అవతరణిక:—వమనాదిపంచకర్మలతో తొలుత శోధనము చేసి పిమ్మట వస్తికర్మ చేయవలెను కావున తొలుత వమనవిరేచనవ్యాపత్తులను పైయధ్యాయమున జెప్పి పిమ్మట నీయధ్యాయమున వస్తివ్యాపత్సిద్ధి చెప్పబడును:—

—వస్తివ్యాపత్సిద్ధిప్రారంభము.—

మూ. అథాతో వస్తివ్యాపత్సిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వమనవిరేచనవ్యాపత్సిద్ధిని చెప్పినపిదప వమనవిరేచనానంతర భావియగు వస్తి (నిరూహవస్తి) కర్మచే గల్గువ్యాపత్తుల నివర్తింప జేయదగు నుపాయముల బోధించు వస్తివ్యాపత్సిద్ధిని భగవానుడగు నాత్రేయు లుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము. (ఈయధ్యాయమున నిరూహవస్తిచే సంభవించువ్యాపత్తులే చెప్పబడునుకావున వస్తిశబ్దముచేత నిరూహవస్తియే గ్రహింపబడును.)

మూ. ధీధైర్యౌదార్యగామ్భీర్యక్షమాదమతపోనిధిం,
పునర్వసుం శిష్యగణః పప్రచ్ఛ వినయాన్వితః. 3
కాః? కతి వ్యాపదో వస్తేః? కిం సముత్థానాః? లక్షణాః?,
కా చికిత్సా? ఇతి ప్రశ్నాన్ శ్రుత్వా తానబ్రవీద్గురుః. ౪

వ్యా. విశదమైనబుద్ధియు, ధైర్యంబును, ఉదారభావంబును, గంభీరతయు, ఓర్పును, ఇంద్రియనిగ్రహంబును, తపశ్శక్తియు వీనికన్నిటికిని పెన్నిధానమైన పునర్వసువను నామాంతరముకల యాత్రేయుని అగ్నివేశులు మున్నగుశిష్యగణము మిక్కిలివినయము తోడ యీక్రింద చెప్పబడువిధముగ ప్రశ్నముల నడిగిరి:—

(1) విధ్యుక్తమునకు వ్యత్యస్తముగ చేయబడిన వస్తిప్రయోగమువలన సంభవించు వ్యాపత్తులెవ్వి?

(2) అట్టివ్యాపత్తు లెన్ని?

(3) ఆవ్యాపత్తులు కల్గుటకు కారణములేవి?

(4) వాని వేరువేరులక్షణము లేవి?

(5) వానిచికిత్స యెద్ది?

అను నీయైదుప్రశ్నములను వస్తికర్మనుద్దేశించి యాత్రేయునిశిష్యబృంద మడిగె నని ముందువాక్యముతో నన్వయము.

(1) (2) (3) వస్తివ్యాపత్తులు-పండ్రెండు, వానిసామాన్యకారణములును.

మూ. నాఽతియోగౌ క్లమాధ్మానే హిక్కా హృత్ప్రాప్తిరూర్ధ్వతా,
ప్రవాహికా శిరోఽఙ్గార్తిః పరికర్తః పరిస్రవః. ౫
ద్వాదశ వ్యాపదో వస్తేః; అసమ్యగ్యోగసమ్భవాః,
ఆసామేకైకశో రూపం చికిత్సాం చ నిబోధత. ౬

వ్యా. అతియోగము, అయోగము, క్లమము, ఆధ్మానము, హిక్క (ఎక్కిళ్లు), హృదయప్రాప్తి, ఊర్ధ్వగమనము, ప్రవాహిక, శిరోఽర్తి, అంగార్తి, పరికర్తము, పరిస్రవము అను నీపండ్రెండును వస్తికిసంబంధించిన వ్యాపత్తులు. ఇయ్యవి నిరూహవస్తి యొక్క అయోగ-అతియోగ-మిథ్యాయోగరూపమైన అసమ్యగ్యోగము (విధ్యుక్తమునకు వ్యత్యయముగ ప్రయోగించుట) వలన సంభవించును. ఈపండ్రెండు వస్తివ్యాపత్తులకును వేరువేరుగ లక్షణంబులును, వేరువేరుచికిత్సలును ఈక్రింద వరుసగ వివరింపబడును. (ఇచ్చట "ద్వాదశ వ్యాపదో వస్తేః" అనునంతవరకుం గలవాక్యముచేత "కాః వ్యాపదః? కతి?" అను రెండుప్రశ్నముల కుత్తరము చెప్పబడినది. "అసమ్యగ్యోగసమ్భవాః" అనువిశే షణముచేత "కిం సముత్థానం" (అట్టివ్యాపత్తుకు కారణమెద్ది?) అను మూడవప్రశ్నమున కుత్తరముగ సామాన్యకారణము చెప్పబడినది. విశేషకారణంబులును అతియోగాదివివరణం బును వానివాని ప్రత్యేకలక్షణముల జెప్పుస్థలములయందు వివరింపబడును.)

మఱియు పైనిర్దేశింపబడిన క్లమము మున్నగువ్యాపత్తులు కొన్ని అయోగము చేతను, కొన్ని అతియోగముచేతను సంభవించును. అయినను సంశోధనవ్యాపత్తులుగ జెప్ప బడిన ఆధ్మానము మున్నగు పదివ్యాపత్తులును అయోగ-అతియోగజన్యములైనను వానికి సంబంధించిన హేతువులును లక్షణములును చికిత్సలును వేరువేరుగ దెలియుటకై ప్రత్యేకముగ జెప్పినవిధముగ, నిచ్చటను క్లమము మున్నగు వస్తివ్యాపత్తులకు హేతు-లక్షణ-చికిత్సావిశేషములు దెలియుటకై ప్రత్యేకవిశేష హేతులక్షణాదులు చెప్పబడును. వస్తివ్యాపత్తులైన క్లమాదులకు అయోగ-అతియోగములు సామాన్యకారణము లనియు, ప్రత్యేకముగ జెప్పబడునవి విశేషకారణములనియు ముఖ్యార్థము. ఈయుద్దేశముచేతనే "నాఽతియోగాత్ క్లమాధ్మానే...పరిస్రవః దశైవ వ్యాపదో వస్తేః" అని ప్రకారాంతర ముగ కొందరు పఠించెదరు. ఈపాఠమున అయోగ-అతియోగములు క్లమాదులకు కార ణములనియు, ఆరెంటిని వదలి తక్కినక్లమాదులు పదియును వస్తివ్యాపత్తులనియు స్ఫుట ముగ నేర్పడును. ఈపాఠము పూర్వాధ్యాయమున జెప్పబడినపద్ధతికి సమానార్థముగ నుండును; కాని వ్యాఖ్యానమున "కిన్తుపూర్వ ఏవ పాఠో నిర్వ్యూహః" అని పూర్వపాఠ మునే సమంజసముగ నభిప్రాయము సూచింపబడినది.

(1) వస్తివ్యాపత్తులు పండ్రెండు. అందు అయోగవ్యాపత్తుయొక్క లక్షణము.

మూ. గురుకోష్ఠేఽనిలప్రాయే రూక్షే వాతోల్బణేఽపి వా,
శీతోఽల్పలవణస్నేహద్రవమాత్రో ఘనోఽపి వా. ౭
వస్తిస్సంక్షోభ్య తం దోషం దుర్బలత్వాదనిర్హరన్,
కరోతి గురుకోష్ఠత్వం వాతమూత్రశకృద్గ్రహమ్. ౮
నాభివస్తిరుజం దాహం హృల్లేపం శ్వయథుం గుదే,
కణ్డూగణ్డాని వైవర్ణ్యం అరుచిం వహ్నిమార్దవమ్. ౯

వ్యా. శీతవీర్యంబును, సైంధవలవణమును స్నేహమును మిక్కిలి కొంచెముగ చేర్చ బడినదియు, కొంచెముగ ద్రవమైనదియు, స్వల్పపరిమాణము కల్గినదియు, మిక్కిలి చిక్క నైనదియు నగు వస్త్యౌషధమును, క్రూరకోష్ఠము కలవానికైనను, (మలపూర్ణమైన కోష్ఠము కలవానికైనను), వాతము ప్రధానముగ కలవానికైనను, రూక్షశరీరునకైనను, వాతం బధికముగ కలవానికైన నుపయోగించినచో, నయ్యది సంక్షోభమును కల్గించి యౌషధము అల్పవీర్యముగుటవలన దోషమును వెడలింప సమర్థముకానేరదు. దానంజేసి కోష్ఠము బరు వుగ నుండును. వాతమూత్రపురీషములను వెడలనీయక నిరోధించును. నాభియందును

వస్తియందును నొప్పినికల్గించును. తాపముకల్గును. హృదయమున పూయబడిన ట్లుండును. గుదస్థానమున వాపుకల్గును. దురదయు గ్రంథులును కల్గును. శరీరమున వర్ణము మారును. అరుచియు అగ్నిమాంద్యంబును కల్గును.

## అయోగవ్యాపత్తుచికిత్స.

మూ. తత్రోష్ణాయాః ప్రమథ్యాయాః పానం స్వేదాః పృథగ్విధాః,
ఫలవర్త్యోఽథవా కాలం జ్ఞాత్వా శస్తం విరేచనమ్ ౧౦
బిల్వమూలత్రివృద్దారు యవకోలకులుత్థవాన్,
సురాదిమూత్రవాన్ వస్తిః సప్రాక్ ప్రేష్య స్తమానయేత్. ౧౧

వ్యా. పైజెప్పిన అయోగవ్యాపత్తునందు ఉష్ణవీర్యములైన ద్రవ్యములను పక్వము చేయబడిన ప్రమథ్య యనుపాచనకషాయమును త్రాగించవలెను. మరియు పలువిధంబులైన స్వేదములను ఫలవర్తుల నుపయోగింపవలెను. లేక విరేచనమునకు యోగ్యమైన యవస్థాభేదమును చక్కగ గమనించి యుక్తమని తోచినచో విరేచనౌషధము నియ్యవలెను. మరియు మారేడువేళ్లు, తెగడవేళ్లు, దేవదారుచెక్క, యవలు, రేగుపట్ట, ఉలవలు అను నీద్రవ్యములతోడను; సురామద్యము, సౌవీరకము తుషోదకము మున్నగుద్రవములతోడను, వస్తిసూత్రీయమున జెప్పబడిన బలాదివస్తియందలి కల్కద్రవ్యములతోడను కూడినవస్తిని ప్రయోగించి, అయోగమును కల్గించి బద్ధమైన లోపల నిలిచియుండు వస్తిని వెడలించవలెను.

ఇచ్చట 'ఉష్ణాయాః ప్రమథ్యాయాః' అనుచోట అతిసారచికిత్సితమున "పిప్పలీ నాగరం ధాన్యం...శ్లోకార్థైరతిసారిణామ్" (చి. అ. ౧౯. శ్లో. ౨౫, ౨౬)అనిచెప్పబడిన ప్రమథ్యమును గ్రహించునది. ప్రమథ్యమన పాచనకషాయమునకు ఆయుర్వేదసమయసిద్ధమైన సంజ్ఞయని యెరుంగునది. ప్రమథ్యాకల్పనము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది. "ప్రమథ్యా ప్రోచ్యతే ద్రవ్య పలకల్కీకృతాత్ శృతాత్, తోయే షడ్గుణితే తస్యాః పానమాహుః ఫలద్వయమ్" పలపరిమితమైన క్వాథ్యద్రవ్యమునం డారింతలు జలమును చేర్చి కాచబడినది ప్రమథ్య యని యర్థము. 'సప్రాక్ప్రేష్యః' అనుపదముచేత వస్తిసూత్రీయమునందలి బలాదివస్తిలో "వచా శతాహ్వా ఘనపిప్పలీనాం కల్కైః" అని నిర్దేశింపబడిన వస, సదాప మున్నగుద్రవ్యకల్కమును గ్రహించునది.

## (2) వస్త్యతియోగవ్యాపత్తులక్షణము, చికిత్సయు.

మూ. స్నిగ్ధస్విన్నేఽతితీక్ష్ణోష్ణో మృదుకోష్ఠేఽతియుజ్యతే,
తస్య లిఙ్గం చికిత్సా చ శోధనాభ్యాం సమా భవేత్. ౧౨

వ్యా. మృదుకోష్ఠము కలవానికి స్నేహస్వేదములచే స్నిగ్ధస్విన్నశరీరుడుగ నున్నపుడు మిక్కిలి తీక్ష్ణంబును ఉష్ణంబునైన వస్తి నుపయోగించినయెడ, నయ్యది అతియోగము కల్గించును. దానిలక్షణములను చికిత్సయు వమనవిరేచనాతియోగములకు జెప్పినవాని వలననే యెరుంగునది. (ఇచ్చట "అతితీక్ష్ణం క్షుధార్తస్య...బలస్వరక్షయం దాహం కణ్ఠశోషం భ్రమం తృషామ్, కుర్యాచ్చ మధురైస్తత్ర" అని పైయధ్యాయమున జెప్పబడిన అతియోగలక్షణములను చికిత్సలను గ్రహించునది.)

## వస్త్యతియోగమునగల్గు దాహమునకు చికిత్స.

మూ. పృశ్నిపర్ణీం స్థిరాం పద్మం కాశ్మర్యం మధుకం బలామ్,
(మధుకోత్పలం)
పిష్ట్వా ద్రాక్షాం మధూకం చ క్షీరే తణ్డులధావనే. ౧౩
ద్రాక్షాయాః పక్వలోష్టస్య ప్రసాదే మధుకస్య చ,
వినీయ సఘృతం వస్తిం దద్యాద్దాహేఽతియోగజే. ౧౪

వ్యా. ముయ్యాకుపొన్న, కోలపొన్న, తామరకమలము, నేలగుమ్మడు, అతిమధురము, చిట్టాముట్టి, ద్రాక్షపండు, ఇప్పపువ్వులు వీనిని కల్కముజేసి ఆవుపాలయందు కలిపి, అందు బియ్యపుకడుగునీళ్లను, ద్రాక్షపండును, అతిమధురమును శీతకషాయముజేసి యాద్రవమును, పెంకనుకాల్చి నీటిలో ముంచి, యాతేటనీటిని కలిపి వస్తిని సిద్ధముచేసి ఘృతమును జేర్చి వస్త్యతియోగముచే కల్గినతాపమునందు వస్తి వేయవలెను. (ఇచ్చట ద్రాక్షపండును అతిమధురమును వేరువేరుగ నూరి నీళ్లలో కలిపి శీతకషాయవిధిప్రకారము తేటనీటిని వేరువేరుగ రెండుద్రవముల సిద్ధముచేయునది. కాలినమట్టిపెంకులను వైచి యాతేటనీటిని గ్రహించి, ఆవుపాలను, బియ్యపుకడుగును ఈయైదుద్రవముల నొకటిగ గూర్చి, అందు ముయ్యాకుపొన్న మొదలగు పైజెప్పినద్రవ్యముల కల్కమును కలిపి మితముగ ఘృతమును కలిపి పిచ్ఛవస్తిప్రకారము వస్తిప్రయోగము చేయునది.)

## (3) క్లమమను వస్తివ్యాపత్తులక్షణము.

మూ. ఆమశేషే(దోషే) నిరూహేణ మృదునా దోష ఈరితః,
మార్గం రుణద్ధి వాతస్య హన్త్యగ్నిం మూర్ఛయత్యపి. ౧౫

(మూర్ఛయత్యనిలం మార్గం రుణద్ధ్యగ్నిం హినస్తి చ)
క్లమం విదాహం హృచ్ఛూలం మోహావేష్టనగౌరవం,
కుర్యాత్

వ్యా. ఆమశేషము నిలిచియున్నపుడు మృదువైననిరూహవస్తి నిచ్చినయెడ దానిం జేసి పిత్తకఫములతోఁ గూడిన ఆమశేషము ప్రకుపితమై స్రోతోమార్గముల నడ్డగించును. జఠరాగ్నిని మందగింపజేయును. మార్గనిరోధముచే వాతము మిక్కిలి ప్రకోపమునొంది క్లమమును, సంతాపమును, హృదయశూలమును, మూర్ఛను కల్గించును. శరీరమున మెలి బెట్టినవిధముగ బాధ కలుగును. శరీరము బరువుగ నుండును. ఇది క్లమమను పూడవవస్తి వ్యాపత్తు.

## క్లమమను వస్తివ్యాపత్తు చికిత్స.

మూ. స్వేదై ర్విరూక్షై స్తం పాచనై శ్చాప్యుపాచరేత్. ౧౬
పిప్పలీకత్తృణోశీరదారుమూర్వాశృతం జలమ్,
పిబేత్ సౌవర్చలోన్మిశ్రం దీపనం హృద్విశోధనమ్. ౧౭
వచానాగరశట్యేలాదధిమణ్డేన మూర్ఛితాః,
పేయాః ప్రసన్నయా వా స్యుః అరిష్టేనాసవేన వా. ౧౮
దారుత్రికటుకం పథ్యాం పలాశం చిత్రకం శటీం,
పిష్ట్వా కుష్ఠం చ మూత్రేణ పిబేత్ క్షారాంశ్చ దీపనాన్. ౧౯
వస్తిమస్య విదధ్యాచ్చ సమూత్రం దాశమూలికం,
సమూత్రమథవా వ్యక్తలవణం మాధుతైలికమ్. ౨౦

వ్యా. పైజెప్పినక్లమ మనువ్యాపత్తునందు రూక్షస్వేదములజేసి పాచనౌషధముల నియ్యవలెను. మరియు పిప్పళ్లు, కామంచిపూరి, వట్టివేళ్లు, దేవదారు, చాగపట్ట వీనినన్నిటిని సమభాగములుగూర్చి జలమును కాచి సౌవర్చలవణమునుకూర్చి త్రాగవలెను. దీనిచే నగ్నిదీప్తి కల్గును. హృదయమును శుభ్రపరచును. మరియు వస, శుంఠి, కచోరములు, ఏలకులు వీనినన్నిటి నొకటిగ కలిపి పెరుగుమీది మీగడతో నైనను, మద్యముపై తేటతో నైనను, అరిష్టమను మద్యముతో నైనను, ఆసవమునందైనను కూర్చి చక్కగ కలియబెట్టి త్రాగవలెను. మరియు దేవదారుచెక్క, త్రికటుకములు, కరకకాయలబెరడు, మోదుగ, చిత్రమూలము, కచోరములు, చెంగల్వకోష్టు వీనినన్నిటిని గోమూత్రమున నూరి త్రాగ

వలెను. అగ్నిని దీపింపజేయు క్షారములనైన గోమూత్రమున కలిపి త్రాగవలెను. మరియు దశమూలముల కషాయమున గోమూత్రమును కలిపియైనను, లవణముతో గూడిన మాధు తైలికవస్తినైనను వస్తిప్రయోగము చేయవలెను.

ఇచ్చట "క్షారాంశ్చ దీపనాన్" అనుచోట గ్రహణీచికిత్సితము మున్నగుస్థలములయందు "సమూలాం పిప్పలీం పాఠాం" (చి. అ. ౧౫.) ఇత్యాదిగ్రంథముచే జెప్పబడిన పిప్పల్యాదిక్షారము, భల్లాతకాదిక్షారము మున్నగుక్షారముల గ్రహించునది. మరియు "ద్విపంచమూలస్య రసోఽమ్లయుక్తః...వ్యాధిహరః ప్రదిష్టః" (సిద్ధి. అ. 3. శ్లో. 3౫.) అని నిర్దేశింపబడిన "దాశమూలికం" అనుపదముచే గ్రహించునది. మాధుతైలికవస్తి తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది.—"ఏరణ్డక్వాథ తుల్యాంశం మధుతైలం పలాష్టకమ్, శతపుష్పా పలార్ధేన సైన్ధవార్ధేన సంయుతమ్, మధుతైలకసంజ్ఞోఽయం వస్తిర్దారువిలోడితః, మేదోగుల్మక్రిమిప్లీహమలోదావర్తనాశనః, బలవర్ణకరశ్చైవ వృష్యో దీపనపాచనః" ఈమాధు తైలికవస్తిని గ్రహించునది. దీనివివరణము స్థలాంతరమున జూచునది.

### (4) ఆధ్మానము వస్తివ్యాపత్తులక్షణము.

మూ. అల్పవీర్యో మహాదోషే రూక్షే క్రూరాశయే కృతః,
వస్తిర్దోషావృతో రుద్ధమార్గో రున్ధ్యాత్ సమీరణమ్,
(వస్తిర్దోషావృతస్తూర్ధ్వమధో రున్ధ్యాత్ సమీరణమ్). ౨౧
స విమార్గోఽనిలః కుర్యాత్ ఆధ్మానం మర్మపీడనం,
విదాహం గురుకోష్ఠస్య ముష్కవఙ్క్షణవేదనామ్. ౨౨
రుణద్ధి హృదయం శూలైః ఇతశ్చేతశ్చ ధావతి,

వ్యా. ప్రబలమైనదోషము కలవానికైనను, రూక్షశరీరునకైనను, క్రూరకోష్ఠము కలవానికైనను మిక్కిలి స్వల్పవీర్యమైనవస్తిని ప్రయోగించినచో నయ్యది దోషమును హరించుసామర్థ్యము లేమింజేసి యాదోషముచే నావరింపబడి యధోమార్గమున వెడలనీయక దోషముచే నడ్డగింపబడును. అట్టివస్తి వాతమును ఊర్ధ్వాధోమార్గముల వెడలనీయక నడ్డగించును. నిరోధింపబడిన యావాతము ప్రకోపించి మార్గాంతరముల వ్యాపించి వస్తిహృదయమర్మముల బాధించునట్టి యాధ్మానమును కల్గించును. దానంజేసి కోష్ఠముబికి బరువైయుండును. తీవ్రమైనతాపంబును వృషణములయందును గెజ్జలయందును తీవ్రమైన నొప్పి కల్గును. వాతము పలుదెరంగులైన పోటునొప్పి మొదలగుబాధల గల్గిం

చుచు హృదయమున వ్యాపించుచు, హృదయమును నిరోధించి కోష్ఠమున నన్నెడల వ్యాపించి సంచరించుచుండును. (ఇయ్యది యాధ్మానమను నాల్గవవస్తివ్యాపత్తు. ఇదియు నయోగమున కల్గునది.)

ఆధ్మానవ్యాపత్తుచికిత్స.

మూ. శ్యామా ఫలాదిభిః కుష్ఠకృష్ణాలవణసర్షపైః. ౨౩
ధూమమాషవచాకిణ్వక్షారచూర్ణగుడైః కృతాం,
కరాఙ్గుష్ఠనిభాం వర్తిం యవమధ్యాం నిధాపయేత్. ౨౪
(ప్రవేశయేత్.)
అభ్యక్తస్విన్నగాత్రస్య తైలాక్తాం స్నేహితే గుదే,
అథవా లవణాఽగారధూమసిద్ధార్థకైః కృతామ్. ౨౫
బిల్వాదినా నిరూహస్స్యాత్ పీలుసర్షపమూత్రవాన్,
సరళామరుదారుభ్యాం సిద్ధం తైవాఽనువాసయేత్. ౨౬

వ్యా. పైజెప్పిన యాధ్మానవ్యాపత్తునందు క్రింద జెప్పబడు చికిత్స చేయునది— కల్పస్థానమున జెప్పబడిన శ్యామాది (నల్లతెగడ మున్నగు) విరేచనద్రవ్యముల తోమ్మిదిటిని, ఫలాది (మ్రంగకాయ మున్నగు) వమనద్రవ్యము లారింటిని, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, సైంధవలవణము, ఆవాలు, కరిదూపము, మినుములు, వస, సురాబీజము, యవక్షారము వీనినన్నిటిని చూర్ణము చేసి (యాచూర్ణమును వర్తిగ జేయుటకు వలసినంత) బెల్లమును కలిపి, పిసికి ముద్దచేసి వర్తిలోపల యవచూర్ణ మిమిడియుండునట్లును చేతి బొటనవ్రేలిలావును పొడవును కల్గియుండునట్లును వర్తిని సిద్ధముచేసి రోగియొక్క గుద ద్వారమునకు వర్తికిని ఆముదమునుపూసి, రోగికి అభ్యంగనమును స్వేదమును జేసి, పైజెప్పిన వర్తిని గుదద్వారమున నెక్కించవలెను. లేక సైంధవలవణమును కరిదూపము తెల్లావాలను గూర్చి చూర్ణముచేసి పైజెప్పినరీతిగ బెల్లమునుచేర్చి మర్దించి వర్తిచేసియైనను పైజెప్పిన విధముగ రోగిగుదద్వారమున ప్రవేశింపజేయవలెను.

మరియు మూడవయధ్యాయమున జెప్పబడిన బిల్వాదిదశమూలములచే సిద్ధమైన వస్తియందు కొండగోగుపట్టను, ఆవాలను గోమూత్రమును కలిపి నిరూహవస్తి చేయునది. పిదప తెగడను, దేవదారుచు చేర్చి కాచబడిన తైలముచేత ననువాసనవస్తిని చేయవలెను.

ఇచ్చట "శ్యామాఫలాదిభిః" అనుచోట ద్వంద్వాంతమునందలి యాదిశబ్దమును రెండుపదములతో జేర్చి శ్యామాది, ఫలాది అని యన్వయించునది. ఈరెండుపదములచేత

కల్పస్థానమున 'ఫలజీమూతకేక్ష్వాకు......కృతవేదనాం; శ్యామా త్రివృచ్చతురఙ్గుళ... ద్రవన్తీనాఞ్చ" (కల్ప. అ. ౧. సూ. ౬) అని నిర్దేశింపబడిన శ్యామాది, ఫలాదిద్రవ్యముల గ్రహించునది. మరియు "బిల్వాదినా నిరూహస్స్యాత్" అనుచోట వస్తిసూత్రీయమున "ద్విపఞ్చమూలస్య రసోఽమ్లయుక్తః......వ్యాధిహరః ప్రదిష్టః" (సిద్ధి. అ. 3. శ్లో. 3౫) అని చెప్పబడిన బిల్వాది ద్విపంచమూలనిరూహవస్తిని గ్రహించునది.

## (౭) హిక్కయను వస్తివ్యాపత్తులక్షణము.

మూ. మృదుకోష్ఠేఽ బలే వస్తిరతితీక్ష్ణోఽతినిర్హరన్,
కుర్యాద్ధిక్కాం;హితం తస్మై హిక్కాఘ్నం బృంహణం చ యత్.

వ్యా. మృదుకోష్ఠము కలవానికిని బలహీనునకు మిక్కిలి తీక్ష్ణమైనవస్తిని ప్రయోగించినచో నయ్యది దోషము నధికముగ వెడలించి హిక్కను (ఎక్కిళ్లను) కల్గించును. అట్టియెడ హిక్కాచికిత్సితమున చెప్పిన హిక్కాహరచికిత్సలను బృంహణ చికిత్సను చేయవలెను.

ఇచ్చట హిక్కాచికిత్సితమున 'వాతికాన్ దుర్బలాన్...రసాదిభిః,...... బృంహయేదితరాన్ భిషక్, బర్హితిత్తిరి...హితాః" (చి. అ. ౧౭. శ్లో. ౯౦.౯3) ఇది మున్నగుగ్రంథముచే జెప్పబడిన హిక్కాచికిత్సలను బృంహణములను ఎరుంగునది.

## హిక్కావ్యాపచ్చికిత్స.

మూ. బలాస్థిరాదికాశ్మర్య త్రిఫలాగుడసైన్ధవైః,
సప్రసన్నారనాళామ్లైః తైలం పక్త్వానువాసయేత్. ౨౭
కృష్ణాలవణయోరక్షం పిబేదుష్ణాఽమ్బునా యుతం,
(ఉష్ణామ్బునాఽక్షః పిప్పల్యాహితో లవణసంయుతః)
ధూమలేహరసక్షీరస్వేదాశ్చాఽన్నం చ వాతనుత్. ౨౮

వ్యా. చిట్టాముట్టి, స్థిరాది (హ్రస్వ) పంచమూలములు, నేలగుమ్మడి త్రిఫలములు, బెల్లము, సైంధవలవణము ఈద్రవ్యములకల్కమును, సురామద్యము, పులిగంజి, పులుపురసములు వీనిని ద్రవములుగను చేర్చి పరిభాషానుసారము తైలమును పక్వముచేసి యాతైలముచే హిక్కావ్యాపత్తునందు అనువాసనవస్తిని విధ్యుక్తప్రకారము చేయవలయును. మరియు పిప్పళ్లను, సైంధవలవణమును చూర్ణముచేసి కర్షప్రమాణము వేడినీళ్లలోకలిపి త్రాగవలయును. వాతమును హరించునట్టి ధూమపానమును, లేహములను, మాంసరసములను, క్షీరమును, స్వేదవిధులను, ఆహారమును ఉపయోగింపనగును.

ఇచ్చట పంచకర్మీయసిద్ధియందు "ప్రసక్తచ్ఛర్దినిష్ఠీవికా శ్వాసకాస హిక్కార్తానాం ఊర్ధ్వభూతో వాయుః ఊర్ధ్వం వస్తిం నయేత్" (సి. అ. 2. సూ. 15) అనువాక్యముచే హిక్కా సామాన్యముగ అనువాసనవస్తి దుష్టమని నిషేధింపబడినను వస్తివ్యాపత్తురూపముగ సంభవించిన హిక్కయందు అనువాసనవస్తి విశేషవిధిగ చెప్పబడి నదిగాన యౌగికముచే యెఱుంగునది.

## (6) హృదయప్రాప్తియను వస్తివ్యాపత్తులక్షణము, దాని చికిత్స.

మూ. అతితీక్ష్ణః సవాతో వా న వా సమ్యక్ ప్రపీడితః,
ఘట్టయేద్ధృదయం వస్తిః; తత్ర కాళకుశేత్కటైః.		౩౦
స్యాత్సామ్లలవణస్కన్ధకరీరబదరీఫలైః,
శృతైర్వస్తిర్హితః సిద్ధం వాతఘ్నైశ్చానువాసనమ్		౩౧

వ్యా. మిక్కిలితీక్ష్ణమైనవస్తిని ప్రయోగించినపుడు వస్తిని నిశ్శేషముగ ప్రయోగించుటచే వాతము ప్రవేశించుటవలనను, వస్తిని చక్కగ నొక్కక వ్యత్యస్తముగ నొక్కినను, అట్టివస్తి పైకి వ్యాపించి హృదయమునఁజేరి బాధించును. (ఇత్యాది అయోగముచే జనించిన హృదయప్రాప్తి యను నారవవస్తివ్యాపత్తు) ఈవస్తివ్యాపత్తునందు కుశదర్భ, రెల్లుదర్భ, సీటిరెల్లు, (రోగభిషగ్జితీయమున జెప్పబడిన) అమ్లస్కంధ-లవణస్కంధ ద్రవ్యములును, వెదురుమొలకలు, రేగుపండ్లు వీనిని చేర్చి సిద్ధముచేయబడిన కషాయముతో నిరూహవస్తిని చేయనగును. మరియు వాతహరములగు దశమూలములు మున్నగు ద్రవ్యములఁజేర్చి సిద్ధముచేయబడిన స్నేహముతో ననువాసనవస్తిని చేయవలెను.

ఇచ్చట 'అమ్ల-లవణస్కన్ధ' అనుచోట రోగభిషగ్జితీయాధ్యాయమున "ఆమ్రామ్రాతక లకుచ కరమర్ద......ఇత్యమ్లస్కన్ధః" "సైన్ధవసౌవర్చల......వస్తిం వాతవికారిణే దద్యాత్" (మూ. అ. ౮. సూ. ౧౮౦. ౧౮౧) అనువాక్యములచే జెప్పబడిన అమ్లస్కంధద్రవ్యములను, లవణస్కంధద్రవ్యములను యథాసంభవముగ గ్రహించునది.

## (7) ఊర్ధ్వగతమను వస్తివ్యాపత్తులక్షణము.

మూ వాతమూత్రపురీషాణాం దత్తే వేగాన్నిగృహ్ణతః,
అతి వా పీడితో వస్తిః ముఖేనాయాతి వేగవాన్.		౩౨

వ్యా. నిరూహవస్తిని ప్రయోగించినపుడు అపానవాతముయొక్కయు మూత్రపురీషములయొక్కయు వేగములను వెడలనీయక నిరోధించినను వస్తిని అధికముగ నొక్కి

ప్రయోగించినను, అట్టివస్త్యౌషధము వేగముతో నోటినుండి వెడలును. ఇయ్యది యూర్ధ్వగమను నేదవస్తివ్యాపత్తు. (ఇది అతియోగముచే సంభవించును.)

ఊర్ధ్వగతవస్తి నాకర్షించుచుపాయము.

మూ. మూర్ఛావికారం తస్యాదౌ దృష్ట్వా శీతామ్బునా ముఖం,
సిఞ్చేత్ పార్శ్వోదరం చాధః ప్రమృజ్యాత్ వీజయేచ్చ తమ్.
కేశేష్వాలమ్బ్య చాకాశే ధునుయాత్త్రాసయేచ్చ తం
(చాకేశం ధునుయాన్నామయేచ్చతం),
గోఖరాశ్వగజైస్సింహైః రాజప్రేష్యైః తథోరగైః. 34
ఉల్కాభిరేవమన్యైశ్చ భీతస్యాఽధః ప్రవర్తతే,
(వస్తిం తస్యానయేదధః),
వస్త్రపాణిగ్రహైః కణ్ఠం రున్ధ్యాన్న మ్రియతే యథా. 35
ప్రాణోదాననిరోధాద్ధి ప్రసిద్ధతరమార్గవాన్ (గః),
అపానః పవనో వస్తిం తమాశ్వేవాపకర్షతి. 36

వ్యా. పైచెప్పిన యూర్ధ్వగతమను వస్తివ్యాపత్తునందు మూర్ఛసంభవించినపుడును గమనించి వెంటనే చల్లనినీళ్లచేత ముఖముపై చిలకరించవలెను. ఇరుప్రక్కలను కడుపును చేతులతో క్రిందికి దువ్వి చరమవలెను. వీవనలచే చల్లనిగాలి తగులునట్లు విసరవలెను. రోగియొక్క వెండ్రుకలను చేతబట్టి పైకెత్తి కదలించవలెను. మరియు గోవులచేనైనను గాడిదెలచేనైనను గుఱ్ఱములచేనైనను సింహములచేనైనను రాజభటులచేనైనను సర్పములచేనైనను మండుచుండు కొరవికట్టెలచేనైనను, భయముకల్గించు నితరసాధనములచేనైనను రోగిని బెదిరించి భయము గల్గించవలెను. అట్లు భయముచే నులికిపడుటవలన పైకివ్యాపించినవస్తి క్రిందికి దిగజారును. మరియు రోగియొక్క కంఠమును గుడ్డచుట్టియైనను చేతితోనైనను ప్రాణమునకు హానికల్గకుండునట్లు బిగదీయవలెను. అట్లు కుత్తుక బిగబట్టుటవలన ప్రాణవాతమునకును ఉదానవాతమునకు సంచరింప వలనుపడక నిరోధము కల్గును. దానంజేసి యపానవాతము విశేషమగమనముకల్గి తానుసంచరించు మామూలు మార్గమున సంచరించుచు పైకి వ్యాపించినవస్తిని క్రిందికి అతిశీఘ్రముగ నాకర్షించును. (కోష్ఠమున పైకివ్యాపించి సంచరించి ప్రాణ-ఉదానవాతములు కంఠమును బిగబట్టుటచే పైకివెడల వలనుపడక క్రిందికివ్యాపించును. వానిచే నపానవాతము పైకి వ్యాపింప వలను పడక యడ్డగింపబడి యధోమార్గముగ సంచరించుచు గుదద్వారమునుండి వెడలును. అట్టి

యెడ నూర్ధ్వముగ వ్యాపించినవస్తిని అపానవాతము మరల నధోమార్గమునజేర్చి గుదము నుండి వెడలింపజేయునని భావము.)

### ఊర్ధ్వగవస్తివ్యాపచ్చికిత్స

మూ. తతః క్రముకకల్కాక్షం
పాయయేత్ాఽమ్లసంయుతం,
ఔష్ణ్యాత్ తైక్ష్ణ్యాత్ సరత్వాచ్చ
వస్తిం సోఽస్యాఽనులోమయేత్. ౩౭

వ్యా. పైజెప్పిన యుపాయములజేసినపిదప గొంటుపోకలచూర్ణమును అక్ష (కర్ష) ప్రమాణము పుల్లనిగంజిలో కలిపి త్రాగించినచో నయ్యది యుష్ణవీర్యంబును తీక్ష్ణంబును నగుటవలనను శరీరమున శీఘ్రముగ వ్యాపించు సరగుణమును కల్గియుండుట వలనను వస్తిని అనులోమముగ జేయును.

### అవస్థాభేదముబట్టి చికిత్సావిశేషము.

మూ. పక్వాశయస్థితే స్విన్నే నిరూహో దాశమూలికః,
యవకోలకులుత్థైశ్చ విధేయో మూత్రసాధితః. ౩౮
బిల్వాదిపంచమూలేన సిద్ధో వస్తిరురఃస్థితే,
శిరస్థేన్ నావనం ధూమః ప్రచ్ఛాద్యం సర్షపైశ్శిరః. ౩౯

వ్యా. వస్తిఔషధము పక్వాశయమున నిలచియున్నయెడ స్వేదవిధిని చేసి పిదప దశమూలములకషాయమున యవలను రేగుపిత్తులను ఉలవలను చూర్ణముచేసి కలిపి గోమూత్రమునుగూడ చేర్చి నిరూహవస్తిని విధ్యుక్తప్రకారము చేయవలెను. వక్షస్థ్సల మున వస్త్యౌషధము చేరియున్నపుడు బిల్వవేరు మున్నగుమహాపంచమూలములచే సిద్ధమైన వస్తిని చేయనగును. వస్త్యౌషధములో నేకదేశము శిరస్సున చేరియున్నయెడ నస్యవిధిని ధూమపానమును చేయించి ఆవాలను నూరి కల్కముచేసి శిరస్సున పూయవలెను.

### (8) ప్రవాహిక యనువస్తివ్యాపత్తులక్షణము.

మూ. స్నిగ్ధస్విన్నే మహాదోషే వస్తిర్మృద్వల్పభేషజః,
ఉత్క్లిశ్యాఽల్పం హరేద్దోషం జనయేచ్చ ప్రవాహికామ్. ౪౦
సవస్తిపాయుశోఫేన జఙ్ఘోరుసదనేన వా,
నిరుద్ధమారుతో జన్తుః అభీక్ష్ణం సమ్ప్రవాహతే.

వ్యా. స్నేహస్వేదవిధుల జేసికొని మిక్కిలి ప్రబలమైన దోషము గలవానికి మృదువును స్వల్పపరిమాణంబును నగునౌషధముచే వస్తి నుపయోగించినయెడ దోషమును స్వస్థానమునుండి సడలింపజేసి స్వల్పముగ వెడలింపజేయును. దానంజేసి ప్రవాహికయను వ్యాపత్తును కల్గించును. మరియు వస్తియందును గుదమునందును శోఫను, పిక్కల యందును తొడలయందును బాధ గల్గించును. ఆమనుజుడు నిరోధింపబడిన వాతముకల వాడై బలవంతముగ ముక్కుచు, పలుమారు కఫమును కొంచెముకొంచెముగ వెడలించును. ఇయ్యది ప్రవాహిక యనువస్తివ్యాపత్తని యెఱుంగునది. (ఇయ్యది అయోగముచే సంభవించు నెనిమిదవ వస్తివ్యాపత్తు.)

ఇచ్చట ప్రవాహికాలక్షణము సుశ్రుతమున నిట్లుచెప్పబడినది:—"వాయుర్వివృద్ధో నిచితం బలాసం నుదత్యధస్తాత్ అహితాశనస్య, ప్రవాహతోఽల్పం బహుశో మలాక్తం ప్రవాహికాంతాం ప్రవదన్తి తజ్జ్ఞాః" (సు. ఉ. అ. ౪౦.) ఈ శ్లోకము అతిసారచికిత్సితమున వివరింపబడినది.

### ప్రవాహికావ్యాపత్తుచికిత్స.

మూ. స్వేదాఽభ్యఙ్గాన్నిరూహాంశ్చ శోధనీయానులోమికాన్,
విదధ్యాల్లఙ్ఘయిత్వా తు వృత్తిం కుర్యాద్విరిక్తవత్. ౪౨

వ్యా. పైజెప్పిన ప్రవాహికయనువ్యాపత్తునందు స్వేదములను, అభ్యంగనములను, తెగడ మున్నగుశోధనీయగణద్రవ్యములతోడను వాతము ననులోమముగజేయు క్షీరము చెరకురసము మున్నగువానితోడను కూడిన నిరూహవస్తులను ప్రయోగించి, లంకణము చేయించి, పిమ్మట విరేచనముసేవించినవానింబోలె పేయాదిసంసర్జనక్రమమును ఆచరింపం దగును.

### (9) శిరోర్తివస్తివ్యాపత్తులక్షణము.

మూ. దుర్బలే క్రూరకోష్ఠే చ తీవ్రదోషే తనుర్మృదుః,
శీతోఽల్పశ్చాప్యవృతో దోషైః వస్తిః తద్విహతోఽనిలః. ౪౩
మార్గైర్గాత్రాణి సన్ధావన్ ఊర్ధ్వం మూర్ధ్ని విహన్యతే,
(మార్గైర్గాత్రాణ్యనుసరన్ ఊర్ధ్వం మూర్ధ్ని విధావతి.
(మూర్ధన్యపాహితః)

గ్రీవాం మన్యే చ గృహ్ణాతి (సంస్తభ్య) శిరః కణ్ఠం భినత్తి చ.
బాధిర్యం కర్ణనాదం చ పీనసం నేత్రవిభ్రమం,

వ్యా. బలహీనుడును, క్రూరమైనకోష్ఠముకలవాడును, తీవ్రమైనదోషము కలవాడును నగుమనుజునకు మృదువును శీతవీర్యంబును అల్పపరిమితంబునైన వస్తిని ప్రయోగించినచో నయ్యది దోషములచే నావరింపబడును. దానంజేసి వాతము ప్రకోపించి శరీరమునందలి మార్గములలో సంచరించుచు పైకి వ్యాపించి, శిరస్సున నభిఘాతమునొంది, కంఠమును మన్యయను మెడకు వెనుకటినరములను వ్యాపించి స్తంభింపజేసి, శిరస్సునందును కంఠమునందును పగులదీయునట్లు బాధనుకల్గించును. చెవుడును కల్గించును. చెవులలో ధ్వని బుట్టించును. పీనసమును కల్గించును. కన్నులు తిరుగునట్లుండును. ఇయ్యది శిరోఽర్తియను తొమ్మిదవవస్తివ్యాపత్తు. (ఇది అయోగముచే గల్గినది.)

## శిరోర్తి వస్తివ్యాపత్తుచికిత్స.

మూ. కుర్యాదభ్యఞ్జనం తైలలవణేన యథావిధి. ౪౫
(తైల లవణేనాఽవగాహయేత్.)
యుఞ్జ్యాత్ ప్రధమనైర్నస్యైః ధూమైరస్య విరేచయేత్,
(ధూమైరాస్యవిరేచనైః)
తీక్ష్ణాఽనులోమికేనాథ స్నిగ్ధం భుక్తేఽనువాసయేత్.
(విరేచనైర్నిరూహైశ్చ వస్తిభిశ్చానులోమికైః) ౪౬

వ్యా. పైజెప్పిన శిరోఽర్తివ్యాపత్తునందు సైంధవలవణముతో కూడిన తైలముచే నభ్యంజనము యథోక్తముగ చేయించవలెను. మరియు ప్రథమననస్యములచేతను ధూమపానములచేతను శిరోవిరేచనమును చేయించవలెను. భుజించినపిదప స్నేహమునుచేసి తీక్ష్ణంబును వాతము ననులోమముగ చేయునదియునగు నౌషధముచే ననువాసనవస్తిని, భుజించినవెనుక చేయవలెను.

## (10) అంగార్తియను వస్తివ్యాపత్తులక్షణము.

మూ. స్నేహస్వేదైరనాపాద్యగురుతీక్ష్ణోఽతిమాత్రయా,
యస్య వస్తిః ప్రయుజ్యేత సోఽతిమాత్రం ప్రవర్తయేత్. ౪౭
(సుస్నిగ్ధస్విన్నదేహస్య యస్య వస్తిర్విధీయతే,
అతితీక్ష్ణో గురుశ్చైవ సోఽతిమాత్రం ప్రవర్తయేత్)

(విరేచనైర్నిరూహైశ్చ వస్తిభిశ్చానులోమికైః,
అతితీక్ష్ణో గురుశ్చైవ సోఽతిమాత్రం ప్రవర్తయేత్)
స్రుతేషు తస్య దోషేషు నిరూఢస్యాఽతిమాత్రశః,
స్తబ్ధో దావృత్తకోష్ఠస్య వాయుస్సమ్ప్రతిహన్యతే. ౪౮
విలోమః సముద్భూతో రుజత్యఙ్గాని దేహినః,
గాత్రవేష్టననిస్తోదభేదస్ఫురణజృమ్భణైః.
(పక్వోదకమ్పసంస్తమ్భసాదవేపథుజృమ్భణైః) ౪౯

వ్యా. స్నేహస్వేదవిధులజేయకయే గురువును తీక్ష్ణంబును నగువస్తిని అధికపరిమాణముగ ప్రయోగించినయెడ నయ్యది శరీరమునందలి దోషములను ప్రమాణాధికముగ వెడలించును. అట్టినిరూహవస్తియొక్క అతియోగమునంజేసి దోషము లధికముగ స్రవించి మరుజూని కోష్ఠము స్తంభించి వాతము ఊర్ధ్వముగ వ్యాపించును. విలోమగతి నొందిన వాతము మిక్కిలి ప్రకుపితమై అవయవములయందు మెలిబెట్టినవిధముగను, సూదుల బొడిచినవిధముగను, పగులదీయునట్లును బాధల గల్గించును. ఒడలివిరుపుల బుట్టించును. ఇయ్యది అంగార్తియను పదియవవస్తివ్యాపత్తు. (ఇది వస్త్యతియోగమున సంభవించును.)

## అంగార్తివస్తివ్యాపచ్చికిత్స.

మూ. తం తైలలవణాభ్యక్తం సేచయేదుష్ణవారిణా,
ఏరణ్డపత్రనిష్క్వాథైః ప్రస్తరైశ్చోపపాదయేత్. ౫౦
యవాన్ కులుత్థాన్ కోలాని పఞ్చమూలే తథోభయే,
జలాఢకద్వయే పక్త్వా పాదశేషేణ తేన చ. ౫౧
కుర్యాత్ సబిల్వతైలోష్ణలవణేన నిరూహణం,
తం నిరూఢం సమాశ్వస్తం ద్రోణ్యాం సమవగాహయేత్. ౫౨
తతో భుక్తవతస్తస్య కారయేదనువాసనం,
యష్టీమధుకతైలేన బిల్వతైలేన వా భిషక్. ౫౩

వ్యా. పైజెప్పబడిన అంగార్తివస్తివ్యాపత్తుచే బాధితుడైనవానికి సైంధవలవణముతో కూడిన తైలముచే శరీరమునందంతటను అభ్యంగనముచేయించి వేడినీళ్లచే స్నానము చేయించవలెను. పిమ్మట ఆముదపాకు కషాయముచే స్వేదనముచేసి విధిప్రకారము ప్రస్తర స్వేదముల చేయవలెను మరియు యవలు, ఉలవలు, రేగుపండ్లు, మహాపంచమూలములు,

హ్రస్వపంచమూలములు, (అను రెండువిధములైన పంచమూలములు), అను నీద్రవ్యములను రెండాఢకముల పరిమితమైన జలమునచేర్చి నాల్గవపాలు మిగులునట్లు క్వాథము చేసి, అందు బిల్వతైలమును సైంధవలవణమును కలిపి సుఖోష్ణముగజేసి విధ్యుక్తప్రకారము నిరూహవస్తిని చేయవలెను. అట్టినిరూహవస్తిచే సమ్యగ్యోగమును గమనించి వానికి సేదదీర్చి సుఖోష్ణజలముతో నిండినతొట్టియందు అవగాహస్నానమును చేయించవలెను. పిమ్మట సముచితముగ నాహారమును భుజింపజేసి అతిమధురమునైనను బిల్వవేరునైనను చేర్చి పక్వముచేయబడిన తైలముచే విధిప్రకారము అనువాసనవస్తిని చేయవలెను.

(11) పరికర్తిక యనువస్తివ్యాపత్తు లక్షణము.

మూ. మృదుకోష్ఠాఽల్పదోషస్య రూక్షస్తీక్ష్ణోఽతిమాత్రవాన్,
వస్తిర్దోషాన్నిరస్యాశు జనయేత్పరికర్తికామ్. ౫౪
త్రికవంక్షణవస్తీనాం తోదం నాభేరధో రుజం,
విబన్ధోఽల్పాఽల్పముత్థానం వస్తినిర్లేఖనాద్భవేత్. ౫౫

వ్యా. మృదువైనకోష్ఠము కలవానికిని, స్వల్పదోషము కలవానికిని రూక్షంబును తీక్ష్ణంబును నగువస్తిని ప్రయోగించినను, ప్రమాణాధికముగ ప్రయోగించినను కోష్ఠమునందలి దోషములను వెడలించి పరికర్తిక యనువ్యాపత్తును కల్గించును. దీనియందు త్రిక (వెన్నెముకకు క్రిందిసంధి) ప్రదేశమునందును గెజ్జలయందును వస్తియందును సూదుల బొడిచినవిధముగ పోటును, నాభికి క్రిందిభాగమున నొప్పిని కల్గించును. మలము బద్ధగించి కొంచెముకొంచెముగ వెడలును. అట్టియుపద్రవములు తీవ్రమైనవాతము వస్తినాకర్షించుటచే సంభవించును (ఈవ్యాపత్తు వస్త్యతియోగముచే గల్గు పదునొకండవది.)

పరికర్తికావ్యాపత్తు చికిత్స.

మూ. స్వాదుశీతౌషధైస్తత్ర పయఇక్ష్వాదిభిశ్శృతం,
యష్ట్యాహ్వాతిలకల్కాభ్యాం వస్తిస్స్యాత్ క్షీరభోజినః ౫౬
ససర్జరసయష్ట్యాహ్వాజిఙ్గినీకర్దమాఞ్జనం,
వినీయ దుగ్ధేవస్తిస్స్యాత్ వ్యక్తామ్లమృదుభోజినః. ౫౭

వ్యా. పైజెప్పినవస్తి వ్యాపత్తునందు మధురంబులును శీతవీర్యంబులును నగు చెరకు మొదలగునౌషధములను అతిమధురముయొక్కయు నువ్వులయొక్కయు కల్కమును గూర్చి కాచబడినపాలచే వస్తినిచ్చి పాలను ఆహారముగ బెట్టవలెను. మరియు సర్జరసము

(మడ్డిపాలు), అతిమధురము, మంజిష్ఠి, చందనము, రసాంజనము అను నీయౌషధములను పాలలో కలిపి కాచి వస్తిప్రయోగము చేయనగును. మిక్కిలి పులుపుకల్గి మృదువైన యాహారమును భుజింపనగును.

## (12) పరిస్రవమను వస్తివ్యాపత్తులక్షణము.

మూ. పిత్త (రోగే) రక్తేఽమ్లఉష్ణోవా తీక్ష్ణోవా లవణోఽథవా,
వస్తిర్దిఖతి పాయుం తు క్షిణోతి విదహత్యపి ౫౮
స విదగ్ధః స్రవత్యస్రం పిత్తం చానేకవర్ణవత్,
సార్యతే బహువేగేన (బహుధా హ్యతివేగేన)
మోహంగచ్ఛతి చాసకృత్. ౫౯

వ్యా. సామాన్య పిత్తరోగమునందైనను, రక్తపిత్తమునందైనను, ఉష్ణవీర్యమయిన వస్తినైనను, తీక్ష్ణమైనవస్తి నైనను, లవణముతోకూడిన వస్తినైనను, ప్రయోగించినచో, నయ్యది గుదమును గీచును. హింసాకరమైన బాధ పెట్టును. తీవ్రమైనమంట కల్గించును. అట్టివస్తి విదాహముతోకూడి అనేకవర్ణములతో కూడినరక్తమును పిత్తమును స్రవింప జేయును. మిక్కిలివేగముతోకూడి పలుమారు రక్తము స్రవించుటవలన పలుమారు మూర్ఛ కల్గును. ఇయ్యది పరిస్రవమను పండ్రెండవవ్యాపత్తు. (ఇది వస్త్యతియోగమున సంభ వించును.)

## పరిస్రవవ్యాపత్తుచికిత్స.

మూ. ఆర్ద్రశాల్మలివృన్తైస్తు క్షుణ్ణైరాజం పయః శృతం,
సర్పిషా యోజితం శీతం వస్తిమస్మై ప్రదాపయేత్. ౬౦
వటాదిపల్లవేష్వేష కల్పో యవతిలేషు చ,
సువర్చలోపోదికయోః కర్బుదారే చ శస్యతే. ౬౧
గుదే సేకాఃప్రదేహాశ్చ శీతాః స్యుర్మధురాశ్చ యే,
రక్తపిత్తాతిసారఘ్నీ క్రియా చాత్ర ప్రశస్యతే. ౬౨

వ్యా. పచ్చివిగనుండు బూరుగపువ్వుల తొడిమలను నలియగొట్టి, మేకపాలలో కలిపి కాచి, అందు నేతినికూడకలిపి చల్లగజేసి పైజెప్పినవ్యాపత్తునందు వస్తినీయవల యును. ఈకల్పప్రకారముగా మఱ్ఱిమొదలగువాని చిగుళ్లతోను, చక్రవర్తికూరతోను,

బచ్చలియాకుతోను, దేవకాంచనముతోను, కల్పించి వస్తిప్రయోగము చేయుట చాల ప్రశస్తము. మరియు గుదస్థానమున శీతవీర్యములును, శీతస్పర్శములును, మధురరసంబులును అగుసౌషధములచే తడుపుటయు, పట్టువేయుటయు చాలమంచిది. మరియు చికిత్సాస్థానమున చెప్పబడిన రక్తపిత్తహరంబులును, అతిసారనాశకంబులును అగుచికిత్సలన్నియు నీవ్యాపత్తున నుపయోగించుట చాల ప్రశస్తము. (ఇత్తెరంగున "గురుకోష్ఠే నిలప్రాయే" అని యుపక్రమించి చెప్పబడిన పైగ్రంథముచేత 'కిం లక్షణం? కా చికిత్సా' అను నాలుగైదుప్రశ్నముల రెండిటికిని ఉత్తరముగ పండ్రెండువస్తివ్యాపత్తుల లక్షణములును వానిచికిత్సలును వేరువేరుగ చెప్పబడినవి.)

### వస్తియొక్క మృదుత్వ-తీక్ష్ణత్వముల గల్పించువిధము.

మూ. తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్నిలవణక్షారసర్షపైః,
ప్రాప్తకాలం విధాతవ్యం క్షీరాద్యైర్మార్దవం తథా. ౬౩

వ్యా. పైజెప్పబడిన వస్తులయందును, వస్తిప్రకరణ సామాన్యముగను, మృదుతీక్ష్ణభేదములుగ అచ్చటచ్చట చెప్పబడినవి. అట్టిమార్దవమును తీక్ష్ణత్వమును కల్గించుద్రవ్యగణము ఈశ్లోకముచే నిర్దేశింపబడును:—గోమూత్రము, కొండగోగుకాయలు, చిత్రమూలము, సైంధవలవణము, యవక్షారము మున్నగుక్షారములు, ఆవాలు, అను నీద్రవ్యములసంసర్గముచే వస్త్యౌషధమునకు తీక్ష్ణత్వమును కల్పింపవగును. పాలు మొదలగుద్రవ్యముల సంసర్గముచే మృదుత్వము కల్గును. కావున ఆయాఅవసరమునుబట్టి రోగముయొక్క బలాద్యనుగుణముగ వస్త్యౌషధమునకు తీక్ష్ణత్వమునైనను, మృదుత్వమునైనను పైజెప్పినద్రవ్యములసంసర్గముచే గల్పించి నుపయోగించవలయునని భావము.

### వస్తిప్రయోగముచే సర్వశరీరమలహరత్వనిర్ణయము.

మూ ఆపాదతలమూర్ధస్థాన్ దోషాన్ పక్వాశయే స్థితః,
వీర్యేణ వస్తిరాదత్తే ఖస్థోఽర్కో భూరసానివ. ౬౪

వ్యా. మనుజులశరీరమున పాదముల మొదలుజేసి శిరస్సువరకును గలసర్వావయవములయందలి దోషముల నన్నిటిని ఆమాశయమున ప్రయోగింపబడిన వస్త్యౌషధము తనయందలి స్వభావసిద్ధమయిన శక్తిచే (ఆకసమునసుండు సూర్యుడు భూమియందలి జలము నాకర్షించుభంగి) అతిశీఘ్రముగ నాకర్షించును. (తక్కినపాచనాద్యౌషధములు తనయందలి వీర్యముచే కాలాంతరమున స్వకార్యమును నివర్తింపజేయును. కాని వస్త్యౌషధము అటుకాక ప్రయోగించినవెంటనే తనశక్తిచే స్వకార్యమును నిర్వర్తించి దోష

ములు హరించునని భావము. ఈవిషయమునే సుశ్రుతాచార్యుడును నిట్లుపదేశించెను. "వీర్యేణ వస్తిరాదత్తే దోషానాపాదమస్తకాత్, పక్వాశయస్థోఽమ్బరగో భూమేరర్కో రసానివ" (సు. చి. అ. 3౫.)

### వస్తిశరీరమునుండి మలాంశమునుమాత్రము హరించువిధము.

మూ. యద్వత్కుసుమ్భసంమిశ్రాత్తోయాద్రాగం హరేత్పటః,
తద్వద్ద్రవీకృతాత్ దేహాత్ నిరూహో నిర్హరేన్మలాన్. ౬౫

వ్యా. లోకమున కుసుంభవర్ణమును కల్గించు వర్ణకరచూర్ణముతో కలిసినజలమునుండి వస్త్రము వర్ణమునుమాత్రము (జలమును వదలి) ఆకర్షించువిధముగ, స్నేహస్వేదవిధులచే ద్రవించి పట్టువదలి శిథిలములైనదోషములు గలశరీరమునుండి ప్రసాదాంశమునుమాత్రము వదలి దోషములను మలములనుమాత్రము విధ్యుక్తముగ ప్రయోగింపబడినవస్తి యాకర్షించును. (మనుజులచే భుజింపబడినయాహారము జాఠరాగ్నిచేతను ధాత్వగ్నులచేతను విపాకమునొంది సారరూపముగను దోషమలరూపముగను పరిణమించును. అందు మలములమాత్రము ఆకర్షించి శరీరమును నిర్దుష్టముగచేయునది వస్తి యని భావము.)

### అధ్యాయోక్తవిషయసంగ్రహము.

మూ. ఇత్యేతాః వ్యాపదః ప్రోక్తాః వస్తేస్సాకృతిభేషజాః,
బుద్ధ్వా కార్త్స్న్యేన తాః వస్తీన్ నియుఞ్జన్నాపరాధ్యతి. ౬౬

వ్యా. ఇత్తెరంగున వస్తియొక్క అయోగ-అతియోగ-మిథ్యాయోగములచే సంభవించువ్యాపత్తులును, వానిలక్షణంబులును, వానిచికిత్సితములును వివరించి చెప్పబడినవి. వీనినన్నిటిని పూర్తిగ నెరింగి విధ్యుక్తమునకు వ్యతిరేకములేక వస్తులను యుక్తియుక్తముగ ప్రయోగించినచో వైద్యుం డెక్కప్పుడును పొరబడక కార్యసిద్ధిని బడయగలడు. (వస్తివ్యాపత్తుల కెడమియ్యక రోగికిగలదోషముల హరింపజేయ సమర్థుడగునని భావము.)

### అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే వస్తివ్యాపత్సిద్ధిర్నామ సప్తమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహిత యనునాయుర్వేదతంత్రమున దృఢబలసంపూరితమైన సిద్ధిస్థానమున వస్తివ్యాపత్సిద్ధి యను సప్తమాధ్యాయము సంపూర్ణము.

---

## అ ష్ట మా ధ్యా య ము.

అవతరణిక:—పూర్వాధ్యాయమున వస్తివ్యాపత్తుల శమింపజేయునుపాయములు వివరింపబడినవి. పిమ్మట అట్టివస్తివ్యాపత్తుల శమింపజేయు మరికొన్నియుపాయాంతరముల జెప్పునట్టి ప్రాసృతయోగికసిద్ధి యనునధ్యాయము వివరముగ జెప్పబడును.

అధ్యాయప్రారంభము.

మూ. అథాతః ప్రాసృతయోగికీం (ప్రాసృతయోగీయాం) సిద్ధిం
వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వస్తివ్యాపత్సిద్ధిని చెప్పినపిదప ప్రాసృతయోగిక (ప్రసృతప్రమాణముచే నుపలక్షితములగు యోగముల నధికరించి చేయబడు) సిద్ధిని, భగవానుడగు నాత్రేయమహర్షి యుపదేశించినదానికన్న న్యూనాతిరేకము కాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

విషయనిర్దేశము.

మూ. అథేమాన్ సుకుమారాణాం నిరూహాన్ స్నేహనాన్ మృదూన్,
కర్మణా విప్లుతానాం చ వక్ష్యామి ప్రసృతైః పృథక్. 3

వ్యా. పిమ్మట సుకుమారులకును పనుల చేయుటచే బడలియున్నవారికిని ఉపయోగింపదగినవియగు మృదువులును స్నేహనములునైన నిరూహవస్తులను ప్రసృతప్రమాణములతో వేరువేరుగ చెప్పబడును.

{ (1) మార్దవస్నేహనములైననిరూహవస్తులు తొమ్మిది. అందు వాతహరంబును వర్ణకరంబునునగు నిరూహవస్తి. }

మూ. క్షీరాత్ ద్వౌ ప్రసృతౌ కార్యౌ మధుతైలఘృతాత్ త్రయః,
ఖజేన మథితో వస్తిః వాతఘ్నో బలవర్ణకృత్. ౪

వ్యా. ఆవుపాలు రెండుప్రసృతములు, తేనెయు తైలంబును ఘృతంబును వేరువేర నొక్కొకప్రసృతమువంతున చేరి మూడుప్రసృతములు, వీనినన్నిటి నొకటిగ కలిపి కవ్వముతో కలియబెట్టి వస్తిప్రయోగముచేసిన వాతమును హరించి బలమును శరీరకాంతిని కల్గించును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—ఎచ్చట ద్రవ్యములను విశేషవిధిగ ప్రత్యేకించి నిర్దేశించియుండునో ఆయోగములయందు నిర్దేశింపబడిన ద్రవ్యములమాత్రమే

గ్రహింపవలెగాని నిరూహవస్తియందు సామాన్యముగ నిర్దేశింపబడిన కల్కాదుల గ్రహింప నవసరములేదు. ఈన్యాయమునను సరించి యీయోగమునందు పైనినిర్దేశింపబడిన క్షీరాది ద్రవ్యములమాత్రమే గ్రహించవలెగాని అనుక్తకల్కాదుల గ్రహింప బనిలేదు. మరియు నేవస్తియోగములయందు ద్రవ్యపరిమాణము నిర్ణయముగ జేర్కొనంబడునో, అచ్చట నిరూహసామాన్యముగ జెప్పబడిన వస్తిప్రమాణమును గ్రహింపక నిర్ణీతపరిమాణముగనే గ్రహింపనగును. ఏయోగములయందు ద్రవ్యైకదేశమునకు మాత్రము పరిమాణమును నిర్దేశించి, కొన్నిటిపరిమాణమును నిర్దేశింపకుందునో, అట్టిస్థలమున అనుక్తపరిమాణద్రవ్యములకు నిరూహసామాన్యముగ జెప్పబడిన పరిమాణమునే గ్రహించునది. ఈన్యాయమునను సరించి పైయోగమున క్షీరాదులకు పరిమాణము నిర్దేశింపబడినది, కావున సామాన్యనిర్దిష్టపరిమాణము గ్రహింపవగదు. ఈనిర్ణయము నీక్రిందియోగములకును అన్వయించుకొనునది.

(2) వాతహరనిరూహవస్తి.

మూ. ఏకైకః ప్రసృతస్తైలప్రసన్నాక్షౌద్రసర్పిషాం,
బిల్వాది మూలక్వాథాత్ ద్వౌ కౌలుత్థాత్ ద్వౌ స వాతనుత్. ౫

వ్యా. తైలము, మద్యముపైతేట, తేనె, ఘృతము ఇవి ప్రత్యేక మొక్కొక ప్రసృతమువంతునను, బిల్వాదిమహాపంచమూలములక్వాథము రెండుప్రసృతములును, ఉలవలకషాయము రెండుప్రసృతములును చేర్చి వస్తినిచేసిన వాతమును హరించును.

(3) వాతహరనిరూహవస్తి రెండవది.

మూ. పఞ్చమూలరసాత్ పఞ్చ ద్వౌ తైలాత్ క్షౌద్రసర్పిషోః,
ఏకైకః ప్రసృతో వస్తిః స్నేహనీయోఽనిలాపహః. ౬

వ్యా. పంచమూలకషాయము ఐదుప్రసృతములు, తైలము రెండుప్రసృతములు, తేనె యొకప్రసృతము, నెయ్యి యొకప్రసృతము ఈభాగములప్రకారము పైద్రవ్యముల నన్నిటిని గూర్చి కవ్వముతో కలియచిలికి వస్తిచేయించిన రూక్షముగనుండుశరీరము స్నిగ్ధమగును. వాతమును హరించును.

(4) శుక్రకరనిరూహవస్తి.

మూ. సైన్ధవార్ధాక్ష ఏకైకః క్షౌద్రతైలపయోఘృతాత్,
ప్రసృతో హపుషా కర్షో నిరూహః శుక్రకృత్పరమ్. ౭

వ్యా. సైంధవలవణము అర్ధకర్షము, తేనె తైలము పాలు నెయ్యి ఇవి ప్రత్యేకము ఒక్కొక ప్రసృతము, బోడతరము కర్షమాత్రము వీనినన్నిటి నొకటిగఁగూర్చి కలియబెట్టి నిరూహవస్తిజేసిన శుక్రము మిక్కిలి వృద్ధినొందించును.

## (5) మేహాదిహర పంచతిక్తనిరూహవస్తి.

మూ. పటోలనిమ్బభూనిమ్బరాస్నాసప్తచ్ఛదామ్భసః,
చత్వారః ప్రసృతాః, ఏకో ఘృతాత్ సర్షపకల్కితః. ౮
నిరూహః పఞ్చతిక్తోఽయం మేహాఽభిష్యన్దకుష్ఠనుత్,

వ్యా. చేదుపొట్ల, వేపపట్ట, నేలవేము, సన్నరాష్టము, ఏడాకులపొన్న ఈయైదిటిని సమభాగములుగఁగూర్చి యీక్వాథ్యమునకు నాలుగింతలు నీళ్లు కలిపి నాల్గవపాలు మిగులునట్లు కాచబడినకషాయము నాల్గుప్రసృతములు, నెయ్యి, యొకప్రసృతము, ఆవాలకల్కము వీనినన్నిటి నొకటిగఁగూర్చి నిరూహవస్తిచేసిన నియ్యది పంచతిక్తనిరూహవస్తి యనబడును. ఇయ్యది ప్రమేహమును, అభిష్యందమను నేత్రరోగమును, కుష్ఠమును హరించును.

ఇచ్చట సర్షపకల్కమునకుమాత్రము పరిమాణము చెప్పబడలేదు. ఐనను ద్వాదశప్రసృతపరిమితవస్తికి కల్కము రెండుపలములు సామాన్యముగ విహితముకావున నీయోగమునందు పటోలాదిక్వాథంబును ఘృతంబును చేరినసముదాయము ఐదుప్రసృతములయందు ఆవాలకల్కమును ఆరవవంతు తక్కువైన పలప్రమాణముగ జేర్చుకొనునది. ఇత్తెరంగుననే స్థలాంతరములయందును ఔషధప్రమాణానుసారముగ కల్కపరిమాణమును కల్పించునది. ఈకల్కసామాన్యపరిమాణనిర్దేశము జతూకర్ణతంత్రమున నిట్లున్నది.— “చతుర్వింశతికే పుటకే పేష్యాణాం ద్విపలమ్.”

## (6) క్రిమినాశన విడంగాదినిరూహవస్తి.

మూ. విడఙ్గత్రిఫలాశిగ్రుఫలముస్తాఖుపర్ణిజాత్. ౯
కషాయాత్ ప్రసృతాః పఞ్చ తైలాదేకో విమథ్య తాన్,
విడఙ్గపిప్పలీకల్కో నిరూహః క్రిమినాశనః. ౧౦

వ్యా. వాయువిడంగములు, త్రిఫలములు, మునగపట్ట, మ్రంగకాయలు, తుంగగడ్డలు, ఎలుకచెవియాకు వీనిని సమభాగములుగఁగూర్చి పరిభాషానుసారముగ కషాయము కాచి యాకషాయము ఐదుప్రసృతములు, తైలమొకప్రసృతము, వాయువిడఙ్గములను

పిప్పళ్లను కల్కముచేసి, యాకల్కము ఒకపలము వీనినన్నిటి నొకటిగ కలిపి కవ్వముతో చక్కగ కలియునట్లు చిలికి దీనిచే నిరూహవస్తి చేసినచో క్రిములను నశింపజేయును. (ఇచ్చట పైనిచెప్పిన న్యాయము ననుసరించి యారుప్రసృతములద్రవమున విడంగపిప్పలీ కల్కమును పలపరిమితముగ జేర్చునది.)

## (7) వృష్య (శుక్రవృద్ధి) కరనిరూహవస్తిః

మూ. పయస్యేక్షుస్థిరారాస్నావిదారీక్షౌద్రసర్పిషామ్,
ఏకైకః ప్రసృతో వస్తిః కృష్ణాకల్కో వృషత్వకృత్. ౧౧

వ్యా. పాలకూర (లేక క్షీరకాకోళి), చెరకు, ముయ్యాకుపొన్న, సన్నరాష్ట్రము, నేలగుమ్మడి ఈయైదిటిని వేరువేరుకషాయముచేసి యాకషాయములు వేరువేరుగ నొక్కొక ప్రసృతము, తేనె యొకప్రసృతము, నెయ్యి యొకప్రసృతము వీనినన్నిటి నొకటిగ గూర్చి; అందు పిప్పలీకల్కమును పైజెప్పినరీతిగ (ద్రవసముదాయమునకు పండ్రెండవ వంతు) చేర్చి కవ్వముతో కలియచిలికి నిరూహవస్తిచేసినచో శుక్రమును వృద్ధినొందించి వృష్యముగ నుండును.

ఇచ్చట పయస్యాదిద్రవ్యములైదిటి కషాయమని చెప్పకున్నను ద్రవరూపమైన తేనె ఘృతములతో సమముగజేర్చి యొక్కొకప్రసృతమని నిర్దేశించియుండుటచేతను సాహచర్యముచేతను పయస్యాదులకషాయమని గ్రహించునది. చెరకుకుండిమాత్రము రసమును గ్రహించుట సమంజసము.

## (8) మలభేదనకరనిరూహవస్తి.

మూ. చత్వారస్తైలగోమూత్రదధిమణ్డామ్లకాఞ్జికాత్,
ప్రసృతాః సర్షపైః కల్కైః (పిష్టైః) విట్సఙ్గానాహభేదనః. ౧౨

వ్యా. తైలము, గోమూత్రము, పెరుగుపైమీగడ, పుల్లనిగంజి అనునీద్రవములు నాల్గును ప్రత్యేక మొక్కొకప్రసృతమువంతునచేరిన ద్రవసముదాయము నాల్గు ప్రసృతములను ఆవాలను కల్కముగ నూరి యాకల్కము (ద్రవములకు పండ్రెండవ వంతు)ను జేర్చి యన్నిటిని కలియచిలికి నిరూహవస్తిచేసిన మలచిక్కును విడదీసి కడుపుబ్బరమును హరించును. మలముల భేదించును.

## (9) మూత్రకృచ్ఛ్రమునకు శ్వదంష్ట్రాదినిరూహవస్తి.

మూ. శ్వదంష్ట్రాశ్మభిదేరణ్డరసాత్ తైలాత్ సురాసవాత్,
ప్రసృతాః షట్చ యష్ట్యాహ్వాకాస్తీమాగధికా సితాః ౧౩

కల్కస్స్యాత్ మూత్రకృచ్ఛ్రే తు సానాహే వ స్తిరుత్తమః,
(కల్కో వ స్తిస్తు సానాహే మూత్రకృచ్ఛ్రే పరో మతః)
ఏతే సలవణాః కోష్ణాః నిరూహాః ప్రసృతైర్నవ. ౧౪

వ్యా. ఏనుగుపల్లేరు, పాషాణభేది (కొండపిండిచెట్టు), ఆముదపువేళ్లు ఈమూటి కషాయములు వేరువేరుగ నొక్కొక ప్రసృతము, తైల మొక ప్రసృతము, సురామద్య మొకప్రసృతము ఇత్తెరంగునకూడిన ద్రవసముదాయము ఐదుప్రసృతములు; అతిమధురము, రేణుకలు, పిప్పళ్లు, చక్కెర ఈనాల్గుద్రవ్యముల కల్కసముదాయము (ద్రవములకు పండ్రెండవవంతు) వీనినన్నిటి నొకటిగ గూర్చి చక్కగ కలియచిలికి నిరూహవస్తి చేయునది. ఇయ్యది మూత్రకృచ్ఛ్రమునందును, దానగల్గిన ఆనాహము(కడుపుబ్బరము) నందు నుపయోగించుటకు చాల ప్రశస్తమై యుండును.

ప్రసృతప్రమాణమును అనుసరించి పైజెప్పబడిన వస్తులతొమ్మిదిటియందును సైంధవలవణమునుకూడ చేర్చి కొంచెము సుఖోష్ణముగ జేసి ప్రయోగింపనగును.

వస్త్యయోగాతియోగములయందు చికిత్స.

మూ. మృదువస్తుజడీభూతే తీక్ష్ణోఽన్యో వ స్తిరిష్యతే,
తీక్ష్ణైర్వికర్షితే స్వాదు ప్రత్యాస్థాపనమిష్యతే. ౧౫

వ్యా. పైజెప్పిన నిరూహవస్తులలో మృదుగుణవస్తుల నుపయోగించుటచేత జడత్వముకల్గినచో (నిరూహవస్తి పనిచేయనియెడ) తీక్ష్ణమైన వేరొండువస్తిని ప్రయోగించవలెను. తీక్ష్ణమైనవస్తి ప్రయోగముచే నతియోగము సంభవించినయెడ ద్రాక్షాదిమధుర ద్రవ్యములచేర్చి మృదువుగ గల్పింపబడిన ఆస్థాపనవస్తిని ప్రయోగింపవలెను. (ప్రత్యాస్థాపనమన—తొలుత ప్రయోగించిన ఆస్థాపనవస్తి నుద్దేశించి రెండవతూరి ప్రయోగింపబడు ఆస్థాపనవస్తియని యెరుంగునది. ఈవిషయమును "ఆస్థాపనం లత్యైకృత్య దీయత ఇతి ప్రత్యాస్థాపనం" అని చక్రపాణివ్యాఖ్యతో వివరించెను. మరియు వస్తికి మృదుత్వమును తీక్ష్ణత్వమును కల్పించువిధము "తీక్ష్ణత్వం మూత్ర......క్షీరాద్యైర్మార్దవం తథా" (సి. అ. ౭. శ్లో. ౬౩) అనుశ్లోకముచే జెప్పబడినదాని నెరుంగునది.)

వస్తిప్రయోగమునకల్గిన గుదదాహాదులకు ద్రాక్షారసాదిపానము.

మూ. వాతోపసృష్టస్యోష్ణైస్స్యుః గుదదాహాదయో యది,
(గదా దాహాదయో యది)

ద్రాక్షామ్బునా త్రివృత్కల్కం దద్యాద్దోషానులోమనమ్. ౧౬
తద్ధి పిత్తశకృద్వాతాన్ హృత్వా దాహాదికాన్ జయేత్,
శుద్ధశ్చాపి పిబేచ్ఛీతాం యవాగూం శర్కరాయుతామ్. ౧౭

వ్యా. వాతం బధికముగ నున్నవానికి ఉష్ణవీర్యములగువస్తుల ప్రయోగించుటవలన గుదస్థానమున మంట, తాపము మున్నగువ్యాధులు సంభవించినయెడ తెగడచూర్ణమును కల్కముజేసి ద్రాక్షపండ్లరసమునకలిపి త్రాగించినచో దోషముల ననులోమముగ జేసి పిత్తమును, మలమును, వాతమును హరించి, దాహము మోహము మూర్ఛ మున్నగు నుపద్రవముల హరించును. పైజెప్పిన త్రివృత్కపానముచే చక్కగ దోషము వెడలి శుద్ధకోష్ఠమైనపిదప శీతవీర్యద్రవ్యములచే సంస్కరింపబడి చల్లనైయుండు యవాగువును చక్కెర కలిపి యాహారముగ త్రాగవలెను.

విరేకాతిరేకముచే గల్గినపురీషక్షయమునకు చికిత్స.

మూ. అథవాఽతివిరిక్తస్స్యాత్ క్షీణవిట్కస్స భక్షయేత్,
మాషయూషేణ కుల్మాషాన్ పిబేత్ మధ్వథవా సురామ్. ౧౮

వ్యా. శోధనాతిరేకముచే విరేచనము లధికముగనై, దానంజేసి పురీషము క్షీణించియున్నయెడ కుల్మాషములను (అలచందులు సెనగలు మున్నగుగుగ్గిళ్లను) మినుముల యూషము ననుపానముగ జేసి తినవలెను, లేక మధుమద్యమునైనను సురామద్యమునైనను త్రాగవలెను.

వస్తిమిథ్యాప్రయోగముచే సంభవించు అతీసారములచికిత్సలు.
అందు ఆమాతిసారచికిత్స.

మూ. సామం చేత్కుణపం శూలైః ఉపవిశేదరోచకీ, [రః)
(సామంచేదతిసార్యేత పూతిశూలైరరోచకీ-శూలారోచకవాన్స
స ఘనాఽతివిషా కుష్ఠ న తదారువచాః పిబేత్. ౧౯

వ్యా. శూలంబు (పోటు)ను అరోచకంబును కల్గించి శవదుర్గంధముతోగూడి మలములేకయే కేవలము ఆమమాత్రము విరేచనము అధికముగనగుచున్నచో తుంగగడ్డలు, అతివస, చెంగల్వకోష్ఠు, గ్రంథితగరము, వస అను నీద్రవ్యములను కషాయముకాచి త్రాగవలెను. (ఇచ్చట నవీనముద్రితకోశమున మొదటగనపరచినపాఠమును ప్రధానముగ గనపరచియున్నది. ప్రాచీనప్రతియందు పాఠాంతరమున్నది. కాని ప్రాచీనపాఠమే సమంజసము. రెండుపక్షములయందును అర్థభేదములేదు.)

ఇచ్చట విధ్యుక్తమునకు వ్యత్యస్తముగ చేయబడిన వస్తిప్రయోగముచే ఆమాద్యతిసారములు సంభవించును. అందు మొదటిది పురీషాదిసంబంధములేక కేవలము ఆమరూపముగ వెడలునతిసారము. దానిచికిత్స యిచట చెప్పబడినది. తక్కినఅతిసారభేదములకును చికిత్సలు క్రిందజెప్పబడును. ఆమమన—కాయాగ్నిబలహీనముగ నుండుటంజేసి చక్కగ పక్వముకాని యాహారముయొక్క రసము కోష్ఠమునం దుపలేపముగ చిక్కినది ఆమశబ్దముచే నిచ్చటచెప్పబడును. ఇది స్థలాంతరమున నిట్లు చెప్పబడినది—ఆమాశయస్థః కాయాగ్నేః దౌర్బల్యాదవిపాచితః, ఆద్యఆహారధాతుర్యః స ఆమ ఇతి సంజ్ఞితః."

పురీషాద్యతిసారములైదిటికిని సామాన్యచికిత్సానిర్దేశము.

మూ॥ శకృద్వాతమసృక్పిత్తం కఫం వా యోఽతిసార్యతే,
పక్వం, తత్ర స్వవర్గీయైః వస్తిశ్శ్రేష్ఠం భిషగ్జితమ్.　　　౨౦

వ్యా. పురీషము, వాతము, రక్తము, పిత్తము, కఫము అనునీయైదిటితో నేదైనను ఆమరససంబంధములేక పక్వమై గుదమునుండి యధికముగ పలుమారు వెడలుచున్నయెడ ఆయావర్గములలో జేరిన (పురీషసంగ్రహణ-వాతశోణితాస్థాపన-పిత్తకఫహర) ద్రవ్యముల చేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రయోగించుట చాలశ్రేష్ఠమైన చికిత్స యగును.

ఇచ్చట "మధుమధుకరుధిర...శోణితస్థాపనాని భవన్తి" (సూ. అ. ౪. సూ. ౬౫) అని చెప్పబడిన శోణితస్థాపనవర్గమును, "ప్రియంగ్వనన్తా...పురీషసంగ్రహణానిభవన్తి" (సూ. అ. ౪. సూత్ర. ౫౪) అనిచెప్పబడిన పురీషసంగ్రహణవర్గమును, వాత-పిత్త-కఫహరద్రవ్యములును "స్వవర్గీయైః" అనుపదముచే గ్రహింపబడును. లేక "తత్రామేఽన్తరపానం స్యాత్" అని యుపక్రమించి వేరువేర క్రిందజెప్పబడు నాయాయౌషధములు "స్వవర్గీయైః" అని నిర్దేశింపబడినదని గ్రహించునది.

మరియు నిచ్చట"పక్వం తత్ర" అనుచోట పక్వశబ్దము పురీషాదులకు విశేషణము "పక్వస్తత్ర" అనుపాఠాంతరము ప్రత్యంతరమున నున్నది. ఈపాఠమున వస్తిశబ్దమునకు విశేషణమగును. ఆయావర్గద్రవ్యములచే పక్వమైనవస్తి యని యర్థము. "పక్వమితి—నిరామం" అని వ్యాఖ్యలో నున్నది కావున ప్రథమాంతపాఠము వ్యాఖ్యానవిరుద్ధము.

{ వస్తిమిథ్యాయోగముచే సంభవించు అతిసారభేదములు ముప్పదియారు, వానివివరణము. }

మూ. షణ్ణామేషాం ద్విసంసర్గాత్ త్రింశద్భేదా భవన్తి తు,
కేవలైస్సహ షట్త్రింశత్ విద్యాత్ సోపద్రవానపి.　　　౨౧

వ్యా. పైనిర్దేశింపబడిన ఆమ-శకృత్-వాత-రక్త-పిత్త-కఫభేదములతో నొక్కొక దానిచే నారువిధములుగను, అట్టి ఆమ-వాతాదులలో రెండేసి పరస్పరము కలిసి సంభవించు నతిసారభేదములు ముప్పదివిధములుగను, అన్నియు కలిసి ముప్పదియారు అతిసారభేదము లగును. అవ్వియవి క్రింద జెప్పబడును. శూల మున్నగునుపద్రవములతో కూడియుండును.(ఈసంసర్గభేదములు ముప్పదియు "శకృతావాయునా" అని యుపక్రమించి క్రిందజెప్పబడు చికిత్సావిధానమున విశదమగును. ఇచ్చట "కేవలైస్సహచేత్త్రింశత్" అని ప్రాచీనకోశమున పాఠమున్నది. ఇది సంఖ్యావిరుద్ధమగుటంచేసి యనార్ష పాఠము.)

## అతిసారోపద్రవములు.

మూ. శూలప్రవాహికాఽఽధ్మానపరికర్త్యరుచిజ్వరాః,
త్రృష్ణోష్ణదాహమూర్ఛాదీంశ్చైషాం విద్యాదుపద్రవాన్. ౨౨

వ్యా. శూలము, (నొప్పి), ప్రవాహిక (బద్ధగించి బలాత్కారముగ ముక్కినపుడు కొంచెము కొంచెముగ పలుమారు వెడలుట), ఆధ్మానము, (కడుపుబ్బరము), పరికర్తిక, (గుదస్థానమున కత్తిరించినవిధముగ బాధ), అరోచకము, జ్వరము, దప్పి, ఉష్ణము, దాహము (మంట), మూర్ఛ ఇవిమున్నగునవి పైజెప్పిన యతీసారసామాన్యముగ సంభవించునుపద్రవములు. (ఈయుపద్రవములు వ్యాధిబలానుసారముగ వ్యస్తసమస్తములుగ సంభవించును.)

## పైజెప్పబడిన చికిత్సాభేదములకు వేరువేరుచికిత్సలు.అందు ఆమాతిసారచికిత్స.

మూ. తత్రామేఽన్తరపానం స్యాత్ (తత్రామే వమనం కార్యం)
వ్యోషాఽమ్లలవణైర్యుతం,
పాచనం శస్యతే వస్తిరామే హి ప్రతిషిధ్యతే. ౨౩

వ్యా. పైజెప్పినఅతిసారములలో ఆమాతిసారమున త్రికములు, పులుపుద్రవ్యములు, లవణము అనునీద్రవ్యములను చూర్ణముచేసి "సఘనాతివిషా" అని పైజెప్పబడిన పాచనకషాయమున జేర్చి త్రాగించవలెను. ఆమదోషమునందు వస్తి నిషిద్ధము. (కావున పాచనౌషధమును లోపలికి త్రాగించవలెనుకాని వస్తి చేయదగదని "అన్తరపానం పాచనం శస్యతే" అని విశేషవిధిగ చెప్పబడినది. ఇచ్చట "అనాస్థాప్యాస్తు......కుష్ఠార్తాః" (సి. అ. ౨) అనువాక్యముచే వస్తినిషేధము నెరుంగునది.)

### కేవలపురీషాతిసారమునకు చికిత్స.

**మూ.** వాతఘ్నైః గ్రాహివర్గీయైః వస్తిశ్శకృతి శస్యతే,

వ్యా. ఇతరసంబంధములేక పక్వపురీషముమాత్రము అధికముగ వెడలుచున్నయెడ వాతహారంబులగు దశమూలములను, షడ్విరేచనశతాశ్రితీయమున జెప్పబడిన పురీష సంగ్రహణములగు ప్రియంగ్వాదిగణద్రవ్యములను చేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రయోగించుట చాల ప్రశస్తము.

(జతూకర్ణతంత్రమున "శకృతిశోథఘ్నగ్రాహిభిః వస్తిః" అని చెప్పబడినది. ఇచ్చట శోథఘ్నమన దశమూలములనియే యర్థము.)

### కేవలవాతాతిసారచికిత్స.

**మూ.** స్వాద్వమ్లలవణైశ్శస్తః స్నేహవస్తిస్సమీరణే. ౨౪

వ్యా. కేవలవాతముమాత్ర మధికముగ వెడలుచున్నయెడ మధుర-అమ్లరస ద్రవ్యములను సైంధవలవణమునుచేర్చి పక్వముచేయబడిన స్నేహముచేత అనువాసనవస్తి నిచ్చుట చాల మంచిది.

### కేవలరక్త-పిత్త-కఫాతిసారములచికిత్సలు.

**మూ.** రక్తే రక్తేన పిత్తే తు కషాయస్వాదుతిక్తకైః,
సార్యమాణే కఫే వస్తిః కషాయకటుతిక్తకైః. ౨౫

వ్యా. కేవలరక్తాతిసారమున రక్తముచేత వస్తిని ప్రయోగించునది. కేవలపిత్తాతిసారమున కషాయ-మధుర-తిక్తరసములు కలద్రవ్యములచే సిద్ధమైనవస్తిని ప్రయోగించవలెను. కేవలకఫాతిసారమున కషాయ-కటు-తిక్తరసద్రవ్యములచే సిద్ధమైనవస్తి నియ్యవలెను. (ఇంతదనుక పరస్పరసంసర్గము లేక కేవలము ఆమ-వాత-రక్త-పిత్త-కఫములలో నొక్కొకదానిచే సంభవించు అతిసారములకు ఆరెంటికిని వేరువేరుగ చికిత్సలు చెప్పబడినవి.)

### ద్విసంసర్గాఽతిసారముల ముప్పదిటికిని వేరువేరుచికిత్సలు.

**మూ.** శకృతా వాయునా వాఽఽమే తేన వర్చస్యథాఽనిలే,
సంసృష్టేఽన్తరపానం స్యాత్ వ్యోషామ్లలవణైర్యుతమ్. ౨౬

వ్యా. అధికప్రమాణమగుటచే ప్రధానమైన ఆమము అల్పప్రమాణమగుటచే న ప్రధానమైన పురీషముతోనైనను, అట్టివాతముతోనైనను కూడి వెడలుచున్నను;

ప్రమాణాధికమైన పురీషంబైనను, అట్టిపాతంబైనను, స్వల్పప్రమాణమైన ఆమముతో కూడి వెడలినను, త్రికటుకములు, అమ్లరసద్రవ్యములు, సైంధవలవణము వీనితో కూడిన కషాయాదులను త్రాగవలెను.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది.—ఇచ్చట చెప్పబడు ద్విసంసర్గ (రెండేసి కలిసిన) అతిసారములయందు ఒకటి యధికప్రమాణమగుటంజేసి ప్రధానమనియు, రెండవది యల్పప్రమాణమగుటవలన అప్రధానమనియు నెరుంగునది. తృతీయాంతపదముచే నిర్దేశింపబడినది అప్రధానము. అదియే అల్పప్రమాణము. సప్తమ్యంతముచే నిర్దేశింపబడినది ప్రధానము. అది అధికప్రమాణము. "సహయుక్తేఽప్రధానే" అనువ్యాకరణసూత్రముచేత అప్రధానార్థమున తృతీయ వచ్చినది కావున తృతీయాంతనిర్దిష్టము అప్రధానమని చెప్పబడును. అల్ప-అధికప్రమాణభేదములచే అప్రధాన-ప్రధానభేదము లని యెరుంగునది. ఈనిర్ణయమును క్రింద జెప్పంబడు సంసర్గభేదముల కన్నిటికిని అన్వయించునది (ఈ శ్లోకముచే నాల్గు అతిసారభేదములకు చికిత్స చెప్పబడినది.)

మూ. పిత్తేనామేఽసృజావాపి తయోరామేన వా పునః,
సంసృష్టయోర్భవేత్పానం సవ్యోషస్వాదుతిక్తకమ్. ౨౭

వ్యా. అధికమైన ఆమము స్వల్పమైనపిత్తముతోనైనను, రక్తముతోనైనను కలిసి వెడలినను; అధికపరిమాణమైన పిత్తంబైనను, అట్టిరక్తంబైనను, స్వల్పపరిమాణమైన ఆమముతో కలిసి వెడలినను, త్రికటుకములతోను మధురతిక్తరసములతోడను కూడినకషాయాదుల త్రాగుట యుక్తము. (ఇవి పైనాల్గు అతిసారభేదములకు చికిత్స).

మూ. తథాఽఽమే కఫసంసృష్టే కషాయవ్యోషతిక్తకమ్,
ఆమేన తు కఫే వ్యోషకషాయలవణైర్యుతమ్. ౨౮

వ్యా. ప్రమాణాధికమైనఆమము అల్పప్రమాణమైనకఫముతో కలిసి వెడలుచున్నయెడ కషాయరసముతోను త్రికటుకములతోడను తిక్తరసముతోడను కూడినకషాయాది పాచనపానము చేయవలెను. మరియు అల్పపరిమితికల ఆమముతో నధికపరిమితికల కఫము కలిసి వెడలుచున్నయెడ త్రికటుకములును కషాయరసంబును సైంధవలవణంబును చేరినకషాయాదుల త్రాగవలెను. (ఇవి రెండు కషాయభేదములచికిత్సలు). ఇచ్చట ఇరువదియవశ్లోకమున మొట్టమొదటియోగమునందు జెప్పబడిన "అంతరపానం" అనుపదమును, పైజెప్పబడిన యోగములన్నిటియందును అనువర్తించి యన్వయించునది.

మూ. వాతేన విషి పిత్తే వా; విట్-పిత్తాస్రైః తథాఽనిలే,
　　మధురామ్లకషాయస్స్యాత్ సంసృష్టే వస్తిరుత్తమః.　　　౨౯

వ్యా. అధికపరిమితమైన పురీషంబైనను, అట్టిపిత్తంబైనను, అల్పపరిమితమైనవాతముతో కలిసి వెడలుచున్నను; అధికమైనవాతము అల్పపరిమితములైన పురీషముతోనైనను పిత్తముతోనైనను, రక్తముతోనైనను కలిసి వెడలుచున్నయెడ మధుర-అమ్ల-కషాయములతోగూడిన కషాయముచే వస్తిని ప్రయోగించుట ఉత్తమము. (ఇది ఐదు అతిసారభేదములకు చికిత్స). ఇచ్చట "విట్పిత్తాస్రైః" అనుచోట "విట్పిత్తాభ్యాం" అనుపాఠము నవీనప్రతియం దున్నది. ఇది ద్విసంసర్గాత్త్రింశద్భేదాః" అనుసంఖ్యకు లోపించును, కావున అనార్ష పాఠము. "విట్పిత్తాస్రైః" అనుప్రాచీనపాఠమే సమంజసము.

మూ. శకృత్ - శోణితయోః, పిత్త-శకృతోః, రక్త-పిత్తయోః,
　　వస్తిరన్యోన్యసంసర్గే కషాయస్వాదుతిక్తకః.　　　３０

వ్యా. అధికపరిమితమైనరక్తము అల్పపరిమితమైనపురీషముతో కలిసియైనను, అధికమైనపురీషము అల్పమగురక్తముతో కలిసియైనను వెడలినను; అధికమైనపురీషము అల్పమగు పిత్తముతోనైనను, అధికమైన పిత్తము అల్పమైనపురీషముతో కలిసియైనను వెడలినను; అధికమైనపిత్తము అల్పమైనరక్తముతోనైనను, అధికమైనరక్తము అల్పమైనపిత్తముతోనైనను కలిసి వెడలుచున్నను, కషాయ-మధుర-తిక్తరసద్రవ్యములతో సిద్ధమైనవస్తిని ప్రయోగించవలెను. (ఇచ్చట శకృద్రక్తములును, పిత్తపురీషంబులును, రక్తపిత్తంబులును, న్యూనాధికభేదములుగ నొండొంట కలయుటవలన నారు అతిసారభేదము లేర్పడును. ఈయారిటికిని ఒకేవిధమైన వస్తిప్రయోగము విధింపబడినది.)

మూ. కఫేన విషి పిత్తే వా కఫే విట్-పిత్త-శోణితైః,
　　వ్యోషతిక్తకషాయస్స్యాత్ సంసృష్టే వస్తిరుత్తమః.　　　３౧

వ్యా. అధికపరిమితములైన పురీషంబైనను, పిత్తంబైనను స్వల్పమైనకఫముతో కూడి వెడలినను; అధికమైనకఫము స్వల్పములైన పురీషముతోనైనను, పిత్తముతోనైనను, రక్తముతోనైనను కలిసి వెడలినను, త్రికటుకముతోడను తిక్తకషాయద్రవ్యములతోను సిద్ధమైనవస్తిని ప్రయోగించుట ఉత్తమము. (పైజెప్పిన ఐదుసంసర్గభేదములకును ఒకవిధమైనచికిత్స.)

మూ. స్యాద్వస్తిః వ్యోష తిక్తామ్లః సంసృష్టే వాయునా కఫే,
　　మధురవ్యోషతిక్తస్తు రక్తే కఫవిమూర్ఛితే.　　　３౨

వ్యా. అధికమైనకఫము స్వల్పమైనవాతముతోకూడి వెడలినయెడ త్రికటుకములను తిక్తకషాయరసములను కూర్చి సిద్ధముచేయబడిన వస్తిని ప్రయోగించవలెను. అధికమైనరక్తము స్వల్పకఫముతోకూడి వెడలుచున్నయెడ మధురరసంబును త్రికటుకములును కషాయరసంబునుకూర్చి సిద్ధమైనవస్తిని ప్రయోగించవలెను.

మూ. మారుతే కఫసంసృష్టే వ్యోషాఽమ్లలవణో భవేత్,
వస్తిర్వాతేన పిత్తే తు కార్యః స్వాద్వమ్లతిక్తకః 33

వ్యా. అధికమైనవాతము స్వల్పమైన కఫముతోకూడి వెడలినయెడ త్రికటుకములను, అమ్లరసమును, సైంధవలవణమును చేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రయోగించవలెను. అధికమైనపిత్తము స్వల్పవాతముతో కలిసివెడలినచో మధుర-అమ్ల-తిక్తరసద్రవ్యములచే సిద్ధమైనవస్తిని ప్రయోగించవలెను.

(ఇత్తెరంగున "షణ్ణామేషాం ద్విసంసర్గాత్ త్రింశద్భేదా భవన్తి తు, కేవలైస్సహ షట్త్రింశ" అని నిర్దేశింపబడిన ముప్పదియారు అతిసారభేదములకును వేరువేరు చికిత్సలు వరుసగ చెప్పబడినవి.)

త్రిచతుః-పంచసంసర్గాతిసారకల్పనము. వానిచికిత్సావిధానము.

మూ. త్రిచతుఃపఞ్చసంసర్గా ఏవమేవ వికల్పయేత్,
యుక్తిశ్చైషాఽతిసారోక్తా సర్వరోగేష్వపి స్మృతా. 34

వ్యా. పైనిర్దేశింపబడిన ఆమ-పురీష-వాత-రక్త-పిత్త-కఫములారిటిలో మూడేసి కలిసినసంసర్గములను, నాలుగేసికలిసినసంసర్గములను, ఐదేసికలిసినసంసర్గములను, పైజెప్పబడిన ద్విసంసర్గభేదములవలెనే ప్రధాన-న్యూనాధికముల గమనించి విభజించి అతిసారభేదముల గల్పించునది. (మరియు నట్టిసంసర్గభేదముల కనుగుణములుగ ద్విసంసర్గచికిత్సాయోగములనే గల్పించి యుపయోగించునది.)

ఈయతిసారరోగమునకు జెప్పిన సంసర్గభేదముల ప్రకారము, తక్కినరోగములకును దోషాదిసంసర్గముల గల్పించి తత్తదుచితముగ చికిత్సలనుగూడ కల్పించునది. విస్తరభీతిచే నాభేదము లిట వివరింపబడవయ్యె. మరియు నేయతిసారములయందు వాతాది దోషములు మూడును రక్తమును మాత్రము కలిసియుండునో, అట్టిస్థలములయందును ఆ నాల్గిటిసంసర్గభేదములను ప్రధానాద్యనుసారముగ గల్పించి, తత్తదుచితచికిత్స జేయునది.

### ఆమాదు లారిటియొక్కయు, పురీషాదు లైదిటియొక్కయు సంసర్గమున చికిత్సాకల్పనము.

మూ. యుగపత్ షడ్రసం, షణ్ణాం సంసర్గే పాచనం భవేత్ (పిబేత్),
నిరామాణాన్తు పఞ్చానాం వస్తిః షాడ్రసికో మతః. ౩౫

వ్యా. పైజెప్పబడిన ఆమ-పురీషాదులారును ఏకకాలమున నొకటిగ కలిసిన యతిసారమునకు మధురాది షడ్రసములద్రవ్యముల నొకటిగ సమకాలమున కలిపి సిద్ధము చేయబడిన పాచనమును త్రాగవలెను. (ఆమావస్థయందు వస్తి నిషిద్ధము కావున ఆమవిశిష్ట సంసర్గమునందు పైజెప్పినరీతిగ పాచనమునే త్రాగవలెనని భావము.)

ఆమరహితములైన తక్కినపురీషాదులు ఐదు నొక్కటిగ కలిసి వెడలుచున్నచో మధురాదిషడ్రసముల నొకటిగ జేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రయోగించవలెను.

### అతిసారహరఘృతము.

మూ. ఉదుమ్బరశలాటూని జమ్బ్వామ్రోదుమ్బరత్వచః,
శఙ్ఖం సర్జరసం లాక్షాం కర్దమం చ పలాంశికమ్. ౩౬
పిష్ట్వా తైస్సర్పిషః ప్రస్థం క్షీరద్విగుణితం పచేత్,
అతీసారేషు సర్వేషు పేయమేతద్యథాబలమ్. ౩౭

వ్యా. అత్తికాయలు లేతవి, నేరేడుపట్ట, మామిడిపట్ట, అత్తిపట్ట, శంఖము, సర్జ రసము, లక్క, కృష్ణాగరు వీనిని ప్రత్యేక మొక్కొకపలముపంతున నూరి కల్కము చేసి ప్రస్థపరిమితమైన నేతిలో కలిపి, అందు నేతికి రెట్టింతలు రెండుప్రస్థములు ఆవుపాలను కలిపి (ఘృతపాకవిధిప్రకారము)పక్వము చేయవలెను. ఈఘృతమును అతిసారము లన్నిటి యందును రోగియొక్కబలమును అగ్నిబలమును గమనించి తదనుసారముగ త్రాగించవలెను. (దీనిచే నతిసారములన్నియు నశించును.)

### అతిసారహరయవాగువు.

మూ. కచ్ఛురాధాతకీబిల్వసమఙ్గారక్తశాలిభిః,
మసూరాఽశ్వత్థశుఙ్గైశ్చ యవాగూస్స్యాత్ జలే శృతైః. ౩౮

వ్యా. దూలగొండి, ఆరెపువ్వు, మారేడువేరు, మంజిష్ఠి, ఎఱ్ఱవరిధాన్యపుబియ్యము, ఎఱ్ఱసెనగలు, రావిచిగుళ్లు (లేక ఊడలు) వీనినన్నిటిని జలమున చేర్చి కషాయము కాచి, అందు యవాగువును పక్వముచేసి అతిసారములన్నిటియందును త్రాగ నగును.

ఇచ్చట దూలగొండి మున్నగు ద్రవ్యములను ప్రత్యేకము కర్ష ప్రమాణమువంతున ప్రస్థపరిమితజలమున జేర్చి సగము మిగులునట్లు కాచి వడగట్టి యాకషాయముచే యవాగువును సిద్ధముచేసి త్రాగించవలెను. ఇదియే షడంగపానీయకల్పము. ఈవిషయము స్థలాంతరమున నిట్లుచెప్పబడినది:—"యదప్సుశృతశీతాసు షడఙ్గాదిప్రయుజ్యతే, కర్షమాత్రం తతో దత్వా సాధయేత్ప్రాస్థికే జలే, అర్థశృతం ప్రయోక్తవ్యం పానే పేయాది సంవిధౌ."

రెండవయవాగు.

మూ. బాలోదుమ్బరకట్వాఙ్గసమఙ్గాప్లక్షపల్లవైః,
మసూరధాతకీపుష్పబలాభిశ్చ తథా భవేత్. ౩౯

వ్యా. లేతఅత్తిపండెలు, దుండగపుమ్రానిపట్ట, మంజిష్ఠి, జువ్విచిగుళ్లు, చిరుసెనగలు, ఆరెపువ్వు, చిట్టాముట్టి వీనినన్నిటిని జలమునచేర్చి పైజెప్పిన షడంగపానీయకల్ప ప్రకారము కషాయము కాచి వడగట్టి యాకషాయముతో యవాగువును సిద్ధముచేసి అతిసారములయందు త్రాగునది.

మరికొన్నియవాగువులు.

మూ. స్థిరాదీనాం బలాదీనాం (వటాదీనాం) ఇక్ష్వాదీనామథాపి వా,
క్వాథేషు సమసూరాణాం యవాగ్వస్స్యుః పృథక్ పృథక్. ౪౦

వ్యా. స్థిరాది(హ్రస్వ) పంచమూలములనైనను, బలాచతుష్టయమునైనను, తృణపంచమూలములతో శరముతక్క తక్కినఇక్ష్వాదుల నాల్గిటినైనను, పైజెప్పినవిధముగ వేరువేరుగ క్వాథములుచేసి యాక్వాథములతో వేరువేరుగ యవాగులను సిద్ధముచేసి అతిసారములయందు త్రాగవలెను. పైజెప్పినక్వాథ్యములతోకూడ చిరుసెనగలనుకూడ చేర్చి క్వాథముల సిద్ధముచేసి యవాగువుల పక్వము చేయునది.

ఇచ్చట—ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, పెద్దములక, పల్లేరు అను నీరైదింటివేళ్ల చేరినసముదాయము స్థిరాదిగణము. బల (చిట్టాముట్టి), అతిబల (పేరాముట్టి), మహాబల (స్వనామఖ్యాతము), నాగబల (జిబిలిక), అను నీనాల్గును బలాచతుష్టయము. ఈబలాచతుష్టయము బలాభేదములోనే చేరినవని భావప్రకాశకారుడు చెప్పెను. చెరకు, కుశదర్భ, కొల్లుదర్భ, ఎఱ్ఱిపైరు అను నీనాల్గువేళ్లనుచేరి ఇక్ష్వాదిశబ్దముచే జెప్పబడును. మరియు 'వటాదీనాం' అనుపాఠమున మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, కలజువ్వి అనుక్షీరిపంచకమును గ్రహించునది.

## ఇంకొకయవాగువు.

మూ. కచ్ఛురామూలశాల్యాది తణ్డులైరుపసాధితాః,
దధి తక్రాఽఽరనాళాఽమ్లక్షీ రేష్విక్షురసేఽపి వా. ౪౧
శీతాస్సశర్కరా క్షౌద్రాః సర్వాతీసారనాశనాః,
ససర్పిర్మరిచాఽజాజ్యః మధురా లవణాశ్చవాః. ౪౨

వ్యా. దూలగొండివేళ్లను, ఎఱ్ఱవరిరాజనములు మున్నగువరిధాన్యము యొక్క బియ్యమును, పెరుగు, మజ్జిగ, ఆరనాళమనుకాంజికము, అమ్లకాంజికము (పుల్లనిగంజి), చెఱకురసము అను నీ ద్రవములలో దేనిలోనైనకలిపి యవాగువుల సిద్ధముచేసి; అందు చక్కెరను, తేనెను, కలిపి; నెయ్యి, మిరియాలపొడి, జీలకర, మధురద్రవ్యములు, సైంధవలవణము అనువానినికూడ యథోచితముగ కలిపి చల్లగజేసి త్రాగించిన అతిసారము లన్నియు నివర్తించును. ఈయవాగువులన్నియు అతిసారములకు చాలప్రశస్తములుగ నుండును.

## పూర్వోక్తాతిసారచికిత్సాసంగ్రహము.

భవన్తి చాత్ర శ్లోకాః.—

మూ. స్నిగ్ధాఽమ్లలవణమధురం పానం వస్తిశ్చ మారుతే కోష్ణః,
శీతం తిక్తకషాయం మధురం పిత్తే చ రక్తే చ. ౪౩
తిక్తోష్ణకషాయకటుశ్లేష్మణి; సజ్గ్రాహిహి వాతనుచ్ఛకృతి,
పాచనమామే పానం, పిచ్ఛాఽసృగ్వస్తయో రక్తే. ౪౪
అతిసారం ప్రత్యుక్తం మిశ్రం ద్వన్ద్వాదియోగజేష్వపి చ,
తత్రోద్రేకవిశేషాత్ దోషేషూపక్రమః కార్యః. ౪౫

వ్యా. స్నిగ్ధంబును అమ్లంబును సైంధవలవణముతో కూడినదియు మధురరసంబును నగుద్రవ్యముల సిద్ధమైనపాచనౌషధమును త్రాగుటయు, అట్టియౌషధములచే సిద్ధము చేయబడి కొంచెమువేడిగనుండు వస్తిని ప్రయోగించుటయు వాతాతిసారమునందు ప్రశస్తములు. పిత్తాతిసారమునందును రక్తాతిసారమునందును తిక్త-కషాయ మధురరసద్రవ్యముల తోను శీతవీర్యద్రవ్యములతోడను సిద్ధముచేసి చల్లగనుండుద్రవమును పానముచేయుటయు, అట్టియౌషధముచే వస్తిని ప్రయోగించుటయు ప్రశస్తము. శ్లేష్మాతిసారమునందు తిక్త-కషాయ-కటురసంబులును, ఉష్ణవీర్యంబులును నగుద్రవ్యములచే సిద్ధముచేయబడిన పానంబును, అట్టియౌషధములచే సిద్ధముచేయబడిన వస్తిని ప్రయోగించుట ప్రశస్తము. పురీషాతిసారమున పురీషమును వెడలనీయక నిరోధించునదియు, వాతమును హరించు

నదియు నగుద్రవ్యములచే సిద్ధమైనయౌషధమును త్రాగుటయు, అట్టియౌషధముచే వస్తిని ప్రయోగించుటయు ప్రశస్తము. ఆమాతిసారమున తుంగగడ్డలు, అతివస మున్నగు పాచన (ఆమమును పచింపజేయు) ఔషధములచే సిద్ధముచేయబడిన అంతరపానము యుక్తముగ నుండును. (ఆమావస్థయందు వస్తి నిషిద్ధముకావున పానౌషధమును త్రాగించవలెనని భావము). రక్తాతిసారమున పిచ్ఛావస్తియు, రక్తముచే సిద్ధమైనవస్తిని ప్రయోగించుటయు ప్రశస్తము. (పిచ్ఛావస్తి స్థలాంతరమున వివరింపబడినది. ఇవి ఆమాదులలో నొక్కొకదానిచే సంభవించునతిసారములకు వేరువేరుగ చికిత్సాసంగ్రహము.

మరియు—ఆమాదులలో రెండు - మూడు- నాలుగు-ఐదు-ఆరు పరస్పరము సంక్రమించిన సంసర్గాతిసారములయందు వానివానికి ప్రత్యేకముగ జెప్పబడిన చికిత్సాయోగములను వానివానికనుగుణముగ నౌషధముల మిశ్రముగ కల్పించి యుపయోగింపవలెను. అందును ఆమాదులలో నేది యధికముగ నుద్రేకించియుండునో అట్టిదోషమునకు ప్రధానముగజేసి, అందుకు తగునట్లు ఔషధమును కల్పింపవలెను.

## అధ్యాయోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకః.—

మూ. ప్రాసృతికాస్సవ్యాపత్ క్రియాః, నిరూహాః తథాతిసారహితాః,
రసకల్ప(కల్క-)ఘృతయవాగ్వశ్చోక్తాః గురుణా ప్రసృతసిద్ధౌచ.

వ్యా. ప్రసృతిప్రమాణము నధికరించి కల్పింపదగినవస్తులును, అట్టిమృదువస్తులచే సంభవించుజాడ్యాదివ్యాపత్తులును, వానిచికిత్సితములును, అతిసారములకు హితకరములైన నిరూహవస్తులును, అట్టియతిసారములకు రసముల నుద్దేశించి చికిత్స చేయవలసినప్పుడు మధురాది, రసకల్పనావిధానంబును, అతిసారమున చికిత్స కుపయోగింపదగిన ఘృతయోగంబును, యవాగువులును ఇవియన్నియు ప్రాసృతయోగికసిద్ధియను నీయధ్యాయమున గురువులగు నాత్రేయమహర్షిచే నుపదేశింపబడినవి.

## అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసమ్పూరితే,
సిద్ధిస్థానే, ప్రాసృతయోగీయాసిద్ధిర్నామ అష్టమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగుచరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున ప్రాసృతయోగీయమను నెనిమిదవ యధ్యాయము సమాప్తము.



## న వ మా ధ్యా య ము.

అవతరణిక.—వస్తివ్యాపచ్చికిత్సాబోధకమగు ప్రాసృతయోగికసిద్ధిని చెప్పినపిదప త్రిమర్మములకు సంబంధించి సంభవించురోగములకు చికిత్సారూపమైన వస్తిప్రయోగమును దెలుపునట్టి త్రిమర్మీయసిద్ధి యనునధ్యాయము చెప్పబడును. మరియు వస్తివ్యాపత్తులచే త్రిమర్మములకు జేరినవ్యాధులును సంభవించునుకావున వస్తివ్యాపచ్చికిత్సాశేష మగుటంజేసి శిరస్సు మున్నగు మూడుమర్మములకు జేరినవ్యాధులచికిత్సను బోధించు వస్తిమర్మీయసిద్ధి చెప్పబడును —

### వస్తిమర్మీయసిద్ధిప్రారంభము.

మూ. అథాతస్త్రిమర్మీయాం సిద్ధిం వ్యాఖ్యాస్యామః.　　౧
　　ఇతి హ స్మాహ భగవానాత్రేయః.　　౨

వ్యా. హృదయము, శిరస్సు, వస్తి అనునీమూడుమర్మములకు సంబంధించినరోగములచికిత్సనుబోధించు త్రిమర్మీయసిద్ధి యనునధ్యాయమును భగవానుడగు నాత్రేయుడుపదేశించినదానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

త్రిమర్మీయచికిత్సితమునందు విస్తరభీతిచే కొన్ని (త్రిమర్మములకు సంబంధించిన) వ్యాధులకు చికిత్స జెప్పబడలేదు. అట్టివ్యాధులును, వానిచికిత్సితములును ఈయధ్యాయమునందు చెప్పబడును. హృదయశిరో-వస్తిరూపములైన మూడుమర్మములయందు సంభవించురోగములు త్రిమర్మశబ్దముచే జెప్పబడును. అట్టిత్రిమర్మరోగముల నధికరించి సాధ్యతారూపమైన సిద్ధి త్రిమర్మీయసిద్ధియని చెప్పబడును.

### మర్మములసంఖ్య.

మూ. సప్తోత్తరం మర్మశతం అస్మిఞ్ శరీరే స్కన్ధశాఖాసమాశ్రితమగ్నివేశ! తేషామన్యతమపీడాయాం సమధికా పీడా భవతి, చేతనానిబన్ధవైశేష్యాత్.　　3

వ్యా. పాంచభౌతికమైన యీశరీరమునందు స్కంధమును (కంఠమునకు క్రిందుగను తొడలకు పైగనుండు మధ్యశరీరభాగము) శాఖలను (బాహువులు కాళ్లు) ఆశ్రయించి నూటయేడుమర్మములు మనుజునకుండును. ఈమర్మస్థానములయందు అభిఘాతాదికారణములచే బాధ కల్గినచో మర్మములకంటె నితరస్థలములకన్న నధికమైనబాధ సంభ

వించును. ఈమర్మముల మూటియందును తక్కినస్థలములకన్న నధికముగ చేతనాధాతువు ఆశ్రయించియుండును కావున వీనిలో దేనికైననొకదానికి అభిఘాతము కల్గినయెడ మిక్కిలి బాధ కల్గునని భావము.

ఇచ్చట హస్తపాదాదుల కాశ్రయమై కంఠపాదములకు నడుమనుండు మధ్య శరీరభాగము స్కంధమనబడును. అట్టిశరీరము నాధారముగ జేసి (యొకచెట్టు మోడును కొమ్మలు ఆశ్రయించి యుండువిధముగ) వ్యాపించి యుండుటంజేసి బాహువులును కాళ్లును శాఖలనబడును. మరియు నట్టిశరీరమధ్యభాగమును రక్తాదిధాతువులుకూడ నాధారముగ జేసికొని వ్యాపించునుకావున రసరక్తాదిధాతువులును శాఖాశబ్దముచే గ్రహింపబడును.

పైజెప్పబడిన నూటయేడుమర్మములలో నలువదినాల్గు శాఖల నాశ్రయించి యుండును. తక్కిన అరువదిమూడుమర్మంబులును స్కంధమునాశ్రయించి యుండును. ఈవిభాగమును సుశ్రుతాచార్యు లిట్లుచెప్పెను.—"తేషా మేకాదశ ఏకస్మిన్ సక్థ్ని భవంతి. ఏతేనేతరసక్థి బాహూ వ్యాఖ్యాతౌ, ఉదరోరసోర్ద్వాదశ, చతుర్దశ పృష్ఠే, గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తత్రింశత్." (సుశ్రుత. శా. అ. 6. సూ. 4.) వీని ప్రత్యేకవిభాగము సుశ్రుతమున చూడదగును.

**మర్మములలో హృదయ-శిరో-వస్తిమర్మములకు ప్రాధాన్యము.**

మూ. తత్ర శాఖాశ్రితేభ్యో మర్మభ్యః స్కన్ధాశ్రితాని గరీయాంసి, శాఖానాం తదాశ్రితత్వాత్. స్కన్ధాశ్రితేభ్యోఽపి హృత్-వస్తి-శిరాంసి; తన్మూలత్వాచ్ఛరీరస్య. ౪

వ్యా. పైజెప్పినరీతిగ స్కంధమును శాఖలను ఆశ్రయించినమర్మములలో శాఖల నాశ్రయించిన మర్మములకన్న స్కంధము నాశ్రయించినమర్మములు ప్రధానములు. శరీరమునందలి శాఖలు స్కంధము నాధారముగ జేసికొని యుండునుకావున అట్టిశాఖల కాధారముగనుండు స్కంధము నాశ్రయించినమర్మములు ప్రధానములని భావము. మరియు నట్టిస్కంధము నాశ్రయించియుండు మర్మములలో హృదయము, వస్తి, శిరస్సు అనుమూడుమర్మములును శరీరమునకు మూలాధారములై యుండునుకావున హృద్వస్తిశిరోమర్మములుమూడు ముఖ్యముగ ప్రధానములు.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది:—శరీరమునందలి హస్తపాదాదిరూపములైన శాఖలు మధ్యశరీరరూప మైనస్కంధము నాధారముగ జేసికొని యుండును. అట్టిశాఖల

నాశ్రయించిన మర్మములకన్న ప్రత్యక్షముగనే స్కంధము నాశ్రయించినమర్మములు ప్రధానములు. మరియు స్కంధమున జనించిన రసాదిధాతువులచే శాఖలు పోషింపబడును. స్కంధమున కేవిధమైన యభిఘాతము కల్గినను శాఖలకుంగూడ బాధసంభవించును. సద్యః ప్రాణహరమర్మములలో హృదయశిరోవస్తిమర్మములు చేరినవి. ఈకారణములచేత నీమర్మములు మూడును ప్రధానములు. సద్యః ప్రాణహరమర్మములు సుశ్రుతమున నిట్లు చెప్పబడినవి:—"శృఙ్గాటకాన్యధిపతిః శఙ్ఖౌ కణ్ఠశిరోగుదమ్, హృదయం వస్తినాభీచ ఘ్నన్తి సద్యో హతాని వై" (సు. శారీ. అ. ౬.)

మరియు ప్రాణములకాధారములైనవానిలో నీమర్మములు మూడును ప్రధానములని ప్రాధాన్యమును సుశ్రుతు లిట్లు చెప్పెను:—"సప్తోత్తరం మర్మశతం యదుక్తం శరీరసంఖ్యామధికృత్య, తేషు మర్మాణి వస్తిః హృదయం శిరశ్చ ప్రధానభూతాన్యృషయో వదన్తి, ప్రాణాశ్రయాత్తానపి పీడయన్తో వాతాదయోఽసూనపి పీడయన్తి" (సు. శా. అ. ౬).

## హృదాశ్రితధమనులు.

మూ. తత్ర హృదయే దశ ధమన్యః ప్రాణాఽపానౌ మనోబుద్ధిశ్చేతనా మహాభూతాని చ నాభ్యామరా ఇవ ప్రతిష్ఠితాని. ౪

వ్యా. పైజెప్పబడిన మూడుమర్మములలో హృదయమర్మమునందు ఓజోవహములైన పదిధమనులును, ఉచ్ఛ్వాస-నిశ్వాసరూపములైన ప్రాణాపానంబులును, అంతఃకరణరూపమైన మనస్సును, బుద్ధియు, బుద్ధివృత్తులలో జేరినచేతనంబును (జ్ఞానము), సూక్ష్మరూపములైన మహాభూతంబులును (పృథివ్యాదిపంచమహాభూతములయొక్క సుసూక్ష్మాంశంబులు), ఇవియన్నియు (చక్రముయొక్క మధ్యభాగమునయుండు బండికుండను కొయ్యలతో చేయబడిన ఆకులు ఆధారముగ జేసికొని యుండురీతిగ) హృదయము నాధారముగ జేసికొని యుండును.

ఇచ్చట అర్థేదశమహామూలీయమున "తేనమూలేన మహతా మహామూలా మతా దశ, ఓజోవహాశ్శరీరేఽస్మిన్ విధమ్యన్తే సమన్తతః" (చ. సూ. అ. ౩౦) అని యుపక్రమించి చెప్పబడినధమనులు "దశ ధమన్య" అనుపదముచే ననువదింపబడినది. "ప్రాణాఽపానౌ" అనుచోట సుప్రసిద్ధములైన ప్రాణ-అపానవాతములనే యర్థమును కొందరు చెప్పెదరు.

## శిరోమర్మాశ్రితవివరణము.

మూ. శిరసి ఇన్ద్రియాణి, ఇన్ద్రియప్రాణవహాని చ స్రోతాంసి, సూర్య మివ గభస్తయః సంశ్రితాని. ౫

వ్యా. శిరస్సునందు చక్షురాదీంద్రియములును, ఆయాఇంద్రియములకు దర్శనాది శక్తిని వహించుస్రోతస్సులును సూర్యుని కిరణములు ఆశ్రయించియుండువిధమున ఆశ్రయించి యుండును. ఇంద్రియశక్తిని వహించుస్రోతస్సులు సుశ్రుతమున నిట్లు చెప్పబడినవి.—"శబ్దరూపరసగన్ధాన్ అష్టాభిః గృహ్ణీతే" (సు. శా. అ. ౯.)

## వస్తిమర్మాశ్రితవివరణము.

మూ. వస్తిస్తు స్థూలగుదముష్కసేవనీశుక్రమూత్రవాహినీనాం నాడీ (ళీ) నాం మధ్యే మూత్రాధారోఽమ్బువహానాం సర్వస్రోతసాముదధిరివ, ఆపగానాం ప్రతిష్ఠా (ప్రతిష్ఠితో భవతి); బహుభిశ్చ తన్మూలైః మర్మసంజ్ఞకైః స్రోతోభిః గగనమివ దినకరకరైః వ్యాప్తమిదం శరీరమ్. ౬

వ్యా. వస్తిమర్మము స్థూలగుదమునకును, వృషణములకును, సేవనులకును, శుక్రమును వహించునాడులకును, మూత్రమును వహించునాడులకును నడుమనుండి మూత్రమున కాధారమై (పలుదెరంగులనుండి వచ్చునదులకన్నిటికిని సముద్రము బోలె) స్రోతస్సుల కన్నిటికిని ఉనికిపట్టై యుండును. అట్టివస్తికి సంబంధించి మర్మసంజ్ఞికములై (మర్మములను పోషించు) స్రోతస్సులచేతను (సూర్యకిరణములచే నాకసము ఆవరింపబడిన రీతిగ) ఈ శరీరము వ్యాపింపబడియుండును.

## హృదయాదిమర్మత్రయరక్షణావశ్యకత.

మూ. తేషాం త్రయాణాం అన్యతమస్యాపి భేదాత్ ఆశ్వేవ శరీరభేదస్స్యాత్, ఆశ్రయనాశాత్ ఆశ్రితస్యాపి వినాశః; తదుపఘాతాత్తు ఘోరతరవ్యాధిప్రాదుర్భావః; తస్మాదేతాని విశేషేణ రక్ష్యాణి బాహ్యాభిఘాతాత్ వాతాదిభ్యశ్చ. ౭

వ్యా. లోకమునం దాశ్రయమునకు నాశముకల్గినచో నాశ్రితమునకును నాశము కల్గును కావున అత్తెరంగుననే పైనివివరింపబడిన హృదయ-శిరో-వస్తి మర్మములలో నేదైననొకదానికి భంగము కల్గినపుడు దాని (హృదయమున) కాశ్రితమగు శరీరంబున

కును అతిశీఘ్రముగ హానికల్గును. కొంచెము వికృతికల్గినపుడు శరీరమునకు క్రూరమైన వ్యాధులు కల్గును. కావున పైజెప్పిన మర్మములమూడిటిని బాహ్యకారణములచేనైనను వాతాదిత్రిదోషములవలనను ఏవిధమైనబాధ గల్గనీయక మిగుల జాగరూకతతో కాపాడవలెను. (శరీరారంభకములైన ప్రధానధమనుల పదిటికిని హృదయము ఆశ్రయముకావున శరీరమున కాశ్రయమని చెప్పబడును.)

### హృదయమర్మాభిఘాతమున కల్గువ్యాపత్తులు.

మూ. తత్ర హృద్యభిహతే తే కాసశ్వాసబలక్షయకణ్ఠశోషక్లోమాకర్షణ జిహ్వానిర్గమముఖతాలుశోషాఽపస్మారోన్మాదప్రలాపచిత్తనాశాదయస్స్యుః ౮

వ్యా పైజెప్పిన మూడుమర్మములలో హృదయమర్మమునకు వాతాదులచేనైనను బాహ్యకారణములచేనైనను అభిఘాతము కల్గినపుడు కాస-శ్వాసములు, బలక్షయము, గొంతెండుట, క్లోమాకర్షణము (క్లోమమున లాగినట్లు బాధ), నాలుక బైటవెడలుట, నోరును తాలువులును చెమ్మలేక యెండుట, అపస్మారము, ప్రలాపము, (అసంబద్ధముగ మాటలాడుట), చిత్తనాశము ఇవి మున్నగురోగములు సంభవించును.

### శిరోమర్మాభిఘాతమున కల్గురోగములు.

మూ. శిరస్యభిహతే—మన్యాస్తమ్భాఽర్దితచక్షుర్విభ్రమమోహోద్వేష్టనచేష్టానాశకాసశ్వాసహనుగ్రహమూకగద్గదత్వాఽక్షినిమీలనగణ్డస్పన్దనజృమ్భణలాలాస్రావస్వరహానివదనజిహ్మత్వాదీని. ౯

వ్యా. శిరస్సు వాతాదులచే వికృతి జెందినపుడు మన్యాస్తంభము, అర్దితవాతము, చక్షుర్విభ్రమము(కండ్లు తిరుగుట), మూర్ఛ,ఉద్వేష్టనము (శిరస్సున మెలిబెట్టినట్లుబాధ), చేష్టానాశము (అవయవములు చేష్టలు దక్కియుండుట),కాసశ్వాసములు, హనుగ్రహము (అంకిళ్లు బిగదీయుట), మూగితనము, గద్గదస్వరము, కండ్లు మూతబడుట, గండస్థలములు అదరుట, ఒడలివిరుపులతో నావలింతలు, నోట జొల్లుకారుట, కంఠస్వరము వెడలకుండుట, నోరు వంకరటింకరగనగుట ఇవి మున్నగువ్యాధులు కల్గును.

### వస్తిమర్మాభిఘాతమున కల్గువ్యాధులు.

మూ. వస్తౌ తు—వాతమూత్రవర్చోనిగ్రహవఙ్క్షణ మేహనవస్తిశూలకుణ్డలోదావర్త గుల్మాఽనిలాఽష్ఠీలోపస్తమ్భనాభికుక్షిగుదశ్రోణిగ్రహాదయః. ౧౦

వ్యా. వస్తియందు వికృతి కల్గినపుడు వాతము మూత్రము పురీషము సరళముగ వెడలక అడ్డుపడును. గెజ్జలయందును మేఢ్రమునందును వస్తి (మూత్రాశయము), యందును పోటు కల్గును. మరియు వస్తియందు కుండలాకారముగ త్రిప్పినట్లు బాధ, ఉదావర్తము, గుల్మము, వాతాష్ఠీల, వస్తిస్తమ్భము, నాభియందును కుక్షియందును గుదమునందును పిరుదులయందును నొప్పి, ఇవిమున్నగురోగంబులును సంభవించును.

## మర్మాశ్రితవ్యాధిచికిత్సలలో వస్తికర్మప్రాశస్త్యము.

మూ. వాతాద్యుపసృష్టానాం త్వేషాం లిఙ్గాని చికిత్సితే సక్రియావిధీ న్యుక్తాని. కిన్త్వేతాని విశేషతోఽనిలాత్ రక్ష్యాణి; అనిలో హి పిత్తకఫసముదీరణే హేతుః, ప్రాణమూలం చ; స వస్తికర్మసాధ్య తమః, తస్మాన్న వస్తిసమం కిఞ్చిత్కర్మ మర్మపరిపాలనమస్తి ౧౧

వ్యా. హృదయాదిమర్మములు మూడును వాతాదులచే వికృతి నొందునపుడు కల్గులక్షణంబులును, వానిచికిత్సావిధానంబులును చికిత్సాస్థానమందలి త్రిమర్మీయ చికిత్సితమున చెప్పబడినవి. మరియు నీమర్మములుమూడును వాతమువలన వికృతి నొంద కుండునట్లు కాపాడవలెను. వాతము పిత్తకఫములను ప్రేరేపించుటకు హేతువును, ప్రాణములకు మూలాధారంబు నైయుండును, కావున మర్మముల నాశ్రయించి సంభవించు వ్యాధు లన్నిటియందును వాతవికృతి కల్గనీయక కాపాడవలెను. అట్టివాతము కేవలము వస్తికర్మచే సాధింపందగియుండును. కావున మర్మముల కాపాడుటకు వస్తికర్మతో సమానమైన వేరొండుచికిత్స కానరాదు.

వివరణము—"పిత్తం పఙ్గు కఫః పఙ్గుః పఙ్గవో మలధాతవః, వాయునా యత్ర నీయన్తే తత్రగచ్ఛన్తి చేతరే" అనుప్రమాణము ననుసరించి పిత్తకఫాదుల ప్రేరేపించుటకు వాతము ప్రధానకారణము. జీవితమునకును ఆధారమైనది. కావున అట్టివాతమువలన మర్మములకు బాధ కల్గనీయక కాపాడుట ముఖ్యకర్తవ్యము. అట్టియెడ యజ్జఃపురుషీయ మున "వస్తిర్వాతహరాణాం" (సూ. అ. ౨౫. సూ. ౪౧) అని అగ్ర్యాధికారమున వాతహరచికిత్సలలో వస్తి శ్రేష్ఠమని చెప్పబడినదికావున తక్కినచికిత్సలకన్న వస్తి ఉత్త మోత్తమమని తెలిసెడి. మర్మములపరిపాలన చేయదలంచినవారు వస్తికర్మమునే చేయవలె నని సముదితార్థము.

### ప్రధానమర్మపరిపాలనోపాయము.

సూ. తత్ర షడాస్థాపనస్కన్ధాన్ విమానే ద్వౌ చానువాసనస్కన్ధౌ, ఇహ చ విహితాన్ వస్తీన్, బుద్ధ్యా విచార్య మహామర్మపరిపాలనార్థం ప్రయోజయేత్, వాతవ్యాధిచికిత్సాం చ. ౧౨

వ్యా. అందు విమానస్థానమున జెప్పబడిన మధురాదిరసభేదములచే నారువిధముల నిరూహవస్తి ద్రవ్యస్కంధములను, స్థావరజంగమస్నేహభేదములచే రెండువిధములైన నువాసన ద్రవ్యస్కంధములను, ఈసిద్ధిస్థానమున జెప్పబడిన నిరూహ-అనువాసనవస్తులను మనించి, దోషము, ఔషధము మున్నగుపదివిషయములను చక్కగ బుద్ధిచే విచారించి, ట్టివస్తులను, వాతవ్యాధికి చెప్పినచికిత్సితములనుకూడ ప్రధానమర్మముల కాపాడుకై ప్రయోగింపవలెను.

ఇచ్చట విమానస్థాన రోగభిషగ్జితీయమున "తద్యథా జీవకర్షభకౌ" (వి. అ. ౮. గాత్ర. ౧౭౯. ౧౮౪) అని యుపక్రమించి చెప్పబడిన నిరూహవస్త్యుపయోగ్యములగు మధుర-అమ్ల-లవణ-కటు-తిక్త-కషాయస్కంధముల నారింటిని; "అనువాసనం తు స్నేహ ‌వ-స్నేహాస్తు ద్వివిధాః, స్థావరాత్మకో జఙ్గమాత్మకశ్చ......సంస్కారవిశేషాత్" వి. అ. ౮. సూ. ౧౯౦) అనువాక్యముచే జెప్పబడిన అనువాసనార్హ స్నేహస్కంధముల రెంటిని యెరుంగునది. మరియు "బుద్ధ్యావిచార్య" అనుచోట, వస్తిసూత్రీయమున 'సమీక్ష్య దోషౌషధి......సిద్ధిమన్తి" (వి. అ. 3) అని నిర్దేశింపబడిన దోషము షౌషధము మున్నగువిచార్యాంశముల పదింటి నెరుంగునది.

### హృదయమర్మము వాతము వికృతిజెందినచో చికిత్స.

సూ. భూయశ్చ హృది ఉపసృష్టే వాతేన హిఙ్గుచూర్ణం లవణానామన్యతమచూర్ణసంయుక్తం, మాతులుఙ్గస్య రసేన అన్యేన వాఽమ్లేన హృద్యేన వా పాయయేత స్థిరాది పఞ్చమూలీరసః సశర్కరః పానార్థమ్, బిల్వాదిపఞ్చమూలరససిద్ధా చ యవాగూః హృద్రోగవిహితం చ కర్మ. ౧౩

వ్యా. హృదయము (వాతముచే) వికృతి నొందినపుడు ఇంగువను పొంగించి చూర్ణముచేసి యాచూర్ణమును సైంధవాది లవణములలో దేనినైన నొకదానిని చూర్ణము చేసి కలిపి, మాతులుంగ (మాదీఫల) రసముతోనైనను, ఇతరములగు పుల్లని ద్రవము

లతోనైనను మనసుకింపైన యమ్లరసములతోనైనను కలిపి త్రాగించవలెను. మరియు స్థిరాది (హ్రస్వ) పంచమూలములకషాయరసమును చక్కెర కలిపి పానమున కుపయోగించవలెను. బిల్వాది (మహా) పంచమూలముల చేర్చి కాచబడిన కషాయములో పక్వము చేయబడిన యవాగువును త్రాగించవలెను. ఇవిగాక త్రిమర్మీయ చికిత్సితమున జెప్పబడిన హృద్రోగచికిత్సావిధికూడ చేయందగును.

## శిరోమర్మవాతవికృతి చికిత్స.

మూ. మూర్ధ్ని తు వాతోపసృష్టే అభ్యఙ్గస్వేదనోపనాహస్నేహ పాన నస్తః కర్మాఽవపీడనధూమాదీని. ౧౪

వ్యా. శిరస్సు వాతముచే వికృతి నొందినపుడు అభ్యంగనము, స్వేదనము, ఉపనాహము, స్నేహపానము, నస్యకర్మ, అవపీడననస్యము, ధూమపానము మున్నగుచికిత్సల చేయవలెను. (ఇచ్చట అవపీడనమన:—"కల్కైర్ద్రవ్యైరవపీడస్తు తీక్ష్ణైః మూర్ధవిరేచనమ్" అని విధింపబడిన తీక్ష్ణములైన చూర్ణాదులచే చేయబడిన శిరోవిరేచన నస్యమని యెరుంగునది.) అయ్యది ప్రధానముగ యౌగికమని తెలియుటకై వేరుగ చెప్పబడెను.

## వస్తిమర్మవాతవికృతిచికిత్స.

మూ. వస్తౌ తు-కుమ్భీస్వేదః, వర్తయః, శ్యామాదిభిః గోమూత్రసిద్ధో నిరూహః, బిల్వాదిభిశ్చ సురాసిద్ధః, శరకాశేక్షుదర్భగోక్షురకమూలశృతక్షీరైశ్చ, (క్షీరం చ) త్రపుసైర్వారుఖరాశ్వాబీజయవబుషభకవృద్ధి కల్కైతో నిరూహః, పీతదారుసిద్ధతైలేనానువాసనం, తైల్వకం చ సర్పిర్విరేకార్థం, శతావరీగోక్షురకబృహతీ కణ్టకారికాగుడూచీ పునర్నవోశీరమధుకద్విసారిబాలోధ్రశ్రేయసీ కుశకాశమూలకషాయక్షీరచతుర్గుణం, బలావృషర్షభకఖరాశ్వోపకుఞ్చికా వత్సకత్రపుసైర్వారుబీజశితివారకమధుకవచాశతపుష్పాఽశ్మభేదక వర్షాభూమదనఫలకల్కసిద్ధం తైలం, ఉత్తరవస్తిర్నిరూహోవా శుద్ధస్నిగ్ధస్విన్నస్య వస్తిశూలమూత్రవికారహర ఇతి. ౧౫

వ్యా. వస్తి వాతముచే వికృతినొందినపుడు కుంభీస్వేదంబును, ఫలవర్తులును, విమానస్థానమున జెప్పబడిన శ్యామాదివర్గద్రవ్యములచేతను గోమూత్రముచేతను సిద్ధము

కేయబడిన నిరూహవస్తియు, బిల్వాది (మహా) పంచమూలముల కషాయముచేతను పరామద్యముచేతను సిద్ధముచేయబడిన నిరూహవస్తియు నుపయోగింపదగును. (ఇచ్చట పంభీస్వేదము స్వేదాధ్యాయమున—"కుమ్భీం వాతహరక్వాథ.........స్నైహైరనిల ఘ్నైః" (చ. సూ. అ. ౧౪. శ్లో. ౬౧) అని చెప్పబడినదాని గ్రహించునది. శ్యామాదిభిః' అనుచోట రోగభిషగ్జితీయమున "శ్యామా త్రివృచ్చతురఙ్గుళతిల్వకమహా వృక్షసప్తలాశఙ్ఖినీద న్తీద్రవన్తీనామ్" (వి. అ. ౮. సూ. ౧౭౪) అని చెప్పబడిన నల్ల తెగడ మున్నగు ద్రవ్యముల గ్రహించునది. "బిల్వాదిభిశ్చ" అనుచోట బిల్వాదిమహా పంచమూలముల నైనను, వస్తివ్యాపత్సిద్ధియందు—"బిల్వమూలత్రివృద్దారు......... ప్రేష్యస్తమానయేత్" (సి. అ. ౭. శ్లో. ౧౧) అని నిర్దేశింపబడిన బిల్వాదిద్రవ్యముల నైన గ్రహించునది.)

మరియు కాకివెదురు, రెల్లుదర్భ, చెరకు, దర్భలు, పల్లేరు వీనివేళ్లను చేర్చి క్షీరపాకవిధిప్రకారము కాచబడిన ఆవుపాలను; దోసవిత్తులు, నక్కదోసవిత్తులు, ఖరాశ్వ బీజ (ఓమము), యవలు, ఋషభకము, వృద్ధి అను నీద్రవ్యములకల్కమును చేర్చి నిరూహవస్తిని విధ్యుక్తప్రకారము చేయదగును. (ఇచ్చట "క్షారయవతిల్వకభృష్ట కల్కతో వా నిరూహః" అని ప్రాచీనకోశమున అధికపాఠమున్నది. యవక్షారము, యవలు, లొద్దుగు వీనిని వేయించి కల్కముచేసి నిరూహవస్తియోగమునచేర్చి యుప యోగించవలెనని యర్థము).

మరియు దేవదారునుచేర్చి సిద్ధము (పక్వము) చేయబడిన తైలమును (అనువాసన ముగజేర్చి) నిరూహవస్తిని చేయవలెను. తిల్వకకల్పమున "లోధ్రకల్కేనమూత్రాష్టు ......సర్పిషీ ద్వే చ సాధయేత్" (కల్ప. అ. ౧౦. శ్లో. ౧౬) అని చెప్పబడిన తిల్వక ఘృతమును విరేచనమునకై యుపయోగింపవలెను.

పిల్లిపీచర, పల్లేరు, పెద్దములక, వాకుడు, తిప్పతీగె, తెల్లగలిజేరు, వట్టివేరు, అతిమధురము, తెల్లసుగంధపాల, నల్లసుగంధపాల, లొద్దుగు, సన్నరాష్ట్రము, కుశదర్భ వేళ్లు, రెల్లుదర్భవేళ్లు వీనినన్నిటినిచేర్చి కషాయము కాచి యీకషాయమును ఆవుపాలును చేరి తైలమునకు నాలుగింతలుగు తైలమున చేర్చి, అందు చిట్టాముట్టి, అడ్డసరము, ఋష భకము, ఓమము, నల్లజీలకర, కొడిసెపాలవిత్తులు, దోసవిత్తులు, నక్కదోసగింజలు, శితి వారక (దూసరిచెట్టు) వేరు, అతిమధురము, వస, సదాపవిత్తులు, పాషాణభేది, గలిజేరు, మ్రంగకాయలు వీనినన్నిటిని కల్కముజేసి తైలమున కలిపి తైలపాకవిధిప్రకారము పక్వముజేసి యుంచునది. రోగికి పైజెప్పిన తైలముతో నిరూహవస్తినైనను ఉత్తరవస్తి

నైనను చేయునది. తొలుత నిరూహవస్తిచే శోధనముచేసి స్నేహస్వేదవిధులజేసి పిమ్మట క్రింద జెప్పబడు విధిప్రకారము ఉత్తరవస్తిప్రయోగించినయెడ వస్తి(మూత్రాశయము) నందలి శూలంబును, మూత్రకృచ్ఛ్రము మున్నగు మూత్రవ్యాధులును నివర్తించును. (ఇచ్చట శతావర్యాదికాఖ్యములచే పరిభాషానుసారముగ కషాయముకాచి యాకషాయ మును ఆవుపాలును చేర్చి తైలమునకు నాల్గుభాగములుగకల్పి, అందు బలాదికల్కము తైలమునకు నాల్గవవంతును కలిపి తైలపాకవిధిప్రకారము పక్వము చేసి యాతైలముచే నిరూహ-ఉత్తరవస్తుల చేయవలెనని యెరుంగునది.)

## హృదయాది మర్మరక్షణావశ్యకత, వానిరక్షణోపాయసంగ్రహము.

భవన్తి చాత్ర శ్లోకాః:—

మూ. హృదయే మూర్ధ్ని వస్తౌ చ నృణాం ప్రాణాః ప్రతిష్ఠితాః,
తస్మాత్తేషాం సదా యత్నం (యత్నాత్) కుర్వీత పరిపాలనే. ౧౬
ఆబాధవర్జనం నిత్యం స్వస్థవృత్తాఽనువర్తనం,
ఉత్పన్నార్తివిఘాతశ్చ మర్మణాం పరిపాలనమ్. ౧౭

వ్యా. హృదయమునందును శిరస్సునందును వస్తియందును మనుజులప్రాణములు ముఖ్యముగ నాధారముగ జేసికొని యుండును; కావున వాని మూటిని కాపాడుట యందు యెల్లప్పుడు మిక్కిలి మెలకువతో ప్రయత్నముచు సలుపవలెను. అట్టి మర్మము లకు వికృతిని కల్గించు కారణముల విసర్జించుటయు, స్వస్థవృత్తమున జెప్పబడిన దినచర్య ఋతుచర్య మున్నగునియమముల నియతముగ ననుసరించి యాచరించుటయు, తత్కాల మున పైజెప్పిన మర్మములకు సంభవించిన వ్యాధుల నుపేక్షింపక శీఘ్రముగనే తగుప్రతీ కారము చేసికొనుటయు హృదయాదిమర్మముల కాపాడుకొనుట కుపాయము లగును.

## హృదయాది మర్మత్రయరోగముల చికిత్సాప్రారంభము.

మూ. అత ఊర్ధ్వం వికారా యే త్రిమర్మీయే చికిత్సితే,
న ప్రోక్తాః మర్మజా స్తేషాం కాంశ్చిద్వక్ష్యామి సౌషధమ్. ౧౮

వ్యా. హృదయాది మర్మముల మూడింటికిని సంభవించు వ్యాధులును వానిచికిత్స లును త్రిమర్మీయ చికిత్సితమున కొన్ని జెప్పబడినవి. అందు (అధ్యాయవిస్తరభీతిచే) జెప్పక విడచినవానిలో కొన్నిటికి లక్షణంబులును వానిచికిత్సితములును ఈక్రింద జెప్పంబడును.

### హృదయమర్మరోగములు,అందు అపతంత్రకవాతలక్షణములు, సంప్రాప్తియు.

మూ. క్రుద్ధః స్వైః కోపనై ర్వాయుః స్థానాదూర్ధ్వం ప్రపద్యతే,
పీడయన్ హృదయం గత్వా శిరశ్శఙ్ఖౌ చ పీడయన్. ౧౯
ధనుర్వన్నమయేద్గాత్రాణ్యాక్షిపేత్ మోహయేత్తథా,
(నమయేచ్చాక్షిపేచ్చాఙ్గాన్యుచ్ఛ్వాసం నిరుణద్ధి చ),
కృచ్ఛ్రేణ చాప్యుచ్ఛ్వసితి స్తబ్ధాక్షోఽథ నిమీలనః ౨౦
కపోత ఇవ కూజేచ్చ నిస్సంజ్ఞస్సోఽపతన్త్రకః,

వ్యా. వాతము స్వకారణములైన యాహారవిహారాదులచే ప్రకోపము నొంది తన స్థానమును వదలి పైకి వ్యాపించి, హృదయమున జేరి, యాస్థలమునందును శిరస్సునందును కణతలయందును నొప్పిని కల్గించుచు, అవయవముల నన్నింటిని వింటిదబ్బవలె వంచి కదలించుచు మూర్ఛ నొందించును. అప్పుడు మనుజుడు చాలకాలమునకు మిక్కిలి కష్టముచే నుచ్ఛ్వాసమును విడచును. కన్నులు స్తంభించి యరమోడ్పుగా మూసికొనును శరీరముపై ప్రజ్ఞ లేక చేష్టలుదక్కి పావురమువలె కూయుచుండును. ఇయ్యది యపతంత్ర మనువాత రోగము.

### అపతానకవాతలక్షణములు.

మూ. దృష్టిం సంస్తభ్య సంజ్ఞాం చ హత్వా కణ్ఠేన కూజతి. ౨౧
హృది ముక్తే నరః స్వాస్థ్యం యాతి మోహం వృతే పునః,
వాయునా దారుణం ప్రాహుః ఏకే తదపతానకమ్. ౨౨

వ్యా. పైజెప్పబడిన యపతంత్రమున దృష్టి స్తంభించి ప్రజ్ఞదప్పి కంఠమున గుఱ్ఱు గుఱ్ఱుమని కూయుచుండును. ఈలక్షణములు కేవల వాతము హృదయమున చేరినప్పుడు మాత్రము కల్గి మూర్ఛ నొంది, వాతము హృదయమును వదలినప్పుడు మూర్ఛనొందక తెలివితో నున్నయెడ నయ్యది యపతానక వాతమని కొందరాచార్యులు చెప్పెదరు. ఇయ్యది కేవలవాతముచేత నే సంభవించును; కావున మిక్కిలి దారుణమైనది.

(అపతంత్రకము వాతముచేతను కఫముచేతను సంభవించుటచే రెండువిధములు. అందు కఫముచే సంభవించుదానియందు సంజ్ఞతప్పియుండును. రెండవది వాతము హృదయమున చేరినప్పుడు ప్రజ్ఞతప్పి, హృదయమును వదలినపుడు ప్రజ్ఞ తెలిసియుండును. దీనిని అపతానకమని కొందరు చెప్పెదరు.)

## అపతంత్రకవాతహర ప్రధమననస్యము.

మూ. శ్వసనం కఫవాతాభ్యాం రుద్ధం తస్య విమోక్షయేత్,
తీక్ష్ణైః ప్రధమనైస్సంజ్ఞాం తాసు ముక్తాసు విన్దతి. ౨౩

వ్యా. కఫవాతములచే హృదయమున శ్వాసము వెడలనీయక అడ్డగింపబడియుండు నపుడు, మిక్కిలి తీక్ష్ణములైన ద్రవ్యములచే సిద్ధమైన ప్రధమననస్యమును ప్రయోగించి తొలుత శ్వాసబంధమును తొలగించవలెను. అట్టి నస్యముచే చేతనావహములగు స్రోతస్సులలో నడ్డు వదలినవెంటనే మూర్ఛతొలగి తెలివి నొందును.

## శిరోవిరేచననస్యము.

మూ. మరిచం శిగ్రుబీజాని విడఙ్గం చ ఫణిజ్ఝకం,
ఏతాని సూక్ష్మచూర్ణాని దద్యాచ్ఛీర్షవిరేచనమ్. ౨౪

వ్యా. మిరియాలు, మునగవిత్తులు, వాయువిడంగములు, మరువము వీనిని మిక్కిలి మెత్తని చూర్ణముగజేసి శిరోవిరేచనమునకై నస్యము చేయవలెను.

## అపతంత్రకహరయవక్వాథపానము.

మూ. తుమ్బురూణ్యభయాహిఙ్గు (హిఙ్గుతుమ్బురుపథ్యాచ)
పౌష్కరం లవణత్రయమ్,
యవక్వాథామ్బునా పేయం హృద్గ్రహే చాఽపతన్త్రకే. ౨౫

వ్యా. తుంబురులు, కరకకాయలు, ఇంగువ, పుష్కరమూలము, లవణత్రయము (సైంధవ-సౌవర్చల-బిడాలవణములు)వీనిని సమభాగములుగగూర్చి చూర్ణముచేసి, యవలకషాయానుపానముతో త్రాగినయెడ అపతంత్రకవాతంబును, హృదయమున పట్టును నివర్తించును.

## అపతంత్రకహరహింగ్వాదిక్వాథపానము.

మూ. హిఙ్గ్వమ్లవేతసం శుణ్ఠీం ససౌవర్చలదాడిమం,
పిబేత్; వాతకఫఘ్నం చ కర్మ హృద్రోగనుద్ధితమ్ ౨౬

వ్యా. ఇంగువ, అమ్లవేతసము (పుల్లప్రబ్బలి), శుంఠి, సౌవర్చలలవణము, దానిమ్మబెరడు వీనిని కషాయము కాచి త్రాగవలెను. మరియు వాతకఫముల హరించునదియు, హృద్రోగహరంబులును నగుచికిత్సావిధానమంతయు నపతంత్రకవాతమున మిక్కిలి హితముగ నుండును.

## అపతంత్రకమున శోధన (నిరూహ) వస్తినిషేధము.

మూ. శోధనాః వస్తయస్తీక్ష్ణాః న హితాస్తస్య కృత్స్నశః,
సౌవర్చలాఽభయావ్యోషైః సిద్ధం తస్మై ఘృతం హితమ్ ౨౭

వ్యా. అపతంత్రకవాతమున (నిరూహ) శోధనవస్తులును తీక్ష్ణముగనున్నవి విశేషముగ హితకరములు కానేరవు. మరియు సౌవర్చలలవణము, కరకకాయలు, త్రికటుకములు వీనిని చేర్చి పక్వముచేయబడిన ఘృతమును శోధనమునకై యుపయోగించుట హితకరము. ("శోధనాః వస్తయః కృత్స్నశః న హితాః" అని చెప్పుటవలన అపతంత్రకవాతమున శోధనమునకై వస్తుల విశేషముగ నుపయోగింపక స్వల్పముగ నిరూహవస్తి నుపయోగింపదగునని తెలిసెడి.)

## తంద్రానిదానము, సంప్రాప్తియు.

మూ. మధురస్నిగ్ధగుర్వన్న(ఘ్న) సేవనాత్ చిన్తనాత్ శ్రమాత్,
శోకాత్ వ్యాధ్యనుషఙ్గాచ్చ వాయునోదీరితః కఫః. ౨౮
యదాఽసౌ సమవస్కన్ద్య హృదయం హృదయాశ్రయాన్,
సమావృణోతి జ్ఞానాదీన్ తదా తన్ద్రోపజాయతే. ౨౯

వ్యా. మధురంబును స్నిగ్ధంబును గురుత్వముకల్గినదియు నగునన్నమును భుజించుటవలనను, దుఃఖమువలనను, చింతనారూపమైన మనోవ్యాపారముచేతను, శ్రమవలనను ఇతరవ్యాధు లనుసరించి యుండుటవలనను ప్రకోపము నొందినవాతముచేత కఫము ప్రేరేపింపబడి హృదయమున జేరి బాధించి, హృదయము నాశ్రయించియుండు సంజ్ఞావహస్రోతస్సుల నడ్డగించి జ్ఞానవిజ్ఞానాది మనోవ్యాపారములను నిరోధించినపుడు తంద్రను కల్గించును.

## తంద్రాలక్షణములు.

మూ. హృదయే వ్యాకులీభావః వాక్చేష్టేన్ద్రియగౌరవం,
మనోబుద్ధ్యప్రసాదశ్చ తన్ద్రాయాః లక్షణం మతమ్ 30

వ్యా. అట్టియెడ హృదయమున వ్యాకులముగనుండును. మాటలాడుటకును ఆంగికవ్యాపారములకు చక్షురాదీంద్రియవ్యాపారములకును కష్టముగ నుండును. మనస్సును బుద్ధియు నిర్మలముగాక మందగించి యుండును. ఇవియన్నియు తంద్రావ్యాధికి లక్షణములు.

## తంద్రాచికిత్సితము.

మూ కఫఘ్నం తత్ర కర్తవ్యం శోధనం శమనాని చ,
వ్యాయామో రక్తమోక్షశ్చ భోజ్యం చ కటుతిక్తకమ్. ౩౧

వ్యా. తంద్రావ్యాధియందు కఫమునుహరించు శోధనంబును శమనౌషధంబులును, వ్యాయామంబును, రక్తమోక్షంబును, కటు-తిక్తరసములైన పదార్థముల భుజించుటయు, హితములుగ నుండును.

## వస్తిగతరోగములు. అందు మూత్రమునకు సంబంధించినరోగములు పదిమూడు

మూ. మూత్రౌకసాదో, జఠరం, కృచ్ఛ్రముత్సఙ్గసంక్షయౌ,
మూత్రాఽతీతోఽనిలాష్ఠీలా వాతవస్త్యుష్ణమారుతౌ. ౩౨
వాతకుణ్డలికా, గ్రన్థిః విడ్విఘాతో వస్తికుణ్డలం,
త్రయోదశైతే మూత్రస్య దోషాః; తాన్ లిఙ్గతశ్శృణు. ౩౩

వ్యా. మూత్రౌకసాదము, మూత్రజఠరము, మూత్రకృచ్ఛ్రము, మూత్రోత్సంగము, మూత్రసంక్షయము, మూత్రాఽతీతము, అఽష్ఠీల, వాతవస్తి, ఉష్ణవాతము, వాతకుండలిక, రక్తగ్రంథి, విడ్విఘాతము, వస్తికుండలము అను నీపదిమూండురోగములును మూత్రమునకు సంబంధించినవి. వీనిలక్షణములన్నియు నీక్రింద వివరింపబడును.

(ఇచ్చట చెప్పబడిన మూత్రవ్యాధులు, త్రిమర్మీయచికిత్సితమున—"వ్యాయామతీక్ష్ణౌషధ రూక్షమద్య..."అని యుపక్రమించి చెప్పబడిన మూత్రకృచ్ఛ్రములకన్న వేరైనవని యెరుంగునది.)

## (1) మూత్రౌకసాదలక్షణము, చికిత్స.

మూ. పిత్తం కఫో ద్వావయం వాపి వస్తౌ సంహన్యతే యదా,
మారుతేన తదా మూత్రం రక్తం పీతం ఘనం సృజేత్. ౩౪
సదాహం శ్వేతసాన్ద్రం వా, సర్వైర్వా లక్షణైర్యుతం,
మూత్రౌకసాదం తం విద్యాత్; పిత్తశ్లేష్మహరైర్జయేత్. ౩౫

వ్యా. పిత్త-కఫములు వేరువేరుగనైనను రెండును చేరియైనను ప్రకోపము నొంది వస్తియందు వాతము నడ్డగించి దీనితో కలిసి యెప్పుడుండునో, అప్పుడు రక్తపీతవర్ణములు కల్గి చిక్కనైనమూత్రమును వెడలించును. లేక శ్వేతవర్ణము కల్గి చిక్కనైనమూత్రము నైన వెడలించును. లేక పైజెప్పినలక్షణము లన్నిటితో కూడిన మూత్రమునైన వెడ

ము. ఇయ్యది మూత్రౌకసాదమని చెప్పబడును. ఈవ్యాధికి పిత్తకఫముల హరించు ధములచే చికిత్స చేయవలెను.

ము:—

మూత్రౌకసాదము మూడువిధములు.—అందు ప్రకుపితమైనపిత్తము వాత నిరోధించి వాతముతో కలిసినపుడు జనించినది యొకటి. ఈభేదమున రక్తపీతఘన మూత్రము వెడలును. కఫము ప్రకుపితమై వాతముతో కలియుటచే సంభవించునది వది. ఈభేదమున మంటతోకూడి శ్వేతవర్ణంబును చిక్కనయు నైనమూత్రము ను. పైజెప్పిన పిత్తకఫములు రెండును ప్రకోపము నొంది వాతముతో కలిసినపుడు చినది మూడవది. దీనియందు పైజెప్పిన రెంటిలక్షణము లన్నియుకలిసిన మూత్రము నును. ఈమూంటికిని పిత్తశ్లేష్మహరములైన చికిత్సల చేయవలెను. వాతమునకు కఫ ములచే నావరణముకల్గుటయే ప్రకోపకారణముకాని వేరొండు కారణములేదు. కావు పిత్తశ్లేష్మముల జయించినచో వాతము తనంతటనే శమించునని యుద్దేశించి పిత్త హారచికిత్సయే విధింపబడినది.

## (2) మూత్రజఠరలక్షణము.

మూ. విధారణాత్ప్రతిహతం వాతోదావర్తితం యదా,
పూరయత్యుదరం మూత్రం తదా తదనిమిత్తరుక్. 36
అపక్తిమూత్రవిట్సఙ్గైః తన్మూత్రజఠరం వదేత్,

వ్యా. మూత్రమును విసర్జించవలసినపుడు వెడలనీయక దానివేగమును నిరోధించు వాతము ప్రతిలోమగతినొంది మూత్రమును పైకిమరలించును. అట్టియెడ ప్రతిహత మూత్రము సంచితమై యుదరమును పూరించును. అయ్యది కారణము తెలియకయే కల్గించును. ఆహారము జీర్ణముకాక మలమూత్రములు వెడలక బంధించును. య్యది మూత్రము జఠరమున పూరించి యుండుటచే మూత్రజఠరమని యన్వర్థముగ బడును.)

## మూత్రజఠరచికిత్స.

మూ. మూత్రవైరేచనీం తత్ర చికిత్సాం సమ్ప్రయోజయేత్. 37
హిఙ్గుద్విరుత్తరం చూర్ణం త్రిమర్మీయే ప్రకీర్తితం,
హన్యాన్మూత్రోదరానాహమాధ్మానం గుదమేఢ్రయోః. 38
(హన్యాన్మూత్రాదిసఙ్ఘాతం వ్యాధించగుదమేఢ్రయోః)

వ్యా. పైజెప్పిన మూత్రజఠరమునందు మూత్రమును బైటవెడలించు, చికిత్సను ప్రయోగము చేయవలెను. మరియు త్రిమర్మీయచికిత్సితమున జెప్పబడిన ద్విరుత్తరహింగ్వాదిచూర్ణమును సేవించినచో మూత్రోదరంబును, ఆనాహంబు (కడుపుబ్బరము)ను, గుదమునందును మేఢ్రమునందును కల్గుఆధ్మానంబును నివర్తించును. (ఇచ్చట త్రిమర్మీయమున—"ద్విరుత్తరం హింగు......సమీరణఘ్నమ్" (చ-చికిత్స. అ. ౨౬. శ్లో. ౨౦) అని చెప్పబడిన ద్విరుత్తరహింగ్వాదిచూర్ణమును గ్రహించునది.)

### (3) మూత్రకృచ్ఛ్రలక్షణము.

మూ. మూత్రితస్య వ్యవాయాత్తు రేతో వాతోద్ధతం చ్యుతం,
పూర్వం మూత్రస్య పశ్చాద్వా స్రవేత్ కృచ్ఛ్రం తదుచ్యతే.

వ్యా. మూత్రము వెడల నున్నప్పుడు దాన్నినిరోధించి అప్పుడే సంభోగముచేసిన యెడ రేతస్సు స్వస్థానమునుండిజారి వాతముచే నిరోధింపబడి మూత్రమునకు ముందైనను వెనుకనైనను స్రవించును. అయ్యది మూత్రకృచ్ఛ్రమని చెప్పబడును. (ఈకృచ్ఛ్రము త్రిమర్మీయమున చెప్పినదానికన్న నితరమైనది.)

### (4) మూత్రోత్సంగలక్షణము.

మూ. స్వైర్వా గుణ్యాऽనిలాక్షేపైః కిఞ్చిత్ మూత్రస్య తిష్ఠతి,
మణిసన్ధౌ స్రవేత్ పశ్చాత్ తదరుగ్వాऽథ చాతిరుక్. ౮౦
మూత్రోత్సఙ్గస్సః విచ్ఛిన్నం ఉచ్ఛేషగురుశేఫసః,

వ్యా. వాతము స్వకారణములచే ప్రకోపమునొంది మూత్రమును అడ్డగించుటచేత మూత్రములో కొంచెము మేఢ్రముయొక్క మణిసంధియందు నిలబడియుండును. వృద్ధినందినమూత్రమంతయు వెడలక కొంచెము మిగిలియుండుటవలన మేఢ్రము స్థూలమై కొంతకాలమునకు పిమ్మట నొప్పిలేకయైనను మిక్కిలిబాధతో కూడియైనను మూత్రము కొంచెముకొంచెముగ నిలిచి నిలిచి వెడలును. ఇది మూత్రోత్సంగమని చెప్పబడును.

### (5) మూత్రక్షయలక్షణము.

మూ. వాతాకృతిర్భవేద్వాతాత్ మూత్రే శుష్యతి సంక్షయః. ౮౧

వ్యా. ప్రకుపితమైనవాతమువలన మూత్రము శోషించి క్షీణించిన నయ్యది మూత్రసంక్షయమని చెప్పబడును. ఇది వాతలక్షణములు కల్గియుండును.

(6) మూత్రాఽతీతలక్షణము.

మూ. చిరం ధారయతో మూత్రం త్వరయా న ప్రవర్తతే,
మేహమానస్య మన్దం వా మూత్రాఽతీతస్స ఉచ్యతే.　　౪౨

వ్యా. మూత్రము వెడల నున్నపుడు దానిని వెడలనీయక చాలకాలము బిగబట్టిన యెడ మూత్రము సరళముగ శీఘ్రముగ వెడలదు. ఒకవేళ బలాత్కారముగ వెడలించినచో మెలమెల్లగ వెడలును. ఇయ్యది మూత్రాతీతమని చెప్పబడును.

(7) అష్ఠీలా లక్షణము.

మూ. ఆధ్మాపయన్ వస్తిగుదం రుద్ధ్వా వాయుశ్చలోన్నతాం,
కుర్యాత్తీవ్రార్తిమష్ఠీలాం మూత్రవిణ్మార్గరోధినీమ్.　　౪౩

వ్యా. వాతము ప్రకుపితమై వస్తియొక్కయు గుదముయొక్కయు మార్గము నడ్డగించియు బిగించి తీవ్రమైన వేదనతోకూడిన రాయినిమూత్రమున గల్గించును. ఇచ్చట చంచలమై యున్నతముగ నుండును. మల మూత్రమార్గము నడ్డగించి వానిని వెడల నీయదు. ఈవ్యాధి అష్ఠీలయని చెప్పబడును.

(8) వాతవస్తిలక్షణము.

మూ. మూత్రం ధారయతో వస్తౌ వాయుః క్రుద్ధో విధారణాత్,
మూత్రరోధార్తికణ్డూభిః వాతవస్తిస్స ఉచ్యతే.　　౪౪

వ్యా. మూత్రమును వెడలనీయక యడ్డుపరచినయెడ దానంజేసి వస్తియందు వాతము ప్రకోపించి మూత్రమును వెడలనీయక వస్తియందే యడ్డగించును, దానంజేసి నొప్పియు జిలయు కల్గును. ఇయ్యది వాతవస్తి యని చెప్పబడును.

(9) ఉష్ణవాత లక్షణము.

మూ. ఊష్మణా సోష్మకం మూత్రం శోషయన్ రక్తపీతకం,
ఉష్ణవాతస్సృజేత్ కృచ్ఛ్రాత్ వస్త్యుపస్థార్తిదాహవాన్.　　౪౫

వ్యా. వాతము ప్రకుపితమై పిత్తముయొక్క వేడిచేత మూత్రమును శోషింపజేసి వేడికల్గి రక్తవర్ణముగనైనను పీతవర్ణముగ నైననుండు మూత్రమును మిక్కిలి కష్టముచే వెడలించును. వస్తియందును మేఢ్రమునందును నొప్పిని మంటను కల్గించును. ఇయ్యది యుష్ణవాతమను మూత్రరోగము.

ఈవ్యాధియొక్క సంప్రాప్తిలక్షణములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:— "వ్యాయామాధ్వాతపైః పిత్తం వస్తిం ప్రాప్యాఽనిలాన్వితమ్, వస్తిం మేఢ్రం గుదం చైవ ప్రదహేత్స్రావయేదధః. మూత్రం హారిద్రమథ వా సరక్తం రక్తమేవ వా, కృచ్ఛ్రాత్పునః పునర్జన్తోః ఉష్ణవాతం బ్రువన్తి తమ్" ఈవాక్యముచేత వ్యాయామము త్రోవనడచుట ఎండలో సంచరించుట అను నీకారణములచే పిత్తము ప్రకుపితమై వస్తిలో జేరి యందలి వాతమున నేకీభవించి వస్తి గుద మేఢ్రములను మంట బుట్టించుచు మిక్కిలి కష్టముచే పసుపురంగు కల మూత్రమునైనను, రక్తముతో కూడిన మూత్రమునైనను, కేవల రక్తమునైనను మాటిమాటికి వెడలించునని యర్థము.

(10) వాతకుండలికాలక్షణము.

మూ. గతిసఙ్గాదుదావృత్తః సమూత్రస్థానమార్గయోః,
మూత్రస్య విగుణో వాయుః భగ్నవ్యావిద్ధకుణ్డలీ. ౪౬
మూత్రం విహన్తి సంస్తమ్భభఙ్గగౌరవవేష్టనైః,
తీవ్రరుక్ మూత్రవిట్సఙ్గైః వాతకుణ్డలికేతిసా. ౪౭

వ్యా. మూత్రస్థానముయొక్కయు మూత్రముయొక్కయు మార్గము నడ్డగించుటచేత వాతము ప్రకుపితమై విలోమగతి నొంది ప్రతిహతమై వక్రగతి కల్గి కుండలాకారముగ సుడివడి సంచరించుచు, మూత్రమున నభిఘాతము కల్గించును. అట్టిమూత్రము సరళముగ వెడలక స్తంభించి భగ్నమై గురుత్వముకల్గి సుడివడిదిరుగుచు తీవ్రమైనబాధను కల్గించి, మూత్ర పురీషములను బద్ధగించుచు వెడలును. ఇయ్యది వాతకుండలిక యనబడును.

(11) రక్తగ్రంథిలక్షణము.

మూ. రక్తం వాతకఫాద్దుష్టం వస్తిద్వారే సుదారుణం,
గ్రన్థిం కుర్యాత్ స కృచ్ఛ్రేణ సృజేన్మూత్రం తదావృతమ్ ౪౮
అశ్మరీసమశూలం తం రక్తగ్రన్థిం ప్రచక్షతే,

వ్యా. వాతకఫములచే దుష్టమైనరక్తము వస్తియొక్క ద్వారమున మిక్కిలి క్రూరమైనగ్రంథిని కల్గించును. అట్టిరక్తగ్రంథిచే నడ్డగింపబడిన మార్గముకల యావస్తి దుష్టమైనరక్తములో కూడినమూత్రమును మిక్కిలికష్టములతో వెడలించును. ఇయ్యది అశ్మరితో సమానములగు కారణములతో జనించి, అట్టిశూలాకారమును కల్గినరక్తగ్రంథి యని చెప్పబడును. (దీనిని "మూత్రగ్రన్థి స్స ఉచ్యతే" అని మూత్రగ్రంథి యను పేర

౦చరు వ్యవహరించిరి). ఈవ్యాధియందు రక్తము గ్రంథిరూపముగ గడ్డకట్టియుండుననియు, శ్మరియందు మూత్రశుక్రాదులు ఘనీభవించి కఠినముగనుండుననియు భేదము రుంగునది.

## (12) విడ్విఘాతలక్షణము.

సూ. రూక్షదుర్బలయోర్వాతేనోదావృత్తం శకృద్యదా. ౪౯
మూత్రస్రోతః ప్రపద్యేత విట్సంసృష్టం తదా నరః,
విడ్గన్ధం మూత్రయేత్ కృచ్ఛ్రాత్ విడ్విఘాతం వినిర్దిశేత్. ౫౦

వ్యా. రూక్షశరీరునకును బలహీనునకును వాతము ప్రకోపించి, పక్వాశయమున ందుపురీషమును విలోమముగ పైకి వ్యాపింపజేయును. అయ్యది మూత్రమార్గమున ేరును. అట్టియెడ మానవుడు మలముతో గలిసి మలముతో సమానముగ దుర్గంధముతో ాడినమూత్రమును మిక్కిలి కష్టముచే వెడలించును. ఇయ్యది విడ్విఘాతమను మూత్ర ్యాధియని చెప్పబడును. (విద్భ్యక్తో విఘాతః-విడ్విఘాతః" అనువ్యుత్పత్తిచేత మలముతో ాడిన మూత్రకృచ్ఛ్రము విడ్విఘాతమని యన్వర్థముగ జెప్పబడును.)

## (13) వస్తికుండలలక్షణము, దానిభేదములును.

సూ. ద్రుతాద్ధ్వలఙ్ఘనాయాసాత్ అభిఘాతాత్ ప్రపీడనాత్,
స్వస్థానాత్ వస్తిరుద్వృత్తః స్థూలస్తిష్ఠతి గర్భవత్. ౫౧
శూలస్పన్దనదాహార్తః బిన్దుం బిన్దుం స్రవత్యపి,
పీడితస్తు సృజేద్ధారాం సంస్తమ్భోద్వేష్టనార్తిమాన్. ౫౨
వస్తికుణ్డలమాహుస్తం ఘోరం శస్త్రవిషోపమం,
పవనప్రబలం ప్రాయః దుర్నివారమబుద్ధిభిః. ౫౩
తస్మిన్ పిత్తాన్వితే దాహః శూలం మూత్రవివర్ణతా,
శ్లేష్మణా గౌరవం శోఫః స్నిగ్ధం మూత్రం ఘనం సితమ్. ౫౪

వ్యా. మిక్కిలివేగముగ త్రోవనడచుట, కాలువ గోంది మొదలగువానినిదాటుట, రీరమునకు శ్రమమును కల్గించు పనులజేయుట, వస్తిప్రదేశమున నభిఘాతము కల్గుట, స్తిప్రదేశమున గట్టిగ బిగపట్టి మర్దనచేయుట, ఈకారణములచేత వస్తి (మూత్రపుతిత్తి) స్థానమునుండి పైకి వ్యాపించి గర్భమువలె స్థూలమై యుండును. అప్పుడు నొప్పియు ాదుల బొడిచినవిధముగ పోటును గల్గి మూత్రము బొట్టుబొట్టుగ మిక్కిలికష్టముచే

వెడలును. అట్టియెడ పొత్తికడుపును చేత పిసికినయెడ మూత్రము ధారగ వెడలును. అప్పుడు వస్తియందు బిగబట్టి పొరలునట్లు నొప్పి కల్గియుండును. ఇయ్యది విషమును శస్త్రమునుబోలె క్రూరమైన వస్తికుండలమను మూత్రరోగమని చెప్పెదరు. ఈవ్యాధియందు వాతము మిక్కిలి బలిష్ఠమై యుండును. కావున శాస్త్రజ్ఞానంబును అనుభవంబును లేని సామాన్యవైద్యునకు ప్రాయికముగ ననివార్యమై యుండును.

మరియు నీవ్యాధియందు పిత్తసంబంధము కల్గియున్నయెడ మంటయు పోటును కలిగి మూత్రము వివర్ణమై వెడలును. కఫముతోకూడినపుడు వస్తియందు బరువును శోఫంబునుకల్గి జిడ్డుతోకూడి చిక్కనై తెల్లగనుండుమూత్రము వెడలును.

## వస్తికుండలసాధ్యాసాధ్యలక్షణములు.

మూ. శ్లేష్మరుద్ధబిలో వస్తిః పిత్తోదీర్ణో న సిధ్యతి,
అవిభ్రాన్తబిలస్సాధ్యః న తు యః కుణ్డలీకృతః. ౫౫
స్యాద్వస్తౌ కుణ్డలీభూతే తృణ్మోహః (తృణ్మోహః) శ్వాస ఏవ చ,

వ్యా. వస్తికుండలమందు పిత్తము మిక్కిలి యుత్కటమై వస్తియొక్కద్వారము కఫముచే నడ్డగింపబడినయెడ, నయ్యది సాధ్యము కానేరదు. వస్తిద్వార మడ్డుపడక వస్తి కుండలమువలె చుట్టికొనక యున్నచో నయ్యది సాధ్యమగును. వస్తి కుండలమువలె మెలితిరిగినపుడు హృదయరోగంబును (డప్పియు) మూర్ఛయు శ్వాసంబును కల్గును.

## మూత్రకృచ్ఛ్రాదివ్యాధులకుచికిత్సావిధి.

మూ. దోషాధిక్యమవేక్ష్యైతాన్ మూత్రకృచ్ఛ్రహరైర్జయేత్. ౫౬
వస్తిముత్తరవస్తిం చ సర్వేషామేవ దాపయేత్,

వ్యా. పైజెప్పిన మూత్రకృచ్ఛ్రము మున్నగువస్తివ్యాధులను చక్కగ గమనించి వానియందలి యేదోషము అధికముగనుండునో దానినిర్ణయించి అట్టిదోషమునకు తగినట్లు మూత్రకృచ్ఛ్రహరములగు చికిత్సలజేసి నివర్తింపజేయనగును. మరియు మూత్రవ్యాధులన్నిటికిని వస్తినైనను, క్రిందచెప్పబడు ఉత్తరవస్తినైనను ప్రయోగించి చికిత్స చేయవలెను.

## ఉత్తరవస్తియంత్రనిర్మాణము. అందు పుష్పనేత్రము.

మూ. పుష్పనేత్రం తు హైమం స్యాత్ శ్లక్ష్ణమాత్తరవస్తికం. [తమ్,
జాత్యశ్వహనవృన్తేన (జాతీపుష్పస్యవృన్తేన) సమం గోపుచ్ఛసంస్థి
రౌప్యం వా సర్షపచ్ఛిద్రం ద్వికర్ణం ద్వాదశాఙ్గులం. ౫౭

వ్యా. (పుష్పనేత్రమన—ఉత్తరవస్తియంత్రమునకు కొనయం దమర్చబడు గొట్టకు పేరు. ఈసంజ్ఞ ఆయుర్వేదపారిభాషికము.) అట్టిపుష్పనేత్రమును (ఉత్తరవస్తి 'త్రమునకు సంబంధించినగొట్టమును)జాజిపువ్వుయొక్క తొడిమకు సమానముగనైనను ౨రుపువ్వుయొక్క తొడిమతో సమానముగనైనను యాకారముకల్గి ఆవుతోకవలెనుండి పు కల్గియుండునట్లు బంగరుతో చేయవలెను. లేక వెండితోనైన చేయవలెను. స్యేది యావగింజ దూరునంతరంధ్రమును కొనయందు కల్గి, కొనయం దొకకర్ణికయు మట చేతపట్టుకొనుస్థలమున నొకకర్ణికయును, కల్గి పంద్రెండంగుళములనిడివి ప్రమాణ కలదిగ నుండవలెను. (ఇచ్చట ఉత్తరమార్గమున (మూత్రద్వారమున) ప్రయోగింప ఉంజేసియు, వస్తులలో నుత్తమమగుటవలనను ఉత్తరవస్తియని యన్వర్థముగ జెప్ప ను.)

### ఉత్తరవస్తిస్నేహపరిమాణము.

౹౭. తేనాఽజవస్తియుక్తేన స్నేహస్యాఽర్థపలం నయేత్,
యథా వయోవిశేషేణ స్నేహమాత్రాం వికల్ప్య వా. ౫౯

వ్యా. పైజెప్పినప్రమాణప్రకారము చేయబడిన పుష్పనేత్రమునకు మేకయొక్క ౦త్రపుసంచిని యిమిడికగ నమర్చి, యందు అర్థపలము స్నేహమునుపోసి వస్తినేత్రము ట్టము) నుండి లోనికి ప్రవేశింపజేయవలెను. అట్టిస్నేహపరిమాణమును వయోభేదము సరించి తత్తదనుసారముగ తగ్గించి కల్పింపనగును.

పైజెప్పబడిన అర్థపలపరిమాణము ఇరువదియైదువత్సరములు వయస్సుగలవారి కైశించినది. ఇదియే పరమప్రమాణము. అంతకధికముగ వయసుకలవారికెల్ల నదియే హాప్రమాణము. ఇరువదియైదువత్సరములకన్న తక్కువవయసున వయోభేదమునుబట్టి ౼ప్రమాణమును తగ్గించవలెనని "యథా వయో విశేషేణ" అనువాక్యముచే నాచా లు శాసించిరి. ఈపరిమాణభేదమును సుశ్రుతాచార్యు లిట్లు చెప్పిరి.—"స్నేహ మాణం పరమం ప్రకుఞ్చశ్చాఽత్ర కీర్తితః. పఞ్చవింశతి వర్షాణాం అర్వాగ్బుద్ధి వికల్పి." (సు. చి. అ. ౩౭.)

### ఉత్తరవస్తిప్రయోగవిధి.

౯౦. స్నాతస్య భుక్తభక్తస్య రసేన పయసాపి వా,
సృష్టవిణ్మూత్రవేగస్య (విసృష్టవర్చోమూత్రస్య)
పీఠే జానుసమే మృదౌ. ౬౦

ఋజోః సుఖోపవిష్టస్య హృష్టే మేఢ్రే ఘృతాఽక్తయా,
శలాకయాఽన్విష్య గతిం యద్యప్రతిహతా వ్రజేత్. ౬౧
తతః శేషప్రమాణేన పుష్పనేత్రం ప్రవేశయేత్,
గుదవత్ మూత్రమార్గేణ ప్రణయేదనుసేవనీమ్. ౬౨
హింస్యాదతిగతం (హింస్యాద్వస్తిగతం)
వస్తిమూనే స్నేహో న గచ్ఛతి,
సుఖం ప్రపీడ్య నిష్కమ్పం నిష్కర్షేన్నేత్రమేవ చ. ౬౩
ప్రత్యాగతే ద్వితీయం చ తృతీయం చ ప్రదాపయేత్,

వ్యా. ఉత్తరవస్తిని ప్రయోగించ వలసినపుడు స్నానము చేసి మాంసరసంబును పాలునుకలిపిన అన్నము భుజించి మలమూత్రముల విసర్జించినవానిని మోకాటిపొడవు కల మృదువైనపీఠముపై సుఖముగ వంకరలేక చక్కగ (కాళ్లుప్రేలవేసి) కూర్చుండ నియమించి, వాని మేఢ్ర మున్నతిజెంది యుండునపుడు(ఏషణీ)శలాకకు నెయ్యి బూసి మేఢ్రద్వారమున ప్రవేశపెట్టి మూత్రమార్గమును తొలుత పరీక్షించవలెను. అప్పుడు శలాక మేఢ్రముపొడుగుకు అడ్డులేక మేఢ్రరంధ్రములో ప్రవేశించినయెడ స్నేహముతో నిండిన వస్తియంత్రముయొక్క పుష్పనేత్రము గుహ్యముపొడుగున మూత్రమార్గమునుండి ప్రవేశపెట్టవలెను. అట్టియెడ నిరూహవస్తి ప్రయోగసమయమున కంపనాదులు లేక గమకించునట్లు గమనించుచు సేవనీయనునవయవము ననుసరించి యంత్రనేత్రమును ప్రవేశింపచేసి స్నేహము వస్తిలోనికి ప్రవేశించునట్లు ప్రయోగించవలెను. మేఢ్రప్రమాణమునకన్న నధికముగ వస్తినేత్రము లోనికిప్రవేశించినచో వస్తిని(మూత్రాశయమును) బాధించును. అటుగాక తక్కువపరిమాణముగ ప్రవేశింపజేసినయెడ స్నేహము లోపలికి ప్రవేశింపనేరదు. (కావున మేఢ్రప్రమాణమువరకు ప్రవేశించునట్లు మూత్రమార్గమున ప్రవేశింపజేయవలె ననుట.) ఇత్తెరంగున ప్రవేశపెట్టి వస్తియంత్రమును సుఖముగ నొక్కి స్నేహమంతయు లోనికి ప్రవేశించినపిమ్మట, ఇటునటు కదిలించక పుష్పనేత్రమును మెల్లగ వెలికి లాగవలెను. స్నేహము బైట వెడలివచ్చినపిమ్మట మరల రెండవతూరియు మూడవతూరియు నదేవిధముగ ప్రవేశింపజేయవలెను.

### ఉత్తరవస్తియందు స్నేహాకర్షణమునకు వర్తిప్రయోగము.

మూ. అనాగచ్ఛన్నుపేక్ష్యస్తు రజనీవ్యుషితస్య చ. ౬౪
పిప్పలీలవణాఽగారధూమాఽపామార్గసర్షపైః,

వా ర్తాకురసనిర్గుణ్డీశమ్పాకైః ససహాచరైః. ౬౫
మూత్రాఽమ్లపిష్టైః సగుడైః వర్తిం కృత్వా ప్రవేశయేత్,
అగ్రేతుసర్షపాకారాం పశ్చాద్బద్ధే మాషసమ్మితామ్. ౬౬
నేత్రదీర్ఘాం ఘృతాఽభ్యక్తాం సుకుమారామభఙ్గురాం,
నేత్రవత్ మూత్రనాడ్యాన్తు పాయా చాఽఙ్గుష్ఠసమ్మితామ్.

వ్యా. పైజెప్పినప్రకారము ఉత్తరవస్తిప్రయోగము చేసినపిదప నొకరాత్రి తయు నిరీక్షించి, అప్పటికిని స్నేహము బైటవెడలకున్నయెడ నారాత్రి గడచినపిదప ంద జెప్పబడువర్తిని ప్రయోగించవలెను:—పిప్పళ్లు, సైంధవలవణము, కరిదూపము, రేణి, ఆవాలు, వంకాయలరసము, నల్లవావిలి, రేలకాయలోనిజిగురు, గోరంట న్నిటిని గోమూత్రమును అమ్లకాంజికమును బోసి మెత్తగనూరి బెల్లము పాకముబట్టి, ప పైజెప్పినపిష్టమును కలిపి వర్తిజేసి, యావస్తిని మూత్రమార్గమున ప్రవేశింపజేయ ు.మరియు నావర్తిని కొనయందు ఆవగింజంతలావును మొదట మినుపగింజంతలావును వస్తినేత్రమునకు జెప్పిన దీర్ఘంబును గల్గి సుకుమారంబును నునుపును కల్గి వంకరలేక ండునట్లు చేసి నిర్మించి దానికి నెయ్యి పూసి, యావర్తిని (వస్తిప్రయోగమున వస్తి ్రమును ప్రవేశింపజేయునట్లు) మూత్రనాళమునందు ప్రవేశింపజేయవలెను. మరియు వాసనవస్తియందు స్నేహము బైట వెడలకున్నప్పుడును పైజెప్పినవిధముగ వర్తిని ంనవ్రేలిలావు కల్గియుండునట్లు నిర్మించి ఘృతమునుబూసి గుదమార్గమునందును ప్రవే జేయవలెను.

## ఉత్తరవస్త్యనంతరవిధి.

౦. స్నేహే ప్రత్యాగతే తాభ్యాం అనువాసనికో విధిః,
పరిహారశ్చ సవ్యాపత్ ససమ్యగ్గత్తలక్షణః. ౬౮

వ్యా. పైజెప్పిన వర్తిప్రయోగములచే మేఢ్రమునుండియు గుదమునుండియు ేహము బైటవెడలినపిదప అనువాసనవస్తిని జేసినపిదప నాచరించవలసినయాహారాది ుములనే ఆచరింపనగును. మరియు విసర్జింపవలసిన విషయములను పథ్యపానాదు వ్యాపత్తులను అసమ్యగ్యోగలక్షణములను వ్యాపచ్చికిత్సితములను అనువాసనవస్తికి నే యెరుంగునది.

## స్త్రీల కుత్తరవస్తి నుపయోగించవలసినకాలము.

౦. స్త్రీణామార్తవకాలే తు ప్రతికర్మ తదాచరేత్,

ఇచ్చట ఉత్తరవస్తి కుపయోగింపబడు స్నేహపరిమాణమును 'స్నేహస్య ప్రసృతం చాత్ర' (సు. చి. అ. 32) అను సుశ్రుతవాక్యము ననుసరించి ప్రసృత(రెండుపలముల) పరిమితము ఉత్తమమాత్రయని గ్రహించునది. మరియు వాగ్భటాచార్యులు మాత్రాంతార తమ్యము నిట్లు నిర్దేశించెను.—"ప్రకుంచో మధ్యమామాత్రా బాలానాం శుక్తిరేవచ" (అ. హృ. సూ. అ. ౧౯) అని చెప్పిరి. స్త్రీల కుత్తరవస్తియందు ప్రకుంచము (ఒక పలము) మధ్యమస్నేహమాత్ర యనియు, బాలురకు శుక్తిపరిమాణము (అర్ధపలము) మధ్యప్రమాణమనియు నర్థము. (ఇంత దనుక వస్తిమర్మగతవ్యాధిచికిత్సితము చెప్ప బడినది.)

### శిరోమర్మగతరోగములు. అందు శంఖకమను శిరోరోగ లక్షణము, దానిచికిత్స.

మూ॥ అతశ్శిరోవికారాణాం కశ్చిద్భేదః ప్రవక్ష్యతే. 22
రక్తపిత్తాఽనిలాః దుష్టాః శఙ్ఖదేశే విమూర్ఛితాః,
తీవ్ర రుగ్దాహరాగం హి శోఫం కుర్వన్తి దారుణమ్. 2౮
స శిరో విషవద్వేగీ నిరుధ్యాశు గళం తథా,
త్రిరాత్రాజ్జీవితం హన్తి శఙ్ఖకో నామ నామతః. 2౯
పరం త్ర్యహాజ్జీవతి చేత్ ప్రత్యాఖ్యాయాచరేత్ క్రియాం,
శిరోవిరేకసేకాది సర్వం వీసర్పనుచ్ఛ యత్. ౩౦

వ్యా. శిరోమర్మమునకు సంబంధించి త్రిమర్మీయచికిత్సితమున జెప్పబడని కొన్ని వ్యాధులభేదములు ఈక్రింద చెప్పబడును—రక్తపిత్తవాతములు మూడును వానికారణ ములచే ప్రకోపము నొంది శంఖప్రదేశములయందు (కణతలయందు) కలిసి మిక్కిలి తీవ్రమైన నొప్పియు మంటయు కల్గి యెఱ్ఱనైనవాపును కల్గించును. ఇయ్యది మిక్కిలి క్రూరమై విషమును బోలె మిక్కిలివేగముతో శిరస్సున వ్యాపించి కంఠమును అడ్డగించి, మూడురాత్రులలో ప్రాణమును హింసించును. ఇయ్యది శంఖకమను క్రూరమైనరోగము. మూడురాత్రులకుపైని రోగి జీవించియున్నచో కుదురునది కష్టమనిచెప్పి చికిత్స చేయ వలెను. ఈవ్యాధియందు శిరోవిరేచనంబును, సేకము (స్నానము) మున్నగుచికిత్సలు చేయదగును. మరియు విసర్పహరము లగుచికిత్సలన్నియు నీవ్యాధియందు చేయందగును. (ఈవ్యాధి కల్గినవెంటనే కుదురుట కష్టమని చెప్పి అప్పుడే శిరోవిరేకాది చికిత్సావిధా నము నాచరించవలెనని "ప్రత్యాఖ్యాయాచరేత్ క్రియాం" అని సూచింపబడినది.)

## అర్ధావభేదకనిదానము, లక్షణము.

మూ. రూక్షాఽత్యధ్యశనాత్ పూర్వవాతాఽవశ్యాయమైథునైః,
(రూక్షాశనాదధ్యశనాత్ ప్రాగ్వాతస్య చ సేవనాత్)
వేగసన్ధారణాయాసవ్యాయామైః కుపితోఽనిలః. ౨౧
కేవలః సకఫోవార్ధం గృహీత్వా శిరసస్తతః,
మన్యాభ్రూశఙ్ఖకర్ణాఽక్షిలలాటార్ధేఽతివేదనామ్. ౨౨
శస్త్రాఽరణినిభాం కుర్యాత్ తీవ్రాం సోఽర్ధాఽవభేదకః,
నయనం వాఽథవా శ్రోత్రం అతివృద్ధో వినాశయేత్. ౨౩

వ్యా. రూక్షమైనయాహారమును భుజించుట, అధికముగ భుజించుట, భుజించిన వెంటనే మరల భుజించుట, తూర్పునుండి వీచుగాలిని సేవించుట, మంచులో నుండుట, అధికముగ స్త్రీసంభోగము చేయుట, మలమూత్రాదులు వెడలనున్నపుడు వానిని వెడలనీయక నిరోధించుట, శరీరమున కాయాసమును కల్గించు పనులజేయుట, కుస్తీ మున్నగు దేహపరిశ్రమమును చేయుట, ఈకారణములచే వాతము ప్రకోపము నొంది కేవలవాతమైనను, కఫముతో కూడినదైనను శిరస్సుయొక్క అర్ధభాగమున వ్యాపించి, మన్య (మెడకు ఇరుప్రక్కలనుండు రెండు ధమనులు) ల యొక్కయు కనుబొమలయొక్కయు చెవులయొక్కయు కన్నులయొక్కయు నుదుటియొక్కయు సగభాగమున (వాతము వ్యాపించిన అర్ధభాగమున) కత్తితో ఛేదించిన విధముగను అరణి (అగ్నిని మథించుటకు సాధనమైన దారువిశేషము) మథించినవిధముగను మిక్కిలి తీవ్రమైనబాధ గల్గించును. ఇయ్యది అర్ధావభేదకమని యన్వర్థకముగ జెప్పబడును. ఈవ్యాధి మిక్కిలి వృద్ధి నొందినయెడ వ్యాధి వ్యాపించినభాగమునందలి కన్నునైనను చెవినైనను చెరచును. (ఆయింద్రియమును చెడగొట్టునని భావము.)

మన్యాస్వరూపము సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"తత్ర కణ్ఠనాడీముభయతః చతస్రో ధమన్యః ద్వేనీలే ద్వేచమన్యే వ్యత్యాసేన" (సు. శా. అ. ౬) కంఠమునకిరుప్రక్కల వ్యాపించియుండు ధమనులు రెండును మన్యలని చెప్పబడును. (ఇయ్యవి నాలుగంగుళముల ప్రమాణము కల్గిన సిరామర్మములలో చేరినవి)

## అర్ధావభేదక శిరోరోగ చికిత్స.

మూ. చతుస్స్నేహోత్తమా మాత్రా శిరఃకాయవిరేచనం,
నాడీస్వేదో ఘృతం జీర్ణం వస్తికర్మాఽనువాసనమ్. ౨౪

ఉపనాహః శిరోవస్తిః దహనం చాత్ర శస్యతే,
ప్రతిశ్యాయే శిరోరోగే యచ్చోద్దిష్టం చికిత్సితమ్. ౧౫

వ్యా. పైజెప్పిన అర్ధావభేదకవ్యాధియందు నెయ్యి, నూనె, వస (మాంససారము), మజ్జ (ఎముకలలోపల నుండుక్రొవ్వు), అను నీనాల్గుస్నేహములను ఉత్తమమాత్రను (ఒక యహోరాత్రమునకు జీర్ణమగునంత పరిమాణము) ఉపయోగించవలెను. (త్రాగించవలెను.) మరియు శిరోవిరేచనమైన నస్యకర్మ, కాయవిరేచనము, నాడీస్వేదము,పదిసంవత్సరములు ప్రాతబడిననెయ్యి, నిరూహ, అనువాసనవస్తికర్మలు, ఉపనాహము (కట్టుకట్టుట), శిరోవస్తి, దాహకర్మ, (అగ్నిచే రకు వేయుట), ఈచికిత్సలన్నియు చాలప్రశస్తములుగ నుండును. మరియు ప్రతిశ్యాయమునకును శిరోరోగమునందును చెప్పబడిన చికిత్స యంతయు నీవ్యాధియందు చేయనగును. (ఇచ్చట చతుస్స్నేహమన—"సర్పిస్తైలం వసా మజ్జా స్నేహోప్యుక్త శ్చతుర్విధః" అని చెప్పబడిన నాల్గుస్నేహములని యెరుంగునది. వానియుత్తమమాత్ర యొకయహోరాత్రమునకు జీర్ణమగునంతపరిమితము.)

మరియు శిరోవిరేచననస్యములు క్రిందచెప్పబడును. నాడీస్వేదము స్థలాంతరమున స్వేదాధ్యాయమున నిర్దేశింపబడినది. ఉపనాహము "తైలభృష్టై రగుర్వాద్యైః...... మాంసైశ్చ శస్యతే" (చ. చి. అ. ౨౬ శ్లో. ౧౫౯) అని చెప్పబడినది. శిరోవస్తి శాలాక్యమున నిట్లు చెప్పబడినది:—"ఆశిరోవ్యాయతం చర్మ కృత్వాఽష్టాఙ్గులముచ్ఛ్రితం, తేనావేష్ట్య శిరోఽధస్తాత్ మాషకల్కేన లేపయేత్, నిశ్చలంవ్యోపవిష్టస్య తైలైః కోష్ణైః ప్రపూరయేత్, ధారయే దారుజశ్శాన్త్యై యామం యామార్ధమేవ వా, శిరోవస్తిర్జయత్యేషః శిరోరోగం మరుద్భవమ్" తలకు చుట్టివచ్చునంత నిడివియు ఎనిమిది యంగుళములమాత్రము పొడుగు (ఎత్తు)ను కలచర్మపట్టమును శిరస్సుకు క్రిందిభాగమున తలచుట్టివచ్చునట్లు చుట్టి యది కదలకుండునట్లు మినపపిండి పూసి బంధించి, త్రిఫలముల కల్కమునుచేర్చి సిద్ధముచేయబడిన తైలముచే సుఖోష్ణముగనుండునట్లు వస్తిపైభాగమున శిరస్సుపై నిండించి యొకజాముకాలమైనను ఒకటిన్నరజాముకాలమైనను నొప్పి శాంతి నొందువరకుంచునది. ఇయ్యది శిరోవస్తివిధి. దీనివలన వాతముచే సంభవించిన శిరోరోగము శమించునని యర్థము. దహనమన—"శిరోరోగాఽధిమన్థప్రభృతిషు భ్రూలలాటశంఖప్రదేశేషు దహేత్" (సు. సూ. అ. ౧౨)అని సుశ్రుతమున చెప్పినప్రకారము నుదుటను కణతలయందును రెల్లుకాడలు మున్నగువానిచే రకువేయవలెను. ఈ దాహవిధి త్రిమర్మీయచికిత్సితమున "పురాణసర్పిషః పానైః తీక్ష్ణై ర్వస్తిభిరేవ చ, కఫా

నిలోత్థితే దాహః” (చ. చి. అ. ౨౬ శ్లో. ౧౮౧) అని నిర్దేశింపబడినది. ఇదిగాక ప్రతిశ్యాయమునందును శిరోరోగమునందును త్రిమర్మీయమున జెప్పబడినవస్యము మున్నగు చికిత్సలన్నియు సమయోచితముగ నాచరింపదగునని “ప్రతిశ్యాయే శిరోరోగే యచ్చోద్దిష్టం చికిత్సితం’ అనువాక్యముచే నుపదేశింపబడినది.

## సూర్యావర్తలక్షణము.

మూ. సన్ధారణాదజీర్ణాద్యైః మస్తిష్కం రక్తమారుతౌ,
దుష్టౌ దూషయతస్తచ్చ దుష్టం తాభ్యాం విమూర్ఛితమ్. ౮౬
సూర్యోదయేఽంశుసన్తాపాత్ ద్రవం విష్యన్దతే శనైః,
తతో దినే శిరశ్శూలం దినవృద్ధ్యా వివర్ధతే. ౮౭
దినక్షయే తతస్స్యానే మస్తిష్కే సంప్రశామ్యతి,
సూర్యావర్తస్సః

వ్యా. మలమూత్రాదివేగముల నిరోధించుటచేతను, అజీర్ణము మున్నగు కారణములచేతను రక్తంబును వాతంబును ప్రకోపము నొంది మస్తిష్కమును (శిరస్సున బుద్ధికి స్థానమైన మెదడును) చెరచును. దుష్టమైన యామస్తిష్కము దుష్టములైన రక్తవాతములతోకూడి సూర్యోదయకాలమున సూర్యకిరణములతాపముచే కరిగి ద్రవరూపమై స్రవించును. సూర్యుడు వృద్ధినొందుకొలది మెలమెల్లగ కరగుచు తలయందు శూలముతో గ్రుమ్మినవిధముగ నొప్పిని కల్గించును. అయ్యది సూర్యునితోకూడ నప్పటప్పటికి క్రమముగ వృద్ధి నొంది, ప్రొద్దువ్రాలి సూర్యరశ్మి తగ్గుచున్నపుడు బాధయు క్రమముగ తగ్గుచుండును. అస్తమయమగుసరికి మస్తిష్కము గడ్డగట్టును. అప్పటికి బాధయు నిశ్శేషముగ నివర్తించును. ఇయ్యది సూర్యావర్తమను శిరోవ్యాధి. (ఈవ్యాధి స్వభావముచే సూర్యసంతాపముచేతమాత్రము వృద్ధినొందును, కాని నిప్పునెగచే వృద్ధినొందుటలేదు.)

“తంత్రాంతరమున “సూర్యోదయం వా ప్రతిమన్దమన్దమక్షిభ్రువం, రుక్ సముపైతిగాఢం.........సర్వాత్మకం కష్టతమం వికారం” అని చెప్పబడినది. ఈవాక్యముచే నీవ్యాధి కంటికిని కనుబొమ్మకును సంబంధించియుండుననియు, సన్నిపాతమున జనించుననియు తెలిసెడి. కావున నియ్యది మిక్కిలిక్రూరమై బాధ తీవ్రముగ నుండును. త్రిదోషములలో వాతము ప్రబలమై రక్తముతోకూడి యుండునని యాతంత్రకారుడు “రక్తమారుతౌ” అని ప్రధానముగ నిర్దేశించెనని తోచెడి.

### సూర్యావర్తచికిత్స.

మూ. తత్ర స్యాత్ సర్పిరౌత్తరభక్తికమ్. ౭౮
శిరఃకాయవిరేకౌ చ మూర్ధ్ని త్రిస్నేహధారణం,
జాఙ్గలైరుపనాహశ్చ ఘృతక్షీరైశ్చ సేచనమ్ (నావనమ్). ౭౯
బర్హితిత్తిరిలావాదిశృతక్షీరోత్థితం ఘృతం,
స్యాన్నావనం జీవనీయక్షీరాష్టగుణసాధితమ్. ౮౦

వ్యా. పైజెప్పిన సూర్యావర్తమునందు భోజనానంతరము నేతిని త్రాగవలెను. నస్యప్రయోగముచే శిరోవిరేచనమును, విధ్యుక్తప్రకారము కాయవిరేచనమును చేయించవలెను. శిరస్సున (శిరోవస్తి విధిప్రకారము) త్రిస్నేహములను (నెయ్యి నూనె మాంసస్నేహము) ధరింపజేయవలెను. జాంగలజంతువుల మాంసముచే నుపనాహము చేయవలెను. ఘృతముచేతను ఆవుపాలచేతను శిరస్సును తడుపవలెను. నెమలి తీతువు పిట్ట లావుకపిట్ట మున్నగు విష్కిరజాతిపక్షులమాంసమును చేర్చి పాలను కాచి, దానినుండి తీయబడిన నేతితో జీవనీయగణద్రవ్యముల కల్కమును ఘృతమునకు ఎనిమిదింతలు పాలను చేర్చి పక్వముచేయబడిన ఘృతముచే నస్యము చేయవలెను.

### అనంతవాతలక్షణము, చికిత్స.

మూ. (ఉపవాసాఽతిశోకాఽతిరూక్షశీతాఽల్పభోజనైః,)
దుష్టా దోషాః త్రయో మన్యాః పశ్చాద్ఘాటాసు వేదనాం,
తీవ్రాం కుర్వన్తి సా చాక్షి (నాసాక్షి) భ్రూశఙ్ఖేష్వవతిష్ఠతే.
స్పన్దనం గణ్డపార్శ్వస్య నేత్రరోగం హనుగ్రహం,
సోఽనన్తవాతః తం హన్యాత్ సిరోఽర్కావర్తనాశనైః. ౮౧

వ్యా. ఉపవాసము, అధికమైనశోకము, మిక్కిలి రూక్షంబును మిక్కిలి శీతంబునైనపదార్థముల భుజించుట,మిక్కిలి స్వల్పముగ భుజించుట, ఈకారణములచేత వాతాది దోషములుమూడును ప్రకోపమునొంది మన్యయనుసిరలయందును మెడకు వెనుకప్రక్కనుండు సంధియందును మిక్కిలి తీవ్రమైనబాధను కల్గించును. అట్టిబాధ కండ్లను కనుబొమ్మలను కణతలయందును స్థిరముగ నిలచియుండును. ఈవ్యాధియందు చెక్కిళ్లకు ప్రక్కన అదరును, నేత్రరోగములును కల్గును. అంకిళులు కదలక పట్టినట్లుండును. ఇయ్యది అనంతవాతమను శిరోరోగము. (ఈవ్యాధికి తంత్రాంతరమున అన్యతో వాత

మని చెప్పెదరు.) ఈవ్యాధికి సిరావ్యధనంబును, సూర్యావర్తక శిరోవ్యాధిహరము లైన చికిత్సలును చేసిన శమించును. (సిరావ్యధనము శల్యతంత్రమున నెఱుంగునది.)

### శిరఃకంపవాతము, దానిచికిత్స.

మూ. వాతో రూక్షాదిభిః క్రుద్ధః శిరఃకమ్పముదీరయేత్,
తత్రాఽమృతాబలారాస్నామహాశ్వేతాఽశ్వగన్ధకైః. ౯౩
స్నేహస్వేదాది వాతఘ్నం శస్తం నస్యం చ తర్పణం,

వ్యా. వాతమును వృద్ధినొందించు రూక్షాదిపదార్థముల భుజించుటచేత వాతము మిక్కిలి ప్రకోపము నొంది శిరఃకంపమును (తలవణకును) కల్గించును. దీనియందు తిప్ప తీగె, చిట్టాముట్టి, సన్నరాష్ట్రము, నేలగుమ్మడి, పెన్నేరుగెడ్డ అను నీయౌషధములతో సిద్ధముచేయబడిన స్నేహస్వేదాదులను వాతహరములైన యౌషధంబులును, నస్యవిధియు, తర్పణంబును మిక్కిలి ప్రశస్తములు.

### నస్యకర్మగుణములు. శిరోరోగములయందు దానిప్రాశస్త్యము.

మూ. నస్తః కర్మ చ కుర్వీత శిరోరోగేషు శాస్త్రవిత్. ౯౪
ద్వారం హి శిరసో నాసా తేన తత్ వ్యాప్య హన్తి తాన్,

వ్యా. శిరోరోగము లన్నిటియందును శాస్త్రవేత్తయగువైద్యుడు నస్యకర్మమును విధ్యుక్తప్రకారము చేయవలెను. శిరస్సుకు నాసారంధ్రములు ద్వారమైయుండును; కావున నాసారంధ్రములనుండి ప్రయోగింపబడిన చూర్ణము తైలము మున్నగునౌషధములు, నాసారంధ్రములనుండి శిరస్సున వ్యాపించి శిరోగతము లైనవ్యాధుల నన్నింటిని మొదలంట నివర్తించును. (కావున అన్నిశిరోరోగములయందును నస్యకర్మ చేయుట చాల ప్రశస్తమని భావము.) ఇచ్చట నస్యకర్మను శాస్త్రపరిజ్ఞానంబును అనుభవంబును కలవాడే చేయవలెనుకాని సాధారణముగ నుండువైద్యులు చేసినచో వ్యత్యస్తమై యపాయమును కల్గించునని తెలియుటకై 'శాస్త్రవిత్' అని చెప్పబడెను.

### నస్యకర్మభేదములు.

మూ. నావనం చాఽవపీడశ్చ ధ్మాపనం ధూమ ఏవ చ. ౯౫
ప్రతిమర్శశ్చ విజ్ఞేయం నస్తః కర్మ తు పఞ్చధా,

వ్యా. (పంచకర్మలో క్రమప్రాప్తమైన నస్యకర్మను వివరింపనుద్దేశించి శిరోరోగప్రస్తావవశమున నస్యకర్మభేదములు వానివిధానములు ఈక్రింద వివరింపబడును.)

(నస్యమన "నస్యం తత్కథ్యతే ధీరైః నాసా గ్రాహ్యం యదౌషధమ్" అనువచనముచే నాసారంధ్రములమూలమున ప్రయోగింపబడు నౌషధము నస్య మనబడును.) అయ్యది నావనము, అవపీడనము, ధ్మాపనము, ధూమము, ప్రతిమర్శము నని నస్యకర్మము ఐదువిధములుగ నుండును.

## నావన-అవపీడ-ధ్మాపననస్యభేదములు.

మూ. శోధనం శమనం చైవ ద్వివిధం నావనం స్మృతమ్. ౯౬
శోధనస్తమ్భనశ్చ స్యాత్ అవపీడో ద్విధా మతః,
చూర్ణస్యాఽఽధ్మాపనం తద్ధి దేహస్రోతోవిశోధనమ్. ౯౭

వ్యా. పైజెప్పిన నస్యములలో నావనమనునది శోధనము, (శిరస్సునందలి దోషముల వెడలించునది.) శమనము నని రెండువిధములు. అవపీడమనునది శోధనమనియు, స్తంభనమనియు రెండువిధములు. శరీరమునందలి స్రోతస్సులదోషములను వెడలించి శుద్ధముగజేయు తీక్ష్ణౌషధచూర్ణమును నాసారంధ్రములనుండి యూది ప్రయోగించునది ధ్మాపన మనబడును.

అవపీడనస్యస్వరూపము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"కల్కీకృతాదౌషధాద్యః పీడితో నిస్సృతేరసః, సోఽవపీడస్సముద్దిష్టః తీక్ష్ణద్రవ్యసముద్భవః" తీక్ష్ణద్రవ్యములను నూరి కల్కము జేసి దానినుండి పిండబడినరసముచే చేయబడిననస్యము అవపీడమని యర్థము. మరియు "కల్కైరవపీడస్తు తీక్ష్ణైర్మూర్ధవిరేచనః, ధ్మానం విరేచనశ్చూర్ణః యుఞ్జ్యాత్తం ముఖవాయునా" అని వాగ్భటులు చెప్పిరి. శిరోవిరేచనమునకై తీక్ష్ణద్రవ్యములను కల్కముజేసి యాకల్కద్రవమును నస్యముచేసిన, నయ్యది అవపీడమనియు, అట్టిద్రవ్యముల చూర్ణమును నాసారంధ్రములనుండి ప్రవేశింపజేసిన నయ్యది ధ్మాపనశిరోవిరేచననస్యమనియు నర్థము. ("అవపీడ్య కల్కాదీని దీయతే యత్ర తదవపీడనం" అనువ్యుత్పత్తిచే నన్వర్థముగ నవపీడమని చెప్పబడును.)

## ధూమపాన-ప్రతిమర్శ-నస్యములకృత్యవిశేషములు.

మూ. విజ్ఞేయస్త్రివిధో ధూమః ప్రాగుక్తశ్శమనాదికః,
ప్రతిమర్శో భవేత్ స్నేహః నిర్దోష ఉభయార్థకృత్. ౯౮
ఏవం తద్రేచనం కర్మ తర్పణం శమనం త్రిధా,

వ్యా. ధూమరూపమైన నస్యము తస్యాశితీయమున జెప్పబడిన స్నైహికరేచనశమనరూపభేదములచే మూడువిధములు. ప్రతిమర్శమనునది స్నేహరూపమైననస్యము.

ఇయ్యది స్నేహనవిరేచనరూపము లైనరెండుకృత్యముల జేయును. ఇయ్యది నిర్దుష్టమై సాధారణముగ నుపయోగింప దగి యుండును. (దీనిలక్షణము "నస్తః స్నేహాఙ్గులి" అని అధ్యాయాంతమున జెప్పబడును.)

పైజెప్పబడిన నావనాదినస్యము లన్నిటికిని జేరి రేచనము (దోషములను బైటవెడలించునది), తర్పణము (ఇంద్రియములకు తృప్తినొందించునది), శమనము (దోషముల వెడలింపకయే రోగముల శమింపజేయునది) నని కృత్యములం మూడువిధములుగ నుండును. (ఇచ్చట స్తంభనము శమనమునందును, స్నేహనము తర్పణమునందును అంతర్భూతము లగును కావున వేరుగ జెప్పబడలేదు. మరియు ధూమపానప్రకరణమున చెప్పబడిన శమన-స్నేహన-రేచనములు మూడుభేదములును "విజ్ఞేయస్త్రివిధో ధూమః ప్రాగుక్తశ్శమనాదిభిః" అనుచోట గ్రహింపబడును. ఇచ్చట నస్యప్రకరణ మగుటం జేసి, అట్టిత్రివిధ ధూమ భేదములుమూడును నాసారంధ్రములనుండి యాకర్షింపబడునదియని గ్రహింపవలెనుగాని పానరూపమని గ్రహింపందగదు. స్నేహభేదము ప్రాయోగికమని యెరుంగునది. ధూమపానము నోటితో పీలువబడునది యొకటి. అయ్యది రోగభిషగ్జితీయమున జెప్పబడినది. నాసారంధ్రములచే పీలువబడునది వేరొకటి. ఇది నస్యరూప మిచ్చట చెప్పినది.)

శిరోవిరేచననస్యము నుపయోగింపదగినవ్యాధులు.

మూ. స్తమ్భసుప్తిగురుత్వాద్యాః శ్లైష్మికా యే శిరోగదాః. ౯౯
శిరోవిరేచనం తేషు నస్తః కర్మ ప్రశస్యతే,

వ్యా. స్తంభము (నరములు మున్నగునవి స్తంభించియుండుట), సుప్తి (స్పర్శజ్ఞానము లేకుండుట), గురుత్వము (బరువుగ నుండుట), ఇవి మున్నగుశ్లేష్మప్రకోపమున సంభవించుశిరోరోగము లన్నిటియందును శిరోవిరేచన నస్యకర్మను చేయుట ప్రశస్తము.

సంతర్పణనస్యము నుపయోగింపదగినవ్యాధులు.

మూ. యే చ వాతాత్మకా రోగాః శిరఃకమ్పార్దితాదయః. ౧౦౦
శిరసస్తర్పణం తేషు నస్తః కర్మ ప్రశస్యతే,

వ్యా. శిరఃకంపము, అర్దితవాతము మున్నగు (శిరస్సునకు సంబంధించిన) వాతరోగములయందు శిరస్సును తృప్తినొందించు తర్పణరూపనస్యకర్మను జేయుట ప్రశస్తము.

శమన-స్థాపన-ధూమపాననస్యముల నుపయోగింపదగినవ్యాధులు.

మూ. రక్తపిత్తాదిరోగేషు శమనం నస్యమిష్యతే. ౧౦౧

ఘ్రాపనం ధూమపానం చ తథా యోగ్యేషు శస్యతే,
(దోషాదికం సమీక్ష్యైవం భిషక్ సమ్యక్ప్ర కారయేత్)

వ్యా. రక్తపిత్తము మున్నగురోగములయందు శమనరూపమైన నస్యము నుపయోగింపనగును. మరియు ఘ్రాపన-ధూమపానరూపములైన నస్యములను వానివానికి యోగ్యములైన రోగములయం దుపయోగించునది. పైజెప్పబడిన నస్యకర్మలను దోషదూష్యాదుల చక్కగ గమనించి తత్తదనుగుణముగ విధ్యుక్తప్రకారము చేయదగును.

ఇచ్చట ఘ్రాపననస్యగుణము చెప్పునపుడు "దేహస్రోతోవిశోధనమ్" అని చెప్పియుండుటచేత దేహమునందలి స్రోతస్సులదోషములను శోధనము చేయవలసినప్పుడు ఘ్రాపననస్య ముపయోగింపవలెనని యెరుంగునది. మరియు మాత్రాశితీయమున "ప్రయోగపానే తస్యాష్టౌ కాలాః" అని యుపక్రమించి చెప్పబడిన ధూమపానవిషయముల నెరుంగునది.

## విరేచననస్యౌషధకల్పనము.

మూ. ఫలాది భేషజం ప్రోక్తం శిరసో యద్విరేచనమ్. ౧౦౨
తచ్చూర్ణం కల్పయేత్ తేన పచేత్ స్నేహం విరేచనం,
యదుక్తం మధురస్కన్ధే భేషజం తేన తర్పణమ్ ౧౦౩
సాధయిత్వా భిషక్ స్నేహం నస్తః కుర్యాత్ విధానవిత్,

వ్యా. రోగభిషగ్జితీయమున ఫలము, పత్రము, మూలము, కందము (గెడ్డలు), పుష్పము, నిర్యాసము (జిగురు). త్వక్కు (పట్ట) అను అవయవభేదములచే నేడువిధములైన ద్రవ్యములు శిరోవిరేచనకై నిర్దేశింపబడినవి. ఆట్టిద్రవ్యములను చూర్ణముగకల్పించి ప్రథమననస్యమున కుపయోగింపనగును. ఆద్రవ్యములనే చేర్చి స్నేహమును పక్వముచేసి శిరోవిరేచననస్యమున కుపయోగించునది. మరియు నాయధ్యాయముననే నిర్దేశింపబడిన మధురస్కంధద్రవ్యములను చేర్చి స్నేహమును పక్వముచేసి తర్పణరూపనస్యమున కుపయోగించునది. వైద్యవిధానమును చక్కగ నెరింగినవైద్యుడు పైజెప్పినప్రకారము విరేచన-తర్పణౌషధముల గల్పించి నస్యకర్మ జేయునది.

ఇచ్చట రోగభిషగ్జితీయమున—"శిరోవిరేచనద్రవ్యాణి పునః అపామార్గపిప్పలీమరిచ...కణ్టకారికాత్వచశ్చేతి; శిరోవిరేచనం సప్తవిధం ఫలపత్రమూలకందపుష్పనిర్యాసత్వగాశ్రయభేదాత్...యథాయోగవిహితాని శిరోవిరేచనార్థం ఉపదిశ్యన్తే ఇతి" (చ. వి. అ. ౮. సూ. ౧౫౧) అని నిర్దేశించిన శిరోవిరేచనద్రవ్యములను, చూర్ణ

స్నేహరూపముగ గల్పించి, శిరోవిరేచనమున కుపయోగించునది. మరియు—"జీవకర్ష భకౌ జీవనీవీరా...ఇతి మధురస్కన్ధాః" (చ. వి. అ. ౮. సూ. ౧౭౯) అని నిర్దేశింప బడిన మధురస్కంధద్రవ్యములను తర్పణనస్యమునకు గ్రహించునది.

## అవపీడనస్యమును ప్రయోగించువిధానము.

మూ. ప్రాక్ సూర్యే మధ్యసూర్యే వా ప్రాక్కృతాఽవశ్యకస్య చ.
ఉత్తానస్య శయానస్య శయనే స్వాస్తృతే సుఖం,
ప్రలమ్బశిరసః కిఞ్చిత్ కిఞ్చిత్పాదోన్నతస్య చ.　　　　౧౦౫
దద్యాన్నాసాపుటే స్నేహం తర్పణం బుద్ధిమాన్ భిషక్,
అనవాక్ శిరసో నస్యం న శిరః ప్రతిపద్యతే.　　　　౧౦౬
అత్యవాక్ శిరసో నస్యం మస్తులుఙ్గేఽవతిష్ఠతి,
అతఏవం శయానస్య శుద్ధ్యర్థం స్వేదయేచ్ఛిరః.　　　　౧౦౭
సంస్వేద్య నాసామున్నమ్య వామేనాఽఙ్గుష్ఠపర్వణా,
హస్తేన దక్షిణేనాథ కుర్యాదుభయతస్సమమ్.　　　　౧౦౮
ప్రణాడ్యా పిచునా వాపి నస్తః స్నేహం యథావిధి,
కృతే చ స్వేదయేత్ భూయః ఆకర్షేచ్ఛ పునః పునః.　　　　౧౦౯
తం స్నేహం శ్లేష్మణా సాకం (సార్థం) తథా(యథా)
స్నేహో న తిష్ఠతి,

వ్యా. సూర్యుడు తూర్పుదెస నుండగనైనను, మధ్యమున నుండగనైనను తర్పణ నస్యమును ప్రయోగించవలెను. నస్యకర్మ చేసికొన దలచినవాడు ఉదయకాలమున నావశ్యకములైన మలవిసర్జన దంతధావనాదికృత్యముల నెరవేర్చి మంచిపడకతో కూడినశయ్యపై సుఖముగ వెలికిల బరుండి, కొంచెముగ తలను వెనుప్రక్కకు వెలికిల వాంచి పాదములను కొంచెముగ నున్నతముగనిడికొని యుండవలెను. అత్తెరంగు పరుండియున్నవానికి నాసా రంధ్రములయందు తర్పణస్నేహమును ప్రయోగింపవలెను. తలను వంచకుండగ ప్రయోగింపబడిన నస్యము శిరస్సున చేరనేరదు. తలను అధికముగ వంచినయెడ నస్యము మస్తులుంగమున మెదడున ప్రవేశించును; కావున పైజెప్పినరీతిగ తలను కొంచెముగవంచి కాళ్లను కొంచెము ఎత్తుగ నిడికొని పరుండువానికి నస్యమును ప్రయోగింపవలెను. మరియు శిరస్సు శుద్ధమగుటకై తొలుత స్వేదనముచేసి యెడమచేతిబొటనవ్రేలితో ముక్కును

పైకెత్తి పట్టుకొని కుడిచేతితో నస్యోపయోగమునకు నేర్పరచికొనిన గొట్టము చేతబట్టి దానినుండియైనను ప్రత్తితోనైనను రెండునాసారంధ్రములయందును స్నేహము సమముగ నుండునట్లు విధ్యుక్తప్రకారము ప్రయోగింపవలెను. ఇత్తెరంగున స్నేహనస్యమును ప్రయోగించి వెంటనే మరల శిరస్సుకు స్వేదనమును చేయవలెను. మరియు నాసారంధ్రముల విడువబడినస్నేహము ముక్కులోని శ్లేష్మముతోకూడి నిలువకుండునట్లు మాటి మాటికిని స్నేహమును వెలికి దీయవలెను.

ఇచ్చట గ్రీష్మకాలమునం దుదయమునను, శీతకాలమున మధ్యాహ్నమునందును నస్యకర్మ చేయవలెనని "ప్రాక్ సూర్యే, మధ్యసూర్యే వా" అనువాక్యమునకు వ్యవస్థ నెరుంగునది. మరియు నస్యమును ప్రయోగించునపుడు ఒకముక్కురంధ్రమును మూసి వేరొకరంధ్రమున నస్యమును ప్రయోగించి, పిదప రెండవరంధ్రమున ప్రయోగింపవలెను. ఈవిషయమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి—'నాసాపుటం పిధాయైకం పర్యాయేణ నిషేచయేత్'' (అ. హృ. సూ. అ. ౨౦)

ధూమనస్యోపయోగప్రయోగము.

మూ. స్వేదేనోత్క్లేశితః శ్లేష్మా నస్తః కర్మణ్యుపస్థితః. ౧౧౦
భూయః స్నేహస్య శైత్యేన శిరసి స్త్యాయతే తతః,
శ్రోత్రమన్యాగలాద్యేషు వికారాయ స కల్పయేత్. ౧౧౧
తతో నస్తః కృతే ధూమం పిబేత్కఫవినాశనం,
హితాన్నభుక్ నివాతోష్ణసేవీ స్యాన్నియతేన్ద్రియః. ౧౧౨

వ్యా. పైజెప్పినరీతిగ స్వేదకర్మనుచేసినచో దానివలన స్వస్థానమునుండి చలనము నొందిన శ్లేష్మము మరల ప్రయోగింపబడు స్నేహముయొక్క శైత్యముచే శిరస్సున గడ్డకట్టి చెవులు మెడకు వెనుకప్రక్క నరములు కంఠము మున్నగుస్థలములయందు ఆయారోగముల గల్గించును; కావున నస్యకర్మను చేసినవెంటనే కఫమును హరించునట్టి ధూమమును నాసారంధ్రములనుండి పీల్చవలెను. పిమ్మట ఆయాదోషముల కనుకూలముగ హితమైన యాహారమును భుజించి, గాలిలేని స్థలమునసుండి ఇంద్రియముల స్వవశమున నుంచుకొని యుష్ణపదార్థములను సేవించుచు నుష్ణోపచారముల జేసికొనుచు నుండవలెను.

ప్రధ్మాపననస్యము నుపయోగించుక్రమము.

మూ. విధిరేషోఽవపీడస్య కార్యః, ప్రధ్మాపనస్య తు. ౧౧౩
తత్ షడఙ్గులయా నాడ్యా ధమేచ్చూర్ణం ముఖేన తు,

విరిక్తశిరసం తూర్ణం పాయయిత్వామ్బు భోజయేత్. ౧౧౪
లఘు త్రిష్వవిరుద్ధం చ నివాతస్థమతన్ద్రితః,

వ్యా. పైజెప్పినవిధిప్రకారము అవపీడనస్యమును చేయవలెను. ప్రధ్మాపన నస్యమును చేయవలసినప్పుడు శిరోవిరేచనచూర్ణమును సిద్ధముచేసి ఆరంగుళములనిడుపును (రెండుకొనలయందును రంధ్రమును) కల్గియుండు గొట్టమున యాచూర్ణము నునిచి రోగి నాసారంధ్రమున గొట్టముకొన నిడి యా గొట్టమునుండి చూర్ణము నాసారంధ్రములో పూర్తిగ ప్రవేశించునట్లు నోటితో నూదవలెను. ఈనస్యప్రయోగముచే శిరస్సునందలి దోషమంతయు బైటవెడలినపిదప నీళ్లుత్రాగించి వాత-పిత్త-కఫములమూటికిని విరుద్ధముగాక తేలికయైన యాహారమును రోగికి భుజింపజేసి గాలిలేనిప్రదేశమున మిక్కిలి జాగరూకుడై యుండవలెను.

ప్రధమననస్యవిధిని వాగ్భటు లిట్లుచెప్పిరి:—"యుఞ్జ్యాత్ తం ముఖవాయునా, షడఙ్గులద్విముఖయా నాడ్యా భేషజగర్భయా, స హి భూరితరం దోషం చూర్ణత్వాదప కర్షతి" (అ. హృ. సూ. అ. ౨౦. శ్లో. ౮). చూర్ణరూపమైన యీనస్యము ప్రబలమైన దోషమునుకూడ వెడలించునని యావాక్యముచే దెలిసెడి.

{ నస్యకర్మయందు మిథ్యాహారాదులచే గల్గువ్యాపత్తులు. అందు విరేకనస్యముచే గల్గువ్యాపత్తులు, వానిచికిత్సయు. }

మూ. విరేకశుద్ధో దోషస్య కోపనం యస్య సేవతే. ౧౧౫
సదోషో విచరం స్తత్ర కరోతి స్వాన్ గదాన్ బహూన్,
యథాస్వం విహితాం తేషు క్రియాం కుర్యాద్విచక్షణః. ౧౧౬
అకాలకృతజాతానాం రోగాణామనురూపతః,

వ్యా. పైజెప్పినరీతిగ శిరోవిరేచననస్యప్రయోగముచే శిరస్సు శుద్ధమైనవాడు ఏదోషమును ప్రకోపింపజేయు నాహారవిహారాదుల సేవించునో, దానివలన నాదోషము ప్రకుపితమై శిరంబున సంచరించుచు తనకు సంబంధించిన నానావిధరోగముల గల్గించును. అట్టియెడ నిదానలక్షణాదులచే నాయావ్యాధులగమనించి వానివానికి విధింపబడిన చికిత్సల జేయునది. మరియు నస్యకర్మకు విధించినకాలమునగాక ఇతరకాలమున నస్యవిధి చేయుటచే సంభవించినరోగములకు వానివానికిం దగినచికిత్సావిధి నాచరింపవలెను.

నస్యప్రయోగకాలమును వాగ్భటు లిట్లునిర్దేశించిరి:—"అథ నస్యం ప్రయోజయేత్, ప్రాతః శ్లేష్మణి, మధ్యాహ్నే పిత్తే, సాయం నిశోశ్చ తే, స్వస్థవృత్తే తు పూర్వాహ్ణే

శరత్కాలవసన్తయోః, శీతే మధ్యన్దినే గ్రీష్మే సాయం వర్షాసు సాऽऽతపే"
(అ. హృ. సూ. అ. ౨౦. శ్లో. ౧౩, ౧౪) దీనియర్థము స్పష్టము.)

### స్నేహననస్యమిథ్యాయోగమున గల్గువ్యాపత్తులు వానిచికిత్సయు.

మూ. అజీర్ణే భోజనే భుక్తే తోయే పీతేऽథ దుర్దినే. ౧౧౭
(అజీర్ణే భుక్తభక్తే చ తోయపీతేऽథ దుర్దినే)
ప్రతిశ్యాయే నవే స్నానే (తే) స్నేహపానేऽనువాసనే,
నావనం స్నేహనం రోగాన్ కరోతి శ్లైష్మికాన్ బహూన్. ౧౧౮
తత్ర శ్లేష్మహరః సర్వః తీక్ష్ణోష్ణాదిః విధిర్హితః,

వ్యా. అజీర్ణముగ నున్నపుడును, భుజించినప్పుడును, నీరు త్రావినపుడును, మేఘము లావరించి యున్నపుడును, ప్రతిశ్యాయము జనించిన వెంబడియైనను, స్నానముచేసిన వెంబడియైనను, స్నేహపానము జేసినప్పుడును, అనువాసనవస్తి జేసినప్పుడును, (ఈసమయములయందు) స్నేహనమైన నావనమును (నస్యమును) చేసినయెడ శ్లేష్మసంబంధములైన యనేకరోగములు కల్గును. అట్టియెడ శ్లేష్మహరములైన తీక్ష్ణము ఉష్ణమునైన గుణాదులు కలఔషధ-అన్న-పాన-విహారాదులన్నియు, చికిత్సావిధానంబున హితముగ నుండును.

### రూక్షనస్యముచే గల్గువ్యాపత్తులు, వానిచికిత్సయు.

మూ. క్షామే విరేచితే గర్భే వ్యాయామాऽభిహతే తృషి. ౧౧౯
వాతో రూక్షేణ నస్యేన క్రుద్ధః స్వాన్ జనయేద్గదాన్,
తత్ర వాతహరస్సర్వః విధిః స్నేహనబృంహణః. ౧౨౦
స్వేదాదిః స్యాత్, ఘృతం క్షీరం గర్భిణ్యాస్తు విశేషతః,

వ్యా. శరీరము కృశించినపుడును, విరేచనౌషధమును సేవించి విరేచనములైనపుడును, గర్భవతియైనపుడును, వ్యాయామముచే నభిఘాతము జెందినపుడును, దప్పిగొని యున్నపుడును, రూక్షమైన నస్యము నుపయోగించినయెడ, దానంజేసి వాతము మిక్కిలి ప్రకోపము నొంది తనకు సంబంధించిన యనేకరోగముల గల్గించును. అట్టియెడ వాతహరములగు స్వేదాదిచికిత్సావిధానమంతయు, బృంహణచికిత్సయు హితముగ నుండును అందును గర్భిణీస్త్రీకి (వాతమును జయించుటకును గర్భమునకు పుష్టికల్గుటకు) ఘృతమును క్షీరమును విశేషముగ నుపయోగింపం దగును.

## నస్యప్రయోగవ్యత్యయముచేగల్గిన తిమిరరోగమునకు చికిత్స.

మూ. జ్వరశోకాఽతి (ది) తప్తానాం తిమిరం మద్యపస్య తు. ౧౨౧
రూక్షైః శీతాఽఞ్జనై ర్లేపైః పుటపాకైశ్చ సాధయేత్,

వ్యా. జ్వరముచేతను, శోకము, భయము మున్నగువానిచేతను మిక్కిలి తాపము నొంది పీడింపబడినవారికిని, మద్యపానము చేసినవారికిని స్నేహననస్యము నుపయోగించిన యెడ తిమిరమను నేత్రరోగము సంభవించును. రూక్షములగు స్రోతోంజనములచేతను, రూక్షములైన లేపములచేతను, పుటపాకములచేతను చికిత్స చేయవలెను. (ఇచ్చట శీతాంజనమన స్రోతోంజనమని చెప్పబడును. లేక తిక్తద్రవ్యములచే సిద్ధముచేయబడినది శీతాంజనమని కొందరు చెప్పెదరు.)

## ప్రతిమర్శనస్యోపయోగక్రమము, దానగల్గుగుణము.

మూ స్నేహనం శోధనం చైవ ద్వివిధం నావనం మతమ్. ౧౨౨
(నస్య ముచ్యతే)
ప్రతిమర్శస్తు నస్యార్థం కరోతి న చ దోషవాన్,
న_స్తః స్నేహాఽఙ్గులిం దద్యాత్ ప్రాత ర్నిశి చ సర్వదా. ౧౨౩
నచోచ్ఛిఙ్ఘే దరోగాణాం ప్రతిమర్శస్స దార్ఢ్యవాన్,

వ్యా. పైజెప్పబడిన నస్యకర్మలన్నియు స్నేహనము (స్నిగ్ధముగ జేయునది) శోధనము (శిరమునందలిదోషముల వెడలించునది)నని రెండువిధములు. (నస్యములకు స్నేహన-శోధనములు కృత్యములని భావము.) అట్టి స్నేహన-శోధనరూపకృత్యముల రెండిటిని ప్రతిమర్శనస్యము చేయును. తక్కిననస్యములవలె నస్యకర్మవ్యత్యయముచే నగుదోషములను (వ్యాపత్తులను) కల్గింపనేరదు. (కావున నియ్యది కాలనియమములేక సర్వకాలమునందు నుపయోగింప దగియుండును. ఈవిషయమే "ప్రతిమర్శో భవేత్ స్నేహః నిర్దోష ఉభయార్థకృత్" (శ్లో. ౯౦) అనుశ్లోకముచే నిర్దేశింపబడినది.)

మరియు—స్నేహమునందు తనవ్రేలిని ముంచి యావ్రేలిని నాసారంధ్రములలో నిడి శిరస్సును వంచి యుంచుకొనినయెడ నావ్రేలినుండి స్నేహబిందువు నాసారంధ్రముల నుండి తనంతనే లోనికిప్రవేశించును. పైకిపీల్చవలసిన యవసరము లేదు. ఈనస్యమును ఋతుభేదములేక రాత్రియందైనను పగటియందైనను సర్వకాలములందును ఉపయోగింప దగియుండును. మరియు రోగము స్వస్థతనుండువారు ప్రతిదినమును నుపయోగించినయెడ (శిరస్సునకును కపాలమునకును) దార్ఢ్యమును కల్గించును.

ఇచ్చుట వ్రేలిని తైలమునముంచి నాసారంధ్రముననిడిన యెంత తైలము లోనికి ప్రవేశించునో, అయ్యది ప్రతిమర్శనస్యతైల ప్రమాణమని పైగ్రంథముచే ప్రమాణము చెప్పబడినది. ఈవిషయమే తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది.—"ఈషదుచ్ఛ్విఙ్ఘనాత్ స్నేహః యావాద్వక్త్రం ప్రపద్యతే, నస్తో నిషిక్తం తం విద్యాత్ ప్రతిమర్శః ప్రమాణతః" మరియు నట్టిస్నేహమును పీల్చినచో కంఠమున ప్రవేశించును. కావున నోట ప్రవేశించకుండునంత పరిమితిగ నుండవలెనని తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:— "ప్రతిమర్శం తు న పిబేత్ కణ్ఠాస్రావ భయాన్నరః, యావత్ స్నేహో ప్రజేదాస్యం తత్ ప్రమాణం చ తస్య తు."

—అధ్యాయోక్తవిషయసంగ్రహము.—

తత్ర శ్లోకాః—

మూ. త్రీణి యస్మాత్ ప్రధానాని మర్మాణ్యభిహతేషు చ. ౧౨౪
తేషు లిఙ్గం చికిత్సాం చ రోగభేదాశ్చ సౌషధాః,
విధిరుత్తరవస్తేశ్చ నస్తః కర్మవిధిస్తథా,
సవ్యాపత్ భేషజం సిద్ధౌ మర్మాఖ్యాయాం ప్రకీర్తితమ్. ౧౨౫

వ్యా. శరీరమునందలి నూటయేడుమర్మములలో హృదయ-వస్తి-శిరోమర్మముల మూటికిమాత్రము ప్రాధాన్యకారణంబును, అట్టిమూడుమర్మల కభిఘాతముకల్గినచో గల్గు లక్షణంబులును, వాని వేరువేరుచికిత్సలును, వానిరోగభేదంబులును, ఉత్తరవస్తివిధానంబును, నస్యకర్మవిధానంబును, నస్యకర్మచే కల్గువ్యాపత్తులును, వానిచికిత్సితములును, ఈవిషయములన్నియు నీత్రిమర్మీయసిద్ధి యనునధ్యాయమున చెప్పబడినవి.

—అధ్యాయసమాప్తి.—

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే త్రిమర్మీయసిద్ధిర్నామ
నవమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగుచరక సంహిత యనునాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున త్రిమర్మీయ సిద్ధియను తొమ్మిదియవయధ్యాయము సమాప్తము.



## దశమాధ్యాయము

అవతరణిక:—త్రిమర్మీయసిద్ధియందు అనేకరోగములు నిర్దేశింపబడినవి. అట్టి రోగములకు అన్నిటికిని హితమైన వస్తివిధానమును దెలుపుటకై వస్తిసిద్ధి యనునీయధ్యాయము చెప్పబడును:—

### అధ్యాయోపక్రమము.

మూ. అథాతో వస్తిసిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. త్రిమర్మీయసిద్ధిని చెప్పినపిదప సిద్ధవస్తుల దెలుపునట్టి వస్తిసిద్ధిని (సిద్ధవస్తి విధానమును దెలుపునట్టి యధ్యాయమును) భగవానుడగు నాత్రేయు డుపదేశించినదాని కన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పెదనని యర్థము.

### అధ్యాయవిషయనిర్దేశము.

మూ. సిద్ధానాం వస్తీనాం శస్తానాం తేషు తేషు రోగేషు,
శృణ్వగ్నివేశ! గదతః సిద్ధిం సిద్ధిప్రదాం భిషజామ్. 3

వ్యా. ప్రసిద్ధమయిన ఫలము గల్గినవియు, ఆయారోగములయందు నుపయోగించుటకు మిక్కిలి ప్రశస్తములైనవియు నగువస్తులయొక్క చికిత్సచేయువారికి చికిత్సా సాఫల్యరూపమయిన సిద్ధిని గల్గించు గ్రంథమును చెప్పెదను వినుము.

### బలాద్యనుగుణముగ నౌషధముల విభజించి చేయబడువస్తిగుణోత్తరము.

మూ. బలదోషకాలరోగప్రకృతీః ప్రవిభజ్య యోజితాః సమ్యక్,
సైవ సైస్స్వరౌషధవర్గైః స్వాన్స్వాన్ రోగాన్నియచ్ఛన్తి. ౪

వ్యా. శరీరాదిబలమును, వాతాదిదోషములను, గ్రీష్మాదికాలమును, బాల్యాది వయోభేదమును, ఆయారోగభేదములను, వాతాదిప్రకృతిభేదమును, చక్కగ గమనించి విభజించుకొని, ఆయాదోషాదుల ననుసరించి, ఈక్రింద నిర్దేశింపబడు ఔషధవర్గములచే గల్పింపబడినవస్తులు ఆయాయౌషధములచే సాధ్యములగు నాయారోగములను అతి శీఘ్రముగ నివర్తింపజేయును. (ఇచ్చట చెప్పబడినవిషయములే మూడవయధ్యాయమున "సమీక్ష్య దోషౌషధ......సిద్ధిమన్తి (సి. అ. 3. శ్లో. ౬) అని నిర్దేశింపబడినది ప్రకరణవశముచే మరల ననువదింపబడియె.)

వస్తిప్రాశస్త్యము.

మూ. కర్మాన్యద్వస్తిసమం న విద్యతే శీఘ్రసుఖవిశోధిత్వాత్,
ఆశ్వపతర్పణతర్పణయోగాచ్చ నిరత్యయత్వాచ్చ. ౫

వ్యా. వస్తికర్మ అతిశీఘ్రముగను, సుఖముగను దోషముల శోధించును. వస్తిప్రయోగముచేత సంతర్పణంబైనను అపతర్పణంబైనను అతిశీఘ్రముగ గల్గును. దీని ప్రయోగమువలనయేవిధమయిన బాధయు సంభవింపదు. కావున చికిత్సావిధానములలో వస్తికర్మతో సమానమైనది వేరొండు లేదు.

విరేచనాదిశోధనములకన్న వస్తికి శ్రేష్ఠత్వము.

మూ. సత్యపి దోషహరత్వే కటుతీక్ష్ణోష్ణాదిభేషజాదానాత్,
దుఃఖోద్గారోత్క్లేశాహృద్యత్వకోష్ఠరుజా విరేకే స్యుః. ౬
అవిరేచ్యౌ శిశువృద్ధౌ తావప్రాప్తప్రహీణధాతుబలౌ,
ఆస్థాపనమేవ తయోః సర్వార్థకృదుత్తమం కర్మ. ౭
బలవర్ణహర్షమార్దవగాత్రస్నేహాన్ నృణాం దదాత్యాశు,

వ్యా. వమనవిరేచనకర్మలుకూడ దోషముల శోధించి వెడలించునవియే; ఐనను అట్టివమనవిరేచనముల కుపయోగింపబడు నౌషధములు కటు-తీక్ష్ణ-ఉష్ణాదిభేదముల గల్గియుండుటవలన దానిని త్రాగినప్పుడు మిక్కిలి కష్టముగను, త్రేనుపులును, దోషోత్క్లేశంబును, మనస్సు కింపులేకుండుటయు, కోష్ఠమునందు నొప్పి మున్నగుబాధయు సంభవించును. మరియు శిశువులకు బలము పూర్తిగ బాల్యమున గల్గక ధాతువులు పూర్తిగాక యుండును. వృద్ధులకు బలము హీనమై ధాతువులు క్షీణించి యుండును. కావున శిశువులకును, వృద్ధులకును,సంశోధనమునకు వమనవిరేచనముల నొకప్పుడును నుపయోగింపంజనదు. వారికి ఆస్థాపనవస్తినే అవశ్యముగ నుపయోగింపవలసి యుండును. కావున వస్తికర్మవలన పైజెప్పిన కష్టములులేకయు, బాలవృద్ధులకు అవశ్య ముపయోగార్హంబును అగుటవలన వమనవిరేచనములకన్న సంశోధనమునకు వస్తికర్మయే మిగుల ప్రశస్తమై సకలప్రయోజనముల గల్గించునది యగుచు. మరియు శరీరబలము, వర్ణము, సంతోషము, మృదుత్వము, శరీరమునకు స్నిగ్ధత్వము అనునీగుణములను నతిశీఘ్రముగ గల్గింపనోపును. కావున శోధనమునకై వమనవిరేచనములకన్న వస్తికర్మ ఉత్తమోత్తమంబని భావము.

వస్తిభేదములు, వానియుపయోగమునకు జేరినవిశేషవిధి.

మూ. అనువాసనం నిరూహశ్చోత్తరవస్తిశ్చ స త్రివిధః. ౮

శాఖావాతార్తానాం సంకుచితస్తబ్ధభగ్నరుగ్ణానామ్(సన్ధీనామ్),
విట్సఙ్గాధ్మానారుచిపరికర్తిరుగాదిషు చ శస్తః ౯
ఉష్ణార్తానాం శీతాన్ శీతార్తానాం తథా సుఖోష్ణాంశ్చ,
తద్యోగ్యౌషధయుక్తాన్ వస్తీన్ సన్తర్క్య వినియుఞ్జ్యాత్. ౧౦

వ్యా. అనువాసనము, నిరూహము, ఉత్తరవస్తియు నని వస్తికర్మ మూడువిధములు, హస్తపాదాదిశాఖలయందు బాధకలవారికిని, సంధులు సంకోచము నొందినవైనను, స్తంభించినవైనను, విరిగినవైనను, యున్నవారికిని, మలబంధము, కడుపుబ్బరము, అరోచకము, పరికర్తిక మున్నగురోగములు గలవారికిని వస్తికర్మ చేయుట మిగుల ప్రశస్తము. మరియు ఉష్ణప్రధానమయిన వ్యాధులు కలవారికి గుణవీర్యములచే శీతలములగు వస్తువులచేతను, శీతసంబంధమయిన వ్యాధులు గలవారికి సుఖోష్ణమయిన ద్రవ్యములచే కల్పింపబడినవస్తులను గల్పించి నుపయోగింపనగును. వస్తులకు నియమింపబడిన యౌషధవర్గముల వానిగుణాదుల చక్కగ నూహించి పైజెప్పినరీతిగ తత్తద్గుణానుసారమగు ఔషధయోగముల గల్పించి వస్తికర్మల చేయనగును.

### బృంహణీయవస్తికిని శోధనీయవస్తికిని అనర్హులు.

మూ. వస్తీన్న బృంహణీయాన్దద్యాద్వ్యాధిషు విశోధనీయేషు,
మేదస్వినో విశోధ్యాః యేఽపి నరాః కుష్ఠమేహార్తాః. ౧౧
న క్షీణక్షతదుర్బలమూర్ఛితకృశశుష్కదేహానాం,
యుఞ్జ్యాద్విశోధనీయాన్ దోషనిబద్ధాయుషో యే చ. ౧౨

వ్యా. మేదోరోగము, కుష్ఠరోగము, ప్రమేహము అనునీరోగములు గలవారు శోధనమునకు నర్హులుగా నుందురు. అట్టిశోధనార్హులకును, శోధనచికిత్స చేయవలసిన యితరరోగములయందును, బృంహణౌషధములచే సిద్ధముచేయబడిన వస్తుల నుపయోగింపజనదు. మరియు క్షీణించినధాతువులు గలవారును, అభిఘాతము నొందినవారును, బలహీనులును, మూర్ఛనొందినవారును, శరీరము కృశించినవారును, శరీరమునందలి ద్రవధాతువు శోషించినవారును, బృంహణమునకు నర్హులుగా నుందురు. కావున అట్టివారికి శోధనీయములైన వస్తుల నుపయోగింపదగదు. మరియు రాజయక్ష్మము, శోష మున్నగు వ్యాధులు గలవారికి జీవితము మలరూపమయినదోషమును ఆధారముగ జేసికొని యుండును. కావున అట్టివారికిని శోధనీయవస్తుల నుపయోగింపకూడదు. (ఈవిషయమునే చికిత్సా

స్థానమున నిట్లుపదేశించిరి:—"శోషీ ముఞ్చతి గాత్రాణి పురీషస్రంసనాదపి, అబల పేక్షిణీమాత్రాం కిం పునః యో విరిచ్యతే" (చి. అ. ౮. శ్లో 32.)

కార్యవిశేషములబట్టి వస్తిసంస్కారవిశేషవిధి.

మూ. వాజీకరణేఽసృక్పిత్తయోశ్చ మధుఘృతపయోయుక్తాః,
శస్తాః; సతైలమూత్రారనాలలవణాశ్చ కఫవాతే. ౧౩
(లవణాః కఫావృతే వాతే)
యుఞ్జ్యాత్ ద్రవ్యాణి వస్తిష్వమ్లం మూత్రం పయః సురాం
క్వాథాన్, అవిరోధాద్ధాతూనాం రసయోనిత్వాచ్చ జలముష్ణమ్

వ్యా. వాజీకరణమునకును, రక్తపిత్తములకు సంబంధించినవ్యాధులయందును ప్రయోగింపబడువస్తులయందు తేనెను, ఘృతమును, విశేషముగ చేర్చి ప్రయోగించుట చాల ప్రశస్తము. మరియు వాతము కఫముతోకూడి యావరింపబడియున్నపుడు తైలమును గోమూత్రమును, ఆరనాళమను కాంజికమును, లవణమునుకూడ చేర్చి సిద్ధముచేయబడిన వస్తుల నుపయోగింపవలయును.

మరియు కాంజికము మొదలగు నమ్లద్రవ్యములను, గోమూత్రమును, ఆవు పాలను, సురామద్యమును, క్వాథములను వీనిని రసాదిధాతువులకు విరోధములేకుండునట్లు తగినవానిని వస్తులయందు చేర్పదగును. మరియు జలము మధురాదిషడ్రసములకును ప్రధానకారణమగును, కావున అట్టిజలమును వెచ్చజేసి వస్త్యౌషధములయందు జేర్చుట యుక్తముగా నుండును. (ఇచ్చట వస్తిసూత్రీయమున "కల్కైః గుడక్షౌద్రయుతైః... యుక్త్యామధుసైన్ధవం చ" (సి. అ. 3. శ్లో. ౧౫) అనువాక్యముచే క్షౌద్రమునచేర్చుట విధింపబడినను ఈవస్తియందు తేనెను అధికముగ జేర్చవలెనని యుద్దేశించి "మధుఘృత పయోయుక్తాః" అని మరల విధింపబడినది. మరియు జలము, రసములకు ప్రధానకారణ మగుటంజేసి క్వాథకల్కాదులతోకూడ చేర్చినచో రసముల నన్నిటిని నొకటిగచేర్చి పోషించునని యుద్దేశముతో "రసయోనిత్వాచ్చ జలముష్ణం" అని నిర్దేశింపబడినది. లేక చూర్ణరూపమయిన వస్తిప్రయోగమునందు ఉష్ణజలమును చేర్చవలయునని అపూర్వవిధి యగును. చూర్ణవస్తి తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది. "రాస్నావచా బిల్వశతాహ్వయైలా పూతీక కృష్ణాఫలదారు కృష్ణైః ససైన్ధవామ్లోష్ణ జలస్సతైలైః శూలఘ్న ఇష్టః ఖలు చూర్ణవస్తిః" ఇవి మున్నగు చూర్ణవస్తిప్రయోగములయందు ఉష్ణజలమును చేర్చవలయునని తంత్రకారుని యుద్దేశము.)

వస్త్యావాపద్రవ్యములు, వానియుపయోగనిర్ణయము.

మూ. సురదారుశతాహ్వైలాకుష్ఠమధుకపిప్పలీమధుస్నేహాః,
ఊర్ధ్వానులోమభాగాః ససర్షపాః శర్కరాలవణమ్. ౧౫
ఆవాపాః వస్తీనాం, అతః ప్రయోజ్యాని యేషు యాని స్యుః,
యుక్తాని, సహ కషాయైః తాన్యుత్తరతః ప్రవక్ష్యామి. ౧౬

వ్యా. దేవదారువు, సదాపవిత్తులు, ఏలకులు, చెంగల్వకోష్ఠు, అతిమధురము, పిప్పళ్లు, తేనె, స్నేహద్రవ్యము, (నెయ్యి మున్నగునవి); వమనవిరేచనద్రవ్యముల భాగములు, ఆవాలు, చక్కెర, సైంధవలవణము ఇవి వస్తులకన్నిటికిని ప్రక్షేపద్రవ్యములు. కావున దీనిలో యేకషాయయోగములయందు యేద్రవ్యములుచేర్చిన యుక్తముగ నుండునో దానిని చక్కగ గమనించి ఆయాకషాయములతోచేర్చి వస్తుల ప్రయోగింపవలయును. అట్టికషాయవస్తియోగములు వరుసగ నీక్రింద జెప్పబడును.

వ్యాధిబలాద్యనుసారముగ తీక్ష్ణ-మృదు ఆవాపద్రవ్యముల జేర్పునియమము.

మూ. చిరజాతకఠినబలేషు వ్యాధిషు తీక్ష్ణాః విపర్యయేచ మృదవః,
సప్రతివాపకషాయాః యోజ్యాస్త్వనువాసననిరూహాః. ౧౭

వ్యా. చాలకాలముగ జనించి యనువర్తించియుండు వ్యాధులయందును, (స్వభావముచేతనే) మిక్కిలిబలిష్ఠము లగువ్యాధులయందును, తీక్ష్ణమైనద్రవ్యములతో సిద్ధమైన కషాయములను, పైజెప్పబడిన యావాపద్రవ్యములతో తీక్ష్ణములగుద్రవ్యముల నావాపముగనుచేర్చి సిద్ధముచేయబడిన అనువాసనవస్తులను, నిరూహవస్తులను ప్రయోగింపదగును. మరియు పైజెప్పినదానికి వ్యత్యయముగ తత్కాలమునజనించిన నూతనవ్యాధులయందును, స్వభావముచేతనే యల్పబలములైన వ్యాధులయందును, మృదుకషాయములతో మృదుగుణము కలయావాపద్రవ్యముల జేర్చి సిద్ధముచేయబడిన అనువాసన-నిరూహవస్తులను ప్రయోగింపవలెను.

ఇచ్చట అనువాసనమునందు స్నేహసాధనమునకై కషాయము చెప్పబడినది. ఆవాపద్రవ్యప్రక్షేపముకూడ ననువాసనవస్తియందు విధింపబడినది. "పిప్పలీం మధుకం కుష్ఠం శతాహ్వాం మధుకం వచాం, యోజయేన్మాత్రయా పిష్ట్వా ఆవాపమనువాసనే" అని స్థలాంతరమున అనువాసనమున కుపయోగింపదగిన ఆవాపద్రవ్యములు చెప్పబడినవి.

—◎ సిద్ధవస్తులు ముప్పదియేడు. వానియుపయోగవిధి. ◎—

మూ. అర్ధశ్లోకైరతస్సిద్ధాన్ నానావ్యాధిషు సర్వశః,
వస్తీన్ వీర్యసమైర్భాగైః యథార్హాలోడనాన్ శృణు. ౧౮

వ్యా. ఈయధ్యాయప్రారంభమునుండి యింతదనుక వస్తిసామాన్యమునకు సంబంధించిన కొన్నివిషయము లుపదేశింపబడినవి. పిమ్మట "సిద్ధానాం వస్తీనాం" అని ప్రతిజ్ఞచే నిర్దేశింపబడిన సిద్ధవస్తులు వరుసగ నీక్రింద నర్ధశ్లోకముచే నొక్కొక వస్తియోగము వంతున చెప్పబడును. ఈవస్తియోగముల జెప్పబడినవస్తువులను ఒకదానితో నొకటి ప్రతిహతముగాక సమవీర్యములుగ నుండునట్లు వానివానికి యుక్తములైన భాగములగల్పించి సముచితముగ కలిపి, ఆయావ్యాధులయందును దోషములయందు నుపయోగింపం దగును. మరియు నొక్కొకవ్యాధియందును దోషమునందును అనేకయోగముల నుపయోగించునట్లు చెప్పబడును. (ఇచ్చట వ్యాధిశబ్దముచే నాయావ్యాధులును, వానికి కారణములైన వాతాదిదోషములను గ్రహింపబడును. వ్యాధులకును వాతాదిదోషములకును దగినవస్తియోగముల చెప్పెదనని యర్థము.)

—◎ { (1-3) ముప్పదియేడువస్తులవివరణము. అందు వాతమున ప్రశస్తములగు మూడువస్తియోగములు. } ◎—

మూ. బిల్వోఽగ్నిమన్థః శ్యోనాకః కాశ్మర్యః పాటలి స్తథా,
శాలిపర్ణీ పృశ్నిపర్ణీ బృహత్యౌ వర్ధమానకః. ౧౯
యవాః కులుత్థాః కోలాని స్థిరా చేతి త్రయోఽనిలే,
శస్యన్తే సచతుస్స్నేహాః పిశితస్య రసాన్వితాః. ౨౦

వ్యా. మారేడువేరు, కూరనెల్లివేరు, కోలపొన్న, నేలగుమ్మడివేరు, పాదిరివేరు, (ఈయైదునుచేరి యొకవర్గము); ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడువేరు, ములకవేరు, ఆముదపువేరు, (ఈయైదునుచేరి రెండవవర్గము), యవలు, ఉలవలు, రేగుగింజలు, ముయ్యాకుపొన్న, (ఈనాల్గునుచేరి మూడవవర్గము); ఈమూడువర్గముల ద్రవ్యములను వేరువేరుగజేర్చి మూడుకషాయములను విధ్యుక్తప్రకారము సిద్ధముచేసి, అందు (ఘృతము, తైలము, వస, మజ్జ యను) నాల్గుస్నేహములను మాంసరసమునుకూడ చేర్చి మూడువస్తియోగములుగ కల్పించునది. ఈవస్తులుమూడును వాతమునం దుపయోగించుటకు చాల ప్రశస్తములు. (ఇచ్చట చెప్పబడు వస్తియోగము లన్నిటియందును పైజెప్పబడిన ఆవాపాదిద్రవ్యముల తత్తదనుగుణముగ జేర్చి సంస్కరించవలెనని యెరుంగునది.) ఇచ్చట

మూడుఅర్థశ్లోకములచే మూడువస్తిద్రవ్యవర్గములు నిర్దేశింపబడినవి. నాల్గవఅర్థశ్లోకముచే దానివివరము తెలుపబడినది. ఈవిషయమును క్రిందియోగములయందును గమనించునది.

(4-6) పిత్తవికారముల ప్రశస్తములగుమూడువస్తులు.

మూ. నలవఞ్జులవానీర శతపత్రాణి శైవలం,
మఞ్జిష్ఠాసారిబాఽనన్తా పయస్యా మధుయష్టికా. ౨౧
చన్దనం పద్మకోశీరం తుఙ్గం, తే పైత్తికే త్రయః,
సశర్కరాక్షౌద్రఘృతాః సక్షీరాః వస్తయో హితాః. ౨౨

వ్యా. కిక్కిసగడ్డి, ప్రబ్బలి, నీరుప్రబ్బలి, తామరపువ్వు, పాచితీగెలు, (ఇవి యైదునుచేరి యొకగణము); మంజిష్ఠి, సుగంధపాలవేరు, నల్లసుగంధపాల, కాకోళి, అతిమధురము, (ఇవియైదునుచేరి రెండవగణము); చందనము, పద్మకము, పట్టివేరు, సురపొన్న, (ఈనాల్గునుచేరి మూడవవర్గము); ఈమూడువర్గద్రవ్యములను వేరువేరుగ క్వాథముచేసి, అందు చక్కెరను తేనెను నేతిని ఆవుపాలను కలిపి, మూడువస్తులుగ సిద్ధముచేసి పిత్తరోగములయందు వస్తిప్రయోగము చేయునది.

(7-9) కఫరోగములకు ప్రశస్తములయిన మూడువస్తియోగములు.

మూ. అర్కస్తథైవ చాలర్కః ఏకాష్ఠీలా పునర్నవా,
హారిద్రా త్రిఫలా ముస్తం పీతదారుకుటన్నటమ్. ౨౩
పిప్పల్యశ్చిత్రకశ్చేతి త్రయస్తే శ్లేష్మరోగిషు,
సక్షారక్షౌద్రగోమూత్రాః నాతిస్నేహాన్వితా హితాః. ౨౪

వ్యా. జిల్లేడువేరు, తెల్లజిల్లేడువేరు, విషబొద్ది, గలిజేరు, (ఈనాల్గునుచేరి యొకవర్గము); పసుపు, త్రిఫలములు, తుంగగెడ్డలు, దేవదారు, కైవర్తముస్తలు, (ఈయైదును చేరి రెండవవర్గము); పిప్పళ్లు, చిత్రమూలము, (ఈరెండునుచేరి యొకవర్గము) ఈమూడు వర్గముల ద్రవ్యములను పైజెప్పినరీతిగ వేరువేరుగ క్వాథములుచేసి, అందు యవక్షారము, తేనె, గోమూత్రము, కొంచెముగస్నేహము, వీనినిచేర్చి సిద్ధముచేయబడిన మూడువస్తులును శ్లేష్మముచే కల్గినరోగములయందు చాల హితకరములుగ నుండును.

త్రిదోషముల నుద్దేశించి వేరువేరుగ పైచెప్పబడిన వస్తులుతొమ్మిదియు సంగ్రహమున "త్రికాస్తయోనిలాదీనాం" అని నిర్దేశింపబడును.

—◎ 10-13 పక్వాశయశోధనములగు నాల్గువస్తియోగములు. ◎—

మూ. ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకవత్సకాః,
శ్యామా చ త్రిఫలా చైవ స్థిరా దన్తీ ద్రవన్త్యపి. ౨౫
ప్రకీర్యా చోదకీర్యా చ నీలినీ క్షీరిణీ తథా,
సప్తలా శఙ్ఖినీ లోధ్రం ఫలం కంపిల్లకస్య చ. ౨౬
చత్వారో మూత్రసిద్ధాస్తే పక్వాశయవిశోధనాః,
వ్యస్తైరపి సమస్తైశ్చ చతుర్యోగా ఉదాహృతాః. ౨౭

వ్యా. మ్రంగకాయ, దేవదాళి, చేమసార, తెల్లపువ్వులఆవడ, కొడిశపాల విత్తులు, (ఈయైదునుచేరి యొకయోగము); నల్లతెగడ, త్రిఫలములు, ముయ్యాకుపొన్న, దంతివేళ్లు, పెద్దదంతివేళ్లు, (ఈయైదునుచేరి రెండవయోగము); కానుగ, పెద్దకానుగ, నీలి, పాలగుమ్మడి, (ఈనాల్గునుచేరి మూడవయోగము); సంబరేణు, శంఖపుష్పి, లొద్దుగు, కంపిల్లకఫలము, (ఈనాల్గునుచేరి నాల్గవయోగము); పైన నిర్దేశింపబడిన నాల్గు గణముల ద్రవ్యములను వేరువేరుగ గోమూత్రమునగలిపి నాల్గుయోగములుగ కల్పించి నుపయోగించినచో పక్వాశయమునందలి దోషములను శోధించును. మరియు పైజెప్ప బడిన నాల్గుగణముల ద్రవ్యములను వ్యస్తముగనైనను, సమస్తముగనైనను జేర్చి నాల్గు వస్తియోగములుగ గల్పింపనగును.

—◎ (14-17) వృష్య (శుక్ర-మాంసవృద్ధికర) వస్తియోగములు నాలుగు. ◎—

మూ. కాకోలీ క్షీరకాకోలీ ముద్గపర్ణీ శతావరీ,
విదారీ మధుయష్ట్యాహ్వా శృఙ్గాటకకశేరుకే. ౨౮
ఆత్మగుప్తా ఫలం మాషాః సగోధూమాయవాస్తథా,
(జలజా) జాఙ్గలానూపజం మాంసం ఇత్యేతే శుక్రమాంసదాః ౨౯

వ్యా. కాకోళి, క్షీరకాకోళి, అడవిపెసర, పిల్లిపీచర, (ఈనాల్గునుచేరి యొక గణము); నేలగుమ్మడి, అతిమధురము, పెద్దపల్లేరు, నమ్మదుంప, (ఈనాల్గునుచేరి రెండవ గణము); దూలగొండివిత్తులు, ఉద్దులు, గోధుమలు, యవలు, (ఈనాల్గునుచేరి మూడవ గణము); జలజంతువులమాంసము, జలప్రాంతమున నివసించుజంతువులమాంసము, (ఈ రెండునుచేరి నాల్గవగణము); ఈనాల్గుగణముల ద్రవ్యములను నాల్గువస్తియోగములుగ సిద్ధముచేసి నుపయోగించునది. ఈనాల్గువస్తియోగములును శుక్రమును మాంసమును వృద్ధిచేయుటకును, వృష్యమనకును చాలప్రశస్తములై యుండును.

(18, 21) సాంగ్రాహికవస్తియోగములు నాల్గు.

మూ. జీవన్తీ చాగ్నిమన్థశ్చ ధాతకీపుష్పవత్సకౌ,
ప్రగ్రహః ఖదిరః కుష్ఠం శమీపిణ్డీతకో యవాః. ౩౦
ప్రియఙ్గూ రక్తమూలీ చ తరుణీ స్వర్ణయూథికా,
వటాద్యాః కింశుకం లోధ్రమితి సాంగ్రాహికా మతాః. ౩౧

వ్యా. పాలతూర, తూరనెల్లి, ఆరెపువ్వు, కొడిసెపాలవిత్తులు, (ఈనాల్గును చేరి యొకవర్గము); ప్రగ్రహము (పిన్నరేల), చండ్ర, చెంగల్వకోష్ఠు, జమ్మిపట్ట, మ్రంగ కాయలు, యవలు, (ఈయారును చేరి రెండవవర్గము); ప్రేంకణము, మంజిష్ఠి, తరుణీ (చేమంతి), స్వర్ణయూథిక(అడవిమొల్ల), (ఈనాల్గును చేరి మూడవవర్గము); మఱ్ఱి మొదలగుక్షీరవృక్షములపట్ట, మోదుగపట్ట, లొద్దుగపట్ట, (ఇవియన్నియుచేరి నాల్గవవర్గము); ఈనాల్గువర్గములలో ఒక్కొక్కవర్గ ద్రవ్యములను చేర్చి యొక్కొక్కవస్తియోగముగ కల్పించి యుపయోగించునది. ఈనాలుగువస్తియోగములును సంగ్రాహకములుగ నుండును. (పాచనదీపనములచే ద్రవమును శోషింపజేయుశక్తి కలవి యని భావము.)

ఇచ్చట వటాదులన మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, కలజువ్వి యను క్షీరిపంచకమని యెరుంగునది. పైజెప్పబడిన పక్వాశయశోధనములు నాల్గును, వృష్యములు నాల్గును, సాంగ్రాహికములు నాల్గునుచేరి పండ్రెండు వస్తియోగములును "చతుష్కాశ్చాపరే త్రయః పక్వాశయవిశుద్ధ్యర్థం, వృష్యాః, సాంగ్రాహికస్తథా" అని విషయసంగ్రహమున నిర్దేశింపబడినది.

(22-23) పరిస్రావోపయోగవస్తియోగములురెండు.

మూ. పరిస్రావే శృతం క్షీరం సవృశ్చీరపునర్నవం,
ఆఖుపర్ణికయా వాపి తండులీయకయుక్తయా. ౩౨

వ్యా. ఎర్రగలిజేరు, తెల్లగలిజేరు, ఈరెంటిని క్షీరమునచేర్చి పక్వముచేసి సిద్ధముచేయబడిన వస్తియొకటి; ఎలుకచెవియాకు, చిర్రికూర, ఈరెంటిని ఆవుపాలతో చేర్చి కాచి సిద్ధముచేయబడినవస్తి రెండవది. ఈరెండువస్తులను పరిస్రావమనెడు వస్తివ్యాపత్తునం దుపయోగించుటకు చాలప్రశస్తము.

(24-25) దాహహరవస్తియోగములు రెండు.

మూ. (కోలకతక) కాలం కతకకాండేక్షుదర్భపోటగశేక్షుభిః,
దాహఘ్నః సఘృతక్షీరో ద్వితీయశ్చోత్పలాదిభిః. ౩౩

వ్యా. రేగుగింజలు, చిల్లగింజలు, తెల్లచెరకు, దర్భవేళ్లు, కిక్కిసగడ్డి అనునీద్రవ్యములచే సిద్ధముచేయబడిన వస్తియొకటి; తెల్లకలువలు, నల్లకలువలు మున్నగుజలమునందు జనించుపువ్వులచేర్చి సిద్ధముచేయబడినవస్తి రెండవది; ఈరెండువస్తియోగములయందును నేతిని ఆవుపాలను కూడ చేర్చి సిద్ధముచేసి నుపయోగించినచో దాహమును,(తాపమును), హరించును.

(26-27) పరికర్తోపయోగ్యవస్తియోగములు రెండు.

మూ. కర్బుదారాఢకీనీపవిదులైః క్షీరసాధితైః,
వస్తిః ప్రదేయో భిషజా శీతః సమధుశర్కరః. 3౪
పరికర్తే తథా వృన్తైః శ్రీపర్ణీకోవిదారజైః,
(దేయో వస్తిః సువైద్యైస్తు యథావత్ విదితక్రియైః). 3౫

వ్యా. దేవకాంచనము, కందులు, నెమ్మి, ప్రబ్బలి అను నీనాల్గును ఆవుపాలలో చేర్చి కాచి, అందు తేనెను, చక్కెరను కలిపి వస్తిని ప్రయోగించునది. టేకుమ్రాని యొక్కయు, దేవకాంచనముయొక్కయు తొడిమలను పాలలోకలిపి కాచి సిద్ధముచేయబడిన వస్తియందు తేనెను చక్కెరను కలిపి ప్రయోగించునది. ఈరెండువస్తులును పరికర్తమనెడు వస్తివ్యాపత్తునకు మిగులప్రశస్తములుగ నుండును. కావున నీవస్తులను వస్తి విధానమును చక్కగ తెలిసిన వైద్యవరులు విధ్యుక్తముగ నుపయోగింపదగును.

(28-29) ప్రవాహణోపయోగ్యవస్తియోగములు రెండు.

మూ. వస్తిః శాల్మలివృన్తానాం క్షీరసిద్ధో ఘృతాన్వితః,
హితః ప్రవాహణే తద్వద్వేష్టైః శాల్మలికస్య చ 3౬

వ్యా. బూరుగపువ్వులయొక్క తొడిమలను పాలలో చేర్చి కాచి, అందు ఆవునేతినిచేర్చి వస్తినుపయోగించునది. మరియు బూరుగబంకను ఆవుపాలలోచేర్చి కాచి ఘృతమునుచేర్చి పైజెప్పినరీతిగనే వస్తిని జేయనగును. ఈరెండువస్తులును ప్రవాహణమను వస్తివ్యాపత్తునం దుపయోగించుటకు చాల ప్రశస్తము.

(30-31) వస్త్యతియోగమున నుపయోగింపదగిన వస్తియోగములు రెండు.

మూ. అశ్వావరోహికాకాకనాసారాజకశేరుకైః,
సిద్ధాః క్షీరేఽతియోగే స్యుః క్షౌద్రాంజనఘృతైర్యుతాః. 3౭
న్యగ్రోధాద్యైశ్చతుర్భిశ్చ తేనైవ విధినాఽపరః,

వ్యా. పెన్నేరుగడ్డ, కాకిదొండ, భద్రముస్తలు అనునీనాల్గిటిని చేర్చి ఆవుపాలను పక్వము చేసి, అందు తేనెను, రసాంజనమును, నేతిని, చేర్చి సిద్ధముచేయబడిన వస్తి యొకటి. మర్రిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట, జువ్విపట్ట, ఈనాల్గిటినిచేర్చి పక్వముచేయబడిన యావుపాలయందు పైజెప్పినరీతిగ తేనె మున్నగువానినిచేర్చి సిద్ధము చేయబడిన వస్తి రెండవది. ఈరెండువస్తులును అతియోగమను వస్తివ్యాపత్తునం దుపయోగించుట మిక్కిలి ప్రశస్తము లగును.

ఇచ్చట పరిస్రావము మొదలుచేసి యైదువ్యాపత్తులకును నొక్కొక్కదానికి రెండేసి వస్తియోగములవంతున యేర్పడిన పదివస్తియోగములును "పరిస్రావే, తథా దాహే, పరికర్తే, ప్రవాహణే, సాఽతియోగే మతౌ ద్వౌ ద్వౌ" అని విషయసంగ్రహమున పరిగణనము చేయబడెను.

## (32-34) జీవాదానమను వస్తివ్యాపత్తున కుపయోగింపదగిన వస్తియోగములు మూడు.

మూ. బృహతీ క్షీరకాకోలీ పృశ్నిపర్ణీ శతావరీ. ౩౮
కాశ్మర్యబదరీమూర్వాః తథోశీర ప్రియఙ్గవః,
జీవాదానే శృతౌ క్షీరే ద్వౌ ఘృతాఞ్జనసంయుతౌ. ౩౯
వస్తీ ప్రదేయౌ భిషజా శీతౌ సమధుశర్కరౌ,
గోవ్యజామహిషీక్షీరైః జీవనీయయుతై స్తథా. ౪౦
శశైణదక్షమార్జారమహిషావ్యజశోణితైః,
సద్యస్కైః మృదిభిర్వస్తిః జీవాదానే ప్రశస్యతే. ౪౧

వ్యా. వాకుడు, క్షీరకాకోళి, కోలపొన్న, పిల్లిపీచర, (ఇవి చేరి యొకవర్గము); నేలగుమ్మడి, రేగు, చాగపట్ట, పట్టివేళ్లు, (ఇవినాల్గును చేరి రెండవవర్గము); ఈరెండువర్గములను వేరువేరుగ ఆవుపాలలోచేర్చి కాచి, అందు తేనెను చక్కెరనుచేర్చి, రెండుయోగములుగ గల్పించి, చల్లార్చి, జీవాదానమను (ప్రాణమున కాధారమైన రక్తమును వెడలించు) వస్తివ్యాపత్తునందు ప్రయోగించవలెను. మరియు-గోవు, మేకలు, గొఱియలు, ఎనుము అను నీజంతువులపాలతో జీవనీయగణద్రవ్యములజేర్చి పక్వముజేసి, అందు— కుందేలు, జింక, కోడి, పిల్లి, ఎనుబోతు, గొఱియలు, మేకలు అనునీజంతువులరక్తమును అప్పుడే క్రొత్తగతీసినదానిని కలిపి, అన్నిటి నొకటిగ కలియబెట్టి వస్తిని ప్రయోగింప

వలెను. ఈమూడువస్తులును జీవాదానమను వస్తివ్యాపత్తునందు మిక్కిలి ప్రశస్తములై యుండును.

ఇచ్చట జెప్పబడిన జీవాదానోపయోగ్యవస్తులు మూడును—"జీవాదానే తథా త్రయః" అని విషయసంగ్రహమున పరిగణింపబడును.) "అర్ధశ్లోకైరతస్సిద్ధాః" అని చెప్పినది ప్రాయికమను నుద్దేశముతో చెప్పినదికావున నిచ్చట తదధికముగ చెప్పినను విరుద్ధముకాదని యెఱుంగునది.

(35-36) రక్తపిత్తోపయోగ్యవస్తియోగములు రెండు.

మూ. మధూకమధుకద్రాక్షా దూర్వాకాశ్మర్యచన్దనైః,
తేనైవ విధినా వస్తిః దేయస్సక్షౌద్రశర్కరః,. ౪౨
మఞ్జిష్ఠా సారిబాऽనన్తా పయస్యా మధుకైస్తథా,
శర్కరాచన్దన ద్రాక్షా మధుధాత్రీ ఫలోత్పలైః
రక్తపిత్తే;

వ్యా. ఇప్పపట్ట, అతిమధురము, ద్రాక్షపండు, గరిక, పెద్దగుమ్మడి, చందనము, ఈద్రవ్యములనుచేర్చి పైజెప్పినవిధముగ వస్తినిసిద్ధముచేసి, అందు తేనెను చక్కెరనుకలిపి వస్తిప్రయోగము చేయునది. మరియు మంజిష్ఠ, సుగంధపాల, నల్లసుగంధపాల, పాల తూర, అతిమధురము అనునీద్రవ్యములతో వస్తిని పైజెప్పినవిధముగ సిద్ధముచేసి, అందు—చక్కెర, చందనము, ద్రాక్షపండు, తేనె, ఉసిరికకాయలరసము, నల్లకలువలు అను నీద్రవ్యముల కూడచేర్చి వస్తిప్రయోగము చేయునది. ఈరెండువస్తులును రక్తపిత్తమున చాలప్రశస్తములు.

(37) ప్రమేహోపయోగ్యవస్తియోగమొకటి.

మూ. ప్రమేహే తు కషాయస్సోమవల్కజః. ౪౩

వ్యా. వెలిచంద్రపట్టకషాయముతో సిద్ధము చేయబడిన వస్తిని ప్రమేహముల యందు ప్రయోగించుట ప్రశస్తము. (ఈవస్తియోగము "మేహేచైకః" అని సంగ్రహమున నిర్దేశింపబడును.)

ఇత్తెరంగున వాతాదిదోషములకు కొన్నివ్యాధులకును సుఖముగ నుపయోగింప దగిన సిద్ధవస్తులు ముప్పదియేడు చెప్పబడినవి. అందు పరిస్రావాదివ్యాపత్తులు వస్తివ్యాప త్సిద్ధియందు "నాతియోగౌ క్లమాధ్మానే......ద్వాదశ వ్యాపదో వస్తేః అసమ్యగ్యోగ

సంభవాః” (సి. అ. ౭ శ్లో. ౫-౬) అని నిర్దేశింపబడిన పండ్రెండువ్యాపత్తులలో చేరినవి. వీనిలక్షణాదులు అచ్చటనే వివరింపబడినవి కావున నిచ్చట వివరింపబడవయ్యె.

## అధ్యాయోక్తవిషయసంగ్రహము.

తత్ర శ్లోకాః:—

మూ. త్రికాస్త్రయోఽనిలాదీనాం చతుష్కాశ్చాపరే త్రయః,
పక్వాశయవిశుద్ధ్యర్థం వృష్యాః సాఙ్గ్రాహికాస్తథా. ౪౪
పరిస్రావే తథా దాహే పరికర్తే ప్రవాహణే,
సాఽతియోగే మతౌ ద్వౌ ద్వౌ; జీవాదానే తథా త్రయః ౪౫
ద్వౌ రక్తపిత్తే; మేహే తు చైకః త్రింశచ్చ సప్త తే,
సులభాఽల్పౌషధక్లేశాః వస్తయో గుణవత్తరాః. ౪౬

వ్యా. వాత - పిత్త - కఫములనుద్దేశించి వేరువేరుగ నొక్కొకదాని మూడేసివస్తి యోగంబులును, పక్వాశయశోధనవస్తియోగములు నాల్గును, శుక్రమాంసవృద్ధికర, (వృష్య) వస్తియోగములు నాల్గును, సాంగ్రాహికవస్తియోగములు నాల్గును; పరిస్రవము, దాహము, పరికర్తము, ప్రవాహణము, అతియోగము అను నీవస్తివ్యాపత్తుల నుద్దేశించి యొక్కొకదానికి రెండేసివస్తియోగంబులును; జీవాదానమను వస్తివ్యాపత్తునకు మూడు వస్తియోగంబులును; రక్తపిత్తమునకు రెండు వస్తియోగంబులును; ప్రమేహమున కొక వస్తియోగంబును; ఇవియన్నియుచేరి ముప్పదియేడు సిద్ధవస్తియోగము లీవస్తిసిద్ధియందు చెప్పబడినవి. మరియు నీవస్తియోగము సులభముగ చేయదగినవియు, కొద్దియౌషధ ములచే సిద్ధముచేయదగినవియు, స్వల్పప్రయాసతో సాధింపదగినవియు నై యుండును. కావుననే యివి సిద్ధవస్తులని చెప్పబడును.)

## అనుక్తవస్తికల్పనావిధి.

మూ. గుల్మాఽతిసారోదావర్తస్తమ్భసఙ్కుచితాదిషు,
సర్వాఙ్గైకాఙ్గరోగేషు రోగేష్వేవం విధేషు చ. ౪౭
యథా స్వైరౌషధైస్సిద్ధాన్ వస్తీన్ దద్యాత్ విచక్షణః,
పూర్వోక్తేన విధానేన కుర్వన్ యోగాన్ పృథగ్విధాన్. ౪౮

వ్యా. గుల్మము, అతిసారము, ఉదావర్తము, స్తంభము, హస్తపాదాదిసంకోచము ఇవిమున్నగు సర్వాంగ-ఏకాంగవాతరోగముల యందును, వీనికి సమానలక్షణము లైన

యితరరోగములయందును, ఆయావ్యాధులకు ప్రత్యనీకములైన యౌషధములచే వస్తులను సిద్ధములుచేసి పైజెప్పినరీతిగ నాయావ్యాధికి దగినఆవాపకల్కాదులజేర్చి సంస్కరించి పలుతెరంగుల గల్పించి పండితుడగువైద్యుడు ఆయావ్యాధులయందు ప్రయోగింపవలెను.

అధ్యాయసమాప్తిః.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే సిద్ధిస్థానే వస్తిసిద్ధిర్నామ దశమోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున వస్తిసిద్ధియను నది పదియవయధ్యాయము సమాప్తము.

---

# ఏ కా ద శా ధ్యా య ము.

అవతరణిక:—పైజెప్పబడిన సిద్ధులయందు అచ్చటచ్చట నానావస్తుల నుద్దేశించి ఆయావస్తుల చేర్పదగిన మ్రంగకాయ మున్నగుఫలములు తంత్రకారులగు నాచార్యులచే నిర్దేశింపబడినవి. అట్టివస్తులలో నుపయోగింపబడు ఫలములలో ప్రధానముగ నిర్ణీతమైన గుణములను, పైగ్రంథముచే జెప్పబడని యపూర్వమైన యేనుగులు మున్నగుజంతువుల కుపయోగింపదగిన వస్తులను, వానివిధానమును, పరిమితిని దెలుపునట్టి ఫల-మాత్రాసిద్ధియను నీయధ్యాయము చెప్పబడును:—

అధ్యాయప్రారంభము.

మూ. అథాతః ఫలమాత్రాసిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧

ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. వస్తిసిద్ధిని చెప్పినపిదప వస్తులప్రయోగించుట యోగ్యములైన ఫలముల నిర్ణయమును, ఏనుగులు మున్నగుజంతువుల కుపయోగింపదగిన వస్తివిధిని వస్త్యౌషధపరిమాణమును తెలుపునట్టి ఫలమాత్రాసిద్ధి యనునధ్యాయము భగవానుడగు నాత్రేయుడుపదేశించినదానికన్న న్యూనాతిరేకము గాకుండునట్లు వివరించి చెప్పబడును.

ఇచ్చట గజాదులనుద్దేశించి వస్తులజెప్పుట యప్రస్తుతము; అయినను వస్తిప్రయోగము గజాదిజంతువులకును యోగికములని వానిమాత్రానిర్ణయమును, వస్తిఫలగుణాదినిర్ణయంబును ఈయధ్యాయమున జెప్పబడునని యెరుంగునది.

—{ వస్తియోగములయందు ఫలాదిగుణతారతమ్యమును నిర్ణయించుటకై ఋషిసమావేశము. }—

మూ. భగవన్తముదారసత్త్వధీశ్రుతవిజ్ఞానసమృద్ధమత్రిజం,
ఫలవస్తి వరత్వనిశ్చయే సవివాదాః మునయోఽభ్యుపాగమన్.
భృగుకౌశికకాప్యశౌనకాః సపులస్త్యాఽసితగౌతమాదయః,
కతమత్ ప్రవరం ఫలాదిషు స్మృతమాస్థాపనయోజనాస్వితి. ౪

వ్యా. భృగువు, కౌశికుడు, కావ్యుడు, శౌనకుడు, పులస్త్యుడు, అసితుడు, గౌతముడు మున్నగుఋషిపుంగవులు కొందరు ఆస్థాపనవస్తి నుద్దేశించి చెప్పబడినఫలములలో శ్రేష్ఠత్వమును గూర్చి వివాదపడి, భగవత్స్వరూపుడును, మిక్కిలి యుత్కృష్టమైన సత్వగుణంబును, బుద్ధికౌశలంబును, శాస్త్రపరిజ్ఞానంబును సమృద్ధిగకల యత్రిమహర్షి సాన్నిధ్యమున జేరి, ఆస్థాపనవస్తిలో జేర్చుటకు ఫలాదులలో (మ్రంగకాయ మున్నగువానిలో) నెయ్యది మిక్కిలి గుణోత్తరమై శ్రేష్ఠముగనుండును అనువిషయమును నిర్ణయింప గోరియుండిరి. (ఇచ్చట ఫలాదులకు వస్తియోగములయందు గుణములదెలుపుటకై పూర్వకాలమున జరిగిన ఋషివర్యుల విమర్శనమును జూపుచు వారివారిమతముల నిర్దేశించి చూపబడును.)

—మదనాదిఫలముల గుణాదినిర్ణయమునశౌనకాదులయభిప్రాయములు.—

మూ. కఫపిత్తహరం వరం ఫలేష్వథజీమూతకమాహ శౌనకః,
మృదువీర్యతయా భినత్తి తత్ శకృదిత్యాహ నృపోఽథ వామకః.
కటుతుమ్బ మమన్యతోత్తమం వమనే దోషసమీరణం చ తత్,

వ్యా. మ్రంగకాయ మున్నగుఫలములలో కఫపిత్తముల హరించుటయందు సమర్థమగుటవలన జీమూతఫలము (దేవదాళి, డావరడంగి) ఆస్థాపనవస్తికి మిగుల శ్రేష్ఠమని శౌనకుడు చెప్పెను.

దేవదాళి మృదువీర్యమగుటవలన మలమునుమాత్రము భేదించునుకాని దోషముల పూర్తిగ హరింపనేరదు; కావున చేదుసొర వమనములచే దోషమును వెడలించి హరించుటకు సమర్థమగుటంజేసి మిక్కిలి శ్రేష్ఠముగనుండునని వామకు డనురాజర్షి చెప్పెను.

మూ. తదవృష్య (తదయోగ్య)మశ్లైత్యతీక్ష్ణతా
కటురౌక్ష్యాదితి గౌతమో౽బ్రవీత్. ౬
కఫపిత్తనిబర్హణం పరం
స చ ధామార్గవమిత్యమన్యత (ధామార్గవ మేష్వమన్యత)
(ధామార్గవ మేవమన్యతే),

వ్యా. పైచెప్పబడిన చేదుసొర ఉష్ణవీర్యంబును, తీక్ష్ణగుణంబును, కటురసంబును, రూక్షగుణంబు నగుటవలన వస్తి యోగ్యముకాదనియు; ధామార్గము, (చేదుపుచ్చ, లేక పెద్దచేదుబీర) కఫపిత్తముల హరించునది కావున మిగులశ్రేష్ఠమనియు గౌతముడు చెప్పెను.

మూ. తదమన్యత వాతలం పునః బడిశో గ్లానికరం బలాపహమ్. ౭
కుటజం ప్రశశంసచోత్తమం న బలఘ్నం కఫపిత్తహారి చ,

వ్యా. పైజెప్పబడిన ధామార్గవము వాతమును వృద్ధి నొందించునదియు, బలమును హరించునదియు, బడలికను కల్గించునదియు నగుటంజేసి యుక్తము కానోపదనియు, కుటజము (కొడిసెపాలవిత్తులు) బలమునకు హాని చేయకయే కఫపిత్తముల హరించును కావున నియ్యది వస్తియోగమున జేర్చుటకు మిక్కిలి యుత్తమంబనియు,బడిశు డనుమహర్షి తన మతమును చెప్పెను.

మూ. అతివిజ్జలమౌర్ధ్వభాగికం పవనక్షోభి చ కాప్య ఆహ తత్. ౮
కృతవేధనమాహ వాతలం కఫపిత్తం ప్రబలం హరేదితి,

వ్యా. పైజెప్పిన కొడిసెపాల మిక్కిలి పిచ్ఛిలంబును, శరీరమునం దూర్ధ్వభాగమును పొందునదియు, వాతము ప్రేరేపించునదియు నగును, కావున శ్రేష్ఠమైనదికాదనియు; కృతవేధనము (చేదుబీర చిన్నది) వాతమును వృద్ధినొందించునది యైనను ప్రబలములైన కఫపిత్తముల రెండిటిని హరించునదియగును కావున నియ్యది యుత్తమమనియు కాప్యుడు చెప్పెను.

మూ. తదసాధ్వితి భద్రశౌనకః కటుకం చా౽తిబలఘ్నమిత్యపి. ౯

వ్యా. పైజెప్పిన చేదుబీర కటురసంబును, బలమును మిక్కిలి హరించునదియు నగునుకావున నయ్యది వస్తికి యుక్తముకానోపదని భద్రశౌనకుడు చెప్పెను.

(ఇచ్చట ఋషులవివాదమూలముగ దేవదాళి మున్నగునౌషధద్రవ్యముల గుణదోషములు వివరింపబడినవని యెరుంగునది.

—౷ ఫలగుణములవిషయమున నాత్రేయసిద్ధాంతము. ౷—

మూ. ఇతి తద్వచనాని హేతుభిః సువిచిత్రాణి నిశమ్య బుద్ధిమాన్.
ప్రశశంస ఫలేషు నిశ్చయం పరమం చాత్రిసుతోఽబ్రవీదిదమ్.

వ్యా. ఇత్తెరంగున వస్త్యౌషధములలో నుపయోగింపదగు దేవదాళి మున్నగఫలముల గుణాదులనుద్దేశించి సహేతుకముగ జెప్పబడిన పలుదెరంగులైన ఋషివాక్యములను విని యాత్రేయుడు చాల ప్రశంసించెను. పిమ్మట అట్టిఫలములలో మిక్కిలి శ్రేష్ఠమైన దానిని నిర్ణయించి వారికి దెలుపుటకై యీక్రింద జెప్పబడువిధముగ వారికి బదులు సెప్పెను.

మూ. ఫలదోషగుణాన్ సరస్వతీ ప్రతి సర్వైరపి సమ్యగీరితా,
న తు కిఞ్చిదదోషనిర్గుణం గుణభూయస్త్వమతో విచిన్త్యతే ౧౧

వ్యా. ఫలములయొక్క దోషములను గుణములను గూర్చి మీరందరును చెప్పిన వాక్యములన్నియు మిక్కిలి యుక్తియుక్తములుగనే యున్నవి. కాని ప్రతిద్రవ్యంబును గుణదోషములు మిశ్రములుగ నుండును కాని యొకవస్తువైన గుణదోషసంకరము లేక యుండబోదు. కావున నేవస్తువునందు గుణము లధికముగ నుండునో దానిని ముఖ్యముగ యోచించి గమనించవలెను. (ప్రతివస్తువునందును గుణములను దోషములను చక్కగ గమనించి గుణము లధికముగ గల ద్రవ్యమునే ఆయాయోగముల జేర్చవలెనని భావము.)

—౷ దేవదాళి మున్నగువాని ప్రత్యేకోపయోగము; మదనఫలప్రాశస్త్యము. ౷—

మూ. ఇహ కుష్ఠహితా గరాగరీ హితమిక్ష్వాకు తు మేహినే మతం,
కుటజస్య ఫలం హృదామయే ప్రవరం కోశఫలం చ పాణ్డుషు.
ఉదరే కృతవేధనం హితం మదనం సర్వగదాఽవిరోధి తు,
మధురం సకషాయతిక్తకం తదరూక్షం సకటూష్ణవిజ్జలమ్. ౧౩
కఫపిత్తహృదాశుకారి చాప్యనపాయం పవనాఽనులోమి చ,
ఫలనామవిశేషతస్త్వతో లభతేఽన్యేషు ఫలేషు సత్స్వపి. ౧౪

వ్యా. మీచే జెప్పబడిన వస్తువులో దేవదాళి కుష్ఠములయందు శ్రేష్ఠము. చేదుసొర ప్రమేహరోగికి హితమైనది. కొడిసెపాలవిత్తులు హృద్రోగములయందు మిక్కిలి హితము. చేదుబీరకాయ పాండురోగములయందు మిగుల శ్రేష్ఠము. చేదుబీరచిన్నది ఉదర

రోగములయందు హితకరము. మదనఫలము (మ్రంగకాయ) అన్నిరోగములయందును విరోధములేక మిక్కిలి హితకరమై యుండును.

మరియు—మ్రంగకాయ మధుర-కషాయ-తిక్త-కటురసంబులును,ఉష్ణవీర్యంబును పిచ్ఛిలగుణంబును కలిగి, రూక్షగుణములేక యుండును. కఫపిత్తములను హరించును. దోషములను అతిశీఘ్రముగ వెడలించును. అపాయము నేమాత్రము కల్గింపదు. వాతమును అనులోమముగ జేయును. కావున మ్రంగకాయ తక్కినఫలము లెన్నియున్నను వానిలో మిగుల శ్రేష్ఠమైనది. కావుననే నిరుపపదముగ 'ఫలం' అనుపదమును సామాన్యముగ చెప్పినస్థలములయందెల్ల తక్కినఫలముల వదలి మ్రంగకాయయే (మదనఫలమే) గ్రహింపబడును.

మూ. గురుణేతి వచస్యుదాహృతే మునిసఙ్ఘేన చ పూజితే తతః (తథా),
ప్రణిపత్య ముదా సమన్వితః సహితశ్శిష్యగణోఽనుపృష్టవాన్.

వ్యా. పైజెప్పినప్రకారము గురువుచెప్పినవాక్యమును శిష్యబృందమున చేరినఋషివర్యులందరును పూజించి, మిక్కిలి సంతసమంది, పిమ్మట గురువునకు నమస్కరించి, మరల నీక్రింద చెప్పబడువిధముగ నడిగెను.

## వస్తిగుణములనుద్దేశించి శిష్యగణప్రశ్నము.

మూ. సర్వకర్మగుణకృద్గురుణోక్తో వస్తిః, ఊర్ధ్వమథ నైతి నాభితః,
నాభ్యధో గుదమతః సశరీరాత్ సర్వతః కథమపోహతి
దోషాన్ (రోగాన్). ౧౬

వ్యా. వస్తి తక్కినవమనాదులచేతను, లంఘనబృంహణాదులచేతను కల్గుగుణములనన్నిటిని కల్గించునని గురువర్యులగు తమరిచే నుపదేశింపబడినది; అట్టివస్తి శరీరమున నాభికి పైభాగమున వ్యాపింపనేరదు. గుదము నాభికి క్రిందిభాగమున నున్నది. దానినుండి ప్రయోగింపబడిన వస్త్యౌషధము శరీరమునంతటను వ్యాపించియుండు దోషములను రోగములను ఎట్లు పోగొట్ట సమర్థమగును? (అని శిష్యగణము ప్రశ్న జేసెనని పైవాక్యముతో నన్వయము.)

## వస్తిగుణములగూర్చి యాత్రేయుల ప్రశంస.

మూ. తద్గురురబ్రవీదిదం శరీరం-త్రయతేఽనిలః సఙ్గవిఘాతాత్,
కేవలఏవ దోషసహితో వా-స్వాఽఽశయగః ప్రకోపముపయాతి.

తం పవనం సపిత్తకఫవిట్కం-శుద్ధికరోఽనులోమయతి వస్తిః,
సర్వశరీరగశ్చ గదసఙ్ఘః-తత్ర్పశమాత్ ప్రశాన్తిముపయాతి.

వ్యా. పైజెప్పినవిధముగ శిష్యులడుగ గురువగునాత్రేయు లిట్లు బదులుసెప్పెను:- వాతము తనకు ప్రకోపకారణములతో సంబంధము లేకుండుటవలన మనుజులశరీరమును (ఆయావ్యాపారముల ప్రవర్తింపజేయుచు) ధరించియుండును. అట్టివాతము కేవలమొక్కటియైనను, లేక వాతపిత్తములతో కలిసియైనను తనయాశయము (పక్వాశయము) నందే (ప్రాయికముగ) ప్రకోపము నొందును. (వాతము స్థానాంతరమునజేరి ప్రకోపము నొందుటకును స్వాశయమున ప్రకోపమే కారణమని భావము). అట్టికఫపిత్తమలములతో కూడినవాతమును, వస్తి వాతమునకు స్థానమైన పక్వాశయశోధనమూలముగ శుద్ధిజేసి అనులోమముగ ప్రవర్తింపజేయును. అట్టివస్తిప్రయోగముచే సర్వశరీరమున వ్యాపించియుండువాతము శాంతి నొందినపుడు శరీరమునందెల్ల వ్యాపించియున్న రోగసముదాయమంతయు శమించును. (వాతము పక్వాశయమున ప్రధానముగనుండి కఫ-పిత్తములతో గూడి సర్వశరీరమును ధరించి యుండును. అయ్యది స్వాశయమున ప్రకోపమునొంది స్థలాంతరముల వ్యాపించి ఆయారోగముల గల్గించును. అట్టియెడ ప్రధానమూలకారణమైన వాతమును, దానిస్థానమైన యామాశయశోధనముచే వస్తికర్మ వాతమును శమింపజేయును. పిమ్మట వాతముచేగల్గిన సర్వశరీరవ్యాప్తము లగురోగములన్నియు తమకు తామే శమించునని ముఖ్యభావము.)

ఈవిషయము వస్తిసిద్ధియందు "కర్మాన్యద్వస్తి సమం" అని యుపక్రమించి విపులముగ జెప్పబడినది. స్థలాంతరములయందును పలుమారు ప్రశంసింపబడినది.

### గజాశ్వాదిజంతుచికిత్స. అందును వస్తిశ్రేష్ఠత్వము.

మూ. అథాఽభిగమ్యార్థమఖణ్డితం ధియా
గజోష్ట్రగోఽశ్వాఽవ్యజ కర్మరోగనుత్,
అపృచ్ఛదేనం స చ వస్తిమబ్రవీత్
విధిం చ తస్యాహ పునః ప్రచోదితః. ౧౯

వ్యా. వస్త్యౌషధయోగమునందు జేర్పదగిన మదనఫలాది ద్రవ్యగుణాదుల నిర్ణయమునుద్దేశించి యాత్రేయునిచే జెప్పబడిన సిద్ధాంతవిషయమును శిష్యగణము బుద్ధిచే చక్కగ తెలిసికొని; పిమ్మట యేనుగులు, ఒంటెలు, గోవులు, గుఱ్ఱములు, గొఱియలు, మేకలు మున్నగుజంతువులయొక్క రోగముల పోగొట్టుటకు దగిన చికిత్స యేది? యని

యడుగ, వానికి దగినది శ్రేష్ఠమైనచికిత్స వస్తికర్మయని బదులు సెప్పిరి; వానికి జేయం దగినవస్తివిధాన మెట్టులని శిష్యుడు మరలనడుగుటయు, ఆత్రేయులు గజాదుల కుపయో గింపదగిన వస్తివిధి నీక్రింద చెప్పబడురీతిగ బదులు సెప్పెను.

గజాదుల కుపయోగింపదగిన వస్తియంత్రము.

మూ. అజోరణౌ సౌమ్య! గజోష్ట్రయోః కృతే
గవాశ్వయోః వస్తిముశన్తి మాహిషం,
అజావికానాం తు జరద్గవోద్భవం
వదన్తి వస్తిం తదుపాయచిన్తకాః. ౨౦

వ్యా. ఏనుగులకును, ఒంటెలకును వస్తికర్మమును జేయుటకు మేకపోతువస్తి (మూత్రపుసంచి) నైనను, గొఱ్ఱెమూత్రపుసంచినైనను గ్రహింపనగును. మరియు ఆవుల కును, గుఱ్ఱములకును వస్తిని ప్రయోగించుటకై యెనుబోతుమూత్రాశయమును గ్రహించ వలెను. మేకబోతులకును గొఱియలకును వస్తికర్మచేయుటకై ముసలియెద్దుయొక్క మూత్రపుసంచిని గ్రహించవలెను.

గజాదులకు వస్తికర్మయం దుపయోగింపదగిన వస్తినేత్రపరిమాణము.

మూ. సువస్తి మష్టాదశషోడశాఙ్గుళం
తథైవ నేత్రం హి దశాఙ్గుళం క్రమాత్,
గజోష్ట్రగోశ్వావ్యజవస్తిసన్ధౌ
చతుర్థభాగోపనయం హితం వదేత్. ౨౧
(చతుర్థభాగే కృతకర్ణికం వదేత్.)

వా. వస్తినేత్రము (గొట్టము), ఏనుగులకును, ఒంటెలకు నుపయోగించుటకు పదు నెనిమిదియంగుళములు పొడుగుకల్గి యుండవలెను. గోవులకును, గుఱ్ఱములకును నుపయో గించువస్తినేత్రము పదునారంగుళములు నిడివి కల్గి యుండవలయును. మేకలకును, గొరి యలకును నుపయోగించువస్తినేత్రము పదియంగుళములనిడివి కల్గియుండవలయును. పైజెప్పిన వస్తినేత్రములయొక్క నాల్గవవంతు లోనికిప్రవేశింప తగునట్లు కర్ణిక నుంచ వలయును.

—● గజాదుల కుపయోగింపదగిన వస్త్యౌషధమాత్రానిర్ణయము. ●—

మూ. ప్రస్థస్త్వజావ్యోర్హి నిరూహమాత్రా
గవాదిషు ద్విత్రిగుణం యథాబలం,
నిరూహ ఉష్ట్రస్య తథాఢకద్వయం
గజస్య వృద్ధిస్త్వనువాసనేఽష్టమః. ౨౨

వ్యా. మేకలకును, గొఱియలకును నిరూహవస్తిజేయుటకు క్వాథాదియౌషధముల పరిమాణము ప్రస్థపరిమితముగ నుండవలయును. గోవులకును, ఎనుబోతులకును, గుఱ్ఱముల కును బలము ననుసరించి రెండులేక మూడుప్రస్థములపరిమితిగ నుండవలయును. ఒంటెలకు రెండాఢకముల పరిమితముగ వస్త్యౌషధ ముండవలయును. యేనుగులకు నాల్గాఢకముల పరిమితముగ వస్త్యౌషధము నుండవలయును. ఇది నిరూహవస్త్యౌషధప్రమాణము. మరియు పైజెప్పిన జంతువులకు అనువాసనవస్తి చేయవలసియున్నచో వానివానికి నిర్దేశింపబడిన నిరూహవస్త్యౌషధప్రమాణములో యెనిమిదవవంతు స్నేహమును చేర్చవలయును. (ఇచ్చట "గవాదిషు ద్విత్రిగుణం" అనుచోట "గవాదిష్వితి గోప్రభృతిషు; గోమహిష అశ్వా నాం గ్రహణాత్ బహువచనం సాధు" అని చక్రపాణిదత్తవ్యాఖ్యలో నున్నది. దాని ననుసరించి ఆదిశబ్దముచే మహిషఅశ్వములు గ్రహించి వ్యాఖ్యానము చేయబడినది.

—● గజాదిజంతుసాధారణమగు వస్త్యౌషధయోగము. ●—

మూ. కలిఙ్గకుష్ఠే మధుకం చ పిప్పలీ
వచా శతాహ్వా మదనం రసాంజనం,
హితాని సర్వేషు గుడః ససైన్ధవో
ద్విపఞ్చమూలం చ

వ్యా. కొడిశపాలవిత్తులు, చెంగల్వకోష్టు, అతిమధురము, పిప్పళ్లు, వస, సదాప విత్తులు, మ్రంగకాయ, రసాంజనము,దశమూలములు వీనినన్నిటిని చేర్చి కషాయము చేసి, అందు బెల్లమును, సైంధవలవణమును యథోచితముగ చేర్చి ఒంటెలు మున్నగుజంతువుల కన్నిటికిని వస్తికర్మ చేయుట మంచిది. (ఈయోగము పైజెప్పినజంతువులకన్నిటికిని సాధా రణముగ నుండును.)

—● ఏనుగులకు విశేషవస్త్యౌషధయోగకల్పనము. ●—

మూ. వికల్పనా త్వియమ్. ౨3

గజేంద్రకాణాశ్వత్థవటాశ్వకర్ణకాః
సఖాదిరాః ప్రగ్రహసాలతాలజాః,
తథాచ పర్ణో ధవశిగ్రుపాటలీ
మధూకసారాః సనికుంభచిత్రకాః.

వ్యా. రావిపట్ట, మఱ్ఱిపట్ట, మద్ది, చండ్ర, రేల, ఏపి, తాటిపండు, కొముయ్యాకుపొన్న, వెలిచండ్ర, మునగ, పాదిరి, ఇప్పబంక, దంతి, చిత్రమూల నన్నిటిని పైజెప్పిన కషాయద్రవ్యములతోకూడ చేర్చి కషాయము కాచి, అం మును, సైంధవలవణమును చేర్చి పైజెప్పినరీతిగ యేనుగులకు వస్తికర్మ చేయున. యేనుగులకు సంబంధించిన వస్తివిశేషకల్పనము.)

## గోవులకు వస్త్యౌషధయోగము.

మూ. పలాశభూతీకసురాహ్వరోహిణీ
కషాయ ఉక్తస్త్వధికో గవాం హితః,

వ్యా. మోదుగ, కానుగ, దేవదారు, కటుకరోహిణి ఈకషాయద్రవ్య కషాయముకాచి పైజెప్పిన సామాన్యముతో గలిపి గోవులకు వస్తికర్మ చేయవలెను

## ఖర-ఉష్ట్రముల కుపయోగింపదగిన వస్త్యౌషధయోగము.

మూ. పలాశదన్తీసురదారుకత్తృణద్రవస్త్వ ఉక్తాఃతురగస్యచ

వ్యా. మోదుగ, దంతివేళ్లు, దేవదారు, కామంచిగడ్డి, పెద్దదంతివేళ్లు కొ ముగజేర్చి కషాయము కాచి గుఱ్ఱములకు వస్తికర్మ చేయుట హితకరము.

మూ. ఖరోష్ట్రయోః పీలుకరీరఖాదిరాః
శమ్యాకబిల్వాదిగణస్య చ చ్ఛదాః,

వ్యా. వరగోగు, వెదురుమోవు, పుల్లవెలగవేరు, రేలజిగురు, బిల్వాది (: మూల-హ్రస్వపంచమూల) వర్గమునందలి మారేడు మున్నగువానిచిగుళ్లు వీని జేర్చి కషాయము కాచి యొంటెలకు వస్తికర్మ చేయునది. (ఇచ్చట బిల్వాదిదశ నెరుంగునది.)

## మేకలకును గొఱియలకును వస్త్యౌషధయోగము.

మూ. అజావికానాం త్రిఫలాపరూషకం
కపిత్థకర్కన్ధుసబిల్వకోలజమ్.

వ్యా. త్రిఫలములు, చిట్టియీత, వెలగ, రేగు, మారేడు, పెద్దరేగు ఈద్రవ్యముల నధికముగ జేర్చి కషాయము కాచి మేకలకును గొఱ్ఱెలకును వస్తికర్మ చేయునది.

ఎల్లప్పుడును రోగపీడలు.

మూ. అథాఽగ్నివేశః సతతాఽఽతురాన్ నరాన్
హితం చ పప్రచ్ఛ, గురుస్తదాహ చ,
సదాఽఽతురాః శ్రోత్రియ - రాజసేవకాః
తథైవ వేశ్యాః సహ పణ్యజీవిభిః.　　౨౭

వ్యా. పైజెప్పినవిషయమునంతయు అగ్నివేశులు విని దీర్ఘకాలముగ నెల్లపుడును వ్యాధులచే బీడింపబడువార లెవ్వరు? వారికి చేయదగినవస్తివిధాన మెద్ది? యని యడిగెను. గురువైనయాత్రేయు లీక్రింద జెప్పబడువిధముగ బదులు సెప్పెను.—వేదముల విధ్యుక్తప్రకారము అధ్యయనముచేసి, వేదవిహితకర్మల నకాలమున నిర్వర్తించుకొను శీలసంపన్నులగు బ్రాహ్మణులును, రాజస్థానమున సేవకావృత్తిచేయుచు రాజాజ్ఞాపరతంత్రులుగ నుండుసేవకులును, బోగముచానలును, క్రయ-విక్రయాది వ్యాపారములచే జీవించువర్తకులును, ఎల్లప్పుడు రోగపీడితులై యుందురు.

ద్విజాదులకు దీర్ఘకాలము రోగములు పీడించుచు సంభవించుటకు కారణములు.

మూ. ద్విజో హి వేదాధ్యయనవ్రతాహ్నిక
క్రియాదిభిః దేహహితం న చేష్టతే (సేవతే),
నృపోపసేవీ నృపచిత్తరక్షణాత్
పరాఽనురోధాత్ బహుచిన్తనాత్ భయాత్.　　౨౮
నృచిత్తవర్తిన్యుపచారతత్పరా
మృజాఽభి (వి) భూషానిరతా పణాఙ్గనా,
సదాఽఽసనాత్ అత్యనుబన్ధవిక్రయ
క్రయాదిలోభాదపి, పణ్యజీవినః.　　౨౯
స్తథైవ తే హ్యాగతవేగనిగ్రహం
సదాఽఽచరన్తే (సమారభన్తే సమాశ్రయన్తే న చకాలభోజనం),
అకాల నిర్హారవిహారసేవనాత్
భవన్తి యేఽన్యేఽపి సదాఽఽతురా నరాః.　　౩౦

వ్యా. ద్విజుడు వేదాధ్యయము, ఉపవాసాదివ్రతముల నాచరించుట, వేదవిహితములగు సంధ్యాజపహోమ వైశ్వదేవాదినిత్యనైమిత్తికకర్మముల విధ్యుక్తముగ నాచరించుట, ఇవి మున్నగుపనులచే శరీరమునకు హితముగ నాహారవిహారాదుల సకాలమున నిర్వర్తింప నవకాశములేకుండును. రాజసేవకుడు ప్రభువుయొక్క చిత్తమును అనుసరించి యెల్లపుడును వారియాజ్ఞను కాపాడుకొనుటవలనను, ఇతరులగు రాజపురుషుల ననుసరించి నటించుటవలనను, పలుదెరంగులైన మనోవ్యాకులముచేతను, పరతంత్రతచే గల్గిన భయమువలనను, శరీరమునకు హితముగ నాహారవిహారాదుల సలుప నవకాశము లేకుండును.

వేశ్యాంగనలు తనవిటగాండ్ర చిత్తము ననుసరించి వారికి దగినయుపచారముల యందు ఆసక్తికల్గి యుపచరించుచుండుటచేతను, జారపురుషుల చిత్తాకర్షణమునకై శరీర సమ్మార్జనము, భూషణాద్యలంకార చిత్రీకరణము మున్నగువ్యాపారములయందు ఎల్లప్పుడును ఆసక్తచిత్తులై యుండుటవలనను, హితకరము లగునాహారవిహారాదుల సలుప నవకాశము లేకుందురు.

వర్తకులు—ఎల్లపుడు కూర్చునియుండుటవలనను, ఎల్లపుడును క్రయవిక్రయములయందు మిక్కిలి యాసగొని అట్టివ్యాపారములందు ఆసక్తచిత్తులై యుండుటవలనను, హితములగు నాహారవిహారాదుల నాచరింప వలనుపడకుందురు. కావున పైజెప్పబడిన ద్విజులు మున్నగు నాల్గుతెగలవారును మలమూత్రాదివేగములు ఆసన్నములైనపుడు వానిని సకాలమున విసర్జింపక నిరోధించి బిగబట్టియుందురు. సకాలమున భోజనము చేయరు. అట్టివేగనిరోధ-అకాలభోజనాది మిథ్యోపచారములవలన వారెల్లపుడును దీర్ఘవ్యాధిబాధితులై యుందురు.

మరియు నెవ్వరైనను భోజనవిహారాదులకు విధించినకాలము ననుసరింపక యకాలాహారవిహారాది మిథ్యోపచారముల సలిపినయెడ వారందరును ఎల్లకాలము దీర్ఘవ్యాధులచే పీడింపబడుచుందురు. (అందు ప్రధానముగ ద్విజాదుల నుదాహరణమునకై చెప్పబడియెనని యెరుంగునది.)

### సతతరోగపీడితులకు ఫలవర్తిప్రయోగము.

మూ. సమీరణం వేగవిధారణోద్ధతం
విబద్ధసర్వాఙ్గరుజాకరం భిషక్,
సమీక్ష్య తేషాం ఫలవర్తిమాదితః
సుకల్పితాం స్నేహవతీం ప్రయోజయేత్. ౩౧

వ్యా. పైజెప్పినకారణములచే మలమూత్రాదివేగముల నిరోధించుటవలన వాతము మిక్కిలి ప్రకోపించి మలమూత్రాదిబంధమును, సర్వావయవములయందును బాధను కల్గించును. వైద్యవరుడు దానిని చక్కగ గమనించి ఫలవర్తిని విధ్యుక్తప్రకారము గల్పించి తగినస్నేహమును జూసి పైజెప్పిన వ్యాధిపీడితునకు ప్రయోగింపవలయును. (ఫలవర్తివిధానము స్థలాంతరమున వివరింపబడినది.)

సతతరోగులకు నిరూహవస్తి.

మూ. పునర్నవైరణ్డనికుమ్భచిత్రకాః
సదేవదారుత్రివృతానిదిగ్ధికాః,
మహాన్తి మూలాని చ పఞ్చ యాని
విపచ్య మూత్రే దధిమణ్డ(స్తు) సంయుతే. 3౨
సతైలసర్పిర్లవణైశ్చ పఞ్చభిః
విమూర్ఛితం వస్తిమథ ప్రయోజయేత్,
నిరూహితం ధన్వరసేన భోజితం
నికుమ్భతైలేన తతోఽనువాసయేత్. 33

వ్యా. గలిజేరువేళ్లు, ఆముదపువేళ్లు, దంతి (నేపాళపువేళ్లు), చిత్రమూలము, దేవదారు, తెగడ, వాకుడువేళ్లు, బిల్వాదిమహాపంచమూలములు వీనిని సమభాగములుగ చేర్చి గోమూత్రమున (పరిభాషానుసారముగ) క్వాథము చేసి, అందు పెరుగుమీదితేట, కలిపి తైలమును, నేతిని, పంచలవణములను (భా'గప్రకారము) కలిపి అన్నిటి నొకటిగ కలియగూర్చి పైజెప్పిన సతతరోగపీడితులకు నిరూహవస్తిని విధ్యుక్తప్రకారము ప్రయోగించునది.

నిరూహవస్తిని చేసినపిదప రోగికి జాంగలజంతువుల మాంసరసముతో భోజనంబిడి దంతివేళ్లకషాయమును, కల్కమును జేర్చి సిద్ధముచేయబడిన తైలముతో ననువాసనవస్తిని విధిప్రకారము చేయునది.

శోకనిరూహవస్తియోగము.

మూ. బలాం సరాస్నాం ఫలబిల్వచిత్రకాః
ద్విపఞ్చమూలం కృతమాలకాత్ ఫలం,
యవాన్కులుత్థాంశ్చ పచేజ్జలాఢకే
రసః సపేష్యైస్తు కలిఙ్గకాదిభిః. 3౪

స్తైలసర్పిర్గుడసైన్ధవో హితః
సదాఽఽతురాణాం బలవర్ణవర్ధనః,

వ్యా. చిట్టాముట్టి, సన్నరాష్ట్రము, (మ్రంగకాయ, బిల్వము, చిత్రమూలము, మహాహ్రస్వపంచమూలములురెండును, (దశమూలములు) రేలకాయలోని గిజరు, యవలు, ఉలవలు వీనినన్నిటిని సమభాగములుగగూర్చి అష్టకపరిమితమైనజలమున (పరిభాషాను సారముగ) క్వాథముచు సిద్ధముచేసి యారసమున కొడిసెపాలవిత్తులు, చెంగల్వకోష్ఠు, అతిమధురము, మారేడువేరు ముస్తగుకల్కద్రవ్యములను నూరి కలిపి తైలమును, నేతిని, బెల్లమును, సైంధవలవణమును, వానివానిభాగములప్రకారము పైజెప్పిన క్వాథమున కలిపి సదా రోగపీడితులకు నిరూహవస్తిని చేసినయెడ బలమును, శరీరకాంతి వృద్ధి నొందించి, మిక్కిలి హితకరముగ నుండును.

సతతరోగులకు అనువాసనవస్తియోగములు.

మూ. తథానువాస్యే మధుకేన సాధితం
ఫలేన బిల్వేన శతాహ్వయాఽపి వా. 3౫

వ్యా. మరియు అతిమధురముచేనైనను, మ్రంగకాయచేనైనను, బిల్వవేరుచే నైనను, సదాపవిత్తులచేనైనను సిద్ధము చేయబడిన తైలముచే పైజెప్పిన సదారోగులకు అనువాసనవస్తిని చేయనగును.

బాలుల కుపయోగ్యములగు నిరూహ-అనువాసనవస్తియోగములు.

మూ. సజీవనీయస్తు రసోఽనువాసనే
నిరూహణే చాలవణో శిశోర్హితః,
న చాన్యదాశ్వఙ్గబలాభివర్ధనం
నిరూహవస్తేః శిశువృద్ధయోః పరమ్. 3౬

వ్యా. జీవనీయగణద్రవ్యములను క్వాథముచేసి యాక్వాథమునుచేర్చి సిద్ధముచేయ బడిన తైలముచేనైనను, అనువాసనవస్తి బిడ్డలకు చేయనగును. మరియు నాకషాయమున సైంధవలవణమును మాత్రము చేర్పక శిశువులకు నిరూహవస్తిని చేయుటయు చాలహిత కరము. శిశువులకును, వృద్ధులకును శరీరబలమును అతిశీఘ్రముగ కల్గించుటకు నిరూహ వస్తికన్న వేరొండుచికిత్సావిధానము ఉత్తమమయినది కానరాదు. (కావున శిశువుల

కును, వృద్ధులకును వాతవ్యాధులు సంభవించినప్పుడు వారిబలాద్యనుసారముగ నిరూహ వస్తిని చేయుంట ముఖ్యకర్తవ్యమని తంత్రకారుల సిద్ధాంతము.)

అధ్యాయవిషయసంగ్రహము.

తత్ర శ్లోకః.—

మూ. ఫలకర్మవస్తివరతా నేత్రం యద్వస్తయో గవాదీనాం,
సతతాతురాశ్చ దృష్టాః ఫలమాత్రాయాం హితం చైషామ్.

వ్యా. మ్రంగకాయ, దేవదాళి మున్నగుఫలములయొక్క కృత్యవిశేషంబును; వానిలో వస్తికర్మయం దుపయోగించుటకు శ్రేష్ఠత్వనిర్ణయమును; గోవులు, గుఱ్ఱములు మున్నగువాని కుపయోగింపదగిన వస్తినేత్రప్రమాణంబును; అట్టిజంతువులకు హితములగు వస్త్యౌషధయోగములును; యెల్లప్పుడు రోగపీడితులగువారి నిర్దేశంబును; కారణంబులును; అట్టివారికి హితమైనవస్తిచికిత్సితంబును; ఈవిషయములన్నియు యీఫలమాత్రాసిద్ధియను నధ్యాయమున వివరింపబడినవి.

అధ్యాయసమాప్తి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే ఫలమాత్రాసిద్ధిర్నామ
ఏకాదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నైన చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున ఫలమాత్రాసిద్ధియను పదునొకండవయధ్యాయము సమాప్తము.

## ద్వా ద శా ధ్యా య ము.

అవతరణిక:—ఫలమాత్రాసిద్ధిని చెప్పినపిదప ఉత్తమమైన కొన్నివస్తులు పైగ్రంథమున జెప్పబడక పరిశిష్టములైనవి యీతంత్రమున కడపటిదియగు నుత్తరవస్తిసిద్ధియను నీయధ్యాయమున జెప్పబడును.—

అధ్యాయోపక్రమము.

మూ. అథాత ఉత్తరవస్తిసిద్ధిం వ్యాఖ్యాస్యామః. ౧
ఇతి హ స్మాహ భగవానాత్రేయః. ౨

వ్యా. ఫలమాత్రాసిద్ధిని జెప్పినపిదప పరిశిష్టములగు నుత్తమములైన కొన్నివస్తుల సిద్ధిని బోధించు నుత్తరవస్తిసిద్ధి యనునధ్యాయమును భగవానుడగు నాత్రేయుం లుపదేశించినవానికన్న న్యూనాతిరేకము లేకుండునట్లు వివరించెదనని యర్థము. (ఇచ్చట ఉత్తర శబ్దము శ్రేష్ఠవాచకము. శ్రేష్ఠములైన (నిరపాయములగు) వస్తుల నధికరించి చెప్పబడు నధ్యాయము 'ఉత్తరవస్తిసిద్ధి' యని యధ్యాయసంజ్ఞ నెరుంగునది.)

వమనాదిశోధనానంతరము రోగిని మిథ్యోపచారములనుండి కాపాడువిధము.

మూ. అథ ఖల్వాతురం వైద్యః సంశుద్ధం వమనాదిభిః,
దుర్బలం కృశమల్పాగ్నిం ముక్తసన్ధానబన్ధనమ్: 3
నిర్హృతాఽనిలవిణ్మూత్రకఫపిత్తం కృశాశయం,
శూన్యదేహం ప్రతీకారాఽసహిష్ణుం పరిపాలయేత్. ౪
యథాఽణ్డం తరుణం పూర్ణం, తైలపాత్రం త థైవ చ,
(యథైవచ)
గోపాల ఇవ దణ్డీ గాః సర్వస్మాదపచారతః. ౫

వ్యా. పైజెప్పిన వమన-విరేచన-నిరూహ-నస్యకర్మలచే చక్కగ శుద్ధశరీరుడై బలహీనుడును, శరీరము కృశించినవాడును, మందగించిన జాఠరాగ్నికలవాడును, శిథిలములైన సంధిబంధములు కలవాడును, వాతంబును మలమూత్రములును కఫపిత్తంబును బైటవెడలినవాడును, సంశోధనముచే దోషములు వెడలుటంజేసి దోషరహితములైన ఆమాద్యాశయములు కలవాడును, చిక్కి బడలినశరీరము కలవాడును, బిగ్గరగమాటలాడుట మున్నగు పనులకును వమనాదిక్రియలకును ఓరువజాలనివాడును నైనరోగిని, పలుదెరంగులైన మిథ్యాహారవిహారాద్యపచారములబారి బడనీయక వైద్యవరుడు మిక్కిలి జాగరూకుడై (తరుణమైన గుడ్డును పక్షులు కాపాడువిధముగను, తైలపూరితమైన కుండను పగలనీయక కాపాడువిధముగను, ఆవులకాపరి చేత కఱ్ఱనుబూని పశువుల కాపత్తుకల్గనీయక కాపాడు రీతిని) కాపాడవలెను.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—వమన-విరేచనాదిసంశోధనములచే సమ్యక్ శుద్ధశరీరునకు పైజెప్పిన బలహీనాదిపరిస్థితి కల్గియుండును. అట్టియెడ జాఠరాగ్ని బలహీనస్థితి నుండును కావున సాధారణమైన (మామూలు) యాహారమును జీర్ణింప సమర్థము కానోపదు. శరీరము దుర్బలముగ నుండుటవలన మామూలుగ తానుచేయు చంక్రమణాదివిహారములకును సమర్థత చాలియుండదు. కావున అట్టిసమయమున క్రింద

జెప్పబడు పేయాదిక్రమము ననుసరించి యాహారమును సేవించవలెను. అందును వమన విరేచనములచే శోధితునకుమాత్ర మీ క్రిందజెప్పబడు పేయాదిక్రమము పూర్తిగ ననుస రింపవలెను. నిరూహ-శిరోవిరేచనములచే శుద్ధునకు విశేషముగ ప్రాముఖ్యము లేదు. "వమనాదిభిః" అను బహువచననిర్దేశము శోధన సామాన్యముగ చేయబడినదియని యెరుంగునది. మరియు—తరుణాణ్డ-తైలపూర్ణపాత్ర - గోరూపదృష్టాంతములమూటిని చెప్పుటచేత అపచారములనుండి రోగిని కాపాడుట ముఖ్యకర్తవ్యమని దృఢపడుచున్నది.

## సంశుద్ధకాగ్ని సంధుక్షణమునకు పేయాదిక్రమవిధి.

మూ. అగ్నిసంధుక్షణార్థం తు పూర్వం పేయాదినా భిషక్,
రసోత్తరేణోపచరేత్ క్రమేణ క్రమకోవిదః ౬

వ్యా. వమనవిరేచనములచే పైజెప్పనరీతిగ జాఠరాగ్ని మిక్కిలి మందగించి స్వల్ప ముగ నుండునుకావున అట్టియగ్ని నానాట వృద్ధినొందుటకై పేయాది (అన్నసంసర్జన) క్రమము ననుసరించి యాహారమును భుజింపజేయనగును. నిరూహవస్తి చేసినపుడు అగ్ని మిగుల కొంచెముగ తగ్గియుండునుకావున అట్టివానికి బలము పూర్ణముగ కల్గి కొంచెము తగ్గిన యగ్ని పూర్ణముగ వృద్ధినొందుటకై మాంసరసక్రమము ననుసరించి యాహారము నిడవలెను. (ఇత్తెరంగున 'పేయాదినా' అని చెప్పబడినక్రమము వమన-విరేచనముల నుద్దే శించి చెప్పబడినది యనియు, "రసోత్తరేణ" అని చెప్పినది నిరూహవస్తి నుద్దేశించి యనియు వ్యవస్థ నెరుంగునది.)

ఇచ్చట—"రసాభ్యాసక్రమః ఉత్తరకాలం యస్మిన్ పేయాదిక్రమే తేన పేయాదినా"అనువిగ్రహముచేత 'రసోత్తరేణ' అనుపదమును 'పేయాదినా' అనుదానికి విశేషణముగ జెప్పి, మొదట పేయాదిక్రమము నాచరించి, పిదప రసాదిక్రమము నాచ రింపవలెనని కొందరుచెప్పెదరు. వస్తిసూత్రీయసిద్ధియందు—"ప్రత్యాగతేకోష్ణ జలాఽవ సిక్తః శాల్యన్నమద్యాత్ తనునా రసేన" (సి. అ. 3. శ్లో. ౨౭.) అని నిరూహవస్తి యందు అన్నాహారమునే తంత్రకారు లుపదేశించిరి. కావున పేయాదిక్రమము వమన విరేచనవిషయమని యాచార్యసమ్మతము. ఇచ్చట జెప్పిన రసాదిక్రమంబును నిరూహ వస్తి నుద్దేశించి రెండవపక్షముగ నిర్దేశింపబడినదని తోచెడి. సుశ్రుతాచార్యులును నిరూ హమున రసాదిక్రమమునే యుపదేశించిరి.

## మధురాదిరసక్రమాభ్యాసము.

మూ. స్నిగ్ధామ్లస్వాదుహృద్యాని తతోఽమ్లలవణౌ రసౌ,
స్వాదుతిక్తౌ తతో భూయః కషాయకటుకౌ తతః. ౭

అన్యోఽన్యప్రత్యనీకానాం రసానాం స్నిగ్ధరూక్షయోః,
వ్యత్యాసాదుపయోగేన ప్రకృతిం గమయేత్ భిషక్. ౮

వ్యా. నిరూహశుద్ధునకు తొలుత స్నేహద్రవ్యముతోగూడి స్నిగ్ధంబును, అమ్లమధురరసములు కల్గినదియు మనసు కింపైనదియు నగుపదార్థములతో కూడినయాహారమును బెట్టవలెను. పిమ్మట అమ్లలవణరసములతో కూడినయాహారము భుజింపజేయవలెను. అటుపిమ్మట, మధురతిక్తరసములకూర్చియు, దానికిపిమ్మట కషాయ-కటురసములగూర్చియు భోజనమును క్రమముగ నిడవలెను. ఇత్తెరంగున పరస్పరవిరుద్ధములై (యొకదానితో నొకటి విరుద్ధములై) యుండురసములను, పరస్పరవిరుద్ధగుణములైన స్నిగ్ధరూక్షాదిపదార్థములను క్రమముగ మార్చిమార్చి కలుపుచు నాహారము నుపయోగించవలెను. ఇట్లు రసాదుల వ్యత్యాసముగ క్రమక్రమముగ నానాటమార్చియభ్యాసముచేసి యుపయోగించుచు కడపట సర్వరసములతోగూడిన యాహారమును భుజించునట్లు చేయవలెను. (ఇదియే రసక్రమాభ్యాసము.)

వివరణము:—వమనవిరేచనాదికర్మలచే శోధనముజేసిన పిదప తొలుత పేయాది క్రమము ననుసరించి యాహారమును మామూలుగ భుజించునపుడు సంశోధనములకు మూలభూతశరీరమునకు బలమును ఆప్యాయతయు కల్గించుటకై మధురాదిరసముల పైజెప్పినక్రమము ననుసరించి కలుపుకొనుచు రసాభ్యాసముచేసి తుట్టతుదకు మధురాది రసముల నన్నిటిని చేర్చి మామూలుగ భుజించునట్లు అభ్యాసముచేయవలెనని యొకపక్షము. మరియు పేయాదిక్రమమునందే మధురాదిరసములచే సంస్కారము చేయునపుడు పైజెప్పిన మధురామ్లాదిక్రమముగ రెండేసిరసముల జేర్చుచు సంస్కరించి క్రమాభ్యాసము చేయవలెనని వేరొకపక్షము. ఈరెండుపక్షములయందును,—పక్వాశయమున నుండువాతమును శమింపజేయుటకై తొలుత మధురామ్లరసముల జేర్చవలెననియు, పిమ్మట పక్వాశయమునకు పైభాగముననున్న జాఠరాగ్ని వృద్ధి నొందించుటకై అమ్లలవణరసములను జేర్చికొనవలెననియు, పిమ్మట పిత్తమును శమింపజేయుటకై మధురతిక్తరసముల నుపయోగింపవలెననియు, అటుపిమ్మట పిత్తమునకు పైభాగమునందుండు ఆమాశయమునందలి కఫమును శమింపజేయుటకై కషాయకటురసముల రెంటి నుపయోగింపవలెననియు పైజెప్పిన రసక్రమోపయోగమునకు ప్రయోజనము.

పైజెప్పినరీతిగ పేయాదిక్రమమున రెండేసిరసములవంతున జేర్చి సంస్కరించి యుపయోగించుచోడ పేయాదిక్రమమువలెనే పంద్రెండు అన్నకాలములతో రససంసర్జన

క్రమంబును పూర్తియై పదిమూడవ భోజనకాలమున సర్వరసయుక్త స్వాభావికభోజనము సిద్ధించును. పేయాదిక్రమము స్థలాంతరమున వివరింపబడినది.

మరియు "స్నిగ్ధరూక్షయోః, వ్యత్యాసాదుపయోగేన" అనుచోట పరస్పర విరుద్ధములగు స్నిగ్ధ-రూక్షగుణములు గలయాహారద్రవ్యములలో తొలుత స్నిగ్ధగుణము కలదాని నుపయోగించి, పిమ్మట రూక్షముగలదాని నుపయోగించవలెను. ఇత్తెరంగున వ్యత్యాసముగ విరుద్ధగుణములగు గురు-లఘు మున్నగువిరుద్ధగుణములు గలద్రవ్యద్వంద్వమును వ్యత్యస్తముగ నుపయోగించి క్రమాభ్యాసము చేయవలెనని యర్థము. ఇచ్చట "స్నిగ్ధరూక్షయోః" అనుపదము తక్కిన గురులఘ్వాదిగుణముల కుపలక్షణము.

## పేయాదిక్రమముచే స్వస్థతనొందినవానిలక్షణములు.

మూ. సర్వక్షమో (కృతక్రమో) నిరాసఙ్గః (హ్యాసంసర్గః) రతియుక్తః
స్థిరేన్ద్రియః, బలవాన్ సత్వసంపన్నో విజ్ఞేయః ప్రకృతిం గతః ౯
(బలవాన్ వర్ణవాన్ సర్వరతిః స్వఙ్గః స్థిరేన్ద్రియః,
ప్రసన్నాత్మా సర్వసహః విజ్ఞేయః ప్రకృతిం గత.)

వ్యా. పైజెప్పినరీతిగ పేయాదిక్రమమును క్రమరసాభ్యాసమును పొరబాటులేక యాచరించినమనుజుడు మధురాదిసరసముల నభ్యాసముగ నుపయోగించుటకును, సకలకార్యముల నిర్వహించుటకును సమర్థుడును; మలమూత్రాదిబాధము లేనివాడుగను, క్రీడాసక్తుడును, స్థిరమైన చక్షురాదీంద్రియబలము కలవాడును, ప్రశస్తమైన బలము కలవాడును, మనోబలసంపన్నుడును నైయుండును. (ఈలక్షణములన్నియు కల్గియున్న యెడ అట్టిమనుజుడు రోగవిముక్తుడై మామూలుగ నుండుపరిస్థితి కల్గియున్నవాడని యెరుంగునది.)

## ప్రకృతినొందనివాడు విసర్జించవలసినవిషయము లెనిమిది.

మూ. ఏతాం ప్రకృతిమప్రాప్తః సర్వవర్జ్యాని వర్జయేత్,
మహాదోషకరాణ్యష్టౌ ఇమాని తు విశేషతః. ౧౦
ఉచ్చైర్భాష్యం రథక్షోభం అతిచఙ్క్రమణాఽఽసనే,
అజీర్ణాఽహితభోజ్యే చ, దివాస్వప్నం సమైథునమ్. ౧౧

వ్యా. సంసర్జనక్రమాభ్యాసముచేకూడ పైజెప్పినప్రకృతిని పొందకయుండు మనుజుడు వర్జనీయములగు నాహారవిహారాదివిషయముల నన్నిటిని (ప్రకృతిస్థితిని పొందు

వరకును) బొత్తుగ మానియుండవలెను. అందును—ఉచ్చైర్భాష్యము (బిగ్గరగ మాటలాడుట), రథక్షోభము, (రథముపై నెక్కి సంచరించుటచే శైనసంచలనము), అతిచంక్రమణము (అధికముగ సంచారము), అత్యాసనము, (ఎల్లప్పుడును కూర్చుని యుండుట), అజీర్ణభోజనము (ఆహారము జీర్ణముకాకుండునపుడు మరల భుజించుట), అహితభోజనము, (వాతాదులకు అనుకూలముకాని యాహారమును భుజించుట), దివాస్వప్నము, (పగటినిద్ర), మైథునము (స్త్రీసంభోగము) అను నీయెనిమిదివిషయములను బొత్తుగ మానియుండవలెను.

## ఉచ్చైర్భాష్య-అతిసంభాషణాదులచే వేరువేరుగ గల్గువ్యాధులు.

మూ. తజ్జాః దేహోర్ధ్వ- సర్వాఙ్గ - మధ్యపీడాఽఽమ దోషజాః,
శ్లేష్మజాః క్షయజాశ్చైవ వ్యాధయస్స్యుః యథాక్రమమ్. ౧౨

వ్యా. పైజెప్పిన యెనిమిదివిధములైన యపచారములచే నీక్రిందజెప్పబడు నెనిమిది విధములైన రోగములును వరుసగ సంభవించును:—అందు బిగ్గరగ మాటలాడుటచే దేహమునం దూర్ధ్వభాగమున వ్యాధులును, రథక్షోభమున సర్వాంగబాధయు, అతి సంచారముచే నధశ్శరీరమున బాధలును, అత్యాసనముచేత మధ్యశరీరవ్యాధులును, అజీర్ణభోజనముచేత అహితభోజనముచే త్రిదోషములకు జేరినరోగములును, పగటినిద్రచేత శ్లేష్మరోగంబులును, మైథునముచేతను ధాతుక్షయముచే నైనవ్యాధులును వరుసగ సంభవించును. (కావున పైజెప్పబడిన ఉచ్చైర్భాషణాదుల నెనిమిదిటిని ప్రకృతిస్థితినొందువరకును బొత్తుగ మానియుండుట ముఖ్యకర్తవ్యమని భావము.)

## ఉచ్చైర్భాష్యాదులచే గల్గువ్యాధులయొక్కసంగ్రహము.

మూ. తేషాం విస్తరతో లిఙ్గం ఏకైకస్య చ భేషజం,
యథావత్ సంప్రవక్ష్యామి సిద్ధాన్ వస్తీంశ్చ యాపనాన్. ౧౩

వ్యా. పైజెప్పిన ఉచ్చైర్భాష్యాదులచే గల్గువ్యాపత్తులకు వేరువేరులక్షణములను, ఆయారోగమునకు దగిన వేరువేరుచికిత్సితములను ఈక్రింద విస్తరముగ జెప్పెదనని యర్థము.

## (1) ఉచ్చైర్భాష్య-అతిసంభాషణములచే గల్గువ్యాధులు.

మూ. తత్ర - ఉచ్చైర్భాష్యాఽతిభాష్యాభ్యాం శిరస్తాప - శఙ్ఖకర్ణ
నిస్తోద-శ్రోత్రోపరోధ - ముఖతాలుకణ్ఠశోష - తైమిర్య - పిపాసా-

జ్వర - తమక - హనుగ్రహ-మన్యాస్తమ్భ - నిష్ఠీవనోరఃపార్శ్వ
శూల - స్వరభేద - హిక్కా-శ్వాసాదయస్స్యుః. ౧౪

వ్యా. పైజెప్పినవానిలో బిగ్గరగ మాటలాడుటచేతను, మితిమీరి వదరుటచేతను—శిరస్తాపము (తలనొప్పి, మంట), కణతలయందును చెవులయందును సూదుల బొడిచిన విధముగ పోటు, చెవుడు, నోటియందును తాలువులయందును కుత్తుకయందును చెమ్మలేక యెండుట, తిమిరమనెడు నేత్రరోగము, దప్పి, జ్వరము, తమకశ్వాసము, అంకిళిలు పట్టికొనుట, మన్యాస్తంభము, నోట నీరుపెడలుట, రొమ్మునందును పార్శ్వములయందును శూలనొప్పి, కంఠస్వరభేదము, వెక్కిళ్లు, శ్వాసము ఇవి మున్నగువ్యాధులు సంభవించును. (ఇచ్చట ఉచ్చైర్భాష్య-అతిభాష్యములచే గల్గువ్యాధులు సమానములగుటవలన నిచ్చట రెండును చెప్పబడినవి. కావున సంఖ్యావిరోధముకాదని యెరుంగునది. ఈన్యాయమును "అజీర్ణాఽధ్యశనాభ్యాం" "విషమాఽహితాశనాభ్యాం" అను స్థలములయందును గమనించునది.)

(2) రథక్షోభముచే గల్గువ్యాధులు.

మూ. రథక్షోభాత్ - సన్ధిపర్వశైథిల్య - హనునాసాకర్ణశిరశ్శూల-తోద-కుక్షిక్షోభాఽఽటోపాఽఽన్త్రకూజనాఽఽధ్మాన హృదయేన్ద్రియోపరోధ - స్ఫిక్ పార్శ్వవఙ్క్షణ వృషణకటీ పృష్ఠవేదనా-సన్ధిస్కన్ధగ్రీవాదౌర్బల్యాఽఙ్గాఽభితాప - పాదశోఫప్రస్వాప హర్షణాదయః. ౧౫

వ్యా. రథసంక్షోభమువలన—కీళ్లయందును, వేళ్లు మున్నగువాని గణుపుల యందును శిథిలత్వము (సడలి బిగిచెడి యుండుట), అంకిళ్లయందును, ముక్కునందును, చెవులయందును, శిరస్సునందును నొప్పియు పోటును కల్గుట, కుక్షియందు సంక్షోభము, ప్రేగులలో కూతలు కడుపుబ్బరము హృదయమునందు చలనము లేకుండుట, చక్షురాదీంద్రియములవ్యాపారముల కాటంకము, పిరుదులయందును ఇరుప్రక్కల యందును గెజ్జలయందును వృషణములయందును నడుమునందును వీపునందును బాధ, కీళ్లయందును మూపులయందును కంఠము (మెడ) యందును బలహీనత, శరీరమునందంతట బలహీనతయు మంటయు, మిగాళ్లయందు శోఫము, స్పర్శము నెరుంగజాలకుండుట, పాదహర్షము (కాళ్లయందు జలజలమనునట్లు తిమ్మిరి), ఇవి మున్నగు సర్వాంగవ్యాధులు సంభవించును.

## (3) అతిచంక్రమణమున గల్గువ్యాధులు.

మూ. అతిచఙ్క్రమణాత్ - పాదజఙ్ఘోరుజానువఙ్క్షణశ్రోణీపృష్ఠ శూల-
సక్థిసాద - నిస్తోద-పిణ్డికోద్వేష్టన - అఙ్గమర్దాఽంసాభితాప - సిరా
ధమనీహర్ష - శ్వాసకాసాదయః స్యుః. ౧౬

వ్యా. అధికముగ సంచరించుటవలన—పాదములయందును పిక్కలయందును తొడలయందును, మోకాళ్లయందును గెజ్జలయందును పిరుదులయందును వీపునందును శూలనొప్పి, తొడయందు కృశతయు సూదులగ్రుచ్చినవిధముగ పోటును, పిక్కల (చిరుదొడల) యందు మెలిబెట్టినవిధముగ బాధయు, ఒడలినొప్పులు, మూపులయందు మంట, సిరలయందును ధమనులయందును హర్షము (జిలజిల యనుబాధ), శ్వాసకాసము, ఇవి మున్నగుబాధలు కల్గును.

## (4) అత్యాసనముచే గల్గువ్యాధులు.

మూ. అత్యాసనాత్ రథక్షోభజాః - స్ఫిక్ - పార్శ్వ - వఙ్క్షణ-వృషణ-
కటీపృష్ఠవేదనాదయః స్యుః. ౧౭

వ్యా. అధికముగ కూర్చుని యుండుటవలన రథసంక్షోభముచే సంభవించువ్యాధులలో పిరుదులయందును ఇరుప్రక్కలయందును గెజ్జలయందును వృషణములయందును నడుమునందును వీపునందును వేదన, ఇవి మొదలగు రథసంక్షోభవ్యాధులన్నియు కల్గును. (ఇచ్చట ''రథక్షోభజాః'' అనిమాత్రము చెప్పినయెడ సంధిపర్వశైథిల్యము మున్నగు వ్యాధులుకూడ గ్రహింపబడును కావున వాని నివృత్తికై ''రథక్షోభజాః స్ఫిక్పార్శ్వ ......వేదనాదయః'' అని నిర్దేశింపబడినది.)

## (5) అజీర్ణ-అధ్యశనములచే గల్గువ్యాధులు.

మూ. అజీర్ణాఽధ్యశనాభ్యాం తు—ముఖశోషాఽఽధ్మాన-శూల-నిస్తోద
పిపాసా - గాత్రసాద - చ్ఛర్ద్యతీసార - మూర్ఛా - జ్వర - ప్రవా
హణాఽఽమ విషాదయః ౧౮

వ్యా. అజీర్ణభోజనముచేతను అధ్యశనముచేతను—నోరెండుట, కడుపుబ్బరము, కడుపులో శూలయు, పోటును, డప్పి, ఒడలినొప్పులు, వాంతి, అతిసారము, మూర్ఛ, జ్వరము, ప్రవాహణము (బంకవిరేచనము), ఆమవిషము (జీర్ణముకానిపదార్థము విషరూపముగ పరిణమించుట), ఇవి మున్నగు ఆమజనితరోగములు కల్గును.

ఇచ్చట జీర్ణముకాని రసశేషమున్నప్పుడు మరల భుజించుట అజీర్ణాశనమనియు, భుజించినవెంటనే మరల భుజించుట అధ్యశనమనియు తెలుసుకొనదగినది. ఈరెంటిచే గల్గు వ్యాధులు ఒకజాతిగ నుండుటచే నిచ్చట రెండును నిర్దేశింపబడినది.

## (6) విషమ-అహితాశనములచే గల్గువ్యాధులు.

మూ. విషమాఽహితాశనాభ్యాం— అనన్నాఽభిలాష - దౌర్బల్య-
వైవర్ణ్య - కణ్డూ-పామా - గాత్రాఽవసాద-వాతాది ప్రకోప
జాశ్చ, గ్రహణ్యర్శోవికారాదయః. ౧౯

వ్యా. విషమాశనము (అకాలభోజనము)చేతను అహితాశనము (అసాత్మ్యాహారము)చేతను— అన్నముపై యభిలాషలేకుండుట, బలహీనము, శరీరమున వర్ణముమారుట, జిల, గజ్జి, ఒడలినొప్పులు, వాతాదిదోషప్రకోపమున జనించుఇతరవ్యాధులు, గ్రహణీరోగము, అర్శోరోగములు ఇవి మున్నగువ్యాధులు సంభవించును. (ఇచ్చట విషమాశన-అహితాశనములచే గల్గువ్యాధులు సమానములుకావున విషమాశనమును నిర్దేశింపకున్నను ఇచ్చట చెప్పబడినది.)

## (7) దివాస్వప్నముచే గల్గువ్యాధులు.

మూ. దివాస్వప్నాత్.—అరోచకాఽవిపాకాఽగ్నినాశ - స్త్తైమిత్య
పాణ్డుత్వ, కణ్డూ-పామా - దాహ-చ్ఛర్ద్యఙ్గమర్ద - హృత్ స్తమ్భ-
జాడ్య-తన్ద్రా- నిద్రాఽప్రసఙ్గ - గ్రన్థిజన్మ - దౌర్బల్య - రక్త
మూత్రాఽక్షితా-తాలులేపాః, (పిపాసా చ.) ౨౦

వ్యా. పగటిపూట నిదురించుటవలన.—అరోచకము, అజీర్ణము, అగ్నినాశము, జడత్వము, పాండుత్వము, జిల, గజ్జి, సంతాపము, వాంతి, ఒడలినొప్పులు, హృదయము (మామూలుగనుండు)స్పందనము,లేక స్తంభించి యుండుట, పనులయం దాలస్యము, తంద్ర (కునికిపాటు), నిదుర బట్టకుండుట, గ్రంథులు పుట్టుట, బలహీనము, మూత్రంబు ఎఱ్ఱనై యుండుట, కన్నులు ఎఱ్ఱబారుట, తాలువులు జిగురుకల్గి అంటికొనుట, దప్పి అనునీశ్లేష్మరోగములు సంభవించును.

## (8) మైథునముచే గల్గువ్యాధులు.

మూ. వ్యవాయాత్ :— ఆశు బలనాశోరుసాద - శిరోవస్తిగుదమేఢ్ర
వఙ్క్షణోరుజాను జఙ్ఘాపాదశూల - హృదయస్పన్దన - నేత్రపీడాఽ

జ్గశైథిల్య - శుక్రమార్గశోణితాఽఽగమన - కాస-శ్వాస - శోణి
తష్ఠీవన - స్వరాఽవసాద - కటీదౌర్బల్యైకాఽఙ్గసర్వాఙ్గరోగ
ముష్కశ్వయథు- వాతవర్చోమూత్రసఙ్గ - శుక్రవిసర్గ - జాడ్య-
వేపథు - బాధిర్య-విషాదాదయస్స్యుః; అవలుప్యత ఇవ గుదః,
తాడ్యత ఇవ మేఢ్రం, అవసీదతీవ మనః, వేపతే హృదయం,
పీడ్యన్తే సన్ధయః, తమః ప్రవేశ్యత ఇవ చ. ౨౧
ఇత్యేవ మేభిరష్టభిరపచారైః ఏతే ప్రాదుర్భవన్తి ఉపద్రవాః. ౨౨

వ్యా. మైథునమువలన—శరీరబలము వెంటనే క్షీణించుట, తొడలు నొప్పి, శిరస్సు వస్తి గుదము మేఢ్రము గెజ్జలు తొడలు మోకాళ్లు పిక్కలు పాదములు అను నీయవయవములయందు శూలనొప్పి, గుండె అధికముగ నదరుట, కండ్లబాధ, అవయవములు శిథిలములుగ నుండుట, శుక్రము వెడలుమార్గమునుండి రక్తము స్రవించుట, కాస శ్వాసములు, నోట రక్తము వెడలుట, కంఠస్వరము హీనమగుట, నడుము బలహీనమగుట, ఏకాంగవాతరోగములు, సర్వాంగవాతరోగములు, వృషణములయందు వాపు, వాత-మూత్ర-పురీషములు వెడలక బద్ధగించుట, శుక్రము తనంతటనే స్రవించుట, అలసత, శరీరకంపము, చెవుడు, మనోవ్యాకులము అను నీరోగములు కల్గును.

మరియు గుదస్థానమున చీలువబడినట్లు బాధ కల్గును. మేఢ్రమున కొట్టినవిధముగ బాధ జనించును. మనస్సు నశించినవిధముగ తనవ్యాపారమును మాని యుండును. గుండె తటతట గొట్టికొనుచు కదలుచుండును. కీళ్లన్నియు నొప్పికల్గియుండును. చీకటిలో నున్న విధమున నేమియు దెలియక మైకము గ్రమ్మును.

ఇత్తెరంగున నుద్దేశానుసారముగ పైజెప్పబడిన ఉచ్చైర్భాషణము మున్నగు నెనిమిది యపచారములచే వేరువేరుగ జనించు నీయుపద్రవములు ఎనిమిదియు వరుసగ వివరింపబడినవి.

(1) పైజెప్పినయెనిమిదింటికి వరుసగ చికిత్సితము.
అందు ఉచ్చైర్భాష్య-అతిభాష్యలచికిత్స.

మూ. తేషాం సిద్ధిః.—తత్ర ఉచ్చైర్భాష్యాఽతిభాష్యజానాం, అభ్య
ఙ్గ-స్వేదోపనాహధూమనస్యో పరిభక్తస్నేహపాన - రసక్షీరాదిః
వాతహరః సర్వో విధిః మౌనం చ. ౨౩

వ్యా. పైజెప్పబడిన ఉచ్చైర్భాష్యాదు లెనిమిదిటిచే వేరువేరుగ గల్గినరోగములకు చికిత్స యీ క్రింద వేరువేరుగ జెప్పబడును.—అందు బిగ్గరగ మాటలాడుటచేతను అధికముగ మాటలాడుటచేతను సంభవించు శిరస్తాపాది వ్యాధులయందు అభ్యంగనము, స్వేదము, ఉపనాహము, ధూమపానము, నస్యవిధి, భుజించినపిదప స్నేహపానము, మాంసరసము, క్షీరపానము ఇవి మున్నగుచికిత్సలును, వాతహరములగు నన్నిచికిత్సలును, మౌనమును బూని యుండుటయు, యుక్తములుగ నుండును. (ఇచ్చట సిద్ధియన సాధనభూతమైన చికిత్స యని యర్థము.)

2-3-4 రథసంక్షోభ-చంక్రమణ-అత్యాసనములచే గల్గువ్యాధులచికిత్స.

మూ. రథక్షోభాతిచఙ్క్రమణాఽత్యాసనజానాం స్నేహస్వేదాదివాతహరం సర్వం నిదానవర్జనం చ. ౨౪

వ్యా. రథసంక్షోభ-అతిచంక్రమణ-అత్యాసనములచే గల్గినవ్యాధులకు స్నేహము స్వేదము మున్నగు వాతవ్యాధిహరచికిత్సావిధానమంతయును, నిదానమును (వ్యాధికి కారణములుగ జెప్పబడిన రథయాన అతిచంక్రమణ అత్యాసనముల) మానియుండుటయు తగినచికిత్స యగును. ఇచ్చట ''సంక్షేపతః క్రియాయోగో నిదాన పరివర్జనమ్'' అను పద్ధతిప్రకారము ఆయావ్యాధుల కారణముల వర్జించుట మంచిదని 'నిదానవర్జనంచ' అని చెప్పబడినది.

(5) అజీర్ణ-అధ్యశనములచే గల్గినవ్యాధులచికిత్స.

మూ. అజీర్ణాఽధ్యశనజానాం నిరవశేషతః ఛర్దనం, రూక్షః స్వేదః, లఙ్ఘనీయ - పాచనీయ - దీపనీయౌషధాఽవచారణం చ. ౨౫

వ్యా. అజీర్ణ-అధ్యశనములచే గల్గినవ్యాధులకు అజీర్ణాహారశేషము బొత్తుగ బైట వెడలునట్లు వాంతి చేయుటయు, రూక్షమైన స్వేదనమును చేయుటయు, లంఘనీయములును,పాచనీయములును, దీపనీయములును నగునౌషధముల నుపయోగించుటయు తగిన చికిత్స యగును.

(6) విషమ-అహితాశనములచే గల్గువ్యాధులచికిత్స.

మూ. విషమాఽహితాశనజానాం యథాస్వం దోషహరాః క్రియాః ౨౬

వ్యా. విషమాశన - అహితాశనములచే గల్గిన వాతికాది దోషజవ్యాధులయందు ఆయాదోషముల హరింప సమర్థములైన చికిత్సల చేయునది.

### (7) పవలు నిదురించుటచే గల్గిన శ్లైష్మికవ్యాధులచికిత్స.

మూ. దివాస్వప్నజానాం ధూమపాన - లఙ్ఘన - వమన - శిరోవిరేచన- వ్యాయామ - రూక్షాశనాఽరిష్ట దీపనీయౌషధోపయోగః, ప్రఘర్షణోన్మర్దన - పరిషేచనాదిశ్చ, శ్లేష్మహరస్సర్వో విధిః. ౨౭

వ్యా. పగలు నిదురించుటచే గల్గిన శ్లైష్మికవ్యాధులయందు ధూమపానము, లంఘనము, వమనము, శిరోవిరేచన నస్యకర్మ, దేహపరిశ్రమము, రూక్షములైన యాహారములను అరిష్టములను సేవించుట, దీపనీయములగు నౌషధముల సేవించుట, ఇవియన్నియు మిక్కిలి హితకరములు. మరియు ప్రఘర్షణము, శరీరమును నలుగుపిండి మొదలగువానిచే రుద్దుట, మర్దించుట, పరిషేకములు మున్నగు కఫహరచికిత్సలన్నియు మిక్కిలి హితకరములు.

### (8) స్త్రీసంభోగముచే గల్గువ్యాధులచికిత్స

మూ. మైథునజానాం జీవనీయసిద్ధయోః క్షీరసర్పిషోః ఉపయోగః, తథా వాతహరాః స్వేదాఽభ్యఙ్గోపనాహాః, వృష్యాశ్చాఽఽహారాః, స్నేహాః, స్నేహవిధయః యాపనావస్తయోఽనువాసనం చ; మూత్రవైకృతవస్తిశూలేషు చోత్తరవస్తిః విదారీగన్ధాదిగణ-జీవనీయక్షీరసంసిద్ధం తైలం స్యాత్, యాపనాశ్చ వస్తయః సర్వకాలం దేయాః. ౨౮

వ్యా. మైథునముచే సంభవించిన బలక్షీణాది రోగములయందు జీవనీయగణద్రవ్యముల జేర్చి పక్వముచేయబడిన క్షీరమును, ఘృతమును ఉపయోగింపవలెను. మరియు వాతహరములగు స్వేదవిధులును, అభ్యంగనమును, ఉపనాహంబులును, వృష్యంబులగు నాహారంబులును, స్నేహపానంబును, స్నేహవిధులును, యాపనావస్తులును, అనువాసనంబును, మిక్కిలి యుపయోగింపదగును. మరియు సంభోగముచే నైనమూత్రకృచ్ఛ్రాది మూత్రవ్యాధులయందును వస్తిశూలమునందును విదారిగంధాది గణద్రవ్యములను జీవనీయగణద్రవ్యములను క్వాథకల్కములజేసి, యాక్వాథకల్కములను ఆవుపాలను చేర్చి విధ్యుక్తప్రకారము తైలమును సిద్ధముచేసి, యాతైలముచే నుత్తరవస్తిని విధిప్రకారము ప్రయోగించవలెను. మరియు నీక్రింద జెప్పబడు యాపనావస్తులను కాలనియమములేక సర్వకాలమందును ఉపయోగింపదగును.

ఇచ్చట నిరూహాదివస్తులకు కాలనియమము కలదుగాని అట్టికాలనియమములేక యెల్లపుడు నుపయోగింపదగినవి యాపనావస్తులని తెలుపుటకై "సర్వకాలం దేయాః" అని చెప్పబడినది. యాపనావస్తియనః—"ఆయుషో యాపనం (దీర్ఘకాలానువర్తనం) కుర్వన్తీతి-యాపనాః వస్తయః" అనువిగ్రహముచేత దీర్ఘకాలము ఆయువును వృద్ధిచేసి ఆరోగ్యస్థితినుంచునవి యాపనావస్తులని యన్వర్థముగ జెప్పబడును. జీవనీయగణము స్థలాంతరమున వివరింపబడినది.

(ఇత్తెరంగున "తేషాం విస్తరశో లిఙ్గం ఏకైకస్య చ భేషజం" అని నిర్దేశించిన ప్రకారము శోధనము చేసినప్పుడు అపచారములచే గల్గువ్యాధులును వానిచికిత్సితములును వివరింపబడినవి. పిమ్మట అధ్యాయారంభమున ప్రతిజ్ఞచేయబడినప్రకారము ఉత్తమను లైన యాపనావస్తులు ఈక్రింద వివరింపబడును.)

## (1) ఒక్కొకయోగమువంతున నిర్దేశింపబడిన యాపనవస్తులు ఇరువదితొమ్మిది. (29). అందు ముస్తాదియాపనవస్తి.

మూ. తానుపదేక్ష్యామః.— ముస్తోశీరబలారగ్వధరాస్నామఞ్జిష్ఠాకటురోహిణీత్రాయమాణా పునర్నవావిభీతక గుడూచీస్థిరాదిపఞ్చమూలాని పలికాని ఖణ్డశః క్లృప్తాని, అష్టౌ చ మదనఫలాని ప్రక్షాళ్య; జలాఢకే పరిక్వాథ్య పాదశేషో రసః; క్షీరద్విప్రస్థసంయుక్తః పునః శృతః క్షీరావశేషః; పాదజాఙ్గలరసః, తుల్యమధుఘృతయుతః,శతకుసుమామధుకకుటజఫలరసాఞ్జన ప్రియఙ్గుకల్కీకృతః, ససైన్ధవః, సుఖోష్ణో వస్తిః; శుక్రమాంస బలజననః, క్షతక్షీణకాస గుల్మ శూలవిషమజ్వర బ్రధ్న (వర్ధ్మ) కుణ్డలోదావర్త కుక్షిశూల, మూత్రకృచ్ఛ్రాసృగ్దరజో విసర్పప్రవాహికా శిరోరుజా జానూరు జఙ్ఘావస్తిగ్రహాశ్మర్యున్మాదార్శః ప్రమేహాధ్మానవాతరక్త పిత్తశ్లేష్మవ్యాధిహరః సద్యోబలజననో రసాయనశ్చేతి. ౨౯

వ్యా. పైననిర్దేశింపబడిన యాపనవస్తులు యీక్రింద చెప్పబడును:—తుంగ గెడ్డలు, వట్టివేళ్లు, చిట్టాముట్టి, రేలకాయగిజరు, సన్నరాష్ట్రము, మంజిష్ఠి, కటుకరోహిణి, కలుక్రానుగ, గలిజేరు, తానికాయలు, తిప్పతీగె, స్థిరాది (హ్రస్వ) పఞ్చమూలములు ఇవి

## (7) పవలు నిదురించుటచే గల్గిన శ్లైష్మికవ్యాధులచికిత్స.

మూ. దివాస్వప్నజానాం ధూమపాన - లఙ్ఘన - వమన - శిరోవిరేచన- వ్యాయామ - రూక్షాశనాఽరిష్ట దీపనీయౌషధోపయోగః, ప్రఘర్షణోన్మర్దన - పరిషేచనాదిశ్చ, శ్లేష్మహరస్సర్వో విధిః. ౨౭

వ్యా. పగలు నిదురించుటచే గల్గిన శ్లైష్మికవ్యాధులయందు ధూమపానము, లంఘనము, వమనము, శిరోవిరేచన నస్యకర్మ, దేహపరిశ్రమము, రూక్షములైన యాహారములను అరిష్టములను సేవించుట, దీపనీయములగు నౌషధముల సేవించుట, ఇవియన్నియు మిక్కిలి హితకరములు. మరియు ప్రఘర్షణము, శరీరమును నలుగుపిండి మొదలగువానిచే రుద్దుట, మర్దించుట, పరిషేకములు మున్నగు కఫహరచికిత్సలన్నియు మిక్కిలి హితకరములు.

## (8) స్త్రీసంభోగముచే గల్గువ్యాధులచికిత్స

మూ. మైథునజానాం జీవనీయసిద్ధయోః క్షీరసర్పిషోః ఉపయోగః, తథా వాతహరాః స్వేదాఽభ్యఙ్గోపనాహాః, వృష్యాశ్చాఽఽహారాః, స్నేహాః, స్నేహవిధయః యాపనావస్తయోఽనువాసనం చ; మూత్రవైకృతవస్తిశూలేషు చోత్తరవస్తిః విదారీగన్ధాదిగణ-జీవనీయక్షీరసంసిద్ధం తైలం స్యాత్, యాపనాశ్చ వస్తయః సర్వకాలం దేయాః. ౨౮

వ్యా. మైథునముచే సంభవించిన బలక్షీణాది రోగములయందు జీవనీయగణద్రవ్యముల జేర్చి పక్వముచేయబడిన క్షీరమును, ఘృతమును ఉపయోగింపవలెను. మరియు వాతహరములగు స్వేదవిధులును, అభ్యంగనమును, ఉపనాహంబులును, వృష్యంబులగు నాహారంబులును, స్నేహపానంబును, స్నేహవిధులును, యాపనావస్తులును, అనువాసనంబును, మిక్కిలి యుపయోగింపదగును. మరియు సంభోగముచే నైనమూత్రకృచ్ఛ్రాది మూత్రవ్యాధులయందును వస్తిశూలమునందును విదారిగంధాది గణద్రవ్యములను జీవనీయగణద్రవ్యములను క్వాథకల్కములజేసి, యాక్వాథకల్కములను ఆవుపాలను చేర్చి విధ్యుక్తప్రకారము తైలమును సిద్ధముచేసి, యాతైలముచే నుత్తరవస్తిని విధిప్రకారము ప్రయోగించవలెను. మరియు నీక్రింద జెప్పబడు యాపనావస్తులను కాలనియమములేక సర్వకాలమందును ఉపయోగింపదగును.

ఇచ్చట నిరూహాదివస్తులకు కాలనియమము కలదుగాని అట్టికాలనియమములేక యెల్లపుడు నుపయోగింపదగినవి యాపనావస్తులని తెలుపుటకై "సర్వకాలం దేయాః" అని చెప్పబడినది. యాపనావస్తియన:—"ఆయుషో యాపనం (దీర్ఘకాలానువర్తనం) కుర్వన్తీతి-యాపనాః వస్తయః" అనువిగ్రహముచేత దీర్ఘకాలము ఆయువును వృద్ధిచేసి ఆరోగ్యస్థితినుంచునవి యాపనావస్తులని యన్వర్థముగా జెప్పబడును. జీవనీయగణము స్థలాంతరమున వివరింపబడినది.

(ఇత్తెరంగున "తేషాం విస్తరశో లిఙ్గం ప్రత్యేకస్య చ భేషజం" అని నిర్దేశించిన ప్రకారము శోధనము చేసినప్పుడు అపచారములచే గల్గువ్యాధులును వానిచికిత్సితములును వివరింపబడినవి. పిమ్మట అధ్యాయారంభమున ప్రతిజ్ఞచేయబడినప్రకారము ఉత్తమనులైన యాపనావస్తులు ఈక్రింద వివరింపబడును.)

(1) ఒక్కొకయోగమువంతున నిర్దేశింపబడిన యాపనవస్తులు ఇరువదితొమ్మిది. (29). అందు ముస్తాదియాపనవస్తి.

మూ. తానుపదేక్ష్యామః.— ముస్తోశీరబలారగ్వధరాస్నామఞ్జిష్ఠాకటురోహిణీత్రాయమాణా పునర్నవావిభీతక గుడూచీస్థిరాదిపఞ్చమూలాని పలికాని ఖణ్డశః క్లృప్తాని, అష్టౌ చ మదనఫలాని ప్రక్షాళ్య; జలాఢకే పరిక్వాథ్య పాదశేషో రసః; క్షీరద్విప్రస్థసంయుక్తః పునః శృతః క్షీరావశేషః; పాదజాఙ్గలరసః, తుల్యమధుఘృతయుతః,శతకుసుమామధుకకుటజఫలరసాఞ్జన ప్రియఙ్గుకల్కీకృతః, ససైన్ధవః, సుఖోష్ణో వస్తిః; శుక్రమాంస బలజననః, క్షతక్షీణకాస గుల్మ శూలవిషమజ్వర బ్రధ్న (వర్ధ్మ) కుణ్డలోదావర్త కుక్షిశూల, మూత్రకృచ్ఛ్రాసృగ్రజో విసర్పప్రవాహికా శిరోరుజా జానూరు జఙ్ఘావస్తిగ్రహాశ్మర్యున్మాదార్శః ప్రమేహాధ్మానవాతరక్త పిత్తశ్లేష్మవ్యాధిహరః సద్యోబలజననో రసాయనశ్చేతి. ౨౯

వ్యా. పైననిర్దేశింపబడిన యాపనవస్తులు యీక్రింద చెప్పబడును:—తుంగగెడ్డలు, పట్టివేళ్లు, చిట్టాముట్టి, రేలకాయగిజరు, సన్నరాష్టము, మంజిష్ఠి, కటుకరోహిణి, కలుత్రానుగ, గలిజేరు, తానికాయలు, తిప్పతీగె, స్థిరాది (హ్రస్వ) పఞ్చమూలములు ఇవి

బృహతీ కణ్టకారీ శతావరీ చ్ఛిన్నరుహాః శృతేన పయసా,
మధుకమదనపిప్పలీకల్కేన పూర్వవద్వస్తిః. 30

వ్యా. గోరంటవేరు, చిట్టాముట్టివేరు, దర్భవేరు, సుగంధిపాలవేరు వీనిని సమభాగములుగగూర్చి నలుగగొట్టి అవుపాలలో కలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వము చేసి వడగట్టి పైజెప్పినరీతిగా వస్త్యౌషధమును సిద్ధముచేసి వస్తిప్రయోగము చేయునది. (ఇది మూడవవస్తియోగము.)

ములకవేరు, వాకుడువేరు, పిల్లిపీచరగడ్డలు, తిప్పతీగె వీనిని సమభాగములుగ గూర్చి నలుగగొట్టి పాలలో గలిపి పైజెప్పినరీతిగ సిద్ధముచేసి, అందు అతిమధురము, మ్రంగకాయలు, పిప్పళ్లు వీనిని సమభాగములుగ కల్కముచేసి కలిపి పైజెప్పినరీతిగ వస్తిప్రయోగము చేయనగును. (ఇది నాల్గవవస్తియోగము.)

ఈవస్తియోగములరెంటిని ప్రత్యేకఫలవిశేష నిర్దేశములేదుగాన వస్తి సామాన్యముగ "ఇత్యేతే వస్తయః" అని యుపక్రమించి చెప్పబడుఫలము నెరుంగునది.

(5) బలాదియాపనవస్తి.

మూ. తథా బలాఽతిబలా-విదారీ - శాలిపర్ణీ - పృశ్నిపర్ణీ - బృహతీ-
కణ్టకారికా - దర్భమూల - పరూషక - కాశ్మర్య - బిల్వఫల-యవ
సిద్ధేన-పయసా; మధూ (ధు)కమదనకల్కేన, మధు - ఘృత -
సౌవర్చలయుక్తేన కాస - జ్వర - గుల్మ - ప్లీ, హార్దితస్త్రీమద్యక్లి
ష్టానాం సద్యోబలజననో, రసాయనశ్చ. 31

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, పెద్దగుమ్మడి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, దర్భవేళ్లు, చిట్టీత, నేలగుమ్మడి,మారేడుకాయ, యవలు వీనిని సమభాగములుగ గూర్చి నలుగగొట్టి, ఆవుపాలలోకలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వముచేసి వడగట్టి, అందు అతిమధురమును మ్రంగకాయలను కల్కముచేసి కలిపి, తేనెను నేతిని సౌవర్చలలవణమును కూడ కలిపి, విధ్యుక్తప్రకారము వస్తిని ప్రయోగించునది. ఇయ్యది కాసము, జ్వరము, గుల్మము, ప్లీహము అను నీరోగములచే పీడింపబడినవారికిని, స్త్రీసంభోగముచేతను మద్యపానముచేతను కృశించినవారికిని వెంటనే బలమును కల్గించును. రసాయనం బగును. (ఇది యైదవవస్తియోగము.)

## (6) బలాదియాపనవస్తి రెండవయోగము.

మూ. బలాతిబలారాస్నారగ్వధమదనబిల్వగుడూచీ పునర్నవైరణ్డాశ్వగన్ధాసహాచరపలాశదేవదారు ద్విపఞ్చమూలాని పలికాని; యవకోలకులుత్థద్విప్రసృతం శుష్కమూలకానాం చ జలద్రోణసిద్ధం నిరూహప్రమాణావశేషం కషాయం పూతం మధుకమదనశతపుష్పా కుష్ఠపిప్పలీవచావత్సకఫలరసాఞ్జనప్రియఙ్గుయవానీకల్కీకృతం గుడఘృతతైలక్షౌద్రక్షీరమాంసరసామ్లం కాఞ్జికసైన్ధవయుక్తం సుఖోష్ణం వస్తిం దద్యాత్; శుక్రమూత్రవర్చస్సఙ్గేఽనిలజే, గుల్మహృద్రోగాధ్మాన బ్రధ్నపార్శ్వ పృష్ఠకటీగ్రహసంజ్ఞానాశబలక్షయేషు చ. 33

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, సన్నరాష్ట్రము, రేల, మ్రంగకాయ, బిల్వకాయ, తిప్పతీగె, గలిజేరు, ఆముదపువేళ్లు, పెన్నేరుగెడ్డ, గోరింటవేళ్లు, మోదుగపట్ట, దేవదారు చెక్క, మహాపంచమూలములు, హ్రస్వపంచమూలములు ఇవియన్నియు ఒక్కొక్కటి ఒక్కొక్కపలము; యవలు, రేగుగింజలు, ఉలవలు ఇవి ప్రత్యేకము నాలుగేసిపలములు; ఎండుముల్లంగియు నాలుగుపలములు; ఈభాగముల ప్రకారము వీనినన్నిటిని చేర్చి నలుగగొట్టి ద్రోణపరిమితమైన జలమున చేర్చి నిరూహవస్తి మూడుపుటములకు వలసినంతకషాయము మిగులునట్లు (క్వాథపరిభాషానుసారముగ) కషాయము కాచి వడగట్టి యుంచుకొని, అందు అతిమధురము, మ్రంగకాయలు, సదాపవిత్తులు, చెంగల్వకోష్ఠు, పిప్పళ్లు, వస, కొడిసెపాలవిత్తులు, రసాంజనము, ప్రేంకణము, ఓమము ఈద్రవ్యములను సమభాగములుగనూర్చి ఆవాపకల్కముగచేసి కల్పునది. మరియు బెల్లము, నెయ్యి, నూనె, తేనె, ఆవుపాలు, మాంసరసము, (అమ్లకాంజికము) పులిగంజి, సైంధవలవణము ఈద్రవ్యములను వానివానికి విధించినపరిమాణానుసారముగ పైవస్త్యౌషధక్వాథమున కలిపి సుఖోష్ణముగ చల్లనార్చి వస్తిప్రయోగము చేయునది. ఇయ్యది వాతముచే కల్గిన శుక్రమూత్ర - పురీషములయొక్క బద్ధకమునందును, గుల్మము, హృద్రోగము, ఆధ్మానము, బ్రధ్నరోగము, ప్రక్కనొప్పి, వీపునొప్పి, కడుపునొప్పి, ప్రజ్ఞతప్పుట, బలక్షయము అను నీవ్యాధులయందును నుపయోగింపదగును. (ఇయ్యది యాపనవస్తియోగము. ఇచ్చట పుటత్రయములకుచేరి నిరూహవస్తి కషాయప్రమాణము ఐదుప్రసృతములు (పదిపలములు) అని నిరూహసామాన్యముగ విధింపబడినది కావున 'నిరూహప్రమాణావశేషం' అను పదమునకు పదిపలములు మిగులునట్లు క్వాథము చేయవలయునని యెరుంగునది.)

బృహతీ కణ్టకారీ శతావరీ చ్ఛిన్నరుహా శృతేన పయసా,
మధుకమదనపిప్పలీకల్కితేన పూర్వవద్వస్తిః. 30

వ్యా. గోరంటవేరు, చిట్టాముట్టివేరు, దర్భవేరు, సుగంధిపాలవేరు వీనిని సమభాగములుగగూర్చి నలుగగొట్టి ఆవుపాలలో కలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వము చేసి వడగట్టి పైజెప్పినరీతిగా వస్త్యౌషధమును సిద్ధముచేసి వస్తిప్రయోగము చేయునది. (ఇది మూడవవస్తియోగము.)

ములకవేరు, వాకుడువేరు, పిల్లిపీచరగడ్డలు, తిప్పతీగె వీనిని సమభాగములుగ గూర్చి నలుగగొట్టి పాలలో గలిపి పైజెప్పినరీతిగ సిద్ధముచేసి, అందు అతిమధురము, మ్రంగకాయలు, పిప్పళ్లు వీనిని సమభాగములుగ కల్కముచేసి కలిపి పైజెప్పినరీతిగ వస్తిప్రయోగము చేయనగును. (ఇది నాల్గవవస్తియోగము.)

ఈవస్తియోగములరెంటిని ప్రత్యేకఫలవిశేష నిర్దేశములేదుగాన వస్తి సామాన్యముగ ''ఇత్యేతే వస్తయః'' అని యుపక్రమించి చెప్పబడుఫలము నెరుంగునది.

(5) బలాదియాపనవస్తి.

మూ. తథా బలాఽతిబలా-విదారీ - శాలిపర్ణీ - పృశ్నిపర్ణీ - బృహతీ-కణ్టకారికా - దర్భమూల - పరూషక - కాశ్మర్య - బిల్వఫల-యవసిద్ధేన-పయసా; మధూ (ధు)కమదనకల్కితేన, మధు - ఘృత - సౌవర్చలయుక్తేన కాస - జ్వర - గుల్మ - ప్లీ, హార్దితస్త్రీమద్యక్లిష్టానాం సద్యోబలజననో, రసాయనశ్చ. 32

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, పెద్దగుమ్మడి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, దర్భవేళ్లు, చిట్టీత, నేలగుమ్మడి,మారేడుకాయ, యవలు వీనిని సమభాగములుగ గూర్చి నలుగగొట్టి, ఆవుపాలలోకలిపి క్షీరపాకవిధిప్రకారము పక్వముచేసి వడగట్టి, అందు అతిమధురమును మ్రంగకాయలను కల్కముచేసి కలిపి, తేనెను నేతిని సౌవర్చలలవణమును కూడ కలిపి, విధ్యుక్తప్రకారము వస్తిని ప్రయోగించునది. ఇయ్యది కాసము, జ్వరము, గుల్మము, ప్లీహము అను నీరోగములచే పీడింపబడినవారికిని, స్త్రీసంభోగముచేతను మద్యపానముచేతను కృశించినవారికిని వెంటనే బలమును కల్గించును. రసాయనం బగును. (ఇది యైదవవస్తియోగము.)

(6) బలాదియాపనవస్తి రెండవయోగము.

మూ॥ బలాతిబలారాస్నారగ్వధమదనబిల్వగుడూచీ పునర్నవైరణ్డాశ్వగన్ధాసహచరపలాశదేవదారు ద్విపఞ్చమూలాని పలికాని; యవకోలకులుత్థద్విప్రసృతం శుష్కమూలకానాం చ జలద్రోణసిద్ధం నిరూహప్రమాణావశేషం కషాయం పూతం మధుకమదనశతపుష్పా కుష్ఠపిప్పలీవచావత్సకఫలరసాఞ్జనప్రియఙ్గుయవానీకల్కీకృతం గుడఘృతతైలక్షౌద్రక్షీరమాంసరసామ్లం కాఞ్జికసైన్ధవయుక్తం సుఖోష్ణం వస్తిం దద్యాత్; శుక్రమూత్రవర్చస్సఙ్గేఽనిలజే, గుల్మహృద్రోగాధ్మాన బ్రధ్నపార్శ్వ పృష్ఠకటీగ్రహసంజ్ఞానాశబలక్షయేషు చ. 33

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, సన్నరాష్ట్రము, రేల, మ్రంగకాయ, బిల్వకాయ, తిప్పతీగె, గలిజేరు, ఆముదపువేళ్లు, పెన్నేరుగెడ్డ, గోరింటవేళ్లు, మోదుగపట్ట, దేవదారుచెక్క, మహాపంచమూలములు, హ్రస్వపంచమూలములు ఇవియన్నియు ఒక్కొక్కటి ఒక్కొక్కపలము; యవలు, రేగుగింజలు, ఉలవలు ఇవి ప్రత్యేకము నాలుగేసిపలములు; యెండుముల్లంగియు నాలుగుపలములు; ఈభాగములప్రకారము వీనినన్నిటిని చేర్చి నలుగగొట్టి ద్రోణపరిమితమైన జలమున చేర్చి నిరూహవస్తి మూడుపుటములకు వలసినంతకషాయము మిగులునట్లు (క్వాథపరిభాషానుసారముగ) కషాయము కాచి వడగట్టియుంచుకొని, అందు అతిమధురము, మ్రంగకాయలు, సదాపవిత్తులు, చెంగల్వకోష్ఠు, పిప్పళ్లు, వస, కొడిసెపాలవిత్తులు, రసాంజనము, ప్రేంకణము, ఓమము ఈద్రవ్యములను సమభాగములుగగూర్చి ఆవాపకల్కముగచేసి కల్పునది. మరియు బెల్లము, నెయ్యి, నూనె, తేనె, ఆవుపాలు, మాంసరసము, (అమ్లకాంజికము) పులిగంజి, సైంధవలవణము ఈద్రవ్యములను వానివానికి విధించినపరిమాణానుసారముగ పైవస్త్యౌషధక్వాథమున కలిపి సుఖోష్ణముగ చల్లనార్చి వస్తిప్రయోగము చేయునది. ఇయ్యది వాతముచే కల్గిన శుక్రమూత్ర - పురీషములయొక్క బద్ధకమునందును, గుల్మము, హృద్రోగము, ఆధ్మానము, బ్రధ్నరోగము, ప్రక్కనొప్పి, వీపునొప్పి, కడుపునొప్పి, ప్రజ్ఞతప్పుట, బలక్షయము అను నీవ్యాధులయందును నుపయోగింపదగును. (ఇయ్యది మూరవవస్తియోగము. ఇచ్చట పుటత్రయములకుచేరి నిరూహవస్తి కషాయప్రమాణము ఐదుప్రసృతములు (పదిపలములు) అని నిరూహసామాన్యముగ విధింపబడినది కావున 'నిరూహప్రమాణావశేషం' అను పదమునకు పదిపలములు మిగులునట్లు క్వాథము చేయవలయునని యెరుంగునది.)

## (7) హపుషాదియాపనవస్తి.

మూ. హపుషార్ధకుడవో ద్విగుణార్ధక్షుణ్ణయవః, క్షీరోదకసిద్ధః క్షీర శేషో మధుఘృతతైలలవణయుక్తః, సర్వాఙ్గవిసృతవాతరక్తసక్త విణ్మూత్ర స్త్రీఖేదితహితో వాతహరః, బుద్ధిమేధాగ్నిబల జననశ్చ. 38

వ్యా. బోడతరము అర్ధకుడవము (రెండుపలములు), సగము మెదుగునట్లు వక్కముక్కలుగ నలియగొట్టబడిన యవలు ద్విగుణము, (నాలుగుపలములు), ఈభాగములు ప్రకారము రెంటిని కూర్చి, అందు ఆవుపాలను, జలమునుచేర్చి పాలుమాత్రము మిగులునట్లు పరిభాషానుసారముగ కషాయము కాచి వడగట్టి అందు తేనెను, నేతిని, నూనెను, సైంధవలవణమును విహితపరిమాణము ననుసరించి చేర్చి వస్తిచేయునది. ఇయ్యది సర్వ శరీరమున వ్యాపించిన వాతరక్తమునందును, మలమూత్రసంగమునందును, స్త్రీప్రసక్తిచే క్షీణశరీరులకును మిక్కిలి హితకరము. వాతమును హరించునది. బుద్ధిని, జ్ఞానమును, అగ్నిని, బలమును కల్గించును. (ఇయ్యది యేడవవస్తియోగము.)

## (8) హ్రస్వపంచమూలాది యాపనవస్తి.

మూ. హ్రస్వపఞ్చమూలీకషాయః క్షీరోదకసిద్ధగ పిప్పలీమధుకమదన కల్కీకృతః, సగుడఘృతతైలలవణః క్షీణవిషమజ్వరకర్శితస్య వస్తిః. 39

వ్యా, హ్రస్వపంచమూలములను, క్షీరోదకముల చేర్చి కషాయముకాచి, అందు పిప్పళ్లను, అతిమధురమును, మ్రంగకాయలను కల్కముగచేసి కలిపి, అందు బెల్లమును, నేతిని, నూనెను, లవణమునుకూడచేర్చి వస్తి చేయునది. ఇయ్యది ధాతువులు క్షీణించిన వారికిని, విషమజ్వరములచే కృశించినవారికిని, మిక్కిలి ప్రశస్తమైనది. ఇయ్యది యెనిమిదవవస్తియోగము.)

## (9) బలాదియాపనవస్తి మూడవయోగము.

మూ. బలాఽతిబలాఽపామార్గాఽఽత్మగుప్తాఽష్ట పలాఽర్ధక్షుణ్ణయవాఞ్జలికషాయః, సగుడఘృతతైలలవణయుక్తః, పూర్వవద్వస్తిః, స్థవిరదుర్బల-క్షీణశుక్రరుధిరాణాం పథ్యతమః. 36

వ్యా. చిట్టాముట్టి, పేరాముట్టి, ఉత్తరేణి, దూలగొండి ఇవి ప్రత్యేకము యెనిమిదేసిపలములు;సగము మెదుగునట్లు నలుగగొట్టబడిన యవలు ఒకఅంజలి(నాలుగుపలములు) వీనిని క్వాథపరిభాషానుసారముగ కషాయము కాచి వడగట్టి, అందు బెల్లమును, ఘృతమును, తైలమును, సైంధవలవణమును కలిపి పైజెప్పిన విధిప్రకారము వస్తిచేయదగును. ఈవస్తివృద్ధులకును, బలహీనులకును, ధాతువులు క్షీణించినవారికిని, శుక్రంబును రక్తంబును క్షీణించినవారికిని, మిక్కిలి హితకరంబులుగ నుండును. (ఇయ్యది తొమ్మిదియవ వస్తియోగము.)

## (10) బలాదియాపనవస్తి, (నాల్గవయోగము).

మూ. బలామధుకవిదారీదర్భమూలమృద్వీకాయవైః కషాయమాజేన పయసా పక్త్వా మధుకమదనకల్కితం సమధుఘృతసైన్ధవం జ్వరార్తేభ్యో వస్తిం దద్యాత్. 32

వ్యా. చిట్టాముట్టి, అతిమధురము, పెద్దగుమ్మడి, దర్భవేళ్లు, ద్రాక్షపండ్లు, యవలు వీనిని సమభాగములుగ గూర్చి పరిభాషానుసారముగ కషాయము కాచి వడగట్టి, దానికి సమము ఆవుపాలనుకలిపి పాలుమాత్రము మిగులునట్లుకాచి, అందు అతిమధురమును, మ్రంగకాయలును కల్కముచేసి కలిపి తేనెను ఘృతమును సైంధవలవణమును గూడ చేర్చి జ్వరపీడితులకు వస్తి నీయవలయును. (ఇయ్యది పదియవ వస్తియోగము.)

## (11) శాలిపర్ణ్యాదియాపనవస్తి.

మూ. శాలిపర్ణీ-పృశ్నిపర్ణీ-గోక్షురకమూల-కాశ్మర్య - పరూషక-ఖర్జూరఫల-మధూకపుష్పైరజాక్షీర జలప్రస్థాభ్యాం సిద్ధః కషాయః పిప్పలీమధుకోత్పలకల్కితః సఘృతసైన్ధవః క్షీణేంద్రియవిషమజ్వరకర్శితస్య వస్తిః శస్తః. 33

వ్యా. కోలపొన్న, ముయ్యాకుపొన్న, పల్లేరువేళ్లు, నేలగుమ్మడివేరు, చిట్టీతపండ్లు, ఖర్జూరపుపండ్లు, ఇప్పపూలు వీనిని సమభాగములుగగూర్చి ఒకప్రస్థము మేకపాలను, ఒకప్రస్థము జలమును కలిపి పాలుమాత్రము మిగులునట్లు కాచి సిద్ధముచేయబడిన కషాయమున పిప్పళ్లను, అతిమధురమును, నల్లకలువలును, కల్కముచేసి కలిపి, అందు ఘృతమును సైంధవలవణమును చేర్చి వస్తిప్రయోగము చేయునది. ఇయ్యది ఇంద్రియము క్షీణించినవారికిని, విషమజ్వరముచే కృశించినవారికిని మిగుల ప్రశస్తము (ఇయ్యది పదునొకండవ వస్తియోగము.)

## (12) స్థిరాది (హ్రస్వపంచమూలాది) యాపనవస్తి.

మూ. స్థిరాదిపఞ్చమూలీ పఞ్చపలేన శాలిషష్టికయవగోధూమమాష పఞ్చప్రసృతేన ఛాగం పయః శృతం పాదశేషం కుక్కుటాణ్డ రససమమధుఘృతశర్కరాసైన్ధవసౌవర్చలయుక్తో వస్తిః, వృష్య తమం బలవర్ణ (మాంస) జననశ్చ. ఇతి యాపనావస్తయో ద్వాదశ. ౭౯

వ్యా. స్థిరాది హ్రస్వపంచమూలములు ఐదును ఒక్కొక్కటి ఒక్కపలము వంతున చేరినది ఐదుపలములును, రాజనములు, అరువదినాళ్లసంబావులు, యవలు, గోధుమలు, ఉద్దులు ఈయైదును ప్రత్యేకము ఒక్కొక్కప్రసృతమువంతున చేరినవి ఐదుప్రసృతములు (పదిపలములు). వీని నన్నిటిని మేకపాలలోచేర్చి నాల్గవపాలు మిగుల కాచి, అందు కోడిగ్రుడ్లరసమునకు సమముగ తేనెను ఘృతమును చేర్చి చక్కెరను సైంధవలవణమును, సౌవర్చలలవణమును, కూడకలిపి చేయబడినవస్తి మిక్కిలి వృష్యంబును, బలమును, వర్ణంబును కల్గించునదియు నగును. (ఇది పండ్రెండవవస్తియోగము)ఇత్తెరంగున యాపనావస్తులు వరుసగ నొక్కొకటిగ చెప్పబడినవానిలో పండ్రెండు.

## { కుక్కుటాణ్డరసకల్పముననుసరించి కల్పించబడిన ఆతిదేశికయాపనవస్తులు మూడు.(3) }

మూ. కల్పశ్చైషః శిఖిగోనర్దహంసాణ్డరసేషు స్యాత్. ౮౦

వ్యా. పైజెప్పబడిన కల్పము ననుసరించి స్థిరాది పంచమూలాది సిద్ధమయిన మేకపాలయందు కోడిగ్రుడ్లరసమునకు బదులుగ నెమళ్లయొక్కయు సారసముల యొక్కయు, హంసలయొక్కయు గ్రుడ్లరసమును వేరువేరుగ జేర్చుచు వేరువేరువస్తుల మూటిని కల్పించునది. (అతిదేశరూపము లైన యీమూడువస్తియోగములును "శిఖిగోనర్దహంసాణ్డైః దక్షవత్ వస్తియః త్రయః" అని విషయసంగ్రహమున పరిగణింప బడును.)

## (13) తిత్తిర్యాది యాపనవస్తియోగము.

మూ. సతిత్తిరిః సమయూరః సరాజహంసః పఞ్చమూలీపయస్సిద్ధః, శత పుష్పా-మధుక-రాస్నా-కుటజ-మదనఫల-పిప్పలీకల్క,ఘృతతైల గుడసైన్ధవయుక్తో వస్తిః, బలవర్ణశుక్రజననో రసాయనశ్చ. ౮౧

వ్యా. తీతుకపిట్టయొక్కయు, నెమలియొక్కయు, రాజహంసములయొక్కయు, మాంసములను; పంచమూలములను చేర్చి కాచబడిన పాలయందు సదాపవిత్తులు, అతిమధురము, సన్నరాష్ట్రము, కోడిసెపాలవిత్తులు, మ్రంగకాయలు, పిప్పళ్లు వీనికల్కమును; నేతిని, నూనెను, బెల్లము, సైంధవలవణమును చేర్చి చేయబడిన యాపనవస్తి బలమును, శరీరవర్ణమును శుక్రమును కల్గించి రసాయనమగును. (ఇయ్యది పదిమూడవ యాపన వస్తియోగ మగును.)

## (14) ద్విపంచమూలాదియాపనవస్తియోగము.

మూ. ద్విపఞ్చమూలీకుక్కుటరససిద్ధం పయః పాదశేషం పిప్పలీమధుకరాస్నామదనకల్కం శర్కరామధుఘృతయుక్తం, స్త్రీష్వతికామానాం బలజననో వస్తిః. ౪౨

వ్యా. హ్రస్వమహాపంచమూలములు రెండును, కోడిగ్రుడ్డురసమును, పాలలో చేర్చి నాల్గవపాలు మిగులునట్లుకాచి, అందు పిప్పళ్లను, అతిమధురమును, సన్నరాష్ట్రమును, మ్రంగకాయలును కల్కముచేసి కలిపి; చక్కెరను, తేనెను, నేతినిగూడచేర్చి వస్తిచేయునది. ఈవస్తి స్త్రీలయందు మిక్కిలి కామముగలవారికి బలమును కల్గించును. (ఇయ్యది పదునాల్గవవస్తియోగ మగును.)

## (15) మయూరాది యాపనవస్తియోగము.

మూ. మయూరమపిత్తపక్షపాదాస్యాన్త్రం (కృత్వా) స్థిరాదిభిః పలకైః సజలే పయసి పక్త్వా క్షీరశేషం; మదనపిప్పలీవిదారీశతకుసుమామధుకకల్కీకృతం మధుఘృతసైన్ధవయుక్తం వస్తిం దద్యాత్; స్త్రీష్వతిప్రసక్తక్షీణేన్ద్రియేభ్యో బలవర్ణకరం. ౪౩

వ్యా. నెమలిని, దానిపిత్తమును, రెక్కయీకలును, కాళ్లను, తలను, ప్రేవులను, లేకయుండునట్లు వీటినిదూరబుచ్చి తక్కినమాంసమును దీసికొని స్థిరాదిపంచమూలములను ఒక్కొక్కపలమువంతున గూర్చి వీనినన్నిటిని జలముతోకూడిన పాలయందు పాలుమాత్రము మిగులునట్లు కాచి, అందు మ్రంగకాయలు, పిప్పళ్లు, మోడి, సదాపవిత్తులు, అతిమధురము వీనికల్కమును; తేనెను, ఘృతమును, సైంధవలవణమును కూడకలిపి, వస్తిప్రయోగము చేయునది. దీనివలన స్త్రీలయందు మిక్కిలి సంచారముకల్గుటచే క్షీణించినయింద్రియములు గలవారికి మిక్కిలి హితకరముగను, బలవర్ణములను కల్గించునదియు నైయుండును. (ఇయ్యది పదునైదవవస్తియోగము.)

### { మయూరకల్పప్రకారము విష్కిరాదిగణములైదిటిచే సిద్ధముచేయబడినవస్తులు నూటపదునైదు. (115) }

మూ. కల్పశ్చైషః విష్కిర-ప్రతుద-ప్రసహ-అంబుచరేషు స్యాత్; అక్షీరో రోహితాదిషు చ మత్స్యేషు. ౪౪

వ్యా. పైనిచెప్పబడిన మయూరకల్పమును (నెమలికి చెప్పినవిధమును) ననుసరించి విష్కిరజాతిలోచేరిన లావాదిపక్షులను, ప్రతుదములను, ప్రసహములను, అంబుచరములను, ఈనాల్గుజంతువర్గములతో పైజెప్పినరీతిగ స్థిరాదిపంచమూలములనుచేర్చుచు పాలను సిద్ధముచేసి మదనాదికల్కమును, మధుఘృతసైంధవములను చేర్చి వేరువేరుగ ఒక్కొక్క పక్షి ఒక్కొక్కయోగమువంతున—వస్తియోగమువంతున సిద్ధముచేయునది. మరియు రోహితాది మత్స్యములనుగూడ పాలనుమాత్రము చేర్చక పైచెప్పిన కల్పమువలెనే వస్తి యోగముల చేయనగును.

పైజెప్పిన వస్తివివరణము:—అన్నపానవిధి అధ్యాయమున "లావోవర్తీ రకశ్చైవ......వర్తకో వర్తికా చైవ...—వారటాశ్చేతి విష్కిరాః"(చ. సూ. అ ౨౭. శ్లో ౪౭. ౪౯.) అని నిర్దేశింపబడిన విష్కిరజాతిపక్షులలో నొక్కొక్కదానిని చేర్చి నొక్కొక్కయోగమువంతున గల్పించబడినవి (20) ఇరువదియోగములు.

"శతపత్రో భృంగరాజః" (చ. సూ. అ ౨౭. శ్లో ౫౨.) అని యుపక్రమించి చెప్పబడిన ప్రతుదములచే వేరువేరుగ గల్పింపబడినయోగములు (30) ముప్పది.

"గోఖరాశ్వతరోష్ట్రాశ్వ......మృగపక్షిణః" (చర. సూ. అధ్యా. ౨౭. శ్లో. 3౫, 3౬.)అని యుపక్రమించి చెప్పబడిన ప్రసహజంతువులచే వేరువేరుగ గల్పింపబడిన యోగములు (29) ఇరువదితొమ్మిది.

"వక్ష్యన్తే వారిచారిణః హంసక్రౌఞ్చ...సన్త్యమ్బుచారిణః" (చ. సూ. అ. ౨౭. శ్లో. ౪౧-౪౪.) అని నిర్దేశింపబడిన (27) నిరువదియేడువారిచరములతో వేరువేరుగ కల్పింపబడిన యోగములు (27) ఇరువదియేడు.

రోహితాదిమత్స్యములచే కల్పింపబడినయోగములు (9) తొమ్మిది. (యీయోగములన్నియుచేరి పైజెప్పిన మయూరకల్పము ప్రకారము సిద్ధముచేయబడిన యాపనావస్తియోగములు నూటపదునైదు వస్తియోగములు.)

### (16) గోధాదిమాంసములచే సిద్ధమగు యాపనావస్తి.

మూ. గోధానకులమార్జారమూషికశల్లకమాంసానాం దశపలాన్భాగాన్ సపఞ్చమూలాన్ పయసి పక్త్వా, తత్పయః పిప్పలీఫలకల్క—

సైన్ధవసౌవర్చలశర్కరామధుఘృతతైలయుక్తో వస్తిః, బల్యో రసాయనః క్షీణక్షతస్య సంధానకరో మథితోరస్కరథగజహయ భగ్నవాతబలాసక ప్రభృత్యుదావర్తవాతసక్త మూత్రవర్చ శ్శుక్రాణాం హితతమశ్చ. ౪౫

వ్యా. ఉడుము, ముంగిస, పిల్లి, మూషకములు, ముండ్లపందులు వీనిమాంసములు సమభాగములుగచేరి పదిపలములు; దశమూలములు వీనిని ఆవుపాలలో పక్వము చేసి పడియకట్టి, అందు పిప్పళ్లు, మ్రంగకాయలు ఈరెంటిని కల్కము చేసి కలిపి; సైంధవ లవణము, సౌవర్చలలవణము, చక్కెర, తేనె, నెయ్యి, నూనె అను నీద్రవ్యములను వాని పరిమాణానుసారముగ జేర్చి వస్తి చేయునది. దీనివలన బలము కల్గును. రసాయనమై యుండును. క్షతక్షీణులకు సంధానకరమై యుండును. మరియు రొమ్మున నభిఘాతము కల్గినవారికిని, రథములు,యేనుగలు, గుఱ్ఱములు మున్నగువానిపై సవారి చేయుటవలన శ్రమ నొందినవారికిని వాతబలాసకము మున్నగురోగములయందును, ఉదావర్తవాతమునందును, మలమూత్ర శుక్రములు బద్ధగించినవారికిని మిక్కిలి హితకరమై యుండును. (ఇయ్యది పదునారవవస్తియోగము.)

**(17) కూర్మమాంససిద్ధయాపనావస్తియోగము పదునేడవది.**
**కర్కటకాదిసిద్ధ అతిదేశికవస్తియోగములు పది (10) యు.**

మూ. కూర్మాదీనామన్యతమపిశితసిద్ధం పయో గోవృషనాగహాయనక్ర హంస కుక్కుటాండరసమధుఘృత శర్కరాసైన్ధవేక్షురకాత్మ గుప్తాఫలకల్కసంసృష్టో వస్తిర్వృద్ధానామపి బలజననః. ౪౬

వ్యా. తాబేలు మొదలగు (పదునొకండు) జంతువులలో యేదైననొకదాని మాంసమును చేర్చి పక్వముచేయబడిన పాలయందు యెద్దు, యేనుగ, గుఱ్ఱము, మొసలి, హంస వీనియొక్కమాంసమును; కోడిగ్రుడ్లరసమును కూడ కలిపి, తేనెను, ఘృతమును, చక్కెరను, సైంధవలవణమును కూడకలిపి; నీరుగొబ్బివిత్తులు,దూలగొవిలవిత్తులు, మ్రంగ కాయలు వీనికల్కమును కూడ కలిపి సిద్ధముచేయబడినవస్తి వృద్ధులకు కూడ బలమును వృద్ధి నొందించును. (ఇయ్యది పదునేడవవస్తియోగము.)

ఇచ్చట తాబేలుమాంసమును చేర్చి కాచబడిన క్షీరమునందు పైజెప్పిన కల్కాదులనుచేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రధానముగజేసి పదునేడవదిగ పరిగణనము చేయబడినది. మరియు "కూర్మాదీనాం"అనుచోట ఆదిగ్రహణముచే గ్రహింపబడిన కర్కట

కాదుల పదిటిచే వేరువేరుగ పైజెప్పిన రీతిగ సిద్ధముచేయబడిన వస్తులు (10) పది యగును. (ఈపదియు అతిదేశరూపముగ నిర్దేశింపబడినవి.) కూర్మాదులు "కూర్మః కర్కటకో మత్స్యః......మకరాదయః. ఇతి వారిశయాః ప్రోక్తాః" (చ. సూ. అ. ౨౭. శ్లో. ౪౦) అని నిర్దేశింపబడినవి.

(18) గోవృషాది సిద్ధయాపనావస్తిః

మూ. గో-వృష - బస్త - వరాహ వృషణ, కర్కటక, చటకసిద్ధం క్షీరం ఉచ్చటకేక్షురకాత్మగుప్తా మధుఘృతసైన్ధవయుక్తః కిఞ్చిల్లవణితః వస్తిః. ౪౭

వ్యా. వృషభము, మేక, పంది వీనియొక్క వృషణములను, కర్కాటకములను, ఊరపిచ్చుకమాంసమును చేర్చి కాచబడినపాలయందు నాగముస్తలు, నీరుగొబ్బివిత్తులు, దూలగొండివిత్తులు వీనియొక్క కల్కమును; తేనెను, నేతిని, కొంచెము సైంధవలవణమును చేర్చి సిద్ధముచేయబడినవస్తిని ప్రయోగించునది. (ఇయ్యది పదునెనిమిదవ వస్తియోగము.)

(19) కర్కటకరసాదియాపనవస్తియోగము.

మూ. కర్కటకరసః చటకాండరసయుక్తః సమధుఘృతశర్కరో వస్తిః ఇత్యేతే వస్తయః పరమవృష్యాః; ఉచ్చటకేక్షురకాత్మగుప్తా శృతక్షీరప్రతిభోజనానుపానాత్ స్త్రీశతగామినం నరం కుర్యుః.

వ్యా. కర్కాటకరసము, ఊరపిచ్చుకగ్రుడ్డురసము కలిపి, అందు మధుఘృతములను, చక్కెరను చేర్చి వస్తిచేయునది. (ఇయ్యది పందొమ్మిదవ వస్తియోగము.) "కూర్మాదీనాం" అని యుపక్రమించి పైజెప్పిన మూడుయోగములును మిక్కిలి వృష్యములై (శుక్రమును వృద్ధి నందించునవియై) యుండును. మరియు యీమూడువస్తుల నుపయోగించి, తుంగముస్తలు, నీరుగొబ్బివిత్తులు, దూలగొండివిత్తులు, యీమూటిని చేర్చి కాచబడిన ఆవుపాలతో భోజనముచేసి యంపాలనే పానమున కుపయోగించినయెడ పురుషుని నూర్గురుస్త్రీలతో రమించుశక్తి గల్గునట్లు చేయును.

ఇచ్చట వ్యాఖ్యానమున "ఇత్యేతే వస్తయ ఇత్యనేన కూర్మాదీనామన్యతమ మిత్యాదిగ్రన్థోక్తా వస్తయః ప్రత్యవమృశ్యన్తే" అని యున్నది.

(20) దశమూలాదియాపనవస్తియోగము.

మూ. దశమూలమయూరహంసకుక్కుటక్వాథాత్ పఞ్చప్రసృతం

తైలఘృతవసామజ్జాచతుష్ప్రస్రృతయుక్తం, శతపుష్పామస్త
హాపుషా కల్కీకృతః సలవణో వస్తిః; పాదగుల్ఫోరుజాను
జఙ్ఘాత్రికవఙ్క్షణవస్తి వృషణానిలరోగహారః. ౪౯

వ్యా. దశమూలములు, నెమలియొక్కయు, హంసయొక్కయు, కోడియొక్కయు మాంసమును; వీనిని చేర్చి కాచబడినకషాయము అయిదుప్రసృతములు; అందు తైలము, ఘృతము, వస, మజ్జ అను నీస్నేహముల నాల్గిటిని ఒక్కొక్కటి ప్రసృతమువంతున (చేరి నాల్గుప్రసృతములును) కూడచేర్చి సదాపవిత్తులును, తుంగగడ్డలును, బోడతరమును కల్కముచేసి కలిపి సైంధవలవణమును కూడచేర్చి వస్తిని సిద్ధము చేయునది. ఇయ్యది పాదములు, చీలమండ, తొడలు, మోకాళ్లు, పిక్కలు, నడుముక్రింద త్రికసంధి, గెజ్జలు, వస్తి, వృషణములు అను నీయవయవములయందు కల్గిన వాతరోగముల హరించును. (ఇయ్యది ఇరువదియవ వస్తియోగము.)

జాంగలమృగ-విష్కిర-అనూప-బిలేశయజంతువులచే దశమూలాది కల్పప్రకారము సిద్ధముచేయబడిన యాపనావస్తులు ఏబదితొమ్మిది (59) యోగములు.

మూ. మృగ - విష్కిర - ఆనూప - బిలేశయానాం - ఏతేనైవ కల్పేన
వస్తయో దేయాః. ౫౦

వ్యా. పైజెప్పబడిన దశమూలాదియోగకల్పము ప్రకారముగ ననుసరించి హంస కుక్కుటములను మారుగ జాంగలమృగములను, విష్కిరములను, అనూపమృగములను, బిలేశయములన, వేరువేరుగ జేర్చి తైలఘృతాదులను శతపుష్పాదికల్కమును చేర్చి పైజెప్పినరీతిగ సిద్ధముచేయబడిన వస్తులను ప్రయోగించునది.

వీనివివరణము:—అన్నపానవిధి అధ్యాయమున "పృషతశ్శరభో రామః...... విజ్ఞేయాః జాఙ్గలా మృగాః" (చ. సూ. అ. ౨౭. శ్లో. ౪౫, ౪౬) అని నిర్దేశింపబడిన పదునేడుజాంగలమృగములను వేరువేరుగ జేర్చుచు ప్రత్యేకముగ గల్పింపబడిన యోగములు పదునేడు (17) అగును.

"లావో వర్తీరకశ్చైవ.........వారటాశ్చేతి విష్కిరాః" అను విష్కిరజాతి పక్షులలో మయూర కుక్కుటములను మాత్రము వదలి తక్కిన పందొమ్మిదిపక్షులమాంసములను వేరువేరుగజేర్చి సిద్ధముచేయబడిన వస్తులు పందొమ్మిది (19) యగును. మయూర కుక్కుటములు పైయోగమున జెప్పబడినవిగాన వానిని రెంటిని వదలి తక్కిన పందొమ్మిది

గ్రహింపనగును. "సృమరః చమరః ఖడ్గో......ఆనూపాః మృగాః సర్వేరురుస్తథా" (చ. సూ. అ. ౨౭. శ్లో. ౩౯.) అని నిర్దేశింపబడిన ఆనూపమృగజంతువుల తొమ్మిదిటిచే వేరువేరుగ సిద్ధముచేయబడిన వస్తులు తొమ్మిది (9) యగును. "శ్వేతః శ్యామః చిత్రపృష్ఠః......ఇతి భూమిశయాః స్మృతాః" (చ. సూ. అ. ౨౭. శ్లో. ౩౭, ౩౮.) అని నిర్దేశింపబడిన బిలేశయజంతువులచే వేరువేరుగ సిద్ధము చేయబడిన వస్తియోగములు పదునాలుగు (14) యగును. ఇవియన్నియు చేరి అతిదేశరూపముగ నిర్దేశింపబడిన వస్తియోగములు (59) యేబదితొమ్మిది.

## (21) మాధుతైలికవస్తియోగములు. అందు మధు-ఘృతాది యాపనవస్తియోగము.

మూ. మధుఘృతద్విప్రసృతః తులోష్ణోదకః, శతపుష్పార్ధపలః (హపుష్పార్ధపలః), సైన్ధవార్ధాఽక్షయుక్తః వస్తిః, దీపనో బృంహణో బలవర్ణకరో నిరుపద్రవో వృష్యతమో రసాయనః, కృమికుష్ఠోదరాఽఽర్తవగుల్మాఽర్శో బ్రధ్నప్లీహమేహహరః. ౪౧

వ్యా. తేనెయు ఘృతమును వేరువేరుగ నొక్కొకప్రసృతమువంతున చేరి రెండు ప్రసృతములును, (నాల్గుపలములు), దీనికి సమభాగము వేడినీళ్లను ఒకటిగకూర్చి, అందు సదాపవిత్తులు అర్ధపలమును, సైంధవలవణమును అర్ధకర్షమును కూడ కలిపి సిద్ధముచేయబడినవస్తి అగ్నిని దీపింపజేయును. శరీరమును బలియజేయును. బల-వర్ణముల కల్గించును. ఏవిధమైన యుపద్రవమును కల్గింపదు. మిక్కిలి శుక్రమును వృద్ధిచేయును. రసాయనముగ నుండును. మరియు కృమిరోగము, కుష్ఠము, మహోదరము, ఆర్తవరోగము, గుల్మము, అర్శోరోగము, బ్రధ్నరోగము, ప్లీహరోగము అను నీవ్యాధులనన్నిటిని హరించును. (ఇయ్యది యిరువదియొకటవ వస్తియోగము).

* (ఇచ్చట నీయోగమునకు పిమ్మట "ఘృతతైలేత్యాదికో ద్వావింశతితమః" అని వ్యాఖ్యానమున ప్రతీకమున్నది. అట్టి యిరువదిరెండవయోగము యేప్రతియందును మూలమున కానరాదు. ఇది లోపించినచో యోగముల మొత్తములో నొకటి తగ్గుచున్నది.

## (22) మధుఘృతాదియాపనవస్తియోగము రెండవవిధము.

మూ. తద్వన్మధుఘృతాభ్యాం పయస్తుల్యో వస్తిః పూర్వకల్కేన బల

వర్ణకరో వృష్యతమో నిరుపద్రవో వస్తిమేఢ్రపాకపరికర్తికా మూత్రకృచ్ఛ్రపిత్తవ్యాధిహరః, రసాయనశ్చ. ౨౨

వ్యా. తేనెను ఘృతమును సమభాగములుగను ఈరెంటికిని సమభాగముగ ఆవు పాలను కూర్చి, అందు పైయోగమున జెప్పబడినరీతిగ సదాపవిత్తులు అర్ధపలంబును, అర్ధకర్షము సైంధవలవణమును కూడ కల్కముజేసి కలిపి సిద్ధముచేయబడిన వస్తి బలవర్ణకరంబును మిక్కిలి వృష్యంబును, రసాయనంబును, నిరుపద్రవంబును, వస్తియందును మేఢ్రమునందును కల్గినపుండు నార్పునదియు, పరికర్తిక, మూత్రకృచ్ఛ్రములను, పిత్తరోగములను హరించునదియు నగును. (ఇయ్యది యిరువదిరెండవ వస్తియోగము.)

(23) మధుఘృతయాపనవస్తియోగము మూడవవిధము.

మూ. తద్వన్మధుఘృతాభ్యాం మాంసరసతుల్యో, ముస్తాౘక్షయుక్తః పూర్వవద్వస్తిః వాతబలాస-పాదహర్ష - గుల్మ-త్రికోరుజానూరు నికుఞ్చనవస్తివృషణమేఢ్రత్రికపృష్ఠశూలహరః. ౨౩

వ్యా. పైజెప్పినరీతిగ మధుఘృతములకు సమముగ మాంసరసమును గూర్చి, అందు కర్షపరిమితముగ తుంగగడ్డలకల్కమును కలిపి పైజెప్పినరీతిగ సైంధవలవణమును చేర్చి వస్తిచేయునది. దీనివలన వాతబలాసంబును, పాదహర్షంబును హరించును. మరియు గుల్మము, త్రికము, మోకాళ్లు, తొడలు ఇవి ముడుంచుకొనువ్యాధియు, వస్తియందును, వృషణములయందును, మేఢ్రమునందును, త్రికసంధియందును, వీపునందును సంభవించు శూలనొప్పి యుపశమించును. (ఇయ్యది యిరువదిమూడవ వస్తియోగము )

(24) సురాసౌవీరకాది యాపనవస్తియోగము.)

మూ. సురాసౌవీరకకులుత్థమాంసరసమధుఘృతతైలసప్తప్రసృతో ముస్తశతాహ్వాకల్కితః సలవణో వస్తిః, సర్వవాతరోగహరః. ౨౪

వ్యా. సురామద్యము, సౌవీరకము, ఉలవలకషాయము,మాంసరసము, నెయ్యి, తేనె, తైలము, వీనిని ప్రత్యేకము ఒక్కొక్కప్రసృతమువంతున నేడుప్రసృతముల (పదునాల్గు పలములు) నొకటిగ గూర్చి, అందు తుంగగడ్డలను సదాపవిత్తులను కల్కముచేసి కలిపి, సైంధవలవణమును కూడకలిపి సిద్ధముచేయబడిన వస్తి వాతరోగముల నన్నిటిని హరించును. (ఇయ్యది యిరువదినాల్గవ వస్తియోగము.)

(25) ద్విపంచమూలాది యాపనవస్తియోగము.

మూ. ద్విపఞ్చమూల - త్రిఫలాబిల్వమదనఫలకషాయో, గోమూత్ర సిద్ధః కుటజమదనఫలముస్తపాఠాకల్కితః, సైన్ధవయావశూక క్షౌద్రతైలయుక్తః వస్తిః; శ్లేష్మవ్యాధివస్త్యాటోపవాతశుక్ర సఙ్గ - పాణ్డురోగాఽజీర్ణ విసూచికాఽలసకేషు దేయ ఇతి. ౨౫

వ్యా. మహా-హ్రస్వపంచమూలములు రెండును, త్రిఫలములు, బిల్వవేరు, మ్రంగ కాయలు వీనిని సమభాగములుగ గోమూత్రమున జేర్చి క్వాథపరిభాషానుసారముగ కషాయము కాచి (వడగట్టి), అందు—కొడిసెపాలవిత్తులు, మ్రంగకాయలు, తుంగ గడ్డలు, చిరుబొద్ది వీనిని కల్కము చేసి కలిపి సైంధవలవణమును, యవక్షారమును, తేనెను, నూనెను చేర్చి వస్తిని సిద్ధము చేయునది. ఇది కఫవ్యాధులను, వస్తియందుకల్గు ఉబ్బర మును, అపానవాత శుక్రబంధమును, పాండురోగమును, అజీర్ణములను, విషూచిక-అల సకములను హరించును. (ఇయ్యది యిరువదియైదవ వస్తియోగము.) పైజెప్పబడిన యోగము లైదిటియందును, మధుతైలము ప్రధానములుగ నుండుటవలన మధుతైలికవస్తు లనియు చెప్పబడును.

(26) శతావర్యాదితైలసిద్ధ అనువాసనరూప యాపనావస్తులు మూడు. అందు మొదటియోగము.

మూ. అత ఊర్ధ్వం వృష్యతమాన్ స్నేహాన్ వక్ష్యామః—
శతావరీ-గుడూచీక్షు-విదార్యామలక ద్రాక్షా-ఖర్జూరాణాం యన్త్రపీడితానాం రసప్రస్థం పృథగేకైకం తద్వత్ ఘృత-తైల-గోమహిష్యజాక్షీరాణాం ద్వే ద్వే దద్యాత్; జీవక-ర్షభక-మేదా-మహామేదా - త్వక్ క్షీరీ - శృఙ్గాటక-మధూలికా-మధుక-ఉచ్చటా - పిప్పలీ-పుష్కరబీజ-నీలోత్పల - కదమ్బపుష్ప-పుణ్డరీక కేసరకల్కాత్, పృషతతరక్షుమాంస - కుక్కుటచటకచకోర-మత్తాక్ష - బర్హి-జీవఞ్జీవ-కులిఙ్గ - హంసాణ్డరస - వసామజ్జాదేశ్చ ప్రస్థం దత్వా సాధయేత్.
బ్రహ్మఘోష-శఙ్ఖ-పటహభేరీనినాదైః సిద్ధం సితచ్ఛత్రకృతచ్ఛాయం, గజస్కన్ధమారోపయేత్ భగవన్తం వృషధ్వజమభిపూజ్య;

తం స్నేహం త్రిభాగమాత్రికం, మఙ్గళాఽఽశీస్తుతి దేవతార్చనైః వస్తిం గమయేత్.

నృణాం స్త్రీవిహారిణాం, నష్టరేతసాం, క్షతక్షీణ విషమజ్వరార్తానాం, వ్యాపన్నయోనీనాం వన్ధ్యానాం, రక్తగుల్మినీనాం, మృతాఽపత్యానాం అనార్తవానాం చ స్త్రీణాం, క్షీణమాంస రుధిరాణాం, పథ్యతమం రసాయనముత్తమం వలీపలితనాశనం చిద్యాత్. ౫౯

వ్యా. పిమ్మట మిక్కిలివృష్యములగు అనువాసనవస్తుల కుపయోగింపదగు స్నేహవస్తులను చెప్పబడును:—పిల్లిపీచరగడ్డలు, తిప్పతీగె, చెరకు, నేలగుమ్మడి, ఉసిరికకాయలు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుపండ్లు వీనిని ప్రత్యేకముగ యంత్రములచే (గానుగ మొదలగుసాధనములచే) రసములదీసి యారసములను నొక్కొక్కటి ఒక్కొక్క ప్రస్థము వంతునను; అత్తెరంగుననే నెయ్యి, నూనె, ఆవులయొక్కయు, గేదెలయొక్కయు, మేకలయొక్కయు పాలను; వేరువేరుగ రెండేసిప్రస్థములవంతున చేర్చునది. మరియు నందు జీవకము, ఋషభకము, మేద, మహామేద, తవక్షీరి (వెదురుప్పు), నమ్మదుంప, (నిమ్మటము), చాగ, అతిమధురము, గుంద్రముగనుండు తుంగగెడ్డలు, పిప్పళ్లు, పుష్కరబీజములు (మెట్టదామరవిత్తులు), నల్లకలువపువ్వులు, కడిమిపువ్వులు, తెల్లదామరపువ్వుల కేసరములు వీనినన్నిటిని సమభాగముగ కల్కముచేసి తైలమునకు నాల్గవవంతున కలిపి, పొడలయిఱ్ఱి, సివంగి వీనియొక్క మాంసమును, కోడి, ఊరపిచ్చుక, చకోరపుపక్షి, కోవెల, నెమలి, జీవఞ్జీవకము (వెన్నెలపులుగు), కులింగము (పిచ్చుకజాతిలో చేరినపక్షివిశేషము), హంసము అను నీపక్షులయొక్క గ్రుడ్లలోనిరసమును; వసను; మజ్జ మున్నగువానిని యొకప్రస్థపరిమితముగను చేర్చి వీనినన్నిటి నొకభాండమున నునిచి తైలమును పక్వము చేయునది.

పక్వమైన యాస్నేహము వేదఘోషము, శంఖధ్వని, పటహము, భేరి మొదలగు వాద్యఘోషములతో, తెల్లనిగొడుగునీడతో కూడినయేనుగుమూపుపై నునిచి, భగవంతుడగు నీశ్వరుని పూజించునది. అట్టిస్నేహమును నూడవవంతు తేనెను కలిపి మంగళాశీర్వచనములు, దేవతాస్తుతి, దేవపూజలు మున్నగుమంగళముల కావించి విధ్యుక్తప్రకారము వస్తిని ప్రయోగించునది.

ఈయనువాసనవస్తి అధికముగ స్త్రీసంచారము చేయువారికిని, శుక్రనష్టమైనవారికిని, ఉరఃక్షతముచేతను, ధాతుక్షయముచేతను, విషమజ్వరములచేతను పీడింపబడిన

వారికిని; మిక్కిలి హితమైయుండును. మరియు యోనివ్యాపత్తులచే పీడితులును, వంధ్యలును, రక్తగుల్మరోగపీడితులును, కలిగినసంతానము నశించువారును, ఆర్తవములేని వారును నగుస్త్రీలకును; రక్తమాంసములు క్షీణించినవారికిని మిక్కిలి హితమైయుండును. రసాయనములలో నియ్యది మిగుల శ్రేష్ఠమై వలీపలితములను నశింపజేయ కల్గియుండును. (ఇయ్యది ఇరువదియారవ వస్తియోగము.) ఇచ్చట వేదఘోషాదులు ఔషధముయొక్క వీర్యమును రాక్షసు లపహరింపకుండుటకై శాంతికరముగ చేయబడినదియని యెరుంగునది.

## (27) బలాదితైలసిద్ధయాపనా (అనువాసన) వస్తియోగము.

మూ. బలాగోక్షురక-రాస్నాఽశ్వగన్ధా-శతావరీ-సహచరాణాం శతం శతమాపోథ్య, జలద్రోణశతే ప్రసాధ్యం; తస్మిన్ జలద్రోణావశేషే రసే వస్త్రపూతే విదార్యామలకస్వరసయోః,బస్త-మహిష-వరాహ - వృషకుక్కుటబర్హిహంసకారణ్డవసారసాణ్డరసానాం, ఘృతతైలయోశ్చ ఏకైకం ప్రస్థం, అష్టౌ ప్రస్థాన్ క్షీరస్య దత్వా; చన్దన-మధుక-మధూలికా-త్వక్ క్షీరీ-బిస-మృణాళ-నీలోత్పల-పటోలాత్మగుప్తాఽన్నపాకి - తాలమస్తక-ఖర్జూర - మృద్వీకా-తామలకీ-కణ్టకారీ-జీవక-ఋషభక - క్షుద్రసహా-మహాసహా - శతావరీ- మేదా-పిప్పలీ-హ్రీబేర - త్వక్పత్ర-కల్కాంశ్చ దత్వా సాధయేత్. బ్రహ్మఘోషాదినా విధినా తత్సిద్ధం వస్తిం దద్యాత్. తేన స్త్రీశతం గచ్ఛేత్ న చాత్రాస్తే విహారాహారయన్త్రణా కాచిత్. ఏష వృష్యో బల్యో బృంహణ ఆయుష్యో వలీపలితనుత్ క్షతక్షీణనష్టశుక్రవిషమజ్వరార్తానాం వ్యాపన్నయోనీనాం చ పథ్యతమః. ౫౭

వ్యా. చిట్టాముట్టి, పల్లేరు, సన్నరాష్ట్రము, పెన్నేరుగడ్డ, పిల్లిపీచరగడ్డ, పచ్చపువ్వుల ములుగోరింట ఇవి వేరువేరుగ నూరేసిపలములవంతున చేర్చునది. ఈక్వాథ్యములను నలుగగొట్టి నూరుద్రోణములు జలమున వైచి క్వాథపరిభాషానుసారముగ ద్రోణపరిమితముగ మిగులునట్లు కషాయము కాచునది. సిద్ధమయిన యాకషాయమును వడకట్టి, అందు గుమ్మడి, ఉసిరికకాయలు ఈరెంటియొక్క స్వరసములను పొట్టేలు, యెనుబోతు, పంది, వృషభము అను నీజంతువుల మాంసరసమును; కోడి, నెమలి, హంస, పెన్నెడ

పులుగు, సారసపుపక్షి అను నీపక్షుల గ్రుడ్లరసమును; ప్రత్యేక మొక్కొక ప్రస్థపరిమితంబుగను; ఘృత-తైలంబులు వేరువేరుగ నొక్కొక్క-ప్రస్థంబును; ఆవుపాలు నెనిమిది ప్రస్థములును చేర్చి; అందు చందనము, అతిమధురము, చాగ, తవక్షీరి, తామరకాడలు, తామరదుంపలు, నల్లకలువలు, చేదుపొట్ల, దూలగోవిల, అన్నుపాకి (నల్లపువ్వులగోరింట), తాటిచెట్టుకొనసుండుపువ్వు, ఖర్జూరపుపండు, ద్రాక్షపండు, నేలయుసిరిక, వాకుడు, జీవకము, ఋషభకము, క్షుద్రసహ, మహాసహ (ఈరెండును గజికలోభేదము), పిల్లిపీచర, మేద, పిప్పళ్లు, కురువేరు, దాల్చినచెక్క అను నీద్రవ్యముల నన్నిటిని కల్కము చేసి తైలమునకు నాల్గవవంతు చేర్చునది. పైజెప్పినద్రవములను, ఘృతతైలములను, కల్కమును, నొకటిగ గూర్చి తైలపాకవిధిప్రకారము తైలమును సిద్ధముచేయునది.

సిద్ధమయిన యీతైలము పైజెప్పిన వేదఘోషాదులచే మంగళమాచరించి యేనుగుపై నిడి పైజెప్పినరీతిగనే యనువాసనవస్తిని చేయనగును. ఈవస్తివలన నూరుగురు స్త్రీలతో రమించుశక్తి కల్గును. దీనిని సేవించునపుడు నాహారవిహారములకు సంబంధించిన నిబంధనము లేశముగూడ లేదు. మరియు నియ్యది వృష్యమగును. శరీరమును బలియజేయును. దీర్ఘాయుష్యము నొసంగును. వలీపలితముల బోనడచును. క్షతక్షీణులకును, శుక్రనష్టమయిన వారికిని, విషమజ్వరపీడితులకును, యోనివ్యాపత్తుచే బాధింపబడిన స్త్రీలకును నియ్యది మిక్కిలి హితకరము లైయుండును. (ఇయ్యది ఇరువదియేడవ వస్తియగును.)

(28) సహచరాదితైలసిద్ధయాపనాఅనువాసనవస్తియోగము.

మూ. సహచరపలశతం ఉదకద్రోణచతుష్టయే పక్త్వా, ద్రోణశేషే రసే పూతే, విదారీక్షురసప్రస్థాభ్యాం, అష్టగుణక్షీరం, ఘృతతైలప్రస్థం, బలామధుకమధూకచన్దనమధూలికాసారిబామేదామహామేదాకాకోలీ క్షీరకాకోలీపయస్యాఽగురుమంజిష్ఠావ్యాఘ్రనఖశటీసహచరసహాస్రవీర్యావరాజ్జలోధ్రాణాం అక్షమాత్రైః ద్విగుణశర్కరైః కల్కైః సాధయేత్ బ్రహ్మఘోషాదినా విధినా. తత్సిద్ధం వస్తిం దద్యాత్, ఏష సర్వరోగహరో, రసాయనో లలితానాం శ్రేష్ఠః అంతః పురచారిణీనాం, క్షతక్షయవాతపిత్తవేదనాశ్వాసకాసహరః, త్రిభాగమక్షికోఽకాలవలీపలితనుత్ వర్ణరూపబలమాంసశుక్రవర్ధనః.　　౫౮

వ్యా. పచ్చగోరింటను నూరుపలములు చేర్చి నలుగగొట్టి నాల్గుద్రోణములు జలమునచేర్చి ద్రోణమాత్రము మిగులునట్లు క్వాథముచేయునది. ఆకషాయమును వడగట్టి, అందు నేలగుమ్మడిరసమును ఒకప్రస్థమును, చెరకురసము ఒకప్రస్థమును, ఘృతతైలములను ఒకప్రస్థమును, ఘృతతైలముల కెనిమిదింతలు (యెనిమిదిప్రస్థములు) ఆవుపాలను చేర్చునది. మరియు చిట్టాముట్టి, అతిమధురము, ఇప్పపువ్వులు, చందనము, చాగపట్ట, సుగంధపాల, మేద, మహామేద, కాకోలి, క్షీరకాకోలి, మదుబాల, అగరు, మంజిష్ఠి, పులిగోరుచెట్టువేరు, కచోరములు, పచ్చగోరింట, గఆకి, దాల్చినచెక్క, లొద్దుగుపట్ట వీనిని వేరువేరుగ నొక్కొక్కకర్షమువంతునను; వీనికన్నిటికిని ద్విగుణముగ చక్కెరను చేర్చి కల్కము చేసి, ఈకల్కమును పైజెప్పినతైలమునకు నాల్గవవంతుచేర్చి ద్రవ-తైల-కల్కముల నన్నిటి నొకటిగచేర్చి వేదఘోషాదివిధిప్రకారము తైలపాకవిధిగ పక్వముచేసి వస్తినిచేయునది.

ఈవస్తి రోగముల నన్నిటిని హరించును. రసాయన మగును. అంతఃపురమున నుండు సుందరవతులైన స్త్రీలకు మిగుల శ్రేష్ఠమయినది. మరియు ఉరఃక్షతము,క్షయము, వాతపిత్తములచే కల్గినవేదనలు, శ్వాసకాసములు అను నీవ్యాధుల హరించును. మరియు నీస్నేహమున మూడవవంతు తేనెను కలిపి వస్తి చేసినయెడ సకాలమున సంభవించు వలీపలితములనుమాన్పి, శరీరమునకు వర్ణమును, రూపమును, బలమును కల్గించి, శుక్రమును వృద్ధిచేయును. (ఇయ్యది ఇరువదియెనిమిదవ వస్తి యోగము.)

పైన ఒక్కొకయోగమువంతున కనుపరచబడినయోగములు విషయసంగ్రహమున "ఏకోనత్రింశత్" అని పరిగణనము చేయబడినది యిరువదితొమ్మిది. అందు ఇరువది యొకటవయోగమునకు పిమ్మట నొకయోగము మూలమున కానరాకుండుటచే నొకటి తగ్గి యిరువదియెనిమిదియోగములే సంఖ్య యేర్పడినది. ఈయోగములును పైజెప్పబడిన అతిదేశిక (అతిదేశరూపముగ నిర్దేశింపబడిన) యోగములును కలిసి యాపనవస్తియోగములు రెండువందల పదునారు (216) అగును.

## శతపాక-సహస్రపాకవస్తివిధానము.

మూ. ఇత్యేతే రసాయనాః స్నేహవస్తయః సతి విభవే శతపాకాః సహస్రపాకా వా కార్యాః, వీర్యబలాధానార్థమితి. ౫౯

వ్యా. ఇత్తెరంగున పైజెప్పబడిన అనువాసనవస్తి కుపయోగింపదగినవస్తులు మూడును మిక్కిలి వైభవముగ మహారాజులు మున్నగువారు నూరుమారులైనను, వేయిమారులైనను పాకముచేసి .నుపయోగించినచో అట్టితైలములు వీర్యబలాధిక్యములు కల్గి ఉత్తమమయిన రసాయనము లగును.

## యాపనావస్తియోగముల వివరణము.

తత్ర శ్లోకాః.—

మూ. శిఖిగోనర్దహంసాద్యైః దక్షవద్వస్తయస్త్రయః,
వింశతిర్విష్కిరైః త్రింశత్ప్రతుదైః, ప్రసహైర్నవ. ౬౪
వింశతిశ్చ తథా సప్తవింశతిశ్చాఽమ్బుచారిభిః,
నవ మత్స్యాదిభిశ్చైవ, శిఖికల్పేన వస్తయః. ౬౫
దశ కర్కటకాద్యైశ్చ కూర్మకల్పేన వస్తయః,
మృగైస్సప్తదశ, ఏకోనవింశతిర్విష్కిరైః, నవ. ౬౬
ఆనూపైః దక్షశిఖివత్, భూశయైశ్చ చతుర్దశ,
ఏకోనత్రింశదిత్యేతే సహాస్నేహైః సమాసతః. ౬౭
ప్రోక్తాః విస్తరశో భిన్నాః ద్వే శతే షోడశోత్తరే,
ఏతే మాక్షికసంయుక్తాః కుర్వన్త్యతివృషం నరమ్. ౬౮
నాఽతియోగం నవాఽయోగం స్తమ్భితాస్తే చ కుర్వతే,

వ్యా. నెమలి, గోనర్దము (కంకజాతిలోచేరిన పక్షివిశేషము) హంసము అను నీపక్షుల మూటియొక్క గుడ్లచే కుక్కుటాండకల్పప్రకారము సిద్ధముచేయబడిన వస్తులు మూడు (3) శిఖిమాంసకల్పము ననుసరించి విష్కిరజాతిపక్షులచే గల్పింపబడిన వస్తులు ఇరువది (20) ప్రతుదజాతిలో చేరినపక్షులచే శిఖికల్పప్రకారము కల్పింపబడిన వస్తులు ముప్పది (30) ప్రసహములచే శిఖికల్పప్రకారము కల్పింపబడినవస్తులు ఇరువదితొమ్మిది. (29) అంబుచరములచే శిఖికల్పప్రకారము గల్పింపబడిన వస్తులు ఇరువదియేడు (27) మత్స్యములచే శిఖికల్పానుసారముగ కల్పింపబడినవస్తులు తొమ్మిది (9) పైజెప్పబడిన విష్కిరాదిగణము లైదిటిచే శిఖికల్పప్రకారము వేరువేరుగ గల్పింపబడినవస్తులు మొత్తము నూటపదునైదు (115.)

కూర్మకల్పము ననుసరించి కర్కటకాదుల పదిటిచే గల్పింపబడిన వస్తులు పది (10).

కుక్కుటమయూరకల్పముల ననుసరించి జాంగలమృగములచే సిద్ధముచేయబడిన వస్తులు పదునేడు (17). అదేకల్పమున విష్కిరములచే సిద్ధముచేయబడిన వస్తులు పందొమ్మిది (19). ఆనూపమృగములచే సిద్ధముచేయబడిన వస్తులు తొమ్మిది (9). భూశయ (బిలేశయముల)చే సిద్ధముచేయబడినవస్తులు పదునాలుగు (14). ఈమృగాది నాల్గుగణములచే వేరువేరుగ కోడి, మయూరములకు చెప్పినకల్పప్రకారము సిద్ధముచేయబడిన వస్తులమొత్తము యేబదితొమ్మిది. (59).

ఇవిగాక "ముస్తోశీరబలా" అని యుపక్రమించి ఒకొ్కకవస్తియోగమువంతున చెప్పబడిన నిరూహవస్తియోగములును "అత ఊర్ధ్వం వృష్యాక్ స్నేహాక్ వక్ష్యామః" అని యుపక్రమించి చెప్పబడిన మూడుస్నేహములచే వేరువేర సిద్ధముచేయబడిన అనువాసనవస్తులు మూడును చేరి ఇరువదితొమ్మిది వస్తియోగములు. (29). పైజెప్పబడిన వస్తియోగములన్నియు చేరి రెండువందల పదునారు (216). వస్తియోగములు యాపనవస్తులని పేరొ్కనంబడినవి యీయధ్యాయమున వివరింపబడినవి.

మరియు నీయాపనవస్తియోగములయందు తేనెను యుక్తానుసారముగ చేర్చి అయోగాతియోగములులేక స్తంభించి శుక్రమును మిక్కిలి వృద్ధిచేసి సంభోగశక్తి నధికముగ కల్గించును. ఈయాపనవస్తులు అయోగ-అతియోగవ్యాపత్తుల గల్గింపవు.

* (ఇచ్చట పైజెప్పబడిన యాపనవస్తులమొత్తముసంఖ్యలో, క్రమసంఖ్యలో చేరిన ఇరువదిరెండవవస్తియోగము గ్రంథపాతముచే లోపించుటవలన ఒక్కయోగము మాత్రము మొత్తముమీద తగ్గి రెండువందలపదునైదే యేర్పడును.)

### యాపనావస్తి బైటవెడలకున్న చేయదగినవిధానము.

మూ. మృదుత్వాన్న నివర్తన్తే యస్య త్వేతే ప్రయోజితాః.　　౯౯
సమూత్రైః వస్తిభిః తీక్ష్ణైః ఆస్థాప్యః క్షిప్రమేవ సః,

వ్యా. పైజెప్పబడిన యాపనవస్తులను ప్రయోగించినపుడు అట్టిపస్త్యౌషధము మృదువగుటచే బయలువెడలకున్నయెడ గోమూత్రముకూడిన తీక్ష్ణవీర్యములయిన నిరూహవస్తుల ప్రయోగించి, వెంటనే బయలువెడలించవలయును.

### యాపనావస్త్యతిసేవనముచే గల్గునుపద్రవములు.

మూ. శోఫాగ్నినాశ పాణ్డుత్వశూలార్శః పరికర్తికాః.　　౨౦
స్యుః జ్వరశ్చాతిసారశ్చ యాపనాత్యర్థసేవనాత్,

వ్యా. యాపనావస్తులను అధికముగ ప్రయోగించుటవలన శోఫ, అగ్నిమాంద్యము, పాండురోగము, శూల, అర్శోరోగము, పరికర్తిక అను నీవ్యాపత్తులు అతియోగమునంజేసి సంభవించును.

### అతిసేవనోపద్రవముల చికిత్స.

మూ. అరిష్టక్షీరశీధ్వాద్యాః తత్రేష్టా దీపనీ క్రియా.　　౨౧
యుక్త్యా తస్మాన్నిషేవేత యాపనాన్న ప్రసజ్జతః,

వ్యా. పైజెప్పిన అతియోగముచే సంభవించిన వ్యాపత్తులయందు అరిష్టములు, క్షీరము, శీధుమద్యము వీనిని నుపయోగించుటయు; అగ్నిని దీపింపజేయుచికిత్స జేయుటయు యుక్తముగా నుండును. అతియోగముచే పైజెప్పిన యుపద్రవములు తప్పక

సంభవించునుగాన యాపనావస్తులను విశేషముగ ప్రయోగింపక యుక్తియుక్తముగ నుప యోగించుట ముఖ్యకర్తవ్యము.

## అధ్యాయోక్తవిషయసంగ్రహము.

మూ. ఇత్యుచ్చైర్భాష్యపూర్వాణాం వ్యాపదః సచికిత్సితాః. 22
విస్తరేణ పృథక్ ప్రోక్తాః తేభ్యో రక్షేన్నరం సదా,

వ్యా. ఈయధ్యాయమున ఉచ్చైర్భాషణము మున్నగువానిచే గల్గువ్యాపత్తులును, వానిచికిత్సలును, వేరువేరుగ విస్తరించి చెప్పబడినవి. అట్టివ్యాపత్తుల కెడమియ్యక మనుజుని (రోగిని) వైద్యుడు మిక్కిలి జాగరూకుడై యెల్లప్పుడును కాపాడవలయును.

## సిద్ధిస్థానపదనిర్వచనము.

మూ. కర్మణాం వమనాదీనామసమ్యక్కరణాపదామ్. 23
యత్రోక్తం సాధనం స్థానే సిద్ధిస్థానం తదుచ్యతే,

వ్యా. వమన-విరేచన-నిరూహ-అనువాసన-నస్యకర్మలను పంచకర్మలను విధ్యుక్త ప్రకారము విరుద్ధముగ నాచరించినచో దానివలన సంభవించినవ్యాపత్తులకు సాధన భూతములయిన చికిత్సావిధానములు యేస్థానమున చెప్పబడునో అయ్యది సిద్ధిస్థానమని పేర్కొనంబడును. (వమనాదివ్యాపత్తులకు ప్రతీకారము దెల్పునది సిద్ధిస్థానమని సిద్ధిస్థానశబ్దఫలితార్థము). ఇచ్చట వమనాద్యౌషధయోగకల్పనవిధానము మున్నగువిషయములు పంచకర్మలకు అనుబంధముగ జెప్పబడినవని యెరుంగునది.

## తంత్రోపసంహారము.

మూ. ఇత్యధ్యాయశతం వింశం ఆత్రేయమునివాఙ్మయమ్. 24
హితార్థం ప్రాణినాం ప్రోక్తం అగ్నివేశేన ధీమతా,

వ్యా. ఇత్తెరంగున ఋషివర్యుడగు నాత్రేయునిచే నూటయిరువదియధ్యాయముల పరిమితమైన ఈతంత్రము పూర్తిగ చెప్పబడినది. అట్టినాత్రేయునివాఙ్మయమును ననుకరించి మిక్కిలి బుద్ధిమంతుడగు నగ్నివేశునిచేత లోకమునకు హితార్థమై చెప్పబడెను.

## ఈతంత్రపఠనమున గల్గుఫలము.

మూ. దీర్ఘమాయుః, యశః, స్వాస్థ్యం త్రివర్గం (ప్రజ్ఞామారోగ్యం) చాపి పుష్కలమ్. 25
సిద్ధిం చానుత్తమాం లోకే ప్రాప్నోతి విధినా పఠన్,

వ్యా. అట్టియీతంత్రమును రోగభిషగ్జితీయాధ్యాయమున చెప్పబడినవిధి ననుసరించి పఠించినమనుజుడు దీర్ఘకాలము ఆయుష్యమును, లోకమున, అప్రతిహతమైన

కీర్తిని ఆరోగ్యరూపమైన స్వస్థతను ప్రకర్షమైనజ్ఞానమును, ధర్మ-అర్థ-కామరూపములైన త్రివర్గమును యెన్నటికిని నాశరహితమై పరమపురుషార్థరూపమయిన మోక్షమును పొందగలడు.

ఈశాస్త్రము విధ్యుక్తప్రకారము నియమముతో పఠించి ఇందు చెప్పబడినవిధుల ననుష్ఠించినచో అట్టిపఠనముచే గల్గిన యపూర్వమువలనకూడ మనుజునకు పైజెప్పినసత్ఫలములు కల్గునని యభిప్రాయము.

—— ప్రతిసంస్కర్తకర్తవ్యము, చరక-దృఢబలప్రతిసంస్కారవిభాగము ——

మూ. విస్తారయతి లేశోక్తం సంక్షిపత్యతివిస్తరమ్ ౭౬
సంస్కర్తా కురుతే తన్త్రం పురాణం చ పునర్నవం,
అతస్తన్త్రోత్తమమిదం చరకేణాతిబుద్ధినా ౭౭
సంస్కృతం; తత్వసంపూర్ణం త్రిభాగో నోపలక్ష్యతే,
తచ్ఛంకరం భూతపతిం సంప్రసాద్య సమాపయత్. ౭౮
అఖణ్డార్థం దృఢబలో జాతః పఞ్చనదే పురే (రా),
కృత్వా బహుభ్యః తన్త్రేభ్యో విశేషోఞ్ఛసిలోచ్చయమ్. ౭౯
సప్తదశౌషధాధ్యాయసిద్ధికల్పైరపూరయత్,
ఇదమన్యూనశబ్దార్థం తన్త్రం దోషవివర్జితమ్. ౮౦
షట్త్రింశతా విచిత్రాభిః భూషితం తన్త్రయుక్తిభిః,

వ్యా. ఒకగ్రంథమును సంస్కరించువాడు స్వల్పముగ చెప్పబడినవిషయమును (ఇతరులకు) చక్కగ తెలియుటకై విస్తరింపజేయును. మిక్కిలి విస్తరించి చెప్పినవిషయమును సుఖముగ బోధపడుటకై క్లుప్తముగ సంగ్రహించి చెప్పును. అట్టివిస్తారసంగ్రహములచే తంత్రమును సంస్కరించి, మరల క్రొత్తదానినిగ జేయును. కావున తంత్రములలో నుత్తమమై యగ్నివేశకృతమైన ఈతంత్రము మిక్కిలి విశాలబుద్ధియగు చరకమహర్షిచే లేశోక్త అతివిస్తరదోషములు లేకుండునట్లు సంస్కరింపబడినది. (సంక్షేపముగనున్నచోట విస్తరించుటయు, అతివిస్తృతముగ నున్నచోట క్లుప్తముగ సంగ్రహించి చెప్పుటయు సంస్కర్తయొక్క కృత్యమని భావము.) అట్టిసంస్కారవిశేషముచేత సంస్కరించి యీతంత్రమును చరకమహర్షి చెప్పెను. ఇట్టిసంస్కారవిశేషమే స్థలాంతరమున నిట్లు చెప్పబడినది:——"సంక్షేపోక్తం మతి హాస్తిం విస్తరోక్తం న గృహ్యతే సంక్షేపవిస్తరౌ హిత్వా సంస్కుర్యాత్ శాస్త్రమాదితః".

పైజెప్పబడిన చరకసంస్కృతమైనతంత్రమున మూడవవంతు కానరాకుండెను. అట్టియెడ పంచనదపురమున పుట్టిన దృఢబలుండను నాయుర్వేదతంత్రకుశలుండు చరక

మును కనుబడక లోపించిన గ్రంథశేషమును పూర్తిచేయదలంచి భూతేశుడను పరమేశ్వ
రుని పూజించి అట్టిశంకరుని యనుగ్రహముపడసి, సుశ్రుతము విదేహతంత్రము మొద
లగు నార్షగ్రంథముల సహాయముచేసికొని అట్టితంత్రములయందలి విషయములను సిల
ఉఞ్ఛవ్యాపారముచే (పరిగయేరువిధముగ) నేర్పరిచి గ్రంథలోపములేక పూర్తిగావించెను.
అందు చికిత్సాస్థానమున పదునేడుఅధ్యాయములను, కల్పసిద్ధిస్థానములను పూర్తిగను
తాజేయు (సంస్కారవిశేషముచే) సంస్కరణమున క్రొత్తగ జేర్చి తంత్రము లోపించ
కుండునట్లు పూర్తి గావించెను.

మరియు నీతంత్రము శబ్దార్థములు లోపింపక పునరుక్తాదితంత్రదోషములులేక
పైజెప్పబడు విచిత్రార్థములతో కూడిన ముప్పదియారు తంత్రయుక్తులచే సమలంకృతమై
యుండును. ఇచ్చట రోగభిషగ్జితీయాధ్యాయమున "పునరుక్తం దుష్ప్రణీతం సూత్ర
సంగ్రహమక్రమమ్" అని యుపక్రమించి చెప్పబడిన పదునాల్గుతంత్రదోషములను
చూచునది. మరియు దృఢప్రతిసంస్కారమును గూర్చి చికిత్సాస్థానమునందు చివరభాగ
మున నిట్లు చెప్పబడినది:—"అస్మిన్ సప్తదశాధ్యాయాః కల్పాస్సిద్ధయ ఏవ చ, నాసా
ద్యన్తేఽగ్నివేశస్య తన్త్రే చరకసంస్కృతే తానేతాన్ కాపిలబలిః శేషాన్ దృఢబలోఽ
కరోత్ తన్త్రస్యాఽస్య మహార్థస్య పూరణార్థం యథాతథమ్" ఈశ్లోకములయర్థమే
యిచ్చట తంత్రాంతమునందును దృఢబలునిచే మరల చెప్పబడినది. ఇచ్చట దృఢబల
సంపూరితచికిత్సాస్థానమునందలి పదునేడధ్యాయముల వివరము చికిత్సాస్థానమున విస్తర
ముగ జెప్పబడినది కావున నచ్చట జూచునది.

### ముప్పదియారుతంత్రయుక్తులు, వానివివరణము.

మూ. తత్రాధికరణం యోగో హేత్వర్థోఽర్థః పదస్య చ. ౪౧
ప్రదేశోద్దేశనిర్దేశవాక్యశేషాః ప్రయోజనం,
ఉపదేశాపదేశాతిదేశార్థాపత్తి నిర్ణయాః. ౪౨
ప్రసఙ్గైకాన్తనైకాన్తాః సాపవర్గో విపర్యయః,
పూర్వపక్షవిధానానుమతవ్యాఖ్యాన సంశయాః. ౪౩
అతీతానాగతావేక్షాస్వసంజ్ఞోహ్యా సముచ్చయాః,
నిదర్శనం నిర్వచనం సంనియోగో వికల్పనమ్. ౪౪
ప్రత్యుత్సారః తథోద్ధారః సంభవ స్తన్త్రయుక్తయః,

వ్యా. అధికరణము, యోగము, హేత్వర్థము, పదార్థము, ప్రదేశము, ఉద్దేశము,
నిర్దేశము, వాక్యశేషము, ప్రయోజనము, ఉపదేశము, అపదేశము, అతిదేశము,
అర్థాపత్తి, నిర్ణయము, ప్రసంగము, ఏకాంతము, అనేకాంతము,అపవర్గము, విపర్యయము,

పూర్వపక్షము, విధానము, అనుమతము, వ్యాఖ్యానము, సంశయము, అతీవేక్షణము, అనాగతావేక్షణము, స్వసంజ్ఞ, ఊహ్యము, సముచ్చయము, నిదర్శనము, నిర్వచనము, సన్నియోగము, వికల్పనము, ప్రత్యుత్సారము, ఉద్ధారము, సంభవము అనునీముప్పది యారును తంత్రయుక్తులగును.

ఈముప్పదియారును శాస్త్రాంతరసుప్రసిద్ధములు కావున నియ్యవి విస్తరభీతిచే నిట వివరింపబడవయ్యె. మరియు నీతంత్రయుక్తులు సుశ్రుతాదితంత్రకారులు కొన్నిటి నధికముగను, కొందరు తక్కువగను చెప్పియున్నారు.

మూ. (తన్త్రే వ్యాససమాసాభ్యాం భవన్త్యేతా హి కృత్స్నశః,
ఏకదేశేన దృశ్యన్తే సమాసాభిహితా స్తథా (స్తు తాః),)
తన్త్రే సమాసవ్యాసోక్తే భవన్త్యేతా హి కృత్స్నశః. ౮౫
ఏకదేశేన దృశ్యన్తే సమాసాభిహితే తథా,

వ్యా. పైజెప్పినతంత్రయుక్తులు ముప్పదియారును తొలుత సంగ్రహరూపముగ తెలుపునట్టి విషయమును మరల విస్తారముగ వివరించుతంత్రమున పూర్తిగనుండును. కేవలము సంక్షేపరూపముగ జెప్పబడుతంత్రమునందు పైజెప్పిన తంత్రయుక్తులలో కొన్ని మాత్రము ఉండునుగాని అన్నియు వుండజాలవు.

### తంత్రయుక్తిప్రయోజనము.

మూ. యథామ్బుజవనస్యార్కః ప్రదీపో వేశ్మనో యథా. ౮౬
ప్రబోధనప్రకాశార్థాః తథా తన్త్రస్య యుక్తయః,

వ్యా. లోకమునకెల్ల ప్రకాశకుడగు సూర్యుడు సంకుచితమై ముకుళించియున్న తామరకమలములను వికసింపజేసి లోపల కనుబడకయుండిన శోభాతిశయమును వెల్లడించు విధముగ పైజెప్పబడిన తంత్రయుక్తులలో కొన్ని తంత్రమున నిగూఢమైయున్న గ్రంథ విశేషములను విపులముగ వ్యక్తపరచును. మరియు కొన్నితంత్రయుక్తులు ఇంటనుండు దీపము ఆయింటియందుండు ఘటపటాది పదార్థములను యెట్లు స్ఫుటముగ గనుపింప జేయునో అత్తెరంగుననే ఆయావాక్యములయందు ఇమిడియున్నయర్థమును స్ఫుటముగ తెలియపరచును. (ఈరెండును తంత్రయుక్తులకు ముఖ్యప్రయోజనమని భావము.)

### ఈతంత్రమునకు ప్రాశస్త్యము.

మూ. ఏకస్మిన్నపి యస్యేహ శాస్త్రే లబ్ధాస్పదా మతిః. ౮౭
స శాస్త్రమన్యదప్యాశు యుక్తిజ్ఞత్వాత్ప్రబుధ్యతే,

అధీయానోఽపి శాస్త్రాణి తన్త్రయుక్త్యా వినా భిషక్. ౧౧
(తన్త్రయుక్త్యవిచక్షణః)
నాధిగచ్ఛతి శాస్త్రార్థాన్ అర్థాన్ భాగ్యక్షయే యథా,

వ్యా. ఈశాస్త్రము నం దొక్కదానియందైనను సంపూర్ణమైనజ్ఞాన మెవరికి యుండునో వాడు యుక్తుల నన్నిటిని పూర్తిగ తెలిసియుండుటవలన ఇతరశాస్త్రములను అతిసులభముగ నెరుగును. మరియు శాస్త్రములన్నిటిని జదివినను తంత్రయుక్తులమాత్రము నెరుంగనివైద్యుడు (భాగ్యహీనుడయిన దరిద్రుడు ధనమును సంపాదించ లేనిభంగి) శాస్త్రార్థములను చక్కగ నెరుంగజాలడు.

శాస్త్రసమ్యక్ జ్ఞానఫలము.

మూ. దుర్గృహీతం క్షిణోత్యేవ శాస్త్రం శస్త్రమివాబుధమ్. ౧౯
సుగృహీతం తదేవ జ్ఞం శాస్త్రం శస్త్రం చ రక్షతి,
(తస్మాదేతాః ప్రవక్ష్యన్తే విస్తరేణోత్తరే పునః. ౯౦
తత్వజ్ఞానార్థమస్యైవ తన్త్రస్య గుణదోషతః)

వ్యా. లోకమున నొక తెలివిమాలిన యోధునకు ఖడ్గము చేజిక్కినచో దాని నుపయోగింప తెలియక నుపయోగించి తనచేతికి భంగము తెచ్చుకొనును. అత్తెరంగున నే శాస్త్రార్థమును చక్కగ నెరుగని పండితంమన్యుడు యెన్నటికైనను కార్యములపట్ల భంగ పడును. మరియు ఆయుధమును బట్టనేర్చినభటుడు తన్ను గాపాడికొనగలడు. అత్తెరంగున శాస్త్రమును సమర్థకముగ నెరింగినబుద్ధిమంతుడు తన్ను చక్కగ కాపాడుకొనగలడు.

(కావున అట్టిశాస్త్రజ్ఞానమును పూర్తిగ నెరుంగుటకై తంత్రయుక్తులు ఉత్తర తంత్రమున విపులముగ జెప్పబడును. అట్టితంత్రయుక్తుల నెరింగిన శాస్త్రమునందలి గుణ దోషములను గమనింప సమర్థుడగును.) ఇచ్చట ఈతంత్రకారుడు సిద్ధిస్థానముతో నీతంత్రము పూర్తి చేసిరి. కాని ఉత్తరతంత్రమును వేరుగ జెప్పియుండలేదు కావున నీశ్లోకము అనార్షమని కొందరిమతము నొకవేళ ఈతంత్రమున అంతర్భూతముగ ఉత్తరతంత్రమును జెప్పకున్నను స్వతంత్రముగ వేరొండుగ్రంథమును రచించెనే మోయని యూహింపవలసియున్నది.

ఈతంత్రపఠనముచేగల్గు దృష్టాఽదృష్టఫలము.

మూ. ఇదమఖిలమధీత్య సమ్యగర్థాన్
విమృశతి యోఽవిమనాః ప్రయోగనిత్యః,

స మనుజసుఖజీవితప్రదాతా
భవతి ధృతిస్మృతిబుద్ధిధర్మయుక్తః. ౯౧

వ్యా. ఈతంత్రమును పూర్తిగ విధ్యుక్తప్రకారము గురువులవద్ద చక్కగ జదివి, ఇందు జెప్పబడిన విషయముల నన్నిటిని చంచలములేని మనస్సుకలవాడై విమర్శించుచు చికిత్సావిధానము నెల్లపుడు నాచరించువైద్యవరుడు, ధృతి (ధైర్యము) స్మృతి, బుద్ధి (సమయోచితజ్ఞానము) ధర్మము ఇవియన్నియుకల్గి, మనుజులకెల్ల సుఖమైన, (ఆరోగ్యవంతమైన) జీవితమును కల్గింప సమర్థుడగును.

మూ. యస్య ద్వాదశసాహస్రీ హృది తిష్ఠతి సంహితా,
సోఽర్థజ్ఞః స విచారజ్ఞః చికిత్సాకుశలశ్చ సః. ౯౨
రోగాన్ తేషాం చికిత్సాం చ స కిమర్థం న బుధ్యతే,
చికిత్సా వహ్ని వేశస్య సుస్థాఽఽతురహితం ప్రతి. ౯౩
యది హాఽస్తి తదన్యత్ర యన్నే హాఽస్తి న తత్ క్వచిత్,
అగ్ని వేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే ౯౪
సిద్ధిస్థానే ఽష్టమే ప్రాప్తే తస్మిన్ దృఢబలేన తు,
సిద్ధిస్థానం స్వసిద్ధ్యర్థం సమాసేన సమాపితమ్. ౯౫

వ్యా. ఏవిద్వాంసునకు ద్వాదశసహస్ర శ్లోకాత్మకమైన యీచరకసంహిత పూర్తిగ మనస్సున దృఢముగ నిలచి యుండునో, ఆట్టివిద్వద్వరుడు అర్థమును పూర్తిగ నెరింగినవాడును, విచారదక్షుడును, చికిత్సల నాచరింప నేర్పరియు నగును. ఆట్టివిద్వద్వైద్యుడు ఆయారోగములను, వానిచికిత్సావిధానమును ఏల యెరుంగడు? (అవశ్యమెరుంగగలడని భావము.) మరియు ఈయగ్నివేశకృతతంత్రమున స్వస్థకసుండువారికిని ఆతురకును హితమునకై యేచికిత్సావిధానము చెప్పబడినదియో, అదియే యితరతంత్రములయందును కానంబడును. ఈతంత్రమున యేచికిత్స లేదో, అయ్యది యితరతంత్రములలో (మచ్చునకైన) కానరాదు. (చికిత్సలన్నియు నీతంత్రముచే గతార్థములగునని భావము.)

అగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును నగు ఎనిమిదవది యగుసిద్ధిస్థానము వచ్చుసరికి (అయ్యది కనుపడకుండుటంజేసి) దృఢబలుండును తనయభీష్టము సిద్ధించుటకై (గ్రంథపూరణరూపమైన కోరిక నెరవేరుటకై) దృఢబలుడు, అట్టిసిద్ధిస్థానమును పూర్తిచేసి ఈతంత్రమును సమగ్రముగ (లోపములేక) సమాప్తి నొందించెను.

అధ్యాయసమాప్తిః

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే, దృఢబలసంపూరితే,
సిద్ధిస్థానే ఉత్తరవస్తిసిద్ధిర్నామ
ద్వాదశోఽధ్యాయః.

వ్యా. ఇత్తెరంగున నగ్నివేశకృతంబును, చరకప్రతిసంస్కృతంబును, నగు చరకసంహితయను నాయుర్వేదతంత్రమునందలి, దృఢబలసంపూరిత సిద్ధిస్థానమున ఉత్తరవస్తిసిద్ధి యనునది పండ్రెండవయధ్యాయము సమాప్తము.

ఇతి విశ్వనాథవిరచితసద్వ్యాఖ్యాయాం తు చరకకౌముద్యాం,
సిద్ధిస్థానం చేదం పరిపూర్ణం భగవతః కృపాలేశాత్.

శ్రీచన్ద్రచూడకరుణారసపూరితేయం
వ్యాఖ్యా నిగూఢచరకార్థసుబోధచఞ్చుః,
ఆచన్ద్రతారమవనౌ ముదమాదధానా
జేజీయతాం! హృది సతాం, దివి చన్ద్రికేవ.

ఇది శ్రీశ్రీశ్రీకాళహస్తిసంస్థానాధిపాస్థానవిద్వదవతంస సర్వతంత్రస్వతంత్ర బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రివరేణ్యచరణకమల సంసేవాసమాసాదిత పాణినీయాదిశాస్త్రవిజ్ఞాన సముల్లసితుండును, అష్టాఙ్గహృదయ-చరహితసంహితా-మాధవనిదానాద్యాయుర్వేదతంత్రాంధ్రవ్యాఖ్యాతయు, శ్రౌతప్రక్రియాధౌరేయుండును, ఆపస్తమ్బసూత్ర-కౌండిన్యగోత్రపవిత్ర నుదురుపాటి వంశపయఃపారావారసుధాకరుండును, వేదవేదాఙ్గశ్రౌతాభిజ్ఞ-బ్రహ్మశ్రీ మహాగ్నిచిత్-సీతారామవిద్వద్వాజపేయయాజి శ్రీమతీసీతామ్బాసోమపీథినీ సాధ్వీమతల్లికాతనూభవుండును, ఉభయభాషాకవితాధురీణ-శ్రౌతాగమధౌరేయ-బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యయాయజూకానుజుండును నగు వైయాకరణ విద్వాన్ శ్రీ పణ్డిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రిచే విరచితమగు కౌముదియను చరకసంహితాంధ్రవ్యాఖ్యానమున సిద్ధిస్థానంబును, తంత్రంబును సమాప్తము.




---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1941.